శ్రీ ర స్తు

# పాండురంగ మాహాత్మ్యము

## తెనాలి రామకృష్ణకవికృతము

శ్రీబులుసు వేంకటరమణయ్యగారిటీకతోఁ గూడినది.







శ్రీ రామా బుక్ డిపో,

[illegible]

[illegible]

[illegible]

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచేఁ

ప్రకటితము

1952

# ప్రకాశకుల విజ్ఞప్తి

ప్రౌఢాంధ్ర ప్రబంధములలో తెనాలి రామకృష్ణకవి రచించిన పాండురంగ మాహాత్మ్యము ముఖ్యమైనది. ఇదివఱకును శ్రీ చిన్నయసూరిగారు తొలుత దీనిలోని మొదటిమూఁడాశ్వాసములను బ్రకటించిరి. మేము నొకసారి ఆమాత్రమే ప్రకటించితిమి. పిదప లఘుటీకతోఁగూడ నీ గ్రంథమును శ్రీ తెన్మఠం శ్రీరంగాచార్యులుగారు ప్రకటించియున్నారు. కాని మూలగ్రంథమున అపపాఠములత్యధికముగ నుండుటవల్లను, లఘుటీక మూలార్థావగతి కనుకూలముగ లేనందునను, దీనిని పరిష్కరింపఁజేసి, వ్యాఖ్యతోఁగూడఁ బ్రకటింపవలెనను సంకల్పము మాకుఁ గలిగినది. సంస్కృతాంధ్రములందు పండితులగు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు మిగుల పరిశ్రమించి దీని సంస్కరించి, టీకనుకూడ వ్రాసినసంగతి మాకుఁ దెలిసి, ప్రకటనార్థము పంపవలసినదని కోరితిమి. మేము కోరినవెంటనే, ఆయన దీనిని మా కొసఁగిరి.

శ్రీ వేంకటరమణయ్యగారు పాండురంగమాహాత్మ్యమును సంస్కరించి టీకను వ్రాయుటయే కాక శ్రీరామకృష్ణకవి కవిత్వతత్త్వమును వెల్లడించుచు విపులమగు పీఠికను పద్యసూచికను గూడ వ్రాసి యిచ్చిరి. ఇట్లు మాసంకల్పమున కనుకూలముగ గ్రంథము తయారగుటచే వ్యయప్రయాసములకోర్చి మే మీగ్రంథము నిపుడు ఆంధ్రలోకమున కర్పించుచున్నాము.

తండయార్పేట<br>చెన్నపట్టణము<br>30-4-1954

ఇట్లు,<br>వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# గ్రంథ పరిచయము

**గ్రంథము-కర్త.—**

గ్రంథనామమునుబట్టి 'పాండురంగమాహాత్మ్యము' తక్కిన మాహాత్మ్యముల వంటి సామాన్యగ్రంథమని తలఁపరాదు; ఇది ప్రాచీనకాలపు ప్రౌఢప్రబంధములలో నెన్నికకెక్కినది; ఆంధ్రపంచకావ్యముల పట్టికలోఁ పద్దు వేయించుకొన్నది. ఈ ప్రబంధమును కృతిపొందిన విరూరి వేదాద్రిమంత్రి గ్రంథకర్తతోఁ బలికినట్లుగా చెప్పఁబడిన—

సీ. తగ సంస్కృతము తెలుంగుగఁ జేయఁ దెనుఁగు సంస్కృతముగఁ జేయఁగ జతురమతివి;
నలుదెఱంగుల నెన్నఁగల కావ్యధారల ఘనుఁడ వాశువునందుఁ గరము మేటి;
వఖిలభూమీపాలకాస్థానకమలాకరోదయతరుణ సూర్యోదయుఁడవు;
శైవవైష్ణవపురాణావళీ నానార్థములు నీకుఁ గరతలామలకనిభము;
గీ. లంధ్రభూమీశుచాగ్రహారాఢ్యమైన, శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేత; వగ్ర
శాఖికా కోకిలమవీవు; సరసకవివి, రమ్యగుణకృష్ణ! రామయరామకృష్ణ!
క. కౌండిన్య సగోత్రుఁడ వా, ఖండలగురునిభుఁడ వఖిలకావ్యరససుధా
మండన కుండలుఁడవు భూ, మండలవినుతుఁడవు లక్ష్మమావరతనుజా!
క. యశము గలిగించు నీ మృదు, విశదోక్తులఁ బౌండరీకవిభుచరిత్రఁ జతు
ర్దశ భువనవిదితముగ శుభ,వశమతి నా పేర నుడువు వరతత్త్వనిధీ! [పాండు. ఆ. ౧. ప. ౨౩-౨౫]

అను పద్యములను బట్టియు,

"ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధికకృపాపరిపాకపరిచిత సరసకవితాసనాథ రామకృష్ణకవినాథ ప్రణీతంబయిన—"

అను నాశ్వాసాంతగద్యభాగములంబట్టియు ఈ ప్రబంధమును తెనాలి రామకృష్ణకవి రచియించెనని స్పష్టపడుచున్నది.

**రామలింగఁడే రామకృష్ణుఁడు.—**

ఉద్భటారాధ్యచరిత్రమును రచించిన తెనాలి రామలింగకవియు, ఈ రామకృష్ణకవియు నభిన్నులని కొందఱిమతము. భిన్నులని కొందఱితలంపు. ఈ కవినామము తొలుత రామలింగఁడనియు, అప్పుడీతఁడు శైవుఁడనియు, కొంతకాలమున కీతఁడు వైష్ణవము పుచ్చుకొని తనపేరు రామకృష్ణుఁడని మార్చుకొనెననియు ప్రతీతి కలదు. శ్రీ వీరేశలింగముపంతులుగారు మున్నగు కొందఱీ యైతిహ్యమును నమ్మిరి.

కొందఱు భేదవాదులు తమవాదమునకు బలకరముగా క్రింది యంశములను చూపుదురు.

(i) పాండురంగమాహాత్మ్యపుగద్యమునకు విలక్షణముగ 'ఉద్భటారాధ్య చరిత్రమున గద్య' "ఇది శ్రీమదేలేశ్వరగురువరేణ్య చరణారవిందషట్చరణ సకలకళాభరణ రామనార్యసుపుత్ర సుకవిజనమిత్ర కుమారభారతిబిరుదాభిరామ రామలింగయ ప్రణీతంబైన" అనియున్నది.

(ii) రామలింగనికిఁ గల 'కుమారభారతి' అను బిరుదము పాండురంగకృతి కర్తకు లేదు. అందు కృతిపతి కవినిగూర్చి "శారద నీరూపము" అని సంబోధించినట్లున్నది.

(iii) రామలింగనిగురువు ఏలేశ్వరుఁడు; పాండురంగకృతికర్తగురువు భట్టరు చిక్కాచార్యులు.

కాని, కొంత విమర్శించి చూచినచో పయి కారణములు భేదవాదమునకు సమర్థకములు కాఁజాలవని తోఁచుచున్నది. తొలుతఁజెప్పఁబడిన ద్వైతివ్యాముసుబట్టి యీ కవి శైవుఁడుగా నున్నపుడు రామలింగఁడై యుండెననియు, నప్పుడితని గురు వేలేశ్వరుఁడై యుండెననియు, నీకవి వైష్ణవుఁడైనపిదప రామకృష్ణుఁడని తనపేరు మార్చుకొనెననియు, చిక్కాచార్యులను గురువుగా గ్రహించెననియు చెప్పికొన వచ్చును. ఉద్భటారాధ్యచరిత్ర మీతని పిన్నవయసున రచింపఁబడినదగుటచే నప్పుడి తనికి 'కుమారభారతి' అను బిరుద ముండెననియు, పాండురంగకృతి రచనాకాలము నాఁటి కీకవి వయసుమీఱినవాఁ డగుటచే దానికి బదులు కవి శారదాస్వరూపుఁడే యగుట 'శారద, నీరూపము' అని కృతిభర్త చెప్ప వలసుపడెననియు గ్రహింపనగును.

కవికులగోత్రాదులఁబట్టి చూచినయెడల వీరిరువురును అభిన్నులనియే చెప్ప వలసి వచ్చుచున్నది.

| ఉద్భటకృతికర్త | పాండురంగకృతికర్త |
|---|---|
| కౌండిన్యగోత్రుఁడు | కౌండిన్యగోత్రుఁడు |
| శుక్లయజుర్వేది | శుక్లయజుర్వేది |
| తండ్రి రామయ | తండ్రి రామయ |
| తల్లి లక్ష్మమ | తల్లి లక్ష్మమ |

తెనాలి రామభద్రకవికృతమగు 'ఇందుమతీపరిణయము'న

ఉ. "......కవితా ఘనతామహు మత్పితామహున్
రామయ రామకృష్ణకవిరాజుఁ దలంచి, నుతించి మ్రొక్కెదన్.

గీ. తదనుసంభవమణిని సుదక్షిణా పరిణయ ముఖకావ్యరచనాధురీణు నాంధ్ర
కవికదంబములోనఁ బ్రఖ్యాతిఁగన్న, యన్నయకవీంద్రు ధీసాంద్రు నభినుతింతు.

... ... ... ...

సీ. ప్రౌఢి మా పెదతాత పాండురంగాదిసత్కృతులు చేసెను రామకృష్ణ సుకవి
అనుజుఁ డన్నప్ప మా పినతాత రచియించెఁ బరఁగ సుదక్షిణాపరిణయంబు

మీ తాత శ్రీగిరి చాతురీవిఖ్యాతి శ్రీశైల మాహాత్మ్యకృతి యొనర్చె
కడిమి మీతండ్రి యిమ్మడి రామకృష్ణాఖ్యుఁడనఁ గీర్తిగనె సంస్కృతాంధ్రములను
గీ. శౌర యనిపించె మీయన్న వీరరాఘు, వాఖ్యకవి సర్వకవితామహత్త్వమునను
ని న్ననూచాన సంతాను నెన్నఁదరమె?, ప్రాజ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి."

అని యున్నది. దీనినిబట్టి చూడఁగా పాండురంగ మాహాత్మ్యాదులను రచించిన తెనాలి రామకృష్ణకవియును, సుదక్షిణాపరిణయమును రచించిన తెనాలి అన్నయకవియును అన్నదమ్ములని యేర్పడుచున్నది. ఏతదనుకూలముగనే సుదక్షిణా పరిణయమున-

గీ. "నవ్యసుగుణాభిరామ తెనాలిరామ, పండితాగ్రణి సత్పుత్రు భవ్యమిత్రు
హరపదాంభోజ సౌముఖ్యు, నన్నపాఖ్యు,నన్న బిలిపించి యాదరోన్నతి వహించి.

... ... ... ...

గద్యము. ఇది శ్రీమత్తెనాలి రామేశ్వర శాశ్వత కృపాకటాక్షలక్షితకవితాభిరామ రామయపండిత కుమార సహజశైవాచారసంపన్న ధీమదన్నయనామధేయ ప్రణీతంబైన సుదక్షిణాపరిణయము నందు—"

అని యున్నది. ఈ పయిభాగమువలనఁగూడ రామకృష్ణుఁడును, అన్నయయును అన్నదమ్ములగుట సుస్పష్టము. ఇరువురును రామయపండితుని కుమారులే! తెనాలి వారే!!

మఱియు అన్నయ 'పాలగుమి భీమగురుని సద్భక్తిఁగొలుతు' అని చెప్పుటచే తెనాలివారు సహజముగా శైవులనియు, పాలగుమివారి శిష్యులనియుఁ దెలియుచున్నది. ఉద్భటారాధ్యచరిత్రరచనాకాలమునాఁటికి రామలింగకవి పాలగుమివారి (పాలగుమిలేశ్వరుని) శిష్యుఁడగుట ప్రసిద్ధముకదా!

తెనాలి యన్నయ తన గ్రంథమున తనయన్నయగు రామకృష్ణుని స్తుతింపలేదు. అంతమాత్రమున వీరిరువురి సోదర్యవిషయమున సందేహింపఁబనిలేదు. అన్న మతాంతరస్వీకరణ మొనరించెనన్న అనాదరమున సుదక్షిణాపరిణయకర్త రామకృష్ణునిఁ బేర్కొనక యుండవచ్చును. రామభద్రకవి స్పష్టముగ వీరిరువురును సోదరులే యని వివరించియే యున్నాఁడు. రామకృష్ణకవి తన మతము మార్పును తెలుపుకొనకున్నను, పాండురంగమాహాత్మ్యమునఁ జెప్పఁబడిన 'శైవవైష్ణవపురాణావళీ నానార్థరచనాపటిష్ఠైకరమ్యమతివి' అను భాగమునుబట్టి యాతనిశైవప్రబంధరచనా పాటవముకూడ వ్యక్తమగుటయు, నతని మతాంతరస్వీకృతి విశదమగుటయు సహృదయవేద్యములు.

ఉద్భటారాధ్యచరిత్రమును, పాండురంగమాహాత్మ్యమును ఏకకర్తృకములని చెప్పుటకీ రెండుగ్రంథములకును గల పోలికలు ప్రమాణము కాఁదగును. అందుఁ గొన్నిమాత్ర మిచట చూపఁబడును—

మ. కవులుం బాఠకులుం బ్రధానులు సుధీగణ్యుల్ పురాణజ్ఞులుం
వివిధార్థుల్ సఖులుం బురోహితులు నుర్వీనాథులుం జోస్యులుం
ధవళాత్ముల్ గొలువంగ నిండుకొలువై దైవారు హర్షంబుతో
నవధానంబుననుండి శంకరకథా వ్యాసక్తి భాసిల్లుచున్. [ఉద్భటా. ౧-౨౩.]

మ. కవులుం బాఠకులుం బ్రధానులు నలంకారజ్ఞులుం బ్రాజ్ఞులుం
ధవళాత్ముల్ భజియింప నిండుకొలువై తారేందు తారావళీ
ధవళంబైన సువర్ణకుంభయుత సౌధంబందు నాస్థానమై
వివిధామ్నాయ పురాణ గుంభనకథల్ వించున్ బ్రమోదంబునన్. [పాండు. ౧-౨౧]

గీ. ......................; .......................
లజ్జముఖి......ందఁజేయు, బ్రహ్మవిద్యా విదూరుఁడై బ్రాహ్మణుండు. [ఉద్భటా. ౨-౧౨౪.]

గీ. ......................; .......................
సిగమ ఘంటాపథైకాధ్వనీనబుద్ధి, బ్రహ్మవిద్యానవద్యుండు బ్రాహ్మణుండు. [పాండు. ౨-౬.]

చ. వ్రతములుచేసి పెక్కు లుపవాసములుం మఱిపెక్కు లుప్పిఁడుల్
ధృతి నొనరించి కూర్మిఁ బరదేసులఁ దల్లియుపోలెఁ బ్రోచి మా
నితగతి మింటిదయ్యముల నేలకుఁదెచ్చి కుమారుఁగాంచెఁ ద
త్పుతి..............రగుఁ జామపతివ్రత సంతసంబునన్. [ఉద్భటా. ౫-౨౧.]

తే. ఆమహీసురులేమకు నతులనిష్ఠ నింగివేల్పుల నేలకు నేలవేల్పు
గొలము నింగికిఁదెచ్చుచుఁ గొలువఁ బుత్త్రు, డొక్కఁడుదయించెఁ దత్కృపాభ్యుదయమహిమ.
[పాండు. ౩-౫.]

సీ. నెరవెంట్రుకలు దువ్వి నిలువుకొప్పు ఘటించి కుసుమదామము మీఁద గుస్తరించి
నుదుట గందపుఁజుక్క నూల్కొల్పి నీలాల పోగంట్లు చెలిదోయిఁ బొందుపఱిచి,
తరళమై బంగారుతాయెత్తు గల ముత్తెములపేరు పేరురంబున ధరించి,
కటిఁ దాళిగోణాముకడచుంగు ధరఁ జీర పట్టుదట్టీ ద్రిండుగట్టి నడుమ
గీ. కేల డాఁపలిచిటికెన వ్రేలియందు, నలఁతిపగడాలయుంగర మనువుకొలిపి
గారవంబీని కలికిసింగార మొదవ, సారజంబుగఁ జరియించు నతఁడు మఱియుం

ఉ. బోఁడికెమూఁపుపైఁ గరము బొందగఁజేసి కరంబు మ్రోయు నం
బాడిగ లోలి మెట్టి కరపద్మము క్రొవ్విరిచెండు మాటికిన్
వేడుకఁ బారమీటుచు నవీననఖాంకవిలాసలక్ష్మితోఁ
గూడినమేను పమ్ముకొనఁ గ్రుమ్మరుచుండు నతండు వీథులన్. [ఉద్భటా. ౨-౧౨౧. ౧౨౨.]

చ. తలగడు గంగమర్దనము ధౌతపటావరణంబు సంస్కృతో
జ్జ్వలకలమాన్నభోజనము చందనచర్చ ప్రసూనదామకం
బులు కపురంపువీడ్యమును భూమణపంక్తులు గల్గి నిచ్చలుం
బులుకడుగంగఁబడ్డ నునుముత్యముఁబోలుచు వాలుచుం బురిన్,

సీ. కలదు, లేదను వాదములకోర్చి మీనుమీసముపంటి యొంటిజంజెము మెఱవఁగ
బహుసంకుమదపంక పాంశుధమంబైన తాళిగోణపుఁజూంగు నేల జీరఁ
గడలేని వీడ్యంపుఁగప్పుచుందురుకావి మోవి పల్లొత్తులమునుగుదన్న
సానతాఁకులు గల్గు సూనాస్త్రశంఖంబుగతి నఖరేఖాంకగళము దనర

తే. సఖులు పనివాసకులు వెంటఁ జనఁగ యంపణి,భుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁ డగుచు
నగరఘంటాపథంబున నగుచు: దిరుగు,నొఱపుగల శివి జాతిమాత్రోపజీవి. [పాండు. ౩-౬. ౧౦.]

ఉ. "శోకకుఁ గూటికై యొకనిఁగొల్చి తదీరిత వాక్యపద్ధతిక్
గ్గొని............................... [ఉద్భటా. ఆ. ౨-౯౧.]

క. వలువకుఁ గూటికినై నీచులవేడం బోడచొరవఁజొచ్చు నతఁడు—"
............................... [పాండు. ౩. ౨౧.]

ఉ. మానితలీల సజ్జనునిమాడ్కి మహీసురుఁ డప్పురంబులో
మానవపంక్తిలోఁ గలసి మచ్చికయై తలలోని నాల్కయై
ధీనిధి యాతఁడే యనఁగఁ దేకువఁ దేజముగాంచి యుండెఁ బెం
పూనఁగఁ గొన్ని వాసరము...............................తటన్. [ఉద్భటా. ౨-౧౪౧.]

క. తలలోపల నాలుక పూసలలో దారంబు, పాలఁ జల్లిన నీరుం
బలె వెలియెఱుఁగక మనసులు,గలసి, యభేదముగఁ గాఁపుకడ నతఁడుండెన్. [పాండు. ౩-౫౯.]

ఉ. ఆరయఁ బాలవంటి కుల మాఱడిఁబోవఁగనిచ్చి వీటిలో
నారజమై చరించు వసుధామరనందనుఁ డిట్టివారు నె
వ్వారును జీరికిం గొనక,.....................జుల్కఁగా
నీరసవృత్తిఁ జూచి; రతినింద్యుఁడు వీఁడని యేవగింపుచున్. [ఉద్భటా. ౨-౧౩౪.]

గీ. కాఁపురము నాకుఁ గడుఁబెద్ద కంచియంత,యిల్లు శ్రీధాన్యకటకమై హెచ్చు........."
[ఉద్భటా. ౨-౨౫౩.]

తే. కాఁపుఁగోడలు కంచంత కాఁపురంబు,పాలవంటికులంబు గాడ్పఱచి చనియె-
.................................................... [పాండు. ౩-౭౧.]

క. భజనచెడి దానిపొత్తున,భుజియించెను మధువుఁద్రావెఁ బోల యంటె, వెసక్
ద్యజియించెఁ దగిననడవడి,కుజనుండై ధరణిసురుఁడు కుత్సితబుద్ధిన్. [ఉద్భటా. ౨-౨౩౧.]

తే. ఎన్నిజన్మంబులేనియుఁ జన్నపిదపఁ,గాని ప్రాపింపరాని ధరానిలింప
జాతి గడెలోన నప్పాపజాతి తొఱఁగి,కల్లుపెల్లాను, వేఁటాడుఁ గఱచు నెఱచి.
[పాండు. ౩-౭౪.]

ఉ. కేతువు నీటముంచి తమకించి ధనుర్లత మళ్లఁబెట్టి వి
ఖ్యాతబలంబుఁ జెట్టులనుగట్టి గుణంబునఁగల్గు పక్షముల్
వే తరలించి యంపగమి వేఁడక మూలకుఁద్రోచి, యమ్మనో
జాతుఁడు తత్పురిం గలుగు శైవులపైఁజన లోఁగునెంతయున్. [ఉద్భటా. ౧-౧౫౨.]

సీ. నిలువున నొలిపించె విలువంగడము సెల్ల శరములయాయంబుఁ బొరయు టుడిపెఁ
దగ శబ్దమాత్రపాత్రముఁ జేసె గుణలత మ్రాఁకునఁ గట్టించె మాలబలముఁ
గంచుకివశము గావించె సేనానాథుఁ గమరించె సహచరుఁ గటికియొండఁ
బ్రతిపక్షభావసంగతుఁడని హితుఁ జూచె వరకేతనము కీర్తిభరము డులిపె
తే. ధర్మనిర్మలబుద్ధి సుశర్మఁ గదిసి, గెలువఁగా లేక చని కోపగించి మదనుఁ
డుఱక; తనవార లతనికి నోడుమనిరె? పలికిఁ గీడౌట బంట్లపాపంబు కాదె! [పాండు. ఆ. ౫-౯౭.]

ఇట్టి వింక నెన్నియేని కలవు. ఈ రీతినే రామకృష్ణకవికృతమగు ఘటికాచల మాహాత్మ్యమునకును, ఉద్భటారాధ్యచరిత్రమునకును చాల పోలికలు కలవు. మచ్చునకు రెండు మాత్ర మిట నీయఁబడుచున్నవి.

సీ. మొకరి తేఁటులు మూఁతి ముట్టవు తేనియల్ శ్రీమధుశాసి కర్పించి కాని
కోకిలమ్ములు చిగురాకులు గొఱుకవు శ్రీవనమాలి కర్పించి కాని
లేఁబచ్చికల్ కబళింపవు హరిణముల్ శ్రీనీలమూర్తి కర్పించి కాని
ఫలభుజిక్రియలకుఁ జిలుకలు దలఁపవు శ్రీమాధవునకు నర్పించి కాని.
గీ. యితరజంతువులును హరిమతిఁ దలంచి, కాని యే వర్తనమునకుఁ బూన వనిన
నా తపోవనమాహాత్మ్య మభినుతింప, నలవియే వేమొగంబుల చిలువకైన. [ఘటికాచలమాహాత్మ్యము.]
సీ. అచలసుతాభర్త కర్పించిమఱి కాని మృగములు లేఁబూరి మేయ వచట
నసమలోచనునకు నర్పించిమఱి కాని యళులు క్రొవ్విరితేనె లాన వచట
అంధకధ్వంసికి నర్పించిమఱి కాని కోయిల లిగురాకు కొఱుక వచట
నంగజారాతికి నర్పించిమఱి కాని చిలుకలు పండ్లు భుజింప వచట.
గీ. తక్కుఁగల జంతువులు శంభుఁ దలఁచి కాని, యుచితవర్తనములఁ గోరి యుండవచట
వదనములు వేయుఁగలయంతవానికైన, నా యరణ్యంబుఁ గొనియాడ నలవియగునె?
[ఉద్భటారాధ్యచరిత్ర]

మ. శుకముల్ ప్రామిసుకుల్ గుణించు; గణియించుం ధర్మమర్మేతిహా
సకథల్ శారిక; లీరికల్ గొనుమనీషన్ శేషభాషావిశే
షకళాశాస్త్ర ముపన్యసించు; బకముల్ సాత్రాజితీప్రాణనా
యకనామాళి; నటుల్ పఠించు సతతోద్యద్గీతికాచాతురిన్. [ఘటికాచలమహాత్మ్యము.]
ఉ. సామగుణంబుఁ గోల్పుచ్చుఁ బికళాబకపంక్తులు శైవధర్మముల్;
ప్రేమ నుపన్యసించు శుకబృందము లీశ్వరయోగశాస్త్రముల్;
కోమలరీతి శారికలు గూడి పఠించు వినోదలీలలన్;
గామవిరోధి: బాడు నధికంబుగ నచ్చట భృంగపోతముల్. [ఉద్భటారాధ్యచరిత్రము.]
ఇంటి పేరు.—

రామకృష్ణకవియింటిపేరు 'తెనాలివా' రని పాండురంగమాహాత్మ్యమునందలి 'శ్రీతెనాల్యగ్రహారనిర్ణేతవు' అనుదానినిబట్టి తెలియుచున్నది. అంతకుఁ బూర్వమున ఆ వంశమువారియింటిపేరు 'గార్లపాటివా'రని ప్రసిద్ధము. శ్రీగురుజాడ శ్రీరామ

మూర్తిగారును, శ్రీవీరేశలింగముగారును అట్లే చెప్పియున్నారు. తెనాలిలో శ్రీ రామలింగేశ్వరస్వామివారి యాలయమున నొక యుత్సవవిగ్రహము పీఠము మీఁదఁ గల

శ్లో. "శ్రీ తెనాలినగరే వ్యరాజయద్గార్లపాటిపుర రామపండితః
శుక్లమాఘసితపంచమీగురౌ రామలింగ ముమయోత్సవాకృతిమ్."

అను శ్లోక మీ యంశమును బలపఱచుచున్నది. గార్లపాటి రామయపండితుఁడు తెనాలినగరమున శ్రీరామలింగేశ్వరస్వామియొక్కయు, శ్రీపార్వతీదేవియొక్కయు ఉత్సవవిగ్రహములను ప్రతిష్ఠించె నని మీఁది శ్లోకమున కర్థము. ఈ రామయపండితుఁడే రామకృష్ణుని తండ్రి. ఈ రామయ గొప్ప శివభక్తుఁడని యీ శ్లోకమే విశదపఱచుచున్నది.

కవికాలము - గ్రంథరచనాకాలము.—

ఉద్భటారాధ్యచరిత్రపు కృత్యవతరణికనుబట్టి యీ గ్రంథము కొండవీడు దుర్గాధ్యక్షుఁడుగా నుండిన నాదెండ్ల గోపమంత్రికడ ముఖ్యోద్యోగిగా నున్న యారె దేచమంత్రికి కృతిగా నీయఁబడినట్లు తెలియుచున్నది. గోపమంత్రి శ్రీకృష్ణదేవరాయలమంత్రి యగు సాళువ తిమ్మరుసుమంత్రికి మేనల్లుఁడు. శ్రీ కృష్ణదేవరాయలు క్రీ. శ. 1515-వ సం॥ న కొండవీటిదుర్గమును జయించినపిదప, దానిని పాలించుటకు తిమ్మరుసు తన మేనల్లుఁడగు నీ గోపమంత్రిని నియమించెను. ఈ గోపమంత్రి సుప్రసిద్ధుఁడు. ఇతఁడు దేచమంత్రికి క్రీ. శ. 1517-వ సం. న ఒక యగ్రహారమును దానమొసఁగెను.

దేచమంత్రి శైవాచారపరాయణుఁడు. ప్రోలనారాధ్యుని వంశస్థుఁడగు చంద్రశేఖరవాచంయమునియొక్కయు, మహావిద్వాంసుఁడగు *లొల్ల లక్ష్మీధరపండితునియొక్కయు శిష్యుఁడు. లక్ష్మీధరపండితుని యనుగ్రహమున పాండిత్యమును సంపాదించి ఈ దేచమంత్రి 'శివపంచస్తవి'కి వ్యాఖ్య రచించెను. ఈ యంశమును

శ్లో. "స చాయం దేచయామాత్యో మహిమ స్తవపంచికాం,
లక్ష్మీధరకటాక్షేణ కురుతే గురుతేజసా."

అను శ్లోకము చాటుచున్నది. దేచమంత్రి గోపమంత్రివలన అగ్రహారాదిసమ్మానములను పొంది, ప్రసిద్ధుఁడైన పిదపనే ఉద్భటారాధ్యచరిత్రమును కృతినంది యుండును. ఆ కాల మించుమించుగా క్రీ. శ. 1535 అని తలఁచవచ్చును. ఉద్భటారాధ్యరచనాకాల మిదియే యై యుండవచ్చును. ఈ మీఁది విషయమునుబట్టి రామకృష్ణకవి శ్రీకృష్ణదేవరాయలకాలమున - ఆతనిసభలో నుండె నన్న లోకప్రతీతి యథార్థమే గాని, కల్పితము కాదని స్పష్టమగుచున్నది.

---

* శ్రీశంకరాచార్యకృత సౌందర్యలహరికి వ్యాఖ్య వ్రాసిన విద్వాంసుఁడు.

పాండురంగమాహాత్మ్యమును కృతిపొందిన విరూరి వేదాద్రిమంత్రి కందాళె అప్పలాచార్యుల శిష్యుఁడు; మంగయగురువరాజు కుమారుఁడగు పెదసంగభూపాలు నొద్ద వ్రాయసకాఁడు. చిత్రభారతకృతిపతి తండ్రి పెదతండ్రులును, సైజయంతీ విలాసకర్తయగు సారంగు తమ్మకవియు ఈ కందాళె అప్పలాచార్యులకు శిష్యులు. క్రీ. శ. 1547-పరాభవసంవత్సరమున గండికోట ప్రభువు కందాళె అప్పలాచార్యులకు భూదానమొసఁగిన శాసనమొకటి కలదఁట !

రామకృష్ణకవి తనగ్రంథమున 'భట్టరు చిక్కాచార్యులు' తనగురువని చెప్పి యున్నాఁడు. ఈ చిక్కాచార్యులకుఁ బెక్కుర శిష్యు లుండిరి. చాతుర్వాటికా మాహాత్మ్యము, ఆనందకానన మాహాత్మ్యము మున్నగు గ్రంథములను రచించిన లింగమగుంట రామకవియును [తెనాలి రామకృష్ణుని అల్లుఁడు], అతని తమ్ముఁడగు లింగమగుంట తిమ్మకవియును ఈ చిక్కాచార్యులకు శిష్యులు. రామకృష్ణకవు లచే 'కామందకము'ను కృతిగొన్నవాఁడును, కొండ్రాజు తిమ్మరాజుకుమారుఁడును, పెదసంగభూపాలుని మేనల్లుఁడును అగు వేంకటాద్రియును చిక్కాచార్యుని శిష్యుఁడే. ఈ వేంకటాద్రి క్రీ. శ. 1584 వ సం. న కామందకమును కృతిఁబొందెను. కాన పాండురంగమాహాత్మ్యరచనము అంతకంటె కొన్నియేండ్లు ముందుగా జరిగియుండ వచ్చును.

పై యంశములనుబట్టి రామకృష్ణుఁడు శైవుఁడుగా నున్నప్పుడు క్రీ. శ. 1535 ప్రాంతమున ఉద్భటారాధ్యచరిత్రమును రచించి దేచమంత్రికి కృతియొసఁగె ననియు, తర్వాత వైష్ణవుఁడుగా మాఱినపిదప 'ఘటికాచలమాహాత్మ్యము'ను రచించెననియు, ఉద్భటచరిత్రరచనయైనపిదప రమారమి ముప్పదియేండ్లకు - అనఁగా (క్రీ. శ. 1565 ప్రాంతమున) పాండురంగమాహాత్మ్యమును రచించెననియును చెప్ప వీలగుచున్నది. పాండురంగమాహాత్మ్యమున (పుట 238) 'గిరికానుషక్తబుద్ధి నుపరిచరునింబోలు' (ఆ. 4. ప. 242) అని వసుచరిత్రవిషయమును, 'గురుభీతమతిక నాముక్తమాల్యదకు నెనయగుచున్' (ఆ. 4. ప. 241) అని యాముక్తమాల్యదయును సూచింపఁబడినందున, పయిగ్రంథద్వయము రచింపఁబడిన పిదపనే యిద్ది వ్రాయఁబడినట్లు వ్యక్తమగుచున్నది. ఆముక్తమాల్యద శ్రీకృష్ణదేవరాయలరచన యగుటచేఁ బ్రాచీనమగుట యుక్తమే. కాని వసుచరిత్రవిషయమునఁ గొంత సందేహము కలుగవచ్చును. కాని అది 1560-70 ప్రాంతమున పెనుగొండను పాలించిన తిరుమలదేవరాయల కంకితమగుటచేత దానిరచన యంతకుఁ బూర్వమే జరిగియుండ వలెను. పాండురంగమాహాత్మ్యమును ఇంచుమించుగ నాకాలపుదే యగుట నివి రెండును సమకాలీనములనియు, అట్టియెడ నొకదానిలో నింకొకటి సూచింపఁబడుట దోషము కాదనియు గ్రహింపనగును. ఇంతకును - ఉపరిచరవసువు వృత్తాంతము మహాభారతమున నున్నదే కాని క్రొత్తది కాదు. కావున దానినే రామకృష్ణకవి సూచించెననియుఁ జెప్పవచ్చును.

కాఁగా రామకృష్ణకవి శ్రీకృష్ణదేవరాయల యాస్థానమున నుండుట యసంభావ్యము కానందునను, వసుచరిత్రవృత్తాంతప్రశంస యసంగతము కానందునను, ఇతఁడు క్రీ. శ. 16-వ శతాబ్దిప్రారంభమున (1505 ప్రాంతమున) జన్మించి, 1575--80 ప్రాంతమువఱకును జీవించియుండెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

కృతులు - ముద్రితములు, అలబ్ధములు.—

రామకృష్ణుఁడు రచించిన గ్రంథములు మూఁడుమాత్ర మింతవఱకు లభించినవి. ఆ మూఁడును ముద్రితములు. ఉద్భటారాధ్య చరిత్రము ముక్త్యాలలోని సరస్వతీపత్రికలో ప్రకటింపఁబడి, పిదప ప్రత్యేక గ్రంథరూపమును దాల్చినది. ఘటికాచలమాహాత్మ్యము ౧౮౯౭-వ సం. న కళ్యాణీముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది. పాండురంగమాహాత్మ్యము తొలుత శ్రీనివర్తివారిచేతను, శ్రీవావిళ్లవారిచేతను కొంతభాగము ముద్రింపఁబడి, పిదప శ్రీమాన్ శ్రీతెన్నతం! శ్రీరంగాచార్యులుగారి లఘుటీకతోఁగూడ పూర్తిగ ముద్రింపఁబడి, ఇందనుక ఐదుకూర్పులను పొందినది.

తెనాలి రామలింగకవికృతులగు కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసము అను ప్రబంధములనుండి కొన్ని పద్యములు ప్రబంధరత్నావళియందు ఉద్ధరింపఁబడినవి. ఆగ్రంథములుమాత్ర మింతవఱకును దొఱకలేదు. "పాండురంగవిజయము" అను వేఱొకగ్రంథము నీ కవి రచించినట్లు ప్రతీతి. అది పాండురంగమాహాత్మ్యమే యై యుండునేమో! 'పాండురంగవిజయము'లోనివని ఉదహరింపఁబడిన పద్యములు మాత్రము పాండురంగమాహాత్మ్యమునఁ గానరాకున్నవి.

రామకృష్ణునిఁగూర్చిన కథలు.—

తెనాలి రామలింగని కథలని దక్షిణదేశమునందంతటను ప్రసిద్ధములయి కొన్ని కథలు ప్రచారమున నున్నవి. అందుఁ జాలవఱకును శ్రీకృష్ణదేవరాయలకును, అతని యాస్థాన విద్వత్కవులకును సంబంధించి యున్నవి. వీనిని శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారు తమ 'కవిజీవితముల'లో ఇచ్చియున్నారు. రామకృష్ణకవి రాయలకాలమున లేఁడని తలఁచిన విమర్శకులు కొందఱీ కథలన్నియుఁ బుక్కిటిపురాణములని తలంచిరి. కాని యీవఱకు నిర్ణయింపఁబడిన కవికాలమునుబట్టి యీ కవి రాయలసభలో ఉండుటకు ఆక్షేపణ లేదు. కొందఱు పరిశోధకులు, విమర్శకులును ఈ యంశమును గ్రహించి శ్రీశ్రీరామమూర్తిగారు వ్రాసిన కథలు కొన్ని యథార్థములే యని నమ్ముచున్నారు. అన్నియుఁగాకున్నను, కొన్నియైనను నమ్మఁదగియే యున్నవని చెప్పక తప్పదు. ఆ కథలు సాధారణముగా భట్టుమూర్తి, అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, ధూర్జటి మున్నగు కవులను వెక్కిరించు గాథలతో నిండియున్నవి. వానికిఁదగిన చాటువులును కలవు. శ్రీకృష్ణదేవరాయలకాలమునాఁటికి రామకృష్ణకవి యువకుఁడు; స్వభావముచేతనే స్వతంత్రుఁడును, వికటస్వభావము కలవాఁడును అగుటచే ఈతఁడు ఇతరకవులను—సమయానుసారముగ అధిక్షేపించుట అసంభవ మెంతమాత్రమును కాదు.

రామకృష్ణుఁడు తన చరమదశలో తరణోపాయముగను, తనకవిత్వపరీక్షకు నికషోపలగను ప్రౌఢప్రబంధమగు పాండురంగమాహాత్మ్యమును రచించెను. అందు హాస్యమున కెట్టి యవకాశమును - అందుచు అట్టి వయసున - లేదు. అట్లయ్యును ఈతఁడు, తన స్వభావమును పూర్తిగ విడువలేక అందందు తన కొంటెతనమును వ్యక్తముచేయుచునే యున్నాఁడు. మచ్చునకు రెండు పద్యము లుదాహరింపఁబడు చున్నవి.

అతులనిష్ఠతో తపస్సుచేసిన పుండరీకమహామునికి భగవంతుఁడు ప్రత్యక్షముకాఁగా ముని ఆతనిని పెక్కువిధముల స్తుతించెను. అందు దశావతారస్తుతిలో బౌద్ధావతారవర్ణన మీ క్రిందిరీతి నున్నది:—

చ. 'ప్రతిదినకేశలుంచనపురాయిడి నెట్టన బట్టగట్టి పైఁ
బుతపుతమంచునున్న కుఱుబోడతలన్ ధరియింప నోడియున్
సతమగు సొమ్ముగాన విడఁజాలవుగా శిఖిపింఛవల్లి, సౌ
గతమతధుర్య! దానిఁ గటిఁ గట్టుము; పుట్టము మిన్నకేటికిన్.' [పాండు. ద్వితీయా. ౬౪]

నెమిలిపించెము శ్రీకృష్ణునకు వీడరాని కేశాలంకారము. బౌద్ధావతారసమయమున బట్టకట్టి నున్ననైన తలపై దానిని ధరింప నెట్లును వీలులేదు. సతమగు నగను వీడుటకును వలను కాదు. కావున మొలకుఁ గట్టిన బట్టను విప్పివేసి, ఆ వస్త్రమునకు బదులుగా శిఖిపింఛమును ధరించుట మేలు. అట్లు చేయుటవలన వస్త్రధారణఫలమును సిద్ధించును. మొల కట్టవలసిన బట్ట, తలయే కట్టుటచే - (బట్టతల యగుటచే) వేఱే వస్త్రధారణ మనావశ్యక మని భావము.

పయి వర్ణనమున రామకృష్ణుఁడు తన స్వభావసిద్ధమగు హాస్యమును వెల్లడించె ననుట స్పష్టము. ఈ వర్ణనము ప్రత్యక్షమైన భగవంతునిఁ గొనియాడుచు పుండరీకునివంటి ముని చేయుట వికటమే కదా!

సహజదుర్బుద్ధియగు నిగమశర్మ తనయక్క చేసిన హితబోధకు లోఁబడి సానుకూలుఁడై మంచిదారిని పడినట్లు నటించియు నొకనాఁటిరాత్రి యందఱును నిద్రింపఁగా వారి నగలను దొంగిలి పరారి యయ్యెను. మఱునాఁటివఱువాత అతనిబంధువులు పోయిన తమ నగలఁగూర్చి విచారించు సందర్భమున నీ క్రిందిపద్య మున్నది.

సీ. 'శోకించు వృద్ధభూసురుఁ డాత్మపితృదత్త దర్భముద్రికకుఁ జిత్తంబు కలఁగ
నత్తగారిచ్చిన హరిసుదర్శనపుఁ బేరునకు ముత్తయిదువ వనటఁబొందఁ
గ్రొత్తగాఁ జేయించుకొన్న ముక్కఱకునై యడలు దుర్వారయై యాఁడుబిడ్డ
జామాత వెతఁబొందు వ్యామోహియై నవగ్రహకర్ణవేష్టన భ్రంశమునకు
తే. నెంత దుర్బుద్ధి! యెంత దుర్భ్రాంతి! యహహా!, సర్వధనముల నద్దురాచారశీలుఁ
డూచముట్టుగ నిలుదోఁచి యుఱికిచనుట, యెఱుఁగరో కాక, యవ్వేళ యెఱుక గలదె!
[పాండు. తృతీయా. ౫౦]

చెడుతిరుగుడులు తిరుగుచు, సర్వనాశన మొనర్చుచున్న నిగమశర్మను దారికిఁ దెచ్చుటకై ఆతనియక్క ఐదారు కోసుల దూరమున నున్న తమయూరినుండి కాఁపురమెత్తి పెట్టి పుట్టినింటికి భర్తతోను, బిడ్డలతోను వచ్చినది; నిగమశర్మకు నయమునను, భయమునను హితబోధచేసి ఆతనిని మంచిదారికి త్రిప్పినది. అతఁడును వెనుకటిరీతి మర్యాదగా ప్రవర్తింపసాగెను. ఇట్టి మార్పునకుఁ గారణము ఆమెయే. తన బుద్ధి చాతుర్యమున కామె గర్వింపవలసినది; అందఱిచేతను పొగడికలను పొందవలసినది. ఇట్టియెడ నిగమశర్మ యొక యర్ధమరేయి అందఱినగలను ఊచముట్టుగ దోఁచుకొనిపోయినపుడు బంధుగు లందఱును తమతమ యాభరణములకై విలపించుచుండఁగా ఈమెయు తన ప్రయత్నము వమ్మగుటకుఁ గాక, నగకొఱకు విలపించుటయు, అందును అత్యల్పమూల్యమగు ముక్కఱకు వాపోవుటయు, అందఱును సామాన్యముగ విలపించుచుండఁగా ఈమె దుర్వారయై యడలుటయు రామకృష్ణకవివికటతను విశదము చేయుచున్నవి.

గ్రంథనామము :—

పాండురంగ క్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించు నీప్రబంధమునకు 'పాండురంగమాహాత్మ్యము' అను పేరున్నట్లు ఆశ్వాసాంతగద్యములనుబట్టి తెలియుచున్నది. దీనికి 'పౌండరీకమాహాత్మ్యము' అను నామాంతరమున్నట్లు 'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన పౌండరీకమాహాత్మ్యంబునకు—' అను గ్రంథారంభ గద్యవలన తెలియుచున్నది. దైవమునుబట్టి పాండురంగమాహాత్మ్యమనియు, భక్తుఁడగు పుండరీకుని కారణమున పౌండరీకమాహాత్మ్యమనియు దీనికి పేళ్లు గలిగినవి. కాని పాండురంగమాహాత్మ్యమను పేరే ఆంధ్రలోకమున ప్రసిద్ధమై యున్నది.

మూలము.—

కృతిపతి యగు వేదాద్రిమంత్రి రామకృష్ణునితోఁ బల్కిన

ఉ. "స్కాందపురాణనీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందను సత్కథోద్యమము నవ్యకవిత్వకళాకలాపమా
గుందనమం ఘటించి కడుఁ గ్రొత్తగు సొమ్మొనరించి, విష్ణుసే
వం దులకించు నప్పరమ వైష్ణవకోటి నలంకరింపుమా!" [పాండు.౧-౨౬.]

అను పద్యమునుబట్టి యీ ప్రబంధమునకు స్కాందపురాణమునందలి కథ మూలమని తెలియుచున్నది.

'పాండురంగమాహాత్మ్య'మను నొక క్షేత్రమాహాత్మ్యము గీర్వాణభాషలోఁ గూర్పఁబడినది కలదు. అది తొమ్మిది యధ్యాయముల చిన్న గ్రంథము. స్కాందపురాణాంతర్గతమఁట ! దానిమాతృక పూనాలోని భండార్కర్ పరిశోధనాలయమునఁ గలదు. దాని ప్రతియొకటి కాకినాడలోని 'ఆంధ్రసాహిత్యపరిషత్తు'లోఁ గలదు. గ్రంథములోనివిషయమునుబట్టిచూడ, అయ్యది రామకృష్ణకవి యాంధ్రప్రబంధము

ననుసరించి వ్రాయఁబడినట్లు తోఁచుచున్నది. అయ్యదియే మూలమని ప్రచారము చేసి, తన్మూలమున రామకృష్ణుని ప్రతిభను, శక్తిని కొంచెపఱచుట కెవ్వరో యిట్లు మూలమును కల్పించి, అయ్యది ప్రచారము పొందునట్లుచేసి యుండవలెను. తెలుఁగునకు సంస్కృతమూలము కల్పింపఁబడుట శ్రీకాళహస్తిమాహాత్మ్యము నెడను కానన గును.

ఆ మూలగ్రంథముయొక్క యాద్యంతభాగములివి—

ప్రారంభము— "పాండురంగమాహాత్మ్యమ్

స్కంద ఉవాచ.—

శ్లో. మాహాత్మ్యం కథితం సమ్యగ్గీనానా ముత్తమోత్తమం,
గంగాదీనాం మునిశ్రేష్ఠాః కిమన్యచ్ఛ్రోతు మిచ్ఛథ

మునయ ఊచుః—

శ్లో. సర్వోత్తమం యది క్షేత్రం తీర్థం చైకత్ర విద్యతే,
ఉత్కృష్టం దైవతం చాపి తన్నో వద మహామునే!

సూత ఉవాచ:—

శ్లో. అగస్త్యాదిమహర్షీణాం వచః శ్రుత్వాథ షణ్ముఖః,
ధ్యాత్వా తాదృగ్విధం క్షేత్రం తీర్థం దైవం న దృష్టవాన్.

స్కంద ఉవాచ:—

శ్లో. నాహం తథావిధం క్షేత్రం తీర్థం దైవతమేవ చ,
ధ్యాయన్పశ్యామి మునయ స్సర్వోత్కృష్టం సుదుర్లభమ్.
తదాగచ్ఛత గచ్ఛామో గిరిజావల్లభం భవమ్,
ద్రష్టుమేతం మహాపద్మం కైలాసనిలయం పృథక్.
ఆశ్చర్యం ను మమాప్యత్ర ప్రశ్నార్థాధిగమే మహాన్,
జాయతే మునిశార్దూలాః స హి నో వక్ష్యతే శివః.

గ్రంథాంతము:—

నవమోఽధ్యాయః

ఈశ్వర ఉవాచ—

శ్లో. స చచార మహావిష్ణోర్మందిరోపరి గంధధీః, తం దృష్ట్వా క్షేత్రపాలోఽసౌ చుకోప చ ననాద చ.
ఉత్పపాత మహావేగాత్ స్తేనవత్ ఖచరః స్వయమ్, ఆరురోహ్యా(?) విమానంతు బభం జ నిపపాత తః.
తం గృహీత్వా మహాసత్త్వో నిపాత్య ధరణీతలే, విచకర్ష మహాబాహుః సర్పరాజం యథా ఖగః.
మరణాభిముఖం దృష్ట్వా భైరవేణార్దితం ప్రభుః, విద్యాధరం దేవయోనిం మహావిష్ణుర్భవా.........

ఇతి శ్రీస్కందపురాణే ఉమామహేశ్వరసంవాదే ఉత్తరసంహితాయాం
పాండురంగమాహాత్మ్యే నవమోఽధ్యాయః.
పాండురంగమాహాత్మ్యం సంపూర్ణమ్.

ఆంధ్ర పాండురంగమాహాత్మ్యమునఁ గల నిగమశర్మోపాఖ్యానము, రాధికా వృత్తాంతము, సుశీల కున్నగువారి కథలు, సుశర్మో పాఖ్యానము, అయుత నియుతుల వృత్తాంతములును సంస్కృతమున లేవు; మిగిలిన వృత్తాంతములు సంగ్రహముగఁ జూపఁబడినవి.

ఆంధ్ర ప్రబంధమునఁ గల పదములు సంస్కృత మూలమునఁ గానవచ్చు చున్నవి. కాని దానింబట్టి సంస్కృతమూలమున కిది యనువాదమనుట యుక్తి దూరము. ఆంధ్రమునందు 'తద్ఘోరతా, జనవేగంబున భగ్నమయ్యెఁ గటిపేల్లత్ తుల్లకా శిక్యమున్.' (పుట ౯౦1) అని యుండఁగా-దానిని సరిగా అర్థముచేసికొనక మూలమున 'తులుకానాం చ శిక్యం చ భగ్నమద్యాప్యపిదృశ్యతే' అని కూర్పఁబడినది. ఇట్టివి చాల కలవు. విస్తరభీతి నవి విడువఁబడినవి.

కథాసారము—

ప్రథమాశ్వాసము

శౌనకాది మహామునులు సూతుఁజూచి క్షేత్ర - దైవత - తీర్థములు మూఁడును సమప్రధానములై యుండు స్థలముంగూర్చి తెల్పుమని కోరఁగా నతఁ డిట్లు వచించెను.

'తొల్లి యగస్త్య మహాముని లోపాముద్రతోఁ గూడ క్షేత్రరాజమగు వారాణసియందు వసించుచుండ సూర్య చంద్రాదుల గమనమును నిరోధించుచుండు వింధ్య పర్వతము గర్వము నణంపవలెనని దేవత లా మహామునిని ప్రార్థించిరి. అగస్త్యుఁడు వారి ప్రార్థనము నంగీకరించి శిష్యులు వెంట రా బయలుదేరి వెళ్లి వింధ్యపర్వతము గర్వము నణఁచి దక్షిణముగాఁ బోయి కొల్లాపురిలోని మహాలక్ష్మిని సేవించెను. పిదప నా దేవియానతి ననుసరించి తుంగభద్రను దాఁటి స్వామిమలకుఁ బోయి కుమార స్వామిని సేవించెను. అతనిం గొనియాడి, యా గుహునివలన సమస్త క్షేత్రమాహాత్మ్యములను దెలిసికొని యగస్త్యుఁ డిట్లనెను - 'స్వామీ! మీదయవలన పుణ్యస్థల మాహాత్మ్యముల నన్నింటిని దెలిసికొంటిని. తీర్థ - దైవత - క్షేత్రములు మూఁడును మేళవించి యున్న చోటేదైనఁ గలదా? దానిం గూర్చి తెల్పుఁడు.' అని యడుగఁగా కుమారస్వామి సుదీర్ఘముగ నాలోచించియు నట్టి స్థలమును గానలేక 'మహామునీ! నీ వడిగిన యర్థము నాకు గోచరము కాలేదు. మన యీ సందేహమును దీర్ప పరమేశ్వరుఁడే సమర్థుఁడు; మనము కైలాసమునకేఁగి యాతనిని దర్శించి మన సందియముఁ బాపికొంద'మని పల్కి మునిగణముతోను, పరివారముతోను బయలుదేరి కైలాస నగమున కరిగెను. అంతకు ముందుఁ బార్వతియు శివు నిదే ప్రశ్న యడుగఁగా నతఁ డట్టి స్థలముం గూర్చి తెలుప సిద్ధముగా నున్నందున మునులతోఁ గూడ వచ్చిన కుమారునకును బార్వతితోపాటు క్షేత్ర - దైవత - తీర్థములు కలిసియుండు స్థలమును దెలుప నెంచి, తొట్టతొలుత వెన్నునిఁ దన మనస్సులో ధ్యానించి యిట్లు చెప్ప మొదలిడెను.

## ద్వితీయాశ్వాసము

ఘర్మవీరానది భైమీనదిలోఁ గలిసినచోట దక్షిణతీరమునఁ గల తీర్థ, క్షేత్రములు పౌండరీకములని ప్రసిద్ధములు కలవు. అచట దేవదేవుఁడగు లక్ష్మీ వల్లభుఁడు పాండురంగనామమునఁ బ్రసిద్ధుఁడై యుండును. అయ్యదియే మీ రభిలషించిన యుత్తమ స్థలము.

ఆదికల్పమునందలి పదునెనిమిదవ ద్వాపరము కడపట పుండరీకుఁడను ముని యచ్చోట ఘోరతపం బొనరింప శ్రీకృష్ణుఁడు ప్రత్యక్షమై కావలసిన వరమడుగఁ గోరెను. పుండరీకుఁ డాదేవుని, ఆ లలితరూపముతో నచటనే యుండునట్లును, అచటి తీర్థక్షేత్రములు తనపేరిట పౌండరీకములయి యుండునట్లును వరము ప్రార్థించెను. శ్రీకృష్ణుఁ డట్లేయగుఁగాక యని వరమొసఁగెను.

ఆ క్షేత్రమును గూర్చి మఱియు నిట్లు శివుఁడు వివరించి పలికెను:—

ఆ క్షేత్రము లోకోత్తరమైనది. దానికి నాలుగు లోవాకిళ్లు గలవు. తూర్పువాకిట సరస్వతియు, దక్షిణద్వారమున నారదుఁడును గలరు. దక్షిణదిశ నైదు కోట్ల నాగకన్యక లారతులిచ్చుచుందురు. పడమటి వాకిట భువనేశ్వరీదేవియు, నుత్తర ద్వారమున దుర్గాదేవియు నున్నారు.

ఇట్టి క్షేత్రము క్షేత్రాంతరములకంటె నుత్తమోత్తమము.

తొల్లి త్రిదంష్ట్రుఁడను రాక్షసుఁడు కోపముతో గదనెత్తి పాండురంగని యెడమ ప్రక్కపై వ్రేయఁగా ఆ దేవుఁడు దానిని తూలించి, యా రాక్షసునిఁ జంపెను. ఆ గదా వేగమునకు పాండురంగని మొలనున్న జాలెసంచి తెగిపోయి యిప్పటికి నచ్చటనే పడి యున్నది.

ఆ క్షేత్రమునకుఁ బడమట పద్మతీర్థమును, శంఖ - పద్మనిధులును గలవు. అచటనే పిప్పలాకారమున నరనారాయణు లున్నారు.

పాండురంగని కీశాన్యదిశను కుండలతీర్థము కలదు. అచట అశ్వత్థ రూపమున నరసింహుఁ డున్నాఁడు. గోపిక యొకర్తె యచట శ్రీకృష్ణునిఁగూర్చి తపస్సు చేయఁగా నా దేవుఁడు ప్రత్యక్షమయ్యెను. అప్పటి తత్తరపాటులో నామె కేశబంధము వీడెను; నీవి కొంత జాఱెను. ఆమె శ్రీకృష్ణునియడుగులను గట్టిగాఁ బట్టుకొని ఆవిధముగానే అచట నుండునట్లు వరమడుగఁగా అతఁ డట్లే వర మొసఁగెను. ఆ స్థలమే ముక్తకేశినీక్షేత్రము.

ఆ దిక్కుననుండియే భైమీనది పొంగి పొరలుచు క్షేత్రముపైకి వచ్చుచుండఁగా, పాండురంగఁడు తన పాదములపైనుండి ప్రవహించున ట్లాజ్ఞాపించెను. అదియే బైమీతీర్థమని ప్రసిద్ధమై యున్నది.

నరసింహుఁడచట ముప్పదిరెండు బాహువులతో నున్నాఁడు. అగస్త్య-గాణాపత్యము లను తీర్థములు నచటనే గలవు. గాణాపత్యతీర్థమునకుఁ దూర్పున సంకర్షణతీర్థమును, దానికి దూర్పున జాబాలితీర్థమును, దానితరువాత బ్రహ్మతీర్థముసు గలవు. బ్రహ్మతీర్థముకడ బ్రహ్మయు, సరస్వతియు వసింతురు. వారికి దక్షిణమున కలశతీర్థమును, దానికి దక్షిణమున పితృతీర్థమును, దానికి దక్షిణముగా చక్రతీర్థమును, దానికి దక్షిణమున లక్ష్మీతీర్థమును, దానికి దక్షిణమున కౌమోదకీ, పద్మ, శంఖ, చక్ర తీర్థములును గలవు. లక్ష్మీతీర్థాదు లయిదును శక్తిపంచక మనఁ బడుచున్నవి.

విష్ణువు సంగముఁడను రాక్షసుని చంపినచోట సంగతీర్థము కలదు. అచట పుష్పావతి యను నది సంగమించును. దానికిఁ బిదప రామ, దేవ-సూర్య-సరస్వతీ తీర్థములు కలవు.'

పరమశివుఁ డీ రీతిని మునులకును, కుమారునికి, నుమకును దెల్పెనని సూతుఁడు శౌనకాదుల కెఱిఁగించెను. వారీ క్షేత్రతీర్థాది మాహాత్మ్యములను విని మిగుల సంతసించిరి. పిదప శౌనకుఁడు సూతుం జూచి 'మహాత్మా! విష్ణు వేల యదుకులమున నందునిపట్టియై పుట్టెను? అతని చరిత్ర మెట్టిది? రాధ యెవ్వతె? రాధాకృష్ణులసంబంధ మెట్టిది? శివునిదేహమునుండి భైమి యెట్లోదవెను? విష్ణుని మంత్రరహస్య మెయ్యది? ఈ యంశములన్నియు మాకు వినిపింపవలయు'నని ప్రార్థింపఁగా సూతుఁడిట్లనెను—

'తొల్లి శంకరుఁడు నారదునకు పుండరీకముని చరిత్రమును వివరముగాఁ దెల్పెను. దానిని మీకు వినిపింతును. అది వినిన మీ సందేహములెల్లను తీరును.' సూతుఁడిట్లు పలుకుచు మున్నుతాను వేదవ్యాసునివలన వినినదాని నిట్లు చెప్ప సాగెను.

'ఇదివఱకుఁ జెప్పినట్లు కుమారుఁడు మునులతోఁగూడఁ దన సందేహములను తీర్చుకొని పోవుచుండఁగా-శివునివద్దకు వచ్చుచున్న నారదుఁడు వారిని జూచి తనలో 'కుమారుఁడును, మునులును పరమశివునియొద్ద కిప్పు డేకారణమున వచ్చిరో? ఏదే నొక గొప్ప సందియముఁ దీర్చుకొన వచ్చి, తమపని నెఱవేర్చుకొని మఱలుచుండ వచ్చు'నని యనుకొని వేవేగ శివుని దర్శించి, యతనిఁ బలుతెఱంగులఁ గొనియాడి యిట్లు ప్రార్థించెను—'దేవా! కుమారాదు లిటనుండి పోవుచుండుట చూచితిని. వారు మిమ్మేమి ప్రార్థించిరి? మీ రేమి సమాధాన మిచ్చితిరి? ఆ యంశమును నాకు వివరముగాఁ దెల్ప వేడుకొనుచున్నాను.' అప్పుడు శివుఁడు పార్వతియుఁ, గుమారుఁడును, మునులును కోరిన యర్థమును దెల్పఁగా నారదుఁడు తనకు నట్టి యుత్తమోత్తమస్థలమును దెలిసికొను కోరికకలదు; కాన వివరింపఁగోరఁగా శివుఁ డాతనికి పాండురంగక్షేత్ర వృత్తాంతమును దెల్ప మొదలిడి యచటి నరసింహక్షేత్రము గొప్పతనముం దెల్పుచు తదనుబంధముగ నొకయితిహాసము నిట్లని చెప్పఁదొడఁగెను.

## తృతీయాశ్వాసము

కళింగదేశమునందలి పీఠికాపురమున వేదవేదాంగవేత్తయు, సుత్తమశీలుఁడును అగు సభాపతియను బ్రాహ్మణోత్తముఁ డుండెను. నిగమశర్మ అతని పుత్రుఁడు. నిగమశర్మ చిన్నవయస్సుననే సమస్తవిద్యలనునేర్చి విద్వాంసుఁడైనను, పోకిరియయి తిరుగుచు, ఇంటఁగల వస్తువుల నన్నింటిని విక్రయించుచు, భూములను కుదువబెట్టుచు సంపదను నాశనముచేయుచుండెను, ఇంటిగడప త్రొక్కుటయే యరుదుగనుండెను. వానికి బుద్ధిచెప్పి, దారికిఁదీసికొని రాఁదలఁచి యతనియక్క భర్తతోను, బిడ్డలతోను తన పుట్టినింటికి వచ్చి, చుక్కతెగిపడినవడువున నొకప్పు డింటికి వచ్చిన తమ్ముని కుంచి మాటలాడి, నిలిపి, సముస్తోపచారములు నొనర్చి హితము నుపదేశించెను. నిగమశర్మయును ఆమెహితమును విన్నవానివలె నటించి కొలఁదిదినములు వినయ, విధేయతలతో మెలఁగుచు నొకనాటిరాత్రి అందఱును నిదురించుచుండఁగా వారి ఆభరణముల నన్నింటిని అపహరించి యడవిదారిని పోవుచుండెను. అడవిలో నొకదొంగలగుంపు నిగమశర్మ నడ్డగించి, అతనిని చావఁగొట్టి యతనికడనున్న యాభరణముల నన్నింటిని తీసికొనెను. కదలలేక - మెదలలేక పడియున్న నిగమశర్మ నొకకాఁపు తనయింటికిఁ దీసికొనిపోయి తగినచికిత్స చేయించి, గాయములు మాన్పి కాపాడెను. ఆ యింటఁగల అందకత్తెయగు నొకకాఁపు పడఁతి నిగమశర్మను మరులుకొని, అతనిని మరులుకొలిపెను; అతఁడు ధర్మమును దలఁపక రహస్యముగ నామెతోఁ గ్రీడించుచుండెను ఇట్లు కొన్నిరోజులుచన నాతఁ డా పడఁతిని లేవఁదీసికొని యెటకేని పోవఁ దగినయదను నరయుచుండెను. ఒకప్పు డాయూర జరిగిన జాతరలోఁ బాల్గొని నడురేయి నందఱును గాఢనిద్రలో మున్గియుండఁగా నిగమశర్మయు, నతని ప్రియురాలగు నా కాఁపుపడఁతియు నిలువీడిపోయిరి. వా రొక యడవికిఁబోయి, అచ్చటి బోయజాతిలోఁ గలిసిపోయిరి. నిగమశర్మ కిరాతుఁడయి వేఁటాడి యాహారము సంపాదించుచుండెను. వారిరువురును అచటఁ గొంతకాలము గడపినపిదప నా కాఁపుపడఁతి మరణించెను. పిదప నిగమశర్మ యొక చండాలవనితం గూడి యామెవలన సంతానముంగూడఁ బడసెను. ఒకనాఁ డతఁడు వేఁటకుఁబోయి యుండఁగా అతని గుడిసె కాలిపోయెను, అందుండిన యతని భార్యాపుత్రులు మరణించిరి. అతఁ డది గాంచి, మిగుల వాపోయి, మతిచెడి, యాహారనిద్రల నుజ్జగించి దేశములఁ గ్రుమ్మరుచుఁ దుదకు శ్రీనరసింహుఁడున్న క్షేత్రముం బ్రవేశించి ప్రాణములు విడిచెను. యమదూత లాతనిని కట్టి, కొట్టుచు ఘోరముగఁ బాధించుచుఁ దమ లోకమునకుఁ దీసికొని పోవుచుండఁగా-వారు పెట్టుబాధలకుఁ దాళఁజాలక నిగమశర్మ గట్టిగా నఱచెను. అంతకు మున్ను విష్ణువుచే రక్షార్థమచట నుంచఁబడిన చక్రము అతని మొఱ విని తొందరగా వచ్చి యమదూతలను దఱిమి, నిగమశర్మ బంధములను త్రెంచెను. అంత విష్ణుదూతలు వచ్చి నిగమశర్మను సగౌరవముగ శ్వేతద్వీపమునందలి పరమపదమునకుఁ దీసికొనిపోయిరి. అతఁడు వైకుంఠమున సుముహ్

డను పరమభాగవతుఁడయి యున్నాఁడు. అతఁడు పాతకియయ్యును నరసింహక్షేత్రమున మరణించుటచే నట్టి యుత్తమోత్తమపదవిని పొందెను. ఆ క్షేత్రమునకు దక్షిణభాగమున నేను నివసింతును. ఎట్టి మహాపాతకము లొనరించినవారైనను సరే, అచ్చట మరణించినచో ఇంద్రపదవిని పొందుదురు.

శివుఁడిట్లు తెల్పఁగా విని సంతసించి నారదుఁడు తీర్థ - క్షేత్ర - దైవతములను గూర్చి తెలుపఁగోరఁగా నిట్లు తెల్పెను - 'నృసింహక్షేత్రము నెదుట చంద్రభాగా నది కలదు. ఇంద్రుఁడు మున్నచట తపంబొనరించి యింద్రభోగముల ననుభవించెను. ఆనృసింహక్షేత్రము చేరువనే పౌండరీకక్షేత్రమున్నది. దాని మాహాత్మ్య మిట్టిది, అట్టిదని వర్ణింపనలవికాదు. దానికిఁ దూర్పుభాగమున సరస్వతియుఁ, బడమట భువనేశ్వరియుఁ జివటిభాగములుకాఁగా ఆ క్షేత్రమను ధనుస్సును చేతధరించి శార్ఙ్గపాణియగు విష్ణువు తీర్థము లను బాణములను దొడిగి పాపములను లక్ష్యములను బడఁగొట్టి భక్తులఁ గాపాడుచుండును. ఆ క్షేత్రమునడుమ పాండురంగఁడను పేర శ్రీకృష్ణుఁడు వెలసియుండును.'

శివుఁడిట్లు పలుకఁగా నారదుఁడు 'నిఖిల జగద్భరితుండగు విష్ణువు ఆ స్థలమున వెలయుటకుఁ గారణమే'మని ప్రశ్నింపఁగా పరమేశ్వరుఁ డిట్లు చెప్పఁదొడంగెను.

'పూర్వము పుండరీకుఁడను మహాముని యచ్చోట ఘోరమగు తపస్సు చేయుచుండఁగా, దానివలనఁ గల్గిన తాపమునకు లోకము లట్టుడికిన ట్లుడికిపోవుచుండ - బ్రహ్మ యా సంగతిని విన్నవింప విష్ణువుదరి కేఁగెను. ఆ సమయమునందే దుష్టజనులను మోయఁజాలని భూదేవి తనస్థితిని వెన్నునకు విన్నవించుటకు క్షీరాబ్ధిమధ్యమునందలి శ్వేతద్వీపములోని వైకుంఠమునకేఁగి యచట దేవదేవుని దర్శించి, స్తుతించి తన గోడు వెళ్లఁగ్రక్కెను. విష్ణు వామె సంగతినివిని తాను మాయామానుషమూర్తియై భూలోకమున నవతరించి, రాక్షసప్రాయులగు రాజులను సంహరించి, భూభారము మాన్చెదనని భూదేవి కభయమిచ్చి, పుండరీకునికిఁ బ్రత్యక్షమయి వరమొసంగి యాతనితపస్సును మాన్పెదనని బ్రహ్మకును వాగ్దానముచేసి పంపివేసెను. పిదప శ్రీహరి యాదవకులమున దేవకీవసుదేవుల తపఃఫలముగఁ గృష్ణుఁడయి పుట్టి ఘోర రాక్షసులను, దుష్టనృపాలురను పెక్కురను సంహరించి బాల్యమాది అనేకాద్భుత కృత్యముల నొనర్చుచుండెను.

ఆ రీతి నవతరించిన శ్రీకృష్ణుని సంతోషమునకై బ్రహ్మ యొక శక్తిని పంపఁగా నది నందుని మఱఁదియగు శతగోపుని పుత్రికయై లోకోత్తర సౌందర్యమున రాధ యను నామమున వర్ధిల్లుచుండెను. ఆ రాధాకృష్ణులహృదయములలోఁ బరస్పరము ప్రేమ యంకురించెను.

## చతుర్థాశ్వాసము

మాధవుఁడే తనకు భర్త కావలెనని రాధ గోవర్ధనాచలసమీపమునఁ గల ఋణవిమోచనతీర్థమున ఆ యాఋతువులననుసరించి ఘోరనియమమునఁ దప మాచ

రించుచుండెను. శరత్కాలమున విష్ణు వామెకుఁ బ్రత్యక్షమై యామెకోరిక నీడే ర్చెను.

పుండరీకుఁడు ఘోరతపము చేయుచుండఁగా బ్రహ్మ యాతనికిఁ బ్రత్యక్ష మయి 'విష్ణువు నేఁడో రేపో యతనికిఁ బ్రత్యక్షమగు'నని తెల్పెను. పుండరీకుఁడు తపముచేయుచున్న క్షేత్రము దేవర్షినరగణ సేవితమగుననియు, దేవుఁడు ముక్తికొసఁ గుననియుఁ దెల్పెను. ఆముని బ్రహ్మమాటఁ దలఁచుకొనుచు భగవంతుని ధ్యానించు చుండఁగా మూఁడవనాఁడు విష్ణు వాతనికి బ్రత్యక్షమయ్యెను. దేవునియద్భుత తేజ మును గని బెదరి యఱచుచుఁ బుండరీకుఁడు పాఱిపోవుచుండఁగా కృష్ణుఁడు నవ్వెను. పుండరీకుఁడు వెనుకకు మరలి దేవునిఁగని వేయి విధములఁ గొనియాడెను. విష్ణువు వెనుకనే వచ్చిన మే మందరమును పుండరీకుని గుణములను బ్రశంసించితిమి. శ్రీ కృష్ణుఁడు నతనిభక్తిని బ్రశంసించి వరములు వేఁడఁగోరెను. పుండరీకుఁడు వేఱేమియుఁ గోరక 'ఈ క్షేత్ర - తీర్థములు గొప్పగా నుండవలెను. నీదర్శనమిచట భవభయకర్శ నంబయి జనులకు లభించుఁగాక! ఈతీర్థక్షేత్రములు నాపేరితో వెలయుఁగాక!' అని ప్రార్థింపఁగా విష్ణు వట్లే వరము లొసఁగెను.

విష్ణు వా తీర్థమునఁ బశ్చిమాభిముఖుఁడై రెండుచేతులను గటిపై నుంచుకొని వెలసెను. ప్రాగభిముఖుఁడయియు నుండును. ఇట్లు రెండుమూర్తులతో వెలసెను. ఫణి భర్త యాతని పాదపీఠము. లక్ష్మీదేవి - హ్రీ శ్రీరూపముల రెండుకడల నతనిని సేవించుచున్నది. ఎదుట గరుడుఁడుండును. దక్షిణభాగమున సనకాదులును, బ్రహ్మ యును-ఎడమవైపు నేనును, రుద్రులును—ఇంద్రాదులు వెనుకభాగమున నుందురు. నారదా! వెన్నునివాత్సల్యమును నీవు నెఱుఁగుదువు. ఆ దేవుఁడు దిగంబరుఁడయి పంచాబ్దంబుల యీడువాఁడై యుండును. వాసవాదులు తన్ను గొల్వఁగా శేషపీఠము నధిష్ఠించి, రెండుకాళ్లనడుమను గోయష్టి నిరికించుకొని యుండును. అతఁడు నాల్గు బాహ్యద్వారములును, నాలు గంతర్ద్వారములును గల మహాసౌధమున నుండును. ఆదేవదేవుని దర్శించినచో ఎట్టి పాతకములైనను నశించును. తొల్లి గోవు, కాకి, హంస, చిలుక, పాము, తేనెటీఁగయును ఆదేవుని సేవించి యుత్తమజన్మములనొంది చివఱ ముక్తిఁబడసినవి. నీకావృత్తాంతములఁ దెల్పెదను వినుము.

పాండురంగఁడు భీమరథీతీరమున మురళీగాన మొనర్చుచుండఁగా దానిని విని పరవశమైన గోవొకటి పాలు స్రవించెను. ఆదుగ్ధబిందువొకటి యెగిరి శ్రీకృష్ణుని శిరస్సుపైఁ బడెను. అందువలన నాధేనువునకు దేవునకు క్షీరాభిషేక మొనరించిన సుకృతము కలిగెను. ఆధేనువు ముదుసలిదై మరణించి మఱుజన్మమున సుశీలయను పేరితో నొక విష్ణుభక్తునకుఁ బుత్రికగా జన్మించెను. యుక్తవయస్సున నామె లోభియుఁ గ్రూరుఁడు నగు నొక బ్రాహ్మణునకిచ్చి పెండ్లిచేయఁబడెను. భర్త యెన్ని బాధలుపెట్టిన నామె సహించుచు గొప్ప పతివ్రత యని పేరువోసెను. ఒకనాఁడామె భర్త గ్రామాంతరమునకేఁగిన సమయమున శ్రీకృష్ణుఁ డొక పొట్టివడుగు

వేసమున నతిథియై వచ్చెను. అతఁడు తనకాఁకలి యెక్కువగా నున్నదనియుఁ, వంట యగునంతకును వేచి యుండఁజాలననియుఁ జెప్పి చల్దియన్నమునే తినుటకు సిద్ధపడెను. ఆమె పెట్టినయన్నము అతనికిఁ జాలనందున సుశీల - భర్తయేమిచేసినఁ జేయనిమ్మని సాహసించి - అతఁడు కానరాకుండ దాచియుంచుకొనిన భక్ష్యముల నతిథికిఁ బెట్టెను. అందునను వటువునకుఁ దృప్తికలుగలేదు. సుశీల మిగుల నాశ్చర్య పడుచు నాయతిథి సామాన్యమానవుఁడు కాఁడనియు, భగవంతుఁడే యా రూపమున వచ్చెననియు భావించి కావలసిన వంటకములను సిద్ధముచేయ నగ్నిదేవునిఁ బ్రార్థించెను. అతని ప్రభావమునఁ బెక్కు రకముల వంటలు తయారైనవి. అపుడామెభక్తికి మెచ్చి, వటువు కృష్ణుఁడుగా మాఱి యామెకుఁ బ్రత్యక్షమయి, యామె వెనుకటి జన్మవృత్తాంతమును తెల్పి యిట్లనెను - 'నీభక్తికి సంతసిల్లితిని. నిన్ను పరీక్షింపఁ దలఁచియే యిట్లు వచ్చితిని. నీభర్తయు కఠినుఁడుగా నుండుటకును నేనే కారణము. పూర్వ మక్కృతసత్క్రియుఁడను బ్రాహ్మణుఁడు పాపాత్ముఁ డొకఁడుండెను. ఒకప్పు డతఁ డుత్సవసమయమున నాకు నివేదించిన యన్నమును గాంచెను. ఆ సుకృతలేశమున నతఁడుత్తమబ్రాహ్మణవంశమునఁబుట్టి విద్యల నభ్యసించి నిన్నువివాహమాడెను. నిన్ను పరీక్షింపఁగోరియే అతనిని లోభిగను, కఠినునిగ నొనర్చితిని. నేఁటినుండియు నతఁ డత్యుత్తముఁ డగును. నీకేవురు పుత్రులుత్తములు కల్గుదురు. నీవు నూఱేండ్లు జీవించి పిదప భర్తతోఁగూడ మోక్షము పొందఁగలవు.' విష్ణు విట్లుపల్కి యంతర్హితుఁ డయ్యెను. పిదప సుశీలభర్త యుత్తమరీతిఁ బ్రవర్తించెను.

కాకి యొకటి పాండురంగని దేవాలయముచేరువఁ గల రావిచెట్టుపయి వసించుచు, నొకప్పుడు విఠ్ఠలాలయాంగణమునఁ గల బలిపీఠముపై వేసిన మెతుకులు తినుటకై చెట్టునుండి యెగురుచు రాఁగా, దాని తెక్కలవలనిగాలిచే దుమ్ము పోయి, కాకికి దేవాలయము తుడిచిన పుణ్యములభించెను. ఆకాకి మఱుజన్మమున సుశీల కొక పుత్రుఁడై జన్మించెను.

ఒకహంస యా దేవాలయసమీపమున వసించుచు నొకప్పుడు మండుటెండకుఁ దాళఁజాలక యచట తటాకమున మునిగి, యా గుడిలోఁ బ్రవేశించి, తెక్కలల్లార్పఁగా, వానివలన రాలిన నీటితుంపరలు అచ్చోటఁ బడినవి. గాలికి దుమ్ము నెగిరి పోయెను. అందువల్ల హంసకు గుడిని అలికిన పుణ్యము లభింపఁగా నదియు సుశీల కొకపుత్రుఁడై పుట్టెను.

ఒకహరిదాసి చిత్రవర్ణములుగల చిలుక నొకదానిం బెంచుచుండెను. ఒకనాఁ డది పంజరమునుండి తప్పించుకొని, ఆ హరిదాసిముత్యాలహారమును ముక్కునఁ గఱచుకొని యెగిరిపోయెను. ఆమెయు నామెచెలికత్తెలును చిలుకం బట్టుకొన నెంత యత్నించినను లాభములేకపోయెను. చిలుక గుడిలోపలి యొక దండెముపై వ్రాలి ముత్యములను ముక్కుతోఁబొడువఁగా నవి క్రిందరాలెను. కానఁ జిలుకకుఁ పాండు

రంగనిగుడిలో ముత్యాలముగ్గులు పెట్టిన పుణ్యము లభించి, అవి సుశీల కొక కుమారుఁడై పుట్టెను.

ఎచటినుండియో పామొకటి విట్ఠలాలయమును ప్రవేశింప, అందున్న యెలుక యొకటి భయపడి దేవునిపాదపీఠముక్రింద దూరెను. పాము దచటికి వచ్చి, విట్ఠలుని పాదములపైనున్న యొక మొగలిపూవులోనిపుప్పొడి నాఘ్రాణించెను. అందువల్ల పామునకు ఆనందము కల్గి అది పడగ విప్పెను. అప్పుడు అందున్నమణి ప్రకాశించి పామునకు దీపారాధన మొనర్చిన పుణ్యము లభించి, అదియు సుశీల కొక కొడుకయి పుట్టెను.

దేవాలయ సమీపోద్యానమున తేనెటీఁగలగుంపొకటి తిరుగుచుండఁగా నందొక యీఁగ భగవంతునికి పూజింపఁబడిన యర్ఘ్యాంబువు కల పుష్పములోని మధువును గ్రోలఁగా-దానికి భగవత్పాదతీర్థముఁ ద్రాగిన ఫల మిచ్చి-అదియు సుశీల కొక పుత్రుఁడయి పుట్టెను. సుశీల యా పుత్రులను పెంచి, భగవద్భక్తిని బోధించి, ముదుసలియైనపిదప ముక్తిఁబొందెను.

విట్ఠలున కీశాన్యదిశను క్షేత్రపాలుఁడగు కాలభైరవుఁ డుండును. ఒకప్పుడు గంధర్వుఁడొకఁడు గర్వించి విమానమెక్కి గుడిపైనుండి పోవుచుండఁగా, భైరవుఁడు కోపించి పైకెగిరి, వానిని క్రిందికీడ్చి చంప సిద్ధపడెను. దయామయుఁడగు పాండురంగఁ డతనిని వారించి, గంధర్వునిఁగాపాడెను. గంధర్వుఁడు విట్ఠలుని మిగులఁ గొనియాడి తన యిచ్చఁబోయెను. భక్తులు తొలుత క్షేత్రపాలుని, ఆపిదపనే పాండురంగనిఁ జూడవలెను.

### పంచమాశ్వాసము

పరమేశ్వరుఁ డిట్లు చెప్పఁగా విని నారదుఁడు మిగుల సంతసించి 'దేవా! ఆ క్షేత్రమునకుఁగల ద్వారము లేవి? ఆయాయియెడల నెవ్వ రెవ్వరున్నారు? ఆ యా స్థలవిశేషము లేవి? వానిని వివరింపవలె'నని కోరఁగా శివుఁడిట్లు చెప్పెను - 'సుఖమాలికా, భీమరథులు కలిసినచోటు ముఖ్యమైన తీర్థము. ఆ క్షేత్రమునకుఁ దూర్పు ద్వారముగ సరస్వతియు, సిద్ధేశ్వరమను శివలింగమును కలవు. పుష్పావతీ, సంగమ తీర్థములు దక్షిణద్వారము.

బోయ యొకఁడొక జింకను దఱుముచు దానిగుండెకు గాఢముగఁ దాఁకు నట్లొక వాఁడిబాణమునేసెను. ఆ జింక యా బాధతోఁ బరుగెత్తుచు సంగమతీర్థమున మునిఁగి, మరణించి విద్యాధరరాజయి మింటికెగసెను. అది చూచి యాశ్చర్యపడుచు, నాబోయయు అందు స్నానముచేసి, నీరు గ్రోలి, నిష్పాపుఁడై శరీరము విడిచి, దివ్యత్వము పొందెను.

తొల్లి యచ్చోట సంగముఁడను రక్కసి రాతిక్రింద దాఁగియుండఁగా విష్ణు వాతనిని బయటికీడ్చి చంపెను. పశ్చిమద్వారమున భువనేశ్వరియు నుత్తరద్వారమున మహిషాసురమర్దని యను దుర్గయు నున్నారు. అచ్చట తరణియు, భైమియును గలి

యును. అచట స్నానముచేసిన సమస్త కలుషములు పోవును. ఈ నాలుగు నంత ర్ద్వారములు. ఇవిగాక నాల్గు బహిర్ద్వారములు కలవు. పశ్చిమమున కరవీరపురము, భద్రకాళిక, కోటీశ్వరలింగము, పుణ్యాజలనది, నారాయణీదేవియుఁ గలరు. దక్షిణ ద్వారమున కృష్ణానదియొడ్డున శూర్పలాఖ్యతీర్థమును, శివుఁడును గలరు. తూర్పు ద్వారమునఁ బుష్కరిణీనది తన కుత్తరముగాఁ బ్రవహింపఁగా త్రివిక్రముఁ డుండును. ఉత్తరద్వారమున నృసింహుఁ డుండును.

పూర్వము బ్రహ్మపుత్త్రుఁడగు సనందనుఁడు శిష్యసహితముగ హస్తిపురి కేఁగి ధర్మరాజును దర్శింపఁగా, నారాజు మునిని మిగుల గౌరవించి బంధుమిత్త్రాదివధవలనఁ గల్గిన పాపము నశించు మార్గముఁ దెల్పఁగోరఁగా ఆ ముని పౌండరీక క్షేత్రమునకు వెళ్లఁగోరెను. ధర్మరా జట్లొనర్చి, తన పాపముఁను బోనడిచెను.

పాండురంగని కుత్తరముగా ౧౦౦ విండ్ల దూరమున బోధిద్రుమరూపమున నృసింహుఁ డున్నాఁడు. అఁట కుండలతీర్థ మున్నది. అందు మునిఁగి నృసింహుని దర్శించువారికి రాజసూయఫలము లభించును. వేఁకోలఁది దేవకన్యక లచట నృసింహునకు నీరాజన మిచ్చుచుందురు. అఁట మరణించువారు ముక్తులగుదురు. అట్లగుటకుఁ గప్పయైన యముతపుత్త్రుఁడే తార్కాణము.

విఠ్ఠలునికిఁ బడమట పద్మతీర్థము కలదు. త్రిదంష్ట్రుఁడను రాక్షసుని చంపుట కయి మున్ను వెన్నుఁడచ్చట పద్మాయుధమును దాఁచియుంచెనఁట! అందు స్నాన మాడినవారికి ముక్తి గలుగును.

సుశర్మ యను క్రూరకిరాతుఁ డొకనాఁడు సపరివారముగ వేఁటకేఁగి దప్పిగొని పద్మతీర్థమునఁ దానమాడి, యా నీరుత్రాగెను. కొంతకాలమున కతనికి మృత్యువు రాఁగా - చిత్రగుప్తుఁడు తా నదివఱకు వ్రాసియుంచిన సుశర్మపాపముల పట్టికను తెప్పించి చూడఁగా నం దొకటియు లేకపోయెను - అతఁడచ్చెరువంది యమునికీ యం శము తెల్పఁగా నతఁడు మఱల శ్రద్ధగా ప్రతిపుటయు పరిశీలింపఁగోరెను. చిత్రగుప్తుఁడు పరిశీలించి యొకయెడ తనవ్రాఁతకు బదులుగ 'ఈతఁడొకనాఁడు పద్మతీర్థమున మున్గి నందున నీతని పాపములన్నియు నశించినవి' అను విష్ణునివ్రాఁతఁ గనుగొని యమునికిఁ దెల్పెను. పద్మతీర్థప్రభావమును యముఁడును కొనియాడి సుశర్మను గౌరవించెను. సుశర్మ స్వర్గమునకేఁగి భోగము లనుభవించి, తిరిగి భూలోకమున నుత్తమకుటుంబ మునఁబుట్టి, పాండురంగనిగుడి నూడ్చుచు సుఖముగఁ బెక్కేండ్లు గడపెను. ఆ సుకృతమునఁ జంద్రలోకమున కేఁగి పెక్కుసుఖము లనుభవించి, పిదప సుకీర్తి యను రాజుగాఁ బుట్టి గొప్పభక్తుఁడై నిండుపయస్సుననే సన్యసించి యవసానమున మోక్షము పొందెను.

కృతయుగమున నొక్క కోరయు, త్రేతలో రెండుకోరలును, ద్వాపరమున త్రిదంష్ట్రలును గల్గిన మాయావి యగు నొక రాక్షసుఁ డుండెను. వాఁడు కృతయుగ మున హిరణ్యకశిపునకు పార్ష్ణిగ్రాహి యనుపేరఁ బుత్త్రుఁడై నృసింహునిచేఁ జంపఁ

బడెను. త్రేతాయుగమున అతికాయుఁడను రాక్షసుఁడై పుట్టి రామునిచేఁ జంపబడెను. వాఁడే ద్వాపరమున త్రిదంష్ట్రనామమునఁ బుట్టి పాండురంగని క్షేత్రమునకు వచ్చి దేవునిపైఁ గోపించి గద నెత్తి యతనిని గొట్టఁగా, పాండురంగఁడు దానిని తూలించి త్రిదంష్ట్రుని సంహరించెను. ఆ గదావేగమునకు కృష్ణుని మొలనున్న జాలెసంచి తెగి, పడెను. అది యిప్పటికి నచ్చట కానవచ్చుచున్నది. విష్ణువు తన హృదయమున దాఁచిన సిద్ధమంత్రమును నాకే తెల్పియున్నాఁడు.'

అని తెల్పఁగా నారదుఁడా మంత్రరహస్యమును తెల్ప శివునిఁ బ్రార్థించెను. మహాభక్తుఁడగు నారదునకు శివుఁడు 'కృష్ణాయ నమః' అను నా మంత్రమును సాంగోపాంగముగ నుపదేశించి యిట్లనెను.

'నారదా' సిద్ధేశ్వరనామముతో నీ వుండు దక్షిణద్వారమున నీ మంత్రము జపించువారలకు కోరిన కోరికలు సిద్ధించును. తొల్లి బలరాముఁ డిచ్చటికి వచ్చి యిందలి చిత్రంబులఁ గాంచుచు, ఈ మంత్రరహస్యము నెఱుఁగఁజాలక, దానిం దెలిసికొనఁ గోరి ఘోరతపం బొనర్పఁగా, సంతసించి శ్రీకృష్ణుఁడు తనయన్న కీ మంత్రరహస్యముఁ దెల్పెను. రుక్మిణీదేవి యీ మంత్రమును జపించుటవలననే మన్మథుని బుత్రునిగాఁ బడయఁగల్గెను. మన్మథుఁడు ముల్లోకములను పూవుటమ్ములచే జయించుట కీ మంత్ర బలమే కారణము.

మున్ను నేను త్రిపురములను దహించునపుడు నా దేహమునుండి వెడలిన చెమ్మటనీరు నదియై పారెను. భీముఁడ నగు నావలనఁ గలుగుటచే అది భైమి, భీమరథి యను పేళ్ళఁబరఁగెను. ఆ నది పొంగిపొరలుచు క్షేత్రముమీఁదికి వచ్చుచుండఁగాఁ జూచి క్షేత్రవాసులు భయపడి మొఱపెట్టఁగా క్షేత్రపాలుఁడు మహాక్రోధమున దాని నడ్డెను. భైమి విష్ణుని శరణు వేడగా అతఁ డభయ మొసఁగి తనపాదముల పయినుండి ప్రవహింపఁజేసెను. అట్లు ప్రవహించిన తీర్థమునకు నరసింహతీర్థమని పేరు.

విష్ణువు ప్రత్యక్షమైన యీ చోటికి దక్షిణమున ఒక యిసుకతిన్నె కలదు. అచ్చట నొక గోపిక కృష్ణునిఁగూర్చి ఘోరతపస్సు చేయఁగా నతఁడు ప్రత్యక్షమయ్యెను. అప్పుడు కలిగిన తొందరలో ఆమె కేశబంధమును, నీవియు శిథిలములయ్యెను. ఆమె కృష్ణునిపాదములను తనకరములతో గట్టిగాఁ బట్టుకొనెను. గంగ ఆమె వ్రేళ్ళమీఁదుగ ప్రవహించెను. అదియే ముక్తకేశినీతీర్థము.'

శివుఁడిట్లు తెల్పఁగా విని, నారదుఁడు 'సుశీలపుత్రు లేరీతిగ ముక్తిఁబొందిరి? ప్రయుతపుత్రుఁ డెవ్వఁడు? అతఁ డేరీతిని నృసింహదేవుని కృపఁగాంచెను?' అని ప్రశ్నింపఁగా శివుఁ డిట్లు తెల్పెను.

సుశీలపుత్రులు, తమ తలిదండ్రులు గతించినపిదప పాండురంగని భక్తులై పెక్కుసుఖము లనుభవించి యంతమందు సశరీరస్వర్గము పొందిరని తెల్పఁగా నారదుఁడు 'మహాత్మా! సంసారసముద్రమున మునుఁగుచు, తేలుచునుండు

వారికి ముకుందుఁడు మోక్షమెట్లిచ్చెను? సంసారులే ముక్తులైనచో సన్న్యాసము వలనఁ బ్రయోజనమేమి?' అని యడుగఁగా శివుఁడిట్లుత్తర మిచ్చెను.

'ముక్తి సంసారులవశమైనది. గృహస్థధర్మముకంటె వేఱగు నుత్తమ ధర్మము లేదు. ఈ విషయమున నొక గాథకలదు. దానిని వినినచో నీసందేహము లన్నియుఁ దీఱిపోవును.

ప్రయుతుఁడను మునికి అయుత, నియుతులను పుత్త్రులు కలరు. వారగస్త్య మునికంతేవాసులు. వారిపై నగస్త్యునికి మక్కువ యెక్కువ. వారికి గురుభక్తియు, విద్యాసక్తియు మెండు. విద్యాపూర్తి యైనపిదప వారికిఁ దగిన కన్యకల నిచ్చి వివాహముచేయఁదలఁచి యగస్త్యుఁడు బ్రహ్మలోకమునకేఁగి యతని పుత్త్రికలను గాయత్త్రి, సావిత్త్రి అనువారిని దెచ్చెను. అయుతుఁడు గురుని దిరస్కరించి సంసారము నొల్లనందున నియుతునికే వారినిద్దఱిని వివాహముచేసి, యగస్త్యుఁడు తన యాశ్రమమునుండి యయుతునిఁ దరిమివేసెను. అయుతుఁడు ఘోరముగఁ దపస్సు చేయుచుండఁగా, అతనితపస్సునకు విఘ్నమొనర్పఁదలఁచి యింద్రుఁడు వృద్ధవానప్రస్థునివేషమున, రూపాంతరముననున్న కామధేనువు, శచి, తక్కుంగలవారును వెంటరా నయుతుఁడున్న యడవికి వచ్చి, గృహస్థాశ్రమము స్వీకరింపవలెనని అయుతున కనేకవిధముల హితము నుపదేశించెను. కాని ప్రయోజనము లేకపోయెను. ఇంద్రుఁడు కోపించి, అతనిని నిందించి, కార్యసాధనార్థము ముసలియావురూపుననున్న కామధేనువు నట విడిచి పోయెను. అది చావ సిద్ధముగా నున్నట్లు నటింపఁగా అయుతుఁడు జాలిపడి దానికి సంరక్షణ చేయఁగడంగెను. అతని కాలము చాల వఱకు దాని సంరక్షణతోనే కడచుచుండెను అయుతుఁ డది గ్రహించి యది యచటనున్న తనతపస్సు మంటఁ గలియునని యెఱిఁగి దానిమెడలో నొక తుండుఁగట్టి చేతఁ గట్టిపట్టి, బలవంతముగ దానిని వనాంతరమునకుఁ దఱుమసాగెను. ఆ యావు పరుగులెత్తుచు తీవ్రతపోనిష్ఠలోనున్న వాధూలమునిని త్రొక్కెను. తపోభంగమునకుఁ గుపితుఁడై ఆ ముని వెనుకకుఁ జూడఁగా, గోవును దఱుముకొని వచ్చుచున్న అయుతుఁడు కనఁబడెను. ముని యాతనిం దిట్టి కప్పయగునట్లు శపించెను. అయుతుఁడు తన వృత్తాంతము నంతను దీనముగా తెలుపఁగా, నాముని తనతొందరపాటునకు వగచి నృసింహదేవుని సేవింపవలెననియు, దర్దురాంగనయందు సంతానము బొంది, పితౄణ విముక్తినిచేసి, ముక్తిని పొందఁగలవనియును తెలిపెను. కామధేనువు తనపని నెఱవేర్చి స్వర్గమునకుఁ బోయెను. అయుతుఁడును పౌండరీకక్షేత్రమునకు వచ్చి, నృసింహుని దర్శించి, సేవించి మునిశాపమున చిత్రవర్ణములు గల కప్పయైయున్నను, పూర్వజన్మవాసనను విడువక భగవద్ధ్యానతత్పరుఁడై హరిదాసమను పేరఁ బరఁగుచు నచటనే యుండెను. ఇట్లు కొన్నియేండ్లు గడవఁగా నొకప్పుడు కాన్యకుబ్జ రాజపుత్త్రిక తన చెలికత్తెలతోఁగూడ పాండురంగని సేవింపవచ్చి చిత్రవర్ణముగు హరిదాసమును జూచెను. ఆమెయు, చెలికత్తెలును దానిని మిగుల చీకాకుపఱచి, కప్పను వెఱ

చిన యొక బ్రాహ్మణునిపయిఁ బడవేయఁగా నతఁడు కోపించి వారి నందఱిని దగ్ధరాఁగ న లగునట్లు శపించెను. వారట్లే యాఁడుకప్పలై హరిదాసమును మోహించి దానివలన సంతానవంతులైరి. పిదప నయుతుఁడు శాపవిముక్తుఁడై ముక్తుఁడయ్యెను. కాన గృహస్థధర్మమును దిరస్కరించువారు దుఃఖభాగులగుదురు. ఈ యంశమును నాకు ముకుందుఁడే తెలిపెను.' ఇట్లు శివుఁడు తెల్పఁగా నారదుఁడు మిగుల హర్షించి, శివు నికి నమస్కరించుచు, పౌండరీకమునకేఁగి, భైమిలో స్నానమొనర్చి విష్ణువును సేవిం చెను. అతఁ డిప్పుడు దక్షిణద్వారమున నున్నాఁడు.'

ఈ విధముగ సూతుఁడు శౌనకాదులకుఁ బాండురంగమాహాత్మ్యమును వివ రించి చెప్పెను.

రామకృష్ణుని విశిష్టత.—

రామకృష్ణునికాలమునను, అంతకుఁబూర్వమునను వెలసిన కవులు తమ కృతు లను ప్రభువులకును, గొప్పసంపన్నులకును అంకితమిచ్చి తన్మూలమున ధనమును సంపాదించి సుఖజీవనము గడపుట కలదు. బమ్మెరపోతనవంటి కొందఱు తమ గ్రంథము లను నరాంకితములనొనరింపక భగవదర్పితములనొనర్చి తమ భక్తిప్రపత్తులను వెల్ల డించుటయు కలదు. రామకృష్ణకవి యీరెండింటికంటెను విలక్షణమగు పద్ధతి ననుస రించెను. పాండురంగమాహాత్మ్యము నీతఁడు విరూరి వేదాద్రిమంత్రి కంకితమిచ్చెను. ఈవేదాద్రిమంత్రి మంగయగురవరాజు పుత్రుఁడగు పెదసంగభూపాలునియొద్ద వ్రాయసకాఁడు. ఇట్టి కృతిపతివలనఁ గృతిభర్తకు సమృద్ధిగ ధనము లభించుట కవ కాశము లేదు. మైత్రిని బురస్కరించుకొనియో, లేక ఇతరకవులకంటె విలక్షణముగఁ గృతినాయకు నేర్పఱుపఁదలఁచియో రామకృష్ణకవి యిట్లొనర్చియుండవలెను. ఇతఁడు తన 'ఉద్భటారాధ్య చరిత్రము'ను దేచమంత్రికిఁ గృతియిచ్చుటయునిట్టిద గమనార్హము.

సామాన్యముగఁ బ్రబంధములను రచించు కవులు కొంతవఱకు ప్రయత్న పూర్వకముగా తమ శక్తిని ప్రదర్శించి, యాపిదప నట్టి యత్నమును సడలింతురు. కావుననే మనుచరిత్రము, వసుచరిత్రము, పారిజాతాపహరణము మున్నగు ప్రబంధ ములలోఁ గొన్ని యాశ్వాసములే రసవంతములుగ నుండి, తక్కినభాగము సామాన్య పద్ధతిని కానవచ్చును. కాని పాండురంగమాహాత్మ్యము తొలుతనుండి కడవఱకు నొకే పద్ధతిలో నున్నది. హృదయంగమములగు వర్ణనములును, కథలును, ఆశ్వాసము లన్నింటను గలవు. మొదటియాశ్వాసమున అగస్త్యముని కుమారవృత్తాంత ములును, ద్వితీయాశ్వాసమున పుండరీకవృత్తాంతమును, మూఁడవ యాశ్వాసమున నిగమశర్మోపాఖ్యాన రాధికావృత్తాంతాదికములును, చతుర్థాశ్వాసమున రాధాత పశ్చరణ సుశీలాదివృత్తాంతములును, ఐదవయాశ్వాసమున సుశర్మోపాఖ్యానము, అయుతనియుత వృత్తాంతమును చాల చక్కగఁ గూర్పఁబడినవి. ప్రతివృత్తాంత మునను ప్రత్యేకత కలదు. కొన్నివిషయములు చర్విత చర్వణములే యైనను, క్రొత్తఁ దనము కలిగి, పాఠకులకు విసువు కల్గింపక ఆసక్తినే కూర్చుచుండును.

రామకృష్ణునిరచన విశిష్టమైనది. పద్యములు ధారాళముగసాగి, సులభముగా నున్నట్లు కన్పించుచున్నను, చాలచోట్ల గూఢార్థభూయిష్టములయి, కొఱకఁబడని కొయ్యలయి యుండును. పద్యములోని పద మొక్కటి యర్థము కానియెడల - ఆ పద్యము నట్లుంచవలసినదే! స్వయముగఁ గొన్నిపదములను - వ్యుత్పత్తి ననుసరించి గాని - జాతీయముగఁగాని - కల్పించుట యితనికిఁ బరిపాటి. అట్టి పదములు నిఘంటువులందును దొరకుట దుర్లభము. ఈ గ్రంథమున సీసపద్యములు మిక్కిలిగా నున్నను - ఒకదాని నింకొక పద్యము పోలియుండక - విలక్షణతను కలిగి యున్నవి. వర్ణనములు స్వభావసిద్ధములయి, క్రొత్తపోలికలతో నలరారుచు, మనస్సు నాకర్షించుచుండును. గతానుగతికపద్ధతి ననుసరింపక క్రొత్తకల్పనలం కూర్చి చక్కని లోకోక్తులతో చమత్కారముగఁ గవిత్వముచెప్పు కవులు వ్రేళ్లపయి లెక్కపెట్టఁదగి యున్నారు. అట్టివారిలో తెనాలి రామకృష్ణకవి యగ్రగణ్యుఁడు. పయివానికిట సంగ్రహముగ ఉదాహరణము లీయఁబడును.

I. క్రొత్తపదములు కల్పించుటకు, మాఱుమాఱుపదములవాడుకకు నుదాహరణములు కొన్ని—కద్రూజాంగదుఁడు = శివుఁడు (పుట 2) సేనముడలియారి = సేనాధిపతి(3)తత్తాదృక్ = సాటిలేని(3, 20, 198)నీటికెంపు=కౌస్తుభము (4) గాంగేయుఁడు, బ్రహ్మగర్భుఁడు, కుక్కుటధ్వజుఁడు = కుమారస్వామి. (43) నెఱ=చోటు(45) మరుత్ఫలము=వాయుఫలము - ఇంద్రధనుస్సు (47)కొమ్ముతేజీ=వృషభము(43) త్రిముఖాస్త్రము = త్రిశూలము(48)వాకతాల్పుఁడు = గంగాధరుడు - శివుఁడు (58) ధేనుదండము = పసులఁద్రోలు కఱ్ఱ(68) బుట్టి = బుట్ట (68) చుట్టుంగత్తి = చక్రము (72) ఉత్పిబము = చాతకము (82) ఉగ్రశత్రువు = మన్మథుఁడు (83) భుజాభోజనము = విందుభోజనము(95,210)కాసూధరుంపు = కుమారస్వా(113) కపిలపనుఁడు, కపివదనుఁడు = గజాననుఁడు (115) ఆదికపి = ఆదిదేవుఁడు (116) వీణాముని = నారదుఁడు (128) ఉతొక్కచుండు = దిట్ట - గడసరి. (129) వీటిప్రోఁగు = దుర్వ్యసని - పోకిరి. (131) త్రాటిగట్టు = జన్నిగట్టు - బ్రాహ్మణుఁడు (146) రూపాజీవ=వేశ్య (153) రసపతి = వంటయిల్లు (163) జనాంతికపదంబు = అంతఃపురము (169) ప్రస్తుతంబు = విశేషము (241) నెట్టికసీల = అడ్డిగసీల - చిన్నవాఁడు - పొట్టివాఁడు (248) భుక్తము = అన్నము (253) ముయ్యాడు = యువకుఁడగుట (273) వార్మణి = నీటికెంపు - కౌస్తుభము (293) శాంబరిగోపాలుఁడు = మాయగొల్లఁడు-శ్రీకృష్ణుఁడు (297) తూనిఁగ = తూనీఁగ (297) తుల్లకాశిక్యము = జాలెసంచి (311) నీటిడొంకలు = నీటిపై యలలు (323) సానాథ్యంబు = కూడిక (326) ఫలాయతనము = స్వర్గము (338) పోలుంబోలములు = కార్యాకార్యములు (339) గోఁచికట్టు = బ్రహ్మచారి (343) కూకులువత్తులు = కలవరపాటు. (345) ఫలోదయము = స్వర్గము (350) వరుణదంతావళము = కప్ప (361) రాతిశొడుకు = కప్ప (362) ముయ్యాడు= పరిపూర్ణత (363) గరిగంటి = హద్దు - లేక హద్దుకలది. (364)

కొన్ని పదములు చమత్కారముగఁ గూర్పఁబడినవి. అట్టివానికిఁ గొన్ని ఉదాహృతులు - (1) మందప్రాయాంధ్రసూరిమిత్రానీకంబు = శ్రీకృష్ణుఁడు (68) (2) పసిగాఁపుపవయసాకె = గోపిక (93) (3) గొనజంబ్రాయపు తేజుసూన = యావనపు తేజస్సుగల చిన్నవాఁడు (129) (4) తొలుకారుకలఁకపులుగు మావురావుత్తు = బ్రహ్మ (213) (5) చతుఃశ్రోత్రకన్యల్ = నాగకన్యకలు (238) (6) పాటిపాటి తలపోఁతలు = లేనిపోని యాలోచనలు (299)

కొన్ని లోకోక్తులు, సామెతలు:—

అడుగులకు మడుగులొత్తుచు (70) తనకుఁబోదు, నాకుఁ బోదని (71) కంపలఁ బడ్డ కాకినై (111) కాళ్లల దోవతియయ్యె (122) చుక్కతెగి పడినవడువున (134) తేనెపూసిన కత్తి (140) శాకాయ లవణాయ వా (241) ధూళిః పరగృహాదపి(241) ఈఁగకుకాటు, పాముకును బలి (241) అభ్యాగతః స్వయం విష్ణుఃవనఁగ (243) కూటిబీద తోడుతప్పును (243) తన ప్రాణము నిలుపుకన్న ధర్మము కలదే! (244) ఈరు తివియఁ బేను రాకున్నె (245) కుప్పఁజిచ్చిడి పేలాలు కొలుకఁడివురు (253) తన మొగంబుఁజూడు, తనుజూడుము (278) ఏనుంగుమీఁద నున్నవాని, మేరమీంటే, నున్నమడుగఁ జూచుచున్నారు (278) పతికిఁ గీడొంట బంట్లపాపంబుగాదె! (308) ప్రకృతిమధురంబుఁలకు వేషరచనలేల?(320)మడుఁగు సగము మైలయు సగమే! (339)

రామకృష్ణుని కవితలో స్వతంత్రపదప్రయోగము చాలచోట్లఁ గానవచ్చుచున్నది. అట్టి పదములు కొన్ని:—

మాద్రి = మాదిరి (18) 'పల్కుల్వంటి = పలుకులవంటి (8) లక్ష్మ ఘనుఁడు = లక్ష్మణ ఘనుఁడు (17) కలకాళాస్తి = కలకాళహస్తి(19)నిర్వేద = నిఋవేద(2,25) కొల్నిలో = కొలనిలో (27) వసవల్పు = వసవలపు (42) తిరువారాధానము (70) చతుర్ముఖవంచితధూర్త కీర్తి = వంచితచతుర్ముఖ ధూర్త కీర్తి (71) బోర్తలుపు = బోరుతలుపు (73) ఎడ్మ = ఎడమ (93) కుచరజ = కుచరజో (93) అర్పభాగ = అర్చాభాగ (96) పాల్తుక = పాలఁతుక (96) తొడ్గిన = తొడిగిన (98) వల్చు = వలచు(122)ప్రేలడములు = ప్రేలుటలు (139) తెల్పు = తెలచు (235) కొన్గినిసి = కొన్ని, గినిసి(240)నిలుపుకన్న=నిలుపుటకన్న(244)మ్రోల్చే పట్టు = మ్రోలచేపట్టు(245) తిరుమేనికప్పు (225) మోడ్పునఁగేలు=మోడ్పుఁగేలు (227) నుయి దాఁటేవానికిన్= నుయ్యి దాటువానికి (297) పోర్మహిషున్ = పోరు మహిషున్ (293) వెన్కదియ్యక = వెనుక దీయక (296) సుధామ త్రల్లులు = సుధామతల్లులు (340)

ఇఁక వ్యాకరణవిశేషములు:—

(1) సంస్కృతాంధ్రమిశ్రసమాసములు.—

ప్రాయసప్రవృత్తి (పుట 7) దినవెచ్చము (11) కనకక్రోవి (198)

(2) అకారసంధి:—

10. కందాళప్పగారు (కందాళ+అప్పగారు)

37. చెంగావివలువందు (చెంగావివలువ+అందు) 83. ఇచ్చుటనుడు = (ఇచ్చుట+అనుడు) 145. బంగారుకుండంచు (బంగారుకుండ+అంచు) 134 చెలు లిండ్ల = చెలుల+ఇండ్ల 210 గురువులిండ్ల గురువుల+ఇండ్ల.

(3) అకారసంధి చేయకుండుటకు:—

(19) కందాళయప్పగారు. (243) పోకయుంత. (277) చింతయాకు.

(4) ఇకారసంధి కుదాహరణములు:—

16. అమ్మాజమ్మ ('అమ్మాజి+అమ్మ) (అమ్మాజియమ్మ'అని సంధి లేని రూపము కూడ వాడఁబడినది. 17.) 30. అరమానిసాత్మవిస్తారము (అరమానిసి+ఆత్మవిస్తారము) 90. కూడాడుఁజూమీ. (కూడి+ఆడు జూమీ) 118. ప్రోదిడి (ప్రోది+ఇడి) 123. ఒకర్తెలుంగు (ఒకర్తి+ఎలుంగు) 149. కంచంత (కంచి+అంత.) 241. కోమటిండ్ల (కోమటి+ఇండ్ల) 247. ఆఁకలింతయుఁ (ఆఁకలి+ఇంతయుఁ) 270. వసుమతినుండేతెంచెఁ (వసుమతినుండి+ఏతెంచెన్.)

(5) ఇతరప్రయోగములు:—

42. కావుకావనుట. (కావుము+కావుము+అనుట) (ఇచట అచ్చు పరమగునపుడును మధ్యమపురుష'ము',లోపించినది)

56. 'హిమనగాత్మజయుం, గంజారి రవిశిఖినయనుఁడుప,చారంబులు - ఇచట 'నయనుఁడు నుపచారంబులు' అని సముచ్చయ ముండవలెను. అది లేదు.)

165, 292. వెండిన్. (ఇచట 'వెండియుఁ' అని 'యు'ఉండవలెను.)

2. జోదుచే - భద్రమయాత్మచే - నలుమోముల వేలుపుచే. 46. ఇందుధరుచేత నెలుఁగంగవలయు (ఇట'వలన' అను పంచమ్యర్థమున తృతీయ.)

341. పంటికి. ('పండు'కౌపవిభక్తికాంతముగా వాడఁబడినది.)

131. బచ్చింట. (ఇచట'బచ్చు నింట'అని ద్రుతము రావలసినది. అది రాలేదు.)

60. దేవుఁడేనియు నటువంటి తీర్థమేని, నట్టి సుక్షేత్రమేని - (ఇచట'ఏని' సముచ్చయార్థకముగ నున్నది.)

242. మాడుకలిగెఁ, బులిసినది కర్గైనన్నంబు (ఇచట 'ఏని' లోపించినది.)

. 118. కాళరాత్రీశుఁడగు నీవు...పుండరీకాక్షుఁడగు నీవు...సత్కృపాంబోధి యగు నీవు...71. నీవాదిభూతుఁడగుట-(ఇట యుష్మద్విశేషణములకు కలుగ వలసిన 'వు' ఆగమము విడువఁబడినది.)

275. 'నిర్బంధమునందుఁ బాపుమీ' (ఇచట 'ఉండి'కి బదులు 'అందు' వాడఁబడినది.)

వర్ణనములు:—

రామలింగకవియే రామకృష్ణుఁడని నిరూపించిన సందర్భమునఁ గొన్ని వర్ణనము లుదాహరింపఁబడినవి. అవి కాక మఱికొన్ని యిచటఁ జూపఁబడును.

గీ. 'పద్మరాగమణీమయ పాదలబ్ధి, స్ఫురిత గైరికశిఖర చంద్రమా సమృద్ధి
గంధవతి యను నొక్క పంకజమునడుమ, మించు నక్కొండ కొదమ రాయంచఁబోలి.'

[ఆశ్వా. I. ప. 175.]

ఇచట భూమియొక్క తామరపూవువలెను, కైలాసము రాజహంసము వలెను, కైలాసప్రత్యంత పర్వతములు - పద్మరాగములతోఁ గూడినవి - హంస కాళ్లవలెను గైరికాదిధాతువులచే నెఱ్ఱనైన కైలాసశిఖరములు హంసముక్కువలెను ఉన్నట్లు వర్ణన చక్కగనున్నది. ఇందలి యుపమ అసాధారణము.

గీ. 'పూవుఁదేనియఁ దడిసిన మావిచిగురు, మీఁదనంటి చరించు తుమ్మెద తలిర్చు
సమయమగుటయు నసినెయ్యి సమరి మరుఁడు, త్రిప్పవోదోము నీలంపుఁదునకయనఁగ.'

[ఆశ్వా. I. ప. 182.]

ఇచటఁ దేఁటి ఆఁకుమీఁది తేనెను గ్రహించుటకు సమర్థముకాక, దానిని విడువను మనసు రాక - ఆచిగురునంటియే యిటునటు తిరుగుచుండుట ఎంత హృదయంగమముగ నుత్ప్రేక్షింపఁబడినదో చదువరు లూహింపకపోరు.

సీ. మును మీనగుటఁ బట్టి మునులువైచిన బత్తి వలఁబోలెఁ జిక్కు మాదలఁ దలిర్ప,
వెలితిగాఁ జవిగొన్న వెన్నముద్దయుఁబోలె శంఖంబు వామహస్తమునఁ దనర,
జగదండవహ కాలచక్ర భ్రమణహేతు దండమై నిజధేనుదండ మమర,
సంచిఁబట్టినఁ బద్మజాతాండముల లీల వలకేల గ్రచ్చకాయలు ఘటిల్ల
గీ. కలయఁబూచిన కల్పవృక్షంబుచాయ, సరస వనపుష్పమాలికాభర సమగ్ర
విగ్రహముతోడ బిలసిల్లు విప్రునెదుట, మందహాసయాంద్ర కూరిమిమ్రానిపండు.

[ఆశ్వా. 2. ప 14.]

పుండరీకుని హృదయమునఁ బ్రతిబింబించు శ్రీకృష్ణుని స్వరూప మిచట ఎంతయు స్వభావసిద్ధమై యున్నది.

అక్క, తమ్ముఁడు నిగమశర్మ తమ్ముజూడ రానందులకెట్లు నిష్ఠురములాడుచున్నదో గమనింపుఁడు:—

శా. 'ప్రారంభించిన వేదపాఠమునకున్ బ్రత్యూహ మానంచునో
యేరా! తమ్ముఁడ! నన్ను జూడఁ జనుదే వెన్నాళ్లనోయుండి; చ
క్షూరాజీవయుగంబు వాచె నినుగన్గోకున్కి; మీబావయున్
నీరాకల్ మదిఁగోరుఁ జంద్రుఁబొడుపున్ నీరాకరంబుంబలెన్.' [ఆశ్వా. 3. ప. 33.]

ఇందు 'ఏరా తమ్ముఁడ! చక్షూరాజీవయుగంబు వాచె' అనునవి ఎంత స్వాభావికముగాఁ బడినవో గమనింపఁదగును.

నిగమశర్మ అక్క—

'చేటికానీకకీలికాసీన యగుచుఁ, బద్మకర్ణికఁ గొలువున్న పద్మవోలె'.

ఉన్నదనుట ఆమెఠీవిని, హితోపదేశముపట్ల ఆమెకుఁ గల సామర్థ్యమును వ్యక్తముచేయుచున్నది.

శ్వేతద్వీపములోని వైకుంఠపురములోని వనితలు ప్రళయకాలపు విష్ణువును సాకిన విధమును గనుఁడు.

సీ. 'జలధివీచీ వాత్యఁ జలిదాఁకెగా యని యక్కల నంపంద యలమి యలమి
ప్రామఱ్ఱియా కొత్తి రాయిడిఁ బొందెఁగా యని సన్నపొత్తుల నునిచి యునిచి
వాపోయి వాపోయి పసివాడి యాఁకటఁ బెగడెఁగా యని యుగ్గు పెట్టి పెట్టి
పెనుజీఁకటులు గ్రమ్మ బెక్కైట వసియించి వెఱచెఁగా యని పుల్ల విఱిచి విఱిచి
గీ. మంచి లక్షణముల పుట్టుమచ్చవాఁడు, నేత్రములు విప్పనట్టి యీ నెత్రుగందు
వరద నేతెంచె నెవ్వారివాఁడొ యనుచు, విబయమారిఁదెచ్చి పెనుతు రవ్వీటిసతులు.

[ఆశ్వా. 3. ప. 156.]

మధుమదక్షీబ యగు నొక యువతి చేష్టితము నవలోకింపుఁడు.

సీ. దామోదరుఁడు యశోదాస్తన్య మానెడు నని మ్రొక్కు విరిగుత్తి నళి భ్రమింపఁ
బ్రొద్దలుసొచ్చెఁ గద్రూదేవి కిపుడని ప్రియమందు వేఱుగర్భిణిగుఱించి
పావనిగద నొచ్చె ఫణికేతు తొడలని నడలు నేసుఁగుచేత నరఁటు లూరుగ
బడబాగ్ని జడధి వెల్వడియెడునని చూపుఁ గానఁ బూఁచిన కింశుకము చెలులకు
గీ. శేషవృత మేరుశిఖరమనీమఁ బొగడు నంచకౌఁగిట నున్న హేమాంబుజంబు
పూర్వమగు విన్కి మదివెడ వాఁడముదేర, మధుమదక్షీబ యగు నొక్క విధునిభాస్య.

[ఆశ్వా. 5. ప. 299.]

ఇట్టి వర్ణనల నెన్నింటినైనఁ జూపవచ్చును. గ్రంథము సామూలాగ్రముగఁ బరిశీలించినవారికి అవి అవగతములగును. మానవుల స్వభావమును, దేశ - కాల సంప్రదాయములను, కుటుంబపరిస్థితులను, నాగరకుల మనుకొనువారి నడవడులను, పెద్దలయెడఁ బాటింపవలసిన మర్యాదలను వర్ణించుటలో రామకృష్ణకవి యద్వితీయుఁడని చెప్పవలసియున్నది. ఇతఁడు, ఏతద్రచనమునకు మున్నే వైష్ణవుఁడుగా మాఱుటవలన నిందు ఎడనెడ వైష్ణవ సంప్రదాయములును గానవచ్చుచున్నవి.

గృహస్థాశ్రమపుటుత్కర్ష, వేదాంతవిద్యయొక్క యథార్థ స్వరూపము ఇందు లెస్సగా నిరూపింపఁ బడినవి.

పోలికలు.—

కవి యేదైన గ్రంథమును రచించినపుడు తనకంటెఁ బూర్వులగు కవుల ననుకరించుటగాని, అనుసరించుటగాని సహజము. శ్రీరామకృష్ణుని కవితయందు నట్టి పోలికలుండవచ్చును. కాని అట్టి వింధు మిక్కిలి స్వల్పము. గ్రహింపఁబడినవికూడఁ గ్రొత్తదనముతో విలసిల్లుటచే నవి అనుసరణములని చెప్పుటకు వలనుపడదు. ఇతఁ డీ గ్రంథమున కవిస్తుతిలో వ్యాస, వాల్మీకి, నన్నయభట్టులనే పేర్కొనెను. కావున నాంధ్రకవులలో నొక్క నన్నయ్యభట్టే యీతనికి స్తుతిపాత్రమయ్యెననుట గ్రాహ్యము. కావున నీతని కే కవిరచనయెడ అభిమానమో వ్యక్తముకాకున్నది.

క. పాపట తెఱువున నడి నా, సాపుట ముక్తాఫలప్రచారంబై రా
థా పృథు వక్షోరుహముల, పైపైఁ బ్రథమోదబిందుపటలము నిగిడెన్. [ఆశ్వా. 4. ప. 27.]

అను పద్యము మహాకవి కాళిదాసు రచించిన కుమారసంభవములోని

'స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః పయోధరోత్సేధనిపాతచూర్ణితాః.
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే చిరేణ నాభిం ప్రథమోదబిందవః.

అను శ్లోకము ననుసరించుచున్నది. మూలముకన్న తెలుఁగున వర్ణనము విలక్షణముగ నున్నది. రాధసీమంత మొక మార్గమువలె నున్నదనియు, ముక్కుకొనను జాఱిన నీటిబిందువు ముత్యమువలె నున్నదనియు నిందలి విశేషములు.

మ. సురకర్మంది హిరణ్యదైత్యసుతు వ్యాసున్ శౌనకున్ శ్రీపరా
శరు రుక్మాంగదు నంబరీషు సరమాజానిన్ వసిష్ఠున్ బురం
దరపుత్త్రున్ శుకు దాల్భ్య భీష్ము వెలుఁగొందంజేయు సద్భక్తిత
త్పరుఁ డీ పుణ్యుఁడు పుండరీకుఁ; డితనిన్ భావింతు మేలీవులన్.' [ఆశ్వా. 4. ప. 104.]

అను పద్యము

శ్లో. 'ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్,
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాద్యాన్ పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి'

అను శ్లోకమున కనువాదమనుట స్పష్టము.

'ప్రకృతి మధురంబులకు వేషరచన లేల? [ఆశ్వా. 5. ప. 150.]

అనుదానికి 'కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం' అను శాకుంతలములోని పద్యపాద మాధారము కావచ్చును.

'నిమ్నాభిముఖమైన నీటి నెవ్వాఁడోపుఁ ద్రిప్పి యొప్పగుచోటఁ దిరుగఁజేయ? [ఆశ్వా.5. ప. 229.]

అనుదానికి, కుమారసంభవమునందలి

'క ఈప్సితార్థస్థిరనిశ్చయం మనః పయశ్చ నిమ్నాభిముఖం ప్రతీపయేత్?'

అనునది మూలము.

'అస్త్యేత దన్యసమాధి భీరుత్వం దేవానాం.' అను శాకుంతలమునందలి వచనము ననుసరించియే

E

'.......................తపముఁ గావించువారిఁ గనిన తలయేర్చుఁగాదె యాఖండలునకు.'
[ఆశ్వా. 5. ప. 231.]

అని కూర్పఁబడినట్లు తెలియుచున్నది.

ఆంధ్రకవులలో శ్రీనాథకవి సార్వభౌముని పోలిక లిందు కొన్ని కానవచ్చు చున్నవి. ఇందలి నిగమశర్మోపాఖ్యానము శ్రీనాథుని సుకుమారచరిత్రఁబోలియున్నది.

సీ. 'చలిపోని గడితంపుఁజలుత చౌకంబుల తోగరుఁబుట్టము కచ్చఁదోడివి కట్టి'
[క్రీడాభిరామము. పుట. 44.]

పైదానిని రామకృష్ణుఁడు 'కట్టిరి చిలుతచౌకముల కొంబుట్టముల్' [పాండు. ఆ. 3. ప. 74] అని గ్రహించినాఁడు.

'తాను సెట్టిక సీలంతగాని లేదు' [క్రీడాభిరామము. పుట. 48.]
పొట్టి సెట్టికసీల దిట్టపడుచు' [పాండు. ఆ. 4. ప. 179.]
"......గుడిలోనుండియు, గుడితాలను దీసె వీఁడు......' [క్రీడాభిరామము. పుట. 82.]
'గుడినుండి గుడితాళ్లు తీయుకరణి' [పాండు. ఆ. 3. ప. 68.]
'ముదిత చన్నులు పొగలేని ముర్మురములు' [క్రీడాభిరామము. పుట. 86.]
పొగలేని ముర్మురంబులు, మగువల పాలిండ్లు భోగమహనీయఁబుల్' [పాండు. ఆ. 4. ప. 9.]

శ్రీనాథుని 'పంచారించు' పదము (పాండు. ఆశ్వా. 3. ప. 179.) 'మిసిమింతుఁడు' అనునదియు [పాండు. ఆ. 2. ప. 29] ఇందును గానవచ్చుచున్నవి.

అల్లసాని పెద్దనామాత్యుని 'అచటఁబుట్టిన చిగురుఁగొమ్మైనఁ జేవ' (మనుచరిత్రము) అనునది 'చిగురుఁ గొమ్మయుం జేగరై' (పాండు. ఆశ్వా. 4. ప. 2.) అని యిందు గ్రహింపఁబడినది. పరికించినకొలఁది నిట్టి పోలికలు కానవచ్చుచుండును.

గ్రంథసంస్కరణము:—

పాండురంగమాహాత్మ్యము వ్యాఖ్యానాపేక్షగల ప్రౌఢప్రబంధమై యున్నను, ఇంతవఱకును శ్రీమాన్ తెన్మఠం శ్రీరంగాచార్యులుగారి టిప్పణిక తప్ప వేఱొక టీక వెలువడలేదు. శ్రీరంగాచార్యులుగారు తమటీకతోఁ బ్రకటించిన గ్రంథముతప్ప వేఱు పూర్తి ముద్రణము వెలువడలేదు. ఆ గ్రంథ మెదు కూర్పులు పొందినది. తొలికూర్పున నే రీతినున్నదో చివఱికూర్పునను అట్లే యున్నది. గ్రంథమునఁ గల పద్యములలో సగమునకుఁ బైగా అపపాఠములతోఁగూడి యుండుటచే సమన్వయము కుదురకున్నది. టీకయు నట్టి మూలము ననుసరించియే వ్రాయఁబడుటవలన దానివలనఁ గవిహృదయము నెఱుఁగుట కవకాశము లేకున్నది.

ఒకప్పు డీప్రబంధమునందలి యొక ఘట్టమును మన్మిత్రులును, భారతీ పత్రికా భూతపూర్వ సంపాదకులును అగు శ్రీగన్నవరపు- సుబ్బరామయ్యగారు నాయెదుటఁ చదువుట తటస్థించినది. శ్రీరామకృష్ణకవి కవితాలహరి మమ్మానంద రసమున ముంచి వైచినది. ఈగ్రంథమునెడ నాకు గొప్పగౌరవమేర్పడినది.

అంతకుఁ గొలఁది దినములక్రిందటనే నేను వ్రాసిన కావ్యాలంకార సంగ్రహటీకను శ్రీసుబ్బరామయ్యగారు చూచుట జరిగినది - కాన, ఆ విధముగనే పాండురంగమాహాత్మ్యమునకుఁ గూడ టీక వ్రాయవలెనని వా రా సమయమునఁ బ్రోత్సహించిరి. మూలమునఁ దప్పులు చాల ఉన్నవనియు, మూలమును సంస్కరించినఁ గాని టీక వ్రాయుట అసాధ్యమనియు తెల్పితిని. పిదప శ్రీసుబ్బరామయ్యగారి సాయముననే ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని మూఁడు వ్రాఁతప్రతులతో ముద్రితప్రతిని సరిపోల్చి పాఠములు సేకరించితిని. కాని కొన్ని యాటంకములవలన కొన్నియేండ్లపాటూ ప్రస్తావనయే లేకపోయినది.

ఒకప్పుడు నేను వేసవిసెలవులను శ్రీకాకుళముజిల్లాలోని నరసన్నపేటలో గడపవలసి వచ్చినది. అప్పుడీ పాండురంగ మాహాత్మ్యమును ముద్రితప్రతి ననుసరించియే సమన్వయము చేసికొనుటకు యత్నించితిని. వ్రాఁతప్రతులలోని పాఠముల నెక్కించుకొన్న ప్రతియు నా సమయమున నాయొద్ద లేదు. నా యీ ప్రయత్నమున కప్పుడా యూర నుండిన ఆప్తమిత్రులు, సంస్కృతాంధ్ర భాషావాఙ్మయ నిష్ణాతులు శ్రీసామవేదుల సీతారామశాస్త్రిగారును, విద్వాన్ శ్రీ కత్తి వేంకటసుబ్బరావుగారును మిగుల సాయపడిరి. పెక్కుచోట్ల శ్రీరంగాచార్యులుగారిచ్చిన యర్థములు కుదురకపోవుటయేకాక విపరీతముగు నర్థముల నిచ్చుటయుఁ గానవచ్చెను. పిదపఁ జెన్నపురికి వచ్చి వ్రాఁతప్రతులలోని పాఠములను సంప్రతించుచు మూలమును సంస్కరించి, శుద్ధప్రతిని వ్రాయఁ దొరకొంటిని. ఈ విషయమున క - చ - ట - త - అను ప్రతులలోని పాఠములను, ఆ యా సందర్భముల ననుసరించి గ్రహించి, పాఠాంతరముల నథస్సూచికయందు ఇచ్చితిని. ఇందు క. గుర్తుగలది శ్రీతెన్మఠము వారు ప్రకటించిన ముద్రితప్రతి. మిగిలినవి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందలి వ్రాఁతప్రతులు. మఱియు నిర్వ్యాడ విసుగుచెందక శబ్దరత్నాకరమునుండియు, సూర్యరాయాంధ్రనిఘంటువునుండియు పాండురంగమాహాత్మ్యమునుండి గ్రహించిన గ్రంథభాగములను పరిశీలించి, ఆ పాఠములను సంప్రతించితిని. ఇట్లొనర్చి మూలమును సరిచేసి టీకను వ్రాయ దొరకొంటిని. తొట్టతొలుత, నేఁజేసిన పరిశ్రమను కొంచెము లోకమునకు వెల్లడించుటకై 'పాండురంగమాహాత్మ్యము - పాఠపరిశీలనము' అను శీర్షికతో నొక వ్యాసమును వ్రాసి ప్రకటనార్థము 'భారతి'కిఁ బంపితిని. నేను పయి గ్రంథమునకు టీక వ్రాయుచున్నట్లు అందు తెలిపితిని. సంపాదకులు నా వ్యాసమును దయతో ప్రకటించిరి (భారతి తారణ - శ్రావణసంచిక.)

కాని కొంతభాగమును—అనఁగా నేను టీక వ్రాయుచున్నసంగతి మున్నగు విషయములు కలదానిని విడిచివేసిరి. వా రట్లొనర్చుటకుఁ గారణము తెలియదు. కాని ఆ వ్యాసము ప్రకటింపఁబడినపిదప - పాండురంగ మాహాత్మ్యమునకు టీక! వ్రాయవలెనని జాబులు వ్రాయుచుఁ గొందఱు నన్ను బ్రోత్సహించిరి. ఇట్టి ప్రోత్సాహముల నూఁతగాఁ గైకొని టీకను పూర్తిచేసితిని.

టీకారచన:—

ఇయ్యది పెద్ద గ్రంథము; మఱియు ప్రౌఢ ప్రబంధము; వైష్ణవసంప్రదాయ విషయములతో వెలయు సద్గ్రంథము. నిఘంటువులలో లేని పదములు ఇందుఁ జాలవఱకును గలవు. వేదాంత విషయములు, మంత్ర శాస్త్రవిషయములు నెడనెడఁ గలవు. చాల పద్యములు గూఢార్థములతో నిండి యున్నవి. ఇట్టి గ్రంథమునకు టీకను వ్రాయుట సామాన్యకార్యము కాదు. అయినను సాహసించి యీ పనికి దొరకొంటిని. కొంతవఱకును వాఙ్మయమునఁ బరిశ్రమ చేసినవారే యీ గ్రంథమును పఠింతురు కావున అట్టివారి కుపయుక్తమగు రీతిని టీక సంగ్రహముగాఁ గూర్పఁబడినది. చివరఁ బద్యసూచికయుఁ జేర్పఁ బడినది. అవసరమని తోఁచినపట్ల మాత్రము టీకలో పదముల కర్థము, తాత్పర్యము నీయఁబడినవి. కొన్నియెడల శబ్దార్థముకాక, భావార్థము చూపఁబడినది. అభిప్రాయభేద మున్నపట్ల టీకలో శ్రీరంగాచార్యులుగారి టీకాభాగము, కొన్నియెడల అందలి యాచిత్యానౌచిత్యములు చూపఁబడినవి. టీక కొన్ని యెడల అన్వయముఖమున నున్నది. కొన్ని యెడల శబ్దముల కవి యున్న విధము ననే అర్థ మీయఁబడినది. కావలసిన గ్రంథములు లభింపనందున బీజాక్షరములను వివరించు మంత్ర శాస్త్ర విషయములు వివరింపఁబడలేదు. కొన్నిచోట్ల సందేహము లుండియే పోయినవి. 'అలవోక' అను పద్యవిషయము (పుట [illegible]) 'లోనింటి బోన మూసి' (పుట 242) 'ఉడ్డపాడలు' (301) 'దీప్యన్మూర్తులై తత్తనూగ్రామం బెక్కిరి' (పుట 324) 'కసరి పైవచ్చు రాళ్లపై గాలివాన' (పుట 349). ఇట్టి వానిని సహృదయులు విమర్శించి నిర్ణయింతురు గాక !

గ్రంథరచన యెంత కష్టమో, దానిని ప్రకటించుట అంతకంటె పదిరెట్లు శ్రమము. అందును కాగితపుకఱవు - పనివాండ్రకొఱత-ఎక్కువగా నున్న యీ కాలములో ఇట్టి పెద్దగ్రంథమును ప్రకటించుట అసాధ్యము. అయినను శ్రీవావిళ్ల సంస్థవారీ గ్రంథమును మేలుకాగితములపై చక్కఁగా ముద్రింపఁ బూనుకొనుట ప్రశంసనీయము. ఈయుద్గ్రంథము విషయమున నేను చేసిన పరిశ్రమను విని, పయి సంస్థకధిపతులు, భాషోద్ధారకులును, విద్వద్వతంసులు నగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు నాయం దాదరము చూపి దీనిం బ్రకటింపఁబూనినందులకు, వారి కనేక ధన్యవాదములు.

చెన్నపురి
28-4-52

భాషాసేవకుఁడు
**బులుసు వేంకటరమణయ్య**
ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు,
కెల్లెట్ హైస్కూలు, ట్రిప్లికేను.

# విషయసూచిక

| విషయము. | | పుట. |
| --- | --- | --- |

శ్రీ ర స్తు

# పాండురంగమాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము



### శ్రీకృష్ణప్రార్థనము

శ్రీకాంతామణిఁ గన్నొఱంగి మది ధాత్రిన్ [1]మంచినన్ [2]దద్రుచి
శ్రీకాదంబిని మీఁది కుబ్బె ననఁగా శ్రీ[3]వత్సముం దాల్చి పు
ణ్యాకంబుల్ [4]పొదలించు కృష్ణుఁడు దయాళుం డేలు శ్రీవైష్ణవ
స్వీకారార్హు విరూరిపట్టణపతిన్ వేదాద్రిమంత్రీశ్వరున్. 1

టీక. శ్రీకాంతామణిన్ = లక్ష్మీదేవిని; కన్నొఱంగి = వంచించి; మదిన్ = హృదయమున; ధాత్రిన్ = భూదేవిని; మంచినన్ = (ఉంచి) గౌరవింపఁగా; తద్రుచిశ్రీకాదంబిని = మేఘమాల వలె నల్లనైన ఆ భూమియొక్క కాంతిపుంజము; మీఁదికి = ఎదపైకి; ఉబ్బెననఁగాన్ = పొంగెనో యనునట్లు. [విష్ణువుఱొమ్మునపైనున్న పుట్టుమచ్చ, అతఁడు హృదయములో దాచి యుంచిన భూదేవి కాంతిపుంజమో యనునట్లున్నదని ఇచ్చట ఉత్ప్రేక్షింపఁబడినది.] పొదలించు = వృద్ధిఁబొందించు; శ్రీవైష్ణవస్వీకారార్హున్ = శ్రీవైష్ణవులచే (సమానగౌరవమర్యాదలతో) స్వీకరింపఁదగినవానిని.

[ఈ గ్రంథమునవతారికఁబట్టి వేదాద్రిమంత్రివంశీయులు తొలుత నియోగిబ్రాహ్మణులైనట్లును, వైష్ణవమును పుచ్చుకొన్నట్లును తెలియుచున్నది.]

[పూర్వటీకలో ఇచట 'తత్ క్షితిశ్రీకాదంబిని = ఆ భూమియొక్క కాంతిసంపద యనెడి మేఘపఙ్క్తి' అని యున్నది.]

### లక్ష్మీప్రార్థనము

సీ. అవతార[5]మందె నేయఖిలైకజనయిత్రి కలశరత్నాకరగర్భసీమఁ
దోఁబుట్టు వయ్యె నేతులితకాంచనవర్ణ వెఁడివెన్నెలకాయు వేల్పునకును
బాయకయుండు నే పరమపావనమూర్తి చక్రిబాహా[6]మధ్యసౌధవీథి
నభిషేకమాడు నేయభివర్ణితాచార దిగ్గజానీతమౌ తేటనీట

తే. నవనిధానంబు [7]లేదేవి [8]జవళి సరకు, లమ్మహాదేవి శ్రీదేవి యాదిలక్ష్మి
సరసశుభదృష్టి గామానుజయ్యసుతుని, నాదరించు విరూరి వేదాద్రినాథు. 2

టీక. కలశరత్నాకరము=పాలసముద్రము; తులితకాంచనవర్ణ = పుటముపెట్టిన బంగారుచాయ కలది. వెలఁదివెన్నెల = స్వచ్ఛమైనవెన్నెల; చక్రిబాహామధ్యసౌధవీథిన్ = విష్ణుభుజములనడుమ

1. చ. నించినన్. ట. మించినన్. త. మించెనా. 2. క. దత్క్షితి. చ. దద్రుచి. త. దదృగి (ధృతి?) 3. ట. శ్రీపత్రమున్. 4. త. మొదలించు. 5. ట. మంద. 6. ట. మూర్ధ్వ. 7. ట. లైదివి 8. చ. జవళి. క. జవణి.

సుండు అొప్పునియెడు భవనప్రదేశమున; అభివర్ణితాచార = కొనియాడఁబడిన యాచారముకలది; నవ, నిధానంబులు = మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము నను తొమ్మిది నిధులును; జవళిసరకులు = అంగడివస్తువులు. ఇందు లక్ష్మీదేవి సౌభాగ్యము వర్ణింపఁ బడినది; కాన ఉదాత్తాలంకారము.

బ్రహ్మస్తుతి

ఉ. మాద్రికి మీఱు నంచవెలిమావుపయిన్ [1]మురువైన జోదుచే
భద్రమయాత్ముచే భువనపాలనఖేలనుచే సరస్వతీ
ముద్రితవక్త్రుచేత నలుమోములవేలుపుచే వరూరివే
దాద్రిచమూవిభుండు గను నాయువు శ్రీయు నిరంతరాయమున్. 3

టీక. మాద్రికిన్, మీఱు = మాదిరినతిక్రమించు - అనగా సాటిలేని; అంచవెలిమావుపయిన్ = తెల్లని హంసవాహనముపయి; మురువైన, జోదుచేన్=సుకుమారియైన యోధుఁడగు బ్రహ్మవలన; భువన పాలనఖేలనుచేన్ = లోకములను పాలించుట యను ఆటలనాడువానివలన; చమూవిభుండు = సేనాధి పతి; నిరంతరాయమున్ = విఘ్నములు లేనట్లుగ; కనున్ = పొందును (గాత.)

ఇచట పంచమ్యర్థమున 'చేన్'అని తృతీయావిభక్తి వాడఁబడినది.

సరస్వతీస్తుతి

శా. కద్రూజాంగదుతోడఁబుట్టువు శరత్కాదంబినీచంద్రికా
[2]జిద్రూపాంచిత పద్మగర్భముఖ[3]రాజీవావళీహంసి వ
ర్ణద్రాక్షాఫలకీరి శారద కృపన్ రామానుజామాత్యు వే
దాద్రిస్వామికి నిచ్చు నిచ్చలును విద్యాబుద్ధివాక్సిద్ధులన్. 4

టీక. కద్రూజాంగదుతోడఁబుట్టువు = పాములు భుజకీర్తులుగాఁ గల శివునికిఁ దోఁబుట్టువు; (శివుఁడు, సరస్వతి బ్రహ్మకు అపత్యములు.) శరత్కాదంబినీ, చంద్రికా, జిద్రూపాంచిత = శరత్కాల మేఘమును, వెన్నెలను అతిక్రమించు తెల్లనిరూపమున నొప్పారునది - సరస్వతీదేవి సర్వశుక్లయని ప్రసిద్ధి. పద్మగర్భముఖరాజీవావళీహంసి = పద్మము తల్లిగాఁగల బ్రహ్మయొక్క ముఖములనెడి తామరల గుంపున విహరించు ఆఁడుహంస; వర్ణద్రాక్షాఫలకీరి=వర్ణములనెడి ద్రాక్షాఫలములకు చిలుక; అలం: రూపకము.

ఇఁట పూర్వటీకలో 'చిద్రూపాంచిత = జ్ఞానస్వరూపముచేత ఒప్పునది' అని యున్నది. ఆ పాఠము, అర్థమును సరికావు.

శివస్తుతి

ఉ. ఈచిగురాకు నీప్రసవ మీపువుదేనియ యెంత యొప్పెడిన్
జూచితిరే యటంచుఁ దనచుట్టు శుకాదులు గొల్వఁగాఁ గప
ర్దాచితచంద్రగాంగజలమైన శివాహ్వయకల్పశాఖి వే
దాచలమంత్రికీర్తికలశాబ్ధిని వెన్నెలమాడ్కిఁ జూచుతన్. 5

1. త. మురవైన. 2. క. చిద్రూపాంచిత. చ. త. జిద్రూపాంచిత. 3. ట. రాజీవాళి హంసంబు.

టీక. ప్రసవము = పుష్పము; ఒప్పెడిక్ = బాగున్నవో; శుకాదులు = చిలుకలు మొదలగు పక్షులు, శుకుఁడు మొదలగు మునులును; కపర్దాచితచంద్ర గాంగజలము = జటాజూటముచేఁ గప్పఁబడిన చంద్రుఁడు, గంగాజలము కలది. శివాహ్వయకల్పశాఖి = శివుఁడనెడి కల్పవృక్షము; వేదాచలమంత్రి కీర్తికలశాబ్ధిని = వేదాద్రిమంత్రియొక్క కీర్తి యనెడి పాలసముద్రమును; [కీర్తి తెల్లని దగుటచే దానికి పాలకడలితోడి సామ్యము.] వెన్నెలమాడ్కిన్ = చంద్రకాంతితో సమానముగా - ఆదరపూర్వకముగా ననుట. చంద్రాదులు పాలకడలిలోఁ బుట్టుట వ్యక్తము. అలం. క్రమము, రూపకము.

## పా ర్వ తీ స్తు తి

ఉ. చిద్రసవేది యా శౌదమచిల్కకు విష్ణుసహస్రనామముల్
ముద్రతి [1]మోవి మోవి నిడి ముక్కున గోరున మేన దువ్వుచున్
భద్రనిధానమై వెలయు పర్వతకన్య విరూరిమంత్రి వే
దాద్రికి విష్ణుభక్తి మహిమాతిశయం బనయంబు నీవుతన్. 6

టీక. చిద్రసవేది=చిదానందసారము తెలిసినది; ముద్రతిన్=సంతోషముతోడి యాసక్తితో; మోవి, మోవి నిడి = తనపెదవిని దాని ముక్కుపై నుంచి; ముక్కుచున్ = మాటలు నేర్పుచు; భద్రనిధానమై = శుభములకు గనియై; విష్ణుభక్తిమహిమాతిశయంబు = విష్ణుభక్తియొక్క గొప్పతనమును; (దానివలనఁ గల్గు నైహికాముష్మికఫలములననుట.]

## వి ష్వ క్సే న ప్రా ర్థ న ము

సీ. సూత్రవతీదేవి సొబగుపాలిండ్లపై మలుపచ్చిగందంపు [2]వలపుతోడ
శిరసులు వంచు నిర్జరకోటిఁ బనిగొను తపనీయవేత్రహస్తంబుతోడఁ
బని యేమి యని విన్నపము సేయు సుమనోహ[3]రములైన దివ్యాయుధములతోడ
బ్రహ్మాండకోటుల పారుపత్తెములెల్లఁ గనియు[4]న్న నిద్దంపుమనసుతోడ
తే. శార్ఙ్గి రెండవమూర్తియై జగము లేలు, మునిమనోహారి శ్రీసేనము[5]దలియారి
చేయుపనులెల్ల సఫలముల్ చేయుఁగాత, [6]మలరి రామానుజయ్య వేదాద్రిపతికి. 7

టీక. సొబగు = అందమైన; మలుపచ్చిగందంపువలపుతోడన్=కొంచెము తడియారిన చందనపుఁ బరిమళముతోను; విష్వక్సేనుని భార్య సూత్రవతీదేవి; ఆమెపాలిండ్లపై పూయఁబడిన చందనము ఆలింగన సమయమున నాతని వక్షమున కంటుకొని పరిమళించుచున్నదని భావము. పనిగొను = ఆజ్ఞాపించు; నిర్జరకోటి = దేవతలగుంపు; తపనీయవేత్రహస్తంబు = బంగారు బెత్తమును పట్టుకొనిన హస్తము; పారుపత్తెములు = అధికారములు; కనియున్న = గ్రహించిన; నిద్దంపు=నిర్మలమైన; శార్ఙ్గి = విష్ణువు; సేనముదలియారి = సేనాధిపతి - విష్వక్సేనుఁడు; అలరి = సంతసించి.

## గ రు డ స్తు తి

శా. మోదం దారథరాధరంబు గల యామేరున్నగంజాలి త
ద్గ్రాద్భక్తుండగుచుం దలిర్చు ఖగయూథస్వామి హేమప్రభా

1. క. మోము. చ. మోవి. 2. చ. వలువతోడ. 3. క. మనోరథములయిన. చ. మనోరథములౌ. 4. క. కనియుండి. చ. కనియున్న. 5. త. మొదలియారి. 6. ట. యలరి.

ప్రాదుర్భావశుభప్రదుండు మనుచున్ రామానుజామాత్యపుత్రు
వేదాద్రీశు విరూరిమందిరు జగద్విఖ్యాతకీర్తీశ్వరున్. ౮

టీక. మీఁదన్ = మీఁదిభాగమున; తారధరాధరంబు = వెండికొండ - కైలాసము; నగంజాలి= తిరస్కరింపఁగలిగి - సరిపోలి; తత్తాదృక్తుండరుచిన్ = సాటిలేనిముక్కుసొరుచే; తలిర్చు = ప్రకాశించు; ఖగయూథస్వామి = పక్షిగుంపునకు రాజు - గరుత్మంతుఁడు; హేమప్రభాప్రాదుర్భావశుభప్రదుండు = బంగరుకాంతివలనఁ గలుగు శుభములనిచ్చువాఁడు. [గరుడదర్శనమువలన మేళ్లు కలుగునని ప్రసిద్ధి] గరుడుఁడు బంగరుఛాయవాఁడు; అతని ముక్కుమాత్రము తెల్లగానుండును.

పూర్వటీకలో 'తత్తాదృక్తుండరుచిన్ = దానిని పోలిన ముక్కుయొక్కప్రకాశముతో' అని అర్థమీయఁబడినది; అది సరికాదు. తత్తాదృక్ఛబ్దమునకు 'సాటిలేని'దని యర్థము. ఈ పద మీగ్రంథమున చాలసార్లు వాడఁబడినది. అలం. ఉపమ.

## అనంతస్తుతి

సీ. ధరణీభరముఁ [1]దాల్చు తన [2]చేవ యంతయు భుజపరిఘంబులఁ బొంకపఱచి
మునుమిన్కుగని రైన తనప్రజ్ఞ యంతయు మతివిశేషమునందు మస్తరించి
దైత్యారివశమైన తనచిత్తమంతయు [3]నియమగౌరవమున నివ్వటించి
[4]తనుపు వెన్నెల గాయు తన [5]మూర్తి యంతయుఁ గీర్తివైభవమునఁ గీలుకొలిపి
తే. శేషుఁ డఖిలప్రపంచ విశేషశాలి, నిత్యముక్తుల కాద్యుఁడై నిలుచు మేటి
చారుచారిత్రు రామానుజయ్యపుత్రుఁ, గరుణ వేదాద్రిమంత్రిశేఖరుని మనుచు.

టీక. ధరణీభరము, తాల్చు = భూభారమును వహించు; చేవ = బలము; భుజపరిఘంబులన్ = అడ్డుగడియలవంటి భుజములయందు; పొంకపఱచి = జతపఱచి; మునుమిన్కుగని = వేదముల కునికిపట్టు; మస్తరించి = ఐక్యముచేసి; నివ్వటించి = వ్యాపింపఁజేసి; కీలుకొలిపి = లగ్నము చేసి; తనుపు వెన్నెల = నిండువెన్నెల; నిత్యముక్తులు = నిత్యులు, ముక్తులును; అనంతుఁడు, గరుడుఁడు, విష్వక్సేనుఁడు మొదలగువారు నిత్యులు; సంసారమునుండి విడువడి మోక్షమును పొందినవారు ముక్తులు; ఆద్యుఁడు = మొదటివాఁడు.

## కవిస్తుతి

క. పుట్టకుఁ బుట్టెడు వేళం, దిట్టపు [6]నునుపచ్చి పుట్టతేనియచవితోఁ
[7]బుట్టె నన నమృత ముట్టెడు, పుట్టనిసువుసత్కవిత్వములు వర్ణింతున్. 10

టీక. పుట్టకుఁ బుట్టెడు వేళన్ = పుట్టనుండి పుట్టినపుడు; నునుపచ్చి = మిక్కిలిపచ్చిగానున్న; అమృతము, ఉట్టెడు= తేనెలొలుకు; పుట్టనిసువు = వాల్మీకి. అలం. ఉత్ప్రేక్ష.

క. ఇట్టాడరాని యాగమ, [8]ఘట్టమునకు నడవ యచ్చుకట్టిన మునిరా
ట్పట్టాభిషిక్తుఁ దపముల, [9]పుట్టిన నెలవయిన వ్యాసముని [10]నుతియింతున్. 11

1. చ. తాళు. 2. చ.చేగ. 3. క. నినుచుగౌరవమున. 4. క. తనువు. చ. తనుపు. 5. చ. కీర్తి. 6. చ. గోనుపచ్చి. క. గోపచ్చి. 7. చ. బుట్టి. 8. చ. గట్టుపలుకు. 9. చ. పు. 10. క. వర్ణింతున్, చ. నుతియింతున్.

టీక. ఇట్టాడరాని = చెప్పుటకు శక్యముకాని; ఆగమఘట్టమునకున్ = వేదము లను రేవునకు; నడవ = (దిగుటకు వీలగు)మార్గము; అచ్చుకట్టిన = ఏర్పఱచిన; నెలవు = చోటు.

వ్యాసమహర్షి ఆమ్నాయములసారమును సర్వజనసుగమముగ భారతమున వివరించెనని భావము.

తే. వ్యాసవాల్మీకి ముఖసూక్తివైభవముల, నేర్పు మీఱంగ నిజకావ్యదర్పణముల
సరసమానసముల నేలుపఱచు కీర్తి, ధవుల నన్నయభట్టాదికవులఁ దలఁతు[1]. 12

టీక. వ్యాస...వములన్ = వ్యాసుఁడు, వాల్మీకి మొదలగువారి కవితాచమత్కారములను; నిజకావ్యదర్పణములన్ = అద్దములవలె నున్న తమకావ్యములవలన (కావ్యములమూలమున); సరస మానసములన్ = రసికుల మనస్సులందు; కీర్తిధవులన్ = కీర్తికాంతకు భర్తలైనవారిని. అద్దములందు ప్రతిఫలించిన వస్తువులు మనకు బాగుగ కన్పించినట్లు నన్నయాదిమహాకవులు తమకావ్యములందు వ్యాసాదికవుల కవితాచమత్కారములను ప్రతిఫలింపఁజేయఁగా, అవి రసికుల మనస్సులందు బాగుగ నిరవుకొనునని భావము.

'కావ్యదర్పణముల' అనుటచే 'వ్యాసవాల్మీకిముఖ' అనుచోట తదనుగుణముగ 'ముఖ'పదము చమత్కరింపబడినది. అలం. రూపకము.

సత్కవిప్రశంసాదికము

ఉ. చాటుకవిత్వతత్త్వరససాగరపారగులయ్యు సత్కవుల్
పాటిగఁ బట్టి విందు రొకపాటివి కా [2]వన కన్యకావ్యముల్
కైటభవైరి యావతశిఖామణి [3]శ్రీసతిఁ [4]బేరురంబునన్
[5]మాటియు నీటికెంపు బహుమానము[6]నం బతకంబు సేయఁడే[7]. 13

టీక. చాటు...పారగులు = ఇంపైన కవిత్వతత్త్వపు రసమనెడు సాగరముయొక్క అంతము చూచినవారు-సరసకవిత్వమర్మముల నెఱిఁగినవారు; పాటిగఁబట్టి=తక్కినవానితో సమము గాఁబోల్చిజూచి; ఒకపాటివి = సామాన్యమైనవి; కైటభవైరి = విష్ణువు; యావతశిఖామణి = యువతీసమూహమున శ్రేష్ఠురాలు; మాటియున్ = మఱుగుపఱచియు-నిత్యానపాయినిగా నుంచుకొనియు; నీటికెంపున్= కౌస్తుభమణిని; బహుమానమునన్ = గౌరవముతో; పదకంబుఁజేయఁడే = హారమునడుమ నుండెడు బిళ్ళగాఁ జేయలేదా? అలం. దృష్టాంతము.

తే. తప్పు గలిగినచోటనే యొప్పుగలుగు, [8]సరసకవితావ[9]శోక్తులసరణియందుఁ
[10]గప్పు కలిగిన నీహారకరునియందు, నమృతధారాప్రవాహంబు లడరుఁగాదె. 14

టీక. సరసకవితావశోక్తుల సరణియందున్ = రసవంతమగు కవిత్వమును జెప్పుచుండు ధోరణిలో; కప్పు = నలుపు-మచ్చ; నీహారకరునియందున్ = చంద్రునియందు; అడరుఁగాదె = వ్యాపించి యుండునుగదా!

[ఈపద్యమున 'సరసకవితావశోక్తులసరణియందు' అనుటకు మాఱుగా 'అరసికావళికవితల యవగుణముల' అని దిద్ది కుకవులుండుటఁబట్టియే సుకవులకుఁ బేరుప్రతిష్ఠలు కలుగుచున్నవని కొందఱర్థము

1. చ. దలచి. 2. చ. గాదనక. 3. త. శ్రీపతి. 4. క. పేరురంబు. త. బేరురంబు. 5. చ. మాట. 6. క. గం. చ. నం. 7. క. సేయరే. చ. సేయఁడే. 8. త. నరసికావలె కవితలయవగుణములు. 9. చ. వచోక్తుల. 10. త. సరసకవితావశోక్తులసరణియందు.

చెప్పుచున్నారు. కాని అట్టిపాఠాంతరము ముద్రితప్రతులలోఁ గానరాకున్నది; అయ్యాది పద్యపుటుత్తర భాగమునుబట్టి పొందుపడునట్లును తోఁచదు.] అలం. దృష్టాంతము.

తే. కాన దోషాత్ము లయిన దుష్కవులకతన
గరిమ వహియించుఁ [1]గవిరాజుకావ్యమహిమ
బహుళపక్షంబు చీఁకటి బహుళి మగుటఁ
జాయవెన్నెల తరితీపుసేయుకరణి. 15

టీక. గరిమ = గొప్పతనము; బహుళపక్షంబుచీఁకటి = కృష్ణపక్షమందలి చీఁకటి; బహుళి మగుటన్ = ఎక్కువయగుటచేత; చాయవెన్నెల = పండువెన్నెల; తరితీపుచేయుఁకరణిన్ = ప్రీతిని కలిగించునట్లు. అలం, ఉపమ.

వ. అని నిఖిలభువన [2]ప్రాధాన్యధన్యంబులగు [3]మాన్య [4]దైవతంబుల [5]ప్రభావం బులు గొనియాడి, రూఢిమెఱయు కవివృషభుల [6]నభినుతించి, యుదంచితంబగు కవిత్వతత్త్వంబునం గల[7]గరిమంబుఁ బరిశీలించి, వంచకులగు కొంచెపుంగవుల రవళి యదలించి, పంచాశత్కోటివిస్తీర్ణం బగు నర్ణవమేఖలావలయంబునం గల పరమవైష్ణవరత్నంబులకుఁ బ్రయత్నపూర్వకంబుగ నభివందనం బాచరించి. 16

టీక. వంచకులు = మోసగాండ్రు; కొంచెపుంగవుల = కుకవులయొక్క; రవళి = ధ్వని-అఱపు; రూఢి = ప్రసిద్ధి; అర్ణవమేఖలావలయంబు = భూమండలము; అభివందనంబు = నమస్కారము.

క. వాక్కాంతాశ్రయు[8] భట్టరు, చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపు భక్తి భజించెద, నిక్కావ్యకళాకలాప మీడేఱుటకున్. 17

టీక. వాక్కాంతాశ్రయున్ = సరస్వతి కాశ్రయమగువానిని - గొప్ప విద్వాంసుని; కావ్య కళాకలాపము = కావ్యకళాగ్రథనము; ఈడేరుటకున్ = నెఱవేరుటకు; భజింతున్ = సేవింతును.

క. తవణింతు నొక్క శ్రీభా, గవతచరిత్రంబుఁ బరమకల్యాణసము
ద్భవ[9]భవనంబుఁ జతుర్దశ, భువనమహారత్నసూత్రముగఁ దగు సరణిన్. 18

టీక. తవణింతున్ = కావింతును; శ్రీభాగవతచరిత్రంబున్ = గొప్పభగవద్భక్తుని చరిత్రమును; కల్యాణ...భవనంబున్ = శుభములకుఁ బుట్టినిల్లగుదానిని; చతుర్దశ...సరణిన్ = పదునాల్గులోకము లను రత్నములను గూర్చు సూత్రపద్ధతిని-సమస్తలోక సారమును తెల్పుదానినిగా;

[లోకములు 14. అవి-భూర్లోకము, భువర్లోకము, స్వర్లోకము, మహర్లోకము, జనర్లోకము, తపోలోకము, సత్యలోకము, అతల, వితల, సతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళలోకములు అనునవి.]

వ. అని యిట్లభినవప్రబంధనిర్మాణ కౌతూహలాయత్తచిత్తుండ నయి యే నున్న సమయంబున. 19

1. క. కవిరాజ. చ. కవిరాజు. 2. క. ప్రధాన. చ. ప్రాధాన్య. 3. చ. లేదు. 4. క. దైవతం బులం. 5. క. లేదు చ. ప్రభావంబులు. 6. చ. వినుతించి. 7. చ. గరిమంబులు. 8. క. తాశ్రయ. చ. తాశ్రయు. 9. చ. హృద్యంబు.

సీ. తన కులాచారవర్తన వైష్ణవాచార పర్యాయముల [1]కొజ్జబంతి గాఁగఁ
దన సూనృతము పురాతనసత్యనిధుల యున్నతికిఁ బునఃప్రతిష్ఠితముగాఁగఁ
దన బుద్ధి నీతిశాస్త్రరహస్యములు తెల్లముగఁ దెల్పు వ్యాఖ్యానముద్రగాఁగఁ
దన ప్రాయు [2]గంటంబు మొనవాఁడి విశ్వంభరా ప్రజలకుఁ బ్రాణరక్షగాఁగ

తే. వెలయు మంగయగురువ భూవిభుని పెద్ద, సంగభూపాలమణి [3]వ్రాయసప్రవృత్తి
జయయుతుండైన రామానుజయ్యసుతుఁడు, [4]భద్రగుణసీరి విరురివేదాద్రిశౌరి.

టీక. వైష్ణవాచారపర్యాయములకుఁ=శ్రీవైష్ణవుల యాచారక్రమములకు; ఒజ్జబంతిగాఁగన్ = ఉపాధ్యాయుఁడు చూపిన పద్ధతి-వరుసడి (మేలుబంతి) కాఁగా; తెల్లముగన్=స్పష్టముగా; వ్యాఖ్యానముద్ర = వ్యాఖ్యానాక్షరపంక్తి; వ్రాయసప్రవృత్తిన్ = లేఖనము [ఈ సమాసము విలక్షణము.] నందు; భద్రగుణసీరి = మేలిగుణములకు బలరాముఁడైనవాఁడు.

మ. కవులుం బాఠకులున్ బ్రధానులు నలంకారజ్ఞులుం బ్రాజ్ఞులున్
ధవళాత్ముల్ [5]భజియింప నిండుకొలువై తారేందుతారావళీ
ధవళంబైన సువర్ణకుంభయుత సౌధంబందు [6]నాస్థానమై
వివిధామ్నాయపురాణగుంభనకథల్ వించున్ బ్రమోదంబునన్. 21

టీక. తారేందుతారావళీధవళంబైన = వెండి, చంద్రుఁడు, హారములవలె తెల్లనైన; ఆస్థానమై= కొలువుతీర్చి; గుంభనము = కూర్పు.

క. నను రామకృష్ణకవిఁ గవి, జనసహకారావళీవసంతోత్సవ సూ
క్తినిధిఁ[7] బిలిపించి [8]యర్థా, సనమునఁగూర్చుండఁ బనిచి చతురత ననియెన్. 22

టీక. కవిజన...... క్తినిధిన్ = కవీశ్వరులనెడి తియ్యమామిడిచెట్లచాలునకు వసంతకాలము వలె వేడుకకల మంచిమాటలకు గనియైనవానిని; చతురతన్ = నేర్పుతో. అలం. రూపకము.

సీ. [9]తగ సంస్కృతము తెనుంగుగఁ జేయఁ దెనుఁగు సం
స్కృతముగఁ జేయంగఁ జతురమతివి
[10]నలుదెఱంగుల నెన్నఁగల కావ్యధారల
ఘనుఁడ వాశువునఁదుః గరము మేటి
వఖలభూమీపాలకాస్థానకమలాక
రోదయ [11]తరుణసూర్యోదయుఁడవు
శైవవైష్ణవపురాణావళి నానార్థ
[12]రచనాపటిమ్నైకరమ్యమతివి[13]

తే. [14]ఆంధ్రభూమీకుచాగ్రహారాభ మైన, శ్రీతెనాల్యగ్రహారనిర్ణేత వగ్ర

---

1. చ. కోజ. శ. ర. పా. కొజ్జబంతియనఁగ. 2. చ. గంటంపు. 3. చ. రాయస. 4. చ. సిరిశ్రీ 5. చ. భజియించ. 6. క. నానాసమై. చ. ఆస్థానమై. 7. చ. నిధిని. 8. క. యర్హా. చ. బిలిపించర్థా. 9. త. పాదము లేదు. 10. త. జగతిసొబగుల నెన్నఁగఁగావ్యధారల 11 చ. తగుణ. 12. క. ములు నీకుఁ గరతలామలకనిభములు. 13. త. నాల్గవపాదము లౌకికవైదికలక్షణచాతుర్య ధైర్యప్రభారూఢకారచణుఁడ-(ఎత్తుగీతి) వరయ్య. 14. క. అంధ్ర. చ. ఆంధ్ర.

శాఖికా[1]కోకిలము వీవు సరసకవివి,రమ్యగుణకృష్ణ! రామయ రామకృష్ణ. 23

టీక. నలుదెఱంగుల, సెన్నఁగల కావ్యధారలన్ = ఆశు, మధుర, చిత్ర, విస్తర భేదంబులచే నాలుగు విధములైన కవిత్వములచే; ఆశువునందున్ = వడిగాఁ గవిత్వముచెప్పుటయందు; ఆంధ్రభూమి కుచాగ్రహారాభము = భూదేవియొక్క స్తనములపై నుండెడి ముత్యాలపేరును పోలినది; అగ్రశాఖి కాకోకిలము = ప్రథమశాఖయనెడి వృక్షమునకు కోయిల యైనవాఁడవు; రమ్యగుణకృష్ణ! = మనోహరములైన గుణములయందు కృష్ణుఁడైనవాఁడా!

క. కౌండిన్యసగోత్రుఁడ వా,ఖండలగురునిభుఁడ వఖిల[2]కావ్యరససుధా
మండనకుండలుఁడవు భూ,మండలవినుతుఁడవు లక్ష్మమావరతనయా. 24

టీక. ఆఖండలగురునిభుఁడవు = బృహస్పతితో సమానుఁడవు; కావ్యరససుధామండనకుండలుఁడవు = కావ్యరసమనెడి అమృతమే అలంకారమయిన కుండలములు కలవాఁడవు - అనఁగా కావ్యామృతమే కర్ణభూషణమని యర్థము. లక్ష్మమావరతనయుఁడు = లక్ష్మమ్మపుత్రులలో శ్రేష్ఠుఁడైనవాఁడు.

క. యశము గలిగించు నీమృదు,విశదోక్తులఁ బౌండరీకవిభుచరితఁ జతు
ర్దశభువనవినుతముగ శుభ,వశమతి నాపేర నుడువు వరతత్త్వనిధీ. 25

టీక. మృదు, విశదోక్తులన్ = సుఖోచ్చారణమును, తేటదనమునుగల మాటలతో.

ఉ. స్కందపురాణనీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందను సత్కథోద్యమము నవ్యకవిత్వకళాకలాప మున్
కుందనమున్ ఘటించి కడుఁ గ్రొత్తగునొప్పొనరించి విష్ణుసే
వం దులకించు నప్పరమవైష్ణవకోటి నలంకరింపుమా! 26

టీక. నీరనిధి = సముద్రము; తులకించు = ప్రకాశించు; అలం. రూపకము.

మ. ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబునుం జుట్టి రా
విదితంబైన మహిన్ మహాంధ్రకవితావిద్యాబలప్రౌఢి నీ
కెదురేరీ సరసార్థబోధఘటనాహేలాపరిష్కారశా
రద నీరూపము రామకృష్ణకవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా! 27

టీక. ఉదయంబు = తూర్పుకొండ; అస్తనగంబు = అస్త్రాద్రి; హిమవ్యూహంబు = హిమాలయము; ప్రౌఢి = నేర్పు; సరసార్థ...పరిష్కార = రసవంతమగునర్థమును బోధించు పొందికయనెడి విలాసచేష్టయే ఆభరణముగా కలది; శారద = సరస్వతి; అలం. రూపకము.

వ. అని సంభావించి కనకాంబరాభరణంబులం బ్రసాదించి యాప్రధానపంచాననుండు.

టీక. సంభావించి = గౌరవించి; ప్రసాదించి = ఇచ్చి; ప్రధానపంచాననుండు = మంత్రిసింహము-మంత్రిశ్రేష్ఠుఁడు.

మ. పలుకుందొయ్యలి [3]మోవికాంతి కెనయా బాగాలు నయ్యింతిచె
క్కులఁబోలుం దెలనాకు లయ్యువిదపల్కుల్వంటి కప్రంపుఁబ
ల్కులతోఁగూడిన వీడియం బొసఁగె నాకుం బద్మనాభార్చనా
కలనాపావనహస్తకంకణఝణత్కారంబు తోరంబుగన్. 29

1. చ. కోకిలము నీవు. 2. చ. స్ఫురణాకుండలి. 3. క. మాళి. చ. మేని. ట. మోవి.

టీక. పలుకుం...కాంతికిన్=సరస్వతీదేవి పెదవులకాంతికి; ఎనయౌ=సాటియైన; బాగాలు = వక్కపలుకులు; పల్కుల్వంటి=మాటలఁబోలిన-కమ్మనైన; తెలనాకులు=పండుతమలపాకులు; వీడియంబు= తాంబూలము. [సరస్వతీదేవి సర్వశుక్లయని ప్రసిద్ధి.] పద్మనాభా...ఝణత్కారంబు=శ్రీవిష్ణుపూజా కరణముచేఁ బవిత్రములగు చేతులయందలి కంకణముల గలగలధ్వని; తోరంబుగన్ = అతిశయింపఁగా; అలం. ఉపమ.

వ. ఇట్లు లోకోత్తరగుణోత్తరుం డగు నాప్రధానశేఖరుండు పరమపురుషపరికర చరిత్రంబునకు నధీశ్వరుం డగుట తీర్థంబును సార్థంబును, [1]జాదులుం దేవర ప్రసాదంబును, బుణ్యంబునుం బురుషార్థంబును నయ్యె [2]నియ్యభ్యుదయంబునకుం గల్యాణాచారంబుగాఁ గృతిపతివంశావతారం బభివర్ణింపం బూని. 30

టీక. లోకోత్తరగుణోత్తరుండు = లోకమునందు మేలైన గుణములచే గొప్పవాఁడు; పరమ... నకున్ = భగవంతుని పరివారమగు భక్తుల చరిత్రంబునకు; అధీశ్వరుండు = నాయకుఁడు; జాదులుం, దేవరప్రసాదంబును = దేవతాప్రసాదమగు జాజిపూవులను స్వీకరించుట పుణ్యసాధనము; అంతేకాక అవి సువాసనగల వగుటచే వానిస్వీకరణమువలన ఆనందము; పరమభాగవతుని చరిత్రమును రచించుట వలనఁ బుణ్యమును, ఆ చరిత్రమును వేదాద్రిమంత్రికిఁ గృతియిచ్చుటవలన-ఏతన్మూలముగా అతనివలన లాభము పొందుటవలన పురుషార్థమును సిద్ధించినవని యభిప్రాయము. అభ్యుదయంబు=మేలు; కల్యాణాచారంబుగాన్ = శుభసూచకపద్ధతిని.

కృతిపతివంశావతారాభివర్ణనము

సీ. [3]మిగులఁ గన్నొదవిన బిగువ యెక్కుడుగాని[4]కరుణాకటాక్షవీక్షణమువాఁడు
దంష్ట్రావిటంకవర్ధనమ యెక్కుడుగాని[5] ముద్దుఁజందురు నేలు మోమువాఁడు
నరమృగదేహ విస్ఫురణ మెక్కుడుగాని బహుకోటిమదనరూపంబువాఁడు
దైత్యు దండించు నుద్ధతియె యెక్కుడుగాని[6] శ్రితజనావళుల రక్షించువాఁడు
తే. నాఁగ గరుడాద్రిసింహాసనమునఁనుండి, యెల్లజగముల నేలు లక్ష్మీశ్వరుండు
శ్రీయహోబలనరసింహనాయకుండు, శఠమఠణగోత్రమంత్రిరక్షణ మొనర్చు. 31

టీక. మిగుల...ఎక్కువ, కాని=ఱెప్పలకు మించిన(మిడిగ్రుడ్లుగల)చూపుయొక్క గాంభీర్యమే ఎక్కువ కానవచ్చును, కాని; దంష్ట్రావిటంకవర్ధనమ = ఎత్తయిన కోఱల పెంపే. ['ఇఁటి ముంజూరు నందలి పావురాగూండ్లవలెఁ గానవచ్చెడి కోఱల పెంపే' అని పూర్వటీక.] విస్ఫురణము = ప్రకాశము; ఉద్ధతి = ఆర్భాటము. నాఁగన్ = అనురీతిని; గరుడాద్రిసింహాసనమునుండి = సింహాసనరూపమగు గరుడాచలమునుండి. అలం. విశేషోక్తి.

చ. జఠరగసత్ప్రపంచసురసత్తమతుల్యుఁ డశేషయోగిరా
ణ్మతహృదయుండు మానిజనమాన్యుఁడు ధన్యుఁడు ముక్తికామినీ
కఠినకుచద్వయీ[7]నిహితకాంచనమాలిక హేళికల్పుఁ డౌ
శఠమఠణార్యశేఖరుఁ బ్రశంస యొనర్పఁ దగున్ జగంబులన్. 32

టీక. జఠర...తుల్యుఁడు=కుక్షియందు నివసించు లోకములుకల విష్ణుదేవునితో సమానుఁడు; అశేష...యుండు = ఎల్లయోగులకును గృహమైన మనసుకలవాఁడు; నిహిత = ఉంచఁబడిన; హేళికల్పుఁడు = సూర్యునిఁబోలినవాఁడు; అలం. ఉపమ, రూపకము.

1. చ. గలదందు. 2. క. నయ్యభ్యు. చ. నియ్యభ్యు. 3. చ. మిగులుగన్నొదవిన. 4. చ. కారుణ్యమొలుకు. 5. చ. ముందు. ట. ముదురు. 6. చ. మంచిభక్తులను. 7. చ. నిచిత.

శా. [1]ఆవిర్భావమునొందెఁ దత్కులమునం దవ్యాహతైశ్వర్యల
క్ష్మీవంతుండు విరూరికర్త సచివశ్రేష్ఠుండు విద్యాహయ
గ్రీవుం డన్నయమంత్రి; యవ్విభుని సత్కీర్తుల్ విజృంభించు నీ
ద్యావాపృథ్వ్యవకాశపుంఖిత నిజవ్యాపారపారీణతన్. 33

టీక. ఆవిర్భావము = పుట్టుక; అవ్యాహతైశ్వర్య లక్ష్మీవంతుండు = ఎడతెగని సిరి, సంపదలు కలవాఁడు; విరూరికర్త = విరూరుగ్రామాధిపతి; విద్యాహయగ్రీవుండు = విద్యలందు వాని కధిదేవత యగు హయగ్రీవుఁడైనవాఁడు; ద్యావా...పారీణతన్ = భూమ్యాకాశముల మధ్యభాగమును సందు లేనట్లు నింపిన తన పనులనేర్పుచేతను; అలం. రూపకము.

ఉ. ఆసచివావతంసముకులాంగన చెల్వగు లక్ష్మమాంబ గౌ
రీసతియో యరుంధతియొ రేవతియో [2]యల యాదిలక్ష్మియో
వాసవురాణియో యనఁగ[3]వాసియుఁవన్నెయుఁగల్గి కీర్తులన్
జేసినమూర్తిచేలు పతిచిత్తమువచ్చిన సచ్చరిత్రలన్. 34

టీక. సచివావతంసము = మంత్రిశ్రేష్ఠుఁడు; కులాంగన = భార్య; వాసియుఁ, వన్నెయున్ = గొప్పదనమును, చక్కదనమును; సచ్చరిత్రలన్ = మంచి నడతలచేత; చెల్వగున్ = పొగడొందును. అలం. ఉత్ప్రేక్ష, సందేహము.

ఉ. అన్నయలక్ష్మమాంబసుతు లర్థినిధానము తిప్పరాజు, సం
పన్నుఁడు రంగరాజుఁ, బ్రతిభానిధి గుండమరాజుఁ బొల్చి రా
సన్నుతభాగ్యవర్ధనుల [4]సన్మతి శౌర్యము [5]ధైర్యము న్నయా
భ్యున్నతి నీతిరీతి జయ మొప్పును నేర్పును నెన్న శక్యమే ? 35

టీక. అర్థినిధానము = యాచకులకు నిధి; నయాభ్యున్నతి = నీతిశాస్త్రమందలి గొప్పతనము (నేర్పు). అలం. రూపకము.

క. ఆముప్వురిలో రంగసుధీమణి దీపించె వంశతిలకం బగుచున్
శ్రీమహిత గంగమాంబా, రామారమణీయరాగరసరంజితుఁడై. 36

టీక. సుధీమణి = పండితశ్రేష్ఠుఁడు; దీపించెన్ = ప్రకాశించెను; వంశతిలకంబు = వంశమునకు వన్నెదెచ్చువాఁడు; రామా = స్త్రీ.

క. ఆరంగరాజుకీర్తులు, శ్రీరంగనివాసహాస [6]సితకరలక్ష్మిం
జేరంగఁ దిగుచు; నహితులఁ, బారంగా నెగుచు నతని బాహాసి [7]యనిన్. 37

టీక. శ్రీరంగ...లక్ష్మిన్ = శ్రీరంగపతి యగు విష్ణుని చిరునవ్వుయొక్కయు, చంద్రునియొక్కయుం శోభను-అనగా - తెల్లఁదనమును; తిగుచున్ = ఆకర్షించుచు. అహితులన్ = శత్రువులను; పాఱంగా, నెగుచున్ = పరుగిడునట్లు తఱుమును; బాహాసి = చేతిలోని కత్తి.

సీ. శ్రీమదష్టాక్షరీసేవైకనిపుణుండు గీతార్థసారసంకేతవేది
పరిచితదివ్యప్రబంధసంధానుండు మహితసౌదర్శనమనువిదుండు

---

1. త. ఆవాచంయమవంశసాగరమునందవ్యాహతైశ్వర్య. 2. చ. యిల. 3. త. వన్నెయువాసియుం. 4. చ. సన్నుతి. 5. క. మన్నయా. త. మున్నయా. చ. మన్వయా. 6. క. శివకర. చ. సితకర. త. సితశర. 7. త. యనన్.

[7]నవ్యవైష్ణవపురాణచతుష్టయజ్ఞుండు నిజసమయావననిపుణబుద్ధి
సరసరామాయణసప్తకాండజ్ఞాత యాళువందారుస్తవాభిశోభి
తే. సలిలనిధిజాలజంఘాల *బలవిశాల, ధూళిపాళీభరాళీక ధూమభూమ
శంకితాత్మ[9]ప్రతాపవైశ్వానరుండు, గంగమాప్రాణవిభుఁ డొప్పు రంగరాజు. 8

టీక. అష్టాక్షరి = 'ఓం నమో నారాయణాయ' అను మంత్రము; సంకేతవేది = ఏర్పాటు నెఱిఁగినవాఁడు; పరిచితదివ్యప్రబంధసంధానుండు = అలవఱచుకొనిన వైష్ణవమత ద్రావిడప్రబంధముల అధ్యయనముకలవాఁడు. మహిత...విదుఁడు = గొప్పదైన సుదర్శనమంత్రము నెఱిఁగినవాఁడు; ['ఓం. నమో భగవతే శ్రీసుదర్శనాయ' అనునది సుదర్శనమంత్రము.] నవ్య...జ్ఞుండు=విష్ణు, వరాహ, వామన, వాయుపురాణములు నాల్గు నెఱిఁగినవాఁడు; నిజ...నిపుణబుద్ధి = తనమతమును రక్షించుకొనుటయందు నేర్పుకల బుద్ధికలవాఁడు; సలిలనిధి...వైశ్వానరుండు, సలిలనిధిజాల = సముద్రములసమూహమును; జంఘాల=మిక్కిలివడిగా దాటునట్టి; బల=సేనలవలని; విశాల, ధూళి, పాళీ, భర=ఎక్కువైన దుమ్ముచాలు యొక్క, అతిశయమనెడి; అళీకధూమభూమ = అబద్ధపు, పొగయొక్క అధిక్యముచే; శంకిత = సందేహించిన; ఆత్మప్రతాప=తనప్రతాపముకల; వైశ్వానరుండు = అగ్నికలవాఁడు.

వేదాద్రిమంత్రి సేనలను నడిపించుకొని పోఁగా వానివలన పుట్టిన దుమ్ము సప్తసముద్రములను దాటి పోయినది; ఆదుమ్ము పొగవలె నుండగా దానిని చూచి అగ్ని తనప్రతాపమువలన లోకములు మండి పొగ వ్యాపించినదేమో యని భ్రాంతిపడుచున్నాఁడని భావము.

ఈపద్యమున 'జలవిశాల' అను ముద్రితపాఠమును, దాని ననుసరించిన టిప్పణియును కుదురవు.

తే. దశరథేశ్వరు భార్యయై ధన్యమహిమ, మున్ను కౌసల్య శ్రీరాముఁ గన్నకరణి
రంగయామాత్యుసతియైనగంగమాంబ, మతిమరున్మంత్రి శ్రీరామమంత్రిఁ గనియె.

టీక. మతిమరున్మంత్రిన్ = బుద్ధియందు బృహస్పతియైనవానిని. అలం. ఉపమ, రూపకము.

క. ఆరామరాజు వాహిని, [10]వారాకర మొకటి దాఁటె వసుమతి మున్నీ
శ్రీరామరాజువాహిని, వారాంనిధు లేడు దాఁటి వర్తిలు [11]నవులన్. 40

టీక. వాహిని = సేన, వాగ్ధాటి; వారాకరము = సముద్రము; వారాంనిధులు = సముద్రములు. అలం. వ్యతిరేకము.

సీ. పుడమిపై నడ నేర్చి యడుగుఁబెట్టెడునాఁడె ధర్మంబు నాల్గుపాదముల నిలిపె
జిలిబిలిపలుకులు పలుక నేర్చిననాఁడె సత్యభాషాహరిశ్చంద్రుఁ డయ్యె
[12]ప్రాలమీఁదటివ్రాలు వ్రాయ నేర్చిననాఁడె కమిచి దిక్కుల జయాంకములువ్రాసె
ముఖ్యవ్రతస్ఫూర్తి ముంజిఁ గట్టెడునాఁడె కవులఁ బ్రోచుటకుఁ గంకణము గట్టె
తే. అంబమాంబికఁ గల్యాణమైననాఁడె
వాసిగల కీర్తిలక్ష్మికి [1]నేసపట్టె
ధైర్యహేమాద్రి ప్రజ్ఞ శాంతనవుమాద్రి
రంగయామాత్యవరుని శ్రీరామమంత్రి. 41

---

1. చ. వితతప్రభాతీతవిజ్ఞాన కోవిదా. త. వి...కోవిదు. ట. వి...ప్రభాసిత...కోవిద. * క. జల. 2. త. భవాళీన. 3. చ. త. ప్రభావ. 5. త. వారాంనిధులేడు. 6. నవలన్. 7. క. వరు సమీఁదటి. చ. ప్రాలమీఁదటి. 8. క. సేసపెట్టె. చ. సేసపట్టె.

టీక. నడ నేర్చి = నడవనేర్చి; జిలిబిలిపలుకులు = వచ్చీరానిమాటలు - ముద్దుమాటలు; వ్రాలమీఁదటివ్రాలు = [అక్షరాభ్యాససమయమున] బియ్యముపై వ్రాయఁబడిన యక్షరములు; వ్రాయనేర్చిననాఁడె = దిద్దుటకు మొదలుపెట్టినపుడే; కమిచి = ఆక్రమించి; ముఖ్యవ్రతస్ఫూర్తిన్ = ఉపనయనవ్రతప్రకాశమానముగ - ఉపనయనసమయమున; ముంజి = దర్భతోఁ జేయఁబడిన మొలనూలు; కంకణముగట్టెన్ = వ్రతము పూనెను; సేస, పట్టెన్ = తలఁబ్రాలు పోసెను; స్థైర్యహేమాద్రి = స్థైర్యమున మేరువుపర్వతము; శాంతనవుమాద్రి = భీష్మునిసాటి. అలం. అనుప్రాసము, ఉపమ, రూపకము, అతిశయోక్తి.

సీ. సం[1]హృతాంహస్స్ఫూర్తి సింహాసనుండు నృసింహవిక్రముఁడు నృసింహశౌరి
త్రయ్యంతవాసనా[2]గ్రహబుద్ధి నొయ్యారి యొయ్యారి రామానుజయ్యగారు
గంగాతరంగసారంగలాంఛనదీప్తిఁ బొంగు కీర్తికి రాజు రంగరాజు
శరణాగతత్రాణకరుణాచరణకేళి వరదరాజులఁబోలు వరదరాజు

తే. వనఁగ [3]శ్రీరామవిభునికి నందనులును, గలిగి రాచంద్రతారార్క[4]గతిఁ బ్రశస్తి
నలువు రాత్మజు లౌదార్యసలిలనిధులు, భుజగశాయికి నాలుగు భుజము లట్లు. 42

టీక. సంహృతాంహస్స్ఫూర్తిసింహాసనుండు = నశింపఁజేయఁబడిన పాపముల ప్రకాశమనెడి సింహాసనముకలవాఁడు; త్రయ్యంత...బుద్ధిన్ = వేదాంతవాసనను బడుకట్టిల్లయిన బుద్ధియందు; ఒయ్యారి=నేర్పరి; ఒయ్యారి=చక్కని; గంగా...దీప్తిన్ = గంగయలలతోను, చంద్రునితోను సాటియగు (తెల్లని) కాంతితో; శరణా...కేళిన్ = శరణుఁజొచ్చినవారిని రక్షించుట యను కరుణతోడి యాటయందు; ఆచంద్రతారార్కగతిన్ = చంద్ర, సూర్య, నక్షత్రము లున్నంత కాలమును; ఔదార్యసలిలనిధులు = దానసముద్రులు; అలం. అనుప్రాసము, ఉపమ, రూపకము.

తే. అందు నగ్రజుఁ డఖిలవిద్యావినోది, శ్రీనృసింహాఖ్యసన్మంత్రిసింహ [5]మమిత
లీల లక్ష్మమ తనకు నిల్లాలు గాఁగఁ, జెలఁగె లక్ష్మీనృసింహవిశేషముద్ర. 43

టీక. మంత్రిసింహము = మంత్రిశ్రేష్ఠుఁడు; లక్ష్మీనృసింహవిశేషముద్రన్ = శ్రీలక్ష్మీనృసింహ రహస్య(మంత్రము)ముచే.

క. శ్రీనరసింహుని లక్ష్మీ, మానవతికి వెంగళాఖ్యమంత్రీశ్వరుఁడున్
గోనప్పయు ననఁదగు విద్యానిధు లిరువురును బుత్త్రులై మని రవనిన్. 44

టీక. మంత్రీశ్వరుఁడున్ = మంత్రిశ్రేష్ఠుఁడును.

క. నయవినయంబులకై వడి, జయతేజములట్లు విభవశమములక్రియ న
వ్యయయశులు వెంగళయ కో, నయ లిరువురు వెలసి రవనినాథార్చితులై. 45

టీక. అవ్యయయశులు = గొప్పకీర్తికలవారు. అలం. మాలోపమ.

క. ఆ వెంగళమంత్రీశ్వరు, దేవికి శ్రీయోబళాఖ్యతిలకవతికి రా
ధావిభుదేవేరియు నల, కావేరియు నీడుజోడు గౌరవకళలన్. 46

టీక. ఔబళాఖ్యతిలకవతికిన్ = ఓబళమ్మయను పేరిటి సుమంగళికి; రాధావిభుదేవేరి = విష్ణువుపట్టపురాణియగు లక్ష్మీదేవి; ఈడుజోడు = సమానము. అలం. ఉపమ.

---

1. క. సంహృతా...చ. సంహతా...2. చ. త. శయ్యాగ్రహద్బుద్ధి. 3. చ. విభుకార్యయందనులును. 4. చ. గతి (లేదు). 5. క. మలరు. చ. మమిత.

క. గానకళాతుంబురుఁ డనఁ, గా నయవిద్యావివేకగౌరవలక్ష్మీ
జాని యనంగా నిద్ధరఁ, గోనప్రభుఁ డొప్పు మంత్రికులతిలకంబై. 47

టీక. లక్ష్మీజాని = లక్ష్మీదేవి భార్యగా కలవాఁడు - విష్ణువు; అలం. రూపకము.

తే. ఆవిదేహాధిపతిపుత్త్రి యాత్మభార్య, గాఁగ విఖ్యాతిఁ బొందు రాఘవునికరణి
రాఘవాంబాధినాథుఁడై శ్లాఘ మీఱు, శ్రీనృసింహుని కోనప్ప సిరులకుప్ప. 48

టీక. విదేహాధిపతిపుత్త్రి = విదేహదేశపురాజగు జనకుని పుత్త్రిక - సీత; అధినాథుఁడు = భర్త. అలం. ఉపమ.

ఉ. సామజరక్షణుం గొలిచి సన్నుతికెక్కిన భాగ్యశాలి శ్రీ
రామచమూపశేఖరుని రంగనమంత్రి ననంతమాంబికా
స్వామి నుతింతు మన్మథభుజానతపుష్పధనుర్మధూళి ధా
రామధురోక్తిగుంభనభరస్ఫురణా[1]పరిణాహిచాతురిన్. 49

టీక. సామజరక్షణున్ = గజేంద్రుని రక్షించిన విష్ణుమూర్తిని; శ్రీరామ ..చమూపశేఖరునిన్ = శ్రీరామమంత్రియను సేనాధిపతిశ్రేష్ఠుని; మన్మథ...చాతురిన్-మన్మథ = మన్మథునియొక్క; భుజ = బాహువుచే; ఆనత = వంచఁబడిన; పుష్పధనుర్మధూళిధారా = పూలింటివేనెవెల్లువవలె; మధుర = తియ్యనైన; ఉక్తిగుంభనభర = మాటలకూర్పుయొక్క అతిశయమువలని; స్ఫురణా = ప్రకాశము యొక్క; పరిణాహిచాతురిన్ = మిక్కుటపునేరుపుతో. అలం. ఉపమ.

చ. ఉరుమతి రంగమంత్రితనయుల్ విలసిల్లిరి ఫుల్లమల్లికా
హారదరహాసహీరహిమహారపటీరయశోధురంధరుల్
వరదయ గల్గువారు గుణవంతులు శాంతులు కాంతిచంద్రముల్
వరదయమంత్రిపుంగవుఁడు వాసవతుల్యుఁడు రాఘవయ్యయున్. 50

టీక. ఉరు...యుల్ = గొప్పబుద్ధికల రంగమంత్రియొక్కపుత్త్రులు; ఫుల్ల...ధరుల్ - ఫుల్లమల్లికా = వికసించిన మల్లెపువ్వువలెను; హార = శివునివలెను; దరహాస = మందహాసమువలెను; హీర = వజ్రమణివలెను; హిమ = మంచువలెను; హార = ముత్యాలపేరువలెను; పటీర = చందనమువలెను; ఉన్న - (తెల్లని) యశోధురంధరుల్ = కీర్తిని, వహించినవారు; కాంతిచంద్రముల్ = కాంతియందు చంద్రులైనవారు; వాసవతుల్యుఁడు = ఇంద్రసమానుఁడు; అలం. ఉపమ.

క. రంగయ వరదామాత్యు వి,హంగమవిభుగమనభజనహంసధ్వజు సా
రంగధర హారనిభ[2]వా, గ్గంగాశృంగారితాస్యకమలు నుతింతున్. 51

టీక. విహంగమ......ధ్వజున్ = గరుత్మంతుఁడు వాహనముగాఁ గల విష్ణుని సేవించుట యందు బ్రహ్మయైన (నేర్పుగల)వానిని, లేదా-హంసధ్వజుఁడను గొప్ప భక్తుని.సారంగ...కమలున్ = చంద్రునితోను, ముత్యాలహారముతోను సరియైన (స్వచ్ఛమైన) వాక్ప్రవాహముచే అలంకరింపఁబడిన ముఖపద్మము కలవానిని.

సీ. సమకూర్పఁగా నేర్చు సకలవైష్ణవశాస్త్ర సిద్ధాంతశుద్ధాంతసిద్ధి గరిమ
హాపణింపఁగా నేర్చు నఖిలావనీచక్రసామ్రాజ్యపూజ్యవిశాలలక్ష్మి

---

1. క. పరిణాహ. చ. పరిణాహి. 2. చ. వాంగంగా.

వలపింపఁగా నేర్చు వాలారుఁజూపుల [1]కోపులు చూపు చకోరదృశలఁ
బాలింపఁగా నేర్చు బాంధవకవిగాయకార్థార్థి నివహంబు ననుదినంబు

తే. దండనాథునిమాత్రుఁడె దశదిశావ, కాశసంపూర్ణ విజయప్రకాశశాలి
రంగయామాత్యువరదయ్య ప్రకటశౌర్య,[2]ధారి వాచాధరాధరధారిశయ్య. 52

టీక. సకల...గరిమన్ = వైష్ణవమతసిద్ధాంతరహస్యసిద్ధియొక్క గొప్పతనమును; వలపింపఁగాన్=చక్కఁబఱచఁగా; వాలారుఁజూపులకోపులు=దీర్ఘములయిన చూపుల యందములు; చకోరదృశలు = స్త్రీలు. ప్రకట శౌర్యధారి = గొప్ప శౌర్యముకలవాఁడు; వాచాధరాధరధారిశయ్య = మాటలచేత విష్ణువాహనమైన శేషుఁడైనవాఁడు.

క. [3]తిమ్మాంబ యక్కమయు వర,దమ్మయు వరదప్పభార్యలై వెలసిరి తే
జమ్మున శక్తిత్రయమువి,ధమ్మున సకలోన్నతప్రథాప్రథితమతిన్. 53

టీక. సకలో...మతిన్ = అన్నిటను గొప్పఖ్యాతిచేఁ బ్రసిద్ధమగునట్లు.

ఉ. మున్నొకరాఘవుండు తలమోచి భజించు విభీషణాదులన్
మన్ననఁ బ్రోచెఁ గాచె నను మాటలెకాని గుణప్రసన్నతన్
బ్రన్నఁదనంబుఁ జూపఁగల రంగయరాఘవమంత్రి నిచ్చలున్
వన్నెకుఁ దెచ్చు నిచ్చు నభివాంఛితవస్తువు లర్థికోటికిన్. 54

టీక. తలమోచి = (ఆజ్ఞ) శిరసావహించి; ప్రన్నదనంబు = మనోజ్ఞత; నిచ్చలున్ = ఎల్లపుడును; అభివాంఛితవస్తువులు = కోరిన ద్రవ్యములు. అలం. వ్యతిరేకము.

క. తేజమున రాఘవుని యం,భోజేక్షణ తిమ్మమాంబ పోల్పందగు నా
రాజీవసదన శారద,రాజార్ధకిరీటపూర్ణరాజనిభాస్యన్. 55

టీక. రాజీవసదన = లక్ష్మి; శారద = సరస్వతి; రాజార్ధ...నిభాస్య=చంద్రవంక కిరీటముగాఁ గల శివుని భార్య-పార్వతి. అలం. ఉపమ.

క. శ్రీరామమంత్రివరదసు,ధీరత్నము కులవధూటి దీపించు యశో
దా[4]రమణిరమణ విష్ణు, శ్రీరంజిత కొండమాంబ [5]చిరపుణ్యమునన్. 56

టీక. కులవధూటి = ధర్మపత్ని; యశోదారమణిరమణన్ = యశోదాదేవిరీతిని; విష్ణుశ్రీరంజిత= విష్ణువునందు భక్తికలది.

క. ఆదంపతులకుఁ గలిగిరి, గాదిలిసత్పుత్రవరులు గనుగొండనయున్
శ్రీదనరు నౌబళయ్యయు, వేదస్మృతిజాయమానవినయనయగతిన్. 57

టీక. గాదిలి = ప్రియమైన-ముద్దులొలుకు; వేద...గతిన్ = శ్రుతిస్మృతుల యధ్యయనము వలనఁ గలుగు వినయ, నీతులవలె. అలం. ఉపమ.

క. కనుగొండ యితనిధైర్యము, పెనుగొండగు [6]నితని నెదిరి భీతిఁ [7]బగఱు వే
చనుఁ గొండల కనఁగాఁ దగు, కనుగొండయ నాగమాంబికావల్లభుఁడై. 58

టీక. పెనుగొండగున్ = పెద్దకొండ యగును. పగఱు = శత్రువులు.

1. చ. కొప్పులు. 2. చ. ధార్య. 3. చ. తిమ్మాజి. 4. చ. రమణీమణిజిష్ణు 5. క. పుణ్యములన్. చ. పుణ్యమునన్. 6. క. నతని. చ. నితని. 7. క. బరఁగ. చ. పగర.

ఆ. అతనిసోదరుండు మతికళాజంభారి
గురుఁడు బంధులోకసురభి వెలయు
నౌబళాఖ్యమంత్రి యహా బళా! యీతని
జయము నయము [1]ననుచు జనులు పొగడ. 59

టీక. మతి...గురుఁడు = బుద్ధియందు ఇంద్రగురువగు బృహస్పతి; సురభి = కామధేనువు. అలం. రూపకము.

ఉ. ఇమ్మనవద్యహృద్యసముదీర్ణగుణాళికిఁ, గల్పవృక్షపుం
గొమ్మ నవీనదానగుణగుంభనసంభృతికిన్, బద్మనాభుఁ గ
న్నమ్మ నరామరస్తుతజయస్థితి కౌబళమంత్రిభార్య యౌ
నమ్మమ [2]యమ్మదద్విరదయానకు నేసతు లీడు ధారుణిన్. 60

టీక. ఇమ్ము = స్థానము, ఆశ్రయము; అనవద్య...గుణాళికిన్ = దోసఁగులులేనివియు, మనోహరములును, గొప్పవియు నగు గుణములకు; గుంభనసంభృతికిన్ = కూర్చుటయందు; పద్మనాభుఁ గన్నమ్మ = విష్ణుఁగన్నతల్లియగు దేవకీదేవి; నరా...స్థితికిన్ = దేవతలచేతను, మనుష్యులచేతను కొనియాడఁబడు గొప్పస్థితికి; అలం. రూపకము.

వ. ఏవంవిధాన్వవాయ పయఃపారావారంబునకుఁ దారకాకమనాకృతి యగు కృతిపతి తెఱం గెట్టి దనినఁ, 61

టీక. తారకాకమనాకృతి = నక్షత్రేశుఁడగు చంద్రునిఁబోలువాఁడు.

ఉ. [3]మానితరాజితద్యుతి సముంచితమోహనమూర్తి వైష్ణవ
జ్ఞానపరాయణుం డమృతసాగరరాజగభీరుఁ డర్థిసం
తానసురద్రుమం [4]బితఁడు దా నన నానతశాత్రవుండు రా
మానుజమంత్రి వర్ధిలు మహామహుఁడై నిజవంశకర్తయై. 62

టీక. మానిత...మూర్తి = గొప్పకాంతితో ఒప్పుచున్న మనోహరమైన దేహము కలవాఁడు; అమృతసాగరరాజగభీరుఁడు = పాలసముద్రముయొక్క గాంభీర్యమువంటి గాంభీర్యము కలవాఁడు; ఆనతశాత్రవుండు = లొంగిన శత్రువులు కలవాఁడు; అలం. ఉపమ. రూపకము.

సీ. కతపత్త్ర మిడవచ్చుఁ గల గాంచు నపుడైనఁ గోరికఁ బరకాంతఁ గోరఁ డనుచు
ముడియ వైవఁగవచ్చు మొన దాఁకసించిన శూరత్వమున వెన్ను చూపఁ డనుచు
దిబ్బె మెత్తఁగవచ్చు నబ్బురం బగుకల్మి మేరమీఱినరీతి మెలఁగఁ డనుచుఁ
[5]జేయిసాఁపఁగవచ్చు శివుమీఁద నేనియుఁ బూనికతోఁ బల్కి బొంకఁ డనుచు

తే. జలధివలయితవసుమతీస్థలవతంస, భాసు[6]రాంస సమాశ్రితప్రౌఢకీర్తి
[7]శఠమఠణగోత్రభవమంత్రిచక్రవర్తి, యైన రామానుజయ్యకునై కడంగి. 63

టీక. కతపత్త్రము = ప్రమాణపత్త్రము; ముడియ = పందెము; మొన, దాఁకసించినన్ = సేనలు మీఁదికిరాఁగా; దిబ్బెము = దీపము; మేర = హద్దు; జలధి...కీర్తి-జలధివలయిత = సముద్రముచేఁ జుట్టుకొనఁబడిన; వసుమతీస్థలవతంస = గొప్పభూమండలముచే; భాసుర = ప్రకాశించు; అంస = భుజములయందు; సమాశ్రిత = ఆశ్రయించిన; ప్రౌఢకీర్తి = గొప్పకీర్తికలవాఁడు.

1. క. నంచుఁ.చ. ననుచు. 2. చ. నమ్మన. 3. చ. మానుజరాజిత. త. మానితరాతిత. 4. క. బతఁడు. త. బితఁడు. 5. క. చేసాఁపగా. చ. చేయిసాఁపఁగ. 6. త. అంశ. 7. శఠమఠన.

ఇందు 'కతపత్రమిచ్చుట, పందెము వేయుట, దీపమెత్తుట, శివునితలపైఁ జేయిచాచుట' అనునవి ప్రతిజ్ఞార్థముపయోగింపఁబడుట ప్రసిద్ధము.

శా. రాధానాథ పదాబ్జభృంగ మగు నా రామానుజామాత్యు తే
జోధారావళిభాను భాను[1]నుపమంజూపట్టు మిత్రాంబుజో
ద్బోధంబుం బ్రతిపక్ష[2]కైరవనిరుద్బోధంబు [3]నర్హక్రియా
సాధుత్వంబు వహింప దుర్దమతమస్సంబాధముల్ [4]పాఱఁగన్. 64

టీక. రాధానాథపదాబ్జభృంగము = పాండురంగని పాదపద్మములందు తుమ్మెద అయినవాఁడు; తేజోధారావళి; భానుభానునుపమన్ = కిరణములవలె ఎడతెగని తేజఃపుంజములచే సూర్యుని పోలికను; మిత్రాంబుజోద్బోధంబున్ = పద్మములవంటి మిత్రులను ఉల్లసిల్లఁజేయుటను; ప్రతిపక్షకైరవనిరుద్బోధంబున్ = కలువలఁ బోలు శత్రువుల సంకోచమును; దుర్దమ .. బాధముల్ = చీఁకటులవంటి అంటరాని అజ్ఞానపు భయములు; పాఱఁగన్ = పరుగెత్తిపోఁగా.

సూర్యుఁడు తేజోవంతములగు కరములతో ప్రకాశించుచు చీఁకట్లను బోఁగొట్టి, కలువలకు వికాసము లేకుండఁ జేసి, కమలములను వికసింపఁజేయును; అట్లే తేజోవంతుఁడగు రామానుజమంత్రి శత్రువులను దురపిల్లఁజేసి, మిత్రులకు సంతసముఁగూర్చి యజ్ఞానమును తఱిమివేయునని భావము.

క. కామగవీ సురతరువులు, వేమాఱును నిచ్చుఁ[5]దవులు విడిబేరముగా
రామానుజయ్యదాన, ప్రామాణికముద్ర కొంగుబంగార మగున్. 65

టీక. కామగవీసురతరువులు = కామధేనువును, కల్పవృక్షమును; తవులువిడిబేరముగాన్ = (పిసినిగొట్టు) కొసరుబేరముగా; వేమాఱును = (ఒకేసారి యీయక) పెక్కుసారులుగా; ఇచ్చున్; ['తగులువిడిబేరము = అంటీఅంటని వ్యాపారము' అని పూర్వటీక] రామా...ముద్ర = శ్రీరామానుజయ్యగారి కరారైన మాట - ప్రతిజ్ఞావాక్యము; కొంగుబంగారము = కొంగున కట్టుకొన్న బంగారమువలె సులభసాధ్యమైనది; రామానుజయ్య మాట యిచ్చినఁజాలును; తిరుగనేఱఁడు; పెక్కుసారులు త్రిప్పక ఒక్కసారిగా ఆశ్రితులకోరికలను నెఱవేర్చునని భావము.

(శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువులో 'తవులువి (వ?)డిబేరము = విడువకుండు బేరగాని నెట్లో విడిపించుకొనుటకై చేయుం బేరము' అని అర్థమీయఁబడి దానికి ఈ పద్యము ప్రమాణముగఁ జూపఁబడినది. మఱియు "కామధేనువు, కల్పవృక్షము యాచకులు పీడించునపుడు వారిని తప్పించుకొనుటకై కోరినది యిచ్చి పంపివేయును; రామానుజయ్య కోరకయే యర్థులకోర్కులు తీర్చుచుండును' అని భావము" అని పద్యముభావము నీయఁబడినది. ఇచట నిఘంటుకారు లిచ్చిన భావమునకును, తవులువిడిబేర మను పదము నర్థమునకును పొందిక కుదురలేదు. కామగవీసురతరువులు 'కోరినది యిచ్చి' పంపివేసినచో 'వేమాఱును' అను పదము నిరర్థకము.

శా. ఆ రామానుజమంత్రిచంద్రుఁడు వివాహం బయ్యె నెయ్యంబుతో
భారద్వాజపవిత్రగోత్రనిధికిన్ బల్పాటి కన్నయ్యకున్
గారామైన కుమారికాతిలకమున్ గౌరీధరాశారదా
మారామా [6]ప్రతిమప్రసిద్ధమతి నమ్మాజమ్మఁ దేజంబునన్. 66

టీక. నెయ్యంబుతోన్ = ప్రీతితో; గారామైన = ప్రీతిపాత్రమైన; మారామా = లక్ష్మీదేవి; ప్రతిమప్రసిద్ధమతి = సమానమైన గొప్ప బుద్ధికలది;

---

1. త. నుపముం. 2. త. కైతవ. 3. చ. నర్హక్రియా. క. నిర్హంక్రియా. 4. క. జాఱఁగన్. చ. బాఱఁగన్. త. జాఱగన్. 5. త, దగులువిరి. 6. క. పరమప్రసిద్ధ. చ. ప్రతిమప్రసిద్ధ.

సీ. తొడవులు పెక్కులు [1]తొడివియుండెనెగాని సత్యంబు తనకు [2]నిజానఁ దొడవు
చుట్టాలసురభులై సొబగు నొందెనెకాని నెనరైనచుట్టంబు తనకుఁ గీర్తి
కులదైవతం బహోబలనాథుఁ [3]డనెఁగాని పతిమూర్తి పరమదైవతము తనకుఁ
జక్కఁదనంబులు సహజంబు[4]లనెఁగాని తనచక్కఁదనము వర్తనమునంద
తే. యనఁగ [5]విలసిల్లె నఖిలవిద్యారహస్య, పరమవిజ్ఞానపాండిత్యభద్రమూర్తి
విప్రసురశాఖి రామానుజప్రధాన, మౌళియర్ధాంగలక్ష్మి యమ్మాజియమ్మ. 67

టీక. తొడవులు = నగలు; తొడివి = ధరించి; నిజానఁ దొడవు = నిజమైన నగ; నెనరైన = ప్రియమైన; వర్తనము = మంచినడత; నిఖిల...పాండిత్య = అన్నివిద్యల మర్మముల నెఱుగుట యందును పాండిత్యము కలది. (ఈపద్యమున 'అమ్మాజియమ్మ' అనుచో సంధిచేయఁబడలేదు; సంజ్ఞావాచకములకును సంధి బహుళమని దీనివలన గ్రాహ్యము.)

క. ఇమ్మహిఁ రామానుజవిభు, నమ్మాజమ్మకు జనించి రబ్జభవముఖా
బ్జమ్ములఁబోలిన సుతర, త్నమ్ములు నలువురు నుదారతాజితశరధుల్. 68

టీక. అబ్జభవముఖాబ్జమ్ములు = బ్రహ్మయొక్క (నాల్గు) ముఖపద్మములు; ఉదారతాజిత శరధుల్ = త్యాగమున సముద్రుని మించినవారు. (ఇందు 'అమ్మాజమ్మ' అనుచో సంధిచేయఁబడుట గమనింపఁదగు.

సీ. మద్రేశనిభసమున్నిద్రశౌర్యోద్రేకవిద్రావితారి వేదాద్రిశౌరి
విష్ణుపదధ్యాననిష్ణాత విజ్ఞానకృష్ణుండు శ్రీరామకృష్ణమంత్రి
శరశరచ్చంద్రికాహారహరహి[6]మహీర కరకీర్తి వరశయ్య తిరుమలయ్య
పక్ష్మలితత్యాగలక్ష్మీకరోద్యోగలక్ష్మలక్షితమూర్తి లక్ష్మఘనుఁడు
తే. ననఁగ వెలసిరి రామానుజయ్యసుతులు, దశరథక్షోణిపాలనందనసమృద్ధి
దైవతేశమదావళదంతరేఖ, నురగపర్యంకనిజచతుర్వ్యూహలక్ష్మి. 69

టీక. మద్రేశ...తారి-మద్రేశనిభ = శల్యునితో సరియైన; సమున్నిద్రశౌర్యోద్రేక = గొప్ప పరాక్రమ విజృంభణమున; విద్రావితారి = తరిమివేయఁబడిన శత్రువులు కలవాఁడు; నిష్ణాత = ఆఱితేఱినవాఁడు; విజ్ఞానకృష్ణుండు = గొప్పజ్ఞానమున కృష్ణపరమాత్మ; శర...శయ్య = రెల్లు, శరత్కాలపు వెన్నెల, శివుఁడు, హారము, మంచు, వజ్రమణికిరణకాంతి - అనువీనితో సమమగు కీర్తికి తగిన శయ్య; అనఁగా సత్కీర్తి కలవాఁడని యర్థము. పక్ష్మలిత...మూర్తి, పక్ష్మలిత=(ఆనందభరమున) కన్నులుమూసిన; త్యాగలక్ష్మీకర = త్యాగలక్ష్మిని సృజించు; ఉద్యోగలక్ష్మలక్షితమూర్తి=వ్యాపారచిహ్నముతోఁ గూడినవాఁడు - త్యాగశీలుఁడు; లక్ష్మఘనుఁడు=లక్ష్మణయ్య యనుట. దైవతేశ...రేఖన్ = ఇంద్రగజమగు ఐరావతముయొక్క నాల్గు దంతములవలె; ఉరగ...లక్ష్మిన్ = శేషశాయి యగు విష్ణుని నాలుగు మూర్తులవలె; [వాసుదేవుఁడు, సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడు అని విష్ణువుమూర్తులు నాలుగు.] అలం. మాలోపమ.

ఉ. ముద్రితవైరివక్త్రు లగు మువ్వురు తమ్ములుఁ బంపుసేయ వే
దాద్రి విరూపమంత్రియుఁ డహర్పతితేజుఁడు రాజిలున్ యశో
భద్రుఁడు రామభద్రుని ప్రభావనయున్ గురుభక్తియుం బ్రతా
పద్రవిణప్రసిద్ధి [illegible] బంధుజనంబు ప్రియంబు సేయఁగన్. 70

1. త. తొడవి 2. క. నిజాల. 3. త. అని. 4. త. లనికాని. 5. చ. విలసిల్లి. 6. త. మాహిరకకీ.

టీక. ముద్రితవైరివక్త్రులు = మూతలుపడిన శత్రువుల నోళ్లుకలవారు; మూపు = ఆజ్ఞ; యశోభద్రుడు = కీర్తిచే మేలైనవాడు; ప్రభావన = ప్రతిభ; ప్రతాప...ప్రసిద్ధి = పరాక్రమధనము యొక్క ప్రసిద్ధి.

సీ. [1]పట్టె వట్రువయును బరిపుష్టి తలకట్టు గుడిసున్న కియ్యయు సుడి[illegible]ను ముడియు
నైత్వంబు [2]నేత్వంబు నందంబు మందంబు [3]గిలుకయు బంతులు ని[illegible]పు పొ[illegible]పు
నయము నిస్సందేహతయు నొప్పు [illegible]రువుచు ద్రచ్చి వేసినయట్లు త[illegible]
సద్వర్గశుద్ధి [illegible] జాతియోగ్యతయును [illegible] [4]ప్రి[illegible]త్వంబు వినయగ[illegible]
తే. [illegible]కొన [5]వ్రాయసంబులు వ్రాయ వ్రా[illegible]
గొంకు కొసరును జేతప్పు గొనక[6]యుండు
లలితముక్తాఫలాకారవిలసనమున
మతిమరున్మంత్రి వేదాద్రిమంత్రివరుడు. 71

టీక. పట్టె = గీత; వట్రువ = గుండ్రన; పరిపుష్టి = నిండు; కియ్య = యావత్తు; సుడి = వట్రువసుడి; ముడి = మాముడి, తాముడి - మావత్తు, తావత్తు; మందంబు = దిట్టము; గిలుక = వలపల గిలుక; త్రచ్చి = చెక్కి; వద్వర్గశుద్ధి = హల్లుల పరిశుద్ధి; [స్పర్శము లైదువర్గములు-య-ర-ల-వ మొదలగునవి ఆరవ వర్గము.] చేతప్పు గొనకయుండుస్ = వ్రాతతప్పుచేయకుండును. మతిమరున్మంత్రి = బుద్ధియందు (ఇంద్ర గురువగు) బృహస్పతి.

తే. మాద్రి మీఱు విఱూరి వేదాద్రిరాజు, దానధారార్ఘ మఖిలప్రధాననదుల
వెచ్చపెట్టుటం దలంకిరో విబుధతటిని, తరుణశశిమాళిజడలలో డాఁగియుండు.

టీక. ధానధారార్ఘము = దానమిచ్చునపుడు నీటిధారను విడుచుటకయి; వెచ్చపెట్టుటన్ = ఖర్చుపఱచుటచే; తలంకిరో = భయపడినదో యనునట్లు; విబుధతటిని = గంగానది; తరుణశశిమాళి = శివుడు. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. [7]చేతులు ద్రిప్పుచుక్ [8]బ్రభుల చెంతల నూరక దుర్వినీతులై
యేతులఁ బోవుచుం దిరుగు [9]నిప్పటిమంత్రులు తంత్రు [10]లిందఱుక్
భూతలకల్పవృక్షముఁ బ్రభూతగుణాఢ్యుని సర్వలోక వి
ఖ్యాతు వినీతు వేదగిరిఁ గాతరచిత్తులు పోలనేర్తురే ? 73

టీక. దుర్వినీతులు = దుర్మార్గులు; ఏతులఁబోవుచున్ = విఱ్ఱవీగుచు; ప్రభూతగుణాఢ్యుడు = గొప్పగుణములు కలవాడు; వినీతుడు = వినయము కలవాడు; కాతరచిత్తులు = పిఱికిగుండె కలవారు.

సీ. కరుణించి చూచెనా కవిగాయకార్థార్థి నివహగేహంబుల నెఱయు సిరులు
కోపించి చూచెనా కొండతో నెనవచ్చు ననవచ్చు నతఁడైన నవని దూఱు
మెచ్చి మన్నించెనా [11]మెదుకపాఁడైన దొరతనంబున నిల్చి పరిఢవించుఁ
బొందు గావించెనా భువి నెట్టి ఖలునకు నాదట కరుణాప్రసాద మొసఁగు
తే. మంత్రిమాత్రుండె దుర్మంత్రి మథనకథన, చారు [12]చర్యాచమత్కారచక్రవర్తి
యద్రినిభుఁడు విఱూరి వేదాద్రి రామ, భద్రపాదసరోరుహాబంభరంబు. 74

1. చ. పట్ట. 2. చ. సెక్వంబు. 3. త. గిలక. 4. క. ప్రియంబును. చ. ప్రియత్వంబు. 5. చ. రాయసంబుల. 6. చ. యుండ. 7 త. చేతుల. 8. చ. లేదు. 9. త. నప్పటి మంత్రుల. 10. చ. లిద్దఱున్. 11. మెద. 12. చ. చర్యా.

టీక. కవి... గేహాంబులన్ = కవులయు, సంగీతవేత్తలయు, యాచకులయు గృహములందు; నెఱయఁన్ = నిండియుండును. అవని, దూఱున్ = పాతాళమున కడఁగిపోవును; మెదుకపాలసుఁడు = మందుఁడైన మూర్ఖుఁడు; పరిభవించున్ = అతిశయించును; పొందు = స్నేహము; ఆదట = మనసార.

దుర్మంత్రి......చక్రవర్తి - దుర్మంత్రి మథన కథన = దుష్టమంత్రులను మర్దించు ప్రసంగము యొక్క; చారు = చక్కని; చర్చా = విచారణ విషయమైన; చమత్కారచక్రవర్తి = చమత్కారమునం దాఱితేఱినవాఁడు; బంభరంబు = తుమ్మెద. అలం. రూపకము.

శా. జలజాక్షాంఘ్రిసరోజషట్పదము విశ్వామిత్రగోత్రోద్భవుం
డలఘుప్రాభవుఁ డర్థిలోకసులభుండై కీర్తిఁ బెంపొందు నా
కల[1]కాళాస్తితనూభవన్ సుగుణ[2]లక్ష్మిన్ దిర్మలాంబన్ బ్రభల్
వెలయంగాఁ గులకాంతఁ జేసి వెలసెన్ వేదాద్రి భద్రోన్నతిన్. 75

టీక. జల ....షట్పదము = విష్ణుపాదపద్మములయందలి తుమ్మెద; అలఘుప్రాభవుఁడు = గొప్ప అధికారముకలవాఁడు; అర్థిలోకసులభుండు = యాచకులకు స్వాధీనుఁడు; కలకాళాస్తి తనూభవన్ = కలకాళహస్తియనునాతని పుత్రికను. (వాడుక ననుసరించి 'కాళాస్తి' అని చెప్పఁబడినది.)

సీ. వృషభేంద్రగమనుఁ డీవేదాద్రినాథుండు గిరిరాజతనయ యీతిరుమలాంబ
[3]వేదనిశ్వాసుఁ డీవేదాద్రినాథుండు భృతి శారదాంబ యీతిరుమలాంబ
విహగేంద్రగమనుఁ డీవేదాద్రినాథుండు శరధితనూజ యీతిరుమలాంబ
విబుధాధినాథుఁ డీవేదాద్రినాథుండు ధర శచీదేవి యీతిరుమలాంబ
తే. యనఁగ ననుకూలదాంపత్య వినుతమహిమ
హరువు దీపించె నౌర! వేదాద్రివిభుఁడు
హరియశుఁడైన కలకాళహస్తితనయ
తిరుమలాంబయు నిత్యపరిష్కలక్ష్మి. 76

టీక. వృషభేంద్రగమనుఁడు = శివుఁడు; వేదనిశ్వాసుఁడు = వేదములు ఊర్పులుగాఁ గల బ్రహ్మ; శరధితనూజ = లక్ష్మీదేవి; విబుధాధినాథుఁడు = ఇంద్రుఁడు; హరువు = మనోజ్ఞత; అలం. రూపకము.

సీ. వేదమార్గప్రతిష్ఠాద్వైవత జ్యేష్ఠుఁ డభ్యస్తషడ్దర్శనార్థరాశి
యతిరాజరచితభాష్యగ్రంథనిర్ణేత యఖిలపురాణేతిహాసకర్త
బంధురదివ్యప్రబంధానుసంధాత పంచసంస్కారప్రపంచనుఁడు
వాధూలమునిచంద్రవంశవర్ధనమూర్తి సకలదేశాచార్య నికర[4]గురువు
తే. పట్టమేనుంగు శ్రీరంగపతికి [5]నణ్ణ, గారిగర్భాంబురాశి నీహారరశ్మి
[6]సరససాహిత్య సౌహిత్యశయ్య నేఁటి, యాళువందారు కందాళయప్పగారు. 77

టీక. వేద......జ్యేష్ఠుఁడు = వైదికమతమును నిలుపుటయందు బ్రహ్మ; అభ్యస్త.....రాశి = అభ్యసించిన షట్ఛాస్త్రములు కలవాఁడు; [తర్కము, వ్యాకరణము, ధర్మము, మీమాంస, వైద్యము, జ్యోతిషము అని శాస్త్రము లాఱు అని శబ్దరత్నాకరము. కాని సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, మీమాంసా, వేదాంతములని దర్శనము లాఱని చెప్పవలెను.]

---

1. చ. కాళ్హాస్తి. 2. చ. లక్ష్మన్. 3. క. వేదనిశ్వాసుఁడు. చ. వేదనిశ్వాసుఁడీ. 4. చ. గురుఁడు. 5. త. నన్న. 6. క, సర్వస్వ. త. సౌహిత్య.

యతి.....నిర్ణేత = శ్రీరామానుజయతిచే రచింపఁబడిన శ్రీభాష్యమున కర్థమును నిర్ణయించువాఁడు; బంధుర...సంధాత = గొప్ప దివ్యప్రబంధములగు ముదలాయిరము, తిరువాయ్మొழி ఇయత్పా, తిరుమొழி అను నాల్గు ద్రావిడామ్నాయగ్రంథముల ననుసంధానము చేయువాఁడు; పంచ...చణుఁడు = తాప, పుండ్ర, నామ, మంత్ర, యాగము లను నైదు సంస్కారముల నొనర్చుటయందు నేర్పరి; పట్టపేనుంగు = పట్టపుటేనుఁగు; [శ్రీరంగపతికి వాహనుఁడనుట.] సితకరరశ్మి = చంద్రుఁడు; అణ్ణాచార్యులపుత్రుఁడనుట; సార......శయ్య = సాహిత్యసారమునకు తృప్తికరమగు పడక; [సాహిత్యసారజ్ఞుఁడని యర్థము.] నేఁటియాళువందారు = ఈకాలమున వెలసిన ఆళువందారను పరమభక్తుఁడు; కందాళ యప్పగారు = కందాళ-అప్పలాచార్యులుగారు.

శా. తత్తాదృగ్విభవప్రభావనిధిఁ గందాళప్పగారిన్ దయా
యత్తస్వాంతు నితాంతశాంతియుతు లోకాచార్యపర్యున్ సుధీ
చిత్తాంభోరుహభానుఁ గొల్చుచుఁ దదాశీర్వాదలబ్ధోన్నతిన్
హత్తెన్ [7]మీఱటి విరూరిమంత్రిమణి వేదాద్రీశుఁ డుద్యద్రుచిన్. 78

టీక. తత్తాదృగ్విభవప్రభావనిధిన్ = సాటిలేని సంపదను, ప్రతిభకు నిధియైనవానిని; సుధీ...భానున్ = విద్వాంసుల మనస్సులనెడి కమలములకు సూర్యుఁడైనవానిని; హత్తెన్ = పొందెను; ఉద్యద్రుచిన్ = గొప్ప ప్రకాశమును.

(ఇచట 'కందాళ+అప్పగారు' అనుచో 'కందాళప్పగారు' అని సంధిచేయఁబడినది; వెనుకటి పద్యములో ఈ సంధి చేయఁబడలేదు.] అలం. రూపకము.

వ. వెండియు నవ్వేదాద్రిమంత్రీశ్వరుండు [8]కవికులతిలకుండును, రణరంగధీరుండును, నంబునిధిగభీరుండును, భట్టరభావాంకుండును, నకలంకుండును, [9]సవత్తారు [10]మండలికరగండండును, నుద్దండ భుజాదండుండునై, పరనారీ సహోదరుండయ్యును నితరసముపార్జితవధూవల్లభుండును, గోపికాగోవిందుండయ్యు నీశ్వరలక్షణలక్షితుండును, [11]పొన్నంబలదేవ దివ్యశ్రీపాదపద్మారాధకుండయ్యును బ్రతిష్ఠాపితపరమవైష్ణవ [12]కుటుంబవిశేషుండు నైన ఘనుని. 79

టీక. కవికులతిలకుండు = కవులలో శ్రేష్ఠుఁడు; భట్టరుభావాంకుండు = భట్టరు చిహ్నకలవాఁడు; సవత్తారు...గండఁడు = ఆ బిరుదముకలవాఁడు. పరనారీసహోదరుండయ్యున్ = పరవనితలకు సోదరుఁడయినను; ఇతర...వల్లభుండు = (ఇతరులు సంపాదించుకొన్న) ఇతరులచే సంపాదింపఁబడిన స్త్రీలకు ప్రియుఁడైనవాఁడని విరోధము; శత్రువులనుండి లాగికొనఁబడిన రాజ్యలక్ష్మి యను స్త్రీకి భర్త యని ఆభాసము. గోపికాగోవిందుఁడయ్యును = గొల్లపడుచులకు శ్రీకృష్ణుఁ డయినను [అంతఃపురస్త్రీలకు శ్రీకృష్ణునివలె విలాసపురుషుఁ డైనవాఁడయినను]. ఈశ్వరలక్షణలక్షితుండు = శివునిలక్షణములతోఁ గూడినవాఁడు అని విరోధము. ప్రభుత్వలక్షణములు కలవాఁడని తదాభాసము. పొన్నంబల......రాధకుండయ్యును = నటరాజస్వామిపాదపద్మములను సేవించువాఁ డయినను; ప్రతిష్ఠా...... విశేషుండు = విష్ణుసంబంధదేవతలను ప్రతిష్ఠించినవాఁడని విరోధము; వైష్ణవకుటుంబముల కాధారముగ కల్పించి, వానిని నిలిపినవాఁడని తదాభాసము.

ఇవియన్నియును పెదసంగభూపాలునికి విశేషణములు. అలం. విరోధాభాసము.

---

7. క. దాను. చ. మీఱటి. 8. క. రవి. చ. కవి. 9. త. సవత్తార. 10. క. మండలీ. చ. మండలి. 11. క. పొన్నాంచారుదేవి. చ. పొన్నంబరదేవ. త. పోలన్నాంబరదేవ. 12. క. కుటుంబినీ.

తే. గుఱుతు గల రాజు ముంగయ గురువరాజు
పుత్త్రుఁ బెదసంగభూపాలు శత్త్రుజైత్త్రు
భానుసముతేజు విద్యావధానభోజుఁ
గొల్చి వేదాద్రి నిత్యలక్ష్ములఁ దలిర్చు. 80

టీక. గుఱుతు = ప్రసిద్ధి, కీర్తి; విద్యావధానభోజున్ = విద్యాపరిశ్రమయందు భోజమహారాజైనవానిని; తలిర్చున్ = ఒప్పుచుండును.

మ. విభవేంద్రుండు విరూరిశాసనమహావిఖ్యాతి రామానుజ
ప్రభువేదాద్రి లిఖించు [1]వ్రాయసము లౌరా! పెద్దసంగావనీ
విభుచిత్తంబు నెఱింగి గంటముఁ బల్ విద్యావధూనూపుర
ప్రభవప్రౌఢఝుళంఝుళారభటిసౌభాగ్యంబు కల్పింపఁగన్. 81

టీక. విభవేంద్రుండు = వైభవమునం దింద్రుఁడు; విరూరిశాసనమహావిఖ్యాతి = విరూరిగ్రామాధికారమున కీర్తికలవాఁడు; వ్రాయసములు = ఆజ్ఞాపత్త్రికలు; విద్యా...భాగ్యంబు - విద్యావధూ = సరస్వతీదేవియొక్క; నూపుర = కాలియందెలవలన; ప్రభవ = పుట్టిన; ప్రౌఢ = ఎక్కువైన; ఝుళంఝుళారభటిసౌభాగ్యంబు = ఝుళంఝుళమను ధ్వనియొక్క గొప్పతనమును; లిఖించున్.

చ. అతనిసహోదరుల్ వెలసి రార్యగుణాఢ్యులు రామకృష్ణుఁ డా
యతభుజశౌర్యుఁడౌ తిరుమలయ్య విచక్షణభవ్యసత్కళా
చతురుఁడు లక్ష్మణయ్యయు రసాతలనూతనకామధేనువుల్
[2]చతురుపధావిధాననయసాంద్రులు చంద్రులు కాంతిసంపదన్. 82

టీక. సహోదరుల్ = తమ్ములు; ఆర్యగుణాఢ్యులు = ఉత్తరగుణములు కలవారు; విచక్షణ...చతురుఁడు = విద్వాంసులు కొనియాడఁదగిన గొప్ప కళలయందు నేర్పరి; రసాతల నూతనకామధేనువుల్ = భూమండలమునందలి (క్రొత్త) కామధేనువులు; [మహాదాతలని యభిప్రాయము.] చతురు...సాంద్రులు=నాలుఁగువిధములగు నుపాయముల విధానపు నీతియందు సమర్థులు; [సామ దాన భేద దండోపాయములు నాలుగు.]

ఇచట మూలమున 'చతురపధావిధాననయసాంద్రు లనియు, దానిటీక 'నేర్పరుల మార్గములను విధించునట్టి నీతియందు అధికులు' అనియుఁ గలదు. అవి సరికావని సహృదయు లెఱుఁగకపోరు.

తే. ధర్మనిర్ణేత వేదాద్రికూర్మితమ్ముఁ, డైన శ్రీరామకృష్ణప్రధాని వెలసె
లక్ష్మమాంబాధినాథుఁడై లక్ష్మితోడి, యాదినారాయణునికృప ననుదినంబు. 83

టీక. ధర్మనిర్ణేత = ధర్మములను నిర్ణయించువాఁడు.

క. ఇంతిం దిరుమలమంత్రియు,నంతమఁ గొనియాడవలయు హరిహయనగర
ప్రాంతోపవనలతాంతా,నంతమరందస్రవంతికాంచితసూక్తిన్. 84

టీక. తిరుమల...తమన్ = తిరుమలమంత్రిభార్య యగు అనంతమ్మను;హరిహయ...సూక్తిన్ = ఇంద్రుని నగరమగు నమరావతి చేరువ పూఁదోఁట [నందనవనము]లోని పుష్పముల మకరందప్రవాహముతో సమానమగు మాటలు కలదానిని; కొనియాడవలయున్.

క. ఆలక్ష్మణమంత్రీశ్వరు, లీలావతి వెంగళాంబ లేఖవిభువధూ
పాలితనానావిధల,క్ష్మీలక్షణశోభివిభవకీర్తుల వెలసెన్. 85

1. త. రాయసము. 2. క. చతురపథా. చ. చతుపపథా.

టీక. లేఖ...కీర్తులన్ = ఇంద్రుని దేవి యగు శచీదేవి పొందిన వివిధములగు శుభలక్షణములచేఁ బ్రకాశించు సంపదతోను, కీర్తితోను.

క. సోదరులు సుతులు సతులును, వేదోదితమార్గచర్య వినయము నయముల్
శ్రీదాంపత్యము నెసఁగఁగ, వేదాద్రిమహాప్రధాని వెలయుం గృతులన్. 86

టీక. వేదోదితమార్గచర్యన్ = యథాశాస్త్రముగ; ఎసఁగఁగన్ = అతిశయింపఁగా. అలం. క్రమము. (యథాసంఖ్యము.)

షష్ఠ్యంతములు

క. ఏవంవిధగుణమణిఖని, కావిర్భవదురుకృపాకటాక్ష జనికి ల
క్ష్మీవల్లభచరణాంబుజ, సేవాహేవాక శీలశీలనమునికిన్. 87

టీక. ఏవంవిధగుణమణిఖనికిన్ = ఇట్టి గుణములనెడి రత్నములకు గనియైనవానికి; ఆవి... జనికిన్ = పుట్టుచున్న గొప్పదయారసమొలికెడి చూపుగలవానికి; లక్ష్మీ...మునికిన్ = విష్ణుపాదపద్మముల సేవాప్రౌఢత్వమనెడి స్వభావమును పరిశీలించుటలో ముని యగువానికి. [అనఁగా విష్ణుపాదసేవ యందత్యంతాసక్తి కలవానికని భావము.]

క. అంధకరిపుగంధద్రుమ, గంధాంధద్విపవిపక్షగరుడత్రోటీ
బాంధవబంధురకీర్తి సుగంధిలభువనత్రయునకు ఘనవినయునకున్. 88

టీక. అంధక...త్రయునకున్ —అంధకరిపు = శివుఁడు; గంధద్రుమ = చందనవృక్షము; గంధాంధద్విపవిపక్ష = కటికచీఁకటి యను నేనుఁగునకు విరోధియగు సింహము—చంద్రుఁడు; గరుడత్రోటీ = గరుడునిముక్కు;(అను వీనికి) బాంధవ = మిత్రమైన-సమానమైన; బంధురకీర్తి = గొప్పకీర్తిచేత; సుగంధిత = పరిమళించుచున్న - వ్యాపించుచున్న; భువనత్రయునకున్ = స్వర్గ, మర్త్య, పాతాళలోకములు కలవానికి. అలం. ఉపమ.

క. చతురుదధివలయవలయిత, క్షితలభరణకరణభుజునకును సుజనునకున్
నుతశౌరికి [1]జితవైరికి, హితకారికి సమదగమనహేలాకరికిన్. 89

టీక. చతురు......భుజునకును = చుట్టును నాల్గు సముద్రములు గల భూమిని భరింపఁగల భుజములు కలవానికి; నుతశౌరికిన్ = స్తుతింపఁబడిన విష్ణువు కలవానికి; జితవైరికిన్ = జయింపఁబడిన శత్రువులు కలవానికి; సమదగమనహేలాకరికిన్ = విలాసముతోఁ గూడిన గమనముచే ఏనుఁగైనవానికి;

క. వాణీనఖముఖముఖరిత, వీణానిక్వాణపల్లవితనూత్నసుధా
ప్రాణసఖలేఖనీకల, రాణున కాచరితభూసురత్రాణునకున్. 90

టీక. వాణీ...రాణునకున్ - వాణీనఖముఖముఖరిత = సరస్వతీదేవి గోటికొనలచే మీటఁబడిన; వీణానిక్వాణ = వీణాధ్వనిచే; పల్లవిత = చిగిర్చిన; నూత్నసుధాప్రాణసఖ = సరిక్రొత్త యమృతముఁబోలిన; లేఖనీకలరాణునకున్ = గంటముయొక్క మధురధ్వని కలవానికి; [వేదాద్రి గంటముతో వ్రాయుచున్నపుడు కలిగిన ధ్వని సరస్వతీదేవి వీణను మీటు ధ్వనివలె మధురమై యుండునని భావము.] ఆచరితభూసురత్రాణునకున్ = బ్రాహ్మణులను రక్షించువానికి - బ్రాహ్మణులను పోషించువానికి.

క. సంధారఘుపతికి వృషస్కంధునకైదంయుగీనకర్ణునకు సమి
న్మాంధాతకు బాంధవశుభసంధాతకు [2]దాతకును వృషభగమనునకున్. 91

1. చ. కారికి. 2. క. ధాతకు. చ. దారతకు. త. తారతకు.

టీక. సంధారఘుపతికిన్ = ప్రతిజ్ఞయందు రాముఁడగువానికి; వృషస్కంధునకున్ = ఎద్దు మూఁపురముఁబోలు అంసములు కలవానికి; ఐదంయుఁగీనకర్ణునకున్ = (దానమునందు) ఈ యుగపు కర్ణుఁడైనవానికి; సమిన్మాంధాతకున్ = యుద్ధమున మాంధాతృచక్రవర్తి యైనవానికి; బాంధవశుభ సంధాతకున్ = బంధువులకు మేళ్లు కూర్చువానికి; దాతకును = త్యాగికి; వృషభగమనునకున్=వృష భముయొక్క గమనమువంటి (ఠీవియైన) నడక గలవానికి.

క. భీమక్రోధాంధవిమత, సీమంతవతీలలామసీమంతమణి
స్తోమాపాకరణపటు,శ్యామలకరవాలజయ సహాయభుజునకున్. 92

టీక. భీమ...భుజునకున్ - భీమక్రోధాంధ = భయంకరమైన కోపముచేఁ గన్నుగానని; విమత= శత్రువులయొక్క, సీమంతవతీలలామ = ఇల్లాండ్రయొక్క; సీమంతమణిస్తోమ = పాపటలయందలి మణులగుంపును; అపాకరణ = పోఁగొట్టుటయందు - అనఁగా - శత్రువీరులను సంహరించుటయందు; పటు = సమర్థమైన; శ్యామలకరవాల = నల్లనికత్తివలన; జయసహాయభుజునకున్ = జయముతోఁ గూడిన భుజము(చేయి) కలవానికి.

క. రవికిరణరుచికి మతిభారవికి విమతసచివగళితరవపదభూషా
రవికి భుజాంతరమణిహా,[1]రవికిని రుచిరాకృతికి [2]ధరాభృతికృతికిన్. 93

టీక. రవికిరణరుచికిన్ = సూర్యకిరణములవంటి కాంతి కలవానికి; మతిభారవికిన్ = బుద్ధి యందు భారవికవి యగువానికి; విమత...రవికిన్ = శత్రురాజుల మంత్రులయొక్క జారిన రవముకల కాలియందెమ్రోఁత కలవానికి, [శత్రురాజుల మంత్రులు తామే గొప్ప యాలోచన గలవారమని భావించి, ఔద్ధత్యముతో కాలికి బిరుదుకడియములు ధరించియుండిరి; కాని వేదాద్రిమంత్రిబుద్ధిబలము ముందర వారి బుద్ధిబలము తీసికట్టయి, వారిప్రభువుల కపజయము కలిగినది; కాన వారు తమ ప్రగల్భ ములకు సిగ్గుపడి తమ బిరుదుకడియములను దీసివేయుచుండఁగా అవి ధ్వనిచేయుచున్నవని భావము.] భుజాంతరమణిహార, వికిన్=వక్షస్థలముపైఁ గల హారముయొక్క మణుల ప్రకాశము కలవానికి; రుచిరా కృతికిన్ = చక్కని ఆకారముకలవానికి-సుందరునకు; ధరాభృతికృతికిన్ = భూమిని భరించునేర్పరికి.

క. [3]రామానుజయ్యసుతునకు, శ్రీమంతున కర్థిసార్థజీమూతవాహ
[4]స్థేమోన్నతికి విరూరి, శ్రీమద్వేదాద్రిమంత్రిసింహంబునకున్. 94

టీక. అర్థిసార్థ...న్నతికిన్ = యాచకుల విషయమున జీమూతవాహనుని స్థైర్యముఁబోలిన గొప్ప స్థైర్యము కలవానికి; ఇచట 'జీమూతవాహయస్తోమోన్నతికి' అను మూలపాఠమును, '—జీమూత వాహన సమూహముయొక్క గౌరవము కలవానికి-యాచకులకు ఇష్టవస్తువులనిచ్చుటయందు జీమూత వాహనునివంటివారిని అనేకులను పోలినవానికి అని అర్థము.' అను టీకయు పూర్వముద్రితప్రతులందు కనఁబడుచున్నవి; అవి సరికావు. జీమూతవాహనుఁడు శంఖచూడుని ప్రాణముఁ గాపాడుటకు తన ప్రాణము నిచ్చుస్థైర్యము కలిగియుండెనని ప్రసిద్ధము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన పౌండరీకమాహాత్మ్యంబు నకుం గథావిధానం బెట్టిదనిన. 95

---

1. చ. కిర. 2. చ. శృతి. 3. ట. జార్య. 4. క. స్తోమోన్నతికి. చ. స్థేమోన్నతికి. 5. చ. కావింపం.

## కథాప్రారంభము

మ. తులితోక్షధ్వజసూతుఁడై వెలయు సూతుం గాంచి మునుల్ శౌనకా
దులు క్షేత్రంబును వేల్పుఁ దీర్థము బుధస్తుత్యప్రభావంబులై
దళితైనస్తిమిరంబులై యిహపరార్థప్రాప్తిమూలంబులై
యిలపై నొక్కెడఁ గల్గెనే ననఘమూర్తీ! తెల్పవే నావుడున్. 96

టీక. తులితోక్షధ్వజసూతుఁడు = సరిపోల్పఁబడిన (శివుని సారథియగు) బ్రహ్మ కలవాఁడు. బుధస్తుత్యప్రభావంబులై = విద్వాంసులచేఁ గొనియాడఁబడిన గొప్పతనము కలవై; దళితైనస్తిమిరంబులై = నశింపఁజేయఁబడిన పాపము లను చీఁకటులు కలవై; ఇహపరార్థప్రాప్తిమూలంబులై = ఐహిక, పారలౌకికసుఖములకు పొందుటకు కారణములై.

క. ఆఋషుల ప్రశ్న మంగీకారం బొనరించి పలుకుఁ [1]గథకుఁడు శ్రీనా
థారాధనహితచర్యున్, బారాశర్యుం దలంచి ప్రాంజలి యగుచున్. 97

టీక. అంగీకారంబొనరించి = (జవాబు చెప్పుటకు) గ్రహించి; కథకుఁడు = కథలు చెప్పు సూతుఁడు; శ్రీనాథా...చర్యున్=విష్ణుదేవుని యారాధన మను మేలిపని చేయువానిని; పారాశర్యున్= వ్యాసుని; ప్రాంజలి, యగుచున్ = చేతులుజోడించి [ప్రాసమునందుహల్లులకేనియమముకాన - తొలి పాదమున 'ఋ' ప్రాసమందుండుట దోషముకాదు].

వ. మహాత్ములారా! యీ [2]పురావృత్తంబు త్రిరావృత్తంబుగా నుత్తమశ్లోకుం డగు కృష్ణద్వైపాయనువలన మున్నెఱింగినయది కల దత్తెఱం గఖిలంబులకు వచ్చు నట్లుగా విన్నవించెద వినుం డని సూతుం డిట్లనియె. 98

టీక. పురావృత్తంబు = తొల్లిటికథ; త్రిరావృత్తంబుగాన్ = మూఁడుసారులుగా; ఇందును ముమ్మాఱు చెప్పఁబడుట సూచితము. ఉత్తమశ్లోకుండు = గొప్పకీర్తికలవాఁడు.

### కాశీపురవర్ణన

శా. శీతాహార్యసుతాళినీవికచరాజీవంబు విశ్వేశ్వర
జ్యోతిర్లింగవిశుద్ధరత్నఖని మోక్షోపాయ[3]దుగ్ధాబ్ధివే
లావీరావని [4]డుంఠినామగజాలానంబు గంగామృత
స్రోతస్స్రుతిచంద్రగోళ [5]మన మించుం గాశి శ్రీరాశియై. 99

టీక. శీతా...వంబు - శీతాహార్యసుతా = హిమవత్పర్వతపుత్రిక యగు పార్వతి యను; అళినీ = ఆఁడుతుమ్మెదకు; వికచరాజీవంబు = వికసించిన తామరపువ్వు; విశ్వేశ్వర......ఖని = విశ్వేశ్వరజ్యోతిర్లింగ మను స్వచ్ఛమైన రత్నమునకు నిధియైనది; మోక్షో......వని = మోక్షసాధనమగు పాలసముద్రమునకు ఒడ్డు; డుంఠి...లానంబు = డుంఠి యను పేరుగల గజమునకు (వినాయకునకు) గజబంధనస్తంభము; గంగా...గోళము = గంగ యను నమృతప్రవాహము స్రవించుటకు చంద్రమండలము; శ్రీరాశి = సంపదల రాశి; అలం. రూపకము.

శా. ప్రాలేయాచలకన్యకావదనశుంభత్పద్మసౌరభ్యముం
గ్రోలంగల్గియుఁ [6]దుష్టి లేక మునిహృత్క్రోడాబ్జసౌగంధ్యలీ

1. చ. నాతఁడు. 2. చ. పురాతన. 3. చ. ముక్తాబ్ధి. 4. క. దుండి.చ. దుంఠి. 5. చ. చంద్రగోళి. 6. చ. దృష్టి.

-లాలాలిత్యమునుఁ గోరు నొక్క సితరోలంబంబు నైజాకృతిన్
డాలొందించుఁ బరాసులన్ భ్రమరకీటన్యాయరీతిన్ బురిన్. 100

టీక. ప్రాలేయా......సౌరభ్యమున్=మంచుకొండపుత్రికయగు పార్వతియొక్క ముఖ మను వికసించుచున్న పద్మముయొక్క పరిమళమును; క్రోలంగల్గియున్ = అనుభవింపఁజాలియు; తుష్టిలేక = తనివితీరక; ముని...లాలిత్యమున్ = మునుల హృదయములలోపలి పద్మముయొక్క పరిమళవిలాసపు మనోజ్ఞతను [మనోజ్ఞమైన మునుల హృదయకమల పరిమళముననుట]. సితరోలంబంబు= తెల్ల తుమ్మెద; (శివుఁడని భావము.) నైజాకృతిన్ = తన యాకారముతో; డాలొందించున్ =ప్రకాశింపఁజేయును. [హృత్క్రోడాబ్జ = హృదయములోపలి భాగమయిన కమలముయొక్క-అని పూర్వటీక.]

భ్రమరకీటన్యాయము = తుమ్మెద యొక కీటకమును దెచ్చి తనగూటిలో నుంచి, రొదచేయుచు, ఆ గూటిచుట్టును తిరుగుచుండును. కొంతకాలమున కా కీటకముకూడ భ్రమరమగునఁట; అట్లే ముని హృత్కమలములఁ జరించు శివుఁడు వారికందరికిని సారూప్యసిద్ధిని కలిగించునని భావము. అలం. రూపకము.

సీ. ఒకనాఁడుఁ [1]దీర్థోపయోగి కాని శఠుండు నౌఁదల ధరియించు నభ్రగంగ
నా ప్రొద్దు పోయిరాఁజనట్టి నిర్వేదయు భోగించు నైశ్వర్యము లెనిమిదియుఁ
బుష్కరాక్షులపొంతఁ బోని వర్షధరుండు దేహార్ధమునఁ దాల్చుఁ [2]దిగఁబోఁడి
నాయుధప్రభఁ గాంచి యలఁగు భీరువుఁ బూను వాఁడిముమ్మొనలవేఁడియలుగు
తే. మలినవర్తనుఁడును సుధాలలితమూర్తి, మించి వర్తించు; మతిలేనిమేదకుండు
మానివరుల్గలఁ జదివించు మట్టినీడఁ, బంచముఖపీఠ మే నోసరించెనేని. 101

టీక. తీర్థోపయోగి = పుణ్యతీర్థమున స్నానము చేసినవాఁడు; శఠుఁడు = మూఢుఁడు; ఔఁదలన్ = తలపైని; ఆప్రొద్దు = ఆరోజు; పోయి రాజనట్టి = కూటికిలేనట్టి; నిర్వేద = [నిరుపేద యనుటకు శ్లిష్టరూపముగా స్వతంత్రించి యిది వాడఁబడినది] మిక్కిలి బీదవాఁడు; ఐశ్వర్యము లెనిమిదియున్ = అష్టైశ్వర్యములను. (అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము ననునవి ఐశ్వర్యములు.)

పుష్కరాక్షులపొంతన్=(తామరపూలవంటికన్నులు గల) స్త్రీలవైపు; వర్షధరుండు = నపుంసకుఁడు; దేహార్ధమునన్=అఱమేనన్; ఆయుధప్రభన్ = ఆయుధములకాంతిని; అలఁగు = వెనుదీయు; వాఁడి......యలుగున్ = వాఁడియైన మూఁడుమొనలు గల తీక్ష్ణమగు నాయుధమును-త్రిశూలమును; మలినవర్తనుఁడును = చెడునడత కలవాఁడును; సుధాలలితమూర్తిన్=అమృతమువలె స్వచ్ఛమైనదేహము కల చంద్రుని; మించి = అతిక్రమించి; మేదకుండు = స్తబ్ధుఁడు-సోమరి; పంచముఖపీఠన్ = శివుని పట్టణమగు కాశియందు; మేను, ఓసరించెనేనిన్ = శరీరమును విడిచినయెడల.

మీఁదిపద్యమునఁ జెప్పఁబడిన శివసారూప్యమే యిందు విపులముగా వర్ణింపఁబడినది.

క. ఆనందకాననంబున, నానందకపాణి కేశవాహ్వయమునఁ బెం
పానం దగు ముక్తిప్రమదానందితహారనీలతరళోపముఁడై. 102

టీక. ఆనందకాననంబునన్ = కాశియందు; ఆ నందకపాణి = నందకమను ఖడ్గము కరమునఁ గల విష్ణువు; కేశవాహ్వయమునన్ = కేశవుఁడను పేర; పెంపు, ఆనన్, తగున్ = అతిశయముఁ బొందఁదగియుండును; ముక్తి...సముఁడై = ముక్తికాంతను తృప్తిపఱచిన హారమునందలి నల్లనైన మధ్యమణిని పోలినవాఁడై. అలం. అనుప్రాసము. ఉపమ.

1. క. తీర్థోపయోగి. 2. తీఁగఁబోఁణి. చ.

సీ. శ్రీకరోదయవధూలోకానన ప్రభానాటిత[1]బహుచంద్ర [2]నాటనంబు
సమ్మర్దగళిత[3]భూషారత్నమంజరీ [4]యోజితరథ్యా ప్రపూజనంబు
కైలాసశైలసంకాశసౌధనివేశ కౌముదీకవచితగగనతలము
విస్తీర్ణవిపణివిన్యస్తవస్తువ్రజ ప్రకటితరత్నగర్భాజఠరము
తే. విపులపవమానతాండవవేపమాన, లాంఛనధ్వజపట్టపల్లవలలామ
మాలికారచిత[5]కశాకృత్యహేళిహయము, దీపితం బగు శ్రీకాశికాపురంబు. 103

టీక. శ్రీక...నంబు-శ్రీకరోదయ=సంపదనుగలిగించు నుదయము కల కళలనీను; వధూలోకానన= స్త్రీలసమూహముయొక్క ముఖములయొక్క; ప్రభా = కాంతిచే; నాటిత = నాట్యముచేయఁబడిన; బహుచంద్రనాటనంబు = పెక్కురు చంద్రుల నటన కలది; అచటిస్త్రీల ముఖములు కళలఁజెలఁగుచు చంద్రులవలె నున్నవనియు, స్త్రీలిటునటు కదలుచుండఁగా పెక్కుమంది చంద్రులు నాట్యముచేయు చున్నట్లవి ప్రకాశించుచున్నవనియును భావము.

సమ్మర్ద...పూజనంబు-సమ్మర్ద = జనుల ఇఱుకటముచే; గళిత = జాఱిన; భూషా = నగలయందలి; రత్నమంజరీ = రత్నములచేతను, ముత్యములచేతను, యోజిత = కూర్పఁబడిన; రథ్యాప్రపూజనంబు = రాజవీథియొక్క పూజకలది; జనుల యొరయికవలన నగలలోని రత్నములు, ముత్యములు రాలి, అవి రథ్యను పూజించుచున్నట్లున్నవని భావము. [మంజరీ = గుత్తులతోడ అని పూర్వటీక.]

కైలాస...తలము - కైలాసశైలసంకాశ = కైలాసపర్వతముతో సమానమైన - తెల్లనైన; సౌధనివేశకౌముదీ = మేడల (కాంతి యనెడు) వెన్నెలచే; కవచితగగనతలము = ఆక్రమింపఁబడిన (ఆవరింపఁబడిన) ఆకాశముగలది; ఆ యూరిమేడలు కైలాసములవలె తెల్లగా నున్నవనియు, వానికాంతి గగనమెల్లెడల వ్యాపించెననియు భావము.

విస్తీర్ణ...జఠరము - విస్తీర్ణవిపణివిన్యస్త = విశాలములైన అంగళ్లయందు ఉంచఁబడిన (పేర్పఁబడిన); వస్తువ్రజ = వస్తుసముదాయముచే; ప్రకటిత = వెల్లడిచేయఁబడిన; రత్నగర్భాజఠరము = భూగర్భము కలది; కాశియందలి విశాలములైన యంగళ్లలో వివిధములగు రత్నములు అమ్మకమునకు పేర్పఁబడఁగా, అవి రత్నగర్భయగు భూమి లోపలిభాగ మిట్టిదని ప్రకటించుచున్నట్లున్నదని భావము.

విపుల...హయము - విపులపవమానతాండవ = ఎక్కువైన గాలియొక్క నాట్యము (కదలిక)చే; వేపమాన = కదలుచున్న; [వేపమాన = చలింపఁజేయఁబడుచున్న అని పూర్వటీక.] లాంఛనధ్వజ = చిహ్నమైన ధ్వజముయొక్క-జెండాయొక్క; పట్టపల్లవలలామమాలి = వలిపెపుఁబట్టువస్త్రముతోనైన టెక్కెపుఁ జివఱిభాగముచే; రచిత = చేయఁబడిన; కశాకృత్య = (కొరడాతో) త్రోలుట గల; హేళిహయము = సూర్యుని గుఱ్ఱములు కలది; ఆ పట్టణమునఁగల జెండాగుడ్డల చివఱిభాగములు గాలి కెగురుచు, సూర్యుని గుఱ్ఱములను కొరడాతో గొట్టి త్రోలుచున్నట్లున్నవని భావము; ఆ జెండాలు సూర్యమండలమువఱకు వ్యాపించి యున్నవనుట. అలం. ఉదాత్తము, ఉత్ప్రేక్ష, ఉపములు.

చ. జలజపరాగరాగరస సంగతమౌ పరిఖాజలంబులో
పలఁ బ్రతిబింబితంబు లగు బంగరుకోటకుఁ బెట్టినట్టి కొ
మ్మలచెలువంబునం బురిరమారమణీమణి యొప్పు రావియా
కుల మొలనూలు పెట్టెననఁ గోరి కనుంగొను వారు మెచ్చఁగన్. 104

1. ట. బహురత్న. 2. క. నాటనంబు. చ. నాటకంబు. త. నాటికంబు. 3. చ. భూషణ. 4. త. యోజక. 5. త. కశా.

టీక. జలజ...సంగతమా = తామరపూవుల పుప్పొడి రంగు నీటితోఁగూడిన; పరిఖాజలంబు లోపలన్=అగడ్తనీటిలో; కొమ్మలచెలువంబునన్ = కోటకొమ్మల చక్కఁదనముచే; పురిరమారమణీమణి = నగరశోభ యను స్త్రీ.

అగడ్తనీటిలో నందలి తామరపూవుల పుప్పొడి పడి నీరు పచ్చనయ్యెను; అందు బంగరు కోట కొమ్మలు ప్రతిఫలింపఁగా అవి రావియాకులవలె నున్నవి; వానిశోభను చూచువారికి 'నగరయనులక్ష్మి నాఁడుది రావియాకులమొలనూలు కట్టుకొన్నదేమో; అన్నట్లు తోఁచుచున్నదని భావము. అలం. ఉత్ప్రేక్ష.

క. పెరిగిన త్రివిక్రమేశ్వరు, చరణతులాకోటి యతఁడు సంహృతదేహ
స్ఫురణుం డగునపు డూడిన, కరణిం బురికోట యొప్పుఁ గనకమయంబై. 105

టీక. త్రివిక్రమేశ్వరు = త్రివిక్రమునియొక్క; చరణతులాకోటి = కాలికిఁదొడిగిన బంగరు టందె; సంహృతదేహస్ఫురణుండు = తగ్గింపఁబడిన శరీర ప్రకాశముకలవాఁడు - తగ్గించుకొన్న దేహముకల వామనుఁడు; ఊడినకరణిన్ = జాఱిపడినట్లుగా; కనకమయంబై = బంగారుమయమై.

త్రివిక్రముఁడు దేహమును పెంచి, ఒకపాదమును స్వర్గమునకుఁ బ్రసరింపఁజేసెను; అపుడా పాదమున బంగరుటందె యుండెను. అతఁడు పొట్టివాఁడుగ మాఱి పాదమును పొట్టిదిగా జేయఁగా వదులయిన అందె జారి నేలపైఁ బడినదఁట! ఆ బంగరుటందెవలె కాశీపట్టణపుఁగోట కనకమయమయి యున్నదని భావము. అలం. కల్పితోపమ.

చ. [7]పరిఖ నిజాశ్రయాంబుపరిపాటిఁ దలిర్పఁ బదాలుపన్నెబం
గరువున నైన *రాజగృహకల్పన కర్ణికగాఁగ గంధసిం
ధురములు తేఁటులై మొరయఁ దోరపుఁగొమ్మలు తేకు లట్లుగా
ధరయను కొల్నిలో [8]మొలచు తామరపూవనఁ గోట మీఁటగున్. 106

టీక. పరిఖ = అగడ్త; నిజాశ్రయాంబుపరిపాటిన్ = తనకు ఆధారమగు నీటిక్రమమును; తలిర్పన్ = ప్రకాశింపఁగా; రాజగృహకల్పన = రాజగృహపుఁగూర్పు; కర్ణికగాఁగన్ = తామర పూవులోని దుద్దుకాఁగా; గంధసింధురములు = మదపుటేనుఁగులు; మొరయన్ = ధ్వనిచేయఁగా; తోరపుఁగొమ్మలు = చక్కనికొమ్మలు; కొల్నిలో = కొలనిలో; [కొలనిలో అనుటకు 'కొన్నిలో' అనునది స్వతంత్రప్రయోగము.] మీఁటగున్ = అతిశయించి యుండును.

'భూమి యను కొలనిలో కోటయను తామరపూవు మొలచినది; అగడ్త దానికి చుట్టునుగల నీటిమేరవలె నున్నది. కోటకొమ్మలు తేకులవలె నున్నవి. బంగారురాజగృహము పూవులోని దిమ్మవలె నున్నది. ఆ పుష్పమున ఏనుఁగులు తుమ్మెదలయి రొద చేయుచున్న'వని భావము. అలం. ఉత్ప్రేక్ష.

క. పురిరాకొమరుల కీర్త్యం, బరవాహిని భుజగపురికిఁ బలువిడిఁ జని యం
[9]దిరవుకొన నెడము చాలమి, మఱలినతఱి బుగ్గలన నమరు సౌధంబుల్. 107

టీక. పురిరాకొమరుల = పట్టణములోని రాజపుత్రులయొక్క; కీర్త్యంబరవాహిని = కీర్తి యను నాకాశగంగ; భుజగపురికిన్ = నాగలోకమునకు - పాతాళమునకు; బలువిడిఁజని = మిక్కిలి పరాక్రమము (ఆర్భాటము)తో పోయి; ఇరవుకొనన్ = నిలుచుటకు - ఉండుటకు; ఎడము, చాలమిన్ = స్థలము చాలనందున; మఱలినతఱిన్, బుగ్గలు = మఱల వెనుకకుఁ దిరుగునపుడు పుట్టిన నీటిబుడగలు; సౌధంబుల్ = మేడలు; అమరున్ = ఒప్పును. అలం. ఉత్ప్రేక్ష.

6. బుడబుడనప్పు-శ. ర. 7. క. పరిఘ. *రాజ్య. సూర్య. 8. చ. మొలుచు. 9. చ. ఇరవుపూఁన.

ఉ. నాకనదీప్రదీప్తపులినంబుల నిచ్చలు నిల్పి సన్మునుల్
సైకతలింగపూజనము [1]సల్పుతఱిన్ తవణించుఁ †దత్పుతా
కాకలకింకిణీరవము ఘంటలు మ్రోఁగుట ధూపధూమముల్
పైకొలుపున్ [2]సమర్హ్వగతిఁ బర్వెడు గుగ్గులుధూపధోరణిన్. 108

టీక. నాక...నంబులన్ = గంగానదియొక్క ప్రకాశించు (స్వచ్ఛమైన) యిసుకతిన్నెలయందు; నిచ్చలు = ఎల్లవేళల; సన్మునుల్ = గొప్పఋషులు; సైకతలింగపూజనమున్ = ఇసుకతోఁ జేయఁబడిన శివలింగముల పూజ; సల్పుతఱిన్ = చేయుచునపుడు; తత్పుతాకాకలకింకిణీరవము = అచటి జెండాలకుఁ గట్టబడిన చిఱుమువ్వల మధురధ్వని; ఘంటలు మ్రోఁగుట = (పూజాసమయమునందలి) ఘంటానాదమును; తవణించున్ = పోలుననుట. ధూపధూమముల్ = పొగలవలెవ్యాపించు సాంబ్రాణి; సమర్హ్వగతింబర్వెడు = తగినరీతిని, వ్యాపించు; గుగ్గులుధూపధోరణిన్ = గుగ్గిలపుధూపపురీతిని; పైకొలుపున్ = కలుగఁజేయును; [ఇచట 'తవణించు = కలుగఁజేయునట్టి' అని పూర్వటీకలో 'తవణించు' అనునది కింకిణీరవమునకు విశేషణముగా, జెప్పఁబడినది.] అలం. ఉపమ.

చ. చదువులపుట్టినిండ్లు శమసంపద [3]యిక్కలు పుణ్యలక్ష్మికిన్
[4]మొదలిదివాణముల్ సురసమూహమునాఁకటపంట లంచితా
భ్యుదయనిసర్గబంధువులు ప్రోడతనంబుల [5]తాణముల్ పురిన్
బొదలెడు[6]భూసురోత్తముల భూరిపవిత్రశరీరవల్లరుల్. 109

టీక. శమసంపదయిక్కలు = శాంతిసంపదకు స్థానములు; మొదలిదివాణముల్ = ప్రధానములయిన కొలువుకూటములు - చోట్లు; సురసమూహమునాఁకటిపంటలు = దేవతలయాఁకలికి పంటలయినవి - యాగాదులొనర్చునవి; అంచితా...బంధువులు = ఒప్పుచున్న శ్రేయస్సునకు దగ్గఱిచుట్టములు; ప్రోడతనంబులతాణముల్ = నైపుణ్యములకు స్థానములు; భూసుర......వల్లరుల్ = బ్రాహ్మణుల పరమపవిత్రములైన తీగలవంటి దేహములు; పురిన్, పొదలెడున్ = వృద్ధిపొందును.

అచట బ్రాహ్మణులు విద్య, శాంతము, పుణ్యము, యాగాభిలాష, శ్రేయస్సు, నైపుణ్యము, పవిత్రత కలిగి వర్ధిల్లుచున్నారని భావము. [ఈ పద్యము మొదలుకొని నాలుగు పద్యములలో వరుసగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను చాతుర్వర్ణ్యము వర్ణింపఁబడుచున్నది.]

ఉ. పుట్టిననాఁటినుండియును బుణ్యులు సత్ఫల [7]మొందునంతకున్
బట్టినకార్య మీశ్వరుఁడు పట్టిన నీని దృఢప్రతిజ్ఞు లే
పట్టున [8]ధర్మముల్ విడని ప్రాజ్ఞులు తద్‌జ్ఞులపాలివేలుపుం
జెట్టులు పోర నైదుపదిసేయని శూరులు వీటిరాసుతుల్. 110

టీక. సత్ఫలము = తగినఫలము - కోరినకోరిక; పట్టినకార్యము = తలపెట్టిన పనిని; ఈశ్వరుఁడు, పట్టినన్ = శివుఁడు వచ్చి, పట్టుదలపట్టి అడిగినను; ఈని = ఈయని - విడువని; దృఢప్రతిజ్ఞులు = గట్టిపట్టుదల కలవారు; ఏపట్టునన్ = ఏయెడలను; ధర్మముల్, విడని = విండ్లను విడువని, న్యాయములను విడువని, ప్రాజ్ఞులు = సమర్థులు; తద్‌జ్ఞుల......జెట్టులు = తత్త్వజ్ఞులపాలిటి కల్పవృక్షములు - తత్త్వజ్ఞు లేమి యడిగినను వానినెల్ల ఇచ్చువారు; పోరన్ = యుద్ధమున; ఐదుపదిసేయని = చేతులు జోడించుకొనని - శత్రువులకు లొంగని ['ఐదుపదిసేయని = చేతులుజోడించుకొని పాఱిపోని' అని పూర్వటీక.] వీటిరాసుతుల్ = పట్టణములోని రాజపుత్రులు.

---

1. చ. తఱిన్. † తత్పుతాఁక. 2. చ. సమార్హ్వగతి. 3. త. యిక్కులు. 4. చ. మొదటి. 5. చ. తాణెముల్. 6. క. పొదలెడి. చ. పొదలెడు. 7. త. మందు. 8. ధర్మమ్ముల్వదని. త.

గీ. [1]బలయు రత్నాకరములు సంచులుగఁ జేసి, పొదిలినిధులెల్లఁగొని సంచి మొదలు చేసి
బేరమాడెడుపాటి యుదారలక్ష్మి, బచ్చు లప్పురి నున్నారు పెచ్చుపెరిగి. 111

టీక. బలయు = (భూమిని) చుట్టుకొని యుండు - భూమిసావరించిన; రత్నాకరములు = సముద్రములను; పొదివి = ఆక్రమించి; నిధులెల్లఁగొని = మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము అను నవనిధులను గ్రహించి; సంచిమొదలు,చేసి = మూలధనముగాఁజేసి-అసలుగా నుంచి; బేరమాడెడుపాటి = బేరమాడఁగల; ఉదారలక్ష్మిన్ = గొప్ప సంపదలతో; బచ్చులు = వైశ్యులు.

క. హారమాళిహీర మచ్యుత, చరణాబ్జమరందధార జాహ్నవి లోకే
శ్వరి తమసోదరి [2]యగునఁట, పురివెలమల భాగ్యమహిమఁ [3]బొగడఁగవశమే?

టీక. హారమాళిహీరము = శివునితలపైఁగల వజ్రమణి; అచ్యుత ..ధార = విష్ణుపాద పద్మమునందలి మకరందపుధార; [గంగ విష్ణుపాదోద్భవ యని ప్రసిద్ధి] జాహ్నవి = గంగ; పురివెలమలభాగ్యమహిమ = పట్టణములోని వెలమలు అను ఒకశూద్రజాతివారి గొప్పభాగ్యము;

శూద్రులు విష్ణుపాదోద్భవులగుట గంగానదికి సహోదరులగుదురని యభిప్రాయము. [పూర్వటీకలో 'వెలమల = శూద్రులయొక్క' అని యర్థము వ్రాయఁబడినది. వెలమపదము శూద్ర సామాన్యబోధకముకాదు; విశేషవాచకము.]

ఉ. భూమియు నాకసంబు తమపొంకమునన్ బిగియించు తత్పురీ
సామజకోటియున్నతికి సర్వజగంబులఁ గల్గు నున్నతుల్
భూమము డింది వామనతఁ బూనఁగ దక్షిణదిక్కునేనుఁగున్
వామన మంచు వాడఁదగవా? దగవాడరుగాక భూజనుల్. 113

టీక. పొంకమునన్ = పొందికచేత - ఆకారముచేత; బిగియించు = బిగిసికొనునట్లుచేయు - ఇఱికించు; తత్పురీ...యున్నతికిన్ = ఆపట్టణములోని ఏనుఁగుల ఎత్తునకు; భూమము, డింది=ఆధిక్యము, అణఁగి (పోయి); వామనతన్, పూనఁగన్ = పొట్టితనమును, పొందఁగా-పొట్టివి కాఁగా; ఆడఁదగవా?= పలుకుట న్యాయమా? భూజనుల్ = ప్రజలు; తగవాడరుగాక! = న్యాయము పలుకరుగదా !

"దక్షిణపుదిగ్గజమునకు వామనమని పేరు; అది పొట్టిదగుటచే ఆపేరు దానికి కలిగియుండ వలెను. కాని అది సరికాదు. ఏలయన - కాశిలోని ఏనుఁగులతో సరిపోల్చి చూచినచో తక్కిన యేనుఁగు లన్నియు వామనములే యగుచున్నవి; ప్రజల న్యాయముఁగ పాపము! దక్షిణదిగ్గజమునకు మాత్రము వామనమని పేరుపెట్టినారు" అని భావము. అలం. నిరుక్తి, అర్థాంతరన్యాసము.

చ. కెరలక క్రమ్మరింప [4]నడుగెంటనె నిల్చు నొకింత నూకినన్
శరనిధు లేడు[5]దాఁటు మెయి చాచి చివుక్కున నుక్కుమీరి సం
గరమున గాయమైన పతిఁ గాంచుఁ జలింపక తత్పురీహరుల్
హరిహయుమావు మున్ డిగిన యంబుధిరేవున వచ్చెనో సుమీ! 114

టీక. కెరలక = సంభ్రమింపక; క్రమ్మరింపన్ = మళ్లింపఁగా; అడుగెంటన్ = అడుగుపడిన మాత్రముననే; ['అడుగు+ఎఁడు'] ఒకింత = కొంచెము; నూకినన్ = త్రోలినను; శరనిధులు = సముద్రములు; మెయి = దేహము; చివుక్కునన్ = తటాలున; ఉక్కుమీఱి = ఎక్కువ శౌర్యము పొంది; సంగరమునన్ = యుద్ధమునందు; గాయమైన; పతిన్ = గాయపడిన యజమానుని; తత్పురీహరుల్ =

1. చ. జలియు. ట. బలియు. 2. క. యూనఁ. చ. యగుననుట. 3. క. పొగడఁగ.
4. చ. నడి. 5. త. దాటి.

ఆ (కాశీ) పట్టణములోని గుఱ్ఱములు; హరిహయుఁమావు = ఇంద్రునివాహనమైనయుచ్చైశ్శ్రవము; మున్, డిగిన = పూర్వము దిగివచ్చిన; అంబుధిరేవునన్ =(పాల) సముద్రపురేవునుండి; వచ్చెనోసుమీ = వచ్చెనో యేమో! ఆయూరి గుఱ్ఱములు ఉచ్చైశ్శ్రవమువలె పాలసముద్రమునఁ బుట్టి వచ్చెనో యన్నట్లు మేలిగుణములు కలిగి యున్నవని భావము. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. సారథి ఛాందసుండు బడి సాగదు చక్రయుగంబు ప్రాతపం
చారపుగుఱ్ఱముల్ రథియు శౌర్యమునం దరమాని సాత్మవి
స్తారము [1]ఖండఖండములు తానఁట మాసరి యంచుఁ దత్పురిం
దేరులు నవ్వు శంకరుని తేరిని కేతనకింకిణీధ్వనిన్. 115

టీక. ఛాందసుండు=వేదజడుఁడు - నేర్పులేనివాఁడు; బడిన్ = క్రమముగా; ప్రాఁతపంచారపు గుఱ్ఱముల్ = ప్రాఁతవ్యాపనముగల -(మార్పులేని) ప్రాఁతరీతినడకగల గుఱ్ఱములు; అఱమానిసి = సగము వీరుఁడు అర్ధనారీశ్వరుఁడు; (లేక) సగమాఁడుది; ఆత్మవిస్తారము = తనవిరివి-తన స్వరూపమంతయు; ఖండఖండములు = (అతుకులువేసిన) ముక్కముక్కలు- [శతాంగము కాన.] తేరులు = రథములు; శంకరుని తేరిని = (త్రిపురాసురసంహారమునకు బయలువెడలినపుడు) శంకరునికి రథమైన భూమిని; కేతనకింకిణీధ్వనిన్ = తమజెండాలఁ గల చిఱుగంటలధ్వనిచే, శివుఁడు త్రిపురాసురసంహారమునకు బయలు దేరినపుడు భూమి యాతని రథమయ్యెను; బ్రహ్మ సారథిగను, సూర్యచంద్రులు చక్రములుగాను, వేదములు గుఱ్ఱములుగను మాఱినవని పురాణగాథ. బ్రహ్మ ఛాందసుఁడనఁగా వేదములు చదువుకొన్నవాఁడనియును, రథచక్రములు సూర్యచంద్రులగుటచే ఒకదానితఱువాత నింకొకటి నడుచునుగాని, రెండు చక్రములును ఒకసారిగా నడువవనియు, నాలుగు వేదములును గుఱ్ఱము లగుటచే అవి నాఁటినుండి, నేఁటివఱకును ఎట్టిమార్పును లేక వెనుకటిపద్ధతిలోనే యున్నవనియు, రథముయజమాని శివుఁడగుటచే అతఁడర్ధనారీశ్వరుఁడగుట సగముమగతనము (పౌరుషము) కలవాఁడనియుఁ, భూమి రథమగుటచే నది ఖండఖండములుగా నుండును (నడుమ నీరు, కొండలు మొదలగునవి యుండుట) గాని ఒకేచోట పూర్తిగ ఉండదనియు [ఖండములన భాగములనియు చెప్పవచ్చును] నర్థమును గ్రహింపవలయును.

సాధారణముగ రథము అతుకులులేక యుండును; సారథి నేర్పరి కావలెను; రెండు చక్రములు సరిగా సాగవలెను; గుఱ్ఱములు నూతనరీతుల నడకలను నేర్వవలెను; రథికుఁడు పూర్తిపౌరుషము కలిగి యుండవలెను. ఆయూరిలోని రథము లిట్లున్నవని భావము. ‘ఈపద్యమున ‘అరమానిసాత్మవిస్తారము’ అని ఇకారముమీఁద సంధి చేయఁబడినది; అది స్వతంత్రప్రయోగము.

[వెనుకటి టీకాకారులు ‘ప్రాఁతపంచారపు = మిక్కిలి ప్రాతవైన - బహుకాలమునాటివైన = మిక్కిలి ముసలివైన -’అని అర్థమును వ్రాసియున్నారు. అందుల కాధారము మృగ్యము. ఇచట అన్నియును వయసుమీఱినవేకదా !] అలం. వ్యతిరేకము.

క. వేటాఱుతునియలుగ నరిపాటన [2]మొనరించు బాహుపాటవగరిమన్
మేటు లగు పోటుమగ లవ్వీటన్ విహరింతు రుగ్రవిక్రము లగుచున్. 116

టీక. వేటు, ఆఱుతునియలుగన్ = ఒక్కవ్రేటునకు ఆఱు తునక లగునట్లుగా; అరిపాటనము, ఒనరించు = శత్రువులను నఱకుట చేయు- శత్రువులను సంహారించునట్టి; బాహుపాటవగరిమన్ = గొప్ప భుజబలసామర్థ్యముచేత; మేటులగు = అధికులైన; పోటుమగలు = యుద్ధవీరులు: ఉగ్రవిక్రము లగుచున్ = భయముగొల్పు శౌర్యముకలవారై. మీఁది నాల్గు పద్యములలోను వరుసగా ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు, కాల్బలము అను చతురంగబలము వర్ణింపఁబడినది.

8. చ. చూడఖండములు. 9. క. మొనరించి. చ, మొనరించు.

సీ. మొలకచీఁకటి జలజలరాల్పఁగా రాదె నెఱులు మించిన వీరికురులయందు
కెరలించి యమృతంబు [1]గిలకొట్టఁగా రాదె ముద్దు*చూపెడివీరి మోవులందు
పచ్చబంగారు కుప్పలు సేయఁగా రాదె గబ్బిమీఱిన వీరిగుబ్బలందు
పండువెన్నెలతేటఁ బరిఢవింపఁగ రాదె నగవు [2]గుల్కెడి వీరి మొగములందు
తే. ఔర! కరవాఁడిచూపుల †యాఘుళంబు, బాపురే! భూరికటితటీభారమహిమ
చాఁగు! మదమందగమనలక్షణము లనఁగ, నేర్పుల మించు రప్పురివారసతులు.

టీక. మొలకచీఁకటి = అంకురించిన (దట్టమైన) చీకటి; రాల్పఁగారాదె! = రాలునట్లు చేయ వచ్చునుగదా! నెఱులుమించిన = వంకరలుతిరిగిన; కెరలించి = రేఁపి; మోవులందున్ = పెదవులయందు; గిలకొట్టఁగారాదె = వ్రేళ్లతోఁ జిలుకరాదా? కుప్పలు = ప్రోఁగులు; గబ్బిమీఱిన = మదించిన-నిక్కఁ బాఱియున్న; గుబ్బలందున్ = స్తనములందు; పరిఢవింపఁగరాదె! = ధరించునట్లు (కలుగునట్లు) చేయ వచ్చునుగదా! ఔర! = ఆహా! (ఆశ్చర్యసూచకము). కర.....యాఘుళంబు=మిక్కిలి వాఁడిచూపుల ప్రసారము; బాపురే! = సెబాసు! భూరి...మహిమ = పెద్దపిరుదులగొప్పతనము; చాఁగు! = భళీ!; మద...లక్షణములు=మదముచే మెల్లనైన నడకలు; అప్పురివారసతులు=ఆపట్టణములోని వెలయాండ్రు.

వారస్త్రీల కురులు చీఁకట్లవలె నల్లనివనియు, మోవి యమృతపుగనియనియు, గుబ్బలు బంగారు కుప్పలవలె నున్నవనియు, ముఖకాంతులు వెన్నెలరీతి నున్నవనియు, వారు సరసులపై వాఁడిచూపులను ప్రసరింపఁజేయుచు, పెద్దవైన పిరుదులబరువున మెల్లమెల్లన నడచుచుందురనియును, వారు మిక్కిలి నేర్పులుకలవారనియు భావము.

కురుల ముడి విప్పఁగా చీకట్లు జలజల రాలుననియు, మోవిని (పంట నొక్కి రేపఁగా) నమృతము లభించుననియు, గుబ్బలను నొక్కి బంగారు కుప్పలుగా చేయవచ్చుననియు, మోమున మోముఁజేర్చి యా తేటను పొందవచ్చుననియు గూఢమగు చమత్కారము.

సీ. మారుతాహతి రాలు నారికేళఫలాళి[3]నిడిసి [4]జల్లించుపుండ్రేక్షురసము
చిలుకపోటులచేతఁ [5]జిరిగిన సహకారఫలములఁ [6]దొరఁగెడి పచ్చితేనె
చిక్రోడ[7]దంష్ట్రలు చెక్కు సుగంధియనంటిపండ్లనుగాఱు నవ్యసుధయుఁ
బాకవేగారంభపరిపాటిఁ దమయంతఁ బగిలిన పనస*గొబ్బండ్లబేస
తే. [8]మేకమై కాలువలుగట్టి యే[9]హేళిఁ, బఱఁగ నందలిక్రియ్యాట పసిమి తేటఁ
బండు నవ్వీట ముక్కారుఁ బసిఁడిగాఁరు,సగసఖాన్యంబు మించి రాజసపు[10]జేల.

టీక. మారుతాహతిన్ = గాలిదెబ్బచే; రాలు = రాలి, క్రిందపడిన; నారికేళఫలాళిన్ = కొబ్బరిబొండ్లములచే; ఇడిసి = చీలి; జల్లించు = కాఱు; పుండ్రేక్షురసము = (సామాల) ఎఱ్ఱచెఱకుల రసము; [అనఁగా కొబ్బరిచెట్లఁ బండిన బొండ్లములు గాలికి రాలి క్రిందనున్న చెఱకుతోఁటపైఁ బడఁగా-ఆదెబ్బకు చెఱకుగడలు చీలిరసమును స్రవించుచున్నవనుట.]

చిరిఁగిన = తూట్లువడిన; సహకారఫలములన్ = తీయమామిడిపండ్లనుండి; తొరఁగెడి = కారుచున్న; పచ్చితేనె = క్రొత్తరసము; చిక్రోడదంష్ట్రలు = ఉడుతకోరలు; చెక్కు = గీరు; సుగంధి

1. చ. గిలుకొట్టు. *జూపెడి శ. ర. 2. చ. లీనెడు. † యవఘుళంబు. శ. ర. 3. త నిడిసిరి. 4. క. జల్లించు. చ. జల్కించు. 5. త. జిరిదిన. 6. దొరుగెడి. చ. 7. చ. దంష్ట్రలఁజెక్కు. ట. దంష్ట్రలు చెక్కుగుద్దినయ. *క్రొంబండ్ల. క. గొబ్బండ్ల. శ. ర. సూ. 8. చ. యేకమై. 9. చ. హేళి. 10. త. జేలు.

యనంటిపండ్లను = కప్పురపుటనఁటిపండ్లనుండి; నవ్యసుధ = క్రొత్త యమృతము; పాకవేగారంభపరిపాటిన్ = వేగముగాఁ బండఁ బ్రారంభించు క్రమమున - వేగముగాఁ బండినదనుట; పనసగొబ్బండ్లపేసము = గొప్పపనసపండ్ల గుజ్జు; ఏకమై = కలిసి; ఏకహేలన్ = ఒక్కుమొగిని; పఱవన్ = ప్రపహింపఁగా; క్రియ్యాటన్ = క్రిందియూటచేత; పసిమితేటన్ = బంగారు (పచ్చని) కాంతితో; ముక్కారున్ = మూఁడు కాలములును - మూఁడు పంటలును; పసిఁడిగారు = బంగారమువంటి; రాజనవుఁజేలన్ = మేలురకపు పంటనేలలందు; పండున్.

ఆయూరి పంటపొలములకుఁ గల కాలువలందు చెఱకురసము, మామిడిపండ్లరసము, అనఁటిపండ్ల గుజ్జు, పనసపండ్లగుజ్జు ప్రవహించి చేలను నిండి సారవంతముల చేయుటచే సత్సరమునకు మూఁడు పంటలును సమృద్ధిగాఁ బండునని భావము.

చ. తెలతెలవాఱ నొయ్య నరుదెంచి నిశాంతరతాంతతాంతలా
చెలువల కింపుగా మెలఁగి చెక్కులఁగూరిన చూర్ణకుంతలా
వళి సరళంబుగా జడిసి వాడినసెజ్జలమీఁదిప్రావిరుల్
దొలఁగఁ బ్రభాతవాయువులు దోఁచుఁ బురిం బరిచారికాకృతిన్. 119

టీక. ఒయ్యన్ = తిన్నఁగా; నిశాంతరతాంతతాంతలు = పేనుపజాముసందలి భోగమైన వెనుక అలసిపోయినవారు; చెలువలకున్ = స్త్రీలకు; ఇంపుగాన్ = ఆనందము కల్గునట్లు; మెలఁగి = సంచరించి; చెక్కులఁ గూరిన = చెక్కులను పొందిన - చెక్కులపై జాఱిన; చూర్ణకుంతలావళిన్ = ముంగురులను; జడిసి = మీఁదికి తొలఁగఁద్రోసి. వాడిన = వాడిపోయిన; సెజ్జలమీఁది ప్రావిరుల్ = పడుకలమీఁది ప్రాఁతపువ్వులు; తొలఁగన్ = తొలఁగి క్రిందఁ బడిపోవునట్లుగా; పరిచారికాకృతిన్ = సేవకురాండ్రవలె; ప్రభాతవాయువులు, తోఁచున్ = (ప్రాతఃకాలవాయువులు) - పిల్లగాలులు, ఉండును.

ఉదయమున వీఁచు పిల్లవాయువులు రతాంతమున-మిగుల శ్రమఁజెందిన స్త్రీల యాయాసము పోవునట్లు వీఁచును. చెక్కులపై జాఱిన ముంగురులను వెనుకకుఁ ద్రోసి సరిచేయును; శయ్యలపై వాడియున్న పూవులను త్రోసివేసి, పడుకలను శుభ్రపఱచును; ఇట్లవి పరిచారికలవలె నాయుువిదలను సేవించును. అలం. ఉపమ.

## అగస్త్యమహర్షి సభార్యుండై సామిమలకు వెడలుట

సీ. ఏవంవిధఖ్యాతి నెసఁగు [1]శ్రీవారాణసీపట్టణంబున సిద్ధతటిని
పొంత సిద్ధాశ్రమంబు ఘటించి యందులోపాముద్రయునుదానుఁ బ్రభయుఁదరణి
యునుబోలెఁ బాయనియనుకూలదాంపత్యమునఁ బొల్చి ముని కోటి తను భజింపఁ
దారకబ్రహ్మవిద్యారహస్యజ్ఞాత చుళుకితాంభోరాశి కలశసూతి
తే. బ్రహ్మనిభమూర్తి పెక్కు[2]కల్పంబు లుండి, విబుధయూథంబు ప్రార్థింప వింధ్యశిఖరి
విక్రమాటోప ముడఁప నవ్వీడు వెడలెఁ, బరవిపత్ప్రీతికారతత్పరులు ఘనులు.

టీక. ఏవంవిధఖ్యాతిన్, ఎసఁగు = ఇట్టి గొప్పతనమున నతిశయించునట్టి; వారాణసీపట్టణమునన్ = (వరుణ, అసి యను రెండు చిన్ననదుల నడుమఁగల) కాశీపట్టణమున; సిద్ధతటినిపొంతన్ = గంగగట్టున, సిద్ధాశ్రమంబు = యోగులు వసించు స్థలము; ఘటియించి = ఏర్పఱచి; ప్రభ = ప్రకాశము - కాంతి; తరణి = సూర్యుఁడు; అనుకూలదాంపత్యమునన్ = భార్యాభర్తల పరస్పరము నచ్చిన దంపతులధర్మములచే; పొల్చి = ఉండి; మునికోటి = మునులగుంపు; తను, భజింపన్ = తన్ను సేవింపఁగా; తారకబ్రహ్మవిద్యారహస్యజ్ఞాత = (నరులను సంసారమునుండి తరింపఁజేయు తత్త్వవిద్యా

1. వారణా 2. చ. గల్పంబు.

రహస్యము నెఱింగినవాఁడు, చుళికితాంభోరాశి = పుడిసిట నుంచఁబడిన సముద్రము కలవాఁడు; కలశసూతి = కలశమునఁ బుట్టిన అగస్త్యుఁడు; బ్రహ్మనిభమూర్తి = బ్రహ్మతో సమానుఁడు; పెక్కుకల్పములనుండి = పెక్కువేల యుగములనుండి; విబుధయూథంబు = దేవతలసమూహము. [ఇచట విబుధయూథమనుట యప్రసిద్ధము; పశువులగుంపు 'యూథము' అనుట ప్రసిద్ధము.] వింధ్య...పము = వింధ్యపర్వతముయొక్క విక్రమవిజృంభణమును; ఆడఁపన్ = అణఁచివేయుటకు అవ్వీడు, వెడలెన్ = ఆ కాశీపట్టణమునుండి బయలుదేరెను. ఘనులు = గొప్పవారు; పర...రులు = ఇతరుల ఆపదలకు ప్రతీకారముచేయుటయందు ఎక్కువ ఇష్టముకలవారుకదా!

[పూర్వము వింధ్యపర్వతము మేరువుపై నసూయపడి సూర్యచంద్రుల మార్గము నరికట్టుచు రోజుకు రోజు ఎత్తుగా పెరుగుచుండెను; అపుడు దాని గర్వము నడఁపవలె నని దేవతలు సమర్థుఁడగు నగస్త్యునిఁ గోరిరి. అతఁడు ఉత్తరపుదిక్కుననుండి దక్షిణమునకు వచ్చుచు దారిలో వింధ్యమును డాసెను; ఆ కొండలఱేఁడు మునికి సాష్టాంగనమస్కార మొనరించెను: 'నేను మఱలి వచ్చువఱకును నీ విట్లే యుండవలెనని యగస్త్యుఁ డా కొండ నాజ్ఞాపించి దక్షిణమునకుఁ బోయెను; ఇది పురాణగాథ.] అలం. ఉపమ.

తే. అబ్ధితోఁగూడ మును గ్రోల నౌర్వవహ్ని,యుదరబిలమున నొకచోట నుండియుండి
జటిలవరునకుఁ గద్రూజకటకకటక,విగమతాపమిషంబున వెడలె నపుడు. 121

టీక. అబ్ధితోఁగూడన్ = సముద్రముతోఁ గలిపి; మును గ్రోలుసౌర్వవహ్ని = పూర్వము గ్రహించిన బడబాగ్ని; ఉదరబిలమునన్=పొట్టయందు; జటిలవరునకున్ = మునిశ్రేష్ఠునకు - అగస్త్యునకు; కద్రూజ......మిషంబునన్ = పాములు కడియములుగాఁ గల శివుని నెలవగు కాశిని విడుచుట వలనఁ గల్గిన తాపమునెపమున; వెడలెన్ = బయలువెడలెను.

[అగస్త్యుఁడు సముద్రమునంతను పుడిసిటఁబట్టి త్రాగెనని పురాణగాథ.] అలం. అపహ్నుతి.

చ. పుడిసిటఁ[1]బట్టె నేతపసి పొంగు పయోనిధి నిల్వలానుజున్
కడుపున వ్రేల్చె నేతపసి గాఢతపోనిధి నయ్యగస్త్యునిన్
బొడఁగని వింధ్యభూధరము పొంకము బింకము దక్కి [2]నేలలో
నడఁగె [3]బిలాంతరస్థలి భయాహతిఁ[4] జొచ్చు కుళీరమో యనన్. 122

టీక. ఇల్వలానుజున్ = ఇల్వలుని తమ్ముఁడగు వాతాపి యను రాక్షసుని, వ్రేల్చెను = ఆహుతిగాఁ జేసెను; గాఢతపోనిధిన్ = గొప్ప తపస్వి యగువానిని, పొడఁగని = చూచి; వింధ్యభూధరము = వింధ్యపర్వతము, పొంకముబింకము, దక్కి = గరువపు బిగువును విడిచి; బిలాంతరస్థలిన్ = రంధ్రపు లోపలిభాగమును; భయాహతిన్ = ఎక్కువభయమున; చొచ్చు = ప్రవేశించు - దూరు; కుళీరమో యనన్ = ఎండ్రియో యనునట్లు.

అగస్త్యునిఁజూచి వింధ్యాద్రి గర్వముడిగి, భయపడి నేలలో లీనమైనదని భావము. అలం. ఉత్ప్రేక్ష.

శా. ఆ వింధ్యాచల మట్లు వంధ్యనిజగర్వారంభమై యుండ న
గ్గోవిందాభుఁ డభంగురోదయనిధిం గొల్లాపురీలక్ష్మి ర
క్షోవిద్వేషిభుజాంతరాళపదవీ శుద్ధాంతసైరంధ్రికిన్
సేవించె న్నుతియించె నాగమకళాసిద్ధాంతశుద్ధోక్తులన్. 123

టీక. వంధ్యనిజగర్వారంభమై = వ్యర్థమైన తన గర్వపు పడిగలదై; అగ్గోవిందాభుఁడు = ఆ గోవిందుని దీప్తివంటి దీప్తికలవాఁడు - అగస్త్యుఁడు; అభంగురోదయనిధిన్ = గొప్ప అభ్యుదయ

1. చ. బెట్టె. 3. ట.భీతితో. 3. చ. నిలాంతర. 4. చ. నీగు.

మునకు ఉనికిపట్టయినదానిని, కొల్లాపురీలక్ష్మిన్ = కొల్లాపురమందలి లక్ష్మీదేవిని; రక్షో...నైరంధ్రికన్ = రాక్షసులకు శత్రువైన విష్ణుదేవుని వక్షఃస్థలమనెడి యంతఃపురమునకు రక్షకురాలగుదానిని, ఆగమ...... న్తులన్ = వేదప్రతిపాదిత సిద్ధాంతముల పరిశుద్ధవాక్యములచే, నుతియించెన్ = స్తోత్రముచేసెను; అలం. ఉపమ, రూపకము.

క. ఆపరమేశ్వరి తను నా,జ్ఞాపింపఁగ సామిమలకు షణ్ముఖపదసే
వాపరతఁ జనియె నమ్ముని, లోపాముద్రయును శిష్యులును సేవింపన్. . 124

టీక. ఆపరమేశ్వరి = ఆ (లక్ష్మీ)దేవి; సామిమలకున్ = (కుమారస్వామి యుండు) స్వామి శైలమునకు; షణ్ముఖపదసేవాపరతన్ = కుమారస్వామి పాదసేవయందలి యాసక్తిచే; లోపాముద్ర = అగస్త్యునిభార్య.

వ. అట్లు చనువవసరంబున. 125

టీక. చనువవసరంబునన్ = వెళ్ళునప్పుడు.

సీ. కొనలఁ జుట్టినతీఁగె పెనచేఁ[1]జమరవాలపరికరంబుల[2] జుట్టు పట్టి తిగిచి
కమ్మ [3]సంపంగిమొగ్గల నిరుగడ రాయు[4]జేగురుఁదిరికలఁ జెంపఁబెట్టి
[5]లేఁడికి నోడిరాయు శిలీముఖశ్రేణిచే మేలిపూ[6]గుత్తుల [7]రాల రువ్వి
[8]కబళనత్వరమాణకరటి[9]తుండకుఁలచేఁగదళికాతరువులఁ గాళ్లఁ దాఁచి

తే. నెఱికురులుఁ జారునాసలు నిబ్బరంపు,గుబ్బచన్నులుఁ దొడల పెక్కువయుఁగలుగు
మృగవధూజీవశుద్ధాంతమీననయనవ, లర్చనలుచేసి కొలిచి [10]రయ్యాలువుఁగల.

టీక. ఆటవికస్త్రీలను వర్ణించు నీ సీసపద్యపు నాలుగు పాదములందును వరుసగా వారి కురులకు, ముక్కులకు, గుబ్బలకుఁ, దొడలకు గల యుపమానములు చూపఁబడి, సరికావని తిరస్కరింపఁ బడినవి. కొనలఁజుట్టినతీఁగె పెనచేన్ = చివఱలందుఁ బెనవైచిన తీఁగలవలన; చమర......జుట్టుపట్టి = చమరమృగముల తోఁకలయందున్న జుట్టును (వెండ్రుకలను) పట్టి (కట్టి;); తిగిచి = ఆకర్షించి-లాగి; ఇచట తీఁగలును, చమరమృగములతోఁక వెండ్రుకలును చెంచెతల కురులకు ఉపమానములు; ఆ కురులతోడి సామ్యమునకు ఆ రెండును పెనఁగులాడుచుండఁగా అందొకదానిచే నింకొకదానిని బాధింపఁ జేసి, (తుదకు ఆరెండిటిని) అవమానించుట యిందు వర్ణితము; ఈ పద్ధతి యిందలి నాల్గుపాదములందును కనఁబడుచున్నది. [చమరవాలములవెండ్రుకలకు తీఁగలను జుట్టి, లాగి వానిని బాధించెనని భావము.]

ఇఁక నీ నాల్గు పాదములందును సహార్థమున 'తోడ'కు బదులుగ 'చేన్' వాడఁబడినదని గ్రహించిన యెడల 'తీఁగలపెనతోఁగూడ చమరమృగవాలచికురములను లాగి బాధించి యవమానించెనని చెప్పవచ్చును.

[పంచమ్యర్థమునను, సహార్థమునను 'చే' వాడుట రామకృష్ణునికవితయందుఁ బెక్కుచోట్లఁ గలదు.] తీఁగలను వెండ్రుకలను లాగుట ప్రసిద్ధమేకదా!

కమ్మసంపంగిమొగ్గలన్ = కమ్మనైన సంపెగమొగ్గలవలన; ఇరుగడరాయు=ముక్కునకు రెండు ప్రక్కలను - రెండుచెంపల నొరసికొను; జేగురుఁ దిరికలన్ = ఎఱ్ఱనిచిగుళ్లను; చెంపఁబెట్టి = చెంపపై నొక్క పెట్టు పెట్టి;

---

1. చ. పెనచెఁజమర. 2. చ. జుంచు. క. జుట్టు 3. క. సంపెగల. చ. సంపంగి. 4. క. జేగురుఁదిరికలు. చ. జిగురుటారికలచే. ట. జిగురుబేరికలచే. 5. చ. లెడెనకో. ట. లెనవెలోడియుం. త. వెరవెలోడియు. 6. క. గుత్తులు. చ. గుత్తుల. 7. చ. రాలురువ్వి. 8. త. కబళన. 9. మండలము. త. 10. రయ్యాలి మగని. చ.

సంపంగిమొగ్గలును, జేగురుఁదిరికలును నాసిక కుపమానములు; నాసికాసామ్యమునకయి పరస్పరము పెనఁగులాడు నారెంటిలో సంపంగిమొగ్గలచే తిరికలకుఁ జెంపపెట్టు పెట్టించెనని యర్థము. ఆ రెండును అవమానింపఁబడిన వనుట గత్యార్థము. "మొగ్గలన్" అనుచో సహార్థమును గ్రహించి వెనుకటిరీతిని 'సంపఁగిమొగ్గలతోఁగూడ జేగురుఁదిరికలకు చెంపపెట్టు లభించెనని చెప్పవచ్చును.

లేడికి నొడియు = జింక నాకర్షించు - జింకలను కొట్టు; శిలీముఖశ్రేణిచేన్ = మిట్టకోలలవలన; మేలిపూగుత్తులన్; రాల, రువ్వి = రాలి పడిపోవునట్లు కొట్టి, రాళ్లతో కొట్టి;

బంతివలె గుండ్రముగా నుండు మిట్టకోలల చివటిభాగములును, పూలగుత్తులును స్తనముల కుప మానములు; స్తనసామ్యము నాకాంక్షించిన యారెంటిలో-మిట్టకోలలచేత పూలగుత్తులు రాలునట్లు కొట్టి కొంచెపఱచెనని యర్థము. 'శిలీముఖశ్రేణిచే'అను తృతీయాంతమునకు సహార్థము గ్రహించినపుడు మిట్టకోలలతోఁబాటు పూలగుత్తులను రాలిపడునట్లు చేసెనని చెప్పవచ్చును. మిట్టకోలలయగ్రభాగములు బంతులవలె నుండుటవలన వానిని ప్రయోగించినయెడల లక్ష్యము దెబ్బతినునుగాని; దానికిఁ గుచ్చుకొని పోదు. కావుననే తోళ్లఁగోరినవారు జింకలఁ జంపుట కిట్టి బాణములనే యుపయోగింతురు. మిట్టకోలలు (తిరిగి) క్రిందఁబడుటయు, పూగుత్తులు రాలి పడుటయు స్వాభావికములు.

కబళన...చేన్ = కబళించుటయందు వేగిరపాటు కల ఏనుఁగులతొండములవలన; కదళి కాతరువులన్ = అరఁటిబోదెలను; కాళ్లఁదాఁచి = మొదలంట పడఁద్రోసి; ఏనుఁగుతొండములు, అరఁటిబోదెలును తొడలకు ఉపమానములు; తొడల సామ్యమును గోరు నా రెంటిలో ఏనుఁగుతొండ ములచేత అరఁటిచెట్లమొదళ్లను కట్టించి పీకించెనని భావము. ఇచటి 'తుండములచే' అను తృతీయాంత మునకు సహార్థమునంగీకరించినచో 'ఏనుఁగుతొండములతోఁబాటు(వానిని తన్నినట్లే) అరఁటిబోదెలను తన్ని'అని యర్థమును చెప్పవచ్చును.

నెఱికురులు=అందమైన కేశములు; చారునాసలు=చక్కనిముక్కులు; నిబ్బరంపు గుబ్బచన్నులు= సడలని - గట్టివైన గుండ్రని చన్నులు; తొడలపెక్కువయున్ = తొడల అతిశయమును; మృగ... నయనలు = మృగములను చంపి జీవించు బోయవాండ్రయాడువారు; అర్చనలుచేసి = పూజించి; అయ్యాలుమగలన్ = భార్యాభర్తలైన యా లోపాముద్రాగస్త్యుల నిరువురను; కొలిచిరి = సేవించిరి.

ఆబోయతల కురులు తీగలవలెను, చమరవాలపువెండ్రుకలవలెను గలవనియు, వారినాసికలు సంపెఁగమొగ్గలవలెను,ఎఱ్ఱనిచిగుళ్లవలెను ఉన్నవనియు, స్తనములు మిట్టకోలలచివరిభాగములను, పూలగుత్తు లను బోలుచున్నవనియు, తొడలు ఏనుఁగుతొండములకును, అరఁటికంబములకును సరియనియు భావము.

ఆస్త్రీలు తమకేశములందు నవరములను కూడఁ బెట్టుకొన్నారనియు, జేగురుఁదిరికలను చెంపలకు అలంకారములుగ పెట్టుకొన్నారనియు, మేలిపూగుత్తులను వక్షములపై నదిమి అలంకరించుకొన్నా రనియు, వారు కదళికాండములను కాళ్లతోఁదన్నుచు, చమత్కారముగా నడచి వచ్చుచుండిరనియు చమత్కారము స్ఫురించుచున్నది. అలం. వ్యతిరేకము, క్రమము.

వ. [1]ఇట్లు ప్రతిదినప్రయాణంబుల నమ్మిథునంబు కుంతలదేశప్రాంతంబు గదిసిన. 127

127. ప్రతిదినప్రయాణంబులన్ = రోజు, రోజుమెల్లగా చేయు ప్రయాణములచేత; అమ్మిథు నంబు = ఆ దంపతులు; ప్రాంతంబు = చేరువ; కదిసిన = సమీపింపఁగా.

క. పంపాతరంగరింఖణ, ఝంపాసం[2]పాద్యమానజలకణరేఖా
సంపాతశీతలానిల, సంపద [3]వొదలించెఁ బరమశైవోత్తంసున్. 128

128. పంపా......సంపద-పంపాతరంగ = పంపానదిలోని యలలయొక్క; రింఖణ = ఖార లికలతోడి; ఝంపా = దూకుళ్లచేత; సంపాద్యమాన = పుట్టింపఁబడుచున్న; జలకణరేఖా = నీటి

1. క, ఇట్టులను. చ. ఇట్లుప్రతి. 2, క. పాద్య. చ. పాద్య. 3. చ. కొదవించె. త. పోషించె.

తుంపరలగుంపుయొక్క; సంపాత = పాటువలన; శీతల = చల్లనైన; అనిల = వాయువుయొక్క; సంపద=కలిమి; పరమశైవోత్తంసున్ = పరమశివభక్తులలో శ్రేష్ఠుఁడగు నగస్త్యుని; పాదలించెన్ = సంతోషపెట్టెను.

పంపానదిలోని ప్రవాహవేగమున అలలనుండి నీటితుంపరలు పుట్టగా, వానిపైనుండి వీఁచు చల్లని గాలి అగస్త్యమహామునికి హాయిని కల్గించెనని భావము.

సీ. నఖరాగ్రలూనాననస్వేదకోరకం బర్ధకషాయదృగంచలంబు
ప్రబలనిశ్శ్వాససౌరభతర్పితమదాళి శోషితశ్రవణశిరీషయుతము
దర్శితమధ్యవృత్తస్రస్తమృదునీవి [1]యప్రమత్తపయోధరాంబరంబు
సంతప్తశర్కరాసహపదన్యాసంబు నచలరజోధూమలాలకంబు

తే. సరణితరుణతరుచ్ఛాయ శమితఖేద,మలసమృదులాంగకంబు నై యరుగుదెంచు
నన్నిజపరిగ్రహముఁ గూర్మి నాద[2]రించి, పలుకు వింధ్యాద్రినిర్బంధబాంధవుండు.

టీక. [ప్రతిదినప్రయాణంబుల నలసటఁ జెందిన లోపాముద్రాదేవి యిందు వర్ణింపఁబడుచున్నది.]

నఖరా......కోరకంబు = కొనగోటిచే మీటఁబడిన మొగమునందలి చిఱుచెమటలు కలది; అర్ధ...లంబు = సగమెఱ్ఱవాఱిన కనుఁగొలుకులు కలది; ప్రబల...మదాళి = దట్టమైన నిట్టూర్పుగాలి పరిమళముచేఁ దృప్తి పొందింపఁబడిన గండుతుమ్మెదలు కలది. శోషిత...యుతము = వాడిపోయిన చెవి యందలి శిరిసెనపూవుతోఁ గూడినది; దర్శిత...నీవి = చూపఁబడిన (ప్రకటింపఁబడిన) బొడ్డునుండి జారిన వదులైన పోకముడి గలది; [ఇచట పూర్వటీకలో 'వృత్త = వర్తులమైన-' అని అర్థము వ్రాయఁబడినది; అది సరికాదు: మధ్యవృత్త మనఁగా నాభి.] అప్రమత్తపయోధరాంబరంబు = అజాగ్రత లేకుండఁ సవరించు స్తనములపై వస్త్రము కలది - జాఱు పైఁట కలది; సంతప్త...న్యాసంబు = కాలిన గులకరాళ్లకు నోర్వని పాదవిన్యాసము - (నడక) కలది; అచల...లకంబు = కొండయందలి దుమ్ము చేత ఎరుపుకలిసిన బూడిదరంగు కల ముంగురులు కలది; సరణి...ఖేదము = బాటయందలి మొక్కల నీడలచే శాంతి పొందింపఁబడిన బడలిక కలది; అలసమృదులాంగకంబునై = బడలిన మృదువగు దేహము కలదియైనదియు; అరుగుదెంచు = (తనవెంట) వచ్చుచున్న; అన్నిజపరిగ్రహముఁ = తన ధర్మపత్నియగు నా లోపాముద్రను, వింధ్యాద్రి...వుండు = వింధ్యపర్వతముయొక్క నిర్బంధమునకు బంధువైన యగస్త్యుఁడు; పలుకున్.

ఎడతెగని ప్రయాణములచే లోపాముద్రాదేవి మిగుల శ్రమపడెను; ఆమె ముఖమునుండి కాఱు చెమటబిందువులను కొనగోళ్లతో మీటుకొనుచుండెను; కనుగొలుకులు సగమెఱ్ఱఁబాఱెను; నిట్టూర్పులను విడుచుచుండెను; ఆమె కర్ణావతంసమైన శిరీషపుష్పము వాడిపోయెను; ఆమె వదులుగా పోకముడి వేయుటచే కట్టువస్త్రము కొంత జాఱి బొడ్డు కన్పించుచుండెను; ఆమె ప్రయత్నించి జారిన పైఁటను సరిచేసికొనుచుండెను. కాలిన గులకరాళ్లపై వేయలేక,వేయలేక అడుగులు వేయుచు నామె నడుచుచుండెను; కొండనుండి ఎగిరిపడు దుమ్ముచే నామెముంగురులు ధూమ్రవర్ణమును పొందెను; దారిలో నున్న చిన్నచిన్న వృక్షములనీడఁ గూరుచుండి యామె బడలికను తీర్చుకొనుచుండెను; ఆమె మృదుశరీరము మిగుల అలసిపోయెను; అట్టి భార్యకు మంచి మాటలతో శ్రమను పోగొట్టి - యామెను గౌరవించుచు నగస్త్యుఁ డిట్లు పలుకుచున్నాఁడని భావము అలం. స్వభావోక్తి.

1. చ. యప్రమత్త. క.అప్రయత్న. 2. చ. రింప.

మ. వనితా! చూచితె మాల్యవంతము ప్రభావంతంబు నానామణీ
జనకోదంచితసానుకాంతము మరుత్సంపూర్ణచంద్రాననా
జనకేళీపదచంద్రకాంతము నభస్సంబాధకృత్కూటవ
ర్ధనదుర్దాంతము సర్వపర్వతకథాప్రాగ్వర్ణితోదంతమున్. 130

టీక. ప్రభావంతంబునన్ = కాంతికలదానిని; నానా......కాంతమున్ = అనేకవిధములగు మణులగుంపుయొక్క పుట్టుచోట్లయి యొప్పునట్టి చరియలచేఁ జక్కనగుదానిని; మరుత్......కాంతమున్ - మరుత్సంపూర్ణచంద్రాననాజన = నిండుచంద్రునివంటి ముఖము కల దేవతాస్త్రీలకు; కేళీపద = క్రీడాస్థానమయిన; చంద్రకాంతమున్ = చంద్రకాంతపురాళ్ళు కలదానిని నభస్......దుర్దాంతమున్ - నభస్సంబాధకృత్ = ఆకాశమును ఒరయుచున్న; కూటవర్ధన = శిఖరముల పెరుగుదలచేః దుర్దాంతమున్ = అణఁపరానదానని; సర్వ......దంతమున్-సర్వపర్వతకథా = (తక్కినపర్వతముల ప్రస్తావనముకంటెను, ప్రాక్=ముందుగా; వర్ణిత = వర్ణింపఁబడిన; ఉదంతమున్=వృత్తాంతము కలదానిని; - పర్వతములఁగూర్చి ప్రసంగించునపుడు అన్నింటికంటెను ముందుగ ఎన్నఁబడు వృత్తాంతము కలదానిని, చూచితె = చూచితివా?

మాల్యవంత మను పర్వతము ప్రకాశము కలది దాని చఱియలయందు విలువగల మణు లనేకములు కలవు; అచటి చంద్రకాంతశిలలపయి దేవతాస్త్రీలు ఆడుకొనుచుందురు; దానిశిఖరములు ఆకాశము నొఱయుచుండును; అది పర్వతము లన్నింటను పేరెన్నికఁ గన్నది అని భావము. అలం. అనుప్రాసము, ఉదాత్తము.

సీ. ఇవె యూపవృత [4]శాఖ లివె లూనముఖదర్భసందర్భవేశంతసైకతంబు
లివె శబ్దసహమృగయువయుగంబులు వీరె చలకాకపక్షమస్తకులు బ్రహ్మ
చారులు నిజహోమసౌరభేయీతర్ణకముల నీడల నిల్పి కాచియున్న
వారు; సామోదితస్వరసంశయమునొంది చిలుక కోయిల నివె [1]తెలియ నడిగె

తే. భసలకలభకులాకృష్టకుసుమవిసర, మసృణమకరందమయమైన మావిమోక
కిసలయచ్ఛవిపునరుక్తి [2]నసలుమసలు, ఋషుల చెంగావివలువందు నిందువదన.

టీక. యూపవృతశాఖలు=యూపస్తంభములకయి వేఱుగా నుంచఁబడిన కొమ్మలు; [యూపవృతశాఖులు=యూపస్తంభములచేత ఆవరింపఁబడిన వృక్షములు - అని పూర్వటీక.] లూన...సైకతంబులు= కోయఁబడిన దర్భల కూడికకల (కోసిన దర్భలమొదళ్లు కల) ఖురదగుంటలతోఁ గూడిన ఇసుకదిబ్బలు, శబ్ద...యుగంబులు = శబ్దమును సహించునట్టి - బెదరని-జంకల జింపతులు; చలకాకపక్షమస్తకులు = చలించుచున్న పిల్లజుట్లు - జునపాలు తలపై కలవారు; నిజ......కములన్ = తమహోమధేనువుల దూడలను; సామో......యమున్ = సామగానమునందలి స్వరముయొక్క సందేహమును, భసల......మయమైన - భసలకలభకుల = కొదమతుమ్మెదల సమూహముచేత. ఆకృష్ట=బాగుగా తాకఁబడిన; కుసుమవిసర = పుష్పసముదాయమువలని; మసృణ = చిక్కని; మకరందమయమైన = తేనెతోఁగూడిన వి మావిమోక = గున్నమామిడి; కిసలయచ్ఛవిపునరుక్తిన్ = చిగుళ్లకాంతి రెట్టింపును; ఋషులచెంగావివలువందున్ = మునుల కావివస్త్రములందు; ఆసలుమసలున్ = ఒప్పెను. [ఆసలుమసలున్ = ఖుదదగొనును - అతిశయించును - అని పూర్వటీక.)

మాల్యవంతప్రాంతాశ్రమభూము లిందు వర్ణింపఁబడుచున్నవి. అఁట యూపములకొఱకు చెట్టుకొమ్మలు కొట్టి భద్రపఱుపఁబడినవి; ఇసుకదిబ్బలయందుఁ గల ఖురదగుంటలయొద్దనుఁగల దర్భలు కోయఁ

1. క. శాఖు. చ. శాఖ. 2. చ. తెలియనడిగి. 3. క. నసలుమసలు. సూర్య. చ. నసలుగొల్పె.

బడుటచే మొదళ్లుమాత్రము కనఁబడుచున్నవి; ధ్వని కలవాటుపడిన లేళ్లు బెదరక నిలిచియున్నవి; పిల్ల జుట్టుకల బ్రహ్మచారులు చెట్లనీడల నిలిచి యావుదూడలను కాచుచున్నారు; సామగానమున తనకుఁగలిగిన స్వరసంశయమును చిలుక కోకిల నడుగుచున్నది; [అచటి పక్షులును వేదము నభ్యసించినవనుట.] గండు తుమ్మెదల గట్టితాకుడువలన మావిపూగుత్తులనుండి కారిన తేనె చెట్లకు ఆరఁగట్టిన కావిగుడ్డలపయి పడి, మామిడిచిగుళ్ల కాంతిని ఆ వస్త్రములకుఁ గలిగించుచున్నది.

[వలువయందు'కు బదులు 'వలువందు' అన్న స్త్రీసమమువీఁది అకారసంధితోఁగూడిన రూపము.] అలం. స్వభావోక్తి.

క. నిర్ధూతపాతకములు హ, వ్యనిర్ధూమలతాగ్రలాస్యవిలసనశిక్షా
ధూర్ధరములు నిజభజనవి, వర్ధితసుకృతంబు లిచటివాయువు లబలా! 132

టీక. నిర్ధూతపాతకములు=పూర్తిగాఁ దుడిచివేయఁబడిన పాపములు కలవి; హవి......ధరములు - హవిర్ధూమలతాగ్ర = లతలవంటి హోమధూమములకొనలయొక్క; లాస్యవిలసనశిక్షా = విలాసపునాట్యముయొక్క యభ్యాసముయొక్క; ధూర్ధరములు = భారమును వహించునవి - అనఁగా హోమాగ్నినుండి వెలువడిన పొగల చివఱిభాగములు తీఁగలవలె మీఁదికి, ప్రక్కకు వ్యాపించుచుండఁగా, అవి నాట్యము నభ్యసించుచున్నట్లుండెనని భావము. [హవిర్ధూమ = హోమపుపొగ యనెడి; లాస్యవిలసన=నాట్యపుచతురత్వమును, ధూర్ధరములు=భారమువహించునవి అని పూర్వటీక.] నిజ...... సుకృతంబులు = తమ్ము సేవించుటవలన వృద్ధిపొందింపఁబడిన పుణ్యము కలవి.

ఉ. ఓలలితాంగి! యిందు సుఖ ముండు మృకండుకణాదగాధివా
ధూలముఖాతిరిక్తచరితుండు మతంగమహాతపస్వి ని
ష్కాలగళుండు నిర్వ్యవతిగాత్రుఁడు నిర్నిటలేక్షణుండు ని
ర్వ్యాళవిభూషణుండు నగు నంబరకేశుఁ డనంగఁ [1]బెంపునన్. 133

టీక. లలితాంగి! = మనోజ్ఞములగు నవయవములుకల లోపాముద్రా! మృకండు...... చరితుండు = మృకండువు, కణాదుఁడు, గాధి, వాధూలుఁడు మొదలగు మునుల నడవడిని మించిన నడవడి కలవాఁడు; మతంగమహాతపస్వి = మతంగుఁడను పేరి గొప్ప ముని; నిష్కాలగళుండు = నల్లఁదనములేని మెడ కలవాఁడు: నిర్వ్యవతిగాత్రుఁడు = ఆఁడురూపు (సగము) శరీరమున లేనివాఁడు; నిర్నిటలేక్షణుఁడు = నొసటఁ (మూఁడవ) కన్ను లేనివాఁడు; నిర్వ్యాళవిభూషణుండు = పాములు నగలుగా లేనివాఁడు; అంబరకేశుఁడనంగన్ = వ్యోమకేశుఁడగు శివుఁడో యనునట్లు; పెంపునన్ = గొప్పతనమున; ఇందున్; సుఖముండున్=సుఖముగా నివసించుచుండును. అలం. వ్యతిరేకము,ఉత్ప్రేక్ష.

తే. హోమధూమాసితప్రభ నీమహాత్ము, నాశ్రమం బొప్పు నీయద్రియంతికమున
వలుదయై మించు నప్పంటవలఁతివెలఁది, చంటికడ నంటు మృగనాభిచర్చవోలె.

టీక. హోమధూమాసితప్రభన్ = హోమముయొక్క పొగచే నైన నల్లని కాంతివలన; ఈయద్రియంతికమునన్=ఈ కొండచేరువను; వలుదయై మించు = వట్రువయై ప్రకాశించు; అప్పంట...... కడన్ = పంటలు పండించు నేర్పు కల - భూమియను స్త్రీయొక్క చంటిదగ్గఱ; మృగనాభిచర్చవోలెన్ = కస్తురిపూఁతవలె.

మాల్యవంతము భూమియను స్త్రీయొక్క స్తనమువలె ప్రకాశించుచున్నది; ఆపర్వతము చేరువఁ గల మతంగాశ్రమము హోమధూమములచే నల్లనికాంతి గల్గి యా స్తనముకడ నంటిన (నల్లని) కస్తూరిపూఁతవలెఁ బ్రకాశించుచున్నదని భావము. అలం. ఉపమ.

---

1. క. బెంకుగున్. త. పెంపు నన్.

ఉ. భూరితరాభ్రవిభ్రమము పుష్కరరమ్యకరంబు దానల
క్ష్మీరుచిరంబు సత్త్వగుణకీర్తితమూర్తియు [1]వాలిసాలసం
హారవిహారకారణము నౌ రఘుకుంజరభర్త మున్ను సం
చార మొనర్చె నీయచలసానుతలంబున నంబుజాననా! 135

టీక. మాల్యవత్సానుతలమున శ్రీరాముఁడును, ఏనుఁగులరాయఁడును సంచార మొనర్చిరని యీ పద్యమున శ్లేషమూలమునఁ జెప్పఁబడుచున్నది.

శ్రీరామునిపక్షమున - భూరితరాభ్రవిభ్రమము = దట్టమైన మేఘమువంటి చక్కఁదనముకలది-నీలమేఘశ్యామమైనది; పుష్కరరమ్యకరంబు = తామరపూవువలె చక్కనైన హస్తముకలది; దానలక్ష్మీరుచిరంబు = ఈవికలిమిచేఁ బ్రకాశించునది; సత్త్వగుణకీర్తితమూర్తియుఁ = మహాపరాక్రమముచేఁ గొనియాడఁబడిన దేహము కలది; - వాలిసాలసంహారవిహారకారణము = వాలియను కోఁతియొక్క నాశన మను విహారమునకుఁ గారణమైనది; రఘుకుంజరభర్త = రఘువంశశ్రేష్ఠుఁడైన శ్రీరాముఁడు. [ఇచట 'కుంజరభర్త - 'అనుటచే తదనుగుణముగ విశేషణముల చివఱ 'ము'వర్ణకము చేర్పఁబడినది.] గజపక్షమున - భూరి......మము = దట్టమైన మేఘముయొక్క కాంతివంటి కాంతికలది. నల్లనిది; పుష్కర...రంబు = (తొండముయొక్క)కొన (అంగము) చే చక్కనైన తొండముకలది; దాన......రంబు = మదసంపదచేఁ బ్రకాశించునది' సత్త్వ.....మూర్తియుఁ = బలముచేఁ బొగడఁబడినదియుం; వాలి, సాలసంహారవిహారకారణము = మ్రొగ్గి - పూని, వృక్షములను విరిచి నాశనముచేయునట్టి యాటకు కారణమైనది; రఘుకుంజరభర్త = రఘువువంటి (గొప్ప) ఏనుఁగులరాజు; [రఘువంశస్థుఁడైన ఏనుఁగులరా'జని పూర్వటీక.] ఈ యచలసానుతలంబునఁ = ఈ కొండచఱియలందు; అంబుజాననా! = పద్మమును బోలిన ముఖముకల ఓహాముద్రా! అలం. శ్లేష, ఉదాత్తము.

సీ. పద్మినీపద్మాతపత్రంబు శిథిలపత్రాగ్రమై రాయంచ [2]యాశ్రయించెఁ
దాలుస్రవత్ఫేనజాలంబుతో ఘోణి పంచలరొంపిఁ గలంచి యాడె
దూరోద్గమద్దావ[3]ధూమంబు ఘనబుద్ధి నెమ్మి లోపాదరింట నిక్కిచూచె
జఠరస్థజలము నాసానాళమునఁ బీల్చి సామజం బిరుప్రక్కఁ [4]జల్లుకొనియె

తే. సరసిపై నీరు సలసల తెరలె విపిన, సకలవీథులు నిర్మృగోచ్చయములయ్యె
మట్టమధ్యాహ్నమిది సుధామధురవాణి, యర్హమిచ్చోటఁ బథశ్రమ [5]మపనయింప.

టీక. మధ్యాహ్నసమయవర్ణన మీ పద్యమునఁ గలదు. పద్మినీపద్మాతపత్రంబుఁ = తామరతీగయందలి గొడుగువంటి తామరపూవును; శిథిలపత్రాగ్రమై = సడలిన రెక్కలకొనలుగలదై; [తూఁట్లుపడిన] ఱెక్కకొనలుగలది' అని పూర్వటీకఁ] తాలుస్రవత్ఫేనజాలంబుతోఁ = దవుడలనుండి కాఱు నురుగు తెట్టెలతో; ఘోణి = పంది; పంచలరొంపిఁ గలంచి = ప్రక్కలనున్న బురదను కెలికి; దూరోద్గమద్దావధూమంబుఁ =దూరమున నెగసిన కార్చిచ్చుపొగను; ఘనబుద్ధిఁ =మేఘమను భ్రాంతిచే; నెమ్మి = నెమలి; లోపాదనుండి = పొదయొక్క లోపలిభాగమునుండి; జఠరస్థజలముఁ =చెఱువులోపలి నీటిని; నాసానాళమునఁ = గొట్టమువంటి తొండముతో; సామజంబు = ఏనుఁగు; ఇరుప్రక్కఁ = రెండువైపులను; సరసిపై నీరు = సరస్సుపైనున్న నీరు; సలసల తెరలెఁ = సలసల ఉడుకు (కాఁగు) చుండెను; విపిన, సకలవీథులు = అడవిలోని ప్రదేశము లన్నియు; నిర్మృగోచ్చయములు = మృగముల విజృంభణ - సంచారము లేనివి; [మృగసమూహములు లేనివి అని పూర్వటీక.]

1. చ. నైనవాలిసం. 2. చ. యాశ్రమించె. 3. క. ధూమమంబుద-చ. ధూమంబుఘన-4. చ. జల్లి. 5. చ. శ. ర. శ్రమంబప-

సుధామధురవాణి! = అమృతమువలె మధురములైన మాటలు కలదానా! ప్రశ్రమము = డారి బడలిక: అపనయింపక = పోఁగొట్టుటకు. అలం. స్వభావోక్తి.

వ. అనుచు సభార్యుండై వింధ్యాహార్య స్తంభయిత[1]సంతాపరోగంబున నిగిడి చని.

టీక. సభార్యుండై = భార్యతో కూడుకొని: వింధ్యాహార్య స్తంభయిత = అడ్డులేకుండ వింధ్యము నరికట్టినవాఁడు - అగస్త్యుఁడు; సంతాపరోగంబునకా = విచారవ్యాధితో; నిగిడి = వేగిరపడి.

క. నటనోద్భటుఁడైనమహానటుని జటాజూటమురిలినం దొరఁగు మరు
త్కటకనది యిది యనుచుఁ జని, యట గనియెఁ దుంగభద్ర [2]నఘముఖముద్రన్.

టీక. నటనోద్భటుఁడైన = నాట్యమునందు గొప్పవాఁడైన; మహానటుని = మహానటుఁడైన శివుని; జటాజూటము = కపర్దము; ఉరిలినక = పీడఁగా; తొరఁగు = ప్రవించునట్టి; మరుత్కటకనది = ఆకాశగంగ; అఘముఖముద్రక = పాపములనోటికి ముద్ర-తాళమైనదానిని - పాపములను నశింపఁజేయుదానిని; తుంగభద్రక, కనియెన్.

శా. గంగాసంగమ మిచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా
నంగీకార మొనర్చునే యమునతో నానందముం బొందునే!
రంగత్తుంగతరంగహస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించునేని గుణభద్రా! తుంగభద్రానదీ! 139

టీక. గంగాసంగమముక = గంగానదిపొందును; దేవేరిగాక = పుట్టపుదేవిగా - భార్యగా; రంగత్......ములక = చలించుచున్న ఎత్తయిన అలలనెడి చేతులతో; ఆ రత్నాకరేంద్రుండు = సముద్రరాజు; గుణభద్రా! = మంచిగుణములు కలదానా! (ఇచటి 4-వ పాదమునప్లుతయతి) అలం. అనుప్రాసము.

క. [3]ఓపుఁ భూపరిధిం గల,యాపగ లవి బాహ్యతాప మాపఁగ; నీవే
యోపుదుగా యంతర్గత,తాపత్రయ మడఁప నోయుదన్వన్మహిళా! 140

టీక. ఓపుక = సహించును; భూపరిధిం, గల = భూమండలమందున్న; ఆపగలు = నదులు; బాహ్యతాపము = బయటికిఁదెలియు వేఁడిమిని; అంతర్గత తాపత్రయము = లోపలి తాపములగు ఆధ్యాత్మిక - ఆధిదైవిక - ఆధిభౌతికము లను మూఁడింటిని; ఓ యుదన్వన్మహిళా! = సముద్రునకు భార్యవగు నో తుంగభద్రా!

చ. అని కొనియాడి యన్నదిఁ మహానియమంబునఁ దీర్థమాడి బో
రన భవరోగజాడ్యములు గ్రాఁగఁ దదుజ్జ్వలకన్సురాబ్జగం
ధనిచితవారి రసౌషధముఁ ద్రావి తటస్థితపూజ్యపూజనం
బు నడపెఁ గాశికావిరహభూరివిషాదము సాద మొందఁగన్. 141

టీక. అన్నదిక = ఆయేటియందు; మహానియమంబునక = గొప్పనియమముతో; తీర్థమాడి = స్నానముచేసి; బోరనక = వేగముగా; భవరోగజాడ్యములు = పుట్టుక యను రోగమువలని మాంద్యములు; గ్రాఁగక = కాలిపోఁగా - నశింపఁగా; తదుజ్జ్వల......నిచితవారి = ఆ నదియందలి బంగారు తామరపూల పరిమళముతోఁ గూడిన; రసౌషధముఁ ద్రావి = జలరూపమైన మందు త్రాగి; తటస్థితపూజ్యపూజనంబు = ఒడ్డుననున్న పూజింపఁదగినవారి పూజను; నడపెక = జరిపెను; కాశికా... విషాదము = కాశీనగరమును విడుచుటవలనఁ గల్గిన గొప్ప విచారము; సాద మొందఁగక = నశించిపోఁగా.

1. క. సంభృతానురాగంబున. చ. సంతాపరోగంబున. 2. చ. నఘ. 3. క. ఓపును. చ. ఓపున్.

రోగముచే బాధపడువారికి ఔషధమట్లే జన్మదుఃఖముచే బాధపడువారికి ఈ నదీజలము దుఃఖమును పోఁగొట్టి యానందము కల్గించునని భావము అలం. రూపకము.

వ. ఇవ్విధంబునఁ ద్రిభువనపవిత్రీకరణసమర్థచరిత్రం బగు పయ్యుదధికళత్రంబున[1]ససతీఛాత్రుండై యుచితకృత్యంబు లాచరించి యా[2]నీవారముష్టింపచుండు తద్వారిపూరంబు వినిర్గమించి మించుబోఁడియుం దానును బంచాక్షరీగుహాహార్యక్షం బగు విరూపాక్షు నుక్షధ్వజు దాక్షాయణీవిభు వళక్షమయూఖరేఖామకుటు భ్రుకుటిమాత్ర విద్రావితత్రిపురనిశాటు హేమకూటనివాసు వాసుకివలయు వలయు తెఱంగునఁ బ్రస్తుతించి సమస్తకలుషనిరసన లలితమూర్తియై చనిచని ముందట నమందమణికందళసందోహదంతురంబయి మహీమందగమనకేళీకందుకంబునుంబోలె నుత్తాలంబగు స్వామిశైలంబు నధిరోహణంబు చేసి [3]యక్కుధరమ్మునందు. 142

టీక. త్రిభువన...చరిత్రంబు = మూఁడు లోకములను పవిత్రములుగఁ జేయఁదగిన ప్రవర్తన కలది; [స్వర్గ, మర్త్య, పాతాళము లని లోకములు మూఁడు] ఉదధికళత్రంబునన్ = సముద్రునకు భార్యయగు నా నదియందు, ససతీఛాత్రుండై = భార్యతోను, శిష్యులతోను కూడుకొన్నవాఁడై; ఉచితకృత్యంబులు = స్నాన, సంధ్యాద్యనుష్ఠానంబులు; ఆచరించి = చేసి; ఆ నీవారముష్టింపచుఁడు = పిడికెఁడు నెవ్వరిధాన్యము మాత్రము వండి తినువాఁడు - ఋషి - అగస్త్యుఁడు; [ఇచట ముద్రిత ప్రతిలో 'నీవారముష్టిం బచవారంబులుండి' అనియున్నది; దాని టీక 'నీవారముష్టిన్ = పిడికెఁడు నివ్వరిధాన్యము నాహారముగాఁ జేసికొనుటచేత; పంచవారంబులు = ఐదు వారములు - నలువది దినములు' అని యున్నది.] తద్వారిపూరంబు = ఆ నీటిప్రవాహమును; వినిర్గమించి = దాటి (ఆయేటిని దాటి); మించుబోఁడియున్ = వనితయు - భార్యయు; పంచాక్షరీగుహాహార్యక్షంబు = 'ఓం నమశ్శివాయ' అను పంచాక్షరీమంత్రమను గుహకు సింహమైనవాఁడు; విరూపాక్షున్ = మూఁడు కన్నులు కలవానిని; ఉక్షధ్వజున్ = వృషభము కేతనముగాఁ గలవానిని; దాక్షాయణీవిభున్ = దక్షుని పుత్రికయగు సతీదేవికి భర్తయైనవానిని; వళక్షమయూఖరేఖామకుటున్ = చంద్రరేఖ కిరీటముగాఁ గలవానిని; భ్రుకుటి......నిశాటున్ = బొమముడిమాత్రముచేతనే ఓడింపఁబడిన త్రిపురరాక్షసులు కలవానిని; హేమకూటనివాసున్ = హేమకూటపర్వతమున నివసించువానిని; వాసుకివలయున్ = సర్పరాజు కంకణముగాఁ గలవానిని; వలయు తెఱంగులన్ = తగినరీతుల; సమస్త...మూర్తియై = ఎల్ల పాపములను తొలఁగించుకొనుటచేత ఇంపైన ఆకారము కలవాఁడై; ముందట = ఎదుట, అమంద... దంతురంబు = ఎక్కువైన మణుల యంకురముల సమూహముచే ఎచ్చుతగ్గులు కలిగినది (మిట్టపల్లములు కలది); మహీ .....కంబునుంబోలెన్ = భూమియను స్త్రీయొక్క ఆఁటబంతివలె; ఉత్తాలంబగు = ఉన్నతమైన; స్వామిశైలంబును = కుమారస్వామియున్న కొండను; అధిరోహణంబుచేసి = ఎక్కి; అక్కుధరమ్మునందున్ = ఆ కొండయందు.

క. షణ్ముఖు శిఖిసంతప్తహిరణ్మయనిభవర్ణుఁ గేకిరాడ్ధ్వజుఁ గొలిచెన్
షాణ్మాతురుఁ దపసి తురా,షాణ్ముఖసుఖదప్రభావు సతియుం దానున్. 143

టీక. షణ్ముఖున్ = ఆఱు ముఖములు కల కుమారస్వామిని; శిఖిసంతప్తహిరణ్మయనిభవర్ణున్ = అగ్నియందు పుటముపెట్టఁబడిన బంగారుయొక్క కాంతివంటి చాయ కలవానిని; కేకిరాడ్ధ్వజున్ =

---

1. చ. సచ్ఛాత్రుండై. 2. క. నీవారముష్టింబంచ వారంబులుండి. చ. నీవారముష్టింపచవారంబు. 3. చ. కుధరంబునందు.

నెమిలిరాజు టెక్కెమునందుఁ గలవానిని; షాణ్మాతురర్ = ఆర్గురు తల్లులు కలవానిని; తపసి=అగస్త్యుఁడు; తురాషా... ప్రభావుర్ = ఇంద్రునికి సుఖము కలిగించు మహిమ కలవానిని; కొలిచెర్ = సేవించెను. [ఇచట 'తపసి తురా...ప్రభావుర్ = మునులు, దేవేంద్రుఁడు మొదలగువారికి సుఖము నిచ్చునట్టి మహిమకలవానిని—'అని పూర్వటీకలో కర్తయైన తపసిశబ్దము తురాషాణ్ముఖ - అనుసమస్త పదముతోఁ జేర్పఁబడి, తదనుకూలముగ నర్థము వ్రాయబడినది.]

క. కొలిచి నుతించెం గ్రౌంచా,చలవిదళననిపుణబాహుసారుఁ గుమారుర్
గలశసుతుండుం బలుకుల, మొలకలు పుష్పోప[1]హారములచెలు వొసఁగన్. 144

టీక. క్రౌంచా......సారుర్ = క్రౌంచపర్వతమును భేదించుటయందు సమర్థమైన బాహుబలము కలవానిని; కలశసుతుండుర్ = అగస్త్యుఁడును: పలుకుల మొలకలు = మృదువులగు మాటలు; పుష్పోపహారముల చెలువు = పూవులకానుకల యందమును; ఒసఁగర్ = కలిగింపఁగా; నుతించెర్ = స్తోత్రముచేసెను అలం. ఉపమ.

సీ. కావు కా వనుట రక్కసులమూకనె కాని నసిచె నీగొంతు సింహనాదవిహృతి
పొత్తులు తోలువేలుపులగంటులనె కాని హత్తె నీమేన వజ్రాంగిబోడు
వసవల్పు దైత్యులవ్రయ్యుగుండెనె కాని నినుఁ గప్పె వీరచందనపుఁదావి
యంగుళీచర్వణం బసురులందునె కాని గెలుపుచిందము మోవి నిలిచె నీకు

తే. నీవు తలమావి వీడని నిసువువయసు, నాఁడె జేజేల దళవాయినాయకరపుఁ
బట్టమున నిల్చి తారకుఁ గిట్టి ప్రౌఢ, తరగణక్రీడ యొనరించు[illegible]కి మహాత్మ! 145

టీక. ఈ పద్యమున అగస్త్యుఁడు సుబ్రహ్మణ్యస్వామిని నుతించుచున్నాఁడు. మహాత్మ! కావు, కావనుట = కావు, కావుమని యఱచుట, రక్షింపుము, రక్షింపుమని వేడుకొనుట; [కావు కావుమనుట కిది స్వతంత్రప్రయోగము. అది శ్లేషకును అనుగుణము.] రక్కసుల మూకనె కాని=రాక్షసుల గుంపునందే కాని; సింహనాదవిహృతి = సింహనాదముయొక్క విహారము. నసిచెర్ = అతిశయించెను: రక్కసుల నీచత్వము, కుమారునిమహత్త్వము ఇందు వ్యక్తము. వారు కావు కావని శిశువుల వలె యేడ్చుదురు కాని, నీవు సింహనాదమును జేయుదువని భావము. ఈ వ్యతిరేకము నాల్గుపాదము లందును గమనింపఁదగినది.

పొత్తులు = బిడ్డల ప్రక్కల వేయు మెత్తనిగుడ్డలు; తోలువేలుపుల = రాక్షసులయొక్క; గంటులనె కాని = గాయపుఁదూఁట్లయందే కాని నీమేనర్ = నీదేహమున; వజ్రాంగిజోడు = వజ్రమయకవచము: హత్తెర్ = అంటెను. వసవల్పు = వసవలపు - వసకంపు; దైత్యులవ్రయ్యుగుండెనె కాని = చీలిన రాక్షసులవక్షఃస్థలములందే కాని; వీరచందనపుఁదావి = వీరులు పూసికొను ఎఱ్ఱచందనపుఁ బరిమళము; నినుర్, కప్పెర్ = నీయందు వ్యాపించెను: అంగుళీచర్వణంబు = వ్రేళ్లను చీకుట; అసురులందునె కాని = రాక్షసులందే కాని; నీకుర్, మోవిర్ = పెదవిపై; గెలుపుచిందము = జయశంఖము; నిలిచెర్; తల...నాఁడె = తలను కప్పియున్న మావి కూడ ఊడని శిశుప్రాయమునందే - పుట్టిన వెంటనే; జేజేల = దేవతలయొక్క; దళవాయినాయకరపుఁబట్టమునర్ = సేనాధిపతులకు నాయకుఁడగు పట్టమును గట్టుకొను నధికారమున; కిట్టి = సమీపించి, ప్రౌఢ......క్రీడ = మిక్కిలి నేర్పుగల యుద్ధమనెడు నాట.

కుమారస్వామి శిశువై యున్నపుడు 'కావు కావు' మని యఱచుచు, పొత్తిగుడ్డలపైఁ బరుంచుచు, వసవాసన కొట్టుచు, వ్రేళ్లు చీకుచు, ఆటలాడుకొనుచు నుండవలసియున్నది. ఏలయన-ఇట్లుండుట శిశువులకు సహజము. కాని యితఁడట్లుండక, ఆడుటకు బదులు తారకాసురునితో యుద్ధముచేసి, తనకు

1. క. హారములు. చ. హారముల.

ఉండవలసినవాని నన్నిటిని ఓడిపోయిన పగతుర కొసంగెను. కాఁగా వారు 'రక్షింపు'మని అఱచుచు, గాయములకు గుడ్డలు కట్టుకొని, వసకంపు (మెదడుకంపు) కొట్టుకొనుచు, వ్రేళ్లకఱచుకొనుచు నుండిరి. కుమారస్వామి సింహనాదమొనర్చుచు, వజ్రకవచము ధరించి, చందనపుఁబరిమళము గుబులుకొనఁగా జయశంఖమును పూరించెను; దేవసేనకు సర్వాధికారపదవి నొందెను. అలం. పరిసంఖ్య, వ్యతిరేకము.

ఆ. అహితగోత్రహృద్వ్యథాహోపకృతి నీదు, శక్తి కుగ్రబాహుశక్తికిఁ దగు
[1]ఘనవివృద్ధిఁ బేర్చి గర్వించుటలు నీదు, శిఖికి సత్ప్రతాపశిఖికి నమరు. 146

టీక. అహిత......కృతి = శత్రువులవంశమునకు మనోవ్యథను కలుగఁజేయునట్టి పని; శత్రువైన (క్రౌంచ) పర్వతమునకు మనోవ్యథను కలిగించు బాణవ్యాపారము; నీదుశక్తికిన్ = నీయాయుధమగు శక్తికి; ఉగ్రబాహుశక్తికిన్ = భయముగొల్పు భుజబలమునకు; తగున్ = తగియుండును. ఘనవివృద్ధిన్ = మేఘములయొక్క సమృద్ధిచేత, అధికముగా విజృంభించుటచేతను; పేర్చి = అతిశయించి; నీదుశిఖికిన్ = నీ (వాహనమైన) నెమలికిని; సత్ప్రతాపశిఖికిన్ = గొప్పప్రతాపమనెడి యగ్నికిని. అమరున్ = తగును.

కుమారుని యాయుధము శత్రువులను నశింపఁజేయఁగా భుజబలము క్రౌంచమును భేదించెను; అతని వాహనము మేఘములఁజూచి అతిశయింపఁగా, ప్రతాపము ఇతరుల విజృంభణమును చూచి అతిశయించును. అలం. శ్లేషము, తుల్యయోగిత.

వ. అని యమ్మునిసులచక్రవర్తి వెండియుం గార్తికేయుం డార్తితార్తిహరుం డనియును, శరవణభవుండు పరమపురుషార్థప్రవణుం డనియును, మహాసేనుండు దీనజనమందారుం డనియును, శర్వద్బాలుండు కృపావిశాలుం డనియును, షడాననుండు కీడుపలసఁ బాచి [2]ప్రోచు ప్రోడ యనియును, నీలదంష్ట్రుండు జయశ్రీలాభంబులకు మూలం బనియును, గాంగేయుండు [3]ముంగిటికిపెన్నిధానం బనియును, కుక్కుటధ్వజుండు మ్రొక్కుటకుం దగిన వేల్పనియును, బ్రహ్మగర్భుండు నిర్భరబ్రహ్మవిద్యోపదేశదేశికుం డనియును, విశాఖుండు కుశాగ్రబుద్ధి యనియును, సుబ్రహ్మణ్యుం డదభ్రగుణరత్న[4]ఖని యనియును, శిఖివాహనుండు సాధుసఖుం డనియును, పార్వతీనందనుండు సచ్చిదా[5]నందుం డనియును, బాహులేయుండు మోహమహీధరవ్యూహ మేఘు[6]వాహుం డనియును, తారకారాతి యకారణసుకృతి యనియును, శక్తిధరుండు భుక్తిముక్తికరుం డనియును, స్వామి యోగక్షేమభూమి యనియును, స్కందుండు జగత్స్పందోహావనపరిస్పందుం డనియును, క్రౌంచదారణుండు పంచాననాపరావతారుం డనియును, గుహుండు నిరవగ్రహశుభావహుం డనియును, గుమారుం డమరచమూసముద్ధరణ నిర్వికారుం డనియును, షాణ్మాతురుండు తురాషాణ్ముఖసుఖప్రదుం డనియును, బ్రమదరసనిమగ్న [7]మనస్కుండై యగ్నిభవుం బ్రణుతించి, యసాదంబగు తదీయప్రసాదంబు వడసి, కతిపయదినంబు లుచితగతిం గడపి తద్విరచిత మహాస్కాందగ్రంథసందర్భంబునం బూర్వభాగంబు విని తదాశయావబోధసుధాధునీవినిమజ్జనంబునం గాశీవియోగజనితక్లేశంబుఁ దీసివైచి యందలి యుత్తరభాగంబున.

1. చ. ఘనకవృద్ధి. 2. చ. ప్రోచుటకు. 3. చ. (ముంగిటి - లేదు.) 4. చ. నిధి. 5. చ. నందంబు. 6. చ. వాహనుండు. 7. చ. మనస్కుండు.

టీక. అమ్మునికులచక్రవర్తి = గొప్పముని-అగస్త్యుఁడు; కార్తికేయుండు=కృత్తికలకుమారుఁడు; ఆశ్రితార్తిహరుండు=ఆశ్రయించినవారి బాధలను పోఁగొట్టువాఁడు; శరవణభవుండు = రెల్లుఅడవియందు పుట్టినవాఁడు; పరమపురుషార్థప్రవణుండు = మోక్షాసక్తుఁడు; మహాసేనుండు = గొప్ప సైన్యము కలవాఁడు; దీన...రుఁడు = దీనులకు కల్పవృక్షమగువాఁడు; శశ్వద్బాలుఁడు = ఎల్లపుడును బాలుఁడుగ నుండువాఁడు; షడాననుండు = ఆఱు ముఖములు కలవాఁడు; పాచి = తప్పించి; ప్రోడ = నేర్పరి; నీలదంష్ట్రుండు = నల్లని దంతములు కలవాఁడు; జయశ్రీలాభంబులకున్ = జయమునకు, సంపదకును; గాంగేయుండు = గంగకొడుకు; మూఁగిటిపెన్నిధానంబు = ఇంటిమూఁగిటనున్న పెద్దనిధి; కుక్కుటధ్వజుండు = నెమలి ధ్వజముగాఁ గలవాఁడు; బ్రహ్మగర్భుఁడు = శివపుత్త్రుఁడు, నిర్భర......దేశికుండు = మేలైన బ్రహ్మవిద్య నుపదేశించుగురువు; విశాఖుఁడు=విశాఖానక్షత్రమున పుట్టినవాఁడు; సుబ్రహ్మణ్యుండు=గొప్ప బ్రహ్మభావము కలవాఁడు; అదభ్రగుణరత్నఖని = గొప్పరత్నములవంటిగుణములకు గని; శిఖివాహనుండు = నెమలి వాహనముగాఁ గలవాఁడు; సాధుసఖుఁడు = మంచివారికి మిత్త్రుఁడు; బాహులేయుండు = బహుమాతలకు పుత్త్రుఁడు; మోహా...వహుఁడు = అజ్ఞానమనెడి కొండలసమూహమునకు ఇంద్రుఁడు; తారకారాతి = తారకవైరి, అకారణసుహృత్ = కారణము లేకయే సత్కార్యములుచేయువాఁడు; శక్తిధరుండు = శక్తి యను నాయుధమును ధరించినవాఁడు; భుక్తిముక్తికరుండు = భోగ, మోక్షములను కలుగఁజేయువాఁడు స్వామి = కుమారస్వామి; యోగక్షేమభూమి = అపూర్వవస్తువులకును, మేలికిని స్థానము; స్కందుఁడు = శత్రువులను శోషింపఁజేయువాఁడు జగ...స్పందుఁడు = లోకములను రక్షించుటయందు స్థిరుఁడు; క్రౌంచదారణుండు = క్రౌంచపర్వతమును భేదించినవాఁడు; పంచ.........తారుండు = శివుని మాఱురూపు గుహుఁడు = స్వసేనారక్షకుఁడు; నిరవగ్రహశుభావహుండు = కఱవులేని - కొఱతలేని శుభముల నిచ్చువాఁడు; కుమారుండు= ఎల్లపుడును శిశువుగా నుండువాఁడు; అమర............నిర్వికారుఁడు=దేవసేనల నాధరించుటయందు వికారము పొందనివాఁడు; షాణ్మాతురుండు = ఆర్గురు తల్లులు కలవాఁడు; తురాషాణ్ముఖసుఖప్రదుండు= ఇంద్రుఁడు మొదలగువారికి సుఖమును కలుగఁజేయువాఁడు; ప్రమదరసనిమగ్నమనస్కుండై =సంతోషమున మునిఁగిన మనస్సు కలవాఁడయి; అగ్నిభవున్ = అగ్నిపుత్త్రుఁడైన [అగ్నిభార్యలగు షట్కృత్తికలను కుమారస్వామికిఁ దల్లులు కాన అగ్ని తండ్రి యగును.] కుమారస్వామిని; ప్రణుతించి=స్తుతించి; అసాదంబు = నాశము లేనిది; తదీయప్రసాదంబు = అతని (కుమారుని) యనుగ్రహమును; కతిపయదివసంబులు = కొన్నిరోజులు; తద్రచిత......గ్రంథంబునన్ =అతనిచే కూర్పఁబడిన గొప్ప స్కాందపురాణగ్రంథమునందు; పూర్వభాగంబు = మొదటిభాగమును; తదాశ......నంబునన్ = దాని యర్థమును తెలిసికొనుట యను అమృతప్రవాహమున మునుఁగుటచే-ఇంపైన యా కథను వినుటవలన; కాశీ...... క్లేశంబును = కాశిని విడుచుటవలనఁ గలిగిన దుఃఖమును; ఉత్తరభాగంబునన్ =ఆపై(రెండవ)భాగమందు.

సీ. మిన్నేటిపాటియుఁ బెన్నయున్నతియు విపాశవాసియుఁ జంద్రభాగచేగ
యును శరావతిభూతియును వేత్రవతిచరిత్రము బాహుదయుదారతయును గృష్ణ
వేణి యగణ్యాభివృద్ధియుఁ గావేరిశీవియుఁ గపిలలీలావిభవము
మంజీరమంజువార్వైభవంబును భవనాశనిక్లేశనిర్నాశకృతియుఁ

తే. తుంగభద్రప్రసంగముత్తుంగభద్ర,రాజి రాజిల్లు గౌతమియోజ మఱియు
వార్తకెక్కిన తీర్థప్రవర్తనములు, స్వామి వినిపించె వింధ్యసంస్తంభయితకు. 148

టీక. మిన్నేటిపాటియున్ = గంగానది ప్రమాణమును; పెన్నయున్నతి = పెన్న గౌరవము, విపాశవాసియున్ = విపాశానదిమేలిమియు; చేగయును = సత్తయు-శ్రేష్ఠత్వమును; భూతియును = సంపదయును; చరిత్రము=నడవడి; ఉదారతయును = ఘనతయును; కృష్ణ...వృద్ధియును = కృష్ణానదియొక్క లెక్కలేని పెంపును; శీవి = బాగు(దర్జా); లీలావిభవము = విలాససంపద; మంజువార్వైభ

పరఁబును = మధురమైన జలసమృద్ధిని; క్లేశనిర్నామకృతియున్ = క్లేశముల పేరు లేకుండఁ జేయుటయును; ప్రసంగము = ప్రస్తావము; ఉత్తుంగభద్రరాజిన్, రాజిల్లు = అధికమైన శుభముల పరంపరచేఁ బ్రకాశించు; గౌతమియోజన్ = గోదావరివిధమును; వార్తకెక్కిన = ప్రసిద్ధికెక్కిన; తీర్థప్రవర్తనములు = తీర్థముల చరిత్రములు; స్వామి = కుమారుఁడు; వింధ్యసంస్తంభయిత్రకున్ = వింధ్యపర్వతము నణఁచినయగస్త్యునికి; వినిపించెన్.

క. ఆకుంభజాతో మఱియుం, గేకిధ్వజుఁ డనియె మౌనికేసరి! విను మిం
 కే కథ వినియెదు సకలము, నీ [1]కెఱిఁగించితినె కా ధునీచరితంబుల్. 149

టీక. కుంభజుతోన్ = అగస్త్యునితో; కేకిధ్వజుఁడు = కుమారస్వామి; మౌనికేసరి! = మునిశ్రేష్ఠుఁడా! ధునీచరితంబుల్ = నదులచరిత్రములను.

క. ఈగంగా[2]దికతీర్థము,లీఁగంగా నీవు తమ సమిద్ధాంబువులన్
 దోఁగెడువారల గనగనఁ, గ్రాఁగెడు నంగారసింధుకల్లోలములన్. 150

టీక. ఈ గంగాదికతీర్థములు = గంగ మొదలైన మీఁది తీర్థములు; తమ సమిద్ధాంబువులన్ = మిక్కిలి పవిత్రములైన తమ జలములయందు; తోఁగెడివారలన్ = మునుఁగువారిని; గనగన గ్రాఁగెడు = గనగనమండుచున్న; అంగారసింధుకల్లోలములన్ = నిప్పుటేటియలలయందు; ఈగంగానీవు = మునుఁగనీయవు - అనఁగా గంగాది తీర్థములందు మునుఁగువారికి నరకలోకములోని నిప్పుటేళ్లలో మునిఁగి బాధపడవలసిన యవసరము లేదని భావము. ఈ మీఁది తీర్థములందు మునుఁగువారికి పుణ్యము కల్గును. అలం. పర్యాయోక్తము.

క. వివిధక్షేత్రచరిత్రలు, వివిధ[3]సుపర్వానుభావవిలసనములుఁ దీ
 ర్థవిశేషశ్రవణముతఱిఁ, జెవికిం జవి యొసఁగెనే విశిష్టవిచారా! 151

టీక. వివిధ......నములు = పెక్కు విధములైన దేవతాప్రభావవిలాసములు; చవి=రుచి; విశిష్టాచారా! = ఉత్తమాచారము కల మునీ!

చ. అనుడు నగస్త్యుఁ డిట్లనియె హైమవతీసుతుతోడఁ దోడి స
 న్మును లలరంగ నోయనఘమూర్తి! సమస్తముఁ గ్రిందుచేసి మిం
 చిన బలువేల్పుఁ దీర్థమును క్షేత్రము నొక్కెడఁ గూడియుండెనే
 ని నిరుప[4]మాదృతిం దెలిపి నీవు మముం గరుణింపఁగాఁదగున్. 152

టీక. హైమవతీసుతుతోడన్ = హిమవంతుని పుత్రికయగు పార్వతి యొక్క పుత్రునితో; తోడిసన్మును లు = తనతోఁగూడ వచ్చిన గొప్పమునులు; అలరంగన్ = సంతోషింపఁగా; క్రిందుచేసి = తక్కువచేసి - అతిక్రమించి; బలువేల్పు = గొప్పదేవత; ఒక్కెడన్ =ఒక్కచోట; నిరుపమాదృతిన్ = సాటిలేని యాదరముతో.

క. అని పలుకు కలశభవముఖ,మునిజనముల ప్రశ్నవాక్యములు విని పురభి
 త్తనయుఁడు తత్త్రివిధము నొ,క్క[5]నెలం గుమిగూడి యునికిఁ గనజాలమికిన్. 153

టీక. కలశ.....ముల = అగస్త్యుఁడు మొదలుగాఁగల మునులయొక్క, పురభిత్తనయుఁడు= త్రిపురసంహారియగు శివునికి పుత్రుఁడు; ఒక్కనెలన్ = ఒక్కచోటనే; గుమిగూడి = చేరి, ఉనికిన్ = ఉండుటను.

---

1. చ. పలికితిన. 2. చ. (దిక - లేదు). 3. చ. సుపర్ణా. 3. చ. మాకృతిం. 4. శ. ఠం నెలవ. చ. నేల.

వ. ముహూర్తమాత్ర విచారదోలాయమాననిజస్వాంతుండై [1]యా యాశ్రమవిశ్రాంతులంగూర్చి యిట్లనియె. 154

టీక. ముహూర్త.....స్వాంతుండై = క్షణకాలము ఆలోచన యనెడి యుయ్యాలయం దూఁగుచున్న మనస్సు కలవాఁడై - ఆలోచనవలన నిలుకడలేని మనస్సు కలవాఁడై; ఆయాశ్రమవిశ్రాంతులంగూర్చి = ఆ మహర్షులతో.

క. ఏతత్త్రితయము నొకచోఁ, భూతలమున మేళవించి పొగడొందుట మ
చ్చేతోగతిఁ దోఁపదు సము, పేతావృతి ముకురమున నిభమును బోలెన్. 155

టీక. ఏతత్త్రితయమున్ = ఈ మూటిని; మేళవించి, పొగడొందుట = కలిసి, పేరుపడి యుండుట; మచ్చేతోగతిన్ = నామనోమార్గమందు - మనస్సునకు; సముపే.....వృతిన్ = ఆవరణ (కప్పు)తోఁ గూడిన యద్దమందు; ఇభమునుబోలెన్ = ఏనుఁగువలె, తోఁపదు.

అద్దమునకు మూఁత లేనపు డెంత చిన్నవస్తువైన నందు ప్రతిఫలించును; మూఁత యున్నపుడు ఏనుఁగంత పెద్ద జంతువైన నందు కనఁబడదు. అలం. ఉపమ.

తే. చిత్త మాశ్చర్యరసమున జొత్తిలంగఁ, జేయు నీప్రశ్న ముత్యక్షాస్త్రముచేత
నిందుధరుచేత హరుచేత నెఱుఁగవలయు, రండు తాపసులార! రజతగిరికి.

టీక. చిత్తము = మనస్సును; ఆశ్చర్యరసమునన్ = ఆశ్చర్యమను ద్రవమున; జొత్తిలంగఁ జేయు = తడియునట్లు చేయు - మనస్సును హత్తుకొనఁజేయు; అ...క్షాస్త్రముచేతన్ = (మూఁడవ) కన్ను ఆయుధముగాఁ గల శివునివలన; ఇందుధరుచేతన్ = చంద్రుని ధరించినవానిచేత - శివునివలన; (పంచమ్యర్థమున తృతీయ) రజతగిరికిన్ = కైలాసపర్వతమునకు, పోదము; రండు.

క. పొడమిన సందేహంబుల, జడిసిన మందేహులం బ్రసన్నులఁ జేయన్
మృడునకుఁ బని గావున మన, మడిగిన యర్థంబు నతఁడ యాదేశించున్. 157

టీక. పొడమిన = కలిగిన; సందేహంబులన్ = సందేహములచేత; జడిసిన = చలించిన; మందేహులన్ = నిదానము చెడినవారిని; ప్రసన్నులన్ = విశ్వాసమునొందినవారినిగా; మృడునకున్ = శివునకు; ఆదేశించున్ = ఉపదేశించును - తెలియఁజేయును.

క. అని కృతనిశ్చయమతి న, మ్మును లంగొని రజతశైలమున కేఁగఁదలం
చిన గుహలఁ బొగడెడు క్రియ బోరన మ్రోసెఁ బ్రయాణభేరి ప్రసభారభటిన్.

టీక. కృతనిశ్చయమతిన్ = నిశ్చయింపఁబడిన మనస్సుతో; బోరనన్ = వేగముగా; ప్రసభారభటిన్ = ఎక్కువ ధ్వనితో. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. ఆసమయంబునన్ ధృతనిజాయుధు లాదృతభూషణుల్ మహో
ల్లాసలసన్ముఖుల్ వివిధలాంఛనలక్షితు లాసురాన్వయ
త్రాసకరుల్ విమానగులు దైవతవీరులు తారకారిపె
న్వాసల మ్రోల నిల్చి రొకముప్పదికోటులు మూఁడుకోటులున్. 159

టీక. ధృతనిజాయుధులు = ధరింపఁబడిన తమతమ ఆయుధములు కలవారు; ఆదృతభూషణుల్ = ఆదరింపఁబడిన - ధరింపఁబడిన నగలు కలవారు; మహోల్లాసముఖుల్ = గొప్ప సంతోషముతోఁగూడిన (వికసించిన) ముఖములు కలవారు; వివిధలాంఛనలక్షితులు = పెక్కు విధముల చిహ్నములతోఁ గూడినవారు; అసురాన్వయత్రాసకరుల్ = రాక్షసుల వంశమునకు భయముగొల్పు

1. తూవ్రా. ప్ర. ట. యశ్రాంతమాశ్ర.

వారు; విమానగులు = విమానములపై నున్నవారు; దైవతవీరులు = దేవవీరులు; తారకారివెక్త్రోసల మ్రోలన్ = కుమారస్వామి మొగసాలయెదుటను; నిల్చిరి.

మ. పనితప్రక్రియ నల్దెఱంగు లెసఁగన్ బ్రస్థాననైపథ్యశో
భనముం గైకొని బ్రహ్మగర్భుఁడు మహాత్పల్యాణకల్యాణమై
ఘనగర్జన్ [1]సకిలించువాపురము నెక్కంబోవుచోఁ బర్వె సం
జనితాశాకరికర్ణసంజ్వరభరాంచత్కంచుకిధ్వానముల్. 160

టీక. పనితప్రక్రియ = పొగడఁబడిన (గొప్ప) విధము; నల్దెఱంగులు, ఎసఁగన్ = నాల్గు దిక్కులను వ్యాపింపఁగా; ప్రస్థాననైపథ్యశోభనమున్ = ప్రయాణమునకుఁ దగిన వస్త్రాభరణాదులను; బ్రహ్మగర్భుఁడు = శివునిపుత్త్రుఁడు - కుమారస్వామి; మహాత్ప్యాణకల్యాణమై = మోయుచున్న జీనిచేత మేలయినదై; ఘనగర్జన్ = మేఘగర్జనతో - గొప్పధ్వనితో; వాపురమున్ - వారువమును - వాహనమును; సంజని......ధ్వానముల్ = పుట్టిన - దిగ్గజముల కర్ణములను బాధించు (బ్రద్దలు చేయు) కంచుకులయొక్క అఱపులు; పర్వెన్ = వ్యాపించినవి.

సీ. ఆటకు మెచ్చి బలారి యీఁగొను మరుత్ఫల మిది యన బర్హభార మమర
హారుఁ గుత్తుకనకాక శిరసునఁ బోలఁ దాల్చిన జటాచ్ఛటలీల శిఖ వెలుంగ
క్షితి శిరోభూషావిశేషనిర్మితికిఁ బాల్పడు వడియచ్చుల ట్లడుగులు దగ
ధాతృవాహనభుక్తిఁ దా నభ్యసింప బిసము మ్రింగుభంగి దష్టఫణి గ్రాలఁ
తే. కంఠగంభీరనినదంబు ఖచరయువతి, గానవిద్యకు షడ్జసంధాన మొసఁగ
నెసఁగు దెలికన్నుగోనల యెక్కిరింత, నెక్కె బలుకొండఁ దూఁటువోనేయు మేటి.

టీక. బలారి = ఇంద్రుఁడు; ఈఁగొను = ఈయఁగా, గ్రహించు; మరుత్ఫలము = వాయుఫలము- ఇంద్రధనుస్సు; [మరుత్ఫలము = దేవతలవలని లాభము అని పూర్వటీక. అది తప్పు.] బర్హభారము, అమరన్ = పింఛము ప్రకాశింపఁగా; హరున్ = శివుని; కుత్తుకనకాక = కంఠముచేతనే కాక; శిరసునన్ = శిరస్సుచేతనుగూడ; తాల్చిన = ధరించిన; జటాచ్ఛటలీలన్ = జడలగుంపువలె; శిఖ, వెలుఁగన్ = జుట్టు, ప్రకాశింపఁగా; [శివుఁడు నీలకంఠుఁడు, నెమలియు నీలకంఠము-ఆ నీలగళత్వమే కాక జటిలత్వము కూడ శివ, మయూరములకు సామాన్యధర్మమని యర్థము.] క్షితి... ..నిర్మితికిన్ = భూమియొక్క శిరోభూషణవిశేషములను నిర్మించుటకు; పాల్పడు = పూనుకొనునట్టి-ఏర్పఱుపఁబడునట్టి; వడియచ్చులట్లు = కరువులవలె - ముద్రసాధనములవలె; తగన్ = ఒప్పియుండఁగా; ధాతృవాహనభుక్తిన్ = బ్రహ్మవాహనమైన హంసముయొక్క ఆహారపద్ధతిని-తామరతూండ్లను దినుటను; బిసము మ్రింగుభంగిన్ = తామరతూఁడు తినునట్లు; దష్టఫణి = (నోటఁ) గఱచిన పాము; గ్రాలన్ = ప్రకాశింపఁగా; కంఠగంభీరనినదంబు = గంభీరమైన కేకాధ్వని; ఖచరయువతిగానవిద్యకున్ = గంధర్వస్త్రీలయొక్క సంగీతమునకు; షడ్జసంధానము = షడ్జస్వరపు కూర్పును; [నెమలియఱపు షడ్జస్వరము కలదని సంగీతశాస్త్రము.] ఒసఁగన్ = కలుగఁజేయఁగా; ఎసఁగు = ప్రకాశించునట్టి; తెలియకన్నుగోనల యెక్కిరింతన్ = తెల్లని కనుఁగొలఁకులు కల వాహనమైన నెమలిని; బలుకొండఁదూఁటువోనేయుమేటి = గొప్పకొండను (క్రౌంచమును) చిల్లులుపడునట్లు కొట్టిన వీరుఁడు - కుమారస్వామి; ఎక్కెన్.

కుమారుని వాహనమైన నెమలి యొక్క పింఛము దానియాటకు మెచ్చి యింద్రుఁడిచ్చిన యింద్రధనుస్సువలె రంగురంగులు కలిగి యున్నదనియు, జుట్టు శివునిజడలవలెను, అడుగులు భూమియను స్త్రీ తలపై ధరించు నగలు కరువుబోయు నచ్చులవలెను, నోటితో పట్టుకొన్న పాము బిసమువలెను ఉన్నదనియు, దాని కనుగొలుకులు తెల్లనివనియు, కేక షడ్జస్వరయుక్తమనియు తాత్పర్యము. అలం. ఉత్ప్రేక్ష.

1. చ. సగిలించు.

క. అది సజ్జస్యందనమై, మదకరియై తత్తదుచితమార్గంబుల నే
ర్పాదవ నొకకొంత చని పా,రద నిభశుభమూర్తి నశ్వరత్నం బగుడున్. 162

టీక. అది = ఆ నెమలి; సజ్జస్యందనమై = సిద్ధముచేయఁబడిన రథమై; మదకరియై = మదపుటేనుఁగై; తత్తదుచితమార్గంబులన్ = ఆ యా రీతులకుఁ దగినట్లు; పారదనిభశుభమూర్తిన్ = పాదరసముతో సమానమగు స్వచ్ఛమైన దేహముతో; అగుడున్ = కాఁగా-మాఱఁగా ననుట.

ఆనెమిలి కొంతదనుక రథమువలెను,ఏనుఁగువలెను నడిచి, తుదకు అశ్వమువలె పరుగిడెనని భావము.

క. శితికంఠసుతుఁడు ఖచర,స్తుతుఁడై [1]యాయిచ్ఛరూపు†తురికీ నాస్కం
దిత ధౌరితకప్లుత రే,చితవల్గితగతులఁ ద టుచేసిన నదియున్. 163

టీక. శితికంఠసుతుఁడు = శివపుత్త్రుఁడు - కుమారస్వామి; ఖచరస్తుతుఁడై = దేవతలచేఁ గొనియాడఁబడినవాఁడై; ఆ యిచ్ఛరూపుతురికీని = కోరినరూపముధరించు నావాహనమును; ఆస్కందిత ........గతులన్ = ఆస్కందితాది గమనములచేత; [ఆస్కందితము = మిక్కిలివేగమును, మిక్కిలి మందమును గాని గమనము; ధౌరితకము = మీఁది గమనముకంటెఁ గొంచెము వడిగల నడక; ప్లుతము = అతివేగముగా దాఁటుచు పోవుట; రేచితము = వంకరగాఁ దిరుగక వడిగాఁబోవు గమనము; వల్గితము= మీఁదికి కాళ్లెత్తి కదలించుచు వడిగాఁ బోవు గమనము.] తరటుసేయఁగాన్ = కొరడాతోఁగొట్టి నడిపింపఁగా.

క. మురళి గొనియు రవణమునన్, బరువడి గోమూత్రికాది భంజళులఁ గడఁకన్
గెరలి చతుర్విధధావిత,పరిపాటీపాటవమునఁ బతి మెప్పించెన్. 164

టీక. మురళి, రవణము, పరువడి, భంజళి అను నాలుగును గుఱ్ఱము దౌడుతీయుటయందలి భేదములు; అందు మిక్కిలి వడిగాఁ బరుగెత్తుట (పరుగు+వడి) పరువడి; పాముపలె వంకర, వంకరగా నడుచుట భంజళి; గోమూత్రికము భంజళిలో నొక విశేషము; ఇట్లు పూర్వటీక. కెరలి = రేఁగి; చతు......పాటవమునన్=నాల్గువిధముల ధావనపద్ధతుల నేర్పుచే; పతిన్=యజమానుని; మెప్పించెన్.

సీ. బలుపాపతలచుట్టు లలవరించినవారు లేఁత[2]చందురులఁ దాల్చినవారు
పుసుకతమ్మంటులఁ బొలుచు వీనులవారు [3]నొసలి మిక్కిలిచూపు లెసఁగువారు
[4]బూఁదుహాఱఁగ మేన బూదిఁ బూసినవారు త్రిముఖాస్త్రములు కేలఁ ద్రిప్పువారు
పులితోలుహొంబట్టుపుట్టముల్ గలవారు కొమ్ముతేజులఁ నెక్కి గునియువారు

తే. ఘోరతపముల హరుఁ దక్కఁగొన్నవారు, కరటిదైతేయకుంభముక్తాలలామ
హారిభుజమధ్యములవా రుదారయశులు, ప్రమథవీరులు *గొలిచిరా బాహులేయు.

టీక. శివుని రూపములతో నున్న ప్రమథగణములు ఇందు వర్ణింపఁబడెను బలుపాపతలచుట్టులు = పెద్దపాముల తలపాగలు; అలవరించినవారు = ధరించినవారు; పుసు......వారు = తలపుజ్జెలచేఁ జేయఁబడిన కుండలములచేఁ ప్రకాశించువారు; నొసల...వారు = నొసట మూఁడవ కన్ను కలవారు; బూఁదువారఁగన్ = బూఁజుపట్టినట్లు; బూది = భస్మము; త్రిముఖాస్త్రములు = త్రిశూలములు; హొంబట్టుపుట్టముల్ = బంగారు పట్టువస్త్రములు; కొమ్ముతేజులన్ = వృషభవాహనములను; గునియువారు = కులికెడివారు; హరున్ = శివుని; తక్కఁగొన్న వారు = స్వాధీనముచేసికొన్నవారు; కరటి......మధ్యములవారు = (శివునిచేఁ జంపఁబడిన) గజాసురునియొక్క కుంభస్థలమునందలి మంచి ముత్యములచే సొగసైన వక్షములు కలవారు; ఉదారయశులు=

1. క. యచ్ఛరూపు. † తురికిని. శ. ర. 2. చ. చంద్రులను. 3. క. నొసల. చ. నొసలి.
4. ట. బూజు. క. బూదు. బూఁదు. శ. ర. * గొల్చి. సూర్య.

గొప్ప కీర్తికలవారు; ఆ బాహులేయుఁ = పెక్కుమంది తల్లులు గల ఆకుమారస్వామిని; కొలిచిరి = సేవించిరి.

శా. క్షోణీరేణుకృతంబు లంజన రజోగుచ్ఛాసితంబుల్ తమ
శ్శ్రేణుల్ దూషితపూష[1]భూషణగతిన్ జృంభించియున్ దూలెన
క్షీణోత్తంభితశక్తి భృద్భటశిరస్సీమాకిరీటస్ఫుర
న్మాణిక్యాతపపల్లవస్తబకసామగ్రీహృతాగ్రంబులై. 166

టీక. క్షోణీరేణుకృతంబులు = నేలనుండి లేచిన దుమ్ముచే ఏర్పడినవి; అంజన...తంబుల్ = కాటుకపొడికుప్పలవలె నల్లనైనవి; తమశ్శ్రేణుల్ = చీఁకట్లు; దూషిత......గతిన్ = దూషింపబడిన (కొఱతచేయఁబడిన) సూర్యునికి భయము కల్గునట్లుగా; (సూర్యునితిరస్కరించి, అతనికి భయము కల్గునట్లుగా.) జృంభించియుఁ = విజృంభించియు - వ్యాపించినను; అక్షీణో.....గ్రంబులై - అక్షీణ = తక్కువవి కానివియు; ఉత్తంభిత = మీఁదికి వ్యాపించినవియు నగు; శక్తిభృద్భటశిరస్సీమా కిరీట = కుమారస్వామి భటుల తలలపై నున్న కిరీటములందు; స్ఫురత్ = ప్రకాశించుచున్న; మాణిక్యాతపపల్లవస్తబకసామగ్రీ = కెంపులవెలుగుల గుంపుల సామగ్రిచే; హృతాగ్రంబులై = పోఁగొట్టఁబడిన కొనలుగలవై; తూలెన్ = చెదరిపోయినవి.

సేనల రాపిడివలన నేలనుండి నల్లనిదుమ్ము వ్యాపించి లోకమును చీఁకట్లలో ముంచినను, వీరుల కిరీటములందలి మాణిక్యముల కాంతిచే ఆ చీఁకట్లు నశించినవని భావము.

క. స్మరశశితటిదజపవమా,నరవిసుధాసలిలమునిజనక్ష్మారిష్టా
సురమృత్యుజ్వలనజ లగు,సురవేశ్యలు గొలిచి రపుడు సుబ్రహ్మణ్యున్. 167

టీక. స్మర......జ్వలనజలు = (క్రమముగా) మన్మథుఁడు, చంద్రుఁడు, మెఱుపు, బ్రహ్మ, వాయువు, సూర్యుఁడు, అమృతము, నీరు, మహర్షులు, భూమి, (దక్షపుత్రికయగు) అరిష్ట, దేవతలు, మృత్యువు, అగ్ని - అనువారివలనఁ బుట్టినవారు - పదునాల్గు తెగలవారు; సురవేశ్యలు = అప్సరసలు.

క. దైవతభటభుజశిఖర,వ్యావల్గన్నచ కృపాణవల్లిక లలరెన్
దైవపథవారినిధిసలి,లావిష్కృతవిషమషీమహోర్చులుపోలెన్. 168

టీక. దైవత......వల్లికలు = దేవవీరుల మూఁపులయందు తళతళలాడుచు చలించుచున్న తీగలవంటి సానపట్టిన కత్తులు; దైవ......హార్చులువోలెన్ = ఆకాశ మను సముద్రపు నీటినుండి వెడలిన విషముయొక్క నల్లని మంటలవలె; అలరెన్ = ప్రకాశించెను. అలం. రూపకము, ఉపమ.

క. నయనత్రిభాగ[2]వృతహా,సయుతంబుగ సాధ్యసతులు చల్లిన లాజల్
నయనాయుధ తనయాయుధ,చయలతికావళుల కుసుమసమత వహించెన్. 169

టీక. నయన......తంబుగన్ = కనుకొలుకులయందు దావరించిన నవ్వుతోఁగూడునట్లు; లాజలు = ఆచారార్థము చల్లిన పేలాలు; నయనా......వళుల = శివుని పుత్రుఁడగు కుమారస్వామి యొక్క ఆయుధచయములను లతలయందలి; కుసుమసమతన్ = పూవులతోడి సామ్యమును; వహించెన్ = పొందెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. వివిధదివిషద్వధూముక్తదివిజవిటపి, కుసుమకేసరలస[3]దంసకూటుఁ డగుచు
వేల్పుబడవాలు కడువాలు విరియఁబడిన, కందమునఁ బొల్చు దుర్గకంఖాళి మనఁగ.

టీక. వివిధ......కూటుఁడు = దేవతాస్త్రీలచేత విడువఁబడిన పెక్కు విధములగు కల్పవృక్ష పుష్పకేసరములచేఁ బ్రకాశించు శిఖరములవంటి మూఁపురములు కలవాఁడు; వేల్పుఁబడవాలు = దేవతల

1. చ. భూపణ. 2. దరహాస. చ. 3. లసదున.

సేనాధిపతి - కుమారస్వామి; విరియఁబడిన కందమునన్ = వికాసము వహించిన మూఁపురముచేత; పొల్చు = ప్రకాశించునట్టి; దుర్గకంఠీరవమనఁగన్ = దుర్గకు వాహనమైన సింహమో యనునట్లు; కడున్ = మిక్కిలి; వాలున్ = అతిశయించెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. విబుధమధురాధరాభుజావీజ్యమాన
విపులచామరబహుసహస్రములు వొలిచె
స్వామియిరుగడఁ బుష్పవర్షములఁ దలఁకి
సురవిమానమరాళముల్ దెరలె ననఁగ. 171

టీక. విబుధ......సహస్రములు = దేవతాస్త్రీలచేతులచే వీచఁబడుచు చక్కనైన వేల కొలఁదిగనుండు వింజామరలు; స్వామియిరుగడన్ = స్వామికి రెండు వైపులను; పుష్పవర్షములన్ = పుష్పవర్షములవలన; తలఁకి = భయపడి; సురవిమానమరాళముల్ = దేవతల విమానములైన హంసలు; తెరలెననఁగన్ = తొలఁగిపోయెనో యనునట్లు; పొలిచెన్ = ప్రకాశించెను. వర్షమును జూచి హంసలు పాఱిపోవుట సహజము; కాన పుష్పవర్షములకుఁ దలఁ విమానమరాళములు తెరలెనని వర్ణితము. అలం. రూపకము, ఉత్ప్రేక్ష.

తే. సామిమలనుండి రాజతాచలముదాఁక, సేతు వెత్తినగతి మహాసేనసేన
రోదసీరంధ్రనీరంధ్రరూప మగుచు, నడచె గిరిసింధువన[1]సృష్టి పుడమి నడఁగ.

టీక. సామిమలనుండి = (కుమార)స్వామి పర్వతమునుండి; రాజతాచలముదాఁకన్ = కైలాసమువఱకును; సేతువు, ఎత్తినగతిన్ = వారధి కట్టినట్లు; మహాసేనుసేన = కుమారస్వామిసైన్యము; రోదసీరంధ్రనీరంధ్రరూపము, అగుచున్ = భూమ్యాకాశముల మధ్యభాగమున సందులేనిదై - (క్రిక్కిరిసి); పుడమిన్ = భూమిపై; గిరిసింధువనసృష్టి = కొండలయు, నదులయు, అడవులయు సృష్టి; అడఁగన్ = అణఁగిపోవునట్లు; నడచెన్. దక్షిణముననున్న స్వామిమలమొదలుకొని ఉత్తరమున నున్న కైలాసమువఱకును వ్యాపించి' కుమారస్వామిసైన్యము నడచుచుండఁగా కొండలు పిండియై, నదులు (దుమ్ముతోఁగలసి) నిర్జలములయి, అడవులు నేలమట్టమై పేరులేకుండఁ బోవుచున్నవని భావము. అలం. ఉపమ.

ఉ. పుట్టినమోములై శిఖరముల్ వెలుఁగొంద, నితంబమండలిం
గట్టిన కృత్తియై నిబిడకాననరేఖ దలిర్ప, లోనఁ జూ
పట్టిన విశ్వమై వెలుఁగుప్రాణికులం బలరన్, గిరీశుఁ డ
వ్వుట్టికిఁ గానిపించినప్రభం గలధౌతనగంబు తోఁచినన్. 173

టీక. కైలాసపర్వతము తనతండ్రియగు శివునివలెఁ గుమారస్వామికిఁ గానిపించెనని యీపద్యమున వర్ణింపఁబడుచున్నది. శిఖరముల్ = కొండకొనలు; పుట్టిన మోములై = సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములను (శివుని) పంచ ముఖములయి; వెలుగొందన్ = ప్రకాశింపఁగా; నిబిడకాననరేఖ = దట్టమైన అడవులవరుస; నితంబమండలిన్ = నడుమున; కట్టిన = ధరించిన; కృత్తియై = తోలై; తలిర్పన్ = ప్రకాశింపఁగా; లోనన్ = కుక్షిలో; చూపట్టిన = కనఁబడిన - ఉన్న; విశ్వమై = ప్రపంచమై; వెలుగు = ప్రకాశించు; ప్రాణికులంబు, = జీవజాలము; అలరన్ గిరీశుఁడు = శివుఁడు; అప్పట్టికిన్ = ఆ కుమారునికి; కానిపించిన ప్రభన్ = కనిపించునట్లుచేసిన రీతిని; కలధౌతనగంబు = కైలాసము; తోఁచినన్ = కనఁబడఁగా.

1. చ. పుష్టి.

క. జైవాతృకబింబము నిజ, జీవాతువుఁ గాంచి ప్రాప్తజీవము లగుచుఁ
జీవంజీవము లలరెడు, భావంబున బాహులేయుబలములు పొదలెన్. 174

టీక. నిజజీవాతువుఁ = తమ జీవనౌషధమగు; జైవాతృకబింబముఁ, కాంచి=చంద్రబింబమును చూచి; ప్రాప్తజీవములు, అగుచుఁ = (పోనున్న) ప్రాణములు వచ్చినవై; జీవంజీవములు = చకోరములు; అలరెడు భావంబునఁ = సంతోషించునట్లు; బాహులేయుబలములు = కుమారుని సేనలు; పొదలెఁ = సంతోషించెను. అలం. ఉపమ.

తే. పద్మరాగమణీమయపాదలబ్ధి, స్ఫురితగైరికశిఖరచంచూసమృద్ధి [బోలి.
గంధవతి [1]యను నొక్క పంకజమునడుమ, మించు నక్కొండ కొదమరాయంచఁ

టీక. పద్మ......లబ్ధిఁ = పద్మరాగమణులను పొందుటచేతను - (కాళ్లను పొందుటచేతను, దగ్గఱనుండు చిన్న కొండలను పొందుటచేతను); స్ఫురిత......సమృద్ధిఁ = ప్రకాశించుచు, గైరికాది ధాతువు(రంగు)లతోఁగూడిన శిఖరములను ముక్కుల సమృద్ధిచేతను; గంధవతియను = భూమి యనునట్టి; పంకజమునడుమఁ = తామరపూవు మధ్యయందు; కొదమరాయంచఁబోలి = జవ్వనముగల రాజ హంసమువలె; అక్కొండ; మించెఁ = ప్రకాశించెను.

భూమి యొక తామరపూవువలెను, అందున్న కైలాసము (తెల్లనికొండ) ఒక రాజహంసవలె నున్నవి. పద్మరాగమణులుగల (ఎఱ్ఱని) కైలాసప్రత్యంతపర్వతములు హంస కాళ్లవలెను, గైరికాది ధాతువులచే నెఱ్ఱనైన కైలాసశిఖరములు హంసముక్కువలెను ఉన్నవని భావము. అలం. రూపకము, ఉపమ.

తే. నీలగళవాహరింఖాఖనిత్రనిహతి, నింగి కెగసిన వెండిరానేలదుమ్ము
ప్రాంతవర్తిష్ణు సప్తర్షిపరివృఢులకు, [2]నొసఁగు నిర్యత్నభసితవిలసిత మచట. 176

టీక. నీల......నిహతిఁ = శివునివాహనమగు వృషభముయొక్క గిట్టలను గొడ్డళ్లదెబ్బల వలన; నింగికి = ఆకాశముపైకి; ఎగసిన = ఎగిరిన; వెండిరానేలదుమ్ము = వెండిరాళ్ల తెల్లదుమ్ము; ప్రాంత ...పరివృఢులకుఁ = దగ్గఱనున్న సప్తర్షిమండలమునకు; [కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, వసిష్ఠుఁడు, జమదగ్ని అను నేడుగురును సప్తర్షులు.] నిర్యత్నభసితవిల సితము = ప్రయత్నమక్కఱలేని భస్మధారణమును; అచటఁ; ఒసఁగున్.

నందీశ్వరుఁ డెగురఁగొట్టిన తెల్లని వెండిదుమ్ము సప్తర్షులదేహములపైఁ బడి, వారు వేఱే శ్రమపడి బూడిద పూసికొననక్కఱలేకుండ చేయుచున్నదని భావము.

వ. కట్టు నిజబలనిఖిలనిరీక్షణనిస్తంద్రచంద్రికా[3]ధీనం బగు నగ్గట్టు తేనివైమానికసే నాని మానధనుం డగు నధికుండు నిజపురుషకారంబునుంబోలె నధిరోహించి.177

టీక. నిజ......ధీనంబు = తన సేనల చూపులకు (దృష్టికి) తక్కువకాని వెన్నెలకు లొంగి నది - నేత్రములకు వెన్నెలవలె చల్లదనము కలిగించునది - ఆనందకరమైనది; (ఇచట 'చంద్రికాధీనంబు' అను సమహాత్తు మహద్విశేషణముగా వాఁడబడినది.) గమ్యస్థానము చేరినందులకుమార్గాయాసపరిశ్రాంతము లగుసేనలు మిగుల సంతసించిన వనుట. వైమానికసేనాని = దేవసేనాపతి - కుమారస్వామి; నిజపురుష కారంబునుంబోలెఁ = తనప్రయత్నమువలె; అధిరోహించి = ఎక్కి. అలం. ఉపమ.

క. వాహనము డిగి గగనచర, వాహినిఁ దక్కుధరసవిధవనవిహారణకాం
క్షాహూతహృదయ నటయటఁ, దోహాలో నిలు మనుచు నిలిపి యుల్లం బలరన్.

---

1. చ. యును. 2. చ. వొసఁగు. 3. క. ధీనంబ. చ. ధేనంబ.

టీక. గగనచరవాహినిన్ = దేవసేనను; తత్కుధర...హృదయన్=ఆకొండచుట్టుప్రక్కలఁ గల వనములందు విహరించు వేడుకలతోడి మనస్సులు కలదానిని; ఉల్లంబు = మనస్సు; అలరన్ = సంతోషింపఁగా.

ఉ. ఆ రవి వాలఖిల్యయుతుఁడై విధుగర్భను దూఱెనో యనన్
దారకవైరి సంయమికదంబయుతంబుగ నేఁగుదెంచి ము
[1]క్తారుచిరుంద్రమైన వసుధారథుగేహముఁ జొచ్చునప్డు మా
రారియు నిష్కుటాంతరవిహార ముమాన్వితుఁడై యొనర్పఁగన్. 179

టీక. రవి=సూర్యుఁడు; వాలఖిల్యయుతుఁడై=వాలఖిల్యులను మునులతోఁ గూడి; విధుగర్భమున్= చంద్రునిగర్భమును; తారకవైరి = కుమారస్వామి; సంయమికదంబయుతంబుగన్ = మునులసమూహముతోఁగూడ; ముక్తారుచిరుంద్రమైన = స్వచ్ఛమైన) ముత్యముల కాంతిచే (అతిశయించిన; వసుధారథగేహమున్ = శివుని యిల్లయిన కైలాసమును; మారారియున్ = శివుఁడును; ఉమాన్వితుఁడై = పార్వతితోఁ గూడి; నిష్కుటాంతరవిహారము = ఇంటికిసంబంధించియున్న తోఁట (గృహారామ) మధ్యమున విహరించుటను; ఒనర్పఁగన్.

తే. మందిరోద్యానఖేలనానందవిభవ, [2]మవధరించెడు తారాధిపార్ధమౌళిఁ
[3]జివురుగుత్తులవిరులఁ బూజించుటకునొ,యాఱుఋతువులు సన్నిధి నెసఁగెన్యనచట.

టీక. మంది......విభవము = ఇంటిపూఁదోఁటలో విహరించుటవలని యెక్కువ ఆనందమును; అవధరించెడు = చిత్తగించునట్టి - పొందునట్టి; తారాధిపార్ధమౌళిన్ = అర్ధచంద్రునిఁ దలపై ధరించిన శివుని; విరులన్ = పూవులతో; పూజించుటకునొ = పూజించుటకో యనునట్లు. అలం. ఉత్ప్రేక్ష.

సీ. మరువంపువలపుఁ బల్మఱు క్రోలిక్రోలి కన్ [4]మ్రాన్చి యూరక మేనుమఱచుఁ గొన్ని
యరవిచ్చు తెలిమొల్లవిరులమూఁతులు సాచి పొదిగూడి ఱెక్కలఁ బొదువుఁ గొన్ని
గురువిందపూఁదేనె [5]పెరలకై తమలోనఁ బొత్తువోవక పోరెఁ బోరుఁ గొన్ని
పక్వంబు లగుదాఁకఁ బాటించి మల్లికా కలికానికాయంబుఁ గాచుఁ గొన్ని

తే. భోగివశమైన గేదంగిపూవునకును, వగచు మదిఁ గొన్ని బంధుజీవకలతాంత
గుచ్ఛములలోన నొకకొన్ని కొలువుసేయుఁ, దేటులఖిలర్తుమయవనీవాటి గమిచి.

టీక. తేఁటులు; (1) మరువంపువలపున్=మరువముయొక్క పరిమళమును; క్రోలి=త్రాగి-అనుభవించి, కన్ మ్రాన్చి = కన్నులమూసి, [ఇందు వసంతర్తువు గోచరము.] (2) అరవిచ్చు = సగము వికసించిన; తెలిమొల్లవిరులన్ = తెల్లనిమల్లిపువ్వులను; పొదిగూడి = గుమికూడి; ఱెక్కలన్, పొదువు = ఱెక్కలతో కప్పును. [ఇందు శిశిరర్తువు వ్యక్తము] (3) గురు......పెరలకై = గురువిందపూల తేనెతెట్టెకయి; పొత్తువోవక = వంతు కుదురక; పోరెన్ = మాటిమాటికి; [ఇందు హేమంతఋతువు సూచితము.] (4) పాటించి = ప్రతీక్షించి - ఎదురుచూచి - కనిపెట్టియుండి; [పాటించి = పొంది - చేరియుండి అని పూర్వటీక.] మల్లికా......నికాయంబున్ = మల్లెమొగ్గలగుంపును; కాచున్ = కాపాడును. [ఇందు గ్రీష్మర్తువు సూచితము.] (5) భోగివశమైన = పామునకు స్వాధీనమైన-అనుభవించు వేరొకనికి స్వాధీనమైన; గేదంగిపూవునకును = మొగలిపువ్వునకయి; వగచున్ = విచారించును; [ఇందు వర్షర్తువు గ్రాహ్యము] (6) బంధు.....గుచ్ఛములలోనన్ = మంకెనపూవుగుత్తులలో; అఖిల......వాటిన్ = సమస్తర్తువులతోఁగూడిన వనమున; [ఇందు శరదృతువు జ్యోతితము.] కమిచి = ఆక్రమించి.

---

1. చ. రంధ్ర. 2. చ. నవధరింకగ. 3. చ. జిగురు. 4. చ. మ్రాల్చి. 5. చ. తెరల.

తే. పూవుఁదేనియఁ [1]దడిసిన మావిచిగురు
మీఁద నంటి చరించు తుమ్మెద తలిర్పు
సమయ [2]మగుటయు [3]నసినెయ్యి సమరి మరుఁడు
త్రుప్పువోఁ దోము [4]నీలంపుఁదునుక యనఁగ. 182

టీక. పూవుఁదేనియన్=పూఁదేనెతో; అంటి = అనుసరించి; అసిన్ = కత్తిపయి; నేయిచమరి= నేయిరాచి; త్రుప్పువోన్ = త్రుప్పు - ఇనుముమీఁది ముఱికి (పింపిరి) పోవునట్లు; నీలంపుఁదునుక యనఁగన్ = నల్లరాతిముక్కయో యనునట్లు; తలిర్పన్ = ప్రకాశించును.

మామిడిచిగురు మన్మథునికి ఆయుధము (కత్తి) వంటిది. అది పూవుఁదేనెతో తడియఁగా, తేనెపై నాసగల తుమ్మెద ఆకుమీఁది తేనెను గ్రహింపలేకను, దానిని విడువను మనసురాకను ఆ చిగురు పైనే యిటునటు తిరుగుచుండెను; అప్పుడు ఆ మన్మథుఁడు విరహులపై దాడివెడలఁదలఁచి, తన కత్తికి నేయిరాచి, నల్లరాతిముక్కతో దానికి పదునుపట్టుచున్నట్లుగా వర్ణింపఁబడినది. ఇచట చిగురు కత్తితోను, తేనె నేతితోను, తుమ్మెద సానరాతిముక్కతోను పోల్పఁబడినవి. అలం. ఉత్ప్రేక్ష.

తే. గంధవిరహిత మను బుద్ధిఁ గనక తేఁటి, మూతి విచ్చిన మోదుగు మొగ్గఁ దగిలి
సౌరభాకాంక్షఁ [5]జొచ్చి చెన్నారెఁ గీర, తుండవశమైన నేరేడుపండుపోలె.

టీక. గంధవిరహితము = పరిమళము లేనిది; అను బుద్ధిఁ గనక = అను జ్ఞానమును పొందక - అను జ్ఞానము లేక; తేఁటి = తుమ్మెద; మూతి, విచ్చిన = చివఱిభాగము విడిన; తగిలి = లగ్నమయి; సౌరభాకాంక్షఁ జొచ్చి = పరిమళము నాస్వాదించు కోరికను పొంది; కీరతుండవశమైన = చిలుక ముక్కునకు స్వాధీనమయిన.

కొంచెము వికసించిన మోదుగుపూవు చిలుకవలె నున్నదనియు, దానిచివఱి నంటి నిలిచిన తుమ్మెద నేరేడుపండువలె నున్నదనియును భావము. అలం. ఉపమ.

క. ఖరకరకరహతి సలసలఁ, దెరలెడు[6]మల్లీమరందదీర్ఘికచుట్టున్
దిరుగు నళి యనుభవమునకుఁ, జొర[7]దతిలోభాంధబుద్ధి సొమ్మరయు క్రియన్. 184

టీక. ఖరకరకరహతిన్ = వేఁడికిరణములు గల సూర్యుని కిరణములు సోఁకుటవలన; సలసలఁ దెరలెడు = సలసల క్రాఁగుచున్న; మల్లీమరందదీర్ఘికచుట్టున్ = మల్లెపూఁదేనె గల దిగుడుబావిచుట్టును; తిరుగునళి=తిరుగుచున్న తుమ్మెద; అతిలోభాంధబుద్ధి = గొప్ప పిసినిగొట్టు; సొమ్ము, అరయు క్రియన్= (తన) ధనము చూచుకొనునట్లు; అనుభవమునకున్, చొరదు = అనుభవించుటకు సిద్ధపడదు - సాహసింపదు. అలం. ఉపమ.

క. [8]నలువదితొమ్మిదిరూపం,బులు గొనియుం బుష్పగంధములు మోవఁగ లే
కలసియుఁ [9]దెమ్మెరలానుం, బలుమఱు యువజనము మేని పలుచనిచెమటల్. 185

టీక. తెమ్మెరలు = గాలులు; నలువదితొమ్మిది రూపములు, గొనియున్ = 49 రూపములు ధరించినను; [ఆవహము - ప్రవహము - సంవహము - ఉద్వహము - వివహము - పరివహము - పరావహము అని వాయువులు ఏడు; ప్రళయకాలమున నీ యొక్కొక్కటియు ఏడేసి విధము లగుచున్నవి.] పుష్పగంధములు = పూలవాసనలను; ఆనున్ = త్రాగును.

---

1. వడిసిన. శ. ర. 2. మగుటను. శ. ర. క. మాటయు. చ. మగుటయు. 3. క. మసి. చ. నసి. శ. ర. నసి. 4. ఖడ్గంబుతునుక. 5. చ. బొంచి. 6. చ. మల్లి. మకరంద. 7. దళి. 8. చ. నలుపది. 9. చ. తుమ్మెద.

పుష్పపరిమళములు మోవఁగలేనంత అధికములగుటచే, నలువది తొమ్మిది విధములుగా నున్న వాయువులును వానిని మోయలేక అలసి - డప్పిగొని, యువజనుల మేని పలుచని చెమటలను త్రాగుచున్న వని భావము.

చ. విమలమయూఖరేఖయు నవీనతరోత్పలపత్రముఁ బ్రవా
ళమణియు నొక్క [1]తీవ [2]యబలాప్రతిఁ దాల్చెనటన్న వించు వి
భ్రమశిథిలాంగియయ్యుఁ గుచభారనితంబకపోలగోపన
క్రమకలనాకులాత్మయయి కన్నుల నీశు నదల్చె గౌరియున్. 186

టీక. విమలమయూఖరేఖయున్ = చంద్రవంకయును; అర్ధచంద్రమను పేరుగల నఖక్షతమును; నవీనతరోత్పలపత్రమున్ = క్రొత్తదగు నల్లకలువరేకును, కుముదపత్రమను నఖక్షతమును; ప్రవాళమణియున్ = పగడమును, ప్రవాళమణి యను దంతక్షతభేదమును; ఒక్క తీవ = ఒక్క తీగ - (ఇవన్ని యును చేరి) అబలాప్రతిఁదాల్చెనటన్నన్ = ఒక్క స్త్రీయొక్క సామ్యము ధరించెనని పలుకఁగా; విభ్రమశిథిలాంగి, యయ్యున్ = విలాసముగా శిథిలములగు అవయవములు కలదైనను; గౌరియున్ = పార్వతియు; కుచ......లాత్మయయి = స్తనములను, పిరుదులను, చెక్కిళ్ళను కప్పిపుచ్చుటయందు తొందర పాటుగల మనస్సుకలదయి; ఈశున్ = భర్తయైన శివుని; అదల్చెన్ = బెదరించెను.

ఉద్యానవిహారమున నుండుటచేతను, తన మగఁడు తప్ప వేఱువ్యక్తు లచట లేనందుటను పార్వతి విలాసముగ - తన యవయవములను అఱచాటుగఁ జేసి తీవిగ కూర్చుండి యుండెను. అపుడు శివుఁడు ఆమె కపోలములందలి ప్రవాళమణి దంతక్షతమును, స్తనముపైఁగల అర్ధచంద్రనఖక్షతమును, నితంబమునఁగల కుముదపత్రనఖక్షతమును జూచి యన్యాపదేశముగ (లత యొకటి ప్రవాళమణిని, చంద్రరేఖను, ఉత్పలపత్రమును ధరించి స్త్రీవలె నున్నదని) పలుకగా విని, పార్వతి సంగతి గ్రహించి, వెంటనే తనచెక్కిళ్ళను, ఉరమును, పిరుదులను దాఁచుచు, వానిని చూచినందులకు శివుని వాఁడిచూపులతో బెదరించెనని భావము. అలం. ప్రస్తుతాంకురము.

తే. ప్రావృషేణ్యపయోధరపటలిచేత, గాడ్పు నీహారకరరేఖఁ గప్పుకరణి
ధరణిధరకార్ముకుఁడు శైలతనయఁ బొదివె, బచ్చడంబునఁబొల్చు పూఁబచ్చడమున.

టీక. గాడ్పు = గాలి; ప్రావృషేణ్యపయోధరపటలిచేతన్ = వర్షాకాలపు మబ్బుల గుంపుచేత; నీహారకరరేఖన్ = చంద్రవంకను; కప్పుకరణిన్ = కప్పినరీతి; ధరణిధరకార్ముకుఁడు = కొండ (మేరు పర్వతము) విల్లుగాఁగల శివుఁడు; పచ్చడంబునన్ = పచ్చని కాంతిచే; పొల్చు = ప్రకాశించు; పూఁబచ్చడమునన్ = పూవుల పచ్చడముచేత; శైలతనయన్ = పార్వతిని; పొదివెన్ = కప్పెను. అలం. ఉపమ.

చ. పొదుపు పరాగఘృష్టి మొగముల్, శ్రమవారిని మేను, భానుదీ
ప్తి దవుల హెచ్చు చన్గడలుఁ, దేజము [3]దాల్చె నెకాని యొప్పుగుం
దదు నగపుత్రి కప్డు భసితంబున వర్షముచేత నగ్నిపైఁ
గదురుట నద్దముల్ లతయుఁ గాంచనకుంభములున్ [4]బెడంకునే? 188

టీక. పొదుపు = ఆక్రమించిన; పరాగఘృష్టిన్ = పుష్పాదికాంతిచేత; శ్రమవారిని = చెమట నీటిచే; భానుదీప్తి, దవులన్ = సూర్యుని కాంతి తగులఁగా; హెచ్చుచన్గడలున్ = ఉన్నతస్తనసన్నివేశములును; తేజముదాల్చెనె, కాని = ప్రకాశించెనే కాని; ఒప్పు = బాగు; కుందదు = తగ్గదు; నగపుత్రికిన్ = పార్వతికి; భసితంబునన్ = భస్మముచే; అగ్ని; పైఁగదురుటన్ = వ్యాపించుటచేత; బెడంకునే = చలించునా?

---

1. క. తీవి. చ. తీవ. 2. క. యబలాదృతి. చ. యబలాప్రబలాధృతిదాల్చెనన్న. ట యబలాప్రబలాధృతిదాల్చెనన్న. 3. చ. దాల్చెన. 4. చ. బెడంగుకై.

' ఇందు పార్వతీదేవి ముఖము, శరీరము, స్తనములు ఉపమేయములు; అద్దము, లత, బంగరుకుండలు నుపమానములు. బూడిదవంటి పుప్పొడి పార్వతి ముఖమునఁ బడినది; విహారమువలని స్వేదజలము శరీరమున వ్యాపించినది; వేడియైన సూర్యకాంతి యామె స్తనములపయిఁ బడినది; అట్లయినను ఆమె చక్కఁదనము హెచ్చెనే కాని తగ్గలేదు. ఏలయన అద్దముపై బూడిద పూసిన (పూసి, తోమిన) అది తళుకెక్కును; వర్షమున మేను తడిసిన పరిశుభ్రమయి అది రాణించును; కాంచనకుంభముల నగ్నిపయి నుంచి (మెరుగుపెట్టి)న నవి తళతళమని ప్రకాశించును. అలం. క్రమము, రూపకము.

మ. బొమ లెక్కించిన విల్లు వంచు నునుఁజూపుల్ చంచలాచంచల
క్రమరేఖ న్నిగిడింప శాతవిశిఖౌఘంబుల్ మెఱున్నించు నె
య్యములం బల్కఁగ నల్కమీఱి చటులజ్యాఘోషముం జేయు న
య్యుమఁ బ్రాపొంది రతీశ్వరుండు హరు బిట్టోడింప [1]నుట్టాడుచున్. 189

టీక. రతీశ్వరుండు = మన్మథుఁడు; హరున్ = శివుని; బిట్టు = శీఘ్రముగా; ఓడింప నుట్టాడుచున్ = ఓడింప సంభ్రమించుచు; ఉమప్రాపు, ఒంది = పార్వతి నాశ్రయించి; బొమ, లెక్కించినన్ = ఆమె కనుబొమలను పైకి ఎత్తఁగా-నిక్కించఁగా; విల్లువంచున్ = తన చెఱకువింటిని వంచును; నునుఁజూపుల్ = కటాక్షములను; చంచలాచంచలక్రమరేఖన్ = మెఱుపు మెఱసినట్లు; నిగిడింపన్ = వ్యాపింపఁజేయఁగా; శాతవిశిఖౌఘంబుల్ = వాఁడిబాణముల మొత్తములను; మెఱున్, నించున్=శివుని దేహముపై పడునట్లు చేయును; నెయ్యములం బల్కఁగన్ = ఆమె సరసపుఁబల్కులను పలుకఁగా; అల్కమీఱి = (తాను) శివునిపైఁ గోపించి; చటులజ్యాఘోషమున్, చేయున్ = చలించుచున్న అల్లెత్రాటిధ్వనిని చేయును.

పార్వతి తనపక్షమున కనుకూల యయి, శివునిపై వలపులను ప్రసరింపఁజేయుటచేత మన్మథుఁడు ధైర్యమును పొంది తన వెనుకటి పగ సాధించి, శివు నోడించుటకు మన్మథుఁడు తొందరపడుచున్నాఁడని భావము. పార్వతి కనుబొమలు మన్మథుని విండ్లవలెను, ఆమెచూపులు బాణములవలెను, పలుకులు శింజినీధ్వనివలెను ఉన్నవని గ్రహింపఁదగును. అలం. వ్యంగ్యోపమ.

చ. చిగురులు దేరఁజేసి విరిచిక్కనిచక్కనిపువ్వుగుత్తులన్
బిగువుచనుంగవం [2]బొదివి ప్రేలెడుచిల్కలఁ జోపి [3]తేనియన్
బొగపిన పల్కులం బొగడి భూతపతిన్ బతి మెచ్చఁజేసె న
య్యగజ తదుద్యమార్హవినయానునయాభినయానుకూలతన్. 190

టీక. తేరఁజేసి = కలుగఁజేసి - తెచ్చి; విరిచక్కనిచిక్కనిపూవుగుత్తులన్ = పూలు దట్టముగాఁ గల చక్కని పూగుత్తులను; పొదివి = కప్పి; ప్రేలెడు = ప్రేలాడు - అంటిపెట్టుకొని యున్న; చోపి = తఱిమి; తేనియంబొగపిన = తేనెతో పక్వముచేసిన; తేనెవంటి మధురములైన; పల్కులన్ = మాటలతోను, గింజలలోని విత్తులతోను; అయ్యగజ = ఆపార్వతి; తదుద్య .....కూలతన్ = ఆయన ప్రయత్నమునకుఁ [కోరికకు] దగిన వినయము, ఊరట, అభినయము లనుకూలపడునట్లు; భూతపతిన్ = ప్రాణులకు ప్రభువైనవానిని, భూతములకు ప్రభువైనవానిని; పతిన్ = భర్తయైన శివుని; మెచ్చఁజేసెన్ = మెప్పించెను.

పార్వతి చిగుళ్లను, పూగుత్తులను కోసి తెచ్చి అలంకరించుకొని, చిలుకలవలె తేనెలొలుకు పలుకులు పలుకుచు, వినయానునయాదులఁ జూపుచు తన భర్తను మెప్పించెను. భూతములవలని చెడుగు రాకుండుటకయి భూతపతికి బలియన్నముల నిచ్చుట సంప్రదాయము; ఇచట పూగుత్తులు అన్నము,

1. చ. నూటాడుచున్. 2. చ. బొదలి. 3. చ. జోప.

చిగుళ్లే వ్యంజనములు, చిలుకలను తఱిమి తెచ్చిన-తేనియం బోగవిన పలుకులు మధురపదార్థములు అని తాత్పర్యము.

క. ఈరీతి ప్రమదవిపినవి, హారం బొనరించి హిమనగాత్మజయుం గం
జారిరవిశిఖినయనుఁ డుపచారంబులు సముదయువతిజన మొనరింపన్. 191

టీక. ప్రమదవిపినవిహారంబు = ఉద్యానవనవిహారమును; కంజారిరవిశిఖినయనుఁడు = చంద్ర సూర్యాగ్నులు కన్నులుగాఁ గల శివుఁడును; [ఇచట సముచ్చయముండవలెను; అది మూలమున లేదు.] సమదయువతిజనము = యౌవనముతోఁ గూడిన యువతులు; ఉపచారంబులు; ఒనరింపన్ = సేవింపఁగా.

ఉ. నాకవిభూషలోత్కరకసచ్ఛిఖరావృతమైన యొక్కప
ద్మాకరతీరకేళికనకాద్రిసుఖస్థితి నుండునంతఁ బుం
జీకృతతారహారముగ శేషవిభూషణు నంఘ్రికిన్ నమో
వాక మొనర్చి యిట్లను శివాకలకంఠి సమంజసోక్తులన్. 192

టీక. నాక......వృత్తము = ఇంద్రనీలమాణిక్యసముదాయముచేఁ బ్రకాశించు నగ (శిఖర) ములతోఁ (గూడినది) సావరింపఁబడినది; ['నాక......వృతము = ఇంద్రనీలమణుల సముదాయము చేత ఆవరింపఁబడినది' అని పూర్వటీక] పద్మాకరతీరకేళికనకాద్రిన్ = సరస్సుయొక్క యొద్దను నున్న బంగారు క్రీడాపర్వతముపైని; సుఖస్థితిన్ = సుఖముగా; శివాకలకంఠి = పార్వతి; పుంజీకృతతార హారముగన్ = రాశిగాఁ జేయఁబడిన ముత్యాలపేరులు కలుగునట్లుగా; [పార్వతి పరమేశ్వరుని పాదములకు వంగి నమస్కారము చేయునపుడు ఆమె మెడలో నున్న ముత్యాలహారములు ముత్యాలపోశ పోసినట్టు రాశిగాఁ నేలఁబడినవని భావము.] శేషవిభూషణు నంఘ్రికిన్ = శివునిపాదములకు; నమోవాకము = నమస్కారమును; ఒనర్చి = చేసి; సమంజసోక్తులన్ = ఉచితములైన మాటలతో; ఇట్లనున్.

సీ. విజ్ఞానమయ! మహాప్రాజ్ఞ! యో సర్వజ్ఞ! ప్రార్థింతు [1]ని న్నొక్క యర్థమేను
నిర్వాణఫలదమై నీ కునికిపట్టైన క్షేత్రంబు దేవతాసింధుముఖ్య
తీర్థంబుల జయించు తీర్థంబు నత్యుత్కటప్రభావంబుల దీప్రమైన
దైవతంబునుగూడి దర్శనస్నానపూజనములఁ [2]గలుషభంజన మొనర్పఁ
తే. జాలునిమ్మాఁడు నొకచోట మేళవించి, యుండునో కాక *వేర్పడియుండునొక్కొ!
దీనిచందంబు సకలంబుఁ దేటపడఁగ, హృదయగమ్యంబుచేసి న న్నేలుమనుడు.

టీక. విజ్ఞానమయ! = విశేషమగు జ్ఞానము స్వరూపముగాఁ గలవాఁడా! మహాప్రాజ్ఞ! = గొప్పపండితుఁడా! సర్వజ్ఞ! = అన్నియు నెఱిఁగినవాఁడా! ఏను = నేను; అర్థము = విషయమును; నిర్వాణఫలదమై = మోక్షఫలము నిచ్చునదయి; నీకు, ఉనికిపట్టైన = నీకు నివాసమైన; క్షేత్రంబు= పుణ్యస్థలము; దేవతా......తీర్థంబులన్ = గంగానది మొదలగు పవిత్రతీర్థములను; జయించు = అతిక్రమించునట్టి; అత్యుత్కటప్రభావంబులన్ = మిక్కిలిగొప్ప మాహాత్మ్యములచేత; దీప్రము = ప్రకాశించునది; దర్శన, స్నాన, పూజనములన్ = (క్షేత్రముయొక్క) దర్శనమునను, (తీర్థమున) స్నానముచేతను, (దేవతయొక్క) పూజచేతను; కలుషభంజనము = పాపములను నశింపఁజేయుటను; మేళవించి = కలిసి; వేర్పడి = వేర్వేఱుగా; దీనిచందంబు = దీనిరీతి; హృదయగమ్యంబు = మనస్సున కెఱుకపడునది.

1. చ. నిన్నొక. 2. క. కలుష. *ఏర్పడి. శ. ర.

మ. లవలీపల్లవపాండురంబు లగు గల్లక్షోణులం జంద్రికా
లవలీలం దరహాస మింపెసఁగఁ [1]గేలన్ వైళ మ[2]గ్గోలఁ జే
లవలీలం గొనితెచ్చి యంకకదళాలంకారముం జేసి బా
లవిధూత్తంసుఁడు పల్కె మాధవకథాశ్లాఘాసుఖాసక్తుఁడై. 194

టీక. లవలీపల్లవపాండురంబులగు = వెన్నెలతీగల చిగుళ్లవలెఁ దెల్లనివైన; గల్లక్షోణులన్ = చెక్కిలిప్రదేశములందు - చెక్కిళ్లపయి; చంద్రికాలవలీలన్ = లేఁతవెన్నెలరీతిని; దరహాసము = చిఱునవ్వు; ఇంపెసఁగన్ = సొగసుఁగూర్పఁగా; అగ్గోలన్ = ముగ్ధరాలైన ఆపార్వతిని; [అగ్గోల=ఆముగ్ధస్త్రీయొక్క అని పూర్వటీక.] కేలన్ = చేతితో (పట్టుకొని); వైళము = శీఘ్రముగా; చేలవరీతిన్ = మృదువుగా; [లవరీతిన్ = లేశమువిధమున అని పూర్వటీక.] కొనితెచ్చి=తీసికొనివచ్చి; అంకకదళాలంకారముంజేసి = అరఁటిబోదెవంటి తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని; బాలవిధూత్తంసుఁడు = లేఁతచంద్రుఁడు తలమానికముగాఁగల శివుఁడు (కర్త); మాధవ......సక్తుఁడై = విష్ణుదేవునియొక్క కథలను కొనియాడుటవలనఁ గలుగు సుఖమునం దిష్టముకలవాఁడై - విష్ణుకథలఁజెప్పుటయం దిష్టము కలవాఁడై; పల్కెన్.

శివుఁడు చిఱునవ్వు నవ్వుచు పార్వతిని మెల్లగాఁ దన తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని యామె కోరిన సంగతిని చెప్పఁదలచెనని భావము. [గల్లశబ్దము గ్రామ్యమని ఆలంకారికులు. 'కదళీ'శబ్ద మకారాంతముగా ఇందు ప్రయోగింపఁబడినది. ఇది కవి సమ్మతము.]

క. కించిద్వలగ్న! మిక్కిలి, మంచిది నీప్రశ్న మిది సమర్మముగా వి
న్పించెద నను నాలోనన, కంచుకు లరుదెంచి ఘటితకరకిసలయులై. 195

టీక. కించిద్వలగ్న! = సన్నని నడుము కల పార్వతీ! మంచిది = బాగున్నది; సమర్మముగాన్= రహస్యములతోఁగూడ; విన్పించెదన్ = చెప్పెదను; అను నాలోనన = అనునంతలోనే; కంచుకులు = సేవకులైన బెత్తాలవారు - అంతఃపురసేవకులు; అరుదెంచి = వచ్చి; ఘటితకరకిసలయులై = జోడించిన చిగుళ్లవంటి చేతులు కలవారై - నమస్కరించి.

క. దేవ! యగస్త్యాదికమునిని, సేవితుఁడై వచ్చినాఁడు సేనాని భవ
త్సేవార్థి యగుచు నతఁ డిట,రావచ్చునొ యనుడు రాగరసభరితమతిన్. 196

టీక. సేనాని = దేవసేనాధిపతి - కుమారస్వామి; భవత్సేవార్థి = మీసేవను కోరినవాఁడు; రాగరసభరితమతిన్ = (శివుఁడు) ఎక్కువ ప్రేమతో నిండిన మనస్సుతో.

వ. దేవీసహితుండై యద్దేవదేవుండు తదాగమనం బనుమతించుటయు వల్లె యని [3]సౌవిదల్లనికరంబు నిజకరంబులఁ బుత్తడిబెత్తంబు లంబురుహచుంబిత[4]తరుణతరణికిరణంబులం బురణింప మరల పఱచి శరవణప్రభవునకు భవానీపతి [5]యనుగ్రహించుట తెలియ విన్నవించుటయు నతండు. 197

టీక. అనుమతించుటయున్ = అంగీకరింపఁగా; వల్లె = సరియే; సౌవిదల్లనికరంబు = కంచుకుల గుంపు; పుత్తడిబెత్తంబులు = బంగారుబెత్తములు. అంబు......కిరణంబులన్ = పద్మములను ముద్దుగొనుచున్న (తాఁకుచున్న)లేఁతసూర్యుని కిరణములను; పురణింపన్ = అనుకరింపఁగా; [అనఁగా కంచుకుల కరములు పద్మములవలెను, చేతులందున్న బెత్తములు లేఁతసూర్యునికిరణములవలెను ఉన్నవనుట.] పఱచి = పరుగెత్తి; శరవణప్రభవునకున్ = కుమారస్వామికి; భవానీపతి = శివుఁడు.

1. నేలన్ వేళ. చ. 2. క. గోలచే. చ. గోలదే. 3. చ. సౌవదల్ల. 4. చ. (తరుణ, లేదు) 5. చ. యనుగ్రహంబెఱిగించుటయు.

సీ. వీడియం బెడలించి విధురత్నకనకాలుకాంచితాంబువు పుక్కిలించి యుమిసి
యుదిరిబంగరువ్రాత హాంబట్టువలెవాటు సడలించి వెసఁ గటిస్థలిని జుట్టి
యనుయాయి పృథుకహస్తాంతరన్యస్తోపదోచితార్థము తానె యుద్వహించి
యంగుళీసంజ్ఞసంయములఁ బ్రత్యేకంబు మునుమున్ను లోనికిఁ జన నొనర్చి

తే. ద్వారపార్శ్వస్థవేదికావలుల జరఠ,రక్షివర్గంబు టంక్రియారభటి[1]వరల
వలయమకుటాదికంబుగ నిలిచి మ్రొక్క, నగవుఁ జూపులఁ జూచుచు నగరుసొచ్చి.

టీక. వీడియంబు ఎడలించి = నోటనున్న తాంబూలము నుమ్మివైచి; విధు......బువు = చంద్రకాంతమణులతోఁ జేయఁబడిన గిండియందలి నీటిని; ఉదిరి .....వలెవాటు = మేలిమి బంగారు పనితనముగల పచ్చపట్టు పైవస్త్రమును; సడలించి = తీసి; వెసన్ = వేగముగా, కటిస్థలిని; జుట్టి = మొలను బిగించి; అనుయాయి .....తార్థము = తన్ననుసరించి వెనుక వచ్చుచున్న పిల్లవానిచేతి యందున్న బహుమానోచితవస్తువును; ఉద్వహించి = పట్టుకొని; అంగుళీసంజ్ఞన్ = చేతివ్రేలి సైగచే; ప్రత్యేకంబు = వేఱుగా; మునుమున్న = మొట్టమొదట; లోనికిఁ జననొనర్చి = లోనికి పంపి; ద్వారపార్శ్వస్థవేదికావలులన్ = ద్వారములకు రెండుప్రక్కల నుండు తిన్నెలయందు; జరఠరక్షివర్గంబు= ముసలికావలివాండ్రగుంపు; టంక్రియారభటిన్, వఱలు = ధనుష్టంకారధ్వనిరీతిని, ఒప్పునట్టి; వలయమకుటాదికంబుగన్ = కడియములు; కిరీటములు (తలపాగలు) కలుగునట్లు, [తాను లోనికి వెళ్లునపుడు ద్వారములకు ప్రక్కనున్న ముసలిసిపాయీలు అరుగులనుండి తొందరగా లేవఁగా, వారిచేతి కడియములు, నమస్కరించునపుడు కిరీటములకుఁ దగిలి ధ్వనించినవనుట.] నగవుఁజూపులన్ = నవ్వులొలుకు చూపులతో.

[పెద్దల దర్శనమునకుఁ బోవునపుడు అవలంబింపవలసిన పద్ధతు లిందు వర్ణింపఁబడినవి.] కుమారస్వామి అంతవఱకు నోటనున్న తాంబూలము నుమ్మివేసి, పుక్కిలించి యుమ్మివైచెను; పైమీఁదివస్త్రమును తీసి, మొలకు చుట్టుకొనెను; తాను తండ్రికీయఁదలఁచిన బహుమానము నింతవఱకు మోసికొనివచ్చుచున్న పిల్లవాని చేతినుండి తీసికొని, తానే పట్టుకొనెను. ముందుగా పెద్దలగు మునులను లోనికిఁ బంపి, తాను వారివెనుక నేఁగెను తన్నుజూచి ద్వారముల ప్రక్కనున్న వేదికలనుండి లేచి నిలిచిన, ముసలి పారావాండ్రను నవ్వుగులుకు చూపులతో గౌరవించి నగరికిఁ బోయెను. అలం. స్వభావోక్తి.

ఉ. వచ్చి పయోజపత్త్రముల వ్రాలెడు తుమ్మెదదొమ్మిమూఁకలన్
దచ్చెన సేయుచున్ బితృపదంబులఁ గూఁకటు లంట దర్శనం
బిచ్చుట మున్నుగాఁగ [2]నుతియించుచు మ్రొక్కుఁడుఁ గేలుసాచి వే
గ్రుచ్చి కవుంగలించి వలిగుబ్బలిపట్టియు *వాఁకదాల్పుఁడున్. 199

టీక. పయోజ...కలన్ = తామరపూవుఱేకులపయి, సందడిచేయు తుమ్మెదగుంపులను; తచ్చనసేయుచున్ = ఎగతాళిచేయుచు; పితృపదంబులన్ = తండ్రిగారిపాదములపయి; కూఁకటులు, అంటన్ = పిల్లజుట్లు తాకునట్లు; దర్శనంబిచ్చుట = కన్పించుట - (చూడననుమతించుట); మున్నుగాన్ = మొదలుకొని; [దర్శనంబు = కానుక అని పూర్వటీక.] మ్రొక్కుడున్ = నమస్కరింపఁగా; కేలుసాఁచి = చేయి చాచి; వలిగుబ్బలిపట్టియున్ = హిమవత్పర్వతము కూఁతురు - పార్వతి యును; వాఁకదాల్పుడున్ = గంగానదిని (తలపై) ధరించిన శివుఁడును; గ్రుచ్చి = గట్టిగా అదిమి; శివునిపాదములు తామరపూవురేకులవలెను, కుమారుని పిల్లజుట్లు తుమ్మెదలవలెను ఉన్నవని భావము. అలం. ఉపమ.

1. చ. వరర. 2. చ. యింపుచు. * వాఁకతాలుపున్. శ. ర.

తే. సమ్మదాశ్రులు కనుఁగవఁ గ్రమ్ముదేర, నాఱుమోములబాలు నిజాంతరమున
నిలుప నతఁ డొప్పె రోహిణీజలజవిమత, మధ్యముననున్న తారాకుమారుఁ[1]బోలి.

టీక. సమ్మదాశ్రులు = ఆనందబాష్పములు; కనుగవన్ = రెండు కన్నులయందును; క్రమ్ముదేరన్ = వ్యాపింపఁగా; ఆఱుమోములసామిన్ = కుమారస్వామిని; నిజాంతరమునన్; నిలుపన్ = తమయిరువుర మధ్యను నిలుపఁగా; రోహిణీ; జలజవిమతమధ్యమునన్ = రోహిణీ, చంద్రుల నడుమ; తారాకుమారుఁబోలి = బుధునివలె; ఒప్పెన్ = ప్రకాశించెను. అలం. ఉపమ.

క. నిటలాక్షువలన నప్పుడు, ఘటసంభవముఖ్యమునులు గని రెంతయు ము
చ్చటఁ బిలిచి పీఁట యిడి యుత్కటకృపతో నొసఁగు పరమగౌరవ [2]మంతన్.

టీక. ఘటసంభవముఖ్యమునులు = అగస్త్యుఁడాదిగాఁగల మహర్షులు; నిటలాక్షువలనన్ = శివునివలన; ముచ్చటన్ = మక్కువతో; ఉత్కటకృపతోన్ = ఎక్కువ దయతో; ఒసఁగు = ఇచ్చునట్టి; పరమగౌరవము = గొప్పమర్యాదను; కనిరి = పొందిరి; అంతన్ = ఆపిదప; [ముందుపద్యమునకన్వయము.]

సీ. అలవోకఁ [3]గనకాద్రి సెలయుచో విరిగిన హరివరాహము దంష్ట్ర నవతరించె
నెద్ది మున్నపరంజి యిసుక రాసేలలఁ జరియించు గంధర్వపరివృఢునకుఁ
జిత్రాశ్వునకు నెద్ది చేకూరె నెద్ది తచ్ఛుద్ధాంతకామినీసురతఖేద
మపనయింపఁగఁజాలెఁ దపవాసరంబుల నంచయై గరుదంచలానిలముల

తే. నెద్ది ప్రాపించె నాఖేచరేంద్రు గెలుపు, గొన్న తారకునకు వాని గుహుఁడు దునిమి
తెచ్చెఁ దా నెద్ది [4]యమ్ముత్య మిచ్చె నచల,సుతకు శితికంధరునకు నిచ్చుటయు నలరి.

టీక. అలవోకన్ = అవలీలగా; కనకాద్రిన్ = మేరుపర్వతమును; సెలయుచోన్ = (ఎగఁ)చిమ్మునపుడు; హరివరాహము దంష్ట్రన్ = వరాహావతారమూర్తియొక్క కోరనుండి; ఎద్ది; యవతరించెన్ = ఏది పుట్టెనో; మున్ను = పూర్వము; అపరంజియిసుకరాసేలలన్ = బంగారపుటిసుక తాతిసేలల యందు; గంధర్వపరివృఢునకున్ = గంధర్వరాజైనవానికి; తచ్ఛుద్ధాంతకామినీ సురతఖేదము = ఆ చిత్రాశ్వుని యంతఃపురస్త్రీలయొక్క సురతక్రీడయందలి యాయాసమును; అపనయింపఁగఁజాలెన్ = పోఁగొట్టఁగలిగెనో; తపవాసరంబులన్ = వేసవిదినములందు; అంచయై = హంసయయి; గరుదంచలానిలములన్ = రెక్కలచివఱలవలన పుట్టిన వాయువులచే; అపనయింపఁగఁజాలెన్ = పోఁగొట్టఁగలిగెనో; ప్రాపించెన్ = లభించెనో; ఖేచరేంద్రున్ = గంధర్వుని; గెలుపుగొన్న = గెలిచిన; గుహుఁడు = కుమారస్వామి; తునిమి = చంపి; అమ్ముత్తెము = ఆముత్యమును; అచలసుతకున్ = పార్వతీదేవికిని; శితికంధరునకున్ = శివునికిని; [వీరిరువురికిని]. అలరి = సంతోషించి.

చ. హరుఁడు శిరంబునం జెవిఁ గరాంబురుహంబునఁ దాల్పఁ జంద్రికాం
కురపరభాగమై యురగకుండలమై స్ఫటికాక్షసూత్రమై
గిరిజకరాళిఁ గర్ణమునఁ గేల వహింపఁ బసూనమాలికా
కరిరదపత్త్రవిభ్రమశుకంబులునై మణి యుల్లసిల్లుచున్. 203

టీక. కరాంబురుహంబునన్ = పద్మమువంటి చేతియందును; తాల్పన్ = ధరింపఁగా; చంద్రికాంకురపరభాగమై = వెన్నెలయంకురమువలె ఉత్కృష్టగుణములు కలదై; ఉరగకుండలమై = పాముచేఁజేయఁబడిన కుండలమువలె నున్నదై; స్ఫటికాక్షసూత్రమై = స్ఫటికజపమాలికయయి; గిరిజ

1. చ. బోలి. క. బోలె. 2. ట. మొప్పన్. 3. క. కనకాద్రి. 4. యమ్ముత్తె.

కచాళిన్ = పార్వతికొప్పువయి; ప్రసూన......శుకంబులునై = పూలమాలిక, దంతపత్త్రము, పిఞ్ఛసార్థమయిన చిలుకయును నయి; మణి; ఉల్లసిల్లుచున్ = ప్రకాశించుచు.

శివుఁ డామణిని తలపై ధరింపఁగా చంద్రవంకవలెను, చెవిని పెట్టుకొనఁగా కుండలమువలెను, చేతిలో నుంచుకొనఁగా జపమాలవలెను ప్రకాశించెను; పార్వతి దానిని తలపై ధరింపఁగా పూలమాలవలెను, చెవిని పెట్టుకొనఁగా చెవికమ్మవలెను, చేతిపై నుంచుకొనఁగా చిలుకవలెను ప్రకాశించెను. అలం. క్రమము, ఉపమ.

వ. వెండియు నక్కొండరాచూలియు ఖండపరశుండునుం డెందంబుల నెద్దియభిలషించి రయ్యయ్యరూపంబు లాపనమరత్నంబు ధరియించి [1]తదాదరణచరితార్థంబయ్యె నంత. 204

టీక. కొండరాచూలి = హిమవంతునికూఁతురు - పార్వతి; ఖండపరశుఁడు = శివుఁడు; అయ్యయ్యరూపంబులు = ఆయారూపములను; ధరియించి = పొంది; తదాదరణచరితార్థంబు = వారు (తన్ను) గౌరవించుటచే సార్థమైన పుట్టుక కలది.

క. మత్స్వామిపార్శ్వమునకు నీ,సత్సంయమివరులు నీవుఁ జనుదెంచుటకో
వత్సా! యెయ్యది కత మని, వాత్సల్యము గదురఁ బంచవదనుఁడు పలుకన్. 205

టీక. మత్స్వామిపార్శ్వమునకున్ = నావద్దకు, నీ; సత్సంయమివరులున్ = గొప్ప మహర్షులును; చనుదెంచుటకు = వచ్చుటకు; ఓవత్సా ! = ఓకుమారా! కతము = కారణము; వాత్సల్యము కదురన్ = ప్రీతికలుగునట్లుగా; పంచవదనుఁడు = ఐదు ముఖములుకల శివుఁడు. [శివుని పంచవదనములును ౧౭౩-వ పద్యవివృతిలోఁ జెప్పఁబడి యున్నవి.]

సీ. తనతండ్రిఁ బలుకుఁ గ్రౌంచనిషూదనుఁడు చంద్రపరిషన్నిరుద్ధనీరరుహముకుళ
భాతి మోడుపుఁగేలు ఫాలాగ్రవీథికి విలసిల్లి యలర నోవృషభగమన!
నాపేర స్కాందంబునాఁదగు నొక పురాణము [2]నీదు కరుణకలిమి రచించి
యిమ్మునీంద్రులకెల్ల నెఱిఁగింప నందు వీరలు సుక్షేత్రతీర్థములకథలు

తే. చాల విని విని సర్వాతిశాయి యైన,దేవుఁ డేనియు నటువంటి తీర్థమేని
నట్టిసుక్షేత్రమేని భోగాపవర్గ,దాయి కలదేని యెఱిఁగింపు తడయ కనిన. 206

టీక. క్రౌంచనిషూదనుఁడు = కుమారస్వామి; చంద్ర...భాతిన్ = చంద్రులసమూహముచే అరికట్టఁబడిన (ఆక్రమింపఁబడిన) తామరమొగ్గలవిధమున; [అతఁడు రెండు చేతులను జోడించి నమస్కరింపఁగా - ఆమోడ్పుఁజేతులు తామరమొగ్గవలెను, వ్రేళ్ళగోళ్లు (౧౦) చంద్రులగుంపువలెను ఉన్నవనుట. తామర చంద్రునికి దాయ యగుటవలన అది వికసింపకుండ చంద్రులరికట్టినట్లున్నదని భావము.] మోడుపుఁగేలు = ముకుళించిన హస్తములు, ఫాలాగ్రవీథికి విలసిల్లి; యలరన్ = నొసటిపై నుండి ప్రకాశింపఁగా; తనతండ్రిన్ = తనతండ్రినిగురించి; పలుకున్; ఓ వృషభగమన! = ఓ నందివాహనుఁడా! స్కాందంబునాఁదగు=స్కాందమను పేరుకల; సర్వాతిశాయియైన=అన్నింటిని మించిన; దేవుఁడేనియున్ = దేవుఁడును; [ఇచట 'ఏని' సముచ్చయార్థకముగా ప్రయోగింపఁబడినది.] తీర్థమేని = తీర్థమును; సుక్షేత్రమేని = గొప్పక్షేత్రమును; భోగాపవర్గదాయి = భుక్తిముక్తులను రెండింటిని ఒసఁగునది; కలదేని = ఉన్నయెడల; తడయక = ఆలస్యముచేయక; ఎఱిఁగింపు = తెలుపుము. అలం. ఉపమ.

వ. సర్వోత్కృష్టంబు లగు తీర్థక్షేత్రదైవతంబుల మహాప్రభావంబు మదీయభావదర్పణంబునం బ్రతిఫలింపమిం జేసి. 207

---

1. చ. పదాచరణ. 2. చ. నీకరుణకల్మినయ.

టీక. సర్వోత్కృష్టంబులు = అన్నింటికిని మించినవి; మదీయభావదర్పణంబునన్ = నామనస్సనెడి యద్దమునందు; ప్రతిఫలింపమిం జేసి = తోఁపకపోవుటచేత.

క. నీవలన [1]నకడమట్టిన, దైవతమహిమయును క్షేత్రతత్త్వము తీర్థ
శ్రీవిభవము శ్రుతిమార్గసుధావిష్కృతిగాఁగ వినుటకై ముదమొదవన్. 208

టీక. నీవలనన కడమట్టిన = నీవలనసిద్ధించిన; దైవతమహిమయును = దేవతామాహాత్మ్యమును; క్షేత్రతత్త్వము = ప్రధానక్షేత్రస్వరూపము; తీర్థశ్రీవిభవము = పుణ్యతీర్థసంపద; శ్రుతి...విష్కృతి గాఁగన్ = చెవియందమృతముపోయువిధమున - కర్ణపేయముగా; ముదమొదవన్ = వేడుక పుట్టఁగా.

ఉ. ఈ కలశోద్భవప్రముఖు లేసును వచ్చితి మీహితార్థల
క్ష్మీకర! దీని మాకు నెఱిఁగింపు మనంబున నున్న సంశయో
త్సేకము మానిపింపు కృపఁదేలెడుచూపులఁ జూడుమన్నఁ దా
రాకమనార్ధమౌళి మధురంబుఁ బ్రియంబునుగాఁగ నిట్లనున్. 209

టీక. ఈ కలశోద్భవప్రముఖులు=అగస్త్యుఁడు మొదలుగాఁగల యీ మునులును; ఈహితార్థలక్ష్మీకర! = కోరినవానిని పొందఁజేయువాఁడా! - కోరికలను నెరవేర్చు నో తండ్రీ! సంశయోత్సేకమున్ = గొప్ప సందేహమును; మానిపింపు = పోఁగొట్టుము; కృపఁదేలెడు = కృపారసమొలుకునట్టి; రాకాకమనార్ధమౌళి = అర్ధచంద్రుఁడు తలపైఁ గల శివుఁడు. ఇట్లనున్.

మ. మము నీయర్థము వేడుచున్నయది యుష్మన్మాత యోపుత్ర! యీ
యుమకు న్నీకు నెఱుంగఁ జెప్పెద వినుం డూహించి యేతచ్చరి
త్రము సర్వంబు కరోదరస్ఫటికరత్నశ్రీఁ బ్రకాశింప గో
ప్యము సేయందగు దీని విన్నపిదపన్ బ్రాణంబుగా దాఁచుచున్. 210

టీక. ఈయర్థము = ఈసంగతినే; యుష్మన్మాత=మీతల్లి - పార్వతి; ఊహించి = ఆలోచించి; కరోదరస్ఫటికరత్నశ్రీన్ = అఱచేతియందలి స్ఫటికముశోభను - స్పష్టముగా; చెప్పెదన్, గోప్యము, చేయందగున్ = రహస్యముగా (దీనిని) ఉంచవలెను.

తే. శఠమతికి నాస్తికునకుఁ బాషండునకును
గర్మముగుఱించి యాచించు గర్హితునకు
నీపరమగోప్యమోపుత్ర! యోపురంధ్రి!
తప్పిదారియు నెఱిఁగింపఁ దగవు కాదు. 211

టీక. శఠమతికిన్ = మూర్ఖునకును; నాస్తికునకున్ = వేదప్రామాణ్యములేనివానికిని; [దేవుఁడు లేడు అనువానికిని - అని పూర్వవ్యాఖ్య.] పాషండునకును = వేదవిరుద్ధాచారములు కలవానికిని; గర్హితునకున్ = నిందితునకును - హేతువాదికిని; పురంధ్రి = స్త్రీ; తప్పిదారియున్ = పొరపడియైనను; తగవు = న్యాయము - ధర్మము.

క. అని నిజతనూభవునకును, దనమగువకుఁ దీర్థదైవతక్షేత్రము లొ
క్కనెలవు నన భువనత్రయ, వినుతిఁ గనుటఁ దెలుపఁ[2]గడఁగి విధుమౌళి మదిన్.

టీక. భువనత్రయిన్ = ముల్లోకములను, విధుమౌళి = చంద్రమౌళి - శివుఁడు.

సీ. వెడఁదకన్నులవాని వెయినామములవాని ప్రేఁతల వలపించు వెరవువానిఁ
జిప్పకూఁకటివానిఁ జిన్నినవ్వులవానిఁ జెరివిన మంచి పించియమువానిఁ

1. క. నకడ. చ. నడక. 2. చ. దొడఁగె.

బులుగుతత్తడివానిఁ బొడవులతుదవానిఁ బొక్కిట వెలిదమ్మిపూవువాని
మినుకుటూర్పులవాని మిసిమిమేఁతలవాని మెఱుఁగుఁ*జామనిచాయమేనివాని

తే. దిస్స మొలవానిఁ బసిఁ గానఁ ద్రిప్పువాని
మురళి[1]గలవాని ముష్వంకమురువువాని
విట్ఠలాధీశుఁ దలచి తద్విపులమహిమ
[2]నొడువుఁ బ్రాఁపత్తి క్రీనీడ విడిదిప్రోడ. 213

టీక. వెడఁదకన్నులవానిన్ = విశాలలోచనములు కలవానిని; వెయి = వేయి-సహస్రము; ప్రేఁతల వలపించు వెఱవువానిన్ = గొల్లపడుచ్చులు తన్ను ప్రేమించునట్లు చేయునుపాయము ఎఱిఁగిన వానిని; చిప్పకూఁకటివానిన్ = పిల్లజుట్టుకలవానిని; చిన్నినవ్వులవానిన్ = ఇంపైననవ్వులుకలవానిని; చెరివిన = దోపిన; మంచిపించియమువానిన్ = చక్కని (నెమలి) పింఛము కలవానిని; పులుగుతత్తడి వానిన్ = పక్షి వాహనముగాఁ గలవానిని; పొడవులతుదవానిన్ = ఉన్నతమైనవాని చివఱనుండు వానిని - ఉన్నతములకంటెను ఉన్నతుఁడైనవానిని; పొక్కిటన్ = నాభియందు; వెలిదమ్మిపూవు వానిన్ = తెల్లతామరపూవు కలవానిని; మినుకుటూర్పులవానిన్ = వేదములు నిశ్వాసములుగాఁ గల వానిని, మిసిమిమేఁతలవానిన్ = వెన్నతినువానిని; మెఱుఁగుఁజామనచాయమేనివానిన్ = మెఱుఁగారు నల్లనిచాయ గల దేహము కలవానిని; దిస్సమొలవానిన్ = దిగంబరుని; పసిన్ = ఆవులగుంపును; కానన్ = అడవియందు (మేఁతకయి); మురళి = పిల్లనగ్రోవి; ముష్వంకమురువువానిన్ = మూఁడు వంక లేర్పడునట్లు నిలుచుటచే అందముగూర్చువానిని; [ముష్వంక = త్రిభంగి అని ప్రసిద్ధము] తద్విపుల మహిమన్ = ఆ విట్ఠలునిగొప్పమహిమను; ప్రాఁపత్తిక్రీనీడ = ప్రాఁతమఱ్ఱిచెట్టుక్రింది నీడ; విడిదిప్రోడ= విడిది (నివాసము) గాగల శివుఁడు; నొడువున్ = చెప్పును.

శా. సారాచారవిచార! చారణవధూసంస్తూయమానప్రథా
ధారోదారవిహార! హారసుషమాధన్యస్ఫురత్కీర్తిక
ర్పూరాలంకృతదిక్క! దిక్కరికరాభోగస్ఫురద్బాహుశా
ఖారారజ్యదశేషభూభరణదక్షా! దక్షజి[3]ద్వైభవా! 214

టీక. సారాచారవిచార! = ఆచారముల సారమును విచారించువాఁడా! చారణ...... విహార !! = చారణులను దేవజాతిస్త్రీలచేఁ గొనియాడఁబడుచున్న ప్రఖ్యాతికి ఆధారమగు ఔదార్యము యొక్క విహారముకలవాఁడా! (వేదాద్రిమంత్రి గారి దానమహిమను చారణస్త్రీలు పాటలుకట్టి పాడు చున్నారని భావము.] హార.........దిక్క !-హారసుషమా = ముత్యాలపేరులయొక్క ప్రకాశము వంటి కాంతిచే; ధన్య = ధన్యమయి; స్ఫురత్ = ప్రకాశించునట్టి; కీర్తికర్పూరాలంకృతదిక్క ! = కర్పూరమువలె తెల్లనయిన కీర్తిచే అలంకరింపఁబడిన దిక్కులు కలవాఁడా! [ఇతనికీర్తి హారములవలెను కర్పూరమువలెను తెల్లనయి నలుగడలను వ్యాపించినదని యర్థము.] దిక్కరి......దక్షా! దిక్కరికరా భోగ = దిగ్గజముల తుండమువలె పరిపూర్ణమయి; స్ఫురత్ = ప్రకాశించుచున్న; బాహుశాఖా = శాఖలవంటి భుజములచే; రారజ్యత్ = మిక్కిలిప్రకాశింపఁ (సంతోషింప)జేయు; అశేష = సమస్త మైన; భూ =భూమిని; భరణ = భరించుటయందు, దక్షా! = సమర్థుఁడగువాఁడా! [ఇతనిబాహువులు ఏనుఁగుతుండములవలెను, శాఖలవలెను ఉండి; సమస్తభూమిని భరించుటకుఁజాలి యున్నవని భావము.] దక్షజిద్వైభవా! = ఐశ్వర్యమునందు దక్షశత్రువగు శివుఁడైనవాఁడా! ఇది ముక్తపదగ్రస్తము. అలం. అనుప్రాసము, ఉపమ.

* చామనచాయ. శ. ర. 1. చ. గలివాని. 2. చ. నొడవు. 3. చ. దిగ్వైభవా!

క. నారాయణపదసేవా,పారాయణ! బంధులోకపాలనదీక్షా
ప్రారంభకల్పభూరుహ!, భారతరామాయణాదిపరమార్థజ్ఞా!. 215

టీక. నారాయణ......పారాయణ! = విష్ణునిపాదసేవయందు ఆసక్తికలవాఁడా! బంధు......భూరుహ! = బంధుసమూహమును పాలించు దీక్షయొక్క ప్రారంభమునకు కల్పవృక్షమైనవాఁడా! [వేదాద్రిమంత్రి బంధుసముద్రుఁడయి వారిని సదా ప్రోచుచుండునని భావము.] భారత...జ్ఞా!=భారత, రామాయణాదులగు పురాణముల తత్త్వమును ఎఱిఁగినవాఁడా! అలం. అనుప్రాసము.

మాలిని. సకలసుజనవర్యా! శాంభవాహార్యధైర్యా!
సుకవినుతకీర్తీ! శుద్ధతత్త్వప్రవర్తీ!
ముకురనిభకపోలా! ముగ్ధలక్ష్మీవిశాలా!
కకుబధిపసమానా! గౌరవశ్రీనిధానా! 216

టీక. సకలసుజనవర్యా! = సుజనులందఱిలోను శ్రేష్ఠుఁడగువాఁడా! శాంభవాహార్యధైర్యా!= శివసంబంధమగు కైలాసగిరివలె చలింపని ధైర్యముకలవాఁడా! [అహార్యము = పర్వతము] శుద్ధతత్త్వప్రవర్తీ! = పరిశుద్ధ స్వభావమున వర్తించువాఁడా! ముకురనిభకపోలా! = అద్దములవంటి చెక్కిళ్లు కలవాఁడా! ముగ్ధలక్ష్మీవిశాలా! = మనోజ్ఞమగు గొప్ప సంపద కలవాఁడా! కకుబధిపసమానా! = దిక్పాలురతో సమానుఁడగువాఁడా! గౌరవశ్రీనిధానా! = గౌరవసంపదకు నిధి యగువాఁడా! అలం. అనుప్రాసము.

గద్యము. ఇది శ్రీమత్పరమపదనాథనిరవధికకృపాపరిపాకపరిచిత సరసకవితాసనాథ రామకృష్ణకవినాథప్రణీతంబైన పాండురంగమాహాత్మ్యం బను పరమభాగవతచరిత్రమునందుఁ బ్రథమాశ్వాసము. 217

టీక. పరమ......ప్రణీతంబు - పరమపదనాథ = మోక్షాధిపతియగు విష్ణువుయొక్క; నిరవధికకృపా = అంతములేని దయయొక్క; పరిపాక = పంటకు; పరిచిత = వాడుకపడిన; సరసకవితాసనాథ = సరసకవిత్వముతోఁ గూడిన; [భగవంతుని నిరవధికకరుణకు ఫలముగా ఈకవికి సరసకవిత యబ్బిన దనుట.] రామకృష్ణ కవినాథ = రామకృష్ణకవిశ్రేష్ఠునిచే; విరచితంబు = కూర్పఁబడినది; పాండురంగమాహాత్మ్యంబు = పాండురంగ విఠ్ఠలదేవుని గొప్పతనము (అను నర్థమిచ్చు పేరుగల ప్రబంధము) పరమభాగవతచరిత్రము = పేరుపడిన భగవద్భక్తుల చరిత్రము.

ఇది శ్రీగౌతమసగోత్రపవిత్ర బులుసూపనామక సీతారామస్వామ్యవధానిపుత్ర, సకలవిద్వజ్జనవిధేయ వేంకటరమణనామధేయగ్రథితంబైన పాండురంగమాహాత్మ్య టీకయందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు

# పాండురంగమాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము




దయితచరణసేవా
ప్రాదుర్భవదఖిలవిభవభాసుర! సరసా
హ్లాదక! వితరణవిద్యా
వేదీ! రామాను[1]జేంద్రు వేదాద్రీశా! 1

టీక శ్రీదయిత .....భాసుర! = విష్ణుని పాదసేవవలనఁ గలిగిన సమస్తైశ్వర్యములతోఁ బ్రకాశించువాఁడా! సరసా......వేదీ! = రసికులను సంతోషింపఁజేసెడి త్యాగ(దాన) విద్య నెఱిఁగినవాఁడా!

వ. ఆకర్ణింపు మాగోకర్ణకుండలుండు సకుమారంబుగాఁ గొండరాచూలిం గనుంగొని.

టీక. గోకర్ణకుండలుండు = పాములు కర్ణాభరణములుగాఁగల శివుఁడు; సకుమారంబుగాన్ = కుమారస్వామితోపాటు; కొండరాచూలి = పార్వతి.

శివుండు పార్వతీకుమారులకుఁ బౌండరీకక్షేత్రమాహాత్మ్యంబుఁ జెప్పుట

సీ. శైలజ! విను విను షట్కంఠ! కరవీరకుశపల్లవంబులఁ గొమరుమిగులు
ఘుర్మవీరానది కలసె నెచ్చట నట్టి భైమిదక్షిణతీరభాగమునకు
యోజనంబున సమస్తోన్నతం బగు తీర్థమును క్షేత్రమును జాలఁ బొగడువడయుఁ
బౌండరీకము లన భాసిల్లు నచట నద్దేవతోత్తముఁడు లక్ష్మీ[2]విభుండు
తే. భక్తరక్షణదాక్షిణ్యసక్తబుద్ధి, యఖిలనిగమాఘగిరిగుహాహరిపృథుకము
[3]పాండురంగండు సాకృతిబ్రహ్మలీల, నిలిచియున్నాఁడు భువనవర్ణితవిభూతి. 3

టీక. షట్కంఠ! = ఆఱుమెడలుకల కుమారుఁడా! సమస్తోన్నతంబు = అన్నింటను గొప్పది; దాక్షిణ్యసక్తబుద్ధి = దయాళుఁడు; అఖిల.....పృథుకము = వేదములను కొండగుహాయందుండు సింహపుఁబిల్ల, సాకృతిబ్రహ్మలీలన్ = దేహముదాల్చిన పరతత్త్వమువలె; వేదములు గిరిగుహాగాను, పాండురంగఁడు సింహపుఁబిల్లగను వర్ణింపఁబడుటచే నిందు అలంకారము రూపకము.

వ. ఆదికల్పంబునందలి పదునెనిమిదవ ద్వాపరంబు కడకందువ శతానందాది బృందారక సందోహ [4]శిరశ్శేఖరశిఖర మణిగణమయూఖచ్ఛటాటోపారోప మహనీయచరణనఖరశిఖరుం డగు పుండరీకాక్షుండు పాండురంగాహ్వయమునం బుండరీకుం డను నొక్క భూసురపుండరీకునకుఁ బ్రత్యక్షుంబై భక్తపక్షపాతంబునఁ

1. క. జేంద్ర. చ. జేంద్రు. 2. క. వరుండు. ట. విభుండు. 3. చ. పాండురాంగుండు.
4. క. శిరశ్శిఖర. చ. శిరశ్శేఖరశిఖర.

దత్క్షేత్రతీర్థంబులకుఁ బౌండరీకంబు [1]లను నామకల్పనం బాచరించి యా చతుర్భుజుండు నేఁడు నచ్చోటన యున్నవాఁడు. అవ్వైష్ణునిచరిత్రంబు మీకు శ్రోత్రరసాయనంబు చేసెద వినుండు. ఇది మీ యిద్దఱిప్రశ్నంబులకు నుత్తరం బయ్యెడు నని మృడుండు మునిసన్నిధానంబునఁ గుమారుండు వినుకొన గిరికుమారిం గటాక్షించి ద్రాక్షారస [2]సపక్షంబు లగు నక్షరవిక్షేపంబు లోలయ నిట్లనియె. 4

టీక. కడకందువ = చివరికాలము; శతానందాది = బ్రహ్మ మొదలగు; శిరశ్శేఖరశిఖర=కిరీటాగ్రములయందలి; మయూఖచ్ఛటాటోపారోప = గొప్పకాంతిసమూహము వ్యాపించుటచే; మహనీయ = పూజ్యుఁడగు; చరణనఖరశిఖరుఁడు = పాదముల కొనగోళ్లు కలవాఁడు; భూసురపుండరీకునకున్=బ్రాహ్మణశ్రేష్ఠునకు; నామకల్పనం బాచరించి = పేరుపెట్టి; శ్రోత్రరసాయనంబు చేసెదన్ = వీనులవిందొనర్చెదను; ఉత్తరంబు = సమాధానము; వినుకొనన్=జాగ్రతతో వినఁగా, కటాక్షించి = చూచి; ద్రాక్షారస సపక్షంబులు = ద్రాక్షారసమునకు సమానమైనవి; అక్షరనిక్షేపంబులు = పలుకులు.

## పుండరీకమహామునిచరిత్రము

చ. అలికులవేణి! విన్ము రచితాఖిలపుణ్యుఁ డశేషగణ్యుఁ డ
త్యలఘువివేకపాకఖని యార్యజనస్తవనీయ[3]చర్యుఁ డు
జ్జ్వలగుణరత్నరత్ననిధి సత్యదయార్జవశాంతిదాంతిమాం
సలగతి పుండరీకుఁ డను సన్ముని పొల్పు నొకండు పెంపునన్. 5

టీక. అత్యలఘువివేకపాకఖని=ఆఱితేఱిన తెలివికి నిధియైనవాఁడు; ఉజ్జ్వలగుణరత్నరత్ననిధి = ప్రకాశించుగుణములనెడి రత్నములకు సముద్రమగువాఁడు; (అలం. రూపకము.) సత్య.....గతి = సత్యము, దయ, తిన్నఁదనము, శాంతి, దాంతి - అనువానిచే పెంపొందిన వర్తనముకలవాఁడు.

సీ. చలిచీమ నేనియుఁ జాఁద్రొక్క శంకించుఁ బలుకఁ డెన్నఁడు మృషాభాషణములు
కలుషవర్తను లున్న పొలముపొంతఁ జనండు కలిమికుబ్బఁడు లేమిఁ [4]గలఁగఁ డాత్మఁ
దలయెత్తి చూడఁ డెవ్వలనఁ బరస్త్రీల ధైర్యంబు విడఁ డెట్టి [5]దద్దఱులల
నొరులసంపదకునై యుపతపింపఁడు లోన నిందింపఁ డెంతటి[6]నీచునైన

తే. మిన్నకయ చూడఁ [7]డాఁకలిగొన్నకడుపు
సర్వభూతదయోదయోత్సవ మొనర్చు
నిగమఘంటాపథైకాధ్వ[8]లీనబుద్ధి
బ్రహ్మవిద్యానవద్యుండు బ్రాహ్మణుండు. 6

టీక. చాఁద్రొక్కన్=చావఁద్రొక్కుటకు; పొలముపొంతన్=చోటిపొలిమేరకు; కలఁగఁడు= కలఁతపడఁడు; ఎవ్వలనన్ = ఏవంకను; దద్దఱులలన్ = ఒడుదొడుకు సమయంబులయందును; సంపదకునై = సొత్తుకొఱకు; విడఁడు = వీడఁడు - విడువఁడు; ఉపతపింపఁడు = అసూయపడఁడు; ఆఁకలిఁగొన్నకడుపున్ = ఆఁకలిచే బాధపడువానిని; నిగమ......బుద్ధి = వేదమార్గము ననుసరించి నడుచువారిలో ప్రధానుఁడు; బ్రహ్మ.....వద్యుండు=వేదాంతశాస్త్రవేత్త; ఇందు పుండరీకుని గొప్పతనము వర్ణింపఁబడినది;

---

1. క. లన. 2. క. పక్షంబులగు. చ. సపక్షంబులగు. 3. చ. ధైర్యుఁడు. 4. క. కలఁగ. 5. తత్తఱముల. శ. ర. చ. దర్ధరముల. 6. ట. నీచునేని. 7. క. కన్న. చ. గొన్న. 8. చ. నినదవృత్తి.

చ. హరిహయదేశికాభుఁ డగు నస్మహిదైవతమౌళియందు బం
గరువునకున్ మృగీమదసుగంధము సంఘటిలుభాతి నంబుజో
దరచరణారవిందసతతస్మృతిలోలుప యైన బుద్ధియున్
బరిణతిఁ గాంచె సంపదలపై మఱియుం జనియించు సంపదల్. 7

టీక. హరిహయదేశికాభుఁడగు = ఇంద్రునిగురువగు బృహస్పతితో సమానుఁడైన; బంగరు... భాతిన్ = బంగారమునకు కస్తూరిపరిమళ మబ్బినట్లు; అంబుజో......లోలుప = విష్ణుదేవుని పాదపద్మముల నెల్లప్పుడును స్మరించుటయందలి వ్యసనము కలది; పరిణతిన్ = పరిపాకమును. అలం. అర్థాంతరన్యాసము.

సీ. మొదలఁ గామక్రోధములు బరాబరిచేసి సత్యవాఙ్నియమంబు [1]సంఘటించి
సాత్త్వికస్వల్పభోజనలబ్ధిఁ గ్రొవ్వాఁగి యష్టాంగకాసక్తి హవణుపఱచి
[2]తరిచి ముప్పదిరెండు తత్త్వంబు లూహించి మది [3]సత్త్వసంపద మస్తరించి
తెలిసి ముద్రాసనంబులు మేని పనిగొని హఠపూరుషుఁ [4]బటాపంచుఁ జేసి
తే. యతఁడు మూలాలవాల గహ్వరకరండ, కుండలీస్థానగోకర్ణకులకలాప
తత్త్వవర్ణవర్ణాధిదైవతదళ, నిర్ణయం బెంత యంతయు నిజము గాంచి. 8

టీక. బరాబరిచేసి = చెదరిపోఁగొట్టి-అణఁచి; సత్యవాఙ్నియమంబున్ = యథార్థమును మితము నగురీతి ప్రసంగమును; క్రొవ్వు, ఆఁగి = క్రొవ్వునడ్డగించి - ఆఁపి; అష్టాంగకాసక్తి = యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, మనన, సమాధు లను యోగములందు అభిరుచిని; హవణుపఱచి= సమకూర్చి; ముప్పదిరెండుతత్త్వంబులు= ప్రకృతి, మహత్తు, అహంకారము, 11 ఇంద్రియములు, పంచ భూతములు, పంచ విషయములు, జీవుఁడు, పరమాత్మ, షట్చక్రములు అనునవి. మస్తరించి = స్వాధీన పఱుచుకొని; మేనిపనిగొని = శరీరమును శ్రమపెట్టి; పటాపంచుచేసి = తఱిమి నశింపఁజేసి; మూలాల వాల......నిర్ణయంబు = మూలాధారమగు గుహారూపమగు బరిణె యగు కుండలీస్థానమందలి శేషుని తత్త్వమును; విష్ణుతత్త్వమునకు మూలములగు బీజాక్షరములు, అధిదేవతలు, దళములు అనువాని తత్త్వము బాగుగ నెఱిఁగెనని భావము.

చ. మనుహఠరాజయోగములమర్మ మెఱింగి తదర్థసిద్ధి నె
మ్మనము[5]దలిర్ప [6]హృజ్జలజమానసరసౌరభషట్పదంబు న
ర్జునరథభూషణంబు వెలిఁ జూడనినిద్దపునిట్టచూపునన్
[7]మునుకొని చొక్కు లోన నిజమూర్ధగళత్సుధ సేదదేర్పఁగన్. 9

టీక. మను. మంత్రములయొక్కయు, హఠరాజయోగములు హఠయోగముయొక్కయు, రాజయోగముయొక్కయు; మర్మము = రహస్యము; తదర్థసిద్ధిన్ =అవి నెఱవేఱుటచే; హృజ్జలజమానసరసౌరభ షట్పదంబు=హృదయకమలమున దట్టముగా వ్యాపించియుండు పరిమళమునకు తుమ్మెదయైనవాఁడు; అర్జున రథభూషణంబు = అర్జునునకు సారథియైనవాఁడు; వెలిఁజూడని = బాహ్యప్రపంచమును చూడని; నిద్దపునిట్టచూపునన్ = చలింపని ప్రేమమయదృష్టిచేత; మునుకొని = పొంగిపొరలి; చొక్కన్ = పరవశమగును; నిజమూర్ధగళత్సుధ = తనశిరస్సునుండి జాఱుచున్న అమృతము; సేదఁదేర్పఁగన్ = శ్రమనుపోఁగొట్టఁగా. అలం. రూపకము.

---

1. క. సంగ్రహించు. చ. సంఘటించు. 2. చ. తరసి. 3. చ. తత్త్వసంపద. 4. క. పటాపంచ. చ. పటాపంచు. 5. క. తలిర్చి. చ. తలిల్చి. 6. క. హృజ్జలజమానస. చ. తజ్జలజమాసర, 7. క. మునుకొని. చ. మును, గని.

మ. శతపత్త్రాక్షుము శిక్యసఖ్యభృతిచంచన్మౌళిసన్నాహము
న్నతనాసాముకుళంబు పూర్ణతరచంద్రస్నిగ్ధముగ్ధాననం
బతసీసూనసవర్ణవర్ణ మతిసౌమ్యం బబ్జనాభంబు శ్రీ
శ్రితవక్షంబు మహోమహం బొకఁడు పర్వెం దన్మనఃపేటికన్. 10

టీక. శతపత్త్రాక్షము = పద్మమువంటికన్నులుకలది; శిక్య......సన్నాహము = తలమీఁద చిక్కముకలది;ఉన్నతనాసాముకుళంబు=పొడవై మొగ్గవలెనున్న ముక్కుకలది; అతసీసూనసవర్ణవర్ణము= నల్ల అవిసెపూవుతో సరియగు దేహకాంతికలది; మహోమహం బొకఁడు = ఒక గొప్ప తేజస్సు; తన్మనఃపేటికన్ = పెట్టెవలె దిట్టమగు నతని (పుండరీకుని) మనస్సునందు; పర్వెన్ = వ్యాపించెను. ఇచట విష్ణుని లోకోత్తరస్వరూపము పుండరీకుని మనస్సున ప్రకాశించెనని గౌణముగ చెప్పఁబడుటచే ఉదాత్తాలంకారము.

సీ. సనకసనందనాదినిఖిలాంతర్వాణిహృల్లీలభావంబు సల్లపెట్టి
విశ్వంభరాభోగ వివిధమూర్త్యంతరస్ఫురితానుభావంబు బుజలువైచి
శింశుమారాకృతి స్వీకృతి వైకుంఠపట్టవిహారంబు జారవిడిచి
క్షీరోదమధ్యస్థలీరత్నగగుహా గర్భనివాసంబు కచ్చువదలి
తే. పుండరీకేక్షణుండు శిఖండిబర్హ, మండితశిఖండకుఁడు నతాఖండలుండు
పుండరీకునిమానసాంభోజపీఠి, మిండతుమ్మెదయై యుండు నిండుకొలువు. 11

టీక. సనకసనంద......భావంబు = సనకుఁడు, సనందనుఁడు మొదలగు విద్వాంసుల మనస్సులయం దణఁగియుండు (నివసించియుండు)టను; సల్లపెట్టి = విడిచి; విశ్వంభరా......నుభావంబు= లోకోద్ధారకములు, గొప్పవియు నగు అవతారములు ఎత్తు మహిమను; బుజలువైచి = సున్నలుపెట్టి - విడిచిపెట్టి; శింశుమారాకృతిస్వీకృతిన్=మీనరూప-(జలచరరూప)మును ధరించుటచేత; వైకుంఠపట్టవిహారంబున్ = జ్ఞాన, శక్తి, బల ఐశ్వర్య, వీర్య, తేజోరూపములగు నాఱువైకుంఠములందును విహరించుటను; క్షీరోద......కచ్చు-క్షీరోదమధ్యస్థలీ = పాలసముద్రము మధ్యమునందలి; రత్నగగుహా గర్భనివాసంబుకచ్చు = రత్నాద్రిగుహయందు నివసించు కోరికను; శిఖండిబర్హమండితశిఖండకుండు = నెమిలి పింఛముచే అలంకరింపఁబడిన జుట్టు కలవాఁడు; నతాఖండలుండు = (తనకు) నమ్రుఁడైన ఇంద్రుఁడు కలవాఁడు; మిండతుమ్మెదయై=గండుతుమ్మెదయై. (అలం. రూపకము)నిండుకొలువు. ఉండున్.

ఉ. అన్వహమున్ [1] ప్రవృద్ధమగు నంబుజనాభపదారవిందభ
క్తి న్వహి కెక్కుచున్ వసుమతీసురవంశవతంస మెల్లవా
రు న్వినుతింపఁ బెంపెసఁగఁ[2] బ్రోది యొనర్చుచుఁ దల్లిఁ దండ్రి [3]నే
దు న్వివిధానురూపతనుదోహదభోజనపూజనాదులన్. 12

టీక. అన్వహమున్ = ప్రతిదినమును; ప్రవృద్ధమగు = వృద్ధిపొందు; వహి కెక్కుచున్ = ప్రసిద్ధికెక్కుచు; వసుమతీసురవంశవతంసము = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు; పెంపెసఁగన్ = గొప్పతనమును పొందును; ప్రోదియొనర్చుచున్ = పోషించుచు-కాపాడుచును; అనురూప......నాదులన్ = తగినట్లు దేహమును కాపాడుట కనుకూలములగు భోజనము, పూజనము మొదలగువానిచే, ఏదున్ = పోషించును.

క. హరిభక్తియు గురుభక్తియు, సురుచక్తియుఁ బుటముగాఁగ యోగీంద్రశిఖా
భరణము ముక్తామయతాస్ఫురణము భువనప్రశస్తముగ జిగి మీఱెన్. 13

1. చ. ప్రవృద్ధమఁగ. 2. క. ప్రోది. 3. క. నెందున్. చ. నేదున్. పెంపొసఁగఁ బ్రోది. శ. చ.

టీక. గురుభక్తి = పెద్దలయందుభక్తి; ఉరురక్తి = ఎక్కువైనప్రేమ. పుటముగాఁగన్ = అధికముకాఁగా; యోగీంద్రశిఖాభరణము = యోగులకు తలమానికమగువాఁడు-మిగులశ్రేష్ఠుఁడు; ముక్తామయతాస్ఫురణము=ముక్తులచే అలంకరింపఁబడుట-లావణ్యము, విడువఁబడినరోగభావమును; భువనప్రశస్తముగన్ = ప్రసిద్ధముగా; జిగి = కాంతి; మీఱెన్=అతిశయించెను.

సీ. మును మీనగుటఁ[1]బట్ట మునులువైచిన బత్తి వలఁబోలెఁ జిక్కు మౌదలఁ దలిర్ప
[2]వెలితిగాఁ జవిగొన్న వెన్నముద్దయుఁబోలె శంఖంబు వామహస్తమునఁ దనర
జగదండవహకాలచక్రభ్రమణహేతుదండమై నిజధేనుదండ మమర
సంచిఁబట్టిన పద్మజాతాండములలీల వలకేల గ్రచ్చకాయలు ఘటిల్ల

తే. కలయఁ బూచిన కల్పవృక్షంబుచాయ, సరసనానపుష్పమాలికాభరసమగ్ర
విగ్రహముతోడ విలసిల్లు విప్రు నెదుట, మందప్రోయాంఁడ్రసూరిమిప్రూనిపండు.

టీక. మీనగుటన్ = మత్స్యరూపమును ధరించుటచే; పట్టన్ = పట్టుకొనుటకు; బత్తివల=భక్తియనువల; చిక్కుము = చలిదిచిక్కము; మౌదలఁ దలిర్పన్ = తలపై ప్రకాశింపఁగా; వలితిగాఁ జవిగొన్న = కొంతకొఱికిన; జగదండ......దండమై = బ్రహ్మాండభాండమును మోయు కాలచక్రము తిరుగుటకు కారణమగు కఱ్ఱయై; నిజధేనుదండము=తన పసులనుతోలెడికఱ్ఱ; వలకేలన్=కుడిచేతియందు; కలయఁబూచిన = బాగుగాఁబూచిన; మందప్రోయాండ్రసూరిమిప్రూనిపండు = గొల్లపడుచులప్రేమఫలము - శ్రీకృష్ణుఁడు. అలం. ఉదాత్తము. స్వభావోక్తి, ఉపమ.

క. నియమాంతంబున సత్యాప్రియరూపముతోడఁ గూడఁ బెనచిన యంత
ర్నయనము సడలిచి పితృపాదయుగార్చాధీనబుద్ధిఁ దహతహ వెలుఁగన్. 15

టీక. నియమాంతంబునన్ = సమాధి ముగిసినపిదప; సత్యాప్రియరూపముతోడన్ = (సాక్షాత్కరించిన) శ్రీకృష్ణుని స్వరూపముతోఁగూడ; అంతర్నయనము = లోపలిచూపు - యోగదృష్టి; సడలించి = విడుచునట్లుచేసి; పితృ...బుద్ధిన్ =తలిదండ్రుల పాదసేవకు లొంగిన బుద్ధిలో; తహతహ = తమకము.

ఉ. పావనదృగ్విలాసములు బాహ్యగతిం బచరించి చంద్రికా
శ్రీవిభవంబులం బలుచనేయు ముఖప్రభ లుల్లసిల్లఁగా
మై వదలించి [3]పూర్వమగుమట్టును గాడ్పును సాగనిచ్చి పైఁ
గావలియిడ్డ శక్తుల సగౌరవదృష్టిఁ బరిగ్రహించుచున్. 16

టీక. పావనదృగ్విలాసములు = పవిత్రములగు తళుకుఁజూపులను; బాహ్యగతిన్, పచరించి = బాహ్యప్రపంచమున వ్యాపింపఁజేసి; చంద్రికాశ్రీవిభవంబులన్ = నిండువెన్నెలసొబగును; పలుచనేయు = తేలికచేయు - తిరస్కరించునట్టి; ముఖప్రభలు = ముఖకాంతులు; మై, వదలించి = దేహమును ఆసనబంధమునుండి తప్పించి; పూర్వమగుమట్టునన్=(సమాధికి) పూర్వపు సంకోచమును; కావలియిడ్డ శక్తులన్ = లోనికి రాకుండ ఆటంకపఱచి యుంచిన యిచ్ఛాది శక్తులను; సగౌరవదృష్టిన్ = మర్యాదతో; పరిగ్రహించుచున్ = తిరిగి తీసికొనుచు. ముందునకన్వయము.

సీ. తనువుతోఁ జరియించు ధర్మదేవతఁబోలె మెలఁపున వనవాటిఁ గలయఁ దిరిగి
గణనమీఱిన శార్ఙ్గిగుణములు హృదయసంపుటి నించుక్రియ విరుల్ [4]బుట్టఁబెట్టి

1. చ. బట్ట. క. బట్టి. 2. చ. వెలితివి. 3. క. మట్టున. ట. మట్టున. 4. ట. బుట్టి.

తనకుఁ బవిత్రవర్ధనమె కృత్యం బనుకరణి నూతనకుశోత్కరముఁ గూర్చి
యపవర్గఫలసిద్ధి హదనైనఁ జేపట్టుకైనడి బహుఫలోత్కరము [1]లొడిసి

తే. యోగయాగంబు సలుపుచో నూర్మిపశువి
శసన మొనరించుటకు యూపసమితిఁ దెచ్చు
భాతి [2]సమిధలఁ గొని మహాప్రాజ్ఞుఁ డతఁడు
వచ్చు లేఁబగటికి నిజావాసమునకు. 17

టీక. మెలపునన్ = మెలకువతో; గణనమీఱిన = లెక్కకు మిక్కిలియైన; హృదయసంపుటిన్ = మనసనెడి పెట్టెయందు; బుట్టిన్ = బుట్టయందు; కుశోత్కరమున్ = దర్భలసమూహమును; ఒడిసి = కోసి; అపవర్గఫలసిద్ధి = మోక్షప్రాప్తి; హదను = అదను - తఱి; ఊర్మిపశువిశసనము = షడూర్ములు అను పశువులను చంపుట; [స్థూలశరీరము నాశ్రయించిన జరామరణములును, సూక్ష్మశరీరము నంటియున్న క్షుత్పిపాసలును, కారణశరీరము నాశ్రయించిన శోకమోహములును ఆఱు ఊర్ములు,] [పూర్వటీకలో ఇచట "ఊర్మిపశువిశసనము = శ్వాసమనెడి పశువును చంపుటను" అని యున్నది. అది తప్పు.] యూపసమితిన్ = యజ్ఞపశువులను కట్టెడి స్తంభములగుంపును; లేఁబగటికిన్ = తెల్లవాఱి ఎక్కువకాలము కాకమునుపే; నిజావాసమునకున్ = తనయింటికి. అలం. ఉపమ, రూపకము.

క. విహితమతిం బరిచారక,సహస్రమయి పిత్రృయుగంబు సంభావించున్
గృహమేధివతంసము నిజ,మహిళామణి యప్రతీపమతిఁ దోడ్పడఁగన్. 18

టీక. విహితమతిన్ = అనుకూలించుబుద్ధితో; పరిచారకసహస్రమయి = తానొక్కఁడే వేయిమందిసేవకులపెట్టయి; పితృయుగంబున్ = తలిదండ్రులిద్దఱిని; గృహమేధివతంసము = గృహస్థులలో ఉత్తముఁడు; నిజమహిళామణి = తనభార్య; అప్రతీపమతిన్ = ఎదురుతిరుగనిబుద్ధితో.

సీ. ఆపాదమస్తంబు నంటు నూనియగాచి న్యాయముగా నుద్వర్తనం బొనర్చు
జలకమార్చు నఖంపచస్వచ్ఛజలములఁ దడియొత్తుఁ గడు మెదుగుడులఁ [3]బొదివి
లఘుధౌతవసనపల్లవములు గట్టించు శిరసార్చు మృదులీల సురటి విసరి
చేయూఁత యొసఁగి వేంచేయించు లోనికి ద్వారావతి [4]గలంతిఁ దానె యొసఁగుఁ

తే. దెలుపు సంధ్యాసమాధివిధిప్రయుక్తి, నగ్ని వేల్పించు విష్ణుసహస్రనామ
పాఠ మొనరించుతఱిఁ దోడుపడు గురునకు, [5]గవలువోకుండఁ బుత్రుఁడో కలువకంటి.

టీక. ఆపాదమస్తంబు = నఖశిఖాపర్యంతము - దేహమంతయుఁ; నయముగాన్ = ఒద్దికతో; ఉద్వర్తనంబొనర్చున్ = నలుగుపెట్టును; జలకమార్చున్ = స్నానముచేయించును; నఖంపచస్వచ్ఛజలములన్ = గోరువెచ్చనితేటనీటితో; మెరుగుడులన్ = మెత్తనిగుడ్డలతో; పొదివి = కప్పి; లఘు......వములు= తేలికయై నిగనిగలాడు మడతవస్త్రములు; సురఁటి=వీవన; ద్వారావతి గలంతిన్ =జారీ చెంబును; కవలువోకుండన్ =క్రమముతప్పకుండునట్లు; కలువకంటి!=కలువలవంటికన్నులుగల పార్వతీ!

తే. చూపు చాలమి వివిధరూపోపకరణ,వితతిఁ దడవాడు జనకునానతి శిరమునఁ
దాల్చి సిద్ధంపుబుద్ధిఁ దద్దారకుండు, చక్రహస్తార్చనమున కుపక్రమించు. 20

టీక. వివిధరూపోపకరణవితతిన్ = పెక్కువిధములగువస్తువులసమూహమును; తడవాడు = తడవుకొను, - వెదకు; సిద్ధంపుబుద్ధిన్ = ప్రేమతో; తద్దారకుండు=అతనికొడుకు; చక్రహస్తార్చనకున్ = విష్ణుని పూజించుటకు; ఉపక్రమించున్ = ప్రారంభించును.

---

1. క. ఒడిచి. శ. ర. ఒడిసి. 2. క. సమిధలు. 3. క. పొదవి. 4. ట. గరంచి. 5. క. కవలు.

సీ. అభిషేక మొనరించు నాకాశవాహి నీజననకారణపాదజలరుహునకు
వైచుఁ దో[1]మాలియ వైజయంతీకాంతివలయితపక్షఃకవాటునకును
గౌశేయ మర్పించుఁ గాంచనమయ[2]పటీ పల్లవారుణ[3]కటిబంధురునకుఁ
జందనం బలఁదు నీళేందిరాకుచకుంభసంగికుంకుమపంకిలాంగునకును
తే. రత్నహారంబు సాతు నిర్యత్న[4]సిద్ధ,కౌస్తుభోదర్చిరభిరామకంధరునకు
ధూపకల్పన మున్నుగా దీప మిచ్చుఁ, దెఱవ! యాతఁడు త్రైలోక్య[5]దీపకునకు. 21

టీక. ఆకాశ......జలరుహునకున్ = గంగపుట్టుటకుఁ గారణమగు పాదపద్మములు కలవానికి; తోమాలియ = వనమాల; వైజ......వాటునకును = వైజయంతి యను పూలమాలయొక్క కాంతిచే నావరింపఁబడిన, తలుపువంటి ఱొమ్ము కలవానికి; కౌశేయము = పట్టువస్త్రము; కాంచన......రునకున్ = చిగురువంటి బంగరువస్త్రముచే నెఱ్ఱనైన మొలచే చక్కనగువానికి; అలఁదున్ = పూయును; నీళేందిరా......నకును = నీళాలక్ష్మీదేవులకుచములయందలి కుంకుమ మంటిన దేహము కలవానికి, చాతున్=సమర్పించును; నిర్యత్న......రునకున్ = అప్రయత్నముగా లభించిన కౌస్తుభమణియొక్క కాంతి పుంజముచే ఇంపైన మెడ కలవానికి; మున్నుగాన్ = మొదలుచేసి - అనఁగా - మొదట ధూప మిచ్చి; తెఱవ! = పార్వతీ!

క. నిడుదచిగురనఁటియాకున నిడి వివిధాన్నములు భూసురేశ్వరుఁ డొసఁగున్
[6]బడి ఘంట మొరయఁ జేయుచు, జడనిధితల్పునకుఁ బూర్ణసంకల్పునకున్. 22

టీక. నిడుదచిగురనఁటియాకునన్ = పొడవైన లేఁతయరఁటియాకులో; బడిన్ = వరుసఁగా - వెంబడిని; మొఱవఁ జేయును = వాయించును; జడనిధితల్పునకున్ = సముద్రముపడుకగాఁ గలవానికి - విష్ణునకు.

క. భూమిసురసూతి సాల, గ్రామశిలావారి కంబుగర్భస్థము ది
వ్యామోదశ్రీతులసీ,కోమలదళసురభితంబు గురునకు నొసఁగున్. 23

టీక. కంబుగర్భస్థమున్ = శంఖములో పోయఁబడినదానిని; గురునకున్ = తండ్రికి.

మ. తిరువారాధన మిట్లొనర్చి ధరణీదేవాన్వయశ్రేష్ఠుఁ డా
హరి కర్పించుటఁ బావనంబు లగు శాల్యన్నంబులు న్నేతులున్
వరుగుల్ [7]చారులు పప్పులప్పడములున్ దాలింపులుం [8]బూపముల్
పరమాన్నంబులుఁ బెట్టు నెట్టన భుజింపం దల్లికిం దండ్రికిన్. 24

టీక. తిరువారాధనము = దేవతార్చన; ధరణీ.....శ్రేష్ఠుఁడు=ఉత్తమబ్రాహ్మణుఁడు; అర్పించుటన్ = నైవేద్యము పెట్టుటవలన; పావనంబులు=పవిత్రములు; తాలింపులున్ = తాలింపుచేసినకూరలను; పూపముల్ = అప్పములు - పిండివంటలు; నెట్టనన్ = సమృద్ధిగా.

వ. ఇట్లతివృద్ధులు శిథిలబుద్ధులు నగు జనయిత్రీజనకులం గని మని నడరుచు నడుగులకు మడుగు [9]లొత్తుచు నడుగునెడఁ బులిజున్నైనియుం దెచ్చి యిచ్చుచు నిచ్చఁ గ్రొత్తయగు మచ్చికం గచ్చు వదలక గోము మెఱసి యోమనగాయలంగా నోముచుఁ గాలో[10]చితంబులగు నోములు నోమించుచు సద్ధరామరనందనుండు జగదభినందితుండై యుండి వెండియు. 25

---

1. ట. మాలిక. 2. క. కట. చ. పటీ. 3. కటీ. 4. చ. సిద్ధి. 5. ట. దీపమునకు. 6. చ. పిడి. 7. క. చేరులు. ట. చారులు. 8. చ. లాపూపముల్. 9. చ. లొత్తుచు. 10. చ. చితంబులుగా.

టీక. శిథిలబుద్ధులు = బుద్ధిపటుత్వము తగ్గినవారు; మనిపడచుచుఁ = పఠించుచు; అడుగు...... లొడ్డుచుఁ = ఉత్తనేలపైఁ నడిపింపక - గౌరవముగా; మచ్చికఁ = ప్రేమచేత; కచ్చు, వదలక = ప్రీతివిడువక; ఓమనగాయలంగాఁ = ఓమనగుంటలాడుగింజలనుగా - చేతులమీఁదనే తిరుగునట్లుగా; ఓముచుఁ = పోషించుచు; ధరామరనందనుండు = బ్రాహ్మణపుత్త్రుఁడు; జగదభినందితుండై = లోకుల మెప్పునుపొంది.

క. పరలోకావాసముఖా, దరపరతం జనిన తల్లిదండ్రుల కొసఁగెన్
గురుభక్తి నిగుడు కొడు కతి, కరుణామతి గంగ నస్థి గయఁ బిండంబున్. 26

టీక. పరలోకావాసముఖాదరపరతంజనిన = లోకాంతరమునకేఁగిన - మరణించిన; ఒసఁగుఁ = అర్పించును.

క. ప్రేయసివలనఁ బ్రబోధవి, ధేయ[1]మతుల సుతులఁ గాంచి తీర్చెఁ బితౄణం
బాయయ్య తదీయం బగు, ప్రాయపుఁబ్రోద్దంతఁ గొంత పడమర దిరిగెన్. 27

టీక. ప్రేయసివలనఁ = ధర్మపత్నివలన; ప్రబోధవిధేయమతులఁ = విశేషజ్ఞానము, అడఁకువ కలవారిని; పితౄణము = పితృదేవతలఋణమును; "జీవతో ర్వాక్యకరణాత్పుత్త్రసంపాదనేన చ, గయాయాం పిండదానేన త్రిభిః పుత్త్రస్యపుత్త్రతా." అను పెద్దలమాటను పుండరీకుఁడు సార్థకపఱచినాఁడని భావము.

క. భాషావిభునిభుఁ డమ్ముని, [2]యీషణదూషణ మొనర్చి యిలు మఱచి మదిన్
శేషఫణిశయనుఁ గను నభి, లాషోన్నతిఁ జేయుఁ దప మిలాధరతనయా! 28

టీక. భాషావిభునిభుఁడు = బ్రహ్మతోసమానుఁడు; ఈషణదూషణమొనర్చి = భార్యాపుత్త్రుల యందును, ధనమునందుగల వ్యామోహమును విడిచి; ఇలాధరతనయా! = పార్వతీ!

సీ. మిసిమింతు డునుగాక వసియించుఁ గుత్తుకబంటినీరను బుండువంటి చలిని
మోముదమ్మికిఁ దేఁటిమొత్తమై పొగ పర్వ వ్రేలుఁ గ్రిందలగాఁగ వృక్షశాఖ
వేరువెల్లఁకిఁ గాయగూర పండని కోరకుదరాగ్ని గాడ్పుచే నుజ్జగించు
నేచి యీచెవిగాడు పాచెవిఁ [3]బోవంగ నుబ్బి లింగమువోలె నుండు నెండ
తే. నంతరాయాంధకారంబు లలమికొనిన, నడఁచు నిజధైర్యసూర్యోదయంబుచేత
దానవారిని [4]గుఱిచేసి తనకుఁ బోదు, నాకుఁ బోదని నమ్మి సుశ్లోకుఁ డగుచు. 29

టీక. మిసిమింతుఁడునుగాక = అలసిపోక; పుండువంటి = శరీరమునుబాధించునట్టి; క్రిందలగాఁగఁ = తలక్రిందుగ; ఉదరాగ్నిఁ = ఆఁకలిని; గాడ్పుచేఁ = వాయువుచే; ఉజ్జగించుఁ = పోఁగొట్టును - అణఁచివేయును; ఏచి = బాధించి; లింగమువోలెఁ = స్థాణువువలె; అంతరాయాంధకారంబులు = విఘ్నములనెడి చీఁకట్లు; తనకుబోఁదు, నాకుఁబోదు, అని = తపము చేయక తనకుఁ దప్పదు, వర మీయక దేవునికిని తప్పదని; నమ్మి = ఆ విష్ణువునే నమ్మి. [పయిది లోకోక్తి.] సుశ్లోకుఁడు = సత్కీర్తికలవాఁడు.

ఉ. ఓగజరాజగామిని! మహోగ్రపునోములు నోఁచుచున్న య
య్యోగివరేణ్యు నేమమున నుల్లము వెన్నవలెం *గరంగె వ్యా
ద్రాగసమగ్ర[5]గోపవనితాజనతాపరిరంభసంభ్రమో
ద్యోగకళాప్రవర్తికిఁ జతుర్ముఖవంచితధూర్తకీర్తికిన్. 30

---

1. చ. సుతుల. 2. చ. యీషద్దూషణ. 3. చ. బోయంగ. 4. చ. న, గురుచేసి. ట. న, గుఱి చేసి. *గరంగి. శ. ర. 5. చ. కోష.

టీక. మహోగ్రపు=మిక్కిలిదుస్సాధ్యములగు; నోములు నోచుచున్న=వ్రతములుచేయుచున్న; నేమమునన్ = నియమమువలన; ఉల్లము = మనస్సు; హృద్రాగ.....ప్రవర్తికిన్ = మించిన ప్రేమతో గోపకన్యకలను కౌఁగిలించుటలో నేర్పుకలవానికి; చతుర్ముఖవంచితఘూర్తకీర్తికిన్ = బ్రహ్మను వంచించిన కీర్తికలవానికి, [ఇట - 'వంచితచతుర్ముఖ - 'అనుటకు మాఱుగా 'చతుర్ముఖవంచిత - ' అను సమాసము - ఆహితాగ్ని వంటిది.] వత్సాపహరణసమయమున బ్రహ్మను కృష్ణుఁడు వంచించుట ప్రసిద్ధము

సీ. యతి మనోగృహదీపికాంకూర మగులీల గోవర్ధనాచలగుహ మెలఁగుచు
గిరికూటతటరటత్కేకిరాజమురీతి రాధ చన్గవమీఁద వ్రాలి నగుచుఁ
చిత్రాభ్రముల నేలు సుత్రాముకైవడి బలువన్నెయాలమందల మెలఁపుచు
కమలకాననమధ్యకల[1]హంసవిభుభాతిఁ గూర్మినెచ్చెలిపిండు గొని చెలఁగుచుఁ
తే. చంద్రబింబంబునకు మృదుస్వనము గఱపు,రచనసంజ్ఞార్థశంఖ మూఁదుచు నొనర్చు
నాఁట లన్నియుఁ జాలించి యరిగెఁ దపస్విపర్ణశాలకు దేవకీతర్ణకంబు. 31

టీక. యతిమనోగృహదీపకాంకూరము = యతుల మనస్సులను గృహములందలి దీపకళికలు; గిరి...రీతిన్ = కొండచరియప్రదేశములందు కేకలువేయు నెమిలిరాజువలె; వ్రాలి = ఒఱఁగి; [ఇట రాధచన్గవ కొండలతోఁ బోల్పఁబడినది.] చిత్రాభ్రములనేలు = రంగురంగుల మేఘములను పాలించు; సుత్రాముకైవడిన్ = ఇంద్రునివలె; కూర్మినెచ్చెలిపిండున్ = తోడి మిత్రులసమూహమును; మృదుస్వనమున్ = మధురధ్వనిని; కఱపురచనన్ = నేర్పురీతిని; సంజ్ఞార్థశంఖము = తత్తత్సంకేతమును బోధచేయు శంఖము; [ఇచట కృష్ణునిముఖము చంద్రబింబమువలెనున్నదనియు, నతఁడు శంఖమును పూరింపఁగా చంద్రబింబమునకు మధురధ్వని యబ్బినట్లున్నదనియు పోలిక.] దేవకీతర్ణకంబు = దేవకీదేవిబిడ్డ - శ్రీకృష్ణుఁడు; అలం. ఉపమ.

చ. లలితశిరీషపుష్పమృదులంబులు నీచరణంబు లక్కటా!
యిల యిది రూక్ష మిట్టు లలయించుట [2]గా దని ప్రార్థనామృదూ
క్తులు చెలఁగంగ [3]వెన్ పొదివి తొల్పలుకుల్ తగు విన్నపంబులం
బలుమఱుఁ జేయుచందమున బంగరుటందియ లుగ్గడింపఁగన్. 32

టీక. లలిత.....లంబులు = చక్కనితిరిసెనపూవువలె మెత్తనివి; నీచరణంబులు = నీపాదములు; ఇల = నేల; రూక్షము = కఠినము; ఇట్టు లలయించుట కాదు = (ఆ పాదములను) ఇట్లు కష్టపెట్టుట తగదు; అని; ప్రార్థనామృదూక్తులు = ప్రార్థించు నొప్పిదపుమాటలు; చెలఁగంగన్ = ప్రకాశింపఁగా; వెన్పొదివి = వెంటనంటి, తొల్పలుకుల్ = వేదములు; పలుమఱు = పెక్కుసారులు; ఉగ్గడింపఁగన్ = మ్రోఁగఁగా; శ్రీకృష్ణుఁడు పరుగిడి పుండరీకుని యొద్దకుఁ బోవునపుడు కాలియందెలు మధురముగ ధ్వని చేయుచుండెను; ఆ చప్పుడు 'కఠినమైన నేలఁమీఁద మెత్తని నీయడుగులిడుట న్యాయము కాదని వేదములు వెంటఁబడి మొఱపెట్టుచున్నట్లున్నదని ఉత్ప్రేక్ష.

క. మెత్తఁగ నూఱిన[4]చుట్టుం, గత్తిన్ మధుకైటభోరుకంఠము లలనాఁ
డొత్తిన హత్తిన చెన్నుం, దిత్తులక్రియఁ దొడలయడ్డతిత్తులు వ్రేలన్. 33

టీక. మెత్తగనూఱిన = చక్కఁగా సానఁబట్టిన; చుట్టుంగత్తిన్ = చక్రమను నాయుధముచే; మధు.....ములు = మధుకైటభు లను రాక్షసుల గొప్ప కంఠములను; అలనాఁడు = పూర్వము; ఒత్తినన్ = ఖండింపఁగా; హత్తిన = అంటుకొన్న; చెన్నుందిత్తులక్రియన్ = సొగసైన సంచులవలెనున్న; తొడలయడ్డతిత్తులు = తొడలప్రక్కలనున్న గచ్చకాయల సంచులు, [చక్రముచే మధుకైట

1. చ. హంసము విభాతి. 2. చ. గాదెవి. 3. చ. శ. ర. వేపొదలి. 4. చ. మట్టుం.

ఖుల కంఠములను తెగవ్రేయునపుడు ఆ భాగములందున్న తిత్తులు చక్రమున కంటుకొని రాఁగా, వానినే కృష్ణుఁడు గ్రచ్చకాయల సంచులఁగాఁ జేసికొన్నాఁడని వర్ణింపఁబడినది.] అలం. ఉపమ.

క. మాయావృతుఁ డగు నాత్మని, సోయగమునఁ [1]దెగడి తీగసోగలు ముచ్చు
ట్టై యునికి సంగరహితం, [2]బయ్యెన్; గాకున్న జఘన ముభిరామ మగున్. 34

టీక. మాయావృతుఁడగు = మాయచే ఆవరింపఁబడిన; సోయగమునన్ = చక్కఁదనముచేత; తెగడి = తిరస్కరించి; ముచ్చుట్టై = మూఁడుచుట్టులుకలదై; ఆత్మ మాయచే ఆవరింపఁబడియుండును; శ్రీకృష్ణునికటిని మాయవంటి వసనము ఆవరించియుండలేదు, [అతఁడు దిగంబరుఁడు.] అది ఈ కటిని ఆవరింపకుండునట్లు మూఁడు చుట్లుగా తీఁగ కట్టఁబడియున్నది. కాన మాయావృతాత్మను శ్రీకృష్ణుకటి మీఱియున్నదని వర్ణితము. అలం. వ్యతిరేకము.

క. ఇట నభ మిట భూవలయం,బిట బలిసద్మంబు నుండు నిరవు లని యనన్
బటువు లగు వళులచెలువున,బుటపుటనై యున్న చిన్నిబొజ్జ గదలఁ[3]గన్. 35

టీక. భూవలయంబు = భూగోళము; బలిసద్మంబు = పాతాళము; ఇరవులు = చోటులు; బటువులగు = గుండ్రని; వళులచెలువునన్ = ముడుతల (త్రివళుల) యందముచేత; పుటపుటనై యున్న = వృద్ధిపొందియున్న. అలం. ఉత్ప్రేక్ష.

చ. తులసికిఁ బచ్చరాకుదురు తోయదవాహనరత్నవేది య
క్కలిమిమెఱుంగుఁబోఁడికిని గౌస్తుభఘర్మగభస్తికిన్ నభ
*స్తలముననంగఁబొల్చి నిరతంబు కృపావిభవంబు[4]నింటి బో
ర్తలుపుఁ దలంపుసేయుచు నురంబు గరంబు పరిస్ఫురింపఁగన్. 36

టీక. పచ్చరాకుదురు = పచ్చలు తాచిన కుదురు; తోయదవాహనరత్నవేది = ఇంద్రనీలముల తిన్నె; కౌస్తుభఘర్మగభస్తికిన్ = కౌస్తుభ మను వేఁడివెలుంగు (సూర్యు)నట్టి, నభస్తలము = ఆకాశ ప్రదేశము; పొల్చి = ప్రకాశించి; నిరతంబున్ = ఎల్లపుడును; కృపా......లుపున్ = దయాసంపద యను నింటియొక్క వీథి (పెద్ద)తలుపును; తలంపుసేయుచున్ = సరిపోలుచు; కరంబు = మిక్కిలి; పరిస్ఫురింపఁగన్ = ప్రకాశింపఁగా. అలం. రూపకము.

క. కలుషఖ[5]గవధవిధానా, కలితఘుటికలనఁగ గ్రచ్చకాయలు వలచే
నెలకొను నల జిలిబిలి వ, న్నెల వన్నెలసంచి నిండి యింపల రారన్. 37

టీక. కలుష......ఘుటికలు = పాపము లను పిట్టలనుచంపుటకుసంగ్రహించినగుండ్లు; జిలిబిలి వన్నెల = ముద్దుముద్దురంగులుగల; వన్నెలసంచి = అందమైనసంచి. అలం. ఉత్ప్రేక్ష.

క. లలిత నిజ[6]వామకరతల, కలిత[7]కనత్కంబుకాంతి కలకల నవ్వన్
గలువలచెలిగిలిగింతల, నలువగు జాలన్ బిసాళినలువగుజాలన్. 38

టీక. లలిత......కాంతి=అందమైన తన యెడమచేతియందుండి ప్రకాశించు శంఖముయొక్క కాంతి; కలువల......జాలన్ = చంద్రకాంతిప్రసారమున ఒప్పిదములగు చంద్రకాంతములను; బిసాళి, నలువ గుజాలన్ = ప్రకాశించునట్టి హంసలను; కలకలనవ్వన్ = తిరస్కరింపఁగా. అలం. ఉపమ. యమకము.

క. నిజధైర్యౌదార్యములను, గజములకుం బొడము నిడుదకరములఁ బోలెన్

---

1.చ. దెగడి. 2. చ.బయ్యెన్. 3.చ. గాన్.*స్థలము. 4. చ. నిట్టిచో. 5. చ. జగ. 6. చ. ధామ. సూర్య. 7. చ. కరత్కం.

భుజములు పోషితభక్త, వ్రజములు కరవిజితపుష్కరజములు పొదలన్. 39

టీక. పొదలన్ = పుట్టిన; నిడుదకరములఁబోలెన్ = పొడవైన తొండములవలె; పోషిత...... ములు = భక్తులసమూహమును పోషించు (రక్షించు)నవి; కరవిజితపుష్కరజములు = తామరపూవులను జయించు (తామరపూలను మించు) అఱచేతులు కలవి. అలం. ఉపమ.

క. వదనైకస్తంభకనక, సదనము [1]సిరికొఱ కొనర్చు స్రష్ట నిలుపు న
మ్మొదలింటి శంఖశంకువొ, యిది యనఁగాఁ గంబుకంఠ మింపు వహింపన్. 40

టీక. వదనైకస్తంభకనకసదనముసిరికొఱకున్ = ముఖమను నొంటికంబపు బంగారుమేడశోభ కయి; స్రష్ట = సృష్టిచేయువాఁడు - బ్రహ్మ; మొదలింటిశంఖశంకువో = మొదటి శంకుస్థాపనచేయుట కొఱకగు శంఖమువంటి మేకో; కంబుకంఠము = శంఖమువలెనున్న మెడ. అలం. ఉత్ప్రేక్ష.

క. బింకపు[2]ప్రేఁతల వాతెఱ, మంకెనపూఁదేనెతేట మానక [3]పైపై
నింకఁగ నింకఁగఁ *బల్మఱు, బంకించుటఁబోలె మోవి బచ్చెన నొప్పెన్. 41

టీక. బింకపు - తేట = బింకమైన గొల్లెతల ఎఱ్ఱనిపెదవులందలి మంకెనపూఁదేనెవంటి అమృతము; పంకించుటఁబోలెన్ = పూయుటచేతనో యనునట్లు; బచ్చెన = రంగు - ఎఱుపురంగు. అలం. ఉత్ప్రేక్ష.

క. తళుకు మొగము నెలపదకము, నెలవున నిడుతీరుగాఁగ నిలిపిన యాఖం
డలనీలకళికక్రియ న్నిట్టలమై స్ఫుటనాసికాపుటము దీపింపన్. 42

టీక. తళుకు... నెలవులన్ = ప్రకాశించు ముఖమను నెలపదకమునందు; ఇడుతీరుగాఁగన్ = నెలకొల్పుపద్ధతిగా; నిలిపిన = ఉంచిన; ఆఖండలనీలకళికక్రియన్ = ఇంద్రనీలపుమొగ్గవలె; నిట్టలమై = హెచ్చుగానుండి; నాసికాపుటము = ముక్కు. అలం. ఉపమ.

తే. తళుకుఁజె[4]క్కుల మకరకుండలకలాప, మరకతద్యుతిరింఛోళి హరిణ[5]లక్ష్మ
మండలంబుల లాంఛనమంజిమములు, గానిపించువిధంబునఁ గలయఁ బ్రాఁక. 43

టీక. మకర...రింఛోళి = చెవులయందలి మకరకుండలములందలి మరకతమణుల కాంతిసమూహము; హరిణమండలములన్ = చంద్రబింబములందు; లాంఛనమంజిమములు = చిహ్నములమనోజ్ఞతలు; కలయఁబ్రాఁకన్ = అంతటను వ్యాపింపఁగా. చెక్కిళ్లు చంద్రబింబములవలెను, వానిపై ప్రేలాడు మకరకుండలములలోని మరకతమణులు చంద్రునిలోని మచ్చలవలెను ఉన్నవని భావము. అలం. ఉపమ.

చ. తరళమసారసారనిభతారకముల్ సితపద్మపత్రబం
ధురములు రాధికాహృదయతోయజకోరకబోధనక్రియా
తరుణతరార్కరుగ్విలసితస్ఫుటరక్తిమసక్తశోణభా
స్వరములు సూక్ష్మపక్ష్మములు వాలికకన్నులు చెన్నుమీఱఁగన్. 44

టీక. తరళ......కముల్ = చలించు నింద్రనీలములవంటి కనుపాపలు కలవి; సిత......ధురములు = తెల్లతామరఱేకులవలె ఒప్పిదమైనవి; రాధికా......భాస్వరములు = రాధయొక్క హృదయమనెడి తామరమొగ్గను వికసింపఁజేయుటకైన లేఁతయెండయొక్క ప్రకాశమువలె స్ఫుటమైన ఎఱ్ఱని కాంతితోఁ గూడిన కనుగొలుకులచేఁ బ్రకాశించునవి; వాలికకన్నులు = వెడఁద లగు కన్నులు; చెన్నుమీఱఁగన్ = ప్రకాశింపఁగా. అలం. ఉపమ, రూపకము.

---

1. చ. కిరికోర. 2. వ్రాఁతల. క. ప్రేఁతల. శ. ర. 3. పైపై. క. * బలుమఱు. శ. ర. 4. క. క్కులు. 5. క. లక్ష్మి. చ. లక్ష్మ.

తే. అలకతిమిరంబు తనుఁగప్పునను భయమున
ముఖసుధాసూతి నునువెల్గు ములికిఁ గూర్చి
సవదరించిన సింగిణిచాయ నొసలి
వంకచూపునఁ [1]దగెఁ గఱివంకబొమలు. 45

టీక. అలకతిమిరంబు = ముంగురులనెడి చీఁకటి; ముఖసుధాసూతి = ముఖచంద్రుఁడు; నునువెల్గుములికిన్, కూర్చి = లేఁతవెన్నెల యను బాణమును సంధించి; సవదరించిన=పట్టిన; సింగిణిచాయన్ = వింటివలె; వంకచూపునన్ = ఓరచూపున; కఱివంకబొమలు = నల్లనై, వంకరగనున్న కనుబొమలు; తగెన్ = ప్రకాశించెను. అలం. రూపకము, ఉపమ.

క. బలభిదుపలాద్రిమౌళిన్, బలపలగాఁ బొదవు ముదిరపటలముపగిదిన్
లలితోత్తమాంగతలమున, జిలుగుం [2]దెలిక్రొత్తచలిదిచిక్కము దవరన్. 46

టీక. బలభిదుపలాద్రిమౌళిన్ = ఇంద్రనీలములకొండకొమ్మున; పలపలగాన్ = విరళముగా; పొదువు = వ్యాపించు; ముదిరిపటలముపగిదిన్ = మేఘములగుంపువలె; లలితోత్తమాంగతలమునన్ = మనోజ్ఞమగుతలపైని; ఉపమ.

శా. దిగ్వాసుం డురుపింఛలాంఛితశిఖోదీర్ణుండు వర్షాపయో
ముగ్వర్ణుండు నవాంబుజాహితలతాముక్తాంగదుండున్ సుధా
రుగ్విస్మేరముఖుం డనంగ శతజిద్రూపాఢ్యుం డగ్రభూ
[3]వాగ్వర్గోద్భవభూమి శ్రీవిభుఁడు శ్రీవత్సాంకవక్షుండునై. 47

టీక. దిగ్వాసుండు = దిగంబరుఁడు; వర్షాపయోముగ్వర్ణుండు = వానకాలపుమేఘమువలె (నల్లని) రంగు కలవాఁడు. నవాంబు......గదుండున్ = లేఁతనెలవంకవంటిముత్యాలభుజకీర్తికలవాఁడు; సుధారుగ్విస్మేరముఖుండు = చంద్రునివలె వికాసముకలముఖము కలవాఁడు; అనంగ శతజిద్రూపాఢ్యుండు = వందఃకొలదిగ నుండు మన్మథులను మించిన చక్కఁదనము కలవాఁడు; అగ్ర......భూమి = తొలిపలుకులగు వేదములు పుట్టుటకు కారణమైనవాఁడు; [పూర్వటీకలో "అగ్రభూవాగ్గర్వోద్భవభూమి = బ్రాహ్మణుల మాటగర్వమునకుఁ బుట్టినచోటు" అని కలదు. ఆ మూలము, వ్యాఖ్యానము అయుక్తములు.] అలం. ఉపమ.

క. *నొడువుల పడఁతుక మగనికిఁ, బొడచూపని తనదురూపు పొడగనిపించెన్
జడనిధిశయనుఁడు కొంగున, [4]ముడిచినమణి గాదె భక్తముఖ్యుల కెల్లన్. 48

టీక. నొడువుల......మగనికిన్ = సరస్వతికి భర్తయగు బ్రహ్మకు; పొడసూపని = చూపని; పొడగనిపించెన్ = కనుపడునట్లు చేసెను - చూపెను; జడనిధిశయనుఁడు = సముద్రమున నిద్రించు విష్ణువు; అలం. కావ్యలింగము.

క. నిగనిగని విదళకదళీయుగళిన్నగి జిగిదొలంకు నూరులఁ గని చొ
క్కు గదురఁజేయు జగత్పతిఁ, దగిలి కనుంగొనుచు మునిమదావళ మెలమిన్.

టీక. నిగనిగని = తళతళలాడు; విదళకదళీయుగళిన్ = ఆఁకులు లేని రెండనఁటి బోదెలను; నగి = నవ్వి - తిరస్కరించి; జిగి, దొలంకు = కాంతులనీను; చొక్కున్=పరవశతను; కదురఁజేయున్ = కల్గించును; మునిమదావళము = మునిశ్రేష్ఠుఁడు; ఎలమిన్ = ప్రీతితో; ["చొక్కుఁగదురన్ = పరవశత్వము కలుఁగగా" అని పూర్వటీక. అది యనుచితము.]

1. క. దగ. చ. దగె. 2. క. దళుకొత్తు. చ. దొలుక్రొత్త. దెలిక్రొత్త. శ. ర. 3. క. వాగ్గర్వో. చ. వాగ్వర్గో. *నుడువు. శ, ర. 4. చ. ముడి.

తే. విపులవీక్షణశక్తిచే [1]వెండి కుండలీంద్రతలిమాంగరుచిసుధ గ్రొత్తి క్రోలి
సంతతవ్రతకల్పనాజాయమాన, దుస్తరక్లేశగుంతియుం దొలంగఁ ద్రోచి. 50

టీక. వెండి = మఱల; కుండలీంద్రతలిమాంగరుచి సుధ = శేషశాయియగు విష్ణుని దేహకాంతి యను నమృతమును. పుండరీకుఁడు తనివితీఱ శ్రీకృష్ణుని దివ్యతేజమును తిలకించెనని భావము.

ఉ. అవు సదల్పు పచ్చవెదు రంఘ్రియుగాంతరవీథి నూఁది యు
గ్రావనిఁ దేజరిల్లు కటిహస్తసమన్వితుఁ గౌస్తుభాంకు నిం
దీవిభు నింద్రనీలనిభదేహుఁ గనుంగొని హర్షవర్షధా
రావిలమానసుం డగుచు నమ్ముని కృత్యవిమూఢబుద్ధియై. 51

టీక. పచ్చవెదురున్ = ఆకుపచ్చని పచ్చివెదురుకఱ్ఱను; అంఘ్రియుగాంతరవీథిన్ = రెండు కాళ్లకును నడుమను; ఊఁది = గట్టిగా ఇరికించి; అగ్రావనిన్ = ఎదుటిభాగమున; ఇందీవిభున్ = లక్ష్మీదేవికి భర్తయైనవానిని - విష్ణుని; హర్ష......మానసుఁడగుచున్ = సంతోషము వర్షధారచేఁ దడుపఁబడి ఉక్కిరిబిక్కిరియైన మనస్సుకలవాఁడై; కృత్యవిమూఢబుద్ధియై - స్తంభించినవాఁడై. అలం. స్వభావోక్తి.

చ. విలిఖితమో శిలాకృతియొ విస్మృతి రూపువహించెనో యనన్
చలనవిదూరుఁడయ్యుఁ దొలుసోవిపయోధరధారఁ దోఁగి స
య్యిలఁ దలయెత్తు క్రొత్తపులు నేపున వే పులకల్ తనూలతన్
మొలవఁగ నున్న నవ్వి యదుముఖ్యుఁడు తాపసముఖ్యు నిట్లనున్. 52

టీక. విలిఖితమో = వ్రాయఁబడినదో - చిత్తరువో; శిలాకృతియొ = రాతివిగ్రహమో; విస్మృతి, రూపువహించెనో = మూర్తిభవించిన మఱపో; చలనవిదూరుఁడయ్యున్ = కదలికలేనివాఁడైనను; తొలుసోవిపయోధరధారన్ = తొలుకరి వర్షధారలచేత; తోఁగు = తడియు; ఇలన్ = భూమిపై; తలయెత్తు = మొలచు; క్రొత్తపులు నేపునన్ = చిగురుగడ్డిపోరున; పులకల్ = గగుర్పాటు; అలం. ఉత్ప్రేక్ష, ఉపమ.

ఉ. నిచ్చలు నిచ్చలోఁ బొదలు నీపితృభక్తికి జ్ఞానశక్తికిన్
మెచ్చితి నిచ్చితిం గరము [†]నీయెడ నీయెడ యేల? వేడుకొ
మ్మిచ్చెదఁ జెచ్చెరన్ వలయునీప్సితముల్ శతమేని దీననే
పొచ్చెము నొచ్చెముం జొరదు భూసురకేసరి! నమ్ము నాపుడున్. 53

టీక. నిచ్చలు = ఎల్లప్పుడు; ఇచ్చలోన్ = మనస్సునందు; కరము = అభయహస్తము; ఎడ = ఎడము-జాలము, భేదము; శతమేని = నూఱైనను; పొచ్చెము = లోపము; ఒచ్చెము = అనుమానము. అలం. అనుప్రాసము.

శా. భస్మోద్ధూలనపాండురాంగము రమాప్రాణేశుపాదద్వయిన్
విస్మేరాంబుజగామిహంస మిది నాచే వ్రాల్పుచున్ లేచి 'దే
వాస్మాకం శరణం త్వమేవ; గతి రన్యో నాస్తి; దుర్వాసనా
పస్మారం హర' యంచుఁ బల్కి మఱియున్ భక్తుండు భక్తిస్పృహన్. 54

టీక. భస్మో......గము = బూడిదపూసికొనుటచే తెల్లనైన దేహము; విస్మేరాంబుజగామి, హంసము = వికసించుపద్మమునుగూర్చిపోవు హంస; నాన్ = అనునట్లు; వే = వేగముగ; వ్రాల్చి

1. ట. కేదు. క. వెఁడి. * క. తలఁదొత్తు, శ. ర. తలయెత్తు. † నియ్యెడ నియ్యెడ. శ. ర. -

చుక్ = పడవేయుచు; దేవాస్మాకం శరణం త్వమేవ = దేవా! మాకు నీవే దిక్కు; గతి రన్యో నాస్తి= వేఱుగతి లేదు; దుర్వాసనాపస్మారం హర = చెడ్డవిషయములయందలి కోరికయను పిచ్చిని పోఁగొట్టుము; భక్తిస్పృహాక్ = భక్తియందలి ఇచ్ఛచేత - భక్తితమకముచేత; ['దేవాస్మాకం'అని సంబుద్ధిపయి సంధి.]

సీ. పాదలు నీపాక్కిటిపుష్పవ కాన్పునఁ గదా పెనుమూయ పిల్లలఁ బెట్టుటెల్లఁ
బోడము నీమొదలియూర్పుల నేప్పలనకదా చదువుసంధ్యలు గల్గి జగము మనుట
కెరలు నీయడుగుఁజాయురల తేనియఁగదా పాపంపుఁ బెనురొంపి [1]పలుచనగుట
పాసఁగు నీతెలిచూపుపసగదా యిది రాత్రి యిది పగలను మేర లెఱుఁగఁబడుట

తే. భవనఘుటనకు మొదలికంబమునఁబోలె, భువనములకెల్ల నీ వాది[2]భూతుఁ డగుట
నిట్టనిలుచుస్కి చేఁగాదె నెట్టుకొనియె, గెంటుగుంటును లేక లక్ష్మీకళత్ర! 55

టీక. పాదలు = వర్ధిల్లు; కాన్పునక్ = ప్రసవముచేత; ఊర్పులు = నిశ్శ్వాసములు; కెరలు= అతిశయించు; తెలిచూపు = తేటతెల్లమగు దృష్టి; భవనఘటనకుక్ = ఇల్లుకట్టుటకు; ఆదిభూతుఁడు = మొదటివాఁడవు - ప్రధానుఁడవు; నిట్టనిలుచుస్కి చేక్ = నిటారుగా నిలుచుండుటచేత; నెట్టుకొని యెక్ = అతిశయించెను - తేటపడియెను; గెంటు, గుంటును, లేక = కదలిక, తగ్గులేక - నిరాటంక ముగ. [ఇచట 'నీవాదిభూతుఁడవగుట' అనుటకు బదులు 'నీవాదిభూతుఁడగుట' అని ప్రయోగింపఁ బడినది.]

విష్ణుని నాభికమలమునఁ బుట్టిన బ్రహ్మ సృష్టిఁజేయఁబూనెననియు, విష్ణుని తొలియూర్పులే వేదములయి జనుల విద్యాబుద్ధుల కవకాశము కలిగించెననియు, విష్ణుపాదములనుండి గంగానది యుద్భవిల్లి ప్రజలపాపములను పటాపంచలుచేసి, వారికి పుణ్యగతులను కలిగించుచున్నదనియుఁ, విష్ణుని కన్నులగు సూర్యచంద్రులవలననే యహర్నిశలను విభజింప వీలగుచున్నదనియు, విష్ణువు భువనములకెల్ల మూల మనియు నభిప్రాయము. అలం. ఉపమ.

చ. ముదమున సోమకాసురుఁడు ముచ్చిలి యచ్చలమారఁగొన్న ప్రాఁ
జదువులు తెచ్చి తజ్జఠరసాంద్రత[3]రాంత్రము లంట నంటు బల్
[4]గదురు దొలంగఁ గీర్తియను గంగఁ దొలంచి విధాతృవిస్ఫుర
ద్వదనసరోజగంధలలితంబులు చేసితిగా జగన్నిధీ! 56

టీక. ముచ్చిలి = దొంగిలించి; అచ్చలమారక్, కొన్న = పూనికతో అపహరించిన; ప్రాఁ జదువులు = వేదములను; తెచ్చి; తజ్జఠరసాంద్రతరాంత్రములు = అతనిపొట్టలో ఎక్కువగనుండు ప్రేవులు; అంటక్ = అట్టకట్టఁగా - అంటుకొనఁగా; అంటు బల్గదురు = వ్యాపించిన ఎక్కువైన కంపును; తొలఁచి = కడిగి; విధాతృ......తంబులు = వికసించిన కమలములవంటి బ్రహ్మముఖములందలి పరిమళముచే సువాసనగలవి. అలం. రూపకము. (ఇది మత్స్యావతారవర్ణనము)

ఉ. కోపనశాపనవ్యశిఖిఁ[5]గోల్మసఁగం గ[6]సుగంది మ్రంది త
త్తాపము నాఁపలేక తిమిధామజలభ్రమిఁగూలి తూలు జం
భాపహరాజ్యలక్ష్మి పెరవాఱగఁ దెల్పవె యీఁతకాయరూ
పై పృథుకర్పరం బమర నాశ్రితరక్షణదక్షిణేక్షణా! 57

---

1. చ. పలచన. 2. చ. భూతివగుచు. 3. చ. గాత్రము. రాంత్రములంటికట్టు. క. ర.
4. చ. గదరు. 5. క. గోర్మస చ. గోల్మస. సూర్య. కోల్మస. 6. చ. సుగంధ.

టీక. కోపన శాపనవ్యశిఖిన్ = కోపస్వభావముకల దుర్వాసునిశాపమనెడి కసకసలాడు నిప్పుచే; కోల్మసఁగన్ = వెన్నుకాలునట్లుగా [గోర్మసఁగన్ = మిక్కిలి రేఁగఁగా అని పూర్వటీక.] కసుగంది= మిక్కిలి తపించి; మ్రంది = సోలి; తిమి...భ్రమన్ = జలచరములకు నివాసమగు సముద్రపు సుడులలో; కూలు = పడు; జంభాపహారాజ్యలక్ష్మిన్ = జంభునిచంపిన ఇంద్రుని రాజ్యసంపదను; వెలివు; ఆరఁగన్ = ఉపాయమున; కూఁతకాయరూపై = కూఁడుకొను అనుకూలమగు సారకాయరూపు కలదయిన; పృథుకర్పరంబు = గొప్పపీఁపుచిప్ప; ఆమరన్ = అనుకూలము గాఁగా; తేల్చవె=తేలునట్లు చేయలేదా? ఆశ్రిత......క్షణా! = ఆశ్రితులను రక్షించుటయే పనితోడి చూపుకలవాఁడా! [ఇది కూర్మావతారవర్ణన] అలం. ఉపమ.

ఉ ఆపెనువెల్లిఁ దెళ్లుమకరాకరమేఖల నీవు దేర్చ య
ష్టాపదటంకవిభ్రమవిడంబినియౌ నిజదంష్ట్రఁ గూర్చు త
ద్రూపము దీపితం బగు సరోరుహలోచన! సప్తజిహ్వజి
హ్వోపరిభాగధూమపలయోపమమై విజయోపలబ్ధులన్. 58

టీక. ఆ పెనువెల్లిన్ = ఆ(ప్రళయకాలపు) పెద్దప్రవాహమున; ద్రెళ్లు = పడిన; మకరాకర మేఖలన్ = సముద్రము మొలనూలుగాఁగల భూమిని; అష్టాపదటంకవిభ్రమవిడంబినియౌ = బంగారు పిడి యొక్క విలాసము ననుకరించునట్టి [ఇచటఁ 'బంగారును సలిపినట్టి యులిపియొక్క విలాసమును పోలినది' అని పూర్వటీకయందు కలదు. అది సరికాదు.] నిజదంష్ట్రన్ = నీకోరయందు; తద్రూపము= అప్పటి భూమిరూపము; విలయోపలబ్ధులన్ = ప్రళయకాలములందు; సప్త...పమమై = అగ్నిజ్వాలల చివళులందు వలయాకారమున నుండు పొగలగుంపును పోలినదై; దీపితంబగున్ = ప్రకాశించును. (ఇది వరాహావతార వర్ణనము) అలం ఉపమ.

చ. అలఘు జగద్విపద్విపఘటాంకుశ శాతనఖాంకురాగ్రలాం
గలముల మున్ను నీవసురఘస్మర! వైరి భుజాంతరాళజాం
గలమహిఁ జాలుపట్టి పయిఁ గ్రమ్మెడు నెత్తురు నీరువెట్టి యం
దలుకవె కీర్తిపూర్తికలమాంకుర మింద్రరమాఫలార్థివై. ౫9

టీక. అలఘు......లాంగలములన్ - అలఘు = గొప్ప; జగద్విపద్విపఘటా = లోకశత్రువులగు రాక్షసులనెడి ఏనుఁగుల గుంపునకు; అంకుశ = అంకుశములైన; శాతనఖాంకురాగ్రలాంగలములన్ = వాఁడిగోళ్లకొనలనెడి నాఁగళ్లచేత; అసురఘస్మర! = రాక్షసులను నశింపఁజేయువాఁడా! వైరి......మహిన్ = శత్రువుల రొమ్ములనెడి అడవినేలను; చాలుపట్టి = చాళ్లు ఏర్పడునట్లు దున్ని; కీర్తిపూర్తికలమాంకురము = గొప్పకీర్తి యను వరిమొలకను; ఇంద్రరమాఫలార్థివై = ఇంద్రుని సంపదను నిలుపఁదలఁచి; అలుకవె = నాటవా. అలం. రూపకము.

నాఁగేళ్లతో తొలుత పొలముదున్ని, చాలుపట్టి, నీరుపెట్టి, విత్తనములు చల్లుట, అవి ఫలించుట లోకపరిపాటి. ఇందు నృసింహావతారము వర్ణితము.

క. దండితబలివై జగములు, నిండఁ బెరుగుచున్న వేళ నీయడుగున భూ
మండల మతిసూక్ష్మాకృతిఁ, గొండికమచ్చయును బోలెఁ గొమరొందు హరీ! 60

టీక. దండితబలివై = బలిని దండించి; కొండికమచ్చయును బోలెన్ = చిన్నమచ్చవలె; కొమరొందున్ = ప్రకాశించును. అలం. అధికము, ఉపమ. ఇది వామనావతారవర్ణనము.

ఉ. మాతృకకోరకంఠబిలమార్గగళద్రుధిరారుణాననం
బై తళుకొత్తు దోఃపరశుహాంసికి మేఁత యొసంగవే రిపు

క్ష్మాతలనాథ మేచకకచాకుచహారమృణాళనాళ సం
ఘాతము నూతనైణమదకర్దము వర్ధనసంప్రభూతకున్. 61

టీక. మాతృ...ననంబై = తల్లియొక్కగట్టికంఠమునుండి కాఱుచున్న నెత్తుటిచే ఎఱ్ఱనైన ముఖముకలదై; (అంచుకలదయి యని పరశువిషయమున గ్రహించునది.) తళుక్కొత్తు = ప్రకాశించు; దోఃపరశుహంసికిన్ = చేతిలోని గండ్రగొడ్డలియను నాఁడుహంసకు; [హంసముఖము ఎఱ్ఱగానుండునని కవిసమయము] రిపు .....సంఘాతమున్ - రిపుక్ష్మాతలనాథ = శత్రురాజులయొక్క; మేచకకచా = నల్లనిజుట్టుగల స్త్రీలయొక్క - వారి భార్యలయొక్క; కుచహార = కుచములపైవ్రేలాడు హారములనెడు; మృణాళనాళసంఘాతమున్ = తామరతూండ్లగుంపును; నూతనైణమద.....భూతమున్ = క్రొత్త కస్తురియను బురదయందు పుట్టి పెరిగినదానిని; [పరశురాముఁడు తండ్రియాజ్ఞచొప్పున తల్లికుత్తుకను నఱికెననియు, తనతండ్రిని రాజు చంపిన కారణమున రాజుల నందఱిని ఇరువదియొక్కసారి సంహరించెననియు పురాణ గాథ.] ఇది పరశురామావతారవర్ణనము.

శత్రురాజులు సంహరింపఁబడఁగా వారిభార్యలు కస్తురి నలఁదుట మానిరనియు, మెడలలో హారములను దాల్చుటయు విడిచిరనియు భావము. [హంసలు తామరతూండ్లను తినునని కవి సమయము.] అలం. రూపకము.

ఉ. దారుణబాణపాతమదధారలు గాఱఁగఁ గ్రాలు దోర్ధను
ర్వారణరాజుఁ గొల్పి దశవక్త్రముఖాంబుజవాటికిఁ గూల్చు బృం
దారకహృత్సరోజములు దాననచేసి వికాసమాసరా
కారత నొందఁజేసిన ప్రగల్భత నీక తగున్ దగున్ హరీ! 62

టీక. దారుణ......ధారలు = క్రూరములగు (వాఁడి) బాణములుపడుటయనెడి మదజలధారలు, కాఱఁగన్ = ప్రవహింపఁగా; క్రాలు = ప్రకాశించు; దోర్ధనుర్వారణరాజున్ = హస్తమందలి ధను స్సను గజరాజును; కొల్పి = పురికొల్పి; దశవక్త్రముఖాంబుజవాటికిన్ = రావణుని ముఖములను పద్మములను; దాననచేసి = ఆ కారణముననే - రావణుని ముఖములను పద్మములను కూల్చుటచేతనే; బృందారకహృత్సరోజములు = దేవతల హృదయము లను పద్మములను; వికాసమాసరాకారతన్ = వికాసముయొక్క సారమైన ఆకారము కల్గుటను; ప్రగల్భత=నేర్పు; హరీ! = విష్ణుదేవుఁడా! - (సింహమా) నీక = నీకే; తగున్, తగున్. అలం. రూపకము. ఇది రామావతారవర్ణనము.

మ. వికటోత్తంభితసీరభోగపటలీ విస్ఫూర్తిమన్మూర్తి కం
చుక నిర్మోకభయానకంబు వికృతాశుక్ష్వేళ మగ్నిచ్ఛటా
వికిరత్క్రూరనిరీక్షణంబు నగు నీవేషంబు శేషానుకా
రికళన్ గ్రాలదె క్రోలదే సమదవైరిప్రాణవాతూలముల్. 63

టీక. ఇందు బలరామావతారము వర్ణింపఁబడుచున్నది.గా అతఁ డిందు శేషుఁడు వర్ణింపఁబడెను. వికట......మూర్తి = వంకరగా ఎత్తఁబడిన నాఁగేళ్లను పడగలగమిచే ప్రకాశించు దేహముకలదని బలరామునిపక్షమున అర్థము; వంకరగా ఎత్తఁబడిన నాఁగేళ్ళవంటి పడగలగుంపుచే ప్రకాశించు దేహము కలదని శేషునిపక్షమున అర్థము. కంచుకనిర్మోకభయానకంబు = కంచుకము విడుచుటచే భయంకరమైన దని బలరామపక్షమునను, చొక్కావంటి కుబుసమువిడుచుటచే భయంకరమైనదని పాముపక్షమునను అర్థము.

[కంచుకనిర్మోకభయానకంబు = కుబుసమువిడుచుటచేత భయంకరమైనది - అని పూర్వటీక. ఈ టీకలో పాముపక్షముననే గాని; బలరామునిపక్షమున అర్థము కుదురదు. కాన నిది అగ్రాహ్యము.] వికృతాశుక్ష్వేళము = వికారమై వడిగల సింహనాదము కలదని బల-పక్షమునను, వికారమై, వేగము

గల విషము కలదని పాముపక్షమునను అర్థము; అగ్ని......నిరీక్షణంబు = నిప్పులను వెదచల్లు వాఁడి చూపులు కలది; (రెండుపక్షములందును ఒకే యర్థము) అగు, నీవేషంబు; శేషానుకారికళన్ = శేషుని అనుకరించురీతిని; క్రాలదె! = ప్రకాశింపదా? సమద.....నాగాలమున్ = క్రొవ్విన శత్రువుల ప్రాణవాయువును; క్రోలదె! = త్రాగదా? [పాము వాయువును భక్షించునని గ్రాహ్యము.] అలం. ఉపమ. రూపకము, శ్లేషము.

చ. ప్రతిదినకేశ[1]లుంచనపు[2]రాయిడి నెట్టన బట్టకట్టి స్రుఁ
బుతపుత మంచు నున్న కుఱుబోడతలన్ ధరియింప నోడియున్
సత[3]మగుసొమ్ముగాన [4]విడ జాలవుగా శిఖిపింఛవస్త్ర సౌ
గతమతధుర్య! దానిఁ గటిఁ గట్టుము పుట్టము మిన్న కేటికిన్. 64

టీక. ప్రతిదినకేశలుంచనపురాయిడిన్ = ప్రతిదినము వెండ్రుకలను పీకివేయుటచేనైన యుపద్రవమున; నెట్టనన్ = మిక్కిలి; పుతపుతమంచున్ = పుతపుతలాడుచు - బొఘవలన దిమ్మెక్కి; కుఱుబోడతలన్ = కురుచయైన బోడితలపైని; ధరియింపనోడియున్ = ధరించుసామర్థ్యము కానున్నను; సతమగు, సొమ్ముగానన్ = (నీకు) శాశ్వతమగు నగ యగుటచే; శిఖిపింఛవస్త్రిన్ = నెమిలిపురిని; విడఁజాలవుగా! = విడువలేవుగదా! సౌగతమతధుర్య! = బుద్ధుఁడా! దానిన్ = ఆపింఛమును; కటిఁగట్టుము = (వస్త్రమునకు బదులుగా) మొలను ధరింపుము; మిన్నక = అనావశ్యముగ; పుట్టము, ఏటికిన్? = వస్త్ర మేల? [వస్త్రముకట్టుకొనుట మాని, పింఛమునే కట్టుకొనుమని భావము. తల బట్టకట్టుటచే మొల బట్ట అక్కఱ లేదని శ్లేషరూపమున చమత్కారము.] ఇందు బౌద్ధావతారవర్ణితము.

చ. కలి హిమవేళ శోభనపుఁగమ్మవిరుల్ సకలంబు డుల్చి భూ
వలయవనంబుఁ గప్పికొని వర్తిలు జాడ్యపుటీఁద పర్వఁగా
నలరులకారులీల భవదాగమనం బఁటఁగల్గ రోషపా
టల మగు నీకనుంగడలడాలు నగున్ జిగురాకునాకృతిన్. 65

టీక. కలిహిమవేళన్ = కలికాలమను చలికాలమున; శోభనపుఁగమ్మవిరుల్ = చక్కఁదనము (శోభ) అను పరిమళయుతపుష్పములు; ['శోభనపుఁగమ్మవిరులు = మేలులనెడి సువాసనతోడి పువ్వులు' అని పూర్వపుటీక.] సకలంబున్ = అన్నిటిని; డుల్చి = రాల్చి; భూవలయవనంబున్ = భూమండలమను అడవిని; కప్పికొని = ఆవరించి; జాడ్యపుటీఁద = మందత్వమనెడి గాలి; పర్వఁగాన్ = వ్యాపింపఁగా - వీవఁగా; అలరులకారులీలన్ = వసంతకాలమువలె; భవదాగమనంబు = నీ (కల్కియొక్క) యొక్కరాక; అఁటఁగల్గన్ = అంతటఁగల్గఁగా; రోషపాటలమగు = కోపముచే నెఱ్ఱనయిన; నీకనుంగడలడాలు = నీకడకన్నులకాంతి; చిగురాకునాకృతిన్ = చిగుళ్ళయొక్క (ఎఱ్ఱనయిన) ఆకారమును; నగున్ = పరిహసించును—పోలును. అలం. రూపకము; ఉపమ.

సీ. నీటిలోఁ జివుకక నిలిచి [5]క్రుస్మరుపూన్కి [6]కఠినకర్పరపుఁ [7]జుక్కాను బిగువు
దంష్ట్ర నెత్తిన మహీతలపుగాడుపుఁజీర యురుదారుకలనయం దుదయ మగుట
పరులకుఁ దనకట్లబలిమి చూపువిధంబు పులిమిన నెత్రుగుగ్గిలపునూనె
ద్వీపాంతరమునకుఁ దెగువమైఁ జను[8]పెంపు చేమట్టునాగంటి [9]జీనితగులు

---

1. క. లుంఛన. 2. చ. రాయణి. 3. క. ముగ. చ. మగు. 4. క. నిడ. త. విడ. 5. క. క్రమ్మరు. శ. ర. చ. క్రుమ్మరు, 6. క. గఠిన. 7. చ. జక్కాను. 8. చ. తెంపు. 9. క. జీను. చ. జీని.

తే. సౌగతాగమమూలమి శాస్త్రసరణి, వల్గువల్గన చిత్రధావనము గల్గు
నిన్నుఁ దరిచేసి భవవార్ధి నిస్తరించి, దరిఁ దఱియకున్నఁ గలదె మోదము మురారి!

టీక. ఈ పద్యము దశావతారముల సంగ్రహవర్ణనరూపము; ఇందు విష్ణుమూర్తి యొక్క పడవవలె వర్ణింపఁబడినాఁడు; సంసారజలధిని దాఁటి మోక్షమును పొందుటకు ఆ తరియే యాధారమని వర్ణింపఁబడియున్నది. ఇందు విష్ణుని దశావతారములును పడవపరికరములుగా వర్ణింపఁబడియున్నవి. చివుకక= తడిసిపోవుటచే సారహీనముగాక; క్రమ్మఱు పూని=తిరుగుచుండు పట్టుదలయు - ప్రయత్నము. [ఇట మత్స్యావతారము సూచితము. చేఁప నీటిలో ఎంతకాల మున్నను చివుకక స్వేచ్ఛగా తిరుగును.] కఠిన.....బిగువు = మోటైన పేఁపుఁజిప్పయనెడి చుక్కాని బలము. [ఇందు కూర్మావతారము వ్యక్తము.] దంష్ట్రనెత్తిన = కోఱతో నీటినుండి బయటకు తీయఁబడిన; మహీ....జీర = భూమియను తెఱచాప; [ఇందు వరాహావతారము గ్రాహ్యము. వరాహమూర్తి ముట్టెతో సముద్రమునుండి పైకి ఎత్తఁబడిన భూమి తెఱచాపవలె నున్నదని భావము.] ఉరుదారుకలనయందున్ = గొప్పమ్రాని కూర్పునందు; ఉదయమగుట = పుట్టుట; [ఇందు నృసింహావతారమును గ్రహించునది. పడవ దారువులచేఁ జేయఁబడినది; విష్ణువు దారుస్తంభమునందు పుట్టెను.] పరులకున్ = శత్రువులకు, ఇతరులకు; తన కట్లబలిమి మాపువిధంబు = తన్ను (పలకలు దగ్గఱదగ్గఱగాఁ జేర్చి) కట్టిన బలమును చూపుపద్ధతి - అని పడవపక్షమున అర్థము. (ఇందు వామనావతారము సూచింపఁబడుటచే) పగవారియెడ తాను వారిని (బలిచక్రవర్తి సూచింపఁబడెను) నిర్బంధించు శక్తిని చూపు విధము అను నర్థాంతరము గ్రాహ్యము. పులమిన.....నూనె = (పడవలో నీరు చొరకుండ, కట్లకు) రాచిన గుగ్గిలపునూనె - అనియు, (పరశురామావతారపక్షమున) శత్రువులను సంహరించి గుగ్గిలపునూనెవలె చిక్కనయిన నెత్తురు భూమిపయి పులుముట అనియు నర్థము. ద్వీపాంతరమునకున్=(పడవపక్షమున) వేఱొకదీవికి; రామావతారపక్షమున) లంకకు; తెగువమై=సాహసమున; చను, పెంపు = పోవునట్టి గొప్పతనము; చేముట్టు......తగులు=పనిముట్టయిన నాఁగటివంటి లంగరు తగుల్చుటయని పడవ పక్షమునను, ఆయుధమయిన లంగరువంటి నాఁగటి యందలి ఆసక్తి యని బలరామునిపక్షమునను అర్థములు. సౌగతా...సరణి=బౌద్ధాగమమనెడి పడవ నడుపుశాస్త్రపద్ధతి; [ఇట బౌద్ధావతారము సూచితము.] వల్గువల్గనచిత్రధావనము=చక్కనైనవల్గితమనెడి విచిత్రమగు శీఘ్రగమనము. [ఇట కల్కిమూర్తియవతారము సూచితము.] తరి = పడవ; దరి=ఒడ్డు; తఱియకున్నన్ = చేరనియెడల; మోదము కలదె! = సంతోషము లేదు. అలం. ఉపమ, రూపకము.

చ. లలితకళావతీ మృదుపలాశపరీతసుధామరందపి
చ్ఛిలసుషమాప్రబోధగుణ జృంభితపూర్ణసుధాంశు బింబపు
ష్కలసితపుష్కరాయతన! షట్పగణేంద్ర [1]నవేంద్రనీల క
జ్జలజలజాస్త్రజాజల నిజద్యుతిపంచక కాంతి[2]కంచుకా! 67

టీక. లలిత.....రాయతన!-లలితకళావళీ = చక్కని కళలసమూహమనెడి; మృదుపలాశ= మెత్తనిదళములచే (ఱేకులతో); పరీత = కూడుకొని; సుధామరందపిచ్ఛిల = అమృతమనెడి పూఁదేనె చిక్కఁదనముకలిగి; సుషమా = కాంతియును; ప్రబోధగుణజృంభిత = పరిమళముతో వికసించిన; పూర్ణసుధాంశుబింబ = నిండుచంద్రుఁడను; పుష్కలసితపుష్కర = ప్రకాశించు తెల్లతామరపువ్వు; ఆయతన! = నివాసముగాఁ గలవాఁడా!

ఇందు పద్మము చంద్రునిగా రూపింపఁబడినది. చంద్రకళలకును, తామరపూవుఱేకులకును రూపకము; అట్లే అమృతమునకును పూఁదేనెకును, కాంతికిని, వికాసమునకును రూపకము.

---

1. చ. మహేంద్ర. 2. పంచకా!

[లలిత.....ఆయతన = ఒప్పినదైన [illegible] గూనలచేతచుట్టబడి, యమృతమనెడి పూఁదేనెమీఁగడయొక్క మేల్మిన [illegible] గుణముచేత రేఁగిన నిండుచంద్రుని బింబముయొక్క [illegible] లేని [illegible] ప్రదేశమును (పాలసముద్రము)ఇల్లుగా కలవాఁడా!' అని పూర్వటీక. ఇది [illegible] నిరసింపఁబడినది.]

మట్చర..... కంచుకా! - మట్చర [illegible] = [illegible]; మహేంద్రనీల = ఇంద్రనీల మణిని; కజ్జల = కాటుకను; జలజాస్త్రగాల = [illegible] నిజద్యుతి= స్వకీయమైన కాంతిచే; వంచక = తన్ను వంచించుచున్న; [illegible] = [illegible]; కంచుక! = కవచముగాఁ గలవాఁడా! అలం. రూపకము, ఉపమ.

క. ఉత్పత్తిస్థితివిలయార్థోత్పాదక ! విట్ఠలాహ్వ [illegible] ! సత్రా
జిత్పుత్రికాసతృష్ణదృ, గుత్పిబసుఖద [illegible] ! 68

టీక. ఉత్పత్తి......త్పాదక! = ఉత్పత్తి, స్థితి, నాశనములను [illegible] గించువాఁడా! - ఉత్పత్త్యాదులకు కారణమైనవాఁడా!; విట్ఠలాహ్వ [illegible]! = విట్ఠలుఁడను [illegible] వాఁడైనవాఁడా! సత్రాజి......శాలీ! సత్రాజిత్పుత్రికా = సత్యభామయొక్క; సతృష్ణ = [illegible] (ఆశతోఁ)గూడిన; దృగుత్పిబ = చూపులను చాతకపక్షులకు; సుఖద = సుఖమును [illegible]; [illegible]శాలీ! = దేహమను మేఘముచేత ఒప్పినవాఁడా! [ఉత్పిబశబ్దమునకు ఇచట పూర్వటీకలో 'సిక్కఁ పానముచేయుట వలని'అనునర్థ మీయఁబడినది. అది పొరపాటు. ఉత్పిబము = (సీటిని త్రాగి జీవించునది) చాతకము అని యర్థము.] అలం. రూపకము.

స్రగ్విణి. అండజాధీశవాహా ! జగద్గేహా ! దోర్దండచం [illegible] ! నతా
ఖండలా ! గండరింఖన్మణీకుండలా ! పుండరీకేక్షణా ! ప్రోవు నన్ సుక్షణా ! 69

టీక. అండజాధీశవాహా! = గరుడుఁడు వాహనముగాఁ గలవాఁడా!; జగద్గేహా! = ప్రపంచమే గృహముగాఁ గలవాఁడా!; దోర్దండ......తారీ! = [illegible] చక్రాయుధముచే నఱకఁబడిన శత్రువులు కలవాఁడా!; నతాఖండలా! = [illegible] ఇంద్రుఁడు కలవాఁడా!; గండరింఖన్మణీకుండలా! = చెక్కిళ్లయందు నటించుచున్న [illegible] కలవాఁడా!; పుండరీకేక్షణా!= తెల్లతామరలవంటి కన్నులు కలవాఁడా!; సుక్షణా! = మంచి యుత్సవము కలవాఁడా!

చ. అళికులభాగకుంతలము [1]లద్దపుముద్దుమొగంబుఁ జేరన్
గొలువఁగవచ్చు కన్నులుఁ జిగుర్నగుమోవి మెఱుంగుఁజెక్కులున్
వలమరియట్టు లేమొసలివాగఁడపోఁగులు లోఁతుపొక్కిటన్
మొలచిన తెల్లదమ్మి బలుమూఁపులు నీలవినీలదేహమున్. 70

టీక. అళికులభాగ కుంతలములు = తుమ్మెదలయొక్క కాంతిని పొందిన - సామ్యమును పొందిన ముంగురులు; అద్దపుముద్దుమొగంబున్ = అద్దమువలె సొగసైన ముఖమును; చిగుర్నగుమోవి = చిగురును నవ్వుచున్న - చిగురుతో సమానమైన పెదవి; మెఱుంగుఁజెక్కులున్ = తళుకుచెక్కిళ్లు; వలమఱియట్టు = దక్షిణావర్తశంఖమువంటి మెడ; లేమొసలివాగఁడపోఁగులు = సరిక్రొత్తమకరకుండలములు; లోఁతుపొక్కిటన్ = గంభీరనాభియందు; బలుమూఁపులు = గొప్పభుజములు; నీలవినీలదేహమున్ = ఇంద్రనీలమువలె నల్లనైన శరీరమును— అని ముందుపద్యమున కన్వయము. అలం. ఉపమ.

చ. కలిగినవానిఁ [2]బ్రాఁబలుకు కమ్మనియూర్పులవాసి [3]నెందు నే
వెలుఁగునుగాని పెన్వెలుఁగు వెంబడినిం [4]జనువాని నంతటన్

1. క. లందపు. చ. లద్దపు. 2. క. నిప్రాఁబ. 3. క యెందు. 4. చ. నిమ్మగు.

వెలసినవాని నిన్ గనని వెంబరపుట్టువు రాతిపుట్టువుం
బలెం గతిం గానలేఁడు యతిమానసహంసక! కంసహింసకా! 71

టీక. ప్రాఁబలుకు......వానిన్ = వేదములు పరిమళించు నిట్టూర్పులుగాఁ గలవానిని; పెన్వెలుఁగు = గొప్పతేజస్సు; వెంబడినిం జనువానిన్ = తనవెనుకనుండువానిని; [విష్ణువెచట నున్నను, అతనివెంట గొప్ప తేజస్సు ఉండునని భావము.] నిన్ గనని = నిన్నుచూడని - ఎఱుఁగలేని; వెంబర పుట్టువు=దుర్మార్గుఁడు [వెంబర = దుష్టునియొక్క అని పూర్వటీక. దానినంగీకరించినచోఁ 'కానలేఁడు' అనునది కుదురుట దుర్ఘటము.] యతిమానసహంసక! = యతులమనస్సు అనెడు మానససరోవరమునకు హంసయగువాఁడా! (శ్లిష్టపరంపరితరూపకము) ['యతులయొక్క మనస్సునకు హంసయైనవాఁడా!'అని పూర్వటీక.] అలం. ఉపమ, రూపకము.

ఉ. ఛత్రితశేష! నాయెడఁ బ్రసన్నుఁడ వయ్యెదవేఁ కృతోగ్రశ
త్రుత్రప మైన యీ లలితరూపముతో నిచటన్ వసింపు మే
క్షేత్రము నెట్టితీర్థమును జెందని యున్నతిఁ బొందఁగాక యీ
క్షేత్రము తీర్థమున్ గడుప్రసిద్ధి మదాహ్వాయలబ్ధిఁ బొందుచున్. 72

టీక. ఛత్రితశేష! = గొడుగుగాఁ జేయఁబడిన శేషుఁడు కలవాఁడా! [శేషుఁడు విష్ణునితల్పము కాఁగా, అతని పడగలు విష్ణునికి గొడుగయినవని భావము.] ప్రసన్నుఁడవు, అయ్యెదవేన్ = అను గ్రహముకలవాఁడ వైనయెడల; కృతోగ్రశత్రుత్రపమైన = శివునికి విరోధియగు మన్మథునికి సిగ్గు కలిగించెడు - మన్మథునతిక్రమించెడు; ['కృతోగ్రశత్రుత్రపము = చేయఁబడిన క్రూరశత్రువుల భయము కలది - క్రూరులైన శత్రువులకు భయము కలుగఁజేయునది'అని పూర్వటీక. అది పొరపాటు.] ఈ లలితరూపముతోన్ = ఈ చక్కనిరూపుతో; చెందని = పొందనట్టి; ఉన్నతిన్ = గొప్పతనమును; మదాహ్వాయలబ్ధిన్, కడుప్రసిద్ధి, పొందుచున్ = నాపేరఁ బ్రసిద్ధమగుచు, అలం. ఉపమ.

తే. క్షేత్రకులరాజమైన యీక్షేత్రమునకుఁ
దీర్థకులరాజమైన యీ తీర్థమునకు
నిఖిలసురనాథ! కర్తృత్వనియతిఁ బొదవి
యీవిట వసించుటయ వరం బిచ్చు టనుడు. 73

టీక. క్షేత్రకులరాజము = అన్నిక్షేత్రములలోను ప్రధానమైనది; నిఖిలసురనాథ! = దేవతా గణమునకు ప్రభువవైన భగవంతుఁడా!; కర్తృత్వనియతిన్, పొదలి = యాజమాన్యతను పొంది; ఈవు = నీవు; ఇచ్చుటనుడు - అనుచో స్త్రీసమముపయి అకారసంధి.

సీ. అనుకంప పెనుమోపుగను సొంపునకు వింత చెలువంబు మొలపింపఁ జిగురుమోవి
పవడంపుఁగొన దంతపఙ్క్తిప్రభలు పుష్పితముగాఁగ హరిపల్కు ధరణిదివిజ
నివహవరేణ్యు నోనిఖిలధర్మధురీణ! యగు నట్లు భవదాహ్వాయము వహించు
నిత్తీర్థమున వసియించెద నడుచక్కి నీకుఁ [1]జేతఃప్రీతి నెలకొనంగ
తే. భీమఘర్మాంబుసంభూతభూమి నీదు, క్షేత్రమును దీర్థమును నిజోత్కృష్టసలిల
వేణి సంప్లావి[2]తములు గావింపఁగలదు, నాకు నెంతయు నిష్ట మొనర్పఁ గడఁగి.

టీక. అనుకంపపెనుమోపు = పెద్దమోపుగా - ఎక్కువగా నుండు దయ; కనుసొంపునకున్ = కన్నులచక్కఁదనమునకు; వింతచెలువంబున్ = క్రొత్తయందమును; మొలపింపన్ = కలుగఁజేయఁగా;

1. చ. చిత్త. 2. క. తమ్ము. చ. తములు.

చిగురుమోవిపవడంపుఁగొనన్ = లేతపెదవియను పగడపుఁదీవెలు; దంతపఙ్క్తిప్రభలు = పలువరుస కాంతులు; పుష్పితము గాఁగన్ = పుష్పములవలె ప్రకాశించునట్లు - వికసించునట్లు; [ఎఱ్ఱనిపెదవులు విప్పఁగా వెడలిన దంతకాంతి ప్రవాళమునందలి పూవు పూచిన ట్లుండెనుగా నున్నదని భావము.] ధరణిదివిజనివహవరేణ్యున్ = బ్రాహ్మణులలో శ్రేష్ఠుఁడగు పుండరీకుని గూర్చి; పొగడి, పల్కెన్ = దేవుఁ డిట్లు పల్కెను; ఓనిఖిలధర్మధురీణ! = అన్నిధర్మములందును ఆరితేరినవాఁడా! భవదాహ్వయము = నీపేరు; నడుచక్కిన్ = మధ్యభాగమున; చేతఃప్రీతి, నెలకొనంగన్ = మనస్సంతోషము కలుగునట్లుగా; భీమఘర్మాంబుసంభూత = శివుని చెమటనీటివలన పుట్టిన నది; నిజోత్కృష్టసలిలవేణిన్ = తన గొప్పనీటిప్రవాహముచే; సంప్లావితములన్ = బాగుగాఁ దడుపఁబడినవానినిగా; [ఇట పూర్వటీకలో 'నిజోత్కృష్ట.సలిలవేణిసంప్లావితమ్ము' అని సమస్తపదము గ్రహింపఁబడినది.] ఇష్టము, ఒనర్పఁగడఁగి = ఇష్టమును కలిగింపఁ బ్రయత్నించి. అలం. ఉపమ.

వ. ప్రకట[1]గుప్తాకారంబునం బశ్చిమాంభఃసుఖుండనై సర్వోత్తమత్వంబు నిర్వ[2]హింపుచు నే నిచ్చట ముచ్చటం దవిలి యున్నవాఁడ. సకలక్షేత్రతీర్థోత్తమంబులగు నీక్షేత్రతీర్థంబులుం బౌండరీకంబులై పాండురంగాహ్వయుండ నగు నాకు నెక్కాలంబును శ్వేతద్వీపసుధాసాగరంబులకంటెఁ బ్రియంబులై నిత్యనివాసంబులై యత్యంతవిభవంబుల నభిరామంబు లయ్యెడు; నీకోరినయట్ల యిచ్చితి నని యచ్చతుర్భుజుండు పుండరీకునిఁ జేకొనియె. 75

టీక. ప్రకటగుప్తాకారంబునన్ = ప్రసిద్ధమైనగుప్తమగుస్వరూపముతో; [ఇచట'సుప్త = నిద్రపోయినవాని'అని పూర్వటీక.] పౌండరీకంబులై = పుండరీకసంబంధముకలవయి; అభిరామంబులు = మనోహరంబులు; చేకొనియెన్ = ఆదరించెను.

శా. శీతాహార్యకుమారి! విస్మితులు లక్ష్మీజాని వాచంయమి
వ్రాతశ్రేష్ఠునకున్ వరం బొసఁగి సాంద్రప్రీతి నచ్చోన మ
ధ్యేతీర్థంబున నున్నవాఁ డిపుడు భుక్తిన్ ముక్తి నీ జాలు వి
ఖ్యాతిం దాల్చి విచిత్రరత్నచయరమ్యస్వర్ణహార్మ్యంబునన్. 76

టీక. శీతాహార్యకుమారి! = హిమాచలపుత్రికవగు పార్వతీ!; లక్ష్మీజాని = విష్ణువు; వాచంయమివ్రాతశ్రేష్ఠునకున్ = మునులసమూహమున శ్రేష్ఠుఁడగు పుండరీకునకు; సాంద్రప్రీతిన్ = ఎక్కువైన ప్రేమతో; మధ్యేతీర్థంబునన్ = తీర్థమునకు నడుమ; భుక్తిన్ = ఇహలోకసుఖమును; ముక్తిన్ = మోక్షమును; ఈఁజాలు = ఈయఁదగిన; విచిత్ర......హార్మ్యంబునన్ = విచిత్రములగు మణులు తాపఁబడిన బంగరుమేడలోపల; ఉన్నవాఁడు.

చ. నలువమొగంబు లెట్లు సృజనప్రథమాహమునం దలిర్చు న
న్నలువున సిద్ధసాధ్యనరనాగసుపర్వయోగిమండలీ
కలకలగుంభితంబులయి కాంచనచారువులైన నాల్గువా
కిళుల వెలుంగు నున్నతనికేతనరాజమునం బ్రసన్నుఁడై. 77

టీక. ఎట్లు=ఏరీతిని; నలువమొగంబులు=బ్రహ్మయొక్కముఖములు; సృజనప్రథమాహమునన్ = సృష్టియొక్కమొదటిదినమున; తలిర్చున్ = ప్రకాశించునో; అన్నలువునన్ = ఆవిధమున; సిద్ధ......తంబులయి = సిద్ధులు, సాధ్యులు, నరులు, నాగులు, దేవతలు, యోగులు - అనువారి సమూహముయొక్క కలకలధ్వనితోఁ గూడినవయి; కాంచచారువులైన = బంగారుతోఁ జేయఁబడి చక్కఁగానున్న;

1. క. సుప్తా. ట. గుప్తా. 2. క. హింప. చ. హింపుచు.

వెలుంగు=ప్రకాశించునట్టి; ఉన్నతనికేతనరాజమునన్ = సౌధమునందు; - తరువాతిపద్యముతో సమన్వయము. విష్ణువునివసించుసౌధమునకు నాల్గుబంగరువాకిళ్లు కలవనియు, నవి బ్రహ్మయొక్క నాల్గుముఖముల వలె నున్నవనియు బ్రహ్మముఖములు వేదఘోషతో నిండినట్లు ఈ ద్వారము లెల్లపుడును సేవార్థ మరుదెంచిన సిద్ధసాధ్యాదుల కలకలధ్వనితో నిండియుండుననియును భావము. అలం. ఉపమ.

తే. పుండరీకుండు క్షేత్రపాలుండు గొలిచి
[1]యుండ నవ్యక్తముఖ్యసంయుక్తుఁ డగుచుఁ
బాండు[2]రంగండు భక్తకల్పద్రులీల
నిష్టఫలసిద్ధిఁ దోరహత్తించు నంతి! 78

టీక. క్షేత్రపాలుండు=క్షేత్రమును కాపాడువాఁడు - అధికారి యగువాఁడు; అవ్యక్త... ...యుక్తుఁడగుచున్ = అవ్యక్తస్వరూపాదులతోఁ గూడినవాఁడై; పాండురంగండు = విష్ణువు(కర్త); భక్తకల్పద్రులీలన్ = భక్తులకు కోరినకోరికల నొసఁగు కల్పవృక్షమువలె; ఇష్టఫలసిద్ధిన్ = కోరిన కార్యములు సిద్ధించుటను; తోరహత్తించున్ = వృద్ధిపొందఁజేయును. అలం. ఉపమ.

క. ఆ కంబులలితకరు బుధ, కోకంబులపాలిహేళిఁ గొలుతు రబల! ము
ల్లోకంబులవారలుఁ బరి,పాకంబుల నాత్మ సుకృతపరికర మొప్పన్. 79

టీక. ఆ,కంబులలితకరున్ = శంఖముచేత సొగసైన కరముగల ఆ విష్ణుని; బుధకోకంబులపాలి, హేళిన్ = విద్వాంసులనెడి చక్రవాకపక్షులకు సూర్యుఁడైన వానిని; ముల్లోకంబులవారలున్; ఆత్మ సుకృతపరికరము = తాము చేసికొన్న పుణ్యోపకరణము; పరిపాకంబులన్, ఒప్పన్ = ఫలింపఁగా; కొలుతురు; అలం. రూపకము.

వ. అర్ధయోజనవిస్తారంబును, దదర్ధాయామసంయుతంబును నై కంబుకంధరునకు నాకుం బ్రియజనకంబై సనకసనందనాదిసజ్జనచింతితార్థప్రదంబై సర్వోత్తమంబై యమ్మహాక్షేత్రరాజంబు పుష్కరంబునకంటెఁ ద్రిగుణంబును, కేదారంబునకంటెను షడ్గుణంబును, వారణాసికంటె దశగుణంబును, శ్రీశైలంబునకంటె ననంతంబును నై పుండరీకునిపేరం బౌండరీకంబన మహీమండలమణికుండలం బగుచు నుండు నప్పరమధామంబు నే నధిష్ఠించి. 80

టీక. అర్ధయోజనవిస్తారంబును = రెండుక్రోశముల పొడవుగలదియు [యోజనమనఁగా నాల్గు క్రోశములు.] తదర్ధాయామసంయుతంబును = అందుసగము [ఒకక్రోసు] వెడల్పుగలదియు; కంబుకంధరునకున్ = శంఖమువంటి మెడగల విష్ణునకు; నాకున్ (శివునకు); పుష్కరంబునకంటెన్ = పుష్కర క్షేత్రముకంటె; త్రిగుణంబును = మూఁడురెట్లును; షడ్గుణంబును = ఆఱింతలును; వారణాసికంటెన్ = కాశీక్షేత్రముకంటె; దశగుణంబును = పదింతలును; అనంతంబును = హద్దులేనిదియు; మహీ...... కుండలంబు = భూమండలము [అనుస్త్రీ] కర్ణకుండలము; పరమధామంబు= గొప్పస్థలమును; అధిష్ఠించి= ఆశ్రయముగాఁ జేసికొని.

ఉ. ఆ యదుభర్త నాహలధరానుజు నానవనీతచోరు నేఁ
బాయనిభక్తితోఁ గొలుతుఁ బ్రత్యహమున్ గృహదైవతంబుగా
నో యరవిందకోరకసహోదరచారుపయోధరాఢ్య! ని
శ్శ్రేయసకాంక్షఁ దక్కొరులు చేరి భజింతు రనంగ నేటికిన్. 81

1. చ. యుండు. 2. చ. రంగుండు.

టీక. ఓయరవింద......రాధ్యా! = తామరమొగ్గలతో సమానమైన చక్కని స్తనములు కల పార్వతీ!; ఆ యదుభర్తన్ = యాదవులకు ప్రభువగు వాసుదేవుని; హలధరానుజున్ = బలరాముని తమ్ముని; నవనీతచోరున్ = వెన్నదొంగను; ప్రత్యహమున్ = ప్రతిదినమును; గృహాప్తపతంబుగాన్ = ఇలువేల్పుగా; నిశ్శ్రేయసకాంతిన్ = శుభాకాంతిలో; హంసనిభకీర్తిన్ = విధుసనిభకీర్తితో; కొలుతున్ = సేవింతును; తక్కొరులు = మిగిలినవారు. [illegible]

క. ఇతరక్షేత్రస్థితదైవతపూజలఁ గలుగు ఫల మవశ్యము గలుగున్
శతదశకగుణితమై యుర్విఁ దెలియఁ దత్క్షేత్రపూజఁ జేయఁగ సరసన్. 82

టీక. ఇతర......పూజలన్ = మిగిలిన క్షేత్రములందున్న దేవతలయొక్క పూజలవలన; అవశ్యము = తప్పక; శతదశకగుణితమై = వేయిరెట్లయి; [illegible] = స్థిరబుద్ధితో.

క. నరుఁ డరువదివేలేఁడు లితరదైవతదర్శనమునఁ దాఁ గను ఫలమున్
బొరయు నలవోకవలె శాంకరి! యాక్షేత్రస్థితునింబుఁ గనుఁగొన్నంతన్. 83

టీక. కను ఫలమున్ = పొందు, మేలిని; అలవోకవలెన్ = అనాయాసముగా; పొరయున్ = పొందును; శాంకరి! = పార్వతీ!

క. సకలక్షేత్రావాసము సకం టె నం దునికి యొప్పు సరసను మృగడిం
భకనయన! యేకదినవాసకృతికి వే వొందుఁ గాన సాయుజ్యంబున్. 84

టీక. మృగడింభకనయన! = జింకపిల్లకన్నులవంటి కన్నులుగలదానా!- పార్వతీ!; ఏకదినవాసకృతికిన్ = ఒక్కదినము నివసించిన నేర్పరికి; సాయుజ్యంబున్ = మోక్షముకూడ, సరసతన్; అందునికి = ఆక్షేత్రమున నివసించుట; ఒప్పున్ = తగినది.

సీ. దొరకుజన్మమునకుఁ బరమభైషజ్యమౌ మాతృశుశ్రూషాసమాధి యొకటి
చిలువాయనపువేల్పుఁగొలముఁ గొల్వక వాసుదేవు నారాధించు తెలివి యొకటి
దుర్వాసనలఁ బెట్టు దొసఁగులు [1]విడఁదన్ని యధ్యాత్మవాసన నలరు టొకటి
యుర్విజీవులకెల్ల నుదయించి యుదయించి తుది మర్త్యులై పుట్టు పదవి యొకటి
తే. కాలమున వచ్చునర్థులకాంక్ష యెఱిఁగి
తృప్తి నొందింపఁగలుగంగఁ దిరుగు టొకటి
దుర్లభం బెట్టు లట్లతిదుర్లభంబు
మగువ! తత్క్షేత్రవాసంబు మానవులకు. 85

టీక. దొరకుజన్మమునకున్ = కలుగఁబోవు పుట్టుటకు; పరమభైషజ్యమౌ = గొప్పమందైన; మాతృశుశ్రూషాసమాధి = తల్లిసేవయందలి యాసక్తి; [ఈ జన్మమున తల్లిని సేవించినయెడల తిరిగి జన్మించుటయను దుఃఖము కలుగదని భావము.] చిలు......గొలమున్ = చిల్లర (క్షుద్ర) దేవతల గుంపును; ఆరాధించుతెలివి = పూజించు జ్ఞానము; దుర్వాసనలన్, పెట్టు = చెడ్డవయిన విషయాపేక్షలకు లాగు; దొసఁగులు = ఆపదలను; విడఁదన్ని = తప్పించుకొని - త్రోసి; అధ్యాత్మవాసనన్ = తత్త్వవిచారాపేక్షచేత; అలరుట = ఆనందించుట; ఉర్విజీవులకెల్లన్ = భూమియందలి ప్రాణులకన్నిటికిని; ఉదయించి = పుట్టి; తుది = చివర; మర్త్యులై = మనుష్యులై; పదవి = గొప్పభాగ్యము; కాలమునన్ = యుక్తసమయమందు; అర్థులకాంక్ష = యాచకులకోరికను; ఎఱిఁగి = తెలిసికొని; దుర్లభంబు; ఎట్టులు = ఏరీతి కష్టమో.

---

1. చ. పీడగదన్ని.

పునర్జన్మము లేకుండఁజేయు తల్లిసేవ యొనర్చు బుద్ధిపుట్టుట కష్టము; చిల్లరదేవతలను విడిచి విష్ణుని సేవించు బుద్ధియు పుట్టుట అసాధ్యము; విషయసుఖములనుగూర్చిన విచారమును విడిచి పరమాత్మతత్త్వమును విచారించుటయు దుర్లభము; ఎన్నో నీచజన్మము లెత్తియెత్తి తుదను మనుష్యుఁడుగా పుట్టుటయు కష్టము; వేళకు వచ్చిన అతిథిని గౌరవించి అతని కోరిక యీడేర్చుట కష్టము; మీఁదివానివలెను - అంతకంటె ఎక్కువగను దుర్లభమైనది పాండురంగక్షేత్రనివాసము; ఎంతో అదృష్టము చేసికొనినఁగాని అది లభింపదు.

చ. వినవె [1]యజస్రముఁ గుతపవేళ క్షుధార్తులకోటిఁ గూర్చి నే
 త నెసరువెట్టి వండు కలధౌతపుఁగూడు పసిండిపప్పు భో
 జన మిడి యొందుచోఁ బడయఁజాలెడు పుణ్య మగణ్యమై ఘటి
 ల్లు నెలఁత! పౌండరీకమహిలో మెదు కొక్కటి పెట్టువానికిన్. 86

టీక. అజస్రమున్ = ఎల్లప్పుడును; కుతపవేళన్ = అపరాహ్ణసమయమున - ప్రొద్దు రెండు జాములు తిరిగినవెనుక; క్షుధార్తులకోటిఁగూర్చి = ఆఁకలిచే బాధపడువారినిగూర్చి - (వారికొఱకయి అనుట); నేతన్ = నేతితో; కలధౌతపుఁగూడు = వెండియన్నము; [తెల్లనియన్నము]; పసిండిపప్పు = బంగారు (పచ్చని) పప్పు; [అనఁగా మిక్కిలి విలువగు భోజనమనియు భావము.] ఒందుచోన్ = వేఱొకచోట; పడయఁజాలెడు = పొందఁగలిగిన; అగణ్యమై = లెక్కలేనంత; ఘటిల్లున్ = కలుగును.

మ. నియతిం బాతికయెత్తు కాంచనముగానీ వెండిగానీ జగ
 త్త్రయపూజ్యం బగు పాండురంగవసతిన్ దానంబు గావించు పు
 ణ్యయుతుం డుండు నఖండలీలఁ గలధౌతాహార్యవర్యాత్మక
 ప్రియగేహంబులలో భవాంతరమునన్ బృథ్వీధరేంద్రాత్మజా! 87

టీక. నియతిన్ = నియమముతో; పాతికయెత్తు; కాంచనముగానీ = (ఇచట 'ఇమ్ము'నకు 'ఈ' ఆదేశము.) బంగారమైనను; జగత్త్రయపూజ్యంబగు = మూఁడు లోకములకును పూజింపఁదగిన; పాండురంగవసతిన్ = పాండురంగని నివాసమగు పౌండరీకక్షేత్రమున; అఖండలీలన్ = గొప్పవిలాసముతో; భవాంతరమునన్ = మఱుజన్మమున; కలధౌ......గేహంబులలోన్ = వెండికొండలవలె శ్రేష్ఠములయిన తమ యిండ్లయందు; ఉండున్; పృథ్వీధరేంద్రాత్మజా! = పర్వతరాజపుత్రికవగు పార్వతీ! అలం. ఉపమ.

శా. ప్రావారాజినరాజిఁ గంబళతతిన్ బట్టాంబరాళిన్ దయా
 ప్లావస్నిగ్ధమతిన్ జలిన్ గృపణవిప్రశ్రేణిపైఁ గప్పుఁబో
 నేవాఁడేనియుఁ బౌండరీకమహి వాఁ డిందుప్రభాకందళ
 శ్రీవిభ్రాజియశంబులం బొదువు ధాత్రీదిఙ్నభస్సీమలన్. 88

టీక. ఏవాఁడేనియున్ = ఎవ్వఁడయినను; ప్రావారాజినరాజిన్ = పైమీఁదివస్త్రముల యొక్కయు, జింకమొదలగువానితోళ్లయొక్కయు గుంపును; ["తోలుత్తరీయపుసమూహమును" అని పూర్వటీక.] కంబళతతిన్ = ఉన్నికంబళ్లను; పట్టాంబరాళిన్ = పట్టువస్త్రముల సమూహమును; దయాప్లావస్నిగ్ధమతిన్ = మిక్కిలి దయతోఁగూడిన స్నేహబుద్ధితో; చలిన్ = చలికాలమునందు; కృపణవిప్రశ్రేణిపైన్ = దరిద్రులయిన బ్రాహ్మణులపయి; కప్పుఁబోన్ = కప్పునో; వాఁడు; ధాత్రీదిఙ్నభస్సీమలన్ = భూమ్యాకాశదిగ్భాగములందు; ఇందు........యశంబులన్ = వెన్నెలమొలకల కలిమివలెఁ బ్రకాశించు కీర్తులను; పొదువున్ = కలిగించును. ['ఇందు ప్రభాకందళశ్రీవిభ్రాజి యశంబులన్ = వెన్నెలమొలకలకలిమిచేత వెలుగునట్టి కీర్తులచేత' అని పూర్వటీక] అలం. ఉపమ.

---

1. ఛ. వనుఘస్రమున్.

ఉ. వృత్రవిరోధిముఖ్యు లగు వేల్పులుఁ బుట్టఁదలంతు రో లతా
గాత్రి! త్రివిష్టపస్థితి సుఖంబులు గావని కర్మభూమిపైఁ
బత్త్రరథాధినాథరథుఁ [1]బాండవపక్షులుఁ బౌండరీకసు
క్షేత్రపతిన్ భజించి తమ[2]చెన్నటిపుట్టువు నీఁగుకోరికన్. 89

టీక. ఓలతాగాత్రి! = తీగవంటి దేహముగల యో పార్వతీ! వృత్రవిరోధిముఖ్యు లగు = ఇంద్రుఁడు మొదలయిన; వేల్పులు = దేవతలు; త్రివిష్టపస్థితిన్ = స్వర్గమునందలియునికిచేత; సుఖంబులు కావని = సుఖంబులు కలుగవని; తమచెన్నటిపుట్టువున్ = నిందింపఁదగిన - నీచమైన - తమ జన్మమును ['చెన్నఁటి = వ్యర్థమైన' అని పూర్వ.గ.]; నీఁగుకోరికన్ = విడుచుకోరికతో; పత్త్రరథాధినాథరథున్ = గరుత్మంతుఁడు వాహనముగాఁ గలవానిని; పాండవపక్షులన్ = పాండవులపయి ప్రేమకలవానిని - శ్రీకృష్ణుని; భజించి = సేవించి; కర్మభూమిపైన్ = కర్మలగు స్థానమగు భరతఖండము మీఁద; పుట్టఁదలంతురు.

సీ. పితరు లుబ్బుదురు హృద్గతుల నాత్మకులోద్భ
వుం డెవ్వఁడేనియుఁ బౌండరీక
మునకు నేగకయున్నె యని, యందు నొసఁగు హ
వ్యముఁ గవ్యము నమేయమై ఫలించు
నవదరించఁగలేరు సాత్త్వికం బగు భావ
మేనొక్కఁడునుదక్క నివల నవల
భక్తు లెవ్వరు రజఃప్రకృతిఁ దాల్తురె కాని
పౌండరీకేశు శాంబరికతమునఁ
తే. దలఁప మానసమునఁ గల్గు కలుష మడఁగుఁ
[3]బొగడ మాటల నగు దోషములు తొలంగుఁ
[4]గనుఁగొనఁగఁ జేతఁబుట్టు [5]నఘంబు లుడుగు
నమ్మహాక్షేత్రమునకు నెయ్యది సమంబు? 90

టీక. పితరులు = పితృదేవతలు; హృద్గతులన్ = మనస్సులందు; ఆత్మకులోద్భవుండు = తమ వంశమునఁ బుట్టినవాఁడు; ఏఁగకయున్నె = వెళ్లకపోవునా? అందున్ = ఆ క్షేత్రమునందు; ఒసఁగు = ఇచ్చునట్టి; హవ్యమున్ = దేవతలకిచ్చు నన్నమును; కవ్యమున్ = పితృదేవతల నుద్దేశించి చేయు పిండప్రదానమును; అమేయమై = ఇంత యనిచెప్ప వీలుకానిదయి; నవదరింపఁగలేరు = పొందలేరు; ఇవల నవలన్ = ఇటువైపు, నటువైపును - ఇప్పుడు, నప్పుడును; పౌండరీకేశు = క్షేత్రపతియగు విష్ణుని యొక్క; శాంబరికతమున = మాయవలన; రజఃప్రకృతిన్ = రజోగుణభావమును; తలఁపన్ = ఆ క్షేత్రమును తలఁచిన; మానసమునన్ = మనస్సున; కలుషము = చెడ్డ తలఁపు; అడఁగున్ = నశించును; పొగడన్ = కొనియాడఁగా; కనుఁగొనఁగన్ = చూడఁగా; చేతఁబుట్టు = చేతివలనఁగల్గు - కాయమువలనఁగల్గు; అఘంబులు = పాపములు; ఉడుగున్ = నశించును. [ఇచట మనోవాక్కాయములవలనఁగల్గు పాపములు - త్రికరణజన్యములు - నశించునని భావము.]

సీ. కుఱుచలై గుమురులై [6]గొనబులై లేఁబాఁపకొమ్మఁజొట్టిన జడల్ గుమురుకొనఁగ
మెఱుపులై మిట్టలై మిక్కిలి బటువులై గ్రాలుకన్నులచెన్ను గబ్బుదేరఁ

1. క. బాంధవ. చ. బాండవ. 2. చ. చన్నది. 3. క. పొగడ 4. క. కనుగొనఁగ. 5. చ. నఖంబు. 6. చ. గొమరులై.

చిక్కనై చెలువమై [1]చిన్నారియై యొప్పు మోము దంష్ట్రాటంకములఁ దలిర్ప
నీలమై నిబిడమై నిద్ధమై నింగిక్రిందుగ నున్న బలుమేని[2]పొగరు మెఱయఁ
తే. బత్త్రిపతికేతనుని పురఃక్షేత్రము గాంచి, యున్న శ్రీక్షేత్రపాలకు యోగిలోక
రమణు ముప్పదిరెండక్షరముల మంత్ర, రాజము జపించి కొల్వ దొరకు శుభములు.

టీక. కుఱుచలై = పొట్టివై; గుమురులై = గుమురుగానున్నవై; గోనబులై = అందమైనవై; లేఁబాప కొమ్మక్ = చిన్నయాఁడుపాముచే; గుమురుకొనఁగన్ = దట్టమైయుండఁగా; మెఱుపులై = ప్రకాశించునవై; మిట్టలై = ఎత్తయినవై - ఉబికినవయి; మిక్కిలిబటువులై = మిక్కిలిగుండ్రనివయి; క్రాలు = ప్రకాశించు; కన్నులచెన్ను = కన్నులకాంతి; గబ్బుదేఱన్ = మదించియుండఁగా - ఎక్కువైయుండఁగా; చిక్కనై = సల్లిలేనిదై; చెలువమై = అందమైనదై; దంష్ట్రాటంకములన్ = ఉలులవంటి కోఱలచేత; తలిర్పన్ = ప్రకాశింపఁగా; నీలమై = నల్లనిదై; నిబిడమై = దట్టమైనదై; నిద్ధమై = నునుపైనదై - నిగనిగలాడునదై; బలుమేనిపొగరు = గొప్పదేహముయొక్క ఉద్ధతి; మెఱయన్ = ప్రకాశింపఁగా; పత్త్రిపతికేతనుని = గరుడధ్వజుఁడగు విష్ణునియొక్క; పురఃక్షేత్రము = ఎదుటిప్రదేశమును; గాంచి = ఆశ్రయించి; శ్రీక్షేత్రపాలకున్ = క్షేత్రపాలకుఁడగు పుండరీకుని; యోగిలోకరమణున్ = యోగులలో శ్రేష్ఠుని; దొరకు = లభించును.

ఉ. చేరి చతుశ్శ్రుతుల్ చిలుకచేఁ [3]జదివించుచు నక్షమాలికా
ధారిణియై తనుప్రభలు దట్టపు[4]వెన్నెలపంట పండఁగాఁ
దూరుపువాకిటన్ వెలయు తోయజగర్భునిరాణి వాణి నీ
హారమయూఖజిన్ముఖ దశాక్షరమంత్రమయిం గనందగున్. 92

టీక. చేరి = సమీపించి; చతుశ్శ్రుతుల్ = నాలుగు వేదములను; అక్షమాలికాధారిణియై = జపమాలను ధరించినదయి; తనుప్రభలు = తనదేహకాంతులు; తోయజగర్భునిరాణిన్ = బ్రహ్మదేవుని భార్యయగు; వాణిన్ = సరస్వతిని; నీహారమయూఖజిన్ముఖన్ = వెన్నెలను జయించినముఖముకల - చంద్రునివంటి చక్కని ముఖము కలదానిని; దశాక్షరమంత్రమయిన్ = పదియక్షరముల మంత్రము కలదానిని; తూరుపువాకిటన్, కనందగున్. అలం. ఉపమ.

ఉ. శ్రీరమణీమనోరమణుచేతఁ బ్రతిష్ఠితుఁ డౌట దక్షిణ
ద్వారమునందు లింగతనువైభవ మొప్ప షడక్షరీవిధుల్
గోరి భజించువారలకుఁ గొంగుధనంబయి వేణుముద్రతో
నారదుఁ డున్నవాఁడు రదనచ్ఛదభర్త్సితవిద్రుమద్రుమా! 93

టీక. శ్రీరమణీమనోరమణుచేతన్ = లక్ష్మీదేవికి భర్తయగు విష్ణునిచే; ఔటన్ = అగుటచేత; లింగతనువైభవము = విగ్రహరూపవైభవము; ఒప్పన్ = ప్రకాశింపఁగా [విగ్రహరూపుఁడగుచు నని భావము.] షడక్షరీవిధుల్ = 'ఓం నమో నారదాయ' అను తన షడక్షరమంత్రపద్ధతులను; కోరి; భజించు వాలకున్ = సేవించువారికి; కొంగుధనంబయి = కొంగునఁగట్టిన బంగారమై; రదన.....ద్రుమా! = పెదవికాంతిచే తిరస్కరించఁబడిన పగడపుచెట్టు కలదానా! - పార్వతీ! నారదుఁడు; ఉన్నవాఁడు; అలం. ఉపమ.

---

1. క. చిన్నది. చ. చిన్నిరి. 2. చ. పొగను. 3. చ. చదివింపుచు. 4. క. వెన్నెలపండు. ట. వెన్నెలపంట.

ఉ. శౌరి భజించుచున్ భుజగసద్మమునన్ విహరించు [1]తన్మనో
హారిణు లైదుకోటులు మహామహిమా[2]న్విత [3]లర్థి దక్షిణ
ద్వారమహిన్ విహారరతి వర్తిలి యవ్విభుఁ జేరి యెన్నఁడో
యారతు లిచ్చినారఁట! తదాయతధూపము నేఁడుఁ బర్వెడున్. 94

టీక. శౌరిన్ భజించుచున్ = విష్ణుని సేవించుచు; భుజగసద్మమునన్ = పాతాళ (నాగ) లోకమున; విహరించు = తిరుగుచున్న; వాఙ్మనోహారిణులు = చమత్కారముగ మాటలాడు నాగకన్యలు; మహామహిమాన్వితలు = గొప్ప ప్రాభవముతో కూడియున్నవారు; అర్థిన్ = కోరికతో; దక్షిణద్వారమహిన్ = దక్షిణద్వారప్రదేశమునందు; విహారరతిన్, వర్తిలి = విహారపుటాసక్తిచే ఉండి; తదాయతధూపము = వారిచ్చిన యారతుల గొప్పపొగ; నేఁడున్, పర్వెడున్ = ఇప్పటికిని వ్యాపించుచునే యున్నది.

నాగకన్యకలు ఎప్పుడో వచ్చి దక్షిణద్వారమున నిల్చి పాండురంగనియెడఁ గల భక్తిప్రేమలతో హారతులిచ్చినారఁట! ఆధూపము ఇప్పటికిని వ్యాపించుచున్నదని భావము. అలం. భావికము.

క. చేడియ! యాద్వారమె యదుచూడామణి క్రీడలాడుచో టమ్మహితా
క్రీడ[4]నకస్థలి హరిఁ [5]గూడాడుఁ జుమీ యమరవల్లభావళి నేఁడున్. 95

టీక. చేడియ! = వనితా! - పార్వతీ! ఆ ద్వారమె = దక్షిణభాగద్వారమే; యదుచూడామణి = శ్రీకృష్ణుఁడు; క్రీడలాడుచోటు = ఆటలాడు స్థలము; అమ్మహితాక్రీడనకస్థలిన్ = ఆ గొప్ప ఆఁటస్థలమున; ['అమ్మహితాక్రీడనభూస్థలిన్ = లెస్సగాఁ గ్రీడించుటకుఁ జనిన ఆ పూజ్యమయిన ప్రదేశమునందు' అని పూర్వటీక.] హరిఁగూడి = విష్ణువుతోఁ గలిసి; అమరవల్లభావళి = దేవతాస్త్రీల సమూహము; నేఁడున్; ఆడుఁజుమీ! 'హరిఁగూడియాడుఁజుమీ' 'అనుటకు' హరిఁగూడాడుఁజుమీ'అని క్త్వార్థేకారసంధి; అలం. భావికము.

ఉ. సేచనముఖ్యకర్మములసేఁతకు నూతన మైన యచ్చటన్
శ్రీచరణంబు లున్న యవి సింగము వెన్ను నగంటి; వానికిన్
వే చని మ్రొక్కి పూజనము నేమముతో రచియించెనేని శీ
తాచలపుత్రి! పూరుషుఁ డిహంబుఁ బరంబుఁ గరంబునం గొనున్. 96

టీక. సేచన......సేతకున్ = తడుపుట మున్నగు పను లొనర్చుటచే; నూతనమైన = క్రొత్తదయిన - శుభ్రమైన - [అది పాండురంగనిక్రీడనకస్థలమగుటచే దానిని పరిశుభ్రముగా నొనరింతురని భావము.] సింగము వెన్నునగంటి = సింహమువీఁపుపయిని; శ్రీచరణంబులు = శ్రీ(విష్ణుని) పాదములు; వే = వేగముగా; చని = వెళ్లి; నేమముతో=నియమముతో; శీతాచలపుత్రి! = పార్వతీ! కరంబునం గొనున్ = చేతియందు (సులభముగా) గ్రహించును.

చ. మరలఁగఁ బట్టఁగట్టఁగ సమ[6]స్తమరుత్కరిఁ దన్నుఁగూర్చి యొ
చ్చరిక ధరింపఁబోలునన శాతముఖాంకుశపాశముల్ వికస్వరరుచిఁ దాల్చి పశ్చిమపు వాకిట హ్రీంకృతిమంత్రరూపభా
స్వర భువనాధినాయిక లసద్రస[7]నాయిక [8]యొప్పు నెప్పుడున్. 97

టీక. మరలఁగఁబట్టన్ = తిరిగి పట్టుకొనుటకు; కట్టఁగన్ = (తన్ను) కట్టుటకును; సమస్తమరుత్కరిన్ = సమస్తదేవతలలోను ఏనుఁగైన - ప్రధానదేవతయైన; తన్నుఁగూర్చి = పాండురంగనిఁగూర్చి

1. క. వాఙ్మనో. ట. జన్మనో. 2. క. న్వితు. ట. న్విత. 3. చ. లట్టి. 4. క. నభూస్థలి. చ నకస్థలి. 5. ట. గోడాడు. 6. మరుద్గవి నన్ను. శ. ర. 7. చ. సాయక. 8. ట. మొప్పు.

హెచ్చరికన్, ధరింపఁబోలుననన్ = జాగరూకతతో గమనించ సిద్ధముగ నున్నదో యనునట్లు; శాతముఖాంకుశముల్ = వాఁడిమొనలుగల యంకుశమును, పాశమును; వికస్వరరుచిన్ = స్ఫుటరీతిని; హ్రీంకృతి... భాస్వర = హ్రీంకారమంత్రమున ప్రకాశించుచున్న; భువనాధినాయక = భువనేశ్వరి; లసద్రసనాయిక! = ప్రకాశించు, శృంగార-నాయికా! పార్వతీ! పాండురంగని దుండగములనుండి మరలించుటకు బెదరించునట్లు అచట భువనేశ్వరీదేవి యున్నదని భావము. [లసద్రసనాయిక = ఒప్పిదములైన రసములకు నాయకురాలు - సరస్వతి' - అని పూర్వటీక; కాని సరస్వతీదేవి యిదివఱకే తూర్పువాకిట నున్నట్లు వర్ణింపఁబడినది ఆమె విష్ణుని బెదరించుటయు అసంభవము.]

ఉ. [1]హారపదాధిరూఢమహిషాసురకీకసవర్గ దుర్గ నా
గారిమహోపవాహ్య సదశాక్షరమంత్రవిశేష యుత్తర
ద్వారమునందు నుండు నిరతంబును [2]దా ఫలపూపపాయసా
హారములం దనుం [3]దెలఁచు [4]నయ్యలదొడ్డికి వేల్పుగిడ్డియై. 98

టీక. హార.....వర్గ = హారస్థానమున నుంచఁబడిన మహిషాసురుని ఎముకలగుంపు కలది - మహిషాసురుని ఎముకలను హారముగా ధరించినది; [పూర్వటీకలో 'హారిపథాధిరూఢ-' అను పాఠము ననుసరించి 'హారి = మనోహరమయిన' అని అర్థము వ్రాయఁబడినది.] నాగారిమహోపవాహ్య = గొప్ప సింహవాహనము కలది; సదశాక్షరమంత్రవిశేష = పదియక్షరముల మంత్రము కలది; దుర్గ = కాళి; నిరతంబును = ఎల్లప్పుడును; తాన్ = తాను; ఫలపూపపాయసాహారములన్ = పండ్లు, పిండివంటలు, పాయసములు మొదలగు నాహారముచే; తెలచు = తృప్తిపొందించు; అయ్యలదొడ్డికిన్ = ఉత్తముల పనులకొట్టమునకు; ['ఉత్తమజనులసమూహమునకు' అని పూర్వటీక.] వేల్పుగిడ్డియై = కామధేనువై - కోరినకోరికలనిచ్చునదయి; ఉండున్. అలం. రూపకము, ఉపమ.

క. ఇవి నాలుగు ద్వారంబులు, ధవళేక్షణ! ద్వారదేవతలు నల్వురు వీ
రవధానబుద్ధి నేతత్సవిశేషార్చన మొనర్ప సంపద లొదవున్. 99

టీక. ద్వారదేవతలు నల్వురు = తూర్పున సరస్వతి, దక్షిణమున శారదుఁడు, పశ్చిమమున భువనేశ్వరి, ఉత్తరమున దుర్గ యనువారు; అవధానబుద్ధిన్ = హెచ్చరిక కల్గునట్లు; ఏతత్సవిశేషార్చనము = నియమముతో వీరిని పూజించుటను; ఒదవున్ = కల్గును.

తే. సమరసన్నద్ధరక్షోనిశాతహేతి,పాత[5]జాతక్షతవ్రాతభూతిఁ దనరు
పరమ[6]పదనాథు నెమ్మేనఁ బరఁగు వర్ణ,రాజి యఖిలంబు శ్రీమంత్రరాజ మబల!

టీక. సమర.....భూతిన్ = యుద్ధమునకు సిద్ధపడిన రాక్షసులయొక్క వాఁడియైన యాయుధముల పాటువలన కలిగిన గాయములసమూహముయొక్క కలిమివలన; తనరు = ఒప్పునట్టి; పరమపదనాథునెమ్మేనన్ = శ్రీవిష్ణునిశరీరమున; పరఁగు = ప్రకాశించు; వర్ణరాజి = అక్షరములపంక్తి; అఖిలంబు = సమస్తము; శ్రీమంత్రరాజము = శ్రీమదష్టాక్షరీమంత్రము.

మ. అహరారంభమునందు రక్తుఁడయి మధ్యాహ్నంబునన్ శుభ్రుఁడై
గ్రహరాడస్తమయంబునం దసితుఁడై గాయత్రియుంబోలి య
య్యహిపర్యంకుఁడు మూఁడుమూర్తులకు నిమ్మై యొప్పుఁ బూజింతు ర
న్వహముం గోమలి! మూఁడుమంత్రముల నిత్యానందకాంక్షన్ మునుల్. 101

1. క. హారిపథా. చ. హారపదా. 2. చ. నిరాఫల. 3. చ. దలఁచు. 4. చ. నయ్యల. 5. చ. జాతాక్షర. 6. చ. పథ.

టీక. అహారారంభమునందున్ = ప్రాతఃకాలమున; రక్తుఁడయి; ఎఱ్ఱనివాఁడయి; శుభ్రుఁడై = తెల్లనివాఁడయి; గ్రహారాడస్తమయంబునందున్ = సూర్యాస్తమయకాలమున; అసితుఁడై = నల్లనివాఁడై; గాయత్రియుంబోలి = గాయత్రీదేవివలె - [ఆమెయు త్రిసంధ్యలందు మువ్విధముగా నుండును] అయ్యహిపర్యంకుఁడు = శేషశాయి యగు నా విష్ణువు; ఇమ్మై = ఉనికిపట్టయి; ఒప్పున్ = ప్రకాశింపఁగా; అన్వహమున్ = ప్రతిదినమును; మునుల్; నిత్యానందకాంక్షన్ = శాశ్వతానందమును పొందు తలఁపున; పూజింతురు. అలం. ఉపమ.

క. మూర్తిత్రితయమయత్వస్ఫూర్తిన్ వర్తించు చిహ్నములు మంత్రము శ్రీ
భర్తకృప నే నెఱుంగుదుఁ, గార్తికరాకాసుధాంశుకమనీయముఖీ ! 102

టీక. మూర్తి.....స్ఫూర్తిన్ = మువ్విధములగు మూర్తుల తోపికచేత; చిహ్నములు = లక్షణములు; శ్రీభర్తకృపన్ = విష్ణునిదయవలన; కార్తిక.....ముఖీ! = శరత్కాలమునందలి నిండు చంద్రునివలె చక్కని ముఖముకల పార్వతీ ! అలం. ఉపమ.

మ. గద సారించి త్రిదంష్ట్రనాముఁ డగు రక్షఃపాలుఁ డొక్కండు బి
ట్టదరుల్ వాఱ మురారియెడ్మబరిఁ బ్రేయన్ దాన నద్దిక్కు నొ
చ్చె దళింపంబడియెన్ దదుగ్రహతిగాసిన్ క్షుల్లకాళిక్యమున్
మృదుసంరంభముతోడ నవ్వుచును దున్మెన్ వాని నద్దేవుఁడున్. 103

టీక. త్రిదంష్ట్రనాముఁడగు = త్రిదంష్ట్రుఁడను పేరు కల; రక్షఃపాలుఁడు = రాక్షసరాజు; గద, సారించి = గదను చాఁచి-ఎత్తి; బిట్టు = అధికముగా; అదరుల్ వాఱన్ = నిప్పురవలు రాలఁగా; మురారియెడ్మబరిన్ = విష్ణుని యెడమప్రక్కను; [ఎడమ-కు 'ఎడ్మ' స్వతంత్రప్రయోగము.] వ్రేయన్ = కొట్టఁగా; దానన్ = ఆదెబ్బవలన; అద్దిక్కు = ఆఎడమప్రక్క; తదుగ్రహతిగాసిన్ = ఆదెబ్బవలని బాధచేత; క్షుల్లకాళిక్యమున్ = చిన్నచిక్కము - జాలెసంచి (గ్రచ్ఛకాయలసంచి) యును; దళింపంబడియెన్ = కొట్టఁబడెను - చించఁబడెను; వానిన్ = ఆరాక్షసుని; అద్దేవుఁడున్ = ఆవిష్ణువును; నవ్వుచును; మృదుసంరంభముతోడన్ = సులభమైన ప్రారంభమున - సులభప్రయత్నమున - అనాయాసముగ; తున్మెన్ = చంపెను.

సీ. ధాత్రీధరాత్మజ! క్షేత్రాత్మ యనఁగఁ దీర్థాత్మ యనంగ మూర్త్యాత్మ యనఁగఁ
ద్రివిధమూర్తులుదాల్చిదీపించునతఁడు [1]మూన్నెలవులయెడఁబూజనీయుఁ[2]డగుటఁ
గంబళకౌశేయకలధౌతకాంచన గంధసింధురతురంగమశతాంగ
కర్ణికాగ్రైవేయ కటకకన్యాగంధ కాశ్మీరకస్తూరికా[3]గవాజ్య
తే. ధాన్య[4]వాసాదిబహుపదార్థంబు లచటఁ, బేదలకు వేదవిదులకుఁ బ్రీతి నొసఁగ
క్షేత్రమయమూర్తి యగు దేవకీసుతునకుఁ, బాండురంగాధిపతి కతిప్రమద మొదవు.

104. ధాత్రీధరాత్మజ! = పార్వతీ! మూన్నెలవులయెడన్ = మూఁడుస్థానములందును - క్షేత్ర, తీర్థ, మూర్తులుండుచోట్ల; కంబళ.....పదార్థంబులు - కంబళ = కంబళ్లు; కౌశేయ = పట్టువస్త్రములు; కలధౌత = వెండి; కాంచన = బంగారము; గంధసింధుర = మదపుటేనుఁగులు; తురంగమ = గుఱ్ఱములు; శతాంగ = రథములు; కర్ణికా = చెవిపోఁగులు; గ్రైవేయ = హారములు; కటక = కడియములు; కన్యా = కన్యకలు; గంధ = చందనము; కాశ్మీర = కుంకుమపువ్వు; కస్తూరికా = కస్తూరి; గవాజ్య = ఆవునేయి; ధాన్య = ధాన్యము; వాసాదిబహుపదార్థములు = గృహము మొదలగు అనేక వస్తువులును; వేదవిదులకున్ = వేదముల నెఱిఁగినవారికిని; ప్రమదము = సంతోషము; ఒదవున్ = కలుగును.

1. చ. ము న్నెలవుల. 2. చ. డగుచు. 3. చ. గరాజ. 4. చ. దసాది.

ఉ. చేడియ! తీర్థమూర్తికడఁ జేయఁదగున్ మనుజుండు సేచనా
క్రీడనముల్ మహీదివిజకేసరులన్ బరమాన్నశర్కరా
పాడబగోఘృతేక్షురస శాకములన్ ఫలపానకాదులన్
వీడెములన్ బ్రమోదపదవీమదలిప్సఁ జెలంగఁజేయుచున్. 105

టీక. చేడియ! = పార్వతీ! తీర్థమూర్తియగు పాండురంగనియొద్ద - భైమియను తీర్థముదగ్గఱ; మనుజుండు = మనుష్యుఁడు; మహీదివిజకేసరులన్ బ్రాహ్మణశ్రేష్ఠులను; పరమాన్న......శాకములన్ = క్షీరాన్నము, చక్కెఱ, పులుసులు, ఆవునేయి, చెఱకురసము, కూరలు - అనువానితోను; ఫలపానకాదులన్ = ఫలములు, పానకములు మొదలగువానితోను; వీడెములన్ = తాంబూలములతోను; ప్రమోదపదవీమదలిప్సన్ = సంతోషమార్గమున కైపు ఎక్కిన కోరికను; చెలంగఁజేయుచున్ = పొందఁజేయుచు; [అనఁగా - వారిని మిగుల మేఁదివానిచే కైపెక్కినట్లుచేయుచు] సేచనాక్రీడనముల్, చేయఁదగున్ = స్నానవిధులు ఒనర్పవలయును.

క. ప్రణుతమతి నర్హపూజార్పణమునఁ దత్తీర్థమూర్తి భజియించు సుధీ
మణులకు నభిముఖమతి బర్హిబర్హాకల్పుఁ డొసఁగు నిహమును బరమున్. 106

టీక. ప్రణుతమతిన్ = ఉత్తమబుద్ధితో; తత్తీర్థమూర్తిన్ = తీర్థస్వరూపుఁడగు విష్ణుని; అర్హపూజార్పణమునన్ = తగినపూజ అర్పించుటచే; భజియించు = సేవించునట్టి; సుధీమణులకున్ = బుద్ధిమంతులకు - విద్వాంసులకు; బర్హిబర్హాకల్పుఁడు = నెమిలిపింఛము ఆభరణముగాఁగల కృష్ణుఁడు; అభిముఖమతిన్ = అనుకూలబుద్ధితో; ఇహమున్ = భుక్తిని; పరమున్ = ముక్తిని; ఒసఁగున్ = ఇచ్చును.

వ. అని మూర్త్యర్చనవిధానకథనోన్ముఖుండై పంచముఖుండు శిఖరిచందనతో నిట్లనియె.

టీక. పంచముఖుండు = ఐదుముఖములు (1-173) కల శివుఁడు; శిఖరినందనతోన్ = పార్వతితో.

సీ. మంత్రపూతముగాఁగ మజ్జనం బొనరించి ప్రసన్నని శుభ్రాంబరములుగట్టి
ఘనసారమిశ్రితగంధసారమలంది పరిమళం బుడివోని విరులు ముడిచి
[1]సికరలతోడ గోక్షీరపూరముతోడ బహువిధంబగు ఫలప్రతతితోడ
పిండిపంటలతోడఁ [2]గండచక్కెఱతోడ నేతులతోడఁ దేనియలతోడ

తే. దధుల[3]తోఁగూడఁదగునివేద్య[4]ములఁజూపి, వనధివనధాముఁబీతాంబరునిరమాకు
[5]చరజవినిలిప్త శిఖిబర్హధరు మఖాంశ,భోక్తఁ బూజింపఁదగుఁజైత్రమున శుభాంగి!

టీక. మంత్రపూతముగాఁగన్ =మంత్రములచేఁబవిత్రమగునట్లుగా - సమంత్రకముగ; మజ్జనంబొనరించి=స్నానముచేసి; ప్రసన్నని = మనోజ్ఞమైన; శుభ్రాంబరములు= తెల్లనివస్త్రములను; ఘన......సారము = కర్పూరముఁకలిపిన మంచిగంధమును; అలంది=పూసికొని; పరిమళంబుడివోని=సువాసన తగ్గని - మంచి పరిమళము కల; విరులు = పూవులను; సిగరలతోడన్ =తాలింపుచేసిన తియ్యమజ్జిగలతోను; ఫలప్రతతితోడన్ = పండ్లసమూహముతోను; దధులతోఁగూడన్ =పెరుగులతోఁగూడ; నివేద్యములన్ = ఆరగింపువస్తువులను; చూపి = ఇచ్చి; చైత్రమునన్ = వసంతర్తుసంబద్ధమగుచైత్రమాసమునందు; [ఈ పద్యము మొదలు క్రమముగా ఆఱు పద్యములందును ఆయా ఋతువులందు పాండురంగని మూర్త్యర్చనము చేయు విధానము చెప్పఁబడుచున్నది.] వనధివనధామున్ = సముద్రమందలి . జలము నివాస

1. చ. శిఖర; 2. క. ఖండశర్కర. చ. కండచక్కెర. 3. చ. తోడ. 4. చ. ములు.
5. చ. చరని.

ముగా: గలవానిని; పీతాంబరునిక్ = పచ్చపట్టుబట్ట ధరించువానిని; రమా......విలిప్తుక్ = లక్ష్మీదేవి స్తనములమీఁదిగంధపు రేణువులచేత పూయఁబడినవానిని; [ఇచట 'రజస్' శబ్దమునకు 'రజ' అని స్వతంత్ర ప్రయోగము.] శిఖిబర్హధరుక్ = నెమిలిపింఛెము ధరించువానిని; మఖాంశభోక్తక్ = యజ్ఞభాగ మును భుజించువానిని - విష్ణువును; పూజింపఁబగున్;

సీ. గంగఁ గాటుకకొండఁ గప్పు నొప్పిద మిం ద[1]ళ్కొత్త నావులపాల నోలలార్చి
బలితంపునురవుజొంపము ధార్తరాష్ట్రంబుఁ జుట్టిన క్రియఁ దెల్లపట్టుఁగట్టి
ముదురువెన్నెలయొప్పు మున్నీటిఁ గమిచి పట్టినలీలఁ [2]గ్రాలఁ జందనముఁ బూసి
వడగండ్లుపాదువు శాద్వలమహిఁ బోల్చు పొల్పుగ మల్లెపువ్వులఁ బూజచేసి

తే. మందువేసవి వాసవి మనుపుకాఁపు, విబుధతతిపాలి [3]పీడర వెల్లమ్రాఁకు
భక్తసులభునిఁ దెలచి పూర్వోక్తభూరి,భక్ష్యభోజ్యాదు లర్పింప భద్ర మొదవు.

టీక. గంగక్ = గంగచే; కాటుకకొండక్ = అంజనాద్రిని; కప్పు నొప్పిదము = కప్పిన రీతి; తళ్కొత్తక్ = ప్రకాశింపఁగా; ఓలలార్చి = అభిషేకముచేసి; నల్లని శ్రీకృష్ణునికి, తెల్లని ఆవుల పాలతో అభిషేకము చేయఁగా - స్వచ్ఛమైన గంగాప్రవాహముచే నల్లని యంజనాద్రిని కప్పినట్లున్న దని భావము. బలితంపునురువురొంపము = పెద్దనురుగుమొత్తము; ధార్తరాష్ట్రంబుఁజుట్టినక్రియక్ = నల్లని కాలు, ముక్కులుగల హంసను చుట్టుకొన్నట్లు; [కృష్ణుఁడు ధార్తరాష్ట్రమువలెను, అతనికిఁగట్టిన తెల్లపట్టువస్త్రము నురుగుజొంపమువలెను ఉన్నవనుట:] ముదురువెన్నెలయొప్పు = పండువెన్నెల తేట; మున్నీటిక్ = సముద్రమును; కమిచి = ఆక్రమించి; చందనముక్ = మంచిగంధమును. [పాండు రంగఁడు సముద్రమువలె నల్లఁగను, అతనికిఁ బూసిన చందనము సముద్రముపై వ్యాపించిన పండు వెన్నెలవలెను ఉన్నవని భావము.] వడగండ్లు పాదువు = వడగండ్లు వ్యాపించిన - పడిన; శాద్వల మహిక్ = పచ్చికనేలను; పోల్చుపొల్పుగక్ = అనుకరించురీతిని; [కృష్ణుఁడు పచ్చికబయలువలెను, మల్లెపూలు వడగండ్లవలెను ఉన్నవని భావము.] వాసవిమనుపుకాఁపుక్ =అర్జున రక్షణము సేయువానిని- అర్జునునికాపాడువానిని; విబుధతతిపాలి పీడరతెల్లమ్రాఁకుక్ = దేవతలపాలిటి ముంగిటికల్పవృక్షమును; తెలచి = తృప్తిపొందించి; పూర్వోక్తభూరిభక్ష్యభోజ్యాదులు = వెనుకఁ జెప్పఁబడిన ఆరగింపులను; అర్పింపక్ = ఈయఁగా - నివేదనచేయఁగా; భద్రము = శుభము; ఒదవుక్ = కల్గును. అలం. ఉపమ.

సీ. వృష్టిగా శుద్ధాంబువేణి మజ్జనమార్చి శిఖరిమేఘముగ [4]మంజిటిని ఘటించి
కరకపాతంబుగ విరిగొజ్జఁగలఁ బూన్చి క్షమపంకిలతగఁ గుంకుమముఁ బూసి
[5]మఘవగోపములుగా మణిహార మర్పించి పలుమెఱుంగులుగ [6]దీపమ్ము లెత్తి
గర్జితంబులుగ శంఖక్వాణములు చూపి పచ్చికగా ధూపపటలిఁ బెనిచి

తే. యుత్పిబంబులు భుక్తిగా నుష్ణతైల,శర్కరగుడమిశ్రపిష్టసూపపరమాన్న
రాసు లొసఁగంగఁదగుఁగారురాకహరికి, నట్టి ఋతుధర్మములుచూపునంద మొంద.

టీక. వృష్టిగాక్ = వర్షముగా; శుద్ధాంబువేణిక్ = తేటనీటిధారచే; మజ్జనమార్చి =స్నానము చేయించి; శిఖరిమేఘముగక్ = కొండపైనున్న మేఘముగ - మేఘమట్లు; మంజిటిక్, ఘటించి = నీల వస్త్రమును కట్టి; [ఇచట 'మంజిడి = పీతాంబరము' అని పూర్వటీకయందు అర్థమీయఁబడినది; ఈ యర్థము నిఘంటువులలో లేదు; ప్రకృతమునకును సరిపడదు.] కరకపాతంబుగక్ = వడగండ్లుపడు టగా; విరిగొజ్జఁగలక్, పూన్చి = వికసించిన పన్నీటిపువ్వులను ధరింపఁజేసి; క్షమపంకిలతక్ = నేల

0. చ. శ్కొత్తు .2. చ. గాఁగ. 3. చ. పీదర. 4. క. మంజిడి. చ. మంజిటి. 5. చ. మఖవ. 6. చ. దీపకము.

ఖురదగా; మఘవగోపములుగాన్ = ఇంద్రగోపములుగా - ఆరుద్రపురుగులుగా; [ఇచట 'పట్టుపురుగులు' అని పూర్వటీక.] పలుమెఱుంగులుగన్ = పెక్కుమెఱుపులుగా; దీపమ్ములు, ఎత్తి = దీపము లుంచి; గర్జితంబులుగన్ = ఉఱుములుగా; శంఖక్వాణములు, చూపి = శంఖములను ధ్వనింపఁజేసి - పూరించి; ధూపపటలిన్ = ధూపములగుంపును; పెనిచి = వృద్ధిపొందించి; ఉత్పిబంబులభుక్తిగాన్ = చాతకములకాహారమగు వాననీటిగా; ఉష్ణ.....రాసులు = కాచిననూనెయందు వండఁబడిన బెల్లము కలిపిన పిండివంటలు, పప్పు, పరమాన్నములసమూహములను; హరికిన్ = విష్ణువునకు, కారురాకన్ = వర్షాకాలమువచ్చునపుడు; చూపునందము, ఒందన్ = కన్నులపండువు కలిగింపఁగా; ఒసఁగంగదగున్ = ఈయఁదగును. అలం. రూపకము.

సీ. మహిఁ జాలఁ బాఁడి ముమ్మరముగాఁ బ్రభవింప నవనవోజ్జ్వలదధిస్నానవిధియు
శుభ్రాభ్రపటలంబు లభ్రంబుపైఁ బర్వ లఘుధౌతవిమలచేలములకప్పు
[1]సితకుశేశయకాశ[2]సితకరద్యుతి హెచ్చ దొరకిన యుచితంపువిరులపూజ
శాలిపాకస్ఫూర్తి [3]గ్రాల గోరోచనాసమ్మిశ్రచర్చిక్యసంఘటనము
తే. ప్రజ భుజాభోజనములు క్రొంబంటవంటకములు గావింప గోధూమఖండఖండ
శర్కరాఢ్యసుపక్వభోజ్యములు నెరపి, విష్ణుఁ బూజింపఁదగుశరద్వేళయందు. 111

టీక. ముమ్మరముగాన్ = సమృద్ధిగా; ప్రభవింపన్ = కలుగఁగా; నవ.....విధియున్ = మిక్కిలిక్రొత్తదై (అప్పుడే చేసి) ప్రకాశించు పెరుగుతో స్నానముచేయించుటయు; శుభ్రాభ్రపటలంబులు = తెల్లనిమేఘములగుంపులు; అభ్రంబుపైన్ = ఆకాశముపయిని; పర్వన్ = వ్యాపింపఁగా; లఘు.....కప్పు = తేలికయై తెల్లనైన మడుగుబట్టలచేఁ గప్పుటయును; సిత.....ద్యుతి = తెల్లతామరపూవు, రెల్లు, చంద్రులయొక్క కాంతివంటి కాంతి; హెచ్చన్ = ఎక్కువకాఁగా; దొరకిన = లభించిన; ఉచితంపువిరులపూజ = తగినపూవులతో పూజించుటయు; శాలిపాకస్ఫూర్తి = వరిపంటయొక్క ప్రకాశము; గ్రాలన్ = ప్రకాశింపఁగా; గోరోచనా.....సంఘటనము = గోరోచనముతోఁగూడిన మైపూఁతపూయుటయును; ప్రజ = జనము; భుజాభోజనములు = మృష్టాన్నభోజనములు - బువ్వపుబంతిభోజనములు; క్రొంబంటవంటకములు = క్రొత్తగా పండిన పంటలతోఁ దయారుచేసిన వంటలు; కావింపన్ = చేయఁగా; గోధూమ .....భోజ్యములు = గోధుమనూక, కండచక్కెఱలు కలిపి బాగుగా వండిన పిండివంటలు; నెరపి = అధికముగా అర్పించి; శరద్వేళయందున్ = శరదృతువున; విష్ణుఁ బూజింపఁదగున్.

సీ. పాథోధివిహృతిసంభవతనూజాడ్యంబు సంతప్తగోఘృతస్నపనరచన
దులసి దండయకాని కలుగనితక్కువమరువకకుందకుట్మలసమృద్ధి
కఠినకచ్ఛర[1]పీతకౌశేయనిర్బంధ మభిరామచిత్రాంబరార్పణమున
ముదురువెన్నెలఁ జేయు నుదరపోషణవృత్తి నవ్యదివ్యాన్నపానప్రశస్తి
తే. నుజ్జగింపించి డెందాన కుబ్బొనర్చి, నిశలఁ గుంకుమ[2]మగులు మైనిండ నలఁది
గేహమునధూపధూమ మెక్కించికుధర,ధరుని హేమంతమునఁగొల్వదొరకుముక్తి.

టీక. పాథోధి.....జాడ్యంబున్ = సముద్రమున విహరించుటవలన పుట్టిన దేహముయొక్క మందత్వమును, నీటిస్వభావమును (శైత్యమును); సంతప్త .......రచనన్ = కాఁచిన ఆవునేతితో స్నానముచేయించుటచేతను; కలుగని = ఎక్కువదొరకని; తక్కువన్ = లేమిని; మరువక... ...సమృద్ధిన్ = మరువము, మల్లెమొగ్గలు అనువానిసంపదచేతను; కఠిన.....నిర్బంధము=ముదుకరై

1. శత. 2. చ. శశధర. 3. చ. గ్రాలు.

ముఱికిఱైన పచ్చపట్టుబట్టకట్టుటయు; అభిరామచిత్రాంబరార్పణమునన్ = మనోహరమైన చిత్రవర్ణ వస్త్రముల నిచ్చుటచేతను; ముసురువెన్నెలన్ = ముదిరినవెన్నెలతో - అమృతముతో; ఉదరపోషణవృత్తిన్ = పొట్టనింపుకొనుట; నవ్య.....ప్రశస్తిన్ = క్రొత్తవైమనోజ్ఞములైన అన్నపానముల అర్పణమునను; ఉజ్జగించి = విడుచునట్లుచేసి; డెందానకున్ = మనస్సునకు; ఉబ్బు = సంతోషమును; ఒనర్చి = కల్గించి; నిశలన్ = రాత్రులందు; అగులు = అగరుగంధమును; మైనిండన్ = శరీరమంతటను; అలఁది = పూసి; గేహమునన్ = దేవాలయమునందు; ఎక్కించి = వ్యాపింపఁజేసి; కుధరధరునిన్ = గోవర్ధనపర్వతమునెత్తిన విష్ణుని; ముక్తి = మోక్షము; దొరకున్ = లభించును.

క. శిశిరాగమవాసరముల, యశోద గారాబుపట్టి నర్చింపఁదగున్
శశిముఖి! తత్కాలోచిత,కుశకుసుమపటాంగరాగకూర్పాసాదిన్. 113

టీక. శిశిరా.....రములన్ = శిశిరర్తుదినములందు; తత్కా.....సాదిన్ = ఆకాలమునకు తగిన కుశలు, పూలు, వస్త్రములు, గంధము, చొక్కాయి మొదలగువానిచే.

క. ఋతువుల నాఱిట నీక్రియఁ, బ్రతిదినము భజింపఁ బరమపదనాథుఁడు వాం
ఛితశతము లొసఁగి భక్తప్రతతుల మన్నించు భక్తపరతంత్రుండై. 114

టీక. ఈక్రియన్ = ఈరీతిని; పరమపదనాథుఁడు = విష్ణువు; వాంఛితశతములు = నూరుల కొలఁది కోరికలను; ఒసఁగి = నెరవేర్చి; భక్తపరతంత్రుండై = భక్తులయెడ ప్రేమకలవాఁడయి; భక్తప్రతతులన్ = భక్తులసమూహములను; మన్నించున్ = గౌరవించును.

తే. మురవిభంజను శ్రీక్షేత్రమూర్తి తీర్థ,మూర్తి మూర్తులకడ నేమమున నొనర్చు
నర్చభాగవిశేషంబు లానుపూర్వి, వినుము వినిపింతుఁ బరమాణువిభవమధ్య!

టీక. మురవిభంజను = మురాసురుని సంహరించిన శ్రీవిష్ణునియొక్క; శ్రీక్షేత్ర.....కడన్ = క్షేత్ర, తీర్థ, మూర్తిరూపములయొద్ద; నేమమునన్ = నియమముతో; ఒనర్చు = చేయునట్టి; అర్చభాగవిశేషంబులు = పూజాభాగవిశేషములను; [అర్చా - అనుటకు అర్చయనది స్వతంత్రప్రయోగము; ఆనుపూర్విన్ = క్రమముగా; పరమాణువిభవమధ్య! = పరమాణువువంటి నడుము - సన్నని నడుముగల పార్వతీ!

తే. పరమపదనాథుఁ దిరిగిరా నిరువదేను,చేతుల ప్రమాణమునఁ గల్గు[1]భూతలంబు
ముక్తికరియైన శ్రీక్షేత్రమూర్తియందు, నర్చభాగమ్ము సుమ్ము చంద్రార్ధనిటల!

టీక. చంద్రార్ధనిటల! = అర్ధచంద్రునివంటి నుదురుకల పార్వతీ! పరమపదనాథున్ = విష్ణుని; తిరిగిరాన్ = చుట్టితిరిగి - ప్రదక్షిణముచేసి వచ్చుటకయిన; ఇరువదేనుచేతుల = ఇరువదియైదుమూరల; ప్రమాణమునఁగల్గు = వెడల్పుగల; భూతలంబు = ప్రదేశము.....అనఁగా విష్ణువునకుఁ బ్రదక్షిణము చేయుటకనువైన యిరువదియైదు మూరలవెడల్పుగలస్థలము అంతయును; ముక్తికరి = మోక్షమిచ్చునది; అర్చభాగంబుసుమ్ము! = పూజింపఁదగిన భాగమగునుసుమీ! పాండురంగని యాలయముచుట్టునుగల ౨౫ మూరల ప్రదేశమున నెచట పూజించినను అది అతనిక్షేత్రమూర్తిని పూజించినట్లే యగును.

క. సకలోత్కృష్టోన్నతిఁ బాయక యెయ్యది కీర్తివడయు నత్తీర్థము బా
ల్తుక! యర్చాభాగంబై, యకుటిలమతిఁ దీర్థమూర్తియందు వెలుంగున్. 117

టీక. సకలోత్కృష్టోన్నతిన్ = తీర్థములన్నిటియందును మిక్కిలిగొప్పతనమును; పాయక = విడువక; కీర్తివడయున్ = పేరుపొందునో; అకుటిలగతిన్ = వక్రముకాని - ఋజువైనపద్ధతిని; బాల్తుక! = పార్వతీ! [బాలఁతుకయనుట కిది స్వేచ్ఛాప్రయోగము.]

1. చ. పీఠ. 2. క. మగలు. చ. మగులు. 1. చ. శ్రీజలంబు.

క. ఏ నేల మూర్తియం దశ్వానియమవిభాగమునఁ బ్రశస్తంబగు నా
స్థానము నర్చింపక యే, శ్వానికిఁ దాఁ జేయు పూజ వమ్ముగుఁజువ్వీ! 118

టీక. ఏనేల = ఏచోటు; మూర్తియందుఁ = పాండురంగనిస్వరూపమున; ఆ స్థానముఁ = ఆ ప్రదేశమును—పాండురంగనినివాసస్థలమును; వమ్ము = వ్యర్థము.

వ. కావున క్షేత్రమూర్తి, తీర్థమూర్తి, మూర్తిమూర్తులయందలి యర్చాభాగంబు లెఱింగి [1]యర్చించుచు నకుచితా[2]చరణంబులకు విముఖుండగు పుణ్యనిధికి సుముఖుండై [3]పాండురంగం డఖండానందం బాపాదించు నని యా పరమేశ్వరుండు పార్వతితో వెండియు నిట్లనియె. 119

టీక. అనుచితాచారములకుఁ, విముఖుండగు = తగని - దురాచారములపొంత పోని; పుణ్యనిధికిఁ = పుణ్యాత్మునకు సుముఖుండై = అనుకూలుఁడై; ఆపాదించును = కలుగఁజేయును.

మ. హరిపశ్చాద్దిశ నూఱువిండుల ప్రమాణాసక్తికల్మిఁ శుభో
[4]త్కరసద్మంబగు పద్మతీర్థమును తీర్థం బొప్పు నచ్చోన సు
స్థిరతఁ శంఖము పద్మమున్నిధులు వర్తించుం దపోదీపితుల్
నరనారాయణు లున్నవాఁ డట గలా! పిప్పలాకారులై. 120

టీక. హరిపశ్చాద్దిశఁ = పాండురంగనికి పడమటిదిక్కున; నూఱువిండుల ప్రమాణాసక్తి కల్మిఁ = నూఱువిండ్లలోతుకలిగి శుభోత్కరసద్మంబగు = శుభములకు స్థానమైన; ['శుభోత్కర పద్మంబు = శుభసమూహములనెడి పద్మములుకలది' అని పూర్వటీక;] సుస్థిరతఁ = స్థిరముగా; శంఖము, పద్మముఁ, నిధులు = నవనిధులలోనివైన శంఖము, పద్మము అనునవి. [మహాపద్మము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము అనునవి తక్కిన నిధులు.] తపోదీపితుల్ = తపస్సుచే ప్రకాశించుచున్నవారై; పిప్పలాకారులై = రావిచెట్టురూపు ధరించినవారై.

సీ. సమధికజ్ఞాన విభ్రమముతోఁ గూడంగ హరిమేన నవతారమైనవారు
మదము [5]మోహని సింధుమునసుతోఁ గూడంగ బ్రహ్మవర్గము చిక్కఁబట్టువారు
పరపురుషార్థసంపదతోడఁ గూడంగ ధనురాదిశస్త్రముల్ దాల్చువారు
దుష్టనిగ్రహవిధాధురతోడఁ గూడంగ బుధరక్ష [6]తిన్ననై గాఁ బూనువారు
తే. మహితగాంభీర్యధైర్యసామగ్రితోడఁ, గూడ సౌజన్యరమఁ గూడి యాడువారు
ఘప్రపతిబింబవిభుల సత్ప్రసవ, కరచనిర్భేదనుబు భువ ధవళనయన! 121

టీక. నర, నారాయణులను మునీశ్వరు లీ పద్యమున వర్ణింపఁబడుచున్నారు. సమధికజ్ఞాన విభ్రమముతోఁ = మిక్కిలి యెక్కువైన జ్ఞానముయొక్క విలాసముతో; హరిమేనఁ = విష్ణువు దేహమునుండి; అవతారమైనవారు = అవతారపురుషులుగా వచ్చినవారు; [నరనారాయణులు కృష్ణార్జునులనియు, వారు భగవంతుని అవతారములనియు పురాణగాథ] చిక్కఁబట్టువారు = పూర్తిగా పరిగ్రహించినవారు; పరపురుషార్థసంపదతోడఁ = ఉత్తమపురుషార్థమగు మోక్షపుసంపదతో దుష్ట... ...తోడఁ = దుష్టులను శిక్షించుటయను (బాధ్యత) బరువుతో; కూడంగఁ = కలిపి; బుధరక్ష; తిన్నఁగాఁ = యుక్తముగా; పూను వారు=వహించువారు; సౌజన్యరమఁ = మంచితనపుకలిమిని ఘప్ర

---

1. చ. యర్చింపుచు. 2. క. చరణవిముఖుండగు. చ. చరణంబులకు విముఖుండగు. 3. పాండురాంగుం. 4. క. తర్కపద్మం చ. త్కరసద్మం. 5. క. వోవగ. చ. బోవగ. ట. మోహని. 6. తిన్నగా. శ. ర. సూర్య. ఖోన్నతి. క.

ప్రతిబింబనిభులు = సూర్యబింబమును బోలినవారు; సహస్రకవచకవచనిర్భేదనులు = కర్ణునికవచమును భేదించినవారు - కర్ణునికి శత్రువులు; అలం. సహోక్తి, ఉపమ.

క. ఏపట్టునఁ జూపట్టుదురు, ఆపట్టున సూర్యకోటు లమరాంగన ల
ష్టాపదపాత్రనిహితమణిదీపకళిక లగుచు శ్రీహరి భజింపుటకై. 122

టీక. ఆపట్టునన్ = అక్కడ; ఏపట్టునన్ = ఏస్థలమునందైనను; అమరాంగనలు = దేవతాస్త్రీలు; అష్టాపద......కళికలు = బంగారుపళ్లెరములయందు ఉంచఁబడిన మణిదీపములు కలవారు; చూపట్టుదురు = కన్పించుదురు.

ఉ. దోశ్శమితారి శౌరి తనతోడ్విన కుండలముల్ జక్రమాం
తశ్శిలలోన దాఁపఁ బ్రమదా! యొకతీర్థము కుండలాఖ్యమై
దుశ్శకునాదిసంజనితదోషశతంబు హరింపఁజేయు నం
భశ్శుచితన్ బ్రసిద్ధముగఁ బన్నగశాయికి నీశదిక్కునన్. 123

టీక. ప్రమదా! = పార్వతీ! దోశ్శమితారి = భుజశక్తిచే నశింపఁజేయఁబడిన శత్రువులు కలవాఁడైన; తనతోడ్విన = తాను ధరించిన; [తొడవిన - అనుటకు 'తొడ్విన' స్వాతంత్ర్యప్రయోగము.] నిజ.....లోనన్ = తన నివాసభూమిలోని రాతియందు; కుండలాఖ్యమై = కుండలతీర్థమను పేరు కలదై; దుశ్శకు.....శతంబున్ = చెడ్డశకునము మొదలగువానివలనఁ గలుగు నూరులకొలఁది దోషములను; అంభశ్శుచితన్ = తీర్థజలపరిశుద్ధిచేత; ఈశదిక్కునన్ = ఈశాన్యభాగమున.

క. వరసింహమధ్య! యచ్చో, నరసింహుఁడు కుంజరాశనతఁ దాల్చుట [1]య
చ్చెరు వద్దేవుఁడు నిజమంత్రపూజనైకాగ్రతాయుతుఁ బ్రోచున్. 124

టీక. వరసింహమధ్య! = సింహరాజముయొక్క మధ్యమువంటి మధ్యముకల పార్వతీ! కుంజరాశనతఁ దాల్చుట = రావిచెట్టురూపుధరించుటయు, ఏనుఁగును భుక్తిగా గ్రహించురూపమును (సింహరూపమును) ధరించుటయు;) [ఇచట 'కుంజరాశనతన్ = అశ్వత్థముచేత' అని పూర్వటీక; అది సరి కాదు.] అచ్చెరువు = ఆశ్చర్యము. నరసింహుఁడు సింహస్వరూపుఁడగుటచే గజభోక్తృత్వమును పొందుట సహజమే కాని యాశ్చర్యము కాదు; ఇచట విరోధము; అయినను 'కుంజరాశనతఁ దాల్చుట = రావిచెట్టురూపుదాల్చుట' అను శ్లేషమూలకార్థాంతరమును గ్రహించుటవలన ఆ విరోధము పోవును. అద్దేవుఁడు = ఆనరసింహుఁడు; నిజ.....తాయుతున్ = తన మంత్రమును పూజించుటయందు ఏకాగ్రత(పట్టుదల) కలవానిని; ప్రోచున్ = కాపాడును. అలం. విరోధాభాసము.

క. ఓరాజవదన! యచటను, నీరాజన *కుబ్జనాభునికి నీనున్నా
రేరాళము హరివల్లభ; లారామలఁ గొల్వవలయు నయకాములకున్. 125

టీక. ఓరాజవదన!=చంద్రునింబోలు ముఖము కల పార్వతీ! నీరాజనలు=హారతులు; ఏరాళము=లెక్కకుమిక్కిలిగా; హరివల్లభలు = విష్ణుప్రియలు; ఈనున్నారు = ఈయ సిద్ధముగనున్నారు. ఆ రామలన్ = ఆస్త్రీలను; అయకాములకున్ = శుభములుకోరు వారికి; [కోరువారని యభిప్రాయము.] కొల్వవలయున్.

శా. అంశేందూద్వహ దేవి! ప్రేంకృతిధుర్యంబై యొప్పు [2]యచ్చోటికిన్
త్రింశచ్చాపమితో[3]ర్వి నుత్తరమునం దీపించు తీర్థంబు మున్

1. క. నచ్చెరువ. చ. యచ్చెరువద్దే. * శ. ర. మబ్జ. క. లబ్జ. 2. క. నచ్చో. ట. యచ్చో.
3. ట. యంతోర్వి.

భ్రంశం బొందక వెన్కఁ దత్సలిలధారన్ గూడెఁ బుష్పావలీ
సంశుద్ధాంబువు; లాయెడం దగు జపస్నానార్హదానక్రియల్. 1[illegible]

టీక. అంకేందుద్వహదేవి ! = చంద్రకళను వహించిన శివునికి (నాకు) భార్యవైన పార్వతీ! హ్రీంకృతిధ్రువంబై = హ్రీంకారబీజముతో స్థిరమై; త్రింశచ్చాపమితోర్వి న్ = ముప్పదివిండ్లదూరమున; తీర్థంబు = ఒకానొకతీర్థము; దీపించున్ = ప్రకాశించును; భ్రంశంబు, ఒందక = పాడై పోక; వెన్కన్ = పిదప; తత్సలిలధారన్ = ఆ తీర్థపుసెలిప్రవాహముతో; పుష్పావలీసంశుద్ధాంబులు = పూలతో పవిత్రమైన జలములు; ఆ యెడన్ = అచ్చోట; జపస్నానార్హదానక్రియల్ = జపము, స్నానము, తగినదానములు మొదలగు పనులు; తగున్ = చేయఁదగును.

సీ. భరమూనుతఱిఁ దోడుపడ వచ్చుగతిఁ గేళితోఁ గరమూలజద్యుతులు సాఁగ
నెలకులంబులచల్వ నేర్చు నవార్కాంశు లన గపోలముల దీపాంశు లంటఁ
గొడిఁ[1]బుట్టుకాళిమాంకురపు మేఘములకు మెఱుఁగులై చూపు గ్రొమ్మించు లలర
స్నేహంబు పాత్రనిక్షిప్త [2]మగుటకు నుబ్బుపగిదిఁ బొలుపొందు నిబ్బరము[3]నిక్క

తే. [4]హరికి బలువంకలను దగ నగ్రవీథి, నిలిచి శతకోటిసంఖ్యల నియమపరత
నారతు లొసంగు దివ్యకన్యకలు ధన్యమతులు క్రీడింతు రయ్యుత్తమస్థలమున.

టీక. భరము, ఆనుతఱిన్ = ఆరతిపళ్లెరముల బరువును మోయునప్పుడు; కేలితోన్ = విలాసముతో; కరమూలజద్యుతులు = చంకల నిగనిగని వెలుఁగులు; సాఁగన్ = వ్యాపింపఁగా; నెలకులంబులచల్వన్ = చంద్రసమూహముల చల్లఁదనమును; నేర్చు = అభ్యసించు; నవార్కాంశులనన్ = క్రొత్త (ఉదయకాలపు) సూర్యకిరణములో యనునట్లు; కపోలములన్ = చెక్కిళ్లపయి; దీపాంశులు = ఆరతిచ్చు దీపములకాంతులు; అంటన్ = అంటుకొనఁగా; కొడిఁబుట్టు = దీపపు చివఱిభాగమున పుట్టు; కాళిమాంకురపు మేఘములకున్ = నల్లఁదనపు మొలకలనెడి మేఘములకు; మెఱుఁగులై = మెఱుపులై; చూపుఁగ్రొమ్మించులు = చూపు లను క్రొత్తమెఱుపులు; అలరన్ = ప్రకాశింపఁగా; స్నేహంబు = నూనె, మైత్రియు; పాత్రనిక్షిప్తమౌటకున్ = తగిన ప్రమిదయందుంచుటకును, తగినవారియెడ నుంచుటకును; ఉబ్బుపగిదిన్ = పొంగునట్లు; నిబ్బరమునిక్కన్ = మిక్కిలియుబ్బఁగా; హరికిన్ = విష్ణువునకు; పలువంకలను = అన్నివైపులను; అగ్రవీథిన్ = ఎదుటను; నియమపరతన్ = నియమమందలి ఆసక్తితో; అలం. ఉపమ.

ఉ. [5]గోపిక యోర్తు తొల్లి హరిఁ గూర్చి తపం బొనరింప దాని ని
ష్ఠాపరతన్ మదిం గరఁగి శార్ఙ్గి యొఁ దోఁచినఁ జూచి వేడ్కతో
నా పసిగాఁపుపూపవయసాకె త్రిలోకవిమోహనక్రియా
రోపనిరూపణం బగు సరోరుహలోచనురూపుఁ జూచుచున్. 1[illegible]

టీక. ఓర్తు = ఒకతె; తొల్లి = పూర్వము; దానినిష్ఠాపరతన్ = ఆమెనియమమునందలి ఆసక్తివలన; మదిన్, కరఁగి = మనస్సున జాలిపొంది; తోఁచినన్ = ప్రత్యక్షము కాఁగా; ఆ, పసిగాఁపుపూపవయసాకె = పసులనుగాచు చిన్నిపయసాడి - గొల్లపడుచు; త్రిలోక......నిరూపణంబగు = మూఁడులోకములను మోహింపఁజేయుటను రూపించు; సరోరుహలోచనురూపున్ = విష్ణునిస్వరూపమును; చూచుచున్; తరువాతిపద్యముతో సమన్వయము.

---

1. చ. బుట్ట. 2. క. మాటకునుబ్బ. 3. చ. నిక్క. 4. చ. హరిసెలవంకబలువంక. ట. హరికి సెలవంక. 5. చ. గోపిని.

దానవు; అఖిల......తాంగివిన్నై = నగలన్నింటితో నలంకరింపఁబడిన దేహము కలదానవును అయి; ఉండుము.

**తే.** అదియు నట్లు యగుచు నభిరామమూర్తియై, తనపసిండిజడలు దలఁగఁ ద్రోచి
యానతార్ధ[1]మూర్తియై క్షేత్రముఁ కు నీ, శాన్యమున వసించుఁ [2]జంద్రవదన !

టీక. అదియుఁ = ఆ గోపకన్యయును; అభిరామమూర్తియై = మనోహరమైన దేహముకల దయి; తనపసిండిజడలు = తనజడగంటలు (జడవేసికొనునప్పుడు ఉపయోగించునవి) తలఁగఁద్రోచి = విడిచిపెట్టి; అనతార్ధమూర్తియై = సగముశరీరము వంచినదై - వంగి యున్నదై.

**క.** ఆమహనీయక్షేత్రశిఖామణిపైఁ బినపుఁ బర్వెఁ గామిని! నానా
భూములను నిగిడి మదగజ, భైమి బహుళలహరిగహనభయదాకృతియై. 133

టీక. ఆ, మహ......మణిపైఁ = క్షేత్రరాజమగు నా పాండురంగక్షేత్రముపై; నానా భూములను = అన్నిభూముల (ప్రదేశముల) యందు; నిగిడి = చొచ్చి; మదగజభైమి = మదించిన యేనుఁగులకును భయముకొల్పునది - భైమీనది; బహుళలహరి గహనభయదాకృతియై = ఎక్కువైన ప్రవాహములను నడవిచే భయమును కల్గించు నాకారముకలదయి; పర్వెఁ = వ్యాపించెను.

**సీ.** జడధి చల్లిన గందవొడి నేత్రములఁ బడ్డగతిఁ [3]దామరల పరాగంబు గ్రమ్మఁ
[4]దదితర క్షేత్రముల్ తమయందు నిలుమన్న నొడ్డించుటలువోలె [5]నూర్మి లెసఁగఁ
బంకదంభమునఁ బాప[6]ముల మ్రింగిన నీటి పెద్దనవ్వులలీల ఫేన [7]మలరఁ
బెఱవాహినులమీఁదఁ బెరిగిన మత్సరావేశంబు లన గ్రాహవికృతు లడర

**తే.** [8]భానుభూమైక జనిభూమి భైమి నడచి, యన్మహాక్షేత్ర మఁట దాసి యధికభీతిఁ
జొరక గిరిరుద్ధగతి యైనకరణి ఘూర్ణ, నంబు నొందుడు శ్రీజగన్నాథుఁ డెఱిఁగి.

టీక. జడధి=జలధి-సముద్రముఁ; పరాగంబు=పుప్పొడి; తమయందుఁ, నిలుమన్నఁ=తామున్న చోట్లయందు నిలువవలెనని బలిమాలఁగా. ఒడ్డించుటలువోలెఁ = దాఁటిపోవుటలువలె, [ఒడ్డించుటలు= చాఁగించుటలు అని పూర్వటీక.] ఊర్ములు = అలలు; ఎసఁగఁ = ప్రకాశింపఁగా, పంకదంభమునఁ= బురదయొక్క బొద్ధత్యమున; నీటిపెద్దనవ్వులలీలఁ = నీటియొక్క అట్టహాసములవలె; ఫేనము, అలరఁ = నురుగు ప్రకాశింపఁగా; మత్సరావేశంబులు = ఈర్ష్యయొక్క ఆక్రమణములు - ఈసు కలుగుటలు; గ్రాహవికృతులు = జలచరముల వికారములు; అడరఁ = వ్యాపింపఁగా; భాను...... భూమి = శివుని స్థానము జన్మస్థలముగాఁగలది - శివునివలన ఏర్పడినది. ['సూర్యునియొక్క (లేక) ప్రకాశములయొక్క అధిక్యమునకు ముఖ్యమయిన జన్మస్థానము' అని పూర్వటీక.] నడచి = కదలి - ప్రయాణముచేసి; అధికభీతిఁ = మిక్కిలి భయముతో; చొరక = (క్షేత్రమును) ప్రవేశింపక; గిరి రుద్ధగతియైనకరణిఁ = కొండచే అడ్డుకొనఁబడినదానిరీతిని; ఘూర్ణనంబుఁ, ఒందుడుఁ = తిరిగుడుఁ బాటును (వెనుకకు మళ్లుటను) పొందఁగా; శ్రీజగన్నాథుఁడు=విష్ణువు: ఎఱిఁగి=తెలిసికొని; అలం.ఉపమ.

**ఉ.** ఏటిఁ గుఱించి పల్కు విను మేటికి నీభయ మో శుభాంగి! యొ
ప్పాట భవత్సమాన మగుపాటి సరిన్నికరంబు లేదు ; వాః
పాటన మొప్ప మత్పదముపైఁ బ్రవహింపు మదాజ్ఞ నన్న న
చ్చోట సపాటమై కడలిజోటియుఁ గొల్వె నిజప్రవాహమున్. 135

1. చ. ట. ధాత్రి. 2. చంద్రవదన. 3. చ. దామెర. 4. క. తదిత. 5. చ. నొరుగు. 6. చం ములు. 7. క. మమర. చ. మలర. 8. చ. భామ.

టీక. ఎప్పాటన్ = ఏవిధమునను; భవత్సమాసమగుపాటి = నీతోసరియగు ప్రమాణముగల; సరిన్నికరంబు = నదీసమూహము; లేదు; మదాజ్ఞన్ = నా ఆజ్ఞవలన; మత్పదముపైన్ = నా అడుగు పయి; వారిపాటవము, ఒప్పన్ = జలసమృద్ధి ప్రకాశింపఁగా; సపాటమై = మట్టముయి. కడలిజొత్తియున్ = సముద్రమునకుభార్యయగు భైమీనదియు; నిజప్రవాహమున్ = తనపొరుదలను, అచ్యోటన్ = అవిష్ణుపాదమున; కొల్పెన్ = వ్యాపింపఁజేసెను.

తే. క్షేత్రమున భైమి నిల్చి పొల్చిన ప్రదేశ,మున జనాభీష్ట[1]దమును నాద్యమును జతుర్ము
ఖాదిసేవ్యంబు నగు నృసింహాఖ్యతీర్థ, మమరుఁ [2]ద్రింశద్ధనుఃప్రమాణమున మెఱసి.

టీక. జనాభీష్టదము = జనులకోరికలను నెఱవేర్చునది; ఆద్యమును = మొదటిదియు - ప్రధానమైనదియు; చతు......సేవ్యంబున్ = బ్రహ్మాదులచే సేవింపఁబడునదియు; త్రింశ...... ప్రమాణమునన్ = ముప్పదివిండ్లపొడవున; మెఱసి = ప్రకాశించి; అమరున్ = వెలయును.

సీ. ఉక్కుఁగంబము [3]వ్రచ్చి యుదయించె నేదేవుఁ డరణి నుద్భవ[4]మొందు నగ్నికరణి
వాలారుగోర [5]వెన్గాలాము చేసె నే జేజే *హిరణ్యాసుశిశుకమునకు
భక్తివృద్ధుఁడుగాఁగఁ బాటించె నేవేల్పు ప్రహ్లాదుఁ గడుఁ బాలపండ్లవాఁడ
నిజసింహతకుఁ దగ సుజనహృద్గుహలందుఁ గ్రీడించె నే త్రిలోకీనియంత

తే. యా నృహర్యక్షవర్యుండు యక్షపక్షి, ఖచరగంధర్వకిన్నరగ్రామణీశి
రోమణి [6]నిఘృష్టచరణసరోజుఁ డందు, నుండు ముప్పదిరెండు[7]బాహువులు గలిగి.

టీక. ఉక్కుఁగంబము = ఉక్కుతోఁజేయఁబడిన - లేదా - ఉక్కువలెగట్టిదగు స్తంభమును; వ్రచ్చి = చీల్చుకొని; ఏదేవుఁడు = ఏనృసింహుఁడు; అరణిన్ = నిప్పుకల్గించుకట్టెయందు; ఉద్భవమొందు = పుట్టునట్టి; అగ్నికరణిన్ = అగ్నివలె; ఉదయించెన్ = పుట్టెనో; వాలారుగోరు = వాఁడి మొనగల గోరిని; ఏ జేజే = ఏదేవుఁడు; హిర......మునకున్ = హిరణ్యకశిపుని ప్రాణ మను చేప పిల్లకు; వెన్గాలాము, చేసెన్ = పెద్దగాలాముగా నొనరించెనో; ఏవేల్పు = ఏదేవుఁడు; కడున్, పాలపండ్లవాఁడ = మిక్కిలి పాలదంతముల పిన్నవయస్సునసే; ప్రహ్లాదున్ ; భక్తివృద్ధుఁడుగాఁగన్ = భక్తిచే ముసలివాఁడగునట్లు; పాటించెన్ = కలిగించెనో - కూర్చెనో; నిజసింహతకున్ = తన సింహత్వమునకు; తగన్ = తగునట్లు; సుజనహృద్గుహలందున్ = సుజనులహృదయము లను గుహలందు; ఏ, త్రిలోకీనియంత=మూఁడులోకములను ఆజ్ఞాపించు ఏవిష్ణువు; క్రీడించెన్=ఆఁటలాడెనో; ఆనృహర్యక్షవర్యుండు = ఆనృసింహదేవుఁడు; యక్ష......సరోజుఁడు = యక్షులు, పక్షులు, ఖచరులు, గంధర్వులు, కిన్నరులు మొదలగువారిలో శ్రేష్ఠుల శిరస్సులందలి మణులచేత ఒఱయఁబడిన పాదపద్మములు కలవాఁడు. ['ఘృష్టి = వెలుఁగులు గల' అని పూర్వటీక.] అలం. ఉపమ, రూపకము.

శా. ఆకుంభప్రభవుం డొకానొక తపం బత్యుగ్రతం జేసి ము
న్నో కుంభస్తని! యాజలాంతరమునం దున్పంగ నే దివ్యలిం
గాకారంబున [8]నిల్తు; నట్టిదె యగస్త్యా[9]ఖ్యాకతీర్థంబు త
ద్వ్యాకోచాకృతి సప్తసప్తతికరాయామావృతిం జెన్నగున్. 138

టీక. ఆ కుంభప్రభవుండు = ఆ యగస్త్యుఁడు; ఓకుంభస్తని ! = కడవలవంటి స్తనములుకల ఓ పార్వతీ! ఆ జలాంతరమునందున్ = ఆ నృసింహతీర్థజలమధ్యమున; ఉన్పంగన్ = ఉంచఁగా;

1. క. దమనా. చ. దమునా. 2. క. త్రింశద్ధను. 3. చ. నందు. 4. చ. మందు. 5. చ. వెన్. *హిరణ్యాక్ష. క. ర. 6. క. మణీఘృష్టిచరణ. చ. మణినిఘృష్టచరణ. ట. ఘృణీఘృష్టచరణ. 7. క. బాహులనుబాహువులు. బా చ. 8. క. నిల్చు. చ. నిల్తు. 9. చ. ఖ్యాంక.

పేన్ = సేను; తాల్తున్ = ధరింతును; అగస్త్యాఖ్యాకతీర్థంబు = అగస్త్యతీర్థమను పేరుగల తీర్థము; తద్వ్యాకోచాకృతి = దాని విస్తరించిన యాకారము; సప్త.....వృతిన్ = దెబ్బదియేడు చేతుల విరివిగల యావణముచేత; చెన్నగున్ = ప్రకాశించును.

మ. నవనీతప్రియుఁ గొల్చి విఘ్నపతి తన్మంత్రాంగతం దాల్చి యే
యవధింబోని గణాధిపత్యపదవిం బ్రాపించి యద్దానిచెం
త వసింపంగఁ దదాహ్వయంబునన గాణాపత్య మానట్టి తీ
ర్థవతంసంబు నగస్త్యతీర్థమున కాద్యం బండ్రు విద్యాధికుల్. 139

టీక. విఘ్నపతి = గణాధిపతి; నవనీతప్రియున్ = శ్రీకృష్ణుని; తన్మంత్రాంగతన్, తాల్చి = అతని మంత్రమున కంగమగుటను పొంది; అవధిం బోని = అంతము(హద్దు)లేని; గణాధిపత్యపదవిన్ = గణములకు అధిపతియగుటను; ప్రాపించి = పొంది; అద్దానిచెంతన్ = ఆ తీర్థముసమీపమున; తదాహ్వయంబునన = అతని పేరితో; ఆద్యంబు = మొదటిది - ప్రధానమైనది.

సీ. నగపుత్త్రి! యట్టి గాణాపత్యతీర్థంబునకుఁ బూర్వమై మజ్జనం బొనర్చు
వారికి మఱి వారివారికిని నపవర్గవర్గంబు నీఁజాలు వారి గలిగి
యచట సంకర్షణాహ్వయతీర్థరాజంబు వెలయు; నచ్చో మున్ను హలధరుండు
తీర్థయాత్ర యొనర్చు [1]శ్రీమ్మటమై వచ్చి యవగాహవేళఁ బ్రత్యక్షమైన
తే. పాండురంగాధిపతికృపఁ [2]బడసి [3]తద్వరాప్తి నిజనామ మత్తీర్థ మధిగమింపఁ
జేసి కార్తార్థ్యమును బొందె; శ్రీసఖుండు,నంద యంతర్హితుండయ్యె నద్భుతముగ.

టీక. నగపుత్త్రి! = పార్వతీ! పూర్వమై = తూర్పుననున్నదై; వారివారికిన్ = వారిబాంధవులకును; అపవర్గవర్గంబున్ = మోక్షసమూహమును; వారి, గలిగి = నీరు కలిగి; హలధరుండు = బలరాముఁడు; త్రిమ్మటమైన్ = శ్రమతో; అవగాహవేళన్ = స్నానసమయమున; తద్వరాప్తిన్ = అతనివలని వరమును పొందుటవలన - అతనిదయవలన; నిజనామము = సంకర్షణమను తన పేరు; అధిగమింపజేసి; పొందఁజేసి; కార్తార్థ్యముం బొందెన్ = కృతార్థతను పొందెను; శ్రీసఖుండున్ = విష్ణువును; అంద = అక్కడనే.

శా. ఆ సంకర్షణతీర్థరాజమున కాద్యంబై నమద్వేదని
శ్వాసంబై తనదైర్ఘ్యమంతయును బంచాశద్ధనుర్మేయమై
భాసిల్లన్ నిజవారి మజ్జదఖిలప్రాణిప్సితత్యాగదీ
క్షాసన్నద్ధ మనం బ్రసిద్ధి వడయున్ జాబాలితీర్థం బిలన్. 141

టీక. ఆ సంకర్షణతీర్థరాజమునకున్ = ఆ, బలరామునితీర్థమునకు; ఆద్యంబై = మొదటిదయి - తరువాతిదయి; నమద్వేదనిశ్వాసంబై = నమస్కరించు బ్రహ్మకలదయి; తన దైర్ఘ్యము, అంతయున్ = తన పొడవంతయును; పంచాశద్ధనుర్మేయమై = ఏఁబదివిండ్ల కొలఁత గలదయి; భాసిల్లన్ = ప్రకాశింపఁగా; నిజ......సన్నద్ధము = తన నీటియందు మునుఁగుచుండు సమస్తజీవులకోరికలను నెఱవేర్చు నియమమునకు సిద్ధపడునది - తనలో మునుఁగువారి కోరికలను నెఱవేర్చునది; అనన్ = అనఁగా; ఇలన్ = భూమిపై.

క. అత్తీర్థము నంతరమున, వృత్తస్తని! బ్రహ్మతీర్థ[4]విభు వభినుతిసం
పత్తి విలసిల్లు శతదోర్వృత్తాకృతి [5]క్రొత్త దానివృత్తం బెల్లన్. 142

1. చ. తిమ్మట. 2. క. వడసి. చ. బడసి. 3. చ. త్వద్వ. 4. చ. విభవభి. 5. క. కాంత. చ. క్రొత్త;

టీక. వృత్తస్తని! = గుండ్రని స్తనములు కల పార్వతీ! ఆతీర్థమునంతరమునక్ = ఆ జాహ్నవీతీర్థమునకు చేరువను; [అంతరమునక్ = నడుమ - అని పూర్వటీక. అది సరికాదు.] బ్రహ్మతీర్థవిభుఁడు= తీర్థరాజమైన బ్రహ్మతీర్థము; శతదోర్వ్యత్తాకృతి=నూఱుచేతులకైవారము కలది; దానివృత్తంబెల్లన్= దాని చరిత్రమంతయును; క్లొత్త=వింతయయినది. ['వృత్తము = ఉనికి' అని పూర్వపుటీక; అది సరికాదు.]

క. అందు వసియించు యదుకుల,నందనసేవావిధాన నందిస్మతియై
కుందవిశదరదన! శతానందుఁడు [1]వాణీవధూసనాథుం డగుచున్. 143

టీక. కుందవిశదరదన! = మల్లెలవలె చక్కని దంతములుకల పార్వతీ! శతానందుఁడు = బ్రహ్మ; వాణీవధూసనాథుండగుచున్ = సరస్వతీదేవితో కలిసినవాఁడగుచు; యదు......స్మతియై = శ్రీకృష్ణునిసేవవలన సంతోషించు మనస్సుకలవాఁడై. అలం. అనుప్రాసము.

తే. బ్రహ్మతీర్థంబునకు దండపాణియాశ, కులశిఖరిపుత్త్రి! దీపించుఁ గలశతీర్థ
మేనుబారల నిడుపున [2]దీను మిగిలి, యదియ యమృతాయమహాదేవి కాస్పదంబు.

టీక. కులశిఖరిపుత్త్రి! = పార్వతీ! దండపాణియాశన్ = యమునిదిక్కున - దక్షిణమున; ఏనుబారలనిడుపునన్ = అయిదుబారలపొడవున; దీనుమిగిలి=చక్కఁదనముకల్గి; ఆస్పదంబు = నివాసము

తే. బ్రహ్మతీర్థంబుఁ, గలశతీర్థంబుఁ బొగడ, నేర రెవ్వారు చంద్రికాగౌరమయ్యుఁ
[3]దత్పయోధార ముక్తినిధానమునకు, నంజనచ్ఛాయయగుచుఁ దోఁచు టద్భుతంబు.

టీక. చంద్రికాగౌరమయ్యున్ = వెన్నెలవలె తెల్లనిదయి యున్నను; తత్పయోధార = ఆతీర్థముల నీటిధార; ముక్తినిధానమునకున్ = ముక్తి యను నిధికి; అంజనచ్ఛాయయై = కాటుక వంటి నల్లనికాంతికలదయి - కాటుకయైనదయి; తోఁచుట = కనఁబడుట; అద్భుతంబు = ఆశ్చర్యము. తెల్లగానుండు పయోధార అంజనచ్ఛాయ గలిగి నల్లగా నుండుట అద్భుతము; ఇట్లుండుట విరుద్ధము; అయినను అది ముక్తియను నిధిని కనిపెట్టుటకు కాటుక యగునని రూపింపఁబడుటచే మీఁది విరోధము అపాస్తమగుచున్నది. అలం. విరోధాభాసము.

ఉ. తామరసాక్షి! యందునకు దక్షిణదిక్కున సప్తదోర్మితా
యామ మయాతయామగుణమై యొసఁగున్ బితృతీర్థ మచ్చటన్
దా మొనరించు దానములుఁ దానములుం [4]గయఁ జేయు సత్క్రియా
స్తోమములై పితృప్రియముఁ జొన్ప సుఖంపుదు రెల్లవారలున్. 146

టీక. తామరసాక్షి! = తామరపువ్వులవంటి కన్నులు కల పార్వతీ! అందునకున్ = దానికి- ఆ కలశతీర్థమునకు; సప్తదోర్మితాయామము = ఏడు చేతుల పొడవుగలది; అయాతయామగుణమై = అభుక్తములగు - అభినవములైన గుణములు కలది; పితృతీర్థము; ఎసఁగున్ = ప్రకాశించును - ఉండును; తానములున్ = స్నానములును; సత్క్రియాస్తోమములై = ఉత్తమకార్యముల గుంపులుగా అయి; పితృప్రియమున్ = పితృదేవతలకు ప్రీతిని; చొన్పన్ = కలిగింపఁగా.

ఉ. దానికి దక్షిణాశ వసుధాధరనందన! యొప్పు బ్రహ్మవి
ద్యానిధిసేవితంబు నగహాస్తమితం బగు చక్రతీర్థ మ
చ్చో నలవాకయుంబలె విశుద్ధజలంబులఁ గ్రుంకి మాధవ
ధ్యానమునేఁకు మానుజకు నబ్రములే యపవర్గదుర్గముల్. 147

1. చ. వాగ్దేవతా. 2. చ. దేను ట. ఏను. 3. క. పయోధర. చ. పయోధార. 4. చ. దగ.

టీక. వసుధాధిపనందన ! = పార్వతీ ! దక్షిణాశన్ = దక్షిణపుదిక్కున; బ్రహ్మవిద్యానిధిసేవితంబున్ = బ్రహ్మవిద్య (వేదాంతవిద్య) యందు దాఁటితేఱిన పండితులచే సేవింపఁబడినది; నవహస్త మితంబు = తొమ్మిదిచేతుల నిడివి కలది; అచ్చోన్ = అక్కడ; అలవోకయుంబలెన్ = అశ్రమముగ-స్వేచ్ఛగా; గ్రుంకి = స్నానముచేసి; మాధవధ్యానము = శ్రీకృష్ణుని ధ్యానమును; అపవర్గదుర్గముల్ = ప్రవేశింపసాధ్యముకాని మోక్షములు; అబ్రము లే! = వింతలుకావు; మోక్షములు సుగమములని భావము.

క. చక్రస్తని ! తజ్జలములఁ, జక్రాలంకృత శిలానిచయ ముదయించున్
శక్రముఖాఖిల[1]మఖభుఙ్చక్రము కొనియాడుఁ దత్ప్రశ స్తగుణంబుల్. 148

టీక. చక్రస్తని! = జక్కవలఁబోలు చన్నులు కల పార్వతీ! చక్రాలంకృతశిలానిచయము = చక్రముల చిహ్నములు కల రాళ్ల సమూహము; ఉదయించున్ = పుట్టును; శక్ర......చక్రము = ఇంద్రుఁడు మొదలుగాఁగల దేవతల సమూహము; తత్ప్రశస్తగుణంబుల్ = చక్రతీర్థపు గొప్పగుణములను; కొనియాడున్.

శా. ఆ తీర్థంబునకుం గృతాంతదిశ నాద్యం బా ర్తివైద్యంబు ల
క్ష్మీతీర్థంబన నొక్కతీర్థము ప్రకాశించున్ రమాదేవి వీ
తాతంకస్థితి నచ్చటం దపముసేయన్ నేర్చికా తొల్లి యా
దైతేయారిభుజాంతరాళమణిసౌధం బెక్కెఁ బెన్మక్కువన్. 149

టీక. కృతాంతదిశన్ = దక్షిణదిక్కున; అద్యంబు = తరువాతిది; ఆర్తివైద్యంబు = మనోరోగమునకు మందైనది; రమాదేవి = లక్ష్మీదేవి; వీతాతంకస్థితిన్ = పోయిన సందేహము కలుగునట్లు = సందేహము పోవునట్లు; నేర్చికా = నేర్చియేకదా - నేర్చుకొనుటచేతనేగదా! పెన్మక్కువన్ = మిక్కిలి ప్రేమతో; దైతేయా......సౌధంబు = రాక్షసవిరోధియగు విష్ణుని వక్షఃస్థలమను మణులు తాఁపిన మేడను; ఎక్కెన్. అలం. రూపకము.

సీ. [2]ధూతాఘమైన లక్ష్మీతీర్థమునకు దక్షిణమునఁ గౌమోదకియును బద్మ
మును శంఖమును జక్రమును నిజనామచిహ్నములుగా వెలయుతీర్థములు పొలుచు
మేఁత! యానాల్గు లక్ష్మీతీర్థ[3]మునుగూడి శక్తిపంచకనామసంప్రయుక్తిఁ
దళుకొత్తు వీనివిస్తారంబు షష్టిహస్తప్రమా[4]ణంబునఁ జాలియుండుఁ

ఆ. బరమపావనంబు పాతకనిర్మూల, నైకకర్మకంబు లోకనుతము
తత్ప్రభావ మసురదమనుసున కీ యేను, ప్రాణధనము లగుచుఁ బ్రణుతి వడయు.

టీక. ధూతాఘమైన = పాపములను నశింపఁజేయునట్టి; నిజనామచిహ్నములుగాన్ = తమ పేర్లతోఁ గూడినవిగా; వెలయు = ప్రకాశించు; పొలుచున్ = ఉండును; శక్తి......యుక్తిన్ = శక్తిపంచకము అను పేరుకలిగి; తళుకొత్తున్ = సొగసుమీఱును; విస్తారంబు = నిడివి; షష్టి...... ణంబునన్ = అఱువదిచేతుల ప్రమాణమున; పరమపావనంబు = మిక్కిలి పవిత్రమైనది; పాతక నిర్మూలనైకకర్మకంబు = పాపములను నశింపఁజేయు ప్రధానమగు పని కలది; లోకనుతము = లోకులచే కొనియాడఁబడునది; అసురదమనునకున్ = రాక్షసులను మర్దించు విష్ణువునకు; ఈ యేను = లక్ష్మీ, కౌమోదకీ, పద్మ, శంఖ, చక్రతీర్థము లను ఐదు తీర్థములును; ప్రణుతివడయున్ = కొనియాడఁబడును.

ఉ. ఆ మధువైరిదిక్కృతఘువై సఃలోన్నతమూర్తియై దశ
వ్యామవిశాలమై పరమమై భువనత్రితయాభిగమ్యమై

1. క. మఘ. చ. మఖ. 2. చ. భూతా. 3. క. మున. చ. మును. 4. క. ణంబన. చ ణంబున.

యీ మును విన్నతీర్థముల కెక్కువ చూపుచుఁ బౌండరీక మ
క్షామగుణాభిరాము మనఁగా వినఁగా గనఁగాఁ దగుం[1]దగున్. 151

టీక. అనుఘ......తనువై = ఆ విష్ణుని తీర్థస్వరూపమయి; సకలోన్నతమూర్తియై=అన్నింటను గొప్పస్వరూపము కలదై; దశవ్యామవిశాలమై=పదిబారల నిడివికలదై; భువనత్రితయాభిగమ్యమై= మూఁడు లోకములను పొందఁదగినదయి; ఈ మును విన్నతీర్థములకన్ = ముందు నీవు విన్న యీ తీర్థములన్నింటికంటెను; ఎక్కువ = గొప్పతనమును; అక్షామగుణాభిరామము = తక్కువకాని గుణములచే ఇంపైనవి.

సీ. నిడువాలుగనుచూపు నిగిడినచో నెల్ల [2]బీఱెండ రేయెండఁ బెండ్లియాడ
నిశ్శ్వాసపవనంబు నెలకొన్నచో నెల్లఁ బ్రామిన్కునెత్తావు లాముకవియఁ
బొక్కిటితమ్మిపుప్పొడి యొల్కుచో నెల్ల బ్రహ్మాంకురంబులు పాదుకొనఁగ
నడుగులేఁజిగురాకు లంటినచో నెల్ల వివిధతీర్థశ్రేణి వెల్లివాడువ

తే. బర్హమణిబంధ మా[3]వెల్పు పచ్చవెదురు, గ్రచ్చుతాయులతిత్తియుఁ గంబుశక్తి
గలిగి విహరించుఁ బౌండరీకంబునందు, నందులేఁబట్టి ప్రాలేయనగముపట్టి ! 152

టీక. నిడువాలుగనుచూపు =మిక్కిలి వాఁడియైన చూపు; నిగిడినచోన్, ఎల్లన్ = వ్యాపించిన ప్రతిస్థలమునందును; బీరెండ = తీక్ష్ణమగు నెండ; రేయెండన్ = వెన్నెలను; పెండ్లియాడన్ = కలిసికొనఁగా; [విష్ణువు సూర్యచంద్రనేత్రుఁడగుటవలన అతని చూడ్కులు ప్రసరించినచో ఎఱ్ఱటెండయు, వెన్నెలయు కలిసికొనినవని భావము.] నిశ్వాసపవనంబు = నిట్టూర్పువాయువు; నెలకొన్నచోటు, ఎల్లన్=నిలిచిన - వ్యాపించిన ప్రదేశమంతయును; ప్రామిన్కునెత్తావులు=వేదవాసనలు; ఆముకవియన్ =ఎక్కువగా ఆవరించుకొనఁగా; [విష్ణువునకు వేదములే నిట్టూర్పువాయువు లగుటవలన వాని వాసన నలుగడలను వ్యాపించినదని భావము.] పొక్కిటి......చోటు, ఎల్లన్ = బొడ్డుతామరయొక్క పుప్పొడి పడిన ప్రదేశ మంతయును; బ్రహ్మాంకురంబులు = బ్రహ్మలయొక్క మొలకలు - పెక్కుమంది పిల్ల బ్రహ్మలను; వెల్లివాడువన్ =వ్యాపింపఁజేయఁగా. ['ప్రవహింపఁగా' అని శ. ర. అనుసరించి పూర్వటీక.]

[విష్ణువునాభికమలమున బ్రహ్మపుట్టెను; కావున నాభీకమలపుపుప్పొడి పడిచినచోట్లను పెక్కురు బ్రహ్మలసృష్టి జరుగుచున్నదని భావము.]

బర్హమణిబంధము = నెమిలిపురి యను మణులు తాపిన నగ; ఆవెల్పు = ఆలనుత్రోలు; పచ్చవెదురు = ఆకుపచ్చని (పచ్చి) వెదురుకఱ్ఱ; కంబు, శక్తి=శంఖరూపమగు ఆయుధవిశేషము; నందులేఁబట్టి = నందుని ముద్దుకుమారుఁడగు కృష్ణుఁడు; ప్రాలేయనగముపట్టి! = పార్వతీ!

వ. అఖిలతీర్థరాజంబగు నమ్మహాతీర్థంబునకు జముదిక్కు [4]నధఃకృతావిముక్తంబగు ముక్తకేశితీర్థం బఖిలార్థప్రదంబై యుండు. మున్నట్లు వెన్నునివలనను [5]దీర్థాధిపత్యంబును ముక్తిదాయిత్వంబునుం గాంచిన యమ్ముక్తకేశియు నచ్చోట నచ్చు వెన్నెలఁ [6]దొచ్చెంబుచేసి యొసఁగునిసుకదిన్నెలపై నున్నయది యట్లగుటం జేసి.

టీక. జముదిక్కునన్ = దక్షిణదిశను; ధిక్కృతావిముక్తంబు = (గొప్పతనమున) అవిముక్తక్షేత్రమును తిరస్కరించునది; అఖిలార్థప్రదంబై = కోరిన కోరికల నన్నింటిని నెఱవేర్చునదయి; వెన్నునివలనన్ = విష్ణువువలన; తీర్థాధిపత్యంబును = తీర్థములకన్నింటికిని యాజమాన్యంబులు; ముక్తి

1. ట. మహిన్. 2. చ. జేరెండ. 3. క. వేల్పు. 4. చ. నాధిక్కృతా. 5. క. దీర్థాపత్యం. చ. తీర్థాధిపత్యం. 6. చ. దుచ్చంబు.

దాయిత్వంబును = మోక్షమునొసంగుటను; కాంచిన = పొందిన; అచ్చవెన్నెలన్ = పండువెన్నెలను; తొచ్చెంబుచేసి = తిరస్కరించి;

క. పులినోపరితలగత నా, తలోదరిని శిథిలవసనధమ్మిల్ల మహో
  జ్జ్వలభూషణభూషిత నిశ్చలపదవీప్రద భజింపఁజను గుహజననీ ! 154

టీక. పులినోపరితలగతన్ = ఇసుకతిన్నెపయి నున్నదానిని; తలోదరిన్ = సూక్ష్మమధ్యయగు స్త్రీని; శిథిలవసనధమ్మిల్లన్ = వీడిపోయిన కేశబంధము, పోకముడియు కలదానిని; మహోజ్జ్వలభూషణ భూషితన్ = మిక్కిలి ప్రకాశించు నగల నలంకరించుకొన్నదానిని; నిశ్చలపదవీప్రదన్ = మోక్షపదవి నిచ్చుదానిని - ముక్తకేశిని; గుహజననీ! = కుమారస్వామికి తల్లివగు పార్వతీ!

శా. భక్తుం డెవ్వఁడు ముక్తకేశికఁ[1]బయఃపానంబు గావించి ని
  ర్ముక్తక్లేశకు ముక్తకేశికిఁ [2]గరంబుల్ మోడ్చి సత్యామన
  స్సక్తుం గన్గొను, వాఁడు గన్నయదివో జన్మంబు [3]మైదాల్చియున్
  ముక్తుం డాతఁడు భావికాలజననంబుల్ వానికిం బూజ్యముల్. 155

టీక. ముక్తకేశికన్ = ముక్తకేశితీర్థమున, పయఃపానంబు; గావించి = నీరుగ్రోలి; నిర్ముక్త క్లేశకున్ = క్లేశములను నశింపఁజేయునట్టిదానికి; కరంబుల్ మోడ్చి = చేతులుజోడించి - నమస్కరించి; సత్యామనస్సక్తున్ = సత్యభామకు ప్రియుఁడగు శ్రీకృష్ణుని,కన్గొనున్ = చూచునో; వాఁడు; కన్నయదివో = ఎత్తినదేకదా ! మైదాల్చియున్ = శరీరమును ధరించియున్నను; ఆతఁడు, ముక్తుండు= ఆతఁడు మోక్షమును పొందినవాఁడేయగును; వానికిన్ = అట్టివానికి, భావికాలజననంబుల్ = పునర్జన్మములు; పూజ్యముల్ = శూన్యములు - కలుగవని యర్థము.

చ. హరి మును సంగమాహ్వయ[4]మహాసురు నాసురవృత్తిఁ ద్రోచి పే
  [5]రురవడి వానిపై నడుగు లూఁదఁ దదంకము లెట్టిచోట గో
  చరమగుచూడ్కి కా స్థలముసన్నిధి [6]పెన్నిధి; వానిపేరిటం
  బరఁగెడు[7] తీర్థ మొప్పుఁ గలభాషిణి! యీషణశోషణస్థితిన్. 156

టీక. హరి=కృష్ణుఁడు; మును=పూర్వము; సంగమాహ్వయమహాసురున్ = సంగముఁడను పేరి గొప్ప రాక్షసుని; ఆసురవృత్తిన్, త్రోచి = క్రూరముగా పడఁద్రోసి; పేరురవడిన్ = మిక్కిలి వేగముగా; అడుగులు, ఊఁదన్ = పాదములను మోపగా; చూడ్కికిన్ = చూపునకు; తదంకములు= ఆ పాదముల చిహ్నములు; ఎట్టిచోటన్, గోచరమగున్ = కనఁబడునో; ఆ స్థలముసన్నిధి = ఆస్థలము యొక్క సాన్నిధ్యమే; పెన్నిధి = పెద్దనిధియైనది; వానిపేరిటన్, పరఁగెడు=ఆ సంగమాసురునిపేరిట నున్న; ఈషణశోషణస్థితిన్ = దారేషణ, ధనేషణ, పుత్రేషణ యను మూఁడు ఈషణ(కోరిక)లను నశింపఁజేయునట్టిరీతిని; ఒప్పున్ = ప్రకాశించును.

క. ప్లావితభూతల యగు పుష్పావతి యను నేఱు [8]గలియఁ బావనమై యో
  దేవీ! సంగమతీర్థం, బావిర్భూతాఖిలాద్భుతార్థత వెలయున్. 157

టీక. ప్లావితభూతల = ఆవరింపఁబడిన భూప్రదేశము కలది - భూమియందు వ్యాపించినది; కలియన్ = తనతోఁజేరఁగా; పావనమై = పవిత్రమై; ఆవి......ర్థతన్ = సమస్తములగు నద్భుతములను పుట్టించురీతిని; వెలయున్ = ప్రకాశించును.

---

1. క. పయః. చ. బయః. 2. క. కిగరం. 3. క. మేఁ. ట. మై. 4. చ. సమరాసుర. 5. చ. రుసవడి. 6. చ. సన్నిధి. 7. చ. గినతీ. 8. క. గలయు.

సీ. ఆ తీర్థమునకు నాద్యము సోమతీర్థంబు సోమలోకావాససుఖకరంబు
దానికి దేవతీర్థము పూర్వమై యుండు దేవతాభోగోపదేష్ట[1]మగుచు
నందున కంటెమున్న యవతరించిన సూర్యతీర్థంబు సౌర[2]సిద్ధిప్రదంబు
తత్తీర్థమునకుఁ బ్రాక్తనము సరస్వతీతీర్థంబు వాఙ్మయోద్దీపకంబు
తే. వీన నాల్గింట నాడిన వీనిమహిమఁ
బ్రస్తుతించిన వీనివైభవముఁ గన్నఁ
బ్రాజ్యసాయుజ్య సామ్రాజ్యపూజ్యభూరి
భోగములు పంచజనులకుఁ [3]బొదలుఁ గొల్ల. 158

టీక. ఆద్యము = మొదటిది - తరువాతిది; సోమ......కరంబు = చంద్రలోకమునందు సుఖనివాసమును కలుగఁజేయునది; పూర్వమై=ముందున్నదై; దేవతాభోగోపదేష్టము = దేవభోగములను కలుగఁజేయునది; సౌరసిద్ధిప్రదంబు = సూర్యలోకనివాససిద్ధి నిచ్చునది; ప్రాక్తనము = పురాతనము; వాఙ్మయోద్దీపకంబు = వాక్సిద్ధిని కలిగించునది; ['వాగ్రూపమై ప్రకాశించునది - 'అని పూర్వటీక.] ఆడినన్ = స్నానము చేసినను; ప్రస్తుతించినన్ = కొనియాడినను; కన్నన్ = చూచినను; పంచజనులకున్=మనుష్యులకు; ప్రాజ్య......భోగములు=గొప్పదైన భగవంతునితోడి కలయిక యనెడి రాజ్యము వలని పవిత్రమైన అధికభోగములు; కొల్ల = సమృద్ధిగా; పొదలున్ = కలుగును.

స్రగ్ధర. పూర్వద్వాఃస్థన్ సితాంగిన్ భువనవినుత నంభోరుహభూ[illegible]రాణిన్
బర్వేందుస్పర్ధవక్త్రన్ భగవతి నఖిలప్రాణిధీమూర్తి వాణిన్
[4]దూర్వాశ్రీపత్రమల్లీతులసిదళశమీధూపదీపాక్షతౌఘా
గుర్వాజ్యక్షీరధారల్ గొని కొలిచినచోఁ గోరు కోర్కుల్ ఫలించున్. 159

టీక. పూర్వద్వాఃస్థన్ = తూర్పువాకిట నున్నదానిని; సితాంగిన్ = తెల్లని దేహముకలదానిని; భువనవినుతన్ = లోకముచేఁ గొనియాడఁబడుదానిని; అంభోరుహభూ[illegible]రాణిన్ = బ్రహ్మకు భార్యయైనదానిని; పర్వేందుస్పర్ధవక్త్రన్ = పున్నమనాఁటి చంద్రునితో సమమగు ముఖము కలదానిని; భగవతిన్ = పూజ్యురాలను; అఖిలప్రాణిధీమూర్తిన్ = సమస్తప్రాణులకు బుద్ధి యగుదానిని; వాణిన్ = సరస్వతిని; దూర్వా......ధారల్ = దూర్వలు, శ్రీపత్రములు, మల్లెలు, తులసిదళములు, శమీదళములు, ధూపములు, దీపములు, అక్షతలు, అగురు, నేయి, పాలు; కొని = గ్రహించి; కొలిచినచోన్ = సేవించినయెడల.

పృథ్వి. తరణ్యయుతజిత్ప్రభాధగధగాయితాశాంతరుం
డరణ్యమృగభూమికావ్యథితదానవస్వాంతుఁ డా
హిరణ్యకశిపు[5]ద్రుహుం డెపుడు నుండు నచ్చో సమ
చ్ఛరణ్యపదపద్ముఁడై చలదళాకృతి స్వీకృతిన్. 160

టీక. తర......తరుండు = పదివేవురు సూర్యులను మించిన గొప్పకాంతిచే ప్రకాశింపఁజేయఁబడిన దిక్కులమధ్యభాగము కలవాఁడు; అరణ్య.....స్వాంతుఁడు = అరణ్యమృగమగు సింహము వేషమున పీడింపఁబడిన రాక్షసుఁడు - (హిరణ్యకశిపుఁడు) కలవాఁడు; హిరణ్యకశిపుద్రుహుండు = హిరణ్యకశిపునకు శత్రువగు నరసింహుఁడు; సమ.....పద్ముఁడై = నమస్కరించువారికి రక్షణ

1. క. యగుచు. 2. చ. సిద్ధ. 3. చ. బొదలె. ట. బొసఁగు. 4. చ. దూర్వాలీపత్రవల్లీ. 5. ఇది మొదలు 161 చివఱివఱకు 'చ' ప్రతిలో లేదు.

మొనఁగు పాదపద్మములు కలవాఁడై; చలదశ్వాకృతిస్వీకృతిక్ =అశ్వత్థవృక్షాకారముయొక్క స్వీకారమున - రావిచెట్టుగా మాఱి; అచ్చోఁక్ = అచ్చట; ఎపుడుక్, ఉండుక్. అలం. ఉపమ.

క. నీ వడిగినఁ జెప్పితి నో, దేవి! చతుర్ముఖముఖులకుఁ దెలియఁగరా ది
 వ్యైవతతీర్థక్షేత్రము,హావిర్భావములు చింతితార్థప్రదముల్. 161

టీక. చతుర్ముఖముఖులకుక్ = బ్రహ్మ మొదలగువారికిని; చింతితార్థప్రదముల్ = కోరిన కోరికల నొసఁగునట్టివి.

ఉ. ఈచరితంబు విన్నఁ బఠియించిన వ్రాసినఁ బుత్త్రపౌత్త్రల
 క్ష్మీచతురాంగనాదికవిశేషము లిమ్మెయిఁ గాంచి మీఁదటన్
 జూచు నరుండు ప్రాముకులు చూడని చక్కని యిక్క నిక్క[1]మో
 మేచకమేఘసంపదుపమేయశిరోజ! సరోజదృక్కృపన్. 162

టీక. పుత్త్ర......విశేషములు = పుత్త్రులు, పౌత్త్రులు, సంపదలు, చతురలగు స్త్రీలు మొదలగు భోగవిశేషములను; ఇమ్మెయిక్ = ఈదేహమున - ఈజన్మమునందు; కాంచి=పొంది; మీఁదటక్= తరువాత; ప్రామునులు, చూడని, చక్కనియిక్కక్=తొల్లిటి మునులుకూడ చూడనట్టి గొప్పస్థానమును-ముక్తిని; సరోజదృక్కృపక్ = శ్రీకృష్ణునిదయవలన; నరుండు, చూచుక్; మేచక......శిరోజ! = నల్లనిమేఘముల సంపదతో పోల్పఁదగిన కేశములు కల పార్వతీ! అలం. ఉపమ.

క. అని శివుఁడు కుధరకన్యకు, వినిపించినయట్టిసరణి వినిపించె మహా
 మునులకు ననుపమితతపోధనులకుఁ గథకుండు తత్త్రినిధ మేళనమున్. 163

టీక. కుధరకన్యకుక్ = పార్వతికి; సరణిక్ = పద్ధతిని; అనుపమితతపోధనులకుక్ = సాటిలేని తపస్సే ధనముగాఁ గలవారికి; కథకుండు=కథలు చెప్పు సూతుఁడు; తత్త్రితయమేళనముక్ = తీర్థదేవతాక్షేత్రముల మూఁడిటి కలయికను; వినిపించెక్ = తెలిపెను.

క. వినిపించిన విని శౌనక, మునిప్రముఖనిఖిలమును లమోఘానందం
 బును [2]మనములఁ దాల్చిరి నెల్కొను నిజతనుఫలకపులకకులకలనమునన్. 164

టీక. వినిపించినక్ = తెలుపఁగా; శౌనక......మునులు = శౌనకుఁడు మొదలగు సమస్త ఋషులును; అమోఘానందమును = అధికమగు సంతోషమును; నెలకొను = కలుగునట్టి; నిజ ..... కలనమునక్ =పలకలవంటి తమదేహములయందు గగుర్పాటుకూటమితోడి కూడికతో.

క. ఆశౌనకుండు మఱియు బి,లేశయతలిమోపథాన లీలాలోల
 స్వాతిశయుఁడు పరమపదబద్ధాశుఁడునై రోమహర్షణాత్మజుఁ [3]బలికెన్. 165

టీక. బిలేశయ......స్వాశయుండు = పాము పానుపు, దిండుగాఁగల విష్ణుని విలాసములందు ఆసక్తమగు మనస్సు కలవాఁడు; పరమపదబద్ధాశుఁడునై=మోక్షమునందును ఆసక్తికలవాఁడయి; రోమహర్షణాత్మజుక్ = సూతునిఁగూర్చి.

చ. దమనిధి! విట్ఠలేశ్వరుఁడు దైవతరత్నము; భైమి తీర్థర
 త్నము నల పౌండరీకవసుధాతలమున్నది క్షేత్రరత్న మీ
 త్రిమణులు సూక్తిసూత్ర[4]వితతిం గుది గ్రుచ్చితి మచ్ఛ్రివో విధే
 య మగుచు నున్కి నక్షపలయాకృతి నీకృతి యొప్పు నెప్పుడున్. 166

1. ట. మా. 2. చ. నివమునవా.ట. బరునయమున. 3. క. బలుకుక్. చ. బలికెక్. 3. చ. వివృతి.

టీక. దమనిధి! = ఓమునీ! దైవతరత్నము = దేవతలలో శ్రేష్ఠుఁడు; పౌండరీకవసుధాతలము, అన్నది = పౌండరీకమను పేరుగల భూమి; త్రిమణులు = మూఁడురత్నములును; సూక్తిసూత్రవితతిన్ = మాట లను దారములయందు; గుదిగ్రుచ్చితి = గుత్తిగాఁగూర్చితివి; మచ్ఛ్రవోవిధేయము, అగుచున్కిన్ = మాచెవులకు పొందినది - (నచ్చినది) అగుచుండుటచేత; ఈ కృతి = ఈచరిత్రము; అక్షవలయాకృతిన్, ఒప్పున్ = జపమాలయొక్క ఆకారమును వహించుచున్నది. [జపమాల మును లకు ముఖ్యము; అది శ్రవణాలంకారము కూడను.]

క. చతురభవదుక్తిముకుర, ప్రతిఫలదఖిలేశగుణాపసంపత్ కలుషో
జ్ఝిత[1] మగు నంతర్దృష్టిన్, సతతము వీక్షింపఁ దనివి సనదు మహాత్మా! 167

టీక. చతుర......సంపద = నేర్పుగల నీమాట యను నద్దమున ప్రతిఫలించు సర్వేశ్వరుని గుణములసంపద; కలుషోజ్ఝితమగు = పాపరహితమైన; అంతర్దృష్టిన్ = లోపలిచూపుతో; సతతము = ఎల్లప్పుడు; వీక్షింపన్ = చూచినను; తనివి, సనదు = తృప్తితీరదు. అలం. రూపకము.

ఉ. హరి, యాద్యుం డఖిలాండనాయకుఁడు నందాపత్య మేలయ్యెఁ! ద
చ్చరితం బెయ్యది? రాధ యెవ్వతె? తదిచ్ఛావృత్తి యేరీతి? శం
కరుదేహంబున నెట్లు దోచె? శ్రీకాంతాంగజాతాక్షరో
త్కర మే[2]మంత్రరహస్య? మింతయును వక్కాణింపు మాకింపు[3]గన్. 163

టీక. హరి = విష్ణువు; ఆద్యుండు = (అందఱికంటెను ముఖ్యుఁడు) మొదటివాఁడు; అఖిలాండనాయకుఁడు = సమస్తలోకములకును అధిపతి; నందాపత్యము = నందునిబిడ్డ - శ్రీకృష్ణుఁడు; తదిచ్ఛావృత్తి = ఆరాధయొక్క కోరిక; ఏరీతి? = ఎట్టిది? ఒదవెన్ = కలిగెను? శ్రీ...తర్కము = శ్రీవిష్ణుని యంగమునుండి పుట్టిన యక్షరములపంక్తి; వక్కాణింపు = చెప్పుము.

ఉ. నావుడు సూతుఁ డిట్లనియె నారదమౌనికి మున్ను మేచక
గ్రీవుఁడు పుండరీకునిచరిత్రము దెల్పెఁ దదర్థవైభవం
బే వినిపింతు మీరు వినుఁ డిందఱు సందియ మెల్ల డిందఁ ల
క్ష్మీవిభుదివ్యలీల లఱచేతఁ గసందగు దీన దీను[4]గన్. 169

టీక. మేచకగ్రీవుఁడు = నీలకంఠుఁడు - శివుఁడు; సందియ మెల్లన్ = సందేహమంతయును; డిందన్ = నశింపఁగా; దీనన్ = ఈ నా తెలియఁజేయుచరిత్రము వినుటవలన; దీనుగన్ = చక్కఁగా.

క. అని సూతుఁడు వెండియు న్నర్జునసూతువిహారములు నిరూఢోక్తుల వి
న్నను వొప్పఁజెప్పఁదొడఁగెన్, మును వేద[5]వ్యాసువచనమున వినియునికిన్.

టీక. అర్జునసూతువిహారములు = అర్జునునకు సారథియైన శ్రీకృష్ణుని లీలలు; నిరూఢోక్తులన్ = ప్రౌఢపదములతో; విన్ననువు, ఒప్పన్ = నేర్పు ఏర్పడఁగా; వినియునికిన్ = వినియుండుటవల్ల.

చ. ధనపతిమిత్రుఁ డట్లు ప్రమదాప్రమదార్థముగా నుపన్యసిం
చిన వచనామృతంబు శ్రుతిసీమలగా [6]డిగి బోధభూజసే
చన మొనరించుటన్ సఫలసంభ్రము లై సమయూరరాజవా
హనముగ మౌను లబ్ధిజల మాను ఘనంబులలీల నేఁగఁగన్. 171

టీక. ధనపతిమిత్రుఁడు = కుబేరునికి మిత్రుఁడగు శివుఁడు; ప్రమదాప్రమదార్థముగాన్ = తనభార్యకు (పార్వతికి) సంతోషము కలుగునట్లు; ఉపన్యసించినన్ = వివరించిచెప్పఁగా; శ్రుతిసీమలఁ

1. క. క్షిత. చ. చ్ఛ్రిత. 2. చ. యంత్ర. 3. చ. గాన్. 4. గాన్. 5. చ. వ్యాస. 6. క. దిగి. చ. డిగి.

గాన్, డిగి=కర్ణప్రదేశమార్గమున లోనికి దిగి; బోధభూజసేచనము, ఒనరించుటన్=జ్ఞానమను వృక్షమును తడుపుటచేత; సఫలసంభ్రములై = తీరిన సందేహము కలవారయి; సమయూరరాజవాహనమునగన్ = నెమలి వాహనముగాఁ గల కుమారస్వామితో కూడుకొన్నట్లుగా - కుమారస్వామితోఁ గూడ; అబ్ధి జలము, అను = సముద్రపునీటిని త్రాగు; ఘనంబులలీలన్ = మేఘములవలె; అలం. ఉపమ.

సీ. జాలపాదము నంఘ్రిఁ గీలితంబగు సితాబ్జముభాతిఁ గుంచె హస్తమునఁ [1]గ్రాల
బిరుదంబుఁ బొగడు శ్రీశ్వరుశంఖ మనఁజాలి తన్నామముఖరతంధర దనర్ప
రజతాద్రికూటగర్జత్కాళికాకృతి బృహదంసమున నిడ్డ మహతి పలుక
నిగిడి సుషుమ్న యీనిన పిల్లవెలుఁగులవడువున నెఱసంజజడలు నిక్కఁ

తే. దెగినచుక్క ధరణికి నేతెంచుకరణిఁ, దరణిజిత్ప్రభతో మేఘసరణి డిగ్గి
నందనీట శతానందనందనుండు, మజ్జనంబాడి బాలేందుమౌళిఁబాడి. 172

టీక. జాలపాదమునంఘ్రిన్ = హంసపాదమునందు; కీలితంబగు = లగ్నమై యున్న; కుంచె= చామరము; సితాబ్జముభాతిన్ = తెల్లతామరవలె; క్రాలన్ = ప్రకాశింపఁగా; [నారదుని యొక్కచేతి యందు తెల్లని చామరము కలదనియు, అది హంసపాదమున చిక్కుకొనియున్న తెల్లతామరపూవువలె ప్రకాశించుచున్నదనియు భావము.] బిరుదంబున్, పొగడు = సామర్థ్యమును, కొనియాడు; శ్రీశ్వరు శంఖము, అనఁజాలి = విష్ణుని పాంచజన్యమనఁదగి; తన్నామముఖరకంధర = ఆవిష్ణునామస్మరణచేఁ బ్రతి ధ్వనించు కంఠము; [నారదుఁడు విష్ణునామస్మరణ చేయుచుండఁగా అతనికంఠము పూరింపఁబడిన పాంచ జన్యమువలె ప్రకాశించుచున్నదని భావము.] రజతాద్రికూటగర్జత్కాలికాకృతిన్=కైలాసపర్వతము చరియయందు ఉఱుముచున్న కాఱుమబ్బువలె; బృహదంసమునన్ = గొప్పమూఁపుపయిని; ఇడ్డ=ఉంచిన; మహతి, పలుకన్ = మహతియను వీణ ధ్వనిచేయఁగా; [నారదుఁడు కైలాసమువలెను, అతనిమూఁపు చరియవలెను, మేళవించిన వీణ, ఉఱుముచున్న కాఱుమబ్బువలెను ఉన్నవని భావము.] నిగిడి = విజృం భించి; సుషుమ్న = సుషుమ్న యను నాడి [నాడులు మూఁడు - అవి ఇడ, పింగళ, సుషుమ్న అను నవి. సుషుమ్న యిడా, పింగళల నడుమనుండునది.] ఈనిన = ప్రసవించిన; పిల్లవెలుఁగులవడువునన్ = చిన్నకాంతులవలె; నెఱసంజజడలు = సంధ్యాకాలమువలె ఎఱ్ఱనైన జడలు; నిక్కన్ = వ్యాపించఁగా; [నారదుని దేహముపై తలనుండి వ్రేలాడు జడలు సుషుమ్ననాడి పిల్లలను పెట్టినట్లు ఎఱ్ఱని కాంతులతో ప్రకాశించుచున్నవని యర్థము.] తరణిజిత్ప్రభతోన్ = సూర్యుని మించు కాంతితో; మేఘసరణిన్= మేఘమండలపుదారినుండి; శతానందనందనుఁడు = బ్రహ్మకుమారుఁడైన నారదుఁడు; నందనీటన్ = కనందాపదిజలమున; మజ్జనంబాడి = స్నానముచేసి - బాలేందుమౌళిన్ = చంద్రశేఖరుఁడగు శివుని; పాగడి = కొనియాడి. అలం. ఉపమ.

చ. తటపుటబిల్వభూరుహవితానలతానవపుష్పనిష్పత
జ్జటిలమధూళిధూళిభవసౌరభమార! భ్రమింపఁజొచ్చె ని
చ్చటవనదేవతోద్ధతకుచద్వితయాశ్రితయక్షకర్దమ
చ్ఛటలఁ [2]దటాలునన్ వెడలు సారపుఁ [3]దావులత్రోవ లాగుచున్. 173

టీక. తట......సౌరభము = ఒడ్డులయందు (ప్రక్కలయందు) న్న మారేడుచెట్లగుంపు యొక్క తీగలనున్న పూవులనుండి రాలుచు, ధారారూపమగు తేనెతుంపులపరిమళము; వన...... చ్ఛటలన్ = వనదేవతల నిక్కిన చనుగవలయందలి యక్షకర్దముఁబోలిన కాంతులతో; [కర్పూరము, అగరు, కస్తూరి, తక్కోలములు కలిపి నూరిన అంగరాగము యక్షకర్దమము.] 'తటాలునన్, వెడలు =

1. శ. ర. వ్రేల. 2. ట. దటిల్లనన్. చ. దటాలనన్. 3. క. దావులుద్రో. చ. దావులత్రో.

అకస్మాత్తుగా వ్యాపించునట్టి; సారపుతావులత్రోవలు = గాఢమైన పరిమళములతోఁ గూడిన దారులందు; అగుచున్ = నిలుచుచు; భ్రమియింపఁజొచ్చెన్ = తిరుగఁజొచ్చినవి! - ఔర! = ఎంతఆశ్చర్యము! (అని నారదుఁ డనుకొనుచున్నాఁడు. ముందు అయిదు పద్యములును నారదకృతవర్ణనరూపములే.] అలం. ఉపమ.

తే. ఉచితనేపథ్యయుతలయ్యు నురగసతులు, సిఘ్నునిజమౌళిమణిఘృణివిఘ్నులబ్ధి
నభికసంకేతములకు రే లరిగి యరిగి.తిరుగుమొగమైన చిక్కులతెరువు లివిర!

టీక. ఉరగసతులు = నాగయువతులు; ఉచితనేపథ్యయుతలయ్యున్ = (అభిసరణమునకు) అనుకూలమగు వేషముతోఁ గూడినవారయినను; రేలు = రాత్రులు; అభికసంకేతములకున్ = తమ ప్రియుం లేర్పఱచిన రహస్యస్థలమునకు; అరిగి, యరఁగి = పోయి, పోయి; నిఘ్ను......లబ్ధిన్ = (తమ్ము) తెలియఁజేయు శిరోమాణిక్యముల కాంతులవలన; ఆటంకము కలుగుటచే; తిరుగుమొగమైన = వెనుకకు తిరిగిపోయిన; చిక్కులతెరువులు = చిక్కయినదారులు; ఇవిర! = ఇవికదా! [ఇచట నిఘ్న= స్వాధీనములై యుండెడి' అని పూర్వటీక, అది సరి కాదు.] అలం. విషాదనము.

ఉ. వ్యాళకరాళకుంభములు వ్రచ్చుట [1]గ్రుచ్చుటఁబోలెఁ బచ్చిపసు
త్యాలు నఖాగ్రధారలకు నాభరణాచరణం బొనర్ప నీ
శైలగుహాగృహస్థలులఁ జల్పెడు నిద్దురలౌర! గట్టురా
చూలి వయాళివావురము సూడుకుఁబట్టు మహోగ్రసింహముల్. 175

టీక. గట్టు......వావురమున్ = పార్వతీదేవికి వాహనమగు సింహమును; సూడుకుఁబట్టు = విరోధించు; మహోగ్రసింహముల్ = మిక్కిలి భయంకరములగు సింహములు; వ్యాళకరాళకుంభములు= దుష్టగజములయొక్క విశాలములగు కుంభస్థలములను; వ్రచ్చుట = చీల్చుట; గ్రుచ్చుటఁబోలెన్ = గ్రుచ్చుకొన్నట్లుగా; నఖాగ్రధారలకున్ = గోటికొనల మొదలకు; ఆభరణాచరణంబు, ఒనర్పన్ = నగ యగుటను పొందింపఁగా; శైల......స్థలులన్ = మంచుకొండగుహాలనెడు ఇండ్లయందు; నిద్దురలు, సల్పెడున్ = నిద్దురపోవుచున్నవి! ఔర! = ఎంతయాశ్చర్యము! అలం. ఉపమ.

సీ. కాఁబోలు నివి గణగ్రామణి కల్పితానల్పవిహారగేహాంగణములు
కాఁబోలు నివి చరత్ఖచరచారుస్తనీ సమ్మర్దగళితభూషాస్రజములు
కాఁబోలు నివి దక్షకన్యాంఘ్రివిన్యాస ధన్యాసకృత్కేళిమాన్యగుహాలు
కాఁబోలు నివి మోదకప్రియప్రబలదంతవ్రాతనిర్భిన్నధాతుఖనులు

తే. తెలియఁ గాఁబోలు నివి వహ్నితిలకచలక, పర్దనిర్ఘోషసురసరిద్ప్రవాళలహరి
గహనకుసుమాయమానశీకరసి[2]హాత, శీతలత్స్ఫాతలోత్థద్రుపోతకములు. 176

టీక. గణ .....హాంగణములు = ప్రమథగణశ్రేష్ఠులు ఎక్కువగా విహరించు నిండ్లముంగిళ్లు; చరత్.....స్రజములు = తిరుగుచున్న గంధర్వస్త్రీలరాయిడివల్ల రాలిన అలంకారములగు హారములు; దక్ష.....గుహాలు = పార్వతీదేవి అడుగులుపెట్టుటచేత కృతార్థములును, పెక్కుసారులు క్రీడించుటచే గౌరవింపఁబడినవియు నగు గుహాలు. [ఇచట పూర్వటీకలో 'ధన్యాసకృత్కేళి అనుచోట సకృత్కేళి అని విడఁదీసి 'ఒకానొకప్పుడు క్రీడించెడి శ్లాఘ్యమయిన గుహాలు' అని అర్థము వ్రాయఁబడినది.] మోదక.....ఖనులు=వినాయకుని బలిష్ఠములగు దంతము లను నీఁటెలచే పొడువఁబడిన జేగురు మొదలగు వాని గనులు; [పూర్వటీకలో ఈపద్యము తొలిపాదమున 'గణగ్రామణి=గణాధిపతి' అని అర్థము వ్రాయఁబడినది; ఈ యర్థమునట గ్రహించిన నీ పాదము పునరుక్తప్రాయమగును.] వహ్ని.....పోత

1. చ. గ్రుచ్చు. 2. చ. వాత.

కములు-వహ్ని తిలక = అగ్ని తిలకముగాఁ గల శివునియొక్క; చల = కదలుచున్న; కపర్ద = జటాజూటమునందలి; నిర్దోష = దోషములేని - పవిత్రమైన; సురసరిత్ = గంగానదియొక్క; బహుళ = ఎక్కువైన; లహరి = ప్రవాహములనెడి; గహన = అడవియందు. [ఇట ప్రాఁతటీకలో 'ప్రవాహము నందలి అడవిలోని' అని కలదు.] కుసుమాయమాన = పూవులుగా చేయఁబడిన; శీకర = తుంపరల యొక్క; నిపాత = పడుటచే; శీతల = చల్లనైన; క్ష్మాతల = భూమియందు; ఉత్థ = పుట్టిన; ద్రుపోతకములు = మొక్కలు. [శివుని జడలలోని గంగయొక్క తుంపరలు పూఁవలె నేలరాలఁగా, అచ్చటి భూమి చల్లబడెననియు, అచట చిన్నచిన్న మొక్కలు లేచినవనియు నభిప్రాయము.] అలం. ఉపమ.

తే. రాజతాహార్యగోరాజ రాజమునకుఁ,జంద్రశేఖరవరకకుచ్చారువునకు
నీ మహాసింధు వుపకంఠసీమ నిగిడి, డాలు దీపించె నిదె గంగడోలుఁబోలె. 177

టీక. రాజితా ..రాజమునకున్=కైలాసపర్వతము అను వృషభమునకు; చంద్ర......చ్చారువునకున్ = శివుఁడను మూఁపుచే చక్కనగుదానికి; ఈ మహాసింధువు = గొప్పనదియైన యీ గంగ; ఉపకంఠసీమన్ = కంఠసమీపప్రదేశమున; నిగిడి=వ్యాపించి; గంగడోలుఁబోలెన్, డాలుదీపించెన్ = ప్రకాశించెను. అలం. రూపకము, ఉపమ.

ఉ. ఈ పృథివీధరంబున నిభేంద్రతటో[1]త్కటదానధారలై
ద్వీపవతీతరంగతట విస్ఫుటశైవలకందళంబులై
తాపసబాలికా శ్రవణ దత్తయవాంకురభూషణంబులై
రేపు దమంబు నేయు శబరీ కబరీ నిబరీసనీలిమల్. 178

టీక. ఈ పృథివీధరంబునన్ = ఈపర్వతమందు; శబరీ......నీలిమల్ = బోయఁపడుచుల జుట్టుయందలి దట్టమగు నలుపులు; ఇభేంద్ర......ధారలై = గొప్పయేనుఁగుల చెక్కిళ్లయందలి గొప్ప-మదధారలగుచు; ద్వీపవతీ......కందళంబులై = గంగానదియొడ్డున ప్రకాశించు నాచుమొలకలగుచును; తాపస......భూషణంబులై = మునికన్యలచెవులకుఁబెట్టఁబడిన గడ్డిమొలకలనగలగుచును; రేపు= పగలు; తమంబునేయున్ = చీఁకటిని కల్గించును. అలం. ఉల్లేఖము.

క. ఇటు లనుచుఁ దో[2]ఁచి చని ముం
దట ముని గనుఁగొనియె వేల్పుదళములు గొలువన్
ఘటపటుక ప్రముఖమహా
జటిలులతో వచ్చు నాభుజగభుగ్వాహున్. 179

టీక. తోఁచి = ముందుగా సాగి; వేల్పుదళములు = దేవసేనలు; కొలువన్ = సేవింపఁగా; ఘట......జటిలులతోన్ = అగస్త్యుఁడు మొదలగు గొప్ప మునులతోఁగూడ; ఆ భుజగభుగ్వాహున్= పాము లాహారముగాఁగల నెమలిని ఎక్కిన కుమారస్వామిని.

మ. కని యేకారణ మేఁగుదెంచిరొకో యీ[3]కాసూధరుం డీమునుల్
కనఁ జిత్రంబకుఁ గంటిఁ[4]గంటి; స్వకృతస్కాందో క్తియుం దావహి
ల్లిన సందేహముఁ దండ్రిచేఁ దెలియ హాళిన్ వీరిఁ దోకొంచుఁ గ్రాం
చనగోద్భేదియు వచ్చె నిట్లగుటకున్ శంకింప నింకేటికిన్. 180

టీక. ఏకారణము = ఎందులకు; కాసూధరుండు = కుమారస్వామి - శక్తిని ధరించినవాఁడు; ['కాసు' కుమారుని యాయుధము పేరు] కంటిఁగంటిన్ = చూచితి, చూచితిని - ఎఱిఁగితిని;

1. క. దిత. చ. త్కట. 2. ట. తండము నిలువన్. 3. క. కామాధరుం. ట. తారాసూదనుం. 4. క. కంటి.

స్వకృతస్కాందోక్తియందున్ = తాను రచించిన స్కాందపురాణమునందు; ఆవహిల్లిన = కలిగిన; తండ్రిచేన్ = తండ్రివలన; తెలియుచాళిన్ = తెలిసికొనునాసక్తిచేత; వీరిన్ = ఈమునులను; తోడ్కొంచున్ = తోడు తెచ్చుకొనుచు; క్రౌంచనగోద్భేదియున్ = క్రౌంచవిదారకుఁడగు కుమారస్వామియును.

క. శరవణభవయుతు లగు నీ [1]పరమమునులు శ్రోతలఁట ! యపార ప్రజ్ఞా
కరుఁడు నిశాకరశిశుశేఖరుఁడు హరుఁడు వక్తయఁట ! యగమ్యము గలదే? 181

టీక. శరవణభవయుతులగు = కుమారస్వామితోఁ గూడియున్న; అపారప్రజ్ఞాకరుఁడు = అంతులేని ప్రతిభకు నిధి; నిశా.....శేఖరుఁడు = బాలచంద్రుఁడు తలమానికముగాఁ గలవాఁడు- హరుఁడు; వక్త = చెప్పువాఁడు; అగమ్యము = తెలియరానిది.

తే. అతిరహస్యంబు శుద్ధంబు నాజవంజవార్తిహరణంబు నగు నెద్ది యడిగెనొక్కొ ?
కొడుకు సర్వజ్ఞువిజ్ఞానకుశలు ధర్మమర్మనిర్ణయవాఙ్మయమహితుఁ దండ్రి. 182

టీక. ఆజవంజవార్తిహరణంబు = సంసారదుఃఖమును హరించునది; ధర్మ...మహితున్ = ధర్మరహస్యములను నిర్ణయించు జ్ఞానమున గొప్పవానిని; తండ్రిన్ = శివుని.

మ. మును పుట్టెం బ్రకృతిం దమంబును రజంబున్ సత్త్వము న్వాఁగ; నం
దు [2]నిలింపారులు తామసాత్మకులు; మర్త్యుల్ రాజసుల్; సాత్త్వికుల్
దనుజద్వేషణు; లందుఁ బూజ్యులు నితాంతఖ్యాతి నా*నిర్జరుల్
ఘనుఁ డందింద్రుఁ [3]డతీంద్రుఁ డీశుఁ డమరుల్ గా రెవ్వరుం దత్సముల్. 183

టీక మును = తొలుత; నిలింపారులు = దేవశత్రువులు - రాక్షసులు; తామసాత్మకులు = తమోగుణప్రధానులు; మర్త్యుల్ = మనుష్యులు; రాజసుల్ = రజోగుణముకలవారు; సాత్త్వికుల్ = సత్త్వగుణప్రధానులు; దనుజద్వేషణులు = రాక్షసులను ద్వేషించు దేవతలు; అందున్ = మువ్విధముల వారియందు; నితాంతఖ్యాతిన్ = గొప్పకీర్తియందు; నిర్జరుల్ = దేవతలు; ఘనుఁడు = గొప్పవాఁడు; అతీంద్రుఁడు = ఇంద్రుని మించినవాఁడు; ఈశుఁడు = శివుఁడు; తత్సముల్ = అతనితో సమానమైనవారు.

ఉ. దక్కిన విష్ణుభక్తియు దృఢంపువిరక్తియుఁ గల్గు నమ్మరు
ద్భుక్కటకున్ భజించు మతి పుట్టక కంపలఁబడ్డ కాకినై
యక్కట! మోసపోయితిఁగదా! పెనుత్రిమ్మట నెంతవారికిన్
దక్కునె! ముఖ్యసౌఖ్యము విశిష్టజనంబుల [4]సఖ్య మందమిన్. 184

టీక. దక్కిన = దక్కిన - లభించిన; దృఢంపు విరక్తియున్ = దృఢమైన వైరాగ్యమును; అమ్మరుద్భుక్కటకున్ = గాలి ఆహారముగాఁగల పాములు కడియములుగా కల శివుని; భజించు, మతి = సేవించుబుద్ధి; కంపలఁబడ్డ కాకినై = అనావశ్యముగ త్రిమ్మరువాఁడనయి; పెనుత్రిమ్మటన్ = పెద్ద త్రిప్పటవలన - శ్రమవలన; ముఖ్యసౌఖ్యము = ప్రధానమగు సుఖము - భగవత్సేవ; విశిష్టజనంబుల సఖ్యము = గొప్పవారితోడి చెలిమి; ఒందమిన్ = పొందకుండఁగ; అలం. అర్థాంతరన్యాసము. లలితము.

స్రగ్ధర. ఐనం గానిమ్ము నన్నీ యతిగురుఁడు విడం డాప్తభృత్యుండుగా స
న్మానాధీనుండుగా వైష్ణవసుఖదుఁడుగా మత్కృపాపాత్రభూతుం

1. చ. వరమ. 2. క. నిలింపాదులుదా. చ. నిలింపారులు. *నాజానుజుల్. క. 3. క. డుపేంద్రు. చ. డతీంద్రు. 4. ట. సఖ్యమున్ మహిన్.

డౌ నంచుం బ్రోచి గోప్యం బగునది తెలుపుఁగా బ్రార్థితుండై మురారి
ధ్యానానూనాశయుల్ తుల్యదృశులు దమశిష్యాళి భావింతు రెందున్. 185

టీక. యతిగురుఁడు = యతు (యోగు)లకు గురువైనవాఁడు - శివుఁడు; విడంబు = విడువఁడు; ఆప్తభృత్యుండుగాన్ = ఆప్తుఁడగు సేవకునిగాను; నస్యానాధీనుండుగాన్ = గౌరవపాత్రునిగాను; వైష్ణవసుఖదుఁడుగాన్ = విష్ణుభక్తులకు సుఖమును కలిగించువానినిగా; మత్కృపాపాత్ర భూతుండు = నేను దయతలఁపఁదగినవాఁడు; గోప్యంబగునది = రహస్యమైనదానిని; మురారిధ్యానానూనాశయుల్ = విష్ణుధ్యానముచే గొప్ప మనసుకలవారు; తుల్యదృశులు = పక్షపాతములేక, సమదృష్టికలవారు; భావింతురు = ఆదరింతురు. అలం. అర్థాంతరన్యాసము.

క. కావున శరణము వేఁడెద, నావైష్ణవసార్వభౌము నడిగెద నాకున్
గావలసిన యర్థము లా, దేవుండును దెలుపుఁ [1]దేటతెల్లముగాఁగన్. 186

టీక. వైష్ణవసార్వభౌమున్ = విష్ణుభక్తులలో శ్రేష్ఠుని; తేటతెల్లముగాఁగన్ = స్పష్టముగా.

క. అని నిశ్చలతరనిశ్చయ, మున నారదుఁ డరిగె సురసమూహావాసం
బునకుం గైలాసమునకు, ననుబింబితశాంభవాట్టహాసంబునకున్. 187

టీక. నిశ్చలతరనిశ్చయమునన్ = చలనములేని అభిప్రాయముతో; సురసమూహావాసంబునకున్ = దేవతలగుంపునకు నివాసమగుదానింగూర్చి; అనుబింబిత............హాసంబునకున్ = శివుని అట్టహాసము(పెద్దనవ్వు)ను బోలినదానింగూర్చి - తెల్లనైన దానింగూర్చి యనుట. అలం. ఉపమ.

సీ. నగధన్వివాహనం బగు గోవృషము ఱంకెలనఁ బొల్చు ఘంటామహాక్వణములు
హరశిరశ్శశిరేఖయపరాపతారంబు లనఁబొల్చు సేవాగతాబ్జముఖులు
కాద్రవేయాకల్పకంఠమూలచ్ఛాయ లనఁ బొల్చు నగరుధూపా[2]యతంబు
లీశానభూషణాహిస్ఫటామణికాంతు లనఁబొల్చు రత్నదీపాంకురములు
తే. ఖండపరశుతనుప్రభాఖండదుగ్ధ, జలధిజలశీకరము లనఁబొలుచు వేల్పు
[3]టేలికలు చల్లుపూవుదోయిళ్లుఁ గల్గు, [4]నగము మునిముఖ్యునకుఁ దృగానంద[5] మొసఁగె.

టీక. నగధన్వివాహనంబగు = కొండ (మేరుపర్వతము) విల్లుగాఁ గల శివుని వాహనమైన; ఘంటామహాక్వణములు = ఘంటానాదములును; హర......తారంబులు = శివునితలమానికమగు చంద్రకళయొక్క రూపాంతరములు; సేవాగతాబ్జముఖులు = శివుని సేవింపవచ్చిన స్త్రీలును; కాద్రవేయా......చ్ఛాయలు = పాములు ఆభరణములుగాఁ గల శివుని కంఠకాంతులు; అగరుధూపాయతంబులు = ఎక్కువైన ధూపములును; ఈశాన...కాంతులు = శివునినగలగు పాములపడగలయందలి మణుల కాంతులు; ఖండపరశు......శీకరములు=శివునిదేహకాంతి యను అఖండమగు పాలసముద్రపు నీటితుంపరలు; వేల్పుటేలికలు = దేవతాప్రభువులు; పూవుదోయిళ్ళు = పుష్పాంజలులును; నగము = కైలాసపర్వతము; దృగానందము = కన్నులపండువును; ఒసఁగెన్ = కలిగించెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. ఆకొండ నెత్తాన హైమసాలావళీ వేల్లితంబగు [6]బలంవీడు గాంచె
*నావీటి నడుచక్కి నభిరామశుభవిభాధగధగాయిత మొక్కనగరు గాంచె
నామహాప్రాసాద మల్లనల్లన డాసి వాకిట నొక [7]కపివదనుఁ గాంచె
నాకపిం బిలపనుచే ననుమతుండై చొచ్చి చని యొక్కముత్యాలచవికఁ గాంచె

1. క. తేట. చ. దేట. 2. చ. యుతంబు. 3. ట. టేరికలు. 4. చ. నగరు. 5. చ. మొదవె. 6. చ. బత్తి. * శ. ర. నవ్వీటి. 7. క. కీశ. చ. కపి 8. ట. లవదనుచే.

తే. నందు విధుకాంతవేదికాభ్యంతరమున, ద్వీపిచర్మోపరిస్థుఁడీసితార్క
కోటినిభమైన యొక నిరాఘాటనిర్ఘు,నిరుపమప్రభుఁ గాంచె నిర్నిమిషదృష్టి. 189

టీక. ఆకొండనెత్తానన్ = ఆకైలాసమందలి విశాలమగు సమప్రదేశమున; హైమసాలావళీ వేల్లితంబగు = బంగరుప్రాకారములచే చుట్టుకొనఁబడిన; ['వేల్లితంబు = ప్రకాశించునది' అని పూర్వ టీక.] బలపీడు = గొప్పపట్టణమును; ఆపీటినడుచక్కిన్ = ఆపట్టణపుమధ్యస్థలమున; అభిరామశుభ విభాభగధగాయితము = ఇంపై మేలయి తళతళమని ప్రకాశించు; నగరు = సౌధము; ఆ మహాప్రాసాద మున్ = ఆగొప్పసౌధమును; అల్లనల్లనన్ = మెల్లమెల్లఁగా; డాసి = సమీపించి; కపివదనున్ = గజాస్యుని; కపిలపనుచేన్ = వినాయకునిచే; ముత్యాలచవికన్ = ముత్యాలమండపమునను విధు...... ......తరమునన్ = చలువరాలితిన్నెనడుమను; ద్వీపి .....సిభమ = పులితోలిపై కోటిసూర్య ప్రభలతో ప్రకాశించునది; నిరాఘాట......ప్రభన్ = మీరఁజాలనిదియు, దోషములేనిదియు, సాటి లేనిదియు నగు కాంతిని; నిర్నిమిషదృష్టిన్ = ఱెప్పపాటులేని చూపుతో; కాంచెన్ = చూచెను.

ఉ. కాంచి విరించినందనుఁడు కన్నులు బిమ్మిటినొంద డింది యొ
క్కించుక కొంకుదేఱి కనియెన్ దదుదగ్రమహోగ్రదీప్తిలోఁ
బంచముఖున్ శిఖిక్షణవిభాసిలలాటు మరుజ్ఝరీధరున్
సంచితసత్కృపారసవశంవదు నాదికపిన్ వృషాకపిన్. 190

టీక. విరించినందనుఁడు = బ్రహ్మకొడుకు - నారదుఁడు; బిమ్మిటినొందన్ = సంకోచము పొందగా - జిగేలుమనఁగా; డింది = తొట్రుపడినవాఁడై; కొంకుదేఱి = సంకోచము వీడి; తదుగ్ర మహోగ్రదీప్తిలోన్ = మిక్కిలి భయంకరమగు నా తేజస్సులో; పంచముఖున్ = ఐదుముఖములు కలవానిని; శిఖి......లలాటున్ = నిప్పుకంటిచేఁ బ్రకాశించు నుదురు కలవానిని; మరుజ్ఝరీధరున్ = ఆకాశగంగను దాల్చినవానిని; సంచిత - వశంవదున్ = కూడఁబెట్టిన కర్మము (పుణ్యము) నకు దయచే వశమగువానిని; ఆదికపిన్ = ప్రధానచైతన్యమైనవానిని; వృషాకపిన్ = శివుని; కనియెన్. అలం. పరికరము.

చ. విడువని వైరవృత్తిఁ దఱివేచి రతీశుఁడు చేతికత్తి నె
క్కుడురభసంబునన్ శిరసు గ్రుచ్చిన నయ్యలుఁ గెల్లఁబోయి లో
నడఁగ బహిఃస్థితత్సరు[1]పదార్పితసూకరదంష్ట్ర కైవడిన్
జడముడిఁ జంద్రరేఖ వెదచల్లఁగఁ జల్లని చిన్నివెన్నెలల్. 191

టీక. వైరవృత్తిన్ = పగచే; తఱి = సమయము; రతీశుఁడు = మన్మథుఁడు; ఎక్కుడు, రభసంబునన్ = ఎక్కువతొందరతో; అయ్యలుఁ గెల్లన్ = ఆ యాయుధము (కత్తి) అంతయును (పూర్తిగా); పోయి = లోనికి చొచ్చి; లోన్, అడఁగన్ = శిరస్సులో అణఁగిపోఁగా; బహిః...... కైవడిన్ = బయట కానవచ్చుచున్న దాని పిడిగా, పందికోరపలెనున్న; వెదచల్లఁగన్ = వ్యాపింపఁ జేయఁగా, అలం. ఉపమ.

ఉ. కుంకుమపంకశోణ యగు కొండలమండలనాథుపట్టి వా
మాంకము దాకొనన్ ఘుణఘుణారవభూరికపాలమాలికా
లంకృతు లోంకృతుల్ నొడువులా గడరన్ దటవిద్రుమద్రుమ
క్రేంకృతికారి సారసపరీతసుధానిధిరీతిఁ గ్రాలుచున్. 192

1. క. పదార్పిత. చ. ట. పదార్పిత.

టీక. కుంకుమపంకశోభి, యగు = కుంకుమకర్దమముచేఁ బ్రకాశించు; కొండలమండలసాధు పట్టి = పార్వతి; వామాంకము, దాకొనన్ = ఎడమతొడను; చేరఁగా; ఘణ......లంకృతులు = ఘణఘణమని ధ్వనిచేయు పుసకలనగలు; ఓంకృతుల్ = ఓంకారములను; నొడువులాగు, అడరన్ = పలుకునట్లు ప్రకాశింపఁగా; తట......సుధానిధిరీతిన్ = ఒడ్డుననున్న పగడపుచెట్లపై క్రేంకారములు చేయుచున్న చాతకపక్షులు గల పాలసముద్రమువలె; క్రాలుచున్ = ప్రకాశించుచు. [ఇచట పూర్వటీకలో "సారసపరీత = తామరచేత చుట్టఁబడిన; సుధానిధిరీతిన్ = చంద్రునివిధమున" అనియున్నది. అది సంగతముగా లేదు.] శివుఁడు పాలసముద్రమువలెను, పార్వతి కుంకుమశోణ యగుటచే పగడపుమ్రానివలెను, పుసకలధ్వని చాతకములక్రేంకారములవలెను ఉన్నవని అర్థము అలం. ఉపమ.

చ. ఉమ [1]పసుపాడి మేనుతడి యొత్తిన హత్తిన తన్నిశాంకదృ
క్కమలద[2]ళాంజనాంకకళంకంబుగ [3]నింబగుచేలఁ గేలి వి
భ్రమగతిఁ [4]గప్పినాఁ డనఁగఁ బచ్చనినల్లనిచారలన్ మనో
రమ మగు ద్వీపిరాడజినరత్నము యత్నము మీఱఁ బాల్పుచున్. 193

టీక. ఉమ = పార్వతీదేవి; పసుపాడి = పసుపుపూసికొని, స్నానముచేసి; మేనితడి యొత్తినన్ = దేహముపైనుండు తడిని ఒత్తఁగా; హత్తిన = అంటుకొనిన; తన్నిశాంక......కంబుగన్ = ఆ పసపుగుఱుతులతోడి తామరలవంటి కన్నులయందలి కాటుకగుఱుతులకు మేలిమిగా; ఇంబగు = ఇంపైన; చేలన్ = వస్త్రమును; కేలివిభ్రమగతిన్ = ఆటయందలివిలాసపుకోరికచేత; మనోరమమగు = మనోహరమైన; ద్వీపిరాడజినరత్నమున్ = మేలయిన పులిచర్మమును; అలం. ఉపమ, ఉత్ప్రేక్ష.

ఉ. దండనమస్క్రియాభిరతిఁ దండములై బలభిన్ముఖామరుల్
తండుసువర్ణదండముఖతాడనభిన్నకిరీటులయ్యుఁ బెన్
జండితనంబునన్ మిగుల సందడిసేయుచుఁ జొచ్చిరాఁ గృపం
బండిన నిండుఁజూపు పయిఁ బర్వఁగ వారల గారవించుచున్. 194

టీక. దండనమస్క్రియాభిరతిన్ = దండప్రణామము నాచరించుకోరికతో; తండములై = గుంపుగాఁ గూడినవారై; బలభిన్ముఖాసురుల్ = ఇంద్రుఁడాదిగాఁగల దేవతలు; తండు......లయ్యున్ = శివకింకరుఁడగు నందియొక్క బంగారుబెత్తముచే; కొట్టుటవలన పడిన కిరీటములు కలవారైనను; పెన్, చండితనంబునన్ = పెద్ద మూర్ఖతచేత; కృపన్, పండిననిండుఁజూపు = దయ కలచూపు; పయిన్, పర్వఁగన్ = వారిపై, వ్యాపింపఁగా; గారవించుచున్ = గౌరవించుచు.

తే. చరణపీఠోపకంఠనిషణ్ణవృషభ,రాజకకుదర్పితాంఘ్రిసరోజుఁ డగుచు
నిండుకొలువున్న దేవతామండలేశు, నీశు డగ్గఱి మ్రొక్కి యోగీశ్వరుండు. 195

టీక. చరణ......సరోజుఁడు = పాదముల సమీపమునఁ గూర్చున్న నందీశ్వరునిమూఁపుపై నుంచఁబడిన పద్మములఁబోలు పాదములు కలవాఁడు; దేవతామండలేశున్ = దేవతలకు ప్రభువగువానిని; డగ్గఱి = సమీపించి.

క. కనదధరకాంతిపల్లవ,మును దశనద్యుతి లతాంతమునుగా వాక్పూ
జన మొనరించెఁ బురారికిఁ, దనివిసనక [5]మానికులవతంసుఁడు వేడ్కన్. 196

---

1. చ. ట. పసపాడి. 2. చ. శాబ్జ. 3. క. నిమ్మగు. చ. నింబగు. 4. గట్టినా. ట. గట్టినా, 5. ట. సనకమానితమ్ముఁడు.

టీక. కనదధరకాంతి = ప్రకాశించు పెదవికాంతి; పల్లవమును = చిగురును; దశనద్యుతి = దంతకాంతి; లతాంతమునుగాన్ = పుష్పమును కాఁగా; వాక్పూజనము = స్తుతించుటయనుపూజను; తనివి, చనక = తృప్తితీఱక; ఒనరించెన్ = చేసెను. అలం. రూపకము.

తే. కాళరాత్రీశుఁ డగు నీకుఁ గడఁదితమము
పుండరీకాభుఁ డగు నీకు భూరిరజము
సత్కృపాంభోధి యగు నీకు సత్త్వభృతియు
[1]ననుగుణంబులు మూర్తిత్రయైకనిలయ ! 197

టీక. మూర్తిత్రయైకనిలయ! = సత్త్వరజస్తమోగుణాత్మకములగు మూఁడుమూర్తులకును నిలయమవగు నో పరమేశ్వరుఁడా !; కాళరాత్రీశుఁడగు = దుర్గాదేవికిభర్తవగు; కడఁదితమము = అసాధ్యమగు - దట్టమైన, తమోగుణము; (రాత్రిపక్షమున చీఁకటి). పుండరీకాభుఁడగు = తామరపూవుతో సమానమగు కాంతి గల; భూరిరజము = ఎక్కువైన రజోగుణము = (పూవుపక్షమున పుప్పొడి); సత్కృపాంభోధియగు = గొప్పదయాసముద్రుఁడవగు; సత్త్వభృతియుఁన్ = సత్త్వగుణము(సముద్రపక్షమున జలచరములు) కలిగియుండుటయు; అనుగుణంబులు=యుక్తములు. అలం. శ్లేష, కావ్యలింగము.

ఉ. వేదవివాదగోష్ఠిఁబడి వృద్ధుల బుద్ధులఁ [2]గొల్వవచ్చు శ్రీ
గాదిలియై [3]మెలంగఁ గలకాలము గ్రాలఁగవచ్చు నిచ్చ[4]కుం
బ్రోదిడు నవ్యభవ్యసుఖముల్ మఖమాల్యము లొందవచ్చుఁగా
కే దొరకేటికిం దొరకు నీవు విషాగ్నుల [5]నాఙ్గఁబెట్టుటల్. 198

టీక. వేదవివాదగోష్ఠిన్, పడి = వేదచర్చలయందు మునిఁగి; వృద్ధులన్ = పెద్దలను; బుద్ధులన్ = మనస్సులందు; కొల్వవచ్చున్ = సేవింపవచ్చును; [బ్రహ్మ వేదచర్చలందు మునిఁగి - కష్టములేక యున్నాఁడని ధ్వని.] శ్రీ = సంపద; గాదిలియై = ప్రేమగలదై; మెలంగన్ = చరింపఁగా; కలకాలము = శాశ్వతముగా; గ్రాలఁగవచ్చున్ = ప్రకాశింపవచ్చును. [విష్ణువు కష్టమెఱుఁగక కలకాలము శ్రీదేవితోఁగూడి యున్నాఁడని ధ్వని.] ఇచ్చకున్, ప్రోదిడు = కోరికలను వృద్ధిపొందించి నెఱవేర్చు; [ప్రోది+ఇడు = ప్రోదిడు - ఇకారసంధి.] నవ్యభవ్యసుఖముల్ = క్రొత్తవైన మేలి సుఖములను; మఖమాల్యములు = యజ్ఞములకు వెలలైనవానిని; [ఇంద్రుఁడు ఏకష్టములులేక యజ్ఞముల నొనర్చి సమస్తభోగములను అనుభవించుచున్నాఁడని ధ్వని.] విషాగ్నులన్ = కాలకూటవిషజ్వాలలను; ఆనఁబెట్టుటల్ = విజృంభింపకుండ ఆటంకపఱచుటలు. [కాలకూటాగ్నిని అడఁచి యాజ్ఞపెట్టుట శివునకేగాని వేఱొకరికి సాధ్యపడలేదని భావము.]

క. అని పలుకు సిద్ధసంయమిఁ, గనుఁగొని కృపమీఱ నీలకంఠుఁడు రారమ్మని కూర్చుండుటకుం దగ, ననుజ్ఞఁ గావించె హాస[6]సాన్ద్రాధరుఁడై. 199

టీక. సిద్ధసంయమిన్ = సిద్ధముని యగు నారదుని; హాససాన్ద్రాధరుఁడై = చిఱునవ్వుతోడి పెదవికలవాఁడై.

క. కలహాశనముని చెన్నగు, నలికేక్షణు సవిధవసుధ నాసీనుండై
వలిమలపురోధరిత్రిన్, మొలచిన ప్రత్యంతకుధరమునకుఁ దరంబై. 200

1. క. నలు. చ. ట. నను. 2. క. గొల్పవచ్చు. చ. ట. గొల్వవచ్చు. 3. చ. ట. మెలంగు. 4. క. లం. చ. ట. కుం. 5. క. నానఁ. చ. ట. నాఙ్గఁ. 6. క. సాంద్రా. చ. సాన్ద్రా.

టీక. కలహాశనముని = నారదుఁడు; అలికేక్షణుసవిధవసుధన్ = నొసటఁ గన్నుగల శివుని సమీపప్రదేశమున; వలిమలపురోధరిత్రిన్ = హిమాలయపుటెదుటిభూమియందు; ప్రత్యంతకుధరమనఁగన్ = దగ్గఱిచిన్నకొండను; తరంబై = సమానమై; చెన్నగున్ = ప్రకాశించెను. అలం. ఉపమ.

చ. హరుకృప నిట్లు గన్గొని తదాననదత్తనిరీక్షణాబ్జుఁడై
సురముని పల్కె నో పురనిషూదన! నీయనుజీవి నేను మీఁ
దరయక మోసపోయితి గుహాన్వితులై మును లర్థి వేఁడ సు
స్థిరమతి మీరు తత్త్వమును దెల్పెడుచో నిఁట [1]నుండఁగల్గమిన్. 201

టీక. హరుకృపన్ = శివునిదయను; కన్గొని = పొంది; తదాననదత్తనిరీక్షణాబ్జుఁడై = ఆ శివునిముఖముపై నుంచిన పద్మములవంటి చూపులు కలవాఁడై; ఓపురనిషూదన! = త్రిపురములను నశింపఁజేసిన యో హరుఁడా! మీయనుజీవిన్ = మీసేవకుఁడైనవాఁడను; మీఁదు, అరయక = ముందు గానక; గుహాన్వితులై = కుమారస్వామితో కలిసి వచ్చినవారై.

ఆ. సాధుజనులతోడి సంసర్గ[2]ముఱివిన, హాని భయము క్లేశ మావహిల్లు
నెంతవారికైన నిది నిక్క మనుమాట, నన్ను మోచివచ్చె నాగహార! 202

టీక. సంసర్గము = కూడియుండుటను; ఉఱివినన్ = విడిచినచో; ['విడిచినను' అని పూర్వటీక.] ఆవహిల్లున్ = కలుగును; నన్ను మోచి = నన్ను వహించి - నేను తార్కాణముగ; నాగహార! = పాములు హారములుగాఁగల హరుఁడా!

తే. దండితానంగ! నీదండ నుండియుండి, యిపుడు నేఁ జన్న యంతలో బుషులువచ్చి
యెద్ది ప్రార్థించిరో మీర లేవిధమున, నుత్తరం బిచ్చితిరో వారియుక్తులకును.

టీక. దండితానంగ! = శిక్షింపఁబడిన మన్మథుఁడు కల శివుఁడా! నీదండన్ = నీసమీపమునందు.

క. కాలీఁచపడఁ జరింపుదు, నీలోకమునందు నెల్ల నీహితబోధ
శ్రీలాభబుద్ధి నెవ్వరుఁ, బోలరు తత్త్వంబుఁ దెలుపు పోలుపున నిన్నున్. 204

టీక. కాలు; ఈఁచపడన్ = నిస్సత్త్వముకాఁగా - శక్తిలేనిదికాఁగా; నీహితబోధశ్రీలాభబుద్ధిని = హితముఁదెలిపి, మేలుపొందఁజేయునట్టి నీ గొప్పమేధయందును; పోలుపునన్ = పద్ధతియందును.

ఉ. కావునఁ గ్రౌంచభేదియు నగస్త్యుఁడు దక్కుమునుల్ త్రిలోకర
క్షావశబుద్ధి నిన్నడిగి కాంచిన యర్థము లానతిచ్చి నన్
బ్రోవఁగఁ బాడి; యట్లగుటఁ బోష్యులు శిష్యులు నైనవారలన్
దేవరవంటివా [7]రలఁతదీర్చి కృపారసదృష్టిఁ దేల్పరే ? 205

టీక. క్రౌంచభేదియున్ = కుమారస్వామియును; అర్థములు = విషయములను; పాడి = న్యాయము. అలఁతన్, తీర్చి = శ్రమను పోఁగొట్టి.

క. అని పలికి యూరకుండిన, మునిముఖ్యునివినయవాక్యముల కలరి మనం
బునఁ గృష్ణు నిలిపి పురమర్దనుఁ డిట్లనుఁ దత్కథాకథనలాలసుఁడై. 206

టీక. అలరి = సంతోషించి; పురమర్దనుఁడు = శివుఁడు; తత్కథాకథనలాలసుఁడై = ఆ విష్ణుని కథలను చెప్పుటయందు ఆసక్తికలవాఁడై.

1. చ. యుండ. 2. చ ట. ముడివిన. 3. ట. కేని. 4. క. నింత. ట. యంత. 5. ట. కాలిచ్చ. 6. చ. రలుత.

చ. విను మునినాథ! నన్ ఋషులు వేఁడిన యర్థ మబోధతీర్థ మ
త్యనఘ మనంతపుణ్యఫలదాననిదాన మనశ్వరంబు వి
శ్వనుతము దీని పెంపు గనజాలరు తక్కినవార లెవ్వరున్
దనుజరిపుప్రసాదజనితప్రతిభానిధి నేన [1]దక్కఁగన్. 207

టీక. అబోధతీర్థము = ఎఱుకలేని మాహాత్మ్యముకలది; అత్యనఘము = మిక్కిలి పుణ్యమైనది; అనంత......నిదానము = సాటిలేని పుణ్యఫలములనిచ్చుటకు మూలకారణము; అనశ్వరంబు = నశింపనిది - చెడనిది; విశ్వనుతము = లోకముచే కొనియాడఁబడినది; దనుజ......నిధిని = విష్ణువు యొక్క దయవలనఁ గలిగిన ప్రతిభకు నిధినైనవాఁడను.

సీ. తరిద్రాడు*సీద్రంపుఁబోరలంటి గాలిచే జడియుచందమున నంచలు భ్రమింప
సురలు బంతులుసాగి సుధ మిథఃస్పృహఁ [2]ద్రాగు తీండ్రఁ దేఁటులు పూవుఁదేనె లాన
నా మహావిషధూను నామూర్తులన జంబుఫలములం [3]దెల్ల చిల్కలు భుజింప
నాశ్రితాభ్రము లభ్రమతిని గూఁకలు వెట్టుక్రియ మయూరంబులు కెరలి పలుక
తే. నబ్ధి మథియింప నొక్కట నవతరిల్లు, నాఁటిసిరి వోల్చుచాడ్పున నవనవర్తు
లక్ష్మిఁ దిలకింప మదికి నుల్లసన మొసఁగు, మందరంబున మున్నే నుమయునుగూడి.

టీక. తరిత్రాడుసీద్రంపుఁబోరలు = కవ్వపుత్రాడయిన నాగరాజుయొక్క పొరలు; జడియుచందమునన్ = చలించురీతిని; అంచలు = హంసలు; సురలు = దేవతలు; బంతులుసాగి = వరుసలు తీర్చి; సుధన్ = అమృతమును; మిథఃస్పృహన్ = అన్యోన్యాసక్తితో; తీండ్రన్ = తీవ్రవాంఛతో; [తేంట్లు ఒకదానికంటె నింకొక్కటి ముందుగాఁ దేనె లానుచున్నవి; అట్లుండుట - ఒకరికంటె వేఱొకరు ముందుగ నమృతపానముగోరు దేవతలచోరవపాటుతో సమానముగనున్నదనుట.] ఆను = త్రాగు; జంబుఫలములన్ = నేరేడుపండ్లను; ఆశ్రితాభ్రములు = మేఘములనాశ్రయించిన; అభ్రమతిని = వేఱే మబ్బులనుబుద్ధిః; కూఁకలుపెట్టుక్రియన్ = ఊఱుమురీతిని; కెరలి=విజృంభించి; పలుకన్ = కేకలు వేయఁగా; అబ్ధిన్ = సముద్రమును; ఒక్కటన్ = ఒక్కసారిగా; అవతరిల్లు = పుట్టు; నవనవర్తులక్ష్మిన్ = క్రొంగ్రొత్తఋతుశోభను; ఉల్లసనము, ఒసఁగు = ఉల్లాసమును కలిగించు.

ఇందు మొదటిపాదమున శరత్కాలమును, ద్వితీయపాదమున వసంతమును, తృతీయ, చతుర్థ పాదములందు వర్షర్తువును సూచింపఁబడుచున్నవి. అలం. ఉపమ.

ఉ. లాలితలీల నైందవశిలాస్థలి నాస్థలిగుర్పఁ గ్రాలుచో
నా లలితాంగిఁ జూచి విను మద్రిజ! నామదిఁ గూలముద్రుజం
బై లలి నిల్చె నీదగువిహారము తోరముగాఁగ; వేఁడు మి
వ్వేళ వరంబు లిత్తు నిదె వేళము[4] నావిని దేవి యిట్లనున్. 209

టీక. లాలితలీలన్ = ఒప్పిదమైన విలాసముతో; ఐందవశిలాస్థలిన్ = చంద్రకాంతవేదికపయి; ఆస్థలిగుర్పన్ = కోరిక తీరిక లెత్తఁగా; కూలముద్రుజంబై = గట్టులనొరయునదై - అధికమైనదయి; నీదగు విహారము = నీవు నాతో విహరించురీతి; లలిన్ = ఇంపుగా; తోరముగాఁగన్ = అధికము అగునట్లు; వేళమ = త్వరితముగా.

---

1. క. నేను. చ. నేన. * శ. ర. సీద్రంబుబొర. 2. చ. త్రావు. 3. చ. (లేదు). ట. నెల్ల. 4. చ. వేళయ

ఉ. సేవకకల్పభూరు[1]హము శిష్టసుధాంబుధి భక్త[2]రోహణ
గ్రావము దేవముఖ్యుఁ డనఁగాఁ దగు[3]వేల్ప! యనల్పరక్తి నీ
సేవకురాలి కిట్లు దయచేసిన యావర మిప్పు డొల్ల నేఁ
గావలె నన్న నాఁ డొసఁగఁగాఁ దగు నాదగు విన్నపంబునన్. 210

టీక. సేవకకల్పభూరుహము = సేవించువారి పాలిటి కల్పవృక్షము; శిష్టసుధాంబుధి = శిష్టుల పాలి పాలసముద్రము; భక్తరోహణగ్రావము=భక్తులపాలి రోహణ (రత్న)పర్వతము; దేవముఖ్యుఁడు= ప్రధానదేవత; వేల్ప! = ఓదేవుఁడా! అనల్పరక్తిన్ = ఎక్కువప్రేమతో; అలం. రూపకము.

క. అని పలికి కొంతకాలము, చన నేఁ డుపవనవిహారసమయమునందున్
మును నాకడ నున్నవరము, కొని వేఁడెఁ గుమారజనని గురుతత్త్వనిధీ! 211

టీక. కుమారజనని = కుమారస్వామితల్లి - పార్వతి; గురుతత్త్వనిధీ = గొప్పతత్త్వములకు నిధియగు నారదుఁడా!

సీ. కాశి గుహాటవి గయ కురుక్షేత్రంబు సైంధవంబును నైమిశంబు పుష్క-
రంబును దండకారణ్యంబు [4]చంపకారణ్యంబు గాంచనారణ్యకంబు
కేదార[5]మును మహాక్షేత్రంబు గంగ యమున సరస్వతి గూడి [6]మొనసి మెలఁగు
నెలవును మొదలుగాఁగలక్షేత్రములు వేనవే లుర్విఁ బొగడొందు; వీనిలోనఁ
తే. గాఁపురముసేయఁ గొన్నింటఁ గలుగు మేలు
మహిమఁ గొన్నింటఁ జేకుఱు మై దొఱంగ
నిట్టి క్షేత్రంబులకు నెక్కు డెద్ది యెద్ది
[7]మును పరం బిచ్చు నేక్షేత్రమున నిక నీకు? 212

టీక. మొనసి = కలసి; మెలఁగునెలవు = ఉండు స్థానమును - త్రివేణీసంగమమును - ప్రయాగ యును; వేనవేలు = వేలకొలఁదిగ; మై, తొఱఁగన్=దేహమును విడువఁగా - మరణింపఁగా; పరంబు= మోక్షమును; నీకున్ ఉనికి = నీకు, నివాసమై యుండునది.

సీ. నీరజగర్భుండు నీవు నింద్రుండు భాస్కరుఁడు చంద్రుఁడు బృహస్పతియు దక్ష
ముఖ్యప్రజేశసమూహంబు మన్వాదిచక్రవర్తులు మునుల్ సాధ్యసిద్ధ
మనుజమహోరగదనుజ సరీసృప పశుకీట [8]మృగపక్షి పరికరంబు
స్థావరజంగమాత్మక మగు భౌతికం బెవ్వనిచేఁ బుట్టు నెవ్వనికృప
తే. నిలుచు నెవ్వని కినుకచే విలయ మొందు,నమ్మహాశక్తిసంపన్నుఁ డమ్మహాత్ముఁ
డమ్మహానందుఁ డెచ్చోట నధివసించు, నెట్టిదాఁ డమ్మహావిష్ణుఁ డిందుమకుట! 213

టీక. నీరజగర్భుండు = బ్రహ్మ; దక్ష......సమూహంబు = దక్షుఁడు మొదలగు ప్రజా పతుల గుంపు; మహోరగ = నాగులు; సరీసృప = పాములు; ఎవ్వనిచేన్ = ఎవ్వనివలన; ఎవ్వని కినుకచేన్ = ఎవ్వనికోపమువలన; విలయ మొందున్ = నశించునో; ఇందుమకుట! = చంద్రుఁడు కిరీ టముగాఁగల ప్రభూ!

---

1. చ. హవిశి. 2. క. రోహిణ. 3. క. వేల్పవ. చ. వేల్పయ. 4. చ. చన్పకా. 5. చ. మును. 6. చ. యెనసి. 7. క. గన. ట. మును. 8. చ. పితృమాతృ.

క. గంగాదితీర్థమహిమ మ్మ,హిం గాదను తీర్థ మెద్ది? యిమ్మూఁడు [1]మిథః
సంగతి నెచ్చో నుండు న,నంగాహిత! దీని నెఱిఁగి యానతియీవే? 214

టీక. గంగాదితీర్థమహిమన్ = గంగాదికములగు పుణ్యతీర్థముల మాహాత్మ్యమును; కాదను = తిరస్కరించు - అతిశయించు; ఇమ్మూఁడున్ = క్షేత్ర దైవత తీర్థములు మూఁడును; మిథఃసంగతిన్ = ఒకదానితో నింకొకటి కలసి; అనంగాహిత! = మన్మథునికి శత్రుఁడవగు నీశ్వరుఁడా!

మ. అని దాక్షాయణి వేడ నుత్తరము నెయ్యం బొప్ప నీ నున్నయం
త నగస్త్యాదులు గొల్వ వచ్చె శిఖిమీఁదం బొల్చి సేనాని; యే
ననుపన్ స్కందపురాణ మమ్మునులకున్ [2]వ్యాఖ్యాతముం జేయ మున్
[3]జని వారల్ [4]శ్రుతతీర్థులై యదియ గాంక్షన్ వేఁడఁ దాఁ గానమిన్. 215

టీక. దాక్షాయణి=పార్వతి; శిఖిమీఁదంబొల్చి = నెమిలిపైనెక్కి ప్రకాశించి; శ్రుతతీర్థులై= వినఁబడిన తీర్థములు కలవారై; అదియ = మీఁది తీర్థ, దైవత, క్షేత్రము లొక్కచో నుండు విషయమునే; కాంక్షన్ = ఆసక్తితో; తాన్, కానమిన్ = తాను, చూడనందున - తనకు దెలియనందున.

తే. వచ్చి శ్రీక్షేత్రతీర్థదైవతచరిత్ర,మస్మఖంబున మౌనిసమన్వితముగ
నెఱిఁగి వారలుఁ దా నిప్పు [5]డిట్టె యరిగె,నంత నీ వేఁగుదెంచితి వజతనూజ!

టీక. మస్మఖంబునన్ = నావలన; మౌనిసమన్వితముగన్ = మునులతోఁగూడ; అజతనూజ! = నారదా!

ఉ. నావిని శంకరుం బలుకు నారదుఁ డో మదనారి! భూరికా
ర్యావహబుద్ధిఁబోలె భువనాళిని హాళిఁ జరింతు భ్రాంతియన్
కావిరివావిరిం దగిలి కాళుల [6]దోవతి యయ్యె క్షేత్రమున్
దేవుఁడు తీర్థ మొక్కకడఁ దీవ్రతరప్రభ నిల్చు టేఁగనన్. 217

టీక. మదనారి! = మన్మథుని శత్రువగు హరుఁడా! భూరి .....పోలెన్ = ఎక్కువ పనిని నెఱవేర్చుబుద్ధికలవానివలె; భువనాళినిన్ = లోకములను; హాళిన్ = ఆసక్తితో; చరింతున్ = తిరుగుదును; భ్రాంతియన్ కావిరి = భ్రాంతియను నలుపు-చీఁకటి - అజ్ఞానము; వావిరిన్ = క్రమముతో; కాళులన్ = కాళ్లయందు; దోవతియయ్యెన్ = అడ్డముగా పంచ అయ్యెను. కాళ్లలో కట్టుబట్ట పడినట్లయ్యెను. నిప్రయోజనముగాఁ దిరిగితి ననుట. అలం. లలితము.

తే. క్షేత్రదైవతీర్థచారిత్ర మెపుడు
గరళకంధర! యొకచోటఁ గలసి యునికి
యానతి యొసంగి నన్నుఁ గృతార్థుఁ జేయు
మనుడుఁ గలహాశిఁ బలుకు నమ్మనసిజారి. 218

టీక. గరళకంధర! = శివుఁడా! మనసిజారి=శివుఁడు; కలహాశిన్ =నారదునిఁగూర్చి; పలుకున్.

చ. తనమది [7]వల్చు భామినికి దక్కిన నిక్కపుమోహిఁబోలె నే
మనుజుఁడు బుద్ధి నిల్పు మురమర్దనదివ్యకథానుభూతిపై
ననిశము మత్ప్రియుం డతఁడ యట్లగుటన్ వినిపింతు నీకు నేఁ
గని విని యున్నగోప్యము నగమ్యమునైన [8]యదఃప్రపంచమున్. 219

1. క. సదా. చ. ట. మిథ. 2. క. వ్యాఖ్యాన. చ. ట. వ్యాఖ్యాత. 3. క. చని. 4. చ. శ్రుతి. 5. క. డిట్టు. చ. డిట్టె. 6. క. ధావతి. చ. దోవతి. 7. చ. గల్చు. ట. గెల్చు. 8. క. యథః ట. చ. యద

టీక. తనమది = తనమనస్సు; వల్చు = పలచు - ప్రేమించు; భామినికిన్ = స్త్రీకి; నిక్కపు మోహిఁబోలెన్ = నిజముగాఁ మోహించువానినిబోలె; మురమర్దను దివ్యకథానుభూతిపైన్ = శ్రీకృష్ణుని దివ్యకథలను వినుటయందు; బుద్ధిన్; అనిశము=ఎల్లపుడు; నిల్పున్=నిల్పునో; గోప్యమున్= రహస్యమును; అగమ్యమున్ = దుర్లభమైనదియు; అదఃప్రపంచమున్ ఈ వృత్తాంతమును; ['అధః ప్రపంచమున్ = కడచిన సమాచారమును' అని పూర్వటీక.]

ఉ. ఈ సముదగ్రతత్త్వపద మే నొకరుండ నెఱుంగుదుఁ సరో
జాసనుఁ డొక్కరుం డెఱుఁగు నబ్ధితనూజ యొక ర్తెఱుంగు న
వ్వాసవుఁ డొక్కరుం డెఱుఁగు వాజ్మ[1]నుభోగిపతార్క్ష్యులాత్మఁ బ్రా
గ్వాసనమై నెఱుంగుదురుగాని తదన్యు లెఱుంగ రెవ్వరున్. 220

టీక. సరోజాసనుఁడు = బ్రహ్మ; అబ్ధితనూజ = లక్ష్మీదేవి; వాసవుఁడు = ఇంద్రుఁడు; వాజ్మను, భోగిప, తార్క్ష్యులు = సరస్వతి, మనువు, ఆదిశేషుఁడు, గరుత్మంతుఁడును; ప్రాగ్వాసనమైన్ = తమ పూర్వజన్మవాసనచేత; ఎఱుంగుదురు.

తే. దాఁపఁదగువాని మిక్కిలి దాఁపఁగలిగి, క్షేత్రములకెల్లఁ బరమమై కీర్తివడయు
నిమ్మహాక్షేత్రరాజంబు నెఱుఁగఁజాలు, ప్రాజ్ఞుఁ డగువాఁడు మునుఁగఁడు పాపజలధి.

టీక. పరమమై = ఉత్తమమై.

క. పుడమికి వితస్తిమాత్రపుఁ, బొడువున నా క్షేత్రరాజము విరాజిల్లున్
నడుమన జ్యోతిర్యానము, వడువునఁ దేజోమయాభి[2]వర్తితమూర్తిన్. 222

టీక. వితస్తిమాత్రపుఁబొడువునన్ = పండ్రెండంగుళముల ఎత్తున - జ్యోతిర్యానము వడువునన్ = విమానమువలె: తేజోమయాభివర్తితమూర్తిన్ = ప్రకాశించుచున్న రూపముతో.

క. ఆక్షేత్రమునకు సురసద్మక్షితి పాతాళములు సమంబై బుధలో
కక్షేమంకర మగునది, యే క్షేత్రము గాకయుండు నిద్ధవిభూతిన్. 223

టీక. సురసద్మ, క్షితి, పాతాళములన్ = స్వర్గ, భూ, పాతాళలోకములలో; సమంబై = సమానమైనదై; ఇద్ధవిభూతిన్=ప్రకాశించునైశ్వర్యమునందు; బుధలోకక్షేమంకరము = పండితసమూహమునకు మేలు కూర్చునది.

క. ఏవంవిధబహుమహిమమై, కావాసంబైన యమ్మహాక్షేత్రమునం
దే వసియింపుదు విను వసు, దేవసుతార్చా విధేయధీయోగమునన్. 224

టీక. ఏవం......వాసంబు = ఇట్టి పెక్కుమహిమలకు ముఖ్యమగు నునికిపట్టు; ఏన్ = నేను; వసుదేవ......యోగమునన్ = శ్రీకృష్ణుని పూజించు బుద్ధితో;

సీ. సహ్యపాదోద్భూతసరిదన్వయమునకు నేను ధాతయును లక్ష్మీశ్వరుండు
నభిమానులముగాన నందుఁ గృష్ణుఁడు కృష్ణ బ్రహ్మ గౌతమి నేను భైమిఁ [3]గాంచి
యధివసింతుము దండకాటవి మొదలు పంపతుదగాఁగల క్షేత్రపటలమెల్ల
నజునకు హరికి నాకాయత్తమై హత్తు భైమి విష్ణుక్షేత్రభూమిఁ బఱచి

తే. వైష్ణవి యనంగఁదగు నందువలన నాదు
క్షేత్రమున నిల్చి శైవినా ధాత్రి వెలయుఁ

---

1. చ. న. 2. క. వర్ణిత. ట. వర్తిత. 3. ఛ. ట. గాంచి.

తామరససంభవక్షేత్రతలము[1]నందు
బ్రాహ్మియై యొప్పు నిప్పాటఁ బ్రహ్మపుత్ర! 225

టీక. సహ్యా......యమునకున్ = సహ్యపర్వతముదగ్గఱి చిన్నకొండలందుఁ బుట్టిన నదుల సముదాయమునకు; ఆయత్తమై = స్వాధీనమై; హత్తున్ = చేరును; పఱచి = పాఱి; తామరస...... నందున్ = బ్రహ్మ యుండు క్షేత్రమున; ఇప్పాటన్ = ఈరీతిని;

తే. పుణ్యగుణగణ్య పాతకారణ్యహేతి, బహుళపుణ్యద్విజవ్రజపిహితకూల
దీపితాకృతి బుధలోకదీపకళిక, యఖిలలోకవిపచ్ఛాంతి యాస్రవంతి. 226

టీక. పాతకారణ్యహేతి = పాపములను నడవికి (ఖండించు) ఆయుధము - గొడ్డలి; ['పాపములను అడవికి కొఱవి' అని పూర్వటీక.] బహుళ......కూల = ఎక్కువగా నుండు పుణ్యాత్ములగు బ్రాహ్మణులచేతను, ఉత్తములగు పక్షులచేతను కప్పఁబడిన [వ్యాపింపఁబడిన] ఒడ్డులు కలది; దీపితాకృతి = ప్రకాశించు సాకారము కలది; బుధబోధదీపకళిక = పండితుల తెలివికి దీపజ్వాల యైనది; ఆస్రవంతి = ఆయేఱు భైమీనది; అఖిలలోకవిపచ్ఛాంతి=జనులందఱి పాపములను పోఁగొట్టునది; అలం. రూపకము;

తే. నడచి భగవంతుక్షేత్రంబు [2]నడుమఁ జొచ్చి
విరజ యనుసింధు వెచ్చోట విడిసియుండు
నృహరి ప్రత్యక్షమై యుండు నెట్టిచోట
[3]నట్టిచోటను వైష్ణవి యనఁగఁ బరఁగు. 227

టీక. సింధువు = నది; విడిసియుండున్ = ప్రవహించియుండునో; నృహరి = నరసింహస్వామి.

తే. కృష్ణవేణి ప్రకాశిం[4]చు నెంతమేర
నంతమేర మదీయరైై యతిశయిల్లు
భైమి; యట మున్న జలజసంభవునియది యు
కాన మూర్తిత్రితయమయాకార[5]యయ్యె. 228

టీక. కృష్ణవేణి = ఒకనది. కృష్ణానది; ['నల్లనినీటిపాయ' అని పూర్వటీక.]

సీ. చలిదిచిక్కపుదిల్లు[6]సాలుముల్కాసుపై నొయ్యారముగఁ బింఛ మొయ్యఁ జెరివి
భాస్కరాంశులు దూఱి పాఱు ప్రేల్వీనుల వెలలేని మకరకుండలము లునిచి
మోచేతివంపుగా ముడిచి పట్టినకేల వరదాభయంబు లావటముచేసి
పారలేని యరఁటుల నిరసించు మృదులోరుయుగళమధ్యమున గోయష్టి నిలిపి

తే. నిగమనూపురములు మ్రోయ నిరుకుళముగ, సిగ్గువాసిన కటి ప్రకాశింప నురము
కెంపు లేదయిుండఁ గ్రక్కఁ జెక్కిళ్ల నగవు, మొలవ నత్తీర్థమున నిల్చి పొల్చుఁ జక్రి.

టీక. చలిది......కాసుపైన్ = నగిషీ, పట్టుపనితనముకల చలిదిచిక్కపుటల్లికపయి; ఒయ్యారముగన్ = సొగసుగా; ఒయ్యన్ = బాగుగా; చెరివి = దోపి; భాస్కరాంశులు = సూర్యకిరణములు; దూఱిపాఱు = (కన్నములద్వారమున) ప్రవేశించు-వ్యాపించు; ప్రేల్వీనులన్ = ప్రేలాడుచున్నచెవుల యందు; ముడిచి = వంచి; ఆవటముచేసి = పొందుపఱచి; పారలేని - పారలేవక నున్నగా నున్న; నిర

1. క. నంటి. చ. నందు. 2. చ. నడుము. 3. చ. ట. నంత. 4. చ. చొకింత. 5 చ. మయ్యె. 6. చ. సాలుముసాళుపై.

సించు = తిరస్కరించు; మృదులోదరయమళమధ్యమునన్ = సుకుమారమైన రెండు తొడలనడుమను; గోయష్టిన్ = పశువులఁగాచు చేతికఱ్ఱను; నిగమనూపురములు = వేదము లను కాలియందెలు; ఇరు వుళముగన్ = అడ్డములేక; సిగ్గువాసినకటి = దిస్సమొల; ఉరముకెంపు = వక్షస్థలముపై వ్రేలాడు మాణిక్యము; లేయెండన్ = ఉదయభానునికాంతిని; చక్రి = విష్ణువు; బొల్చున్ = ప్రకాశించును. అలం. స్వభావోక్తి, ఉపమ.

తే. తీర్థహారంబునకు వాసు[1]దేవుమూర్తి, నీలతరళాకృతిస్ఫూర్తి నెలవుకొనఁగ
నత్తొడవునకు సంగమాఖ్యాకతీర్థ,తలము దళుకొత్తు హత్తిన [2]కొలికిఁబోలె. 230

టీక. తీర్థహారంబునకున్ = తీర్థమనెడి హారమునకు; వాసుదేవుమూర్తి = శ్రీకృష్ణుని విగ్రహము; నీలతరళాకృతిస్ఫూర్తిన్ = నాయకమణియగు నీలముయొక్క ప్రకాశముతో; నెలవుకొనఁగన్ = ఉండఁగా; అత్తొడవునకున్ = హారరూపమగు ఆ నగకు; సంగమాఖ్యాకతీర్థతలము = సంగమమను తీర్థము; హత్తిన = చేరిన; కొలికిఁబోలెన్, తళుకొత్తున్ = ప్రకాశించును. అలం. రూపకము, ఉపమ.

చ. ఖరనఖరాగ్రనిర్దళిత కర్బురరాజభుజాంతరుండు శ్రీ
నరహరి యుండు సంగమమునం జలమాడి నృసింహు నంఘ్రిపం
కరుహయుగంబు గాంచి తనకల్గినమాత్రము దాన మిచ్చు నే
నరుఁ డొకపూఁట వాఁడును గనంగలఁ డాదిమవిష్ణుధిష్ణ్యమున్. 231

టీక. ఖర......రుండు = వాడిగోళ్లకొనలచే భేదింపఁబడిన హిరణ్యకశిపునిరొమ్ముకలవాఁడు; శ్రీనరహరి = నృసింహస్వామి; ఉండు = నెలకొనియున్నట్టి; ఆదిమవిష్ణుధిష్ణ్యమున్ = విరాట్పురుషుని స్థానమును - వైకుంఠమును; కనంగలఁడు.

క. కలుష[3]వనప్లోషదవా,నలకీలావలయమైన నరహరిక్షేత్ర
స్థలపుణ్యమహిమ లెన్నినఁ, గలుగుఁ [4]గురుక్షేత్రముఖ్యగమనఫలంబుల్. 232

టీక. కలుష......వలయమైన = పాపములను అడవిని కాల్చునట్టి కార్చిచ్చుమంటల ఆవరణము కలదైన; ఎన్నినన్ = కొనియాడినచో; కురు......ఫలంబుల్ = కురుక్షేత్రము మొదలగు ప్రధానక్షేత్రములకు వెళ్లఁగాఁ గలుగు పుణ్యములు; కలుగున్.

తే. అపునరావృత్తి శాశ్వతవిపులసౌఖ్య
సిద్ధి ప్రహ్లాదునికి దయచేసినట్టి
యానృహర్యక్షవిభుక్షేత్ర మధిగమించు
జనుఁడు పాశంబువలన మోచనముఁ గాంచు. 233

టీక. అపున......సిద్ధి = పునర్జన్మలేని శాశ్వతమోక్షసిద్ధిని; నృహర్యక్షవిభుక్షేత్రము = నరసింహక్షేత్రమును; అధిగమించు, జనుఁడు = చేరిన మనుష్యుఁడు; మోచనముఁగాంచున్ = విడుదలను పొందును - ముక్తుఁడగును.

శా. ఆక్షేత్రస్థలి క్రోశపంచకమితంబై యుండుఁ దత్రత్యులన్
వీక్షించుం దివినుండి వేల్పుగమి దిగ్వేదండశుండాకృతా
రక్షుద్రేతరదోశ్చతుష్టయులుఁగా రాజీవరాజీవ స
చ్చక్షూపమ్యులఁగా హిరణ్మయ[6]పటీసక్తోరులంగా మహిన్. 234

---

1. క. దేవ. చ. దేవు. 2. చ. కలికి. 3. చ. దవప్లోష. ట. వనదోషదావా. 4. క. గురున క్షేత్ర. ట. గుఁగురుక్షేత్ర. 5. క్రుత్తో. చ. 6. చ. పటా.

టీక. ఆ క్షేత్రస్థలి = ఆ నృసింహక్షేత్రపువైశాల్యము; క్రోశపంచకమితంబై = ఐదు క్రోశములు కలదై; తత్రత్యులన్ = అచ్చటనుండువారిని; దివినుండి = స్వర్గమునుండి; వేల్పుగమి = దేవతలసమూహము; దిగ్వేదండ.....యుఁలఁగాన్ = దిగ్గజముల తొండములవలెనుండి,, తొందర పాటును, గొప్పతనమును గల నాల్గుచేతులుకలవారినిగాను; ['దిగ్గజముల తొండములకుఁ గలుగఁజేయఁ బడిన వడిగల విశాలములయిన నాలుగుచేతులు కలవారినిగాను'అని పూర్వపుటీక.] రాజీవ.....రమ్యు లఁగాన్ = తామరపూలవలెను, మత్స్యములవలెను సొగసైన చక్కని కన్నులు కలవారినిగాను; ['తామరలపంక్తికి ఉనికిపట్టులగు కన్నులచేత అందగించువారినిగను' అని పూర్వటీక.] హిరణ్మయపటీ సక్తోరులంగాన్ = బంగారు(పచ్చని)వస్త్రమును తొడలపై దాల్చినవారినిగను; అనఁగా - విష్ణుస్వరూపు లనుగా నని అర్థము. మహిన్ = భూమియందు (ఉన్నవారిని); వీక్షించున్.

ఉ. వంచన యింత లేక బహువారము లెంతయుఁ గ్రాంచిత్తుఁడై
పంచజనుండు పంచవిధపాతకముల్ మును చేసెనేనియున్
బంచత శ్రీనృసింహుకుడిభాగమునం గను పుణ్యు మొక్కఁడున్
గాంచినఁ జాలు విష్ణుపదగామి యగున్ గులకోటితోడుతన్. 235

టీక. వంచన = అరమర; ఇంత = కొంచెమైనను; బహువారములు = పెక్కుసార్లు; పంచ జనుండు = మనుష్యుఁడు; పంచవిధపాతకముల్ = బ్రహ్మహత్య, సురాపానము, స్వర్ణస్తేయము, గురు తల్పగమనము, మీఁదివానిని చేసినవారితోడి సహవాసము అను నైదు ఘోరపాపములను; పంచతన్ = మరణమును; కను=పొందు; ఒక్కఁడున్=ఒక్కటియును; విష్ణుపదగామి=వైకుంఠమును పొందినవాఁడు.

ఉ. దేవునివామభాగమున దేహము నూడ్చిన సార్వభౌముఁడౌ
దేవునివెన్క [1]మేల్కొనని త్రేనుపు గైకొన నాకవాసియౌ
దేవుని మ్రోల దక్షిణపుదిక్కున నీల్గినయేని ముక్తుఁడౌఁ
గావున మానవుం డెపుడుఁ గాఁపుర మాయెడఁ జేయఁగాఁదగున్. 236

టీక. వామభాగమునన్ = ఎడమవైపు; ఊడ్చినన్ = విడువఁగా; సార్వభౌముఁడు = చక్రవర్తి; మేల్కొననిత్రేనుపు = తిరిగి తెలివిరానిత్రేఁపు - మరణము; గైకొనన్ = గ్రహింపఁగా - పొందఁగా; నాకవాసియౌన్ = స్వర్గనివాసి యగును; నీల్గినయేనిన్=మరణించినయెడల; ముక్తుఁడు= మోక్షమును పొందినవాఁడు.

క. యతిపతి! యేతత్ క్షేత్రోర్జితచరితం బ్రకటనంబు సేయఁగఁదగు న
య్యితిహాస మొకటిగల దది, శ్రుతి[2]పేయంబు విను మనుచు రుద్రుఁడు పల్కున్.

టీక. యతిపతి! = గొప్పమునీ! ఏతత్.....చరితన్ = ఈ నృసింహక్షేత్రముయొక్క గొప్పచరితమును - మాహాత్మ్యమును; ప్రకటనంబు = వెల్లడి;' ఇతిహాసము = ఉదంతము - కథ; శ్రుతి పేయము = కర్ణామృతము.

శా. అంభోరాశిగభీర! భీరహితచిత్తాఽఽభోగ! భోగావళీ
సంభారామరరాజ! రాజకృతపూజాయోగ్య! యోగ్యర్థిమి
త్రాంభోజాహిమధామ! ధామహితనిత్యావాసలక్ష్మీసము
జ్జృంభాలంకృతవక్త్ర! వక్త్రభిముఖశ్రీమద్గుణప్రాభవా! 238

1. క. మేల్కనిన. చే. మేల్కొనని. త్రేనుట. ట. మేల్కొనన. త్రే. 2. క. పేయముచేయు. చ. పేయంబువిను. ట. ప్రియముచేయు.

టీక. ఇదిముక్తపదగ్రస్తము. అంభోరాశిగభీర! = సముద్రమువలె లోతైన(మనసు)వాఁడా! భీరహితచిత్తాఽఽభోగ! = భయములేని పరిపూర్ణమైన మనస్సుకలవాఁడా! భోగావళీసంభోగరామరరాజ!= భోగముల ననుభవించుటలో నింద్రుఁడైనవాఁడా; [ఈ పద్యము ముక్తపదగ్రస్తమని గమనింపకయో, యేమో టీకాకారులు 'భీరహితచిత్తా!' అనియు 'ఆభోగభోగావళీసంభోగరామరరాజ' అనియు పదచ్ఛేదముచేసి 'భీరహితచిత్తా!=భయములేని మనసుకలవాఁడా! ఆభోగ......రాజ=విశేషములయిన భోగములను అనుభవించుటయందు ఇంద్రుఁడా!' అని యర్థమిచ్చి యున్నారు.] రాజ......యోగ్య!= రాజులు చేయుగౌరవమునకు తగినవాఁడా! యోగ్య-...ధామ! = యోగులు, యాచకులు, మిత్రులు ననెడి తామరలకు సూర్యుఁడా! ధామ......వక్త్ర! = ఇంటికి మేలయి యెల్లప్పుడును వసించునట్టి లక్ష్మియొక్క విజృంభణముచే అలంకరింపఁబడిన ముఖము కలవాఁడా! వక్త్రభి...ప్రాభవా! = వక్తలకు అనుకూలమగు సంపద్గుణములతోడి అధికారము కలవాఁడా!

క. శరమఠన[1]వంశవర్ధన!, కఠినకుఠారాగ్రదళితగర్వితవిద్వి
డ్జఠరమునితుల్య! వితరణ,పఠనకళాభ్యాసవిభవపారీణమతీ! 239

టీక. కఠిన......వితరణ! = కఠోరమైన గండ్రగొడ్డలిమొనచేత భేదింపఁబడిన గర్వించిన శత్రువుల కడుపులు గల మునియైన పరశురామునితోఁ బోల్పఁదగిన వాఁడా! వితరణ......మతీ = త్యాగము పఠించుటయును కళ నభ్యసించుటకగు సంపదయం దాఱితేఱిన బుద్ధికలవాఁడా!

మాలిని. కవిశుకసహకారా! కల్పవృక్షావతారా!
సవినయనిజమూర్తీ! సర్వది[2]గ్గాహికీర్తీ!
భువనహితచరిత్రా! పుణ్యదాక్షిణ్యమిత్రా!
నవరసికవతంసా! నవ్యసూక్తిప్రశంసా! 240

టీక. కవి......సహకారా! కవులనెడి చిలుకలకు తీయమామిడిచెట్టయినవాఁడా! సవినయనిజమూర్తీ! = వినయముతోఁగూడినవాఁడా! సర్వ......కీర్తీ! = అన్నిదిక్కులందును వ్యాపించినకీర్తి కలవాఁడా! ['సర్వదిగ్గ్రాహికీర్తీ! = ఎల్లదిక్కులను గ్రహించునట్టి కీర్తి కలవాఁడా!' అని పూర్వటీక.] భువనహితచరిత్రా!=లోకమునకు హితమైన చరిత్రముకలవాఁడా! పుణ్యదాక్షిణ్యమిత్రా! = ['ధర్మము, మోమోటమి యనెడి మిత్రులు కలవాఁడా!' అని పూర్వటీక.] న్యాయము, దయ అను మిత్రులు కలవాఁడా! నవ......వతంసా! (తొమ్మిది రసములను గ్రహించు) నూతనరసికులలో శ్రేష్ఠుఁడగు వాఁడా; నవ్యసూక్తిప్రశంసా! = శ్లాఘ్యమైన మంచిమాటలపొగడ్తకలవాఁడా!

గద్యము. ఇది శ్రీపరమశివదసనాథనిరవధికకృపాపరిపాకపరిచిత సరసకవితాసనాథ రామకృష్ణకవినాథ ప్రణీతంబైన పాండురంగమాహాత్మ్యంబను పరమభాగవత చరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

టీక. ప్రథమాశ్వాసగద్యమునకువలెనే గ్రహించునది.

ఇది శ్రీగౌతమసగోత్రపవిత్ర ఇలుసూపనామక సీతారామస్వామ్యవధానిసుపుత్ర సకలవిద్వజ్జనవిధేయ వేంకటరమణనామధేయగ్రథితంబైన పాండురంగమాహాత్మ్య టీకయందు ద్వితీయాశ్వాసము.



1. చ. గోత్ర. 2. క. గ్గ్రాహి. చ. గ్గాహి. 3. చ. షఠ.

శ్రీ ర స్తు

# పాండురంగమాహాత్మ్యము

## తృతీయాశ్వాసము



రమ్యాచరణతలలా
క్షారసరాగాభిరమ్యశంకావహదృ
గ్ధార! సమారాధితరఘు
వీరా! రామానుజయ్యవేదాద్రీశా! 1

టీక. శ్రీరమ్య......గ్ధార! = లక్ష్మీదేవియొక్క రమ్యములగు పాదములందలి లత్తుకయొక్క యెఱుపుయొక్క చక్కఁదన మను శంకను బొందు కన్నులలోని ఎఱ్ఱజీరలుకలవాఁడా! సమారాధితరఘువీరా! = పూజింపఁబడిన శ్రీరాముఁడు కలవాఁడా! - శ్రీరాముని పూజించువాఁడా!

వ. ఆకర్ణింపు మా యర్ణవతూణీరుండు వీణామునిం గనుంగొని యిట్లనియె. 2

టీక. అర్ణవతూణీరుండు = సముద్రము అమ్ములపొదిగాఁగల శివుఁడు; వీణామునిన్ = నారదుని.

ఉ. [1]ప్రాసఁగువిత్తువంటి నెఱిపాఱుకొలంబునఁబుట్టి వేదముల్
వ్రాసినగాదె శాస్త్రములు పుట్టిన యిల్లు కళాకలాపముల్
డాసిన రచ్చ యంచు [2]నఖిలంబుఁ దనుం గొనియాడ నొప్పు ను
ద్భాసితభాసితద్యుతి సభాపతినా నొకఁ డాహితాగ్నియై. 3

టీక. ప్రాసఁగువిత్తువంటి = రాజనపువరివిత్తుఁబోలిన; నెఱి, పాఱుకొలంబునన్ = ఉత్తమబ్రాహ్మణవంశమునందు; కళాకలాపముల్ = కళలసమూహములు; డాసిన = సమీపించిన - చేరిన; రచ్చ = సభ; అఖిలంబున్ = అందఱును; ఉద్భాసిత, భాసితద్యుతి = విజృంభించు (ప్రకాశించు) కాంతికి చంద్రుఁడైనవాఁడు - చంద్రునికాంతివంటి కాంతికలవాఁడు; ఆహితాగ్నియై = ఎల్లపుడును అగ్నిహోత్రములఁజేయువాఁడై. అలం. ఉపమ, రూపకము.

వ. అతండు కళింగదేశాభరణంబగు పీఠికాపురం బధిష్ఠించి సకలమహీసురసర్వశ్రేష్ఠుండై వెలయునంత. 4

టీక. పీఠికాపురంబు, అధిష్ఠించి = పిఠాపురమున నివసించి; సకల......శ్రేష్ఠుండై = బ్రాహ్మణులందరిలోను ఉత్తముఁడై.

తే. ఆ మహీసురు లేమకు నతులనిష్ఠ
నింగివేల్పుల నేలకు, నేలవేల్పు
కొలము నింగికిఁ దెచ్చుచుఁ గొలువఁ బుత్రుఁ
డొక్కఁ డుదయించెఁ దత్కృపాభ్యుదయమహిమ. 5

1. చ. ప్రాసుగువిత్త. 2. ట. సకలంబు.

టీక. అతులనిష్ఠన్ = గొప్పనియమముతో; నింగివేల్పులన్ = దేవతలను; నేలకున్=భూమికిని; నేలవేల్పుకొలమున్ = బ్రాహ్మణులగుంపును; నింగికిన్ = (సంతోషపెట్టి) ఆకాశమునకును; కొలువన్= సేవింపఁగా. [సభాపతిగారిభార్య గొప్పపూజలను చేసి, దేవతలు భూమికి వచ్చునట్లు చేయును; బ్రాహ్మణులను సంతోషపెట్టి, వారు ఆనందమున నాకాశము నందుకొనునట్లు చేయునని భావము.] ఆ మహీసురులేమకున్ = ఆ బ్రాహ్మణుని భార్యకు; తత్కృపాభ్యుదయమహిమన్ = ఆ నింగి, నేలవేల్పుల గొప్పదయవలన.

## నిగమశర్మోపాఖ్యానము

మ. వనితామానససూనసాయకుఁడు జీవత్తాతపాదుండు భూ
జనసన్మాన్యవిశుద్ధవర్తనుఁ డుదంచిత్త్యాగశీలుండు చం
ద్రునిపెన్నుద్ది సమగ్రకాంతిమహిమన్ నూనూఁగుమీసాలలే
గొనబుం బ్రాయపుఁదేజుకూన యతఁ డుత్తోఁచుండు వాచాలతన్. 6

టీక. వనితా......కుఁడు = యువతుల మనస్సులకు (వాని నాకర్షించుటలో) మన్మథుడైనవాఁడు; జీవత్తాతపాదుండు = జీవించియున్న తండ్రికలవాఁడు; భూజన.....నుఁడు = ప్రజలచే గౌరవింపఁబడిన పరిశుద్ధస్వభావము కలవాఁడు; ఉదంచిత్త్యాగశీలుండు = గొప్ప వితరణబుద్ధికలవాఁడు; సమగ్రకాంతిమహిమన్ = పరిపూర్ణమైన కాంతియందు; చంద్రునిపెన్నుద్ది = చంద్రునికి సమానమైనవాఁడు; కొమరుంబ్రాయపుఁదేజుకూన = యౌవనపుతేజస్సుకల చిన్నవాఁడు; వాచాలతన్ = అధికప్రసంగమున; ఉత్తోఁచుండు = దిట్ట; ['ఉత్తోఁచుండు = అధికుఁడు' అని పూర్వటీక].

వ. అజ్జగతీసురపుంగవునకుం బితృదత్తంబగు నిగమశర్మాభిధానంబు ప్రసిద్ధంబై యుండు వెండియు. 7

టీక. అజ్జ.....నకున్ = ఆ బ్రాహ్మణపుత్రునకు; పితృదత్తంబగు = తండ్రిపెట్టిన; నిగమశర్మాభిధానంబు = నిగమశర్మయను పేరు.

తే. అతఁ డనూచానసంతతి నవతరిలియు, సకలనిగమశిఖారహస్యములు గనియు
మనసుఁ దార్తీయపురుషార్థము[1]నకె తార్చె, దైవఘటనావశంబున [2]నోవశీంద్ర !

టీక. అనూచానసంతతిన్ = వేదాధ్యయనసంపన్నుల శిష్టవంశమున; అవతరిలియున్=పుట్టినను; సకల......ములు = సమస్త వేదాంతరహస్యములను; కనియున్ = గ్రహించినను; దైవ......నన్ = తనవిధికి లొంగియుండుటవలన; తార్తీయపురుషార్థమునకె = మూఁడవపురుషార్థమగు కామమునకే; మనసున్, తార్చెన్ = చేర్చెను. ఓ వశీంద్ర ! ఇంద్రియనిగ్రహము కల ఓ నారదమునీ !

చ. తలగడు గంగమర్దనము ధౌతపటావరణంబు సంస్కృతో
జ్జ్వలకలమాన్నభోజనము చందనచర్చ ప్రసూనదామకం
[3]బులు కపురంపు*వీడ్యమును భూషణపఙ్క్తులు కల్గి నిచ్చలుం
పులుగడుగంగఁబడ్డ [4]నునుముత్యముఁబోలుచు వాలుచుం బురిన్. 9

టీక. తలగడుగు = అభ్యంగస్నానము; అంగమర్దనము = శరీరమును మర్దింపించుకొనుట - శరీరసంవాహనము; ధౌతపటావరణంబు = మడుగువస్త్రముకట్టుకొనుట; సంస్కృ......భోజనము=పక్వముచేయఁబడి మిలమిలలాడు వరియన్నము; చందనచర్చ = గంధపుఁబూఁత; ప్రసూనదామకంబులు = పూలమాలలు; కపురంపువీడ్యమును = కర్పూరపుతాంబూలమును; భూషణపంక్తులు = నగలగుంపులు; పులుగడుగంగఁబడ్డ = (ముత్యములపైనుండు) మురికి కడుగఁబడిన; నునుముత్యముఁబోలుచున్=స్వచ్ఛమైన

1. చ. నక. 2. చ. తాపసేంద్ర. 3. క. బును. * విద్యములు. శ. ర. 4. చ. తెలిముత్తెము.

ముత్యమువలెనుండి; పురిన్ = పట్టణమునందు; వాలుచున్ = మీఱుచు - అతిశయించుచు; [ముందు పద్యమున కన్వయము.]

సీ. కలదు లేదనువాదమున కోర్చి మీసుమీ, సము నంటి రెయొంటిజందెము మెఱయఁగ
బహుసంకుపదపంకపాణింధమం బైన, తాళిగోణపుఁజుంగు నేల జీరఁ
గడలేని*వీడ్యంపుఁ గప్పుఁ[1]జందురుకావి, మోవి పల్లొత్తుల ముసుఁగుదన్న
పానతాఁకులుగల్గు సూనాస్త్రశంఖంబుగతి నఖరేఖాంకగళము దనర

తే. సఖులు పరిహాసకులు వెంటఁజనఁగ యువతి, భుక్తనిర్ముక్తపరిధానయుక్తుఁ డగుచు
నగరఘంటాపథంబున నగుచుఁ దిరుగు, నొఱపుగల[1]శివి జాతిమాత్రోపజీవి. 10

టీక. బహు.....మం బైన = ఎక్కువైన జవ్వాదిబురదచే దట్టమైన; తాళిగోణపుఁజుంగు = ప్రక్కగోచియొక్క చెంగు; నేలన్, జీరన్ = నేలపై రాయుచుండఁగా; కడలేని = హద్దుమీఱిన; వీడ్యంపు = తాంబూలమువల్లకలిగిన; కప్పు = గారగల; చందురుకావిమోవి = సిందూరపురంగుగల పెదవి; పల్లొత్తుల = దంతక్షతములచేత; ముసుగుదిన్నన్ = ఆవరింపఁబడఁగా; సూనాస్త్రశంఖంబు గతిన్ = మన్మథునిశంఖమువలెనున్న; నఖరేఖాంకగళము = నఖక్షతములతోఁగూడిన మెడ; తనరన్ = ప్రకాశింపఁగా; యువతి.....యుక్తుఁడు = యువతులను అనుభవించుటచే మలినమైన కట్టువస్త్రము కలవాఁడగుచు; జాతిమాత్రోపజీవి = బ్రాహ్మణుఁడనని చెప్పికొని జీవించువాఁడు - నిగమశర్మ; ఒఱపుగల శివిన్ = చక్కదనముతోడి దర్జాతో; నగుచున్; నగరఘంటాపథంబులన్ = ఆ పట్టణములోని రాచబాట లందు; తిరుగున్. అలం. స్వభావోక్తి.

తే. భార్యపాలిండ్లు రిక్తకుంభములు; రోయి
వెలఁదిచనుదోయి నిండుకుండలు; కులంబు
తరుణిఫాలంబు చవితిచందురుఁడు; వేశ్య
నుదురు హానికిఁ బ్రతిపదిందుండు నయ్యె. 11

టీక. రోయివెలఁదిచనుదోయి = బోగముపడతిచనుగవ; కులంబుతరుణిఫాలంబు = భార్యనుదురు; చవితిచందురుఁడు = చూడఁదగనిది; ప్రతిపదిందుండు = పరిశీలించి చూడఁదగినది. అలం. రూపకము.

సీ. ఉష్మాని హోమాగ్ని యూఁద నొల్లఁడుగాని విరహాజ్వరా[2]ర్తితో వెచ్చనూర్పు
సంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింపఁడుగాని [3]యెరఁగు నీర్ష్యాకషాయితల కర్థి
లాగమవాదంబు లొఁగాదనఁడుగాని విటవాదములు తీర్చు వేగి లేచి
కంబుభృత్పాదోదకంబు గ్రోలఁడుగాని యాహవతాధరశీధువాని చొక్కుఁ

తే. బుణ్యచిహ్నాంబు లపఘనంబున ఘటింప, సిగ్గుపడుఁగాని కరనఖశిఖర[4]లసిత
జాతనూత్నక్షతాంకముల్ సన్మతించు, నారజము మీఱి యా దుర్విహారహారి.

టీక. విరహాజ్వరార్తితోన్ = విరహవ్యథవలనఁగలిగిన జ్వరముచే; ప్రార్థనాంజలిన్ = నమస్కారమును; ఘటింపఁడు = కూర్పఁడు; అర్థిన్ = మక్కువతో; ఈర్ష్యాకషాయితలకున్ = (ఇతరవనితా సాంగత్యమును) ఓర్వలేక కన్నులెఱ్ఱచేసిన స్త్రీలకు; ఎఱఁగున్ = నమస్కరించును; ఆగమవాదంబులు = వేదచర్చలు; వేగి, లేచి = తెల్లవాఱి, లేవఁగానే; విటవాదములు = గతరాత్రిని విటులకును, విటీజనమునకును కలిగిన కలహములను; కంబు...కంబున్ = శంఖమునఁ బోయఁబడిన విష్ణుపాదతీర్థమును;

* వీడ్యంబు. 1. చ. రంబున. 2. చ. దీవి. 3. ట. ర్తితో. క. ర్తుఁడై. శ. ర. ర్తితో. 4. ట. యరుగు. 5. చ. లిఖిత. కలిఖిత. శ. ర. లసిత.

క్రోలఁడు = త్రాగఁడు; యూవతాధరశీధువు = యువతీసమూహముయొక్క మోవితేనెను; అని = త్రాగి; చొక్కున్ = పరవశుఁడగును; అపఘనంబునన్ = దేహమున; పుణ్యచిహ్నములు = తిరుమణి, తిరుచూర్ణము మొదలగునవి; ఘటింపన్ = ధరించుటకు; కర.....ముల్ = (యువతుల) చేతిగోళ్ల వాఁడిమొనలు గ్రుచ్చుటవలనఁగలిగిన క్రొత్తగాయముల గుఱుతులను; అరజముమీఱన్ = ఎక్కువ దుర్విలాసమున; ఆ దుర్విహారహారి = చెడ్డనడతకల ఆ పోరికి; సమ్మతించున్ = అంగీకరించును.

తే. నిగమశర్మాభిధానంబు నేతిబీర,కాయఁగనుబోలె నయథార్థగాథఁ దాల్ప
వైదికాచారదూరప్రవర్తనముల, వీట విహరించుచుండు నవ్వీటిప్రోగు. 13

టీక. నిగమశర్మాభిధానంబు = నిగమశర్మ [వేదవేత్త] యను పేరు; అయథార్థగాథన్, తాల్పన్ = అబద్ధపుకథ కాఁగా; వీటిప్రోగు = కొల్లలరాశి - మిక్కిలి దుర్వ్యసనము కలవాఁడు; వైదికా.....నములన్ = వేదవిరుద్ధములగు నడతలతో; వీటన్ = నగరమున; విహరించున్=తిరుగుచుండును. అలం. ఉపమ.

క. వెడవెడ దుర్వ్యవహారపు,నడవడి గడిదేఱి గురుజనము శిక్షింపన్
గడుసువడి విప్రతనయుఁడు, సడి కోరిచి [1]వంకపోరక చాటున్ మానెన్. 14

టీక. వెడవెడన్ = మందముగా - కొంచెము కొంచెముగా; దుర్వ్యవహారపునడవడిన్ = చెడ్డనడతయందు; గడిదేఱి = ఆఱితేఱి; గురుజనము = పెద్దలు; గడుసువడి = అసాధ్యుఁడయి - ధీరుఁడై - గడుసుమీఱి; విప్రతనయుఁడు = ఆ బ్రాహ్మణపుత్రుఁడు - నిగమశర్మ; వంకపోరకచాటున్=వంకర గడ్డిపోఁచచాటునుకూడ.

తే. తాతముత్తాతతండ్రులతరతరంబు, చీమవలెఁ గూడఁబెట్టి యూర్జితముసేయు
విత్త ముడివోయెఁ దత్కరాయత్త మగుచు, నురగదష్టునిమేని నెత్తురునుబోలె.

టీక. తరతరంబు = క్రమక్రమముగా; ఊర్జితముసేయు = భద్రపఱచఁబడినట్టి; విత్తము = ధనము; తత్కరాయత్తమగుచున్ = అతనిచేతికి చిక్కినదయి; ఉడివోయెన్ = నశించెను. అలం. ఉపమ.

సీ. దినవెచ్చమునకునై తనమేనఁగలసొమ్ము కొదుకక బచ్చింటఁ గుదువవైచు
నీఁదుగీచినరీతి నించుకించుకచేరి గిలుబాడుఁ దల్లిపైఁగల పసిఁడి
తండ్రికి నిడ్డ పత్రములు దొంగిలిపోయి షాయినంతకు నిచ్చి పొరయుఁ [2]గొంత
[3]మిండవడ్డికి నోర్చి మృత్యురూపములైన సాహుఁలచే ఋణగ్రాహి యగుచు
తే. [4]గుడ్డవృత్తులు, వృత్తులుఁ గొలుచు గుత్త,చేలు గ్రామాంశములు [5]గాదినేలలెల్లఁ
జనవరుల కమ్మఁజూపు నిచ్ఛావిహార,వర్తి వాఁడేమి కానున్నవాఁడొ మీఁద. 16

టీక. దినవెచ్చమునకునై = ప్రతిదినము చేయు చిల్లరకర్చునకుగాను; ('దినవెచ్చము' అనునది అనింద్యగ్రామ్యము) సొమ్ము = నగను; కొదుకక = సంకోచింపక; బచ్చింటన్=కోమటింట; ['బచ్చునింట' అనుదానికి బదులు స్వతంత్రప్రయోగము.] కుదువవైచున్ = తాకట్టుపెట్టును; ఇంచుకించుకచేరి = మెల్లమెల్లగా (తల్లిని) సమీపించి; పసిఁడిన్=(నగలరూపముననున్న) బంగారమును; ఈఁదుగీచినరీతిన్ = ఈఁతచెట్టును (మధ్యమునకై) గీచినట్లు— [ఈఁతచెట్టును కల్లుకయి గీచినయెడల పెక్కురోజులవఱకును కొంచెము కొంచెముగా నది వచ్చుననిభావము.] గిలుబాడున్=అపహరించును; [ఇచట 'ఇందుఁగీసిన రీతి' అను ముద్రితప్రతిపాఠమును, 'చిల్లగింజరాచినవిధమున' అను దానిటీకయు అననుగతములు.] పోయి

1. క. వంకపరక. చ. వంగపొరక. వంగ. శ. ర. 2. ట. విత్త ముద్రితప్రతి అథస్సూచిక. కొంత. 3. క. మిడ్డ. చ. ట. మిండ. 4. చ. గుడ్డవృత్తులువృత్తులు. 5. క. నాధి. చ. ట. గాది.

నంతకున్ = చెలామణి అగునంతసొమ్మునకు; పొరయున్ = పొందును; మిండవడ్డికిన్ = ఎక్కువవడ్డికి-చక్రవృద్ధికి; ఓర్చి = సహించి - అంగీకరించి; సాహులచేన్ = సాహుకారులవలన; ఋణగ్రాహి యగుచున్ = అప్పుతీసికొనినవాఁడయి; గుడ్డవృత్తులు = వృత్తిసంజ్ఞలుగల పంటచేలు; వృత్తులు = వృత్తిసంజ్ఞలుగల పొలములు; కొలుచు = ధాన్యము; గుత్తచేలు = గుత్తకు తీసికొనిన పంట చేలు; గ్రామాంశములు=గ్రామము మొత్తముగా నిచ్చిన మాన్యములు; గాదినేలలు = పాతఱలు, ఎల్లన్ = అన్నియును; ఇచ్ఛావిహారవర్తి = స్వేచ్ఛగా విహరించువాఁడు - నిగమశర్మ; చనవరులకున్ = పరిచితులకు - మిత్రులకు; [ఈ పద్యమున 'గుడ్డవృత్తులు = చేనిసేద్యపుఁబనులు' అనియు, 'చనవరులకున్ = అధికారులకు' అనియు ప్రాఁతటీకయందు అర్థము లీయఁబడియున్నవి; అవి సరికావు.]

క. అతఁడు కళింగోద్భవుఁడగు,కతముననో వ్రేలఁజూపఁ గసుగందక యో
గ్యతమస్వీకారమునకు, నితరుండై యుండె మునికులేశ్వర! వింటే. 17

టీక. అతఁడు = నిగమశర్మ; కళింగోద్భవుఁడు = కళింగదేశమున పుట్టినవాఁడు; వ్రేలన్, చూపన్ = తన్నుందఱును వ్రేలుపెట్టి చూపుచుండఁగా; కసుగందక = కొంచెమైనను జంకక; యోగ్యతమస్వీకారమునకున్ = గొప్పయోగ్యుల అంగీకారమునకు - యోగ్యులకుర్యాసకు; ఇతరుండై = అన్యుఁడై - తగనివాఁడై. కళింగదేశస్థు లనాచారపరులని ప్రాచీనులయాశయము.

ఇచట అర్థాంతరము గ్రహింపవలసినది. కళింగము (పుచ్చతీగ)యం దుబుట్టిన కాయ - పుచ్చకాయ - వ్రేలితోఁజూపిన కుఱిగిపోదు; [తక్కిన కాయలు తీగను వ్రేలాడుచుండఁగా; వానిని చూపిన యెడల ముఱిగిపోవును.] మఱియు పుచ్చకాయ నిషిద్ధవస్తువు కాన శిష్టులెవ్వరును దానిని ఆహారముగా గ్రహింపరు. ఈపద్యమున నీ యర్థము ధ్వనితము.

తే. పొందుఁబట్టుల నప్పులు పొడిచి పొడిచి,దొరతనంబునఁ జుట్టాలఁ దిరిసి తిరిసి
నలఁగి శిశ్నోదరపరాయణత్వమునకుఁ,*బార మెఱుఁగక తిరుగు నాబ్రాహ్మణుండు.

టీక. పొందుఁబట్టులన్ = దొరకినచోట్లను; పొడిచి పొడిచి = తీసితీసి; దొరతనంబునన్ = దివాణమునందును; చుట్టాలన్ = బంధువులదగ్గఱను; తిరిసి తిరిసి = బిచ్చమెత్తియెత్తి - యాచించి; నలఁగి = బాధపడి; శిశ్నోదరపరాయణత్వమునకున్ = కూడు, కూటములయెడఁగల ఆసక్తికి; పారము= హద్దును.

చ. తనచెలు[4]లిండ్లయం దదవద్రావుడు త్రావుచు నింటి కెన్నఁడున్
జనక దురోదరార్జితముఁ జౌర్యహృతం బనృతోపపన్నమున్
జెనఁటి పిసాళివెచ్చములఁ జేర్చుచుఁ దొల్లిటివైభవంబు లె
ల్ల నడఁగ నవ్వెడంగు కడు లాఘవవృత్తికిఁ జొచ్చి నిచ్చలున్. 19

టీక. తనచెలులిండ్లయందున్ = తనమిత్రులయిండ్లలో ['చెలులయిండ్లయందున్' అని యుండవలెను; ఇది స్వతంత్రప్రయోగము.] అదవత్రావుడు = చెడ్డత్రాగుడు - సురాదికము; త్రావుచున్; చనక = వెళ్లక; దురోదరార్జితమున్ = జూదమున నార్జింపఁబడినదియుఁ; చౌర్యహృతంబు = దొంగతనమువలన సంపాదింపఁబడినదియుఁ; అనృతోపపన్నమున్ = అబద్ధములాడి సంపాదించినదియు నగు ధనమును; చెనఁటి పిసాళివెచ్చములన్, చేర్చుచున్ = వ్యర్థముగా, దొంగయెత్తులువేయుచు చేయు కర్చుల కుపయోగించుచు; అడఁగన్ = నశింపఁగా; అవ్వెడంగు = వివేకములేని యా నిగమశర్మ; నిచ్చలున్ = ఎల్లపుడును; లాఘవవృత్తికిన్; చొచ్చెన్ = చులకఁదనమును (అవమానమును) పొందెను. ఇందు 'అదవత్రావుడు = స్థిరములేనిత్రాగుట' అనియు, 'లాఘవవృత్తికి = తక్కువవ్యాపారమునకు' అనియుఁ బూర్వటీకయం దర్థములు ఈయఁబడినవి.

* పార.సూర్యా. ఆం. చ. టి. చెలికారునిండ్లనవ.

క. మితి †గడచిన ఋణజాతులు, వెతవెట్టఁగ నూరుఁజొరక వెలివెలిఁ దిరుగున్
దతిఁ గూడులేక యాఁకటఁ, గుతిలపడు నతండు [1]గువ్వకుత్తుకతోడన్. 20

టీక. మితిగడచినన్ = పెట్టినగడువు తప్పిపోఁగా; వెతవెట్టఁగన్ = బాధింపఁగా; చొరక = ప్రవేశింపక; వెలివెలిదిరుగున్ = పైపైచోట్లనే తిరుగును; తతిన్ = సమయమునందు; అతండు; గువ్వకుత్తుకతోడకతోడన్ = గువ్వగొంతువంటిహీనస్వరముతో; కుతిలపడున్ = బాధపడును. అలం. ఉపమ.

క. వలువకుఁ గూటికినై నీచుల వేడం బోడచొరవఁజొచ్చు నతఁడు పూ
వులు ముడిచిన యంగళ్లనె, కలకల వీడెల్ల నవ్వఁ గట్టెలు మోసెన్. 21

టీక. వలువకున్ = వస్త్రమునకు; బోడచొరవన్ = మొండిచొరవను; వీడెల్లన్ = పట్టణమంతయు; కలకల, నవ్వన్. అలం. లలితము.

తే. పదను [2]దివిసిన కస్తూరి ప్రాఁచి యలరు, పాయఁ[3]బాఱినకూడు నీర్వట్టు మడుఁగు
గళితమణి యగు సొమ్మునై కానఁబడియె, దుర్విదగ్ధుండు గౌరవదూరుఁ డగుచు.

టీక. పదనుదివిసిన = తడి యారిపోయిన - వాసనపోయిన; ప్రాఁచియలరు = వాడిపోయిన పూవు; పాయఁబాఱిన = పాసిపోయినట్టి; కూడు=అన్నము; నీర్వట్టు = నీరువట్టిపోయిన - నీరులేని; మడుఁగు = చెఱువు; గళితమణి = రవలుజాఱిపోయిన; సొమ్ము = నగ; దుర్విదగ్ధుండు = పోకిరి; గౌరవదూరుఁడగుచున్ = మర్యాదకు దూరమై - మర్యాద లేనివాఁడై; కానఁబడియె. అలం. రూపకము.

క. ఆలో నొకనాఁ డా దుశ్శీలరతునియక్క యోర్తు శిక్షించెద నీ
బాలిశు నని తనమగనిన్, బాలురఁ గొనివచ్చె మాతృభవనంబునకున్. 23

టీక. దుశ్శీలరతుని = చెడ్డనడతయందిష్టముకల నిగమశర్మయొక్క; బాలిశున్ = మూర్ఖుని; మాతృభవనంబునకున్ = పుట్టినింటికి;

వ. ఇట్లు [4]పంచషయోజనమాత్రదూరంబగు తనయూరినుండి వచ్చి పితృభవనంబు సొచ్చి యచ్చటం గొన్ని ప్రొద్దులు గడపి, కొడుకుచెడునడవడికి నడలుకడలింబడి సుడివడియెడు తల్లిదండ్రులఁ దీండ్రగల వచనరచనాచమత్కారంబుల నుదారముదారోపణకరణోపచారంబులఁ గొంతకొంత వంతకుం దొలంగించుచు, మందిరముకుందారాధనాతిథిసంతర్పణంబులు నేర్పునం బచరింపించుచు జనయిత్రీదర్శితంబగు మూలవిత్తంబు నష్టావశిష్టం బగునది గుప్తంబుసేయుచుఁ బశుశిశుదాసదాసీజనంబులఁ దనవారింగా మెలఁగించి నలంకువలకుం దొలంగించుచుఁ బుస్తకభాండాగారంబు నిజభర్తృహస్తాంతరంబున నాశుశుక్షణి శిథిలబంధనయాచకప్రముఖోపద్రవంబులవలనం బాఁచి ప్రోచుచు, విగళితసన్నాహం బగు గేహంబు యథాపూర్వనిర్వాహణమనోహారంబుగా నను[5]సంధించి చదువు, [6]సంధ్య సాగించి నడపించుచు నిజానుజు దుర్వ్యసనంబువలన గాసిఁబొందని రాజానుగ్రహాలబ్ధంబులగు [7]నేకభోగగ్రామంబు [8]లాత్మాధీనంబు

† కడచిన. శ. ర. 1. క. గు. 2. ట. దివిచిన. 3. చ. వాఱిన. 4. క. పంచయో. చ. పంచషయో. 5. చ. (ంచి. లేదు.) 6. క. సంధింపించి. చ. సంధించి. 7. క. సంత. చ. సంధ్య. 8. ట. ననేక. 9. చ. లనాత్మా.

లుగా నొనరించుచుఁ *దప్పిదారి సుడిమత్ర చేమచెట్లున్న పట్లరసి తనపట్టులం గాఁపువెట్టుచు, గుట్టికి నలంగియు న త్తమామలచి త్తంబువచ్చునట్లు భక్తిశక్తులు మెఱసి పాటులంబడు మఱందలి సౌందర్యంబు ననివార్యజృంభణంబగు యౌవనారంభంబును, నవచంద్రికావైభవంబును, [1]వనకేళీపలాశదోహదంబు నగుటకు వగచి వగచి, తెగచి కడుపు చుమ్మలు[2]చుట్టఁ గన్నీరుట్టిపడం బొట్టుపొర లగుచుండునంతం జొక్కి తెగిపడిన చదువున నెక్కడనుండియో యాకస్మికంబుగ నింటికిఁ జలిదివంటకంబుఁ గుడుపం జనుదెంచి తన్నుఁ గాంచి డెందంబునం గొంచియుం బోరాక చేరి నమస్కరించి తలవంచికొనియున్న తమ్ముని గని [3]కదిసి కొదమనెలవంకల వంకలొత్తుచు నెత్తురులు చిలుకుచుం గుకవిపదబంధంబునుం బోలె నసకలప్రవృత్తంబులయి మదోన్మత్తమత్తకాశినీదత్తంబులగు [4]నఖాంకంబుల కతనఁ గర్కశంబగు నతనిశరీరంబుఁ [5]గౌఁగిలింప నగ్గలించి శంకించి యాపీనుంతిని యొక్కింత [6]బుజాస్వాంతయై యాదుర్విదగ్ధవిదగ్ధాలాపంబు లాలయ సీమంతపుం బెండ్లికొడుకవు గమ్మని పోతుగర్భితంబుగా నాశీర్వదించి యతండు తనుకంబు గమకంబునం బోవ [7]నుఁకించిన వానినోఁకోర్వమి యొఱంగి తరంగితవినయసౌహార్దమార్దవమధురంబులగు మాటలతేఁటలం బందిరివెట్టి యిందుబింబంబునుంబోని నిజనందనుం జెఱుతవాని మేనల్లుని నిందమని చంక కిచ్చి యెచ్చటి కేఁగెదవు మీబావబంతి నారగింతువు[8]గాక శాకపాకంబులు నిమిషంబులోనం గావింతు నని నిలిపి వెనుకదెస నెడగలసియున్న తత్కళత్రంబునకు నేత్రసంజ్ఞ యొసంగుటయును. 24

టీక. పంచ.....దూరంబు = ఐదారు యోజనములు మాత్రము దూరము కలది; (యోజన మనఁగా ఎనిమిదిమైళ్లు - ఆమడ.] ప్రొద్దులు = రోజులు; అడలుకడలిన్ = విచారసముద్రమునందు; సుడివడియెడు = తిరుగుడుపడుచున్న - కలఁతపడు; తీంద్ర = చొరవ - ధైర్యము; ఉదార.....చారంబులన్ = మిక్కిలి సంతోషమును కలిగించు నుపచారములచేత; వంతకున్ = విచారమునుండి; తొలఁగించుచున్ = తప్పించుచు; మందిర.....ణంబులు = ఇలవేల్పగు విష్ణునిపూజనము, అతిథిపూజలు; పచరింపించుచున్ = చేయించుచు; జనయిత్రీదర్శితంబు = తల్లిచే చూపఁబడినది; మూలవిత్తము = (కర్చుచేయక) నిలువగా ఉంచినసొమ్ము; నష్టావశిష్టంబు = పోఁగా మిగిలినది; గుప్తంబు చేయుచున్ = భద్రపఱచుచు; మెలఁగించి = సంచరించునట్లుచేసి - తనవైపు త్రిప్పుకొని; నలంకువలకున్ = కష్టములనుండి; పుస్తకభాండాగారంబున్ = గ్రంథాలయమును; ['భాండాగారంబు = బొక్కసము' అని పూర్వటీక.] నిజ.....రంబునన్ = తనభర్తస్వాధీనమున; ఆశు.....వలనన్ = అగ్ని, చినిఁగిపోవుట, యాచకులు మొదలగు నుపద్రవములనుండి; పోఁచి = తప్పించి; ప్రోచుచున్ = కాపాడుచు. ['శ్లో. అగ్నే రక్ష, జలాద్రక్ష, రక్ష మాం శ్లథబంధనాత్; పునశ్చయాచకాద్రక్ష యాచనాంతం హి పుస్తక'మ్మని పుస్తకప్రార్థన.]

---

*క. తప్పిదారిన. తప్పిదారి శ. ర. 1. చ. నవకేసిపలాశి. 2. క. చుట్టి. చ. చుట్ట. 3. చ. లేదు. 4. చ. నఖాంకురంబు. 5. చ. గౌఁగిలించుచు. 6. చ. భుజస్వాంత. 7. చ. నూకించిన. 8. ఉ. గాని.

విగళితసన్నాహంబగు = జాఱిపోయిన - పోయినవస్తువులు కలిగిన; ['విగళితసన్నాహంబు=తొలఁగిన ప్రయత్నముకలది - చక్కఁబఱుపఁబడినది' అని పూర్వటీక; ఇది పొసఁగదు.] గేహంబుఁ=ఇంటిని; యథాపూర్వ......రంబుగాన్ = పూర్వపురీతిని శోభావంతమైనట్లు; అనుసంధించి = కూర్చి-చక్కఁబఱచి; గాసింబొందని = పాడుకాని; ఏకభోగగ్రామంబులన్=వేఱు వంతుదారులులేక పూర్తిహక్కుగల గ్రామములను; తప్పి, దారి = పొరపాటున (తమస్థలములనుండి) తప్పిపోయి; ఉన్నపట్లు = ఉన్న చోట్లను; అరసి = తెలిసికొని - అవి యితరులకు చెందకుండునట్లుచేసి; తనపట్టులన్ = తనబిడ్డలను; కాఁపువెట్టుచున్ = కావలియుంచుచు; గుట్టు+ఈక = రహస్యమును బయటపెట్టక; నలఁగియున్ = శ్రమపొందియును; మెఱసి = ప్రకాశింపఁజేసి; పాటులంబడు = కష్టములుపడుచున్న; అనివార్యజృంభణంబగు = అడ్డగింపరాని పొంగుగలదైన; యౌవనారంభంబును = క్రొత్తయౌవనమును; వనచంద్రికావైభవంబును = అడవిఁగాచిన వెన్నెలశోభయగుదానిని; వన......దోహదంబును = అడవిమొక్కలకు చేసిన దోహదక్రియయు; [కాలముకానికాలమున చెట్లు చిగిర్చి, పుష్పించి, ఫలించుటకుఁ జేయు చికిత్సలకు దోహదములని పేరు.] వగచివగచి = మిక్కిలి విచారించి; తెగచి = కలఁతపడి; ['తెగించి' అని పూర్వటీక.] కడుపు చుమ్మలుచుట్టన్ = కడుపు, కలియపెట్టగా; కుట్టిపడన్=కాఱఁగా; పొట్టపొరలు, ఆగుచుండునంతన్ = సంకటపడుచుండఁగా; పడినవడువునన్ = పడినరీతిగా; ఆకస్మికంబుగన్ = తటాలున; కొంచియున్ = సందేహించినను - జంకియు; పోరాక = పోవుటకు సాధ్యపడక; కొదమ......లొత్తుచున్ = లేఁతచంద్రవంకలకు తప్పులుదిద్దుచు - లేఁతచంద్రవంకలతో సమానములయి; కుకవిపదబంధంబునుంబోలెన్ = చెడ్డ కవుల పదములకూర్పులరీతి; అసకలప్రవృత్తంబులయి = అంతటను ప్రచారము పొందనివై - ఆదరమును పొందనివయి; (నఖక్షతములపక్షమున - పూర్తిగా గుండ్రదనమును పొందనివి - అనఁగా వంకరైనవి) మదోన్మత్త......ధత్తంబులు = క్రొవ్విన స్త్రీలచే కూర్పఁ(కలిగింప)బడినవి; నఖాంకంబులకతనన్ = నఖక్షతములమూలమున; కర్కశంబగు = కఠినమైన; అగ్గలించి = ప్రయత్నించి; సీమంతిని = ముత్తయిదువ; ఋజుస్వాంతయై = సరిచేసికొన్న మనస్సు కలదై; దుర్విదగ్ధున్ = పోకిరిని; విదగ్ధాలాపంబులు = నేర్పుమాటలు; ఒలయన్ = ప్రకాశింపఁగా; హేతుగర్భితంబుగాన్ = అభిప్రాయముతోఁ గూడియుండునట్లు; తమకంబుగమకంబునన్ = మోహము యొక్క తొందరపాటువలన; ఉంకించినన్ = ప్రయత్నింపఁగా; వానిసోఁకోర్వమి = వాని అనిష్టతను; తరంగిత......మధురంబులు = పొంగుచున్న వినయ, స్నేహములతో; మృదుమధురములు; పందిరిపెట్టి = అల్లి; ఇందుబింబంబునుంబోలి = చంద్రునివలె చక్కఁగా నున్న; నిజనందనున్ = తన పుత్రుని; ఎడ, గలసియున్న = దూరముగ నున్న; తత్కళత్రంబునకున్ = అతనిభార్యకు; నేత్రసంజ్ఞ= కనుసైఁగ; ఒసంగుటయున్ = చేయఁగా.

క. ఆపైఁదలి ప్రాణేశ్వరు, శ్రీపాదద్వయముఁ గడిగె శీతలవారిన్
వ్యాపృత నిజనిశ్శ్వాసజ,తాపంబునఁ గొంతకొంత తప్తముగాఁగన్. 25

టీక. ఆపైఁదలి = ఆ యిల్లాలు; శీతలవారిన్ = చల్లనినీటితో; ప్రాణేశ్వరు శ్రీపాదద్వయమున్ = భర్తయొక్క రెండుపాదములను; వ్యాపృత......తాపంబునన్ = వ్యాపింపఁజేయఁబడిన తన నిట్టూర్పుగాలులవలని వేడిమిచేత; తప్తముకాఁగన్ = వేఁడియైనది కాఁగా.

క. విను వేల్పునకును మెచ్చొ్చ్చల, యని బలువిందునకుఁబోలె నఖలాన్నంబుల్
కనుగీటినంతలోననె, యనుజునకుఁ దదగ్రజాత యమరించి తగన్. 26

టీక. విను=వినుము; వేల్పునకును = దేవునకును; మెచ్చొ్చ్చలయని = మెప్పులేని - దేవునికంటెను గౌరవింపఁదగిన; బలువిందునకున్, పోలెన్ = గొప్పచుట్టమునకువలె; అనుజునకున్ = తమ్మునికి; తదగ్రజాత = అతనియక్క.

చ. తల గడిగించి ధౌతపరిధానము గట్టఁగ నిచ్చి లెస్సఁగా
నలకలయందుఁ గల్గు తడి యార్చి క్రొవ్విరులావటించి మై
మలయజచర్చచేసి గృహమాధవదత్తమనోజ్ఞభోజనం
బు లొసఁగెఁ దల్లి తండ్రి నిజపుత్త్రులు భర్తయుఁ దో భుజింపఁగన్. 27

టీక. తల గడిగించి = అభ్యంజనముచేయించి; ధౌతపరిధానమున్ = మడుఁగుకోవతిని; అలకలయందున్ = తలవెండ్రుకలయందు; క్రొవ్విరులు = అప్పుడు పూచినపూలు; ఆవటించి = ధరింపఁజేసి; మలయజచర్చచేసి = చందనపుఁబూఁత పూసి; గృహ......భోజనంబులు = ఇలవేల్పగు విష్ణువునకు నివేదించిన మృష్టాన్నములను; తోన్ = నిగమశర్మతోఁగూడ;

ఉ. ఇష్టములైన పంటకము లిట్లు భుజించి యతండు వార్చి సం
తుష్టమనస్కుఁడై తనదు తొయ్యలి వీడ్యముచుట్టి యీ మహా
శిష్టుఁడుఁబోలెఁ దిన్నెపయి చిర్నగ వొప్పఁగఁ గూరుచున్నచోఁ
[1]బుష్టి సమస్తముం గదపి[2]పుచ్చి తదగ్రజ పూర్ణచిత్తయై. 28

టీక. వార్చి = (భోజనానంతరము చేయు) నాచమనము చేసి; తనదుతొయ్యలి = తనభార్య; పుష్టిన్ = ఉత్సాహముతో; ['నిండుకొన్నతనముచేత' అని పూర్వటీక.] పూర్ణచిత్తయై = నిండుమనస్సుకలదయి. అలం. స్వభావోక్తి.

క. ఇంతలు నంతలు నగు తన,సంతానము చంట వెంట సందడిసేయన్
బ్రాంతమున నిలిచి తమ్ముని, కుంతలబంధంబు విడిచి కుశలాశయయై. 29

టీక. ప్రాంతమునన్ = సమీపమున - చేరువఁగా; కుంతలబంధంబు = జుట్టుముడిని; విడిచి = విప్పి; కుశలాశయయై=సదభిప్రాయము-(మంచిమనస్సు కలదయి. అలం. స్వభావోక్తి.

తే. ఎలయు సీత్కారములతోడ నీళ్లు గ్రుక్కి
* యంటునంటులు పరికించి యంట్లుఁ [3]బొడిచి
గోరుముక్కల † దిగదువ్వి తూరు పెత్తి
నెఱులఁ గలగిన పేల నన్నింటిఁ ‡ దిగిచి. 30

టీక. ఎలయుం = కలుగుచున్న; సీత్కారములతోడన్ = 'ఇస్'అను అనుకరణధ్వనులతో; ఈళ్లు = ఈళ్లను,- పేలపిల్లల; త్రుక్కి = నొక్కి; అంటునంటులు = అంటుకొనిపోయిన జుట్టుపాయలను; పరికించి = శోధించి; అంట్లన్ = అంటుపేలను; గోరుముక్కులన్ = కొనగోళ్లతో; దిగదువ్వి = క్రిందికి దువ్వి; తూరుపెత్తి=మీఁదికి ఎత్తిపట్టి-దులిపి; నెఱులన్ = తలవెండ్రుకలయందు; తిగిచెన్ = తీసివేసెను. అలం. స్వభావోక్తి.

క. మెడమన్ను నలచి యలకలు, ముడిగొని నిజపాణిపద్మములు గరగరగాఁ
గడిగికొని తనకు మరదలు,విడె మొసఁగుచుఁ బసిమి పసిఁడిపీవన వీవన్. 31

టీక. అలకలు = జుట్టు; ముడిగొని = ముడివేసి; నిజపాణిపద్మములు = పద్మములనుబోలిన తనచేతులను; గరగరగాన్ = పరిశుభ్రముగా; పసిమిపసిఁడిపీవనన్ = పచ్చని బంగారువిసనకఱ్ఱతో; అలం.. స్వభావోక్తి.

---

1. చ. తుష్టి. ట. దృష్టి. 2. చ. వచ్చి. * శ. ర. అంట్లుసంట్లును. సూర్య. అంటుసొంటులు 3. క. బొడిచె. శ. ర. చి. † డిగ. శ. ర. ‡ దిగిచి. శ. ర. క. దిగిచె.

తే. చేటికానీత పీఠికాసీన యగుచుఁ, బద్మకర్ణికఁ గొలువున్న పద్మవోలెఁ
గుడివలన నింత [1]యోరఁగాఁ గోమరు మెఱసి, బిడ్డ చనుద్రావ నిట్లను బిసరుహాక్షి.

టీక. చేటికా......సీన = దాసితెచ్చిన పీఁటపయి కూర్చున్నది; పద్మకర్ణికన్ = తామరపూదుద్దుపయి; పద్మవోలెన్ = లక్ష్మీదేవివలె; కుడివలనన్ = కుడివైపు; బిసరుహాక్షి = తామరలవంటి కన్నులుకల ఆమె; కోమరు మెఱసి = ఇంపుగులుకుచు; అలం. స్వభావోక్తి. ఉపమ.

శా. ప్రారంభించిన వేదపాఠముసకున్ బ్రత్యూహ మౌనంచునో
యేరా తమ్ముఁడ! నన్నుఁజూడఁ జనుదే వెన్నాళ్లనోయుండి చ
క్షూరాజీవయుగంబు వాచె నినుఁ గన్గోకున్కి మీబావయున్
నీరాకల్ మదిఁ గోరుఁ [2]జంద్రుపొడుపున్ నీరాకరంబుంబలెన్. 33

టీక. ప్రత్యూహము = విఘ్నము - ఆటంకము; చక్షూరాజీవయుగంబు = పద్మములబోలు కనుగవ; నీరాకల్ = నీవు వచ్చుటలను; చంద్రుపొడుపున్ = చంద్రోదయమును; నీరాకరంబుంబలెన్ = సముద్రమువలె. (ఏరాతమ్ముఁడ! ఎన్నాళ్లనోయుండి' అసున విచట జాతీయములు.) అలం. ఉపమ.

శా. శ్రీలాలిత్యము నిత్యశుద్ధియు గుణోత్సేకంబునుం గల్గి యు
ద్వేలస్ఫూర్తిఁ దలిర్చు తండ్రి యను నబ్ధిం జంద్రుఁడై తోఁచినన్
బోలుంగాక; భవాదృశుం డితరుఁడై పుణ్యంబులం బాసినన్
సాలగ్రామఖనిం జనించునెకదా జాత్యల్పపాషాణముల్. 34

టీక. శ్రీలాలిత్యము = చక్కని సౌభాగ్యము; గుణోత్సేకంబు = గుణములసమృద్ధి; ఉద్వేలస్ఫూర్తిన్ = ఎక్కువప్రకాశముతో - ఒడ్డులను అతిక్రమించునో యనునట్లుగా; తలిర్చు = అతిశయించునట్టి; భవాదృశుండు = నీవంటివాఁడు; ఇతరుఁడై = మీఁదివానికంటె విభిన్నపద్ధతులు కలవాఁడై - అక్రమప్రవృత్తి కలవాఁడై; సాలగ్రామఖనిన్ = సాలగ్రామములుండు గనియందు; జాత్యల్పపాషాణముల్ = తక్కువజాతులవైన రాళ్ళు. అలం. నిదర్శన.

క. ఏ నమ్ముదు గడవఁగఁ [3]దత్తనూసులు కనుగందు లగ్రజుండవు నీ వి
ట్లైనతఱి నెంత దుఃఖమొ, యీనీప్రోపాసపడెడు [4]నీగురువులకున్. 35

టీక. అమ్ముదుగడవఁగన్ = ఇతరులసొత్తు కాఁగా; తత్తనూసులు = వారిబిడ్డలు; అగ్రజుండవు = పెద్దవాఁడవు; ఈ నీప్రోపు = నీ రక్షణమును; ఆసపడెడు = కోరునట్టి; ఈగురువులకున్ = ఈ నీ గురువులయిన తల్లిదండ్రులకు; ఎంత దుఃఖమొ = ఎంత దుఃఖము కలుగునో ఆలోచింపుము.

సీ. పరమేష్ఠినుండి నీతరముదాఁక విశుద్ధతరమైన వంశంబుఁ దలఁపవైతి
తఱిఁ [5]దక్కియున్న యీ తల్లిదండ్రులఁ జాల పఱచవై సంతోషపఱచవైతి
[6]నగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన యిల్లాలి నిల్లాలితాకార నొల్లవైతి
ధర్మశాస్త్రార్థ విత్తముల విత్తములచే నలరించి విఖ్యాతి నందవైతి
తే. శీల మఖిలంబు నిది పిల్లిశీల మగుచుఁ, జదువు లిపియెల్లఁ జిల్కలచదువు లనుచుఁ
దోడివారలు నవ్వ నాతోడ! యేల, బేలవైతివి? యీగుణం బేల నీకు ? 36

టీక. పరమేష్ఠినుండి = బ్రహ్మమొదలుకొని; నీతరముదాఁకన్ = నీపురుషాంతరమువఱకును; తఱిన్, దక్కియున్న = (మరణ)సమయమునకు వశమైయున్న; పఱచవై = అల్పుఁడవై - నీచుఁ

1. చ. వారగా. 2. క. చంద్రు. 3. చ. భవ. 4. క. నిరు. చ. నీ. 5. చ. ద్రొక్కి.
6. చ. వహ్ని.

డవై; ఇల్లాలిఁ = భార్యను; ఇల్లాలితాకారఁ = మనోజ్ఞమగు ఆకారముగల యీమెను; ఒల్లవైతి = గ్రహింపవైతివి; ధర్మ......త్తములఁ = ధర్మశాస్త్రముల యర్థమును వివరించు పండితులను; విత్తములచేఁ = ధనములచే; అలరించి = సంతోషపెట్టి; చిల్కలచదువులు = అర్థజ్ఞానములేని చదువులు; పిల్లిశీలము = కపటమైన నడత; నాతోడ! = నాతమ్ముఁడా! బేలవు = మూఢుఁడవు.

వ. అని తదీయదురాచరణస్మరణసంతప్తస్వాంతయై యక్కంఠీరవమధ్య యమర్షోత్కంఠ కలకంఠకులకంఠపాకలీలా[1]పహాంబగు నెలుంగు చెలంగం గలంగి కుంఠితప్రబోధుండగు నా[2]శుంఠుం గెరలి పలికియు నలుక మగిడించి యుదంచితప్రయోజనఘటనాపారవశ్యంబున సామరస్యంబు మీఱ నిట్లనియె. 37

టీక. తదీయ......స్వాంతయై = అతని చెడ్డనడతలను తలఁచుటవలన సంతాపమును పొందిన మనస్సు కలదయి; అక్కంఠీరవమధ్య = సింహమునడుమువంటి నడుము గల యామె; అమర్షో...... పహాంబగు = కోపమున గట్టిగా నఱచుటచే, కోకిలలకాకలీధ్వని నతిక్రమించియున్న; ఎలుంగు = కంఠస్వరము; కలంగి = కలఁతపడి; కుంఠితప్రబోధుండగు = వ్యర్థమైన యుపదేశముకల; ['కుంఠితప్రబోధుండు = మొక్కపోయిన తెలివిగలవాఁడు' అని పూర్వటీక.] శుంఠునిఁ = మూఢుని; కెరలి = కోపించి; పలికియుఁ = పలికినను; అలుక, మగిడించి = కోపమును; శాంతింపఁజేసి; ఉదంచిత...... వశ్యంబునఁ = మేలైన ప్రయోజనమును కూర్చు పరవశత్వమున; సామరస్యంబు, మీఱఁ = అనుకూల్యము ప్రకాశింపఁగా.

చ. పడఁబడఁబొఱలుచుఁ వడుకుపట్టిన తల్లిని దండ్రి [3]నేలలో
వెడలని తమ్ముఁగుఱ్ఱల నవీనకులాంగన నోరులేని యా
తొడుకుల బంటుఁబైద విడఁద్రోవక ప్రోవఁగ నెందు నీక పా
ల్పడినది; కర్ణు నొఁదలనె భారతసంహిత నిల్చు చాడ్పునన్. 38

టీక. పడఁబడఁబొఱలుచుఁ = మిక్కిలిశ్రమలను పొందుచు; నేలలోఁ, వెడలని = భూమిపై నడుగుపెట్టి తిరుగని - మిక్కిలి పసివాండ్రయిన; నవీనకులాంగనఁ = క్రొత్తగాఁ గాఁపురమునకు వచ్చిన భార్యను, తొడుకులఁ = ఆవులను; బంటుఁ = సేవకుని; పైఁదఁ = పసులకుఱ్ఱవానిని; విడఁద్రోవక = త్రోసివేయక - విడువక; కర్ణునొఁదలనె = కర్ణునితలపైనే. అలం. ఉపమ.

ఉ. నాదుసహోదరుండు సుజనస్తవనీయనయప్రసక్తి బ్ర
హ్మాదుల మెచ్చఁ డే నతని యజ్ఞమునం గడుఁ బూజ్యురాలనై
వేది యలంకరింతు నని [4]వేవురిముందర నాడుకొందు నీ
వేదియు లేక సర్వగుణహీనుఁడ వౌఁట యెఱుంగఁ దమ్ముఁడా! 39

టీక. నాదుసహోదరుండు = నాసోదరుఁడు; సుజన......ప్రసక్తిఁ = సత్పురుషులచేఁ గొనియాడఁబడు నీతిపద్ధతియందు; వేదిఁ = యజ్ఞవేదికను; ఆడుకొందుఁ = చెప్పుకొనుచున్నాను;

శా. వీరావేశము దాల్చి సర్వధనముల్ వెచ్చింతుగాకేమి ము
క్కారుం బండు నఖండసేతువృతముల్ కాశ్మీరఖండంపుఁగే
దారంబుల్ తెగనమ్మఁగాఁజనునె నిర్ధారుండవే [5]వెన్క నె
వ్వారుఁ లేరె సహోదరాదులు? కులధ్వంసంబు నీ కర్హమే? 40

1. చ. ట. సహాంబగు. 2. క. శుంఠుని. చ. శుంఠం. 3. చ. నేలతో. 4. క. వేవురిలోపల. చ. వేవురిముందర. 5. చ. యెన్న (డెన్న)

టీక. వీరావేశముఁ = ఎక్కువపౌరుషమును - [నేనే యెక్కువగా వెచ్చచేయుదునను గొప్ప తనమును, పేరుసుపొందు నహంకారమును] వెచ్చింతుగాకేమి = వెచ్చముచేసినది యటుండనిమ్ము; [చరాస్తిని ఖర్చుచేసినఁ జేయుదువుగాక!] ముక్కారుఁ, పండు = మూఁడు పంటలు పండుచున్న; అఖండసేతువృతముల్ = ఎడతెగకపాఱు పంటకాలువలు కలవి; కాశ్మీరఖండంపుగేదారంబుల్ = కాశ్మీరదేశపుపొలములు-బాగుగా ఫలించు మేలిరకపుపొలములు; నిర్దారుండవే? = భార్యలేనివాఁడవా? - బ్రహ్మచారివా? అర్హమే? = తగునా?

ఉ. కామవికార మాత్మ నవగాఢత దాల్చినయేని నిర్భర
శ్రీ మెఱయంగ రూపగుణశీలకులోన్నతి గల్గు విప్రక
న్యామణులన్ సహస్రముయినన్ వరియించి రమింపరాదె యే
మీ [1]మునులే గృహస్థులు? రమించుట యొగ్గె కులాంగనాతతిన్. 41

టీక. ఆత్మన్ = మనస్సులో; నవగాఢతన్ = క్రొత్తదగు అతిశయమును; నిర్భరశ్రీ = గొప్ప శోభ. (''నిండినసంపద''అని పూర్వటీక.) రూప......న్నతి = గొప్పచక్కదనము, గుణము కులము, శీలము; ఏమీ గృహస్థులు మునులే ? = సంసారులు మునులు కారనుట; కులాంగనాతతిన్ = ధర్మ పత్నులసమూహమును; రమించుట = కూడుట; ఎగ్గె = తప్పుకాదు.

శా. లోలత్వంబున మత్తకాశినుల కిల్లుం బొల్లునుం జెల్లఁగా
నేలా? వెచ్చముసేయ నెవ్వలన మన్నీలాఢ్యులుం జాలరే !
[2]కోలాభోఽజనియంచు [3]వేడ నిను వీడ్కోలాభమో తండ్రి! దు
శ్శీలాగారము వారయావతము నిన్నే! మేటి పాటించునే! 42

టీక. లోలత్వంబునన్ = చాపల్యమువలన; మత్తకాశినులకున్ = (భోగపు) స్త్రీలకు; ఇల్లున్ = స్థిరాస్తియుం; పొల్లునున్ = చరాస్తియును; చెల్లఁగానేలా? = ఎందులకు నాశముకావలెను? ఎవ్వలనన్ = ఎచ్చోనయినను; మన్నీలు = రాజులు - జమీందారులు; ఆఢ్యులున్ = ధనవంతు లును; చాలరే! = తగరే! (వారును వెలయాండ్ర కీరీతిని ఖర్చుచేయ సాధ్యముకాదే!] 'కోలాభో ఽజని'యంచున్ = [ఇట్లు ఖర్చుపెట్టుటవలన నీకేమిలాభము కల్గినది? అనిపల్కుచు; వేడన్, నినున్ = నిన్ను, ప్రార్థింపఁగా; వీడ్కోల్, లాభము = వారిని విడిచిపెట్టఁగా లాభమగును; దుశ్శీలా గారమున్ = చెడునడతకు నిలయమైనదానిని; వారయావతమున్ = వారవనితలగుంపును; మేటి = ఉత్తముఁడు; పాటించునే? = లెక్కింపఁడు.

[ఇందు 'కోలంబో, జనియించు' అను పాఠము గ్రహింపఁబడి ప్రాఁతటీకలో 'కోలంబు = ఆట' అను నర్థము వ్రాయఁబడినది; అది ఉచితము కాదు.]

సీ. నర్మగర్భోక్తులు నక్కుటక్కులు వింత నయగారములు బహునాటకములు
పిలుపిచ్చవిద్యలు పీఁక వన్నియలును బెలుచఁదనంబులు ప్రేలడములు
వక్రభావంబులు వలకారిబాగులు వలసి [4]యొల్లములును వట్టిపసలు
కేరడంబులు సాళగింపులు కిల్బిషాక్రీడనంబులు నడకించువగలు

తే. బాసపోసనములు విడంబములు భ్రమలు, లేని మచ్చిక లివి యాదిరైన వివిధ
దుర్గుణంబులప్రోవులు ద్రోహమతులు, వారకాంతలఁ దడవిన వచ్చుఁ గీడు. 43

1. క. మునులై. చ. ట. మునులే. 2. క. కోలంబోజనియించు. చ. కోలాభోజనియంచు. 3. క. వేడినను. చ. వెండినిను. 4. చ. ట. యొల్లంబులు.

టీక. నర్మగర్భోక్తులు = అర్థాంతరములతోఁ గూడిన చమత్కారపుమాటలు; నక్కటక్కులు = అతివినయములు; వింతనయగారములు = వింతలైన కపటపుమెత్తదనములు; బహునాటకములు = వివిధములగు నటనలు; పిలుపిచ్చవిద్యలు = నీచపుపనులు; పీఁకపన్నియలును = పైమెఱుఁగులును; పెలుచఁదనంబులు = కఠినత్వములు; - మొఱటుదనములు; ప్రేలపములు = ప్రేలుటలు; వక్రభావంబులు = వంకరతలఁపులు; వలకారిబాఁగులు = వలపించునేర్పులు; వలసిరియొల్లములును = అంగీకారములేని అపేక్షలు; కేరడంబులు = పరిహాసములు; సాళగింపులు = ఏలగలుపుదనములు; కిల్బిషక్రీడనంబులు = తప్పుడుఆటలు; అడకించు, వగలు = వంచించుకులుకులు; బొంసపోసనములు = పొందికగల (పైమెఱుఁగు)మాటలు; విడంబములు = మోసములు, భ్రమలు = భ్రాంతులు; లేని మచ్చికలు = కపటపు ప్రేమలు; ఇవి, యాదియైన = ఈమొదలయిన; తడవినన్ = తాఁకినను; కీడు; వచ్చున్ = కలుగును.

చ. [1]విడు మిఁకనైన నిట్టి యవివేకము, మామకబుద్ధిపద్ధతిన్
నడువుము; నీకుఁ గావలసినా హరికౌస్తుభమైనఁ దెచ్చెదన్
గడుసరి యచ్చమాళ పలుగాకుల నీడుము చేయి మీఁదుగా
నడచినపూర్ణకాముఁడవు నాయనుజన్ముఁడ విట్లు సేయుదే! 44

టీక. అవివేకము = తెలివిలేమి; మామకబుద్ధిపద్ధతిన్ = నా హితము ననుసరించి; హరికౌస్తుభమైనన్ = విష్ణువు ధరించిన కౌస్తుభమణినైనను - అసాధ్యమగువస్తువునైనను; గడుసరి = అసాధ్యులయి; అచ్చమాళకలుగాకులన్ = అచ్చపుఁగుచ్చితములగల దుష్టులను; చేయి మీఁదుగా = (పైచేయియుండు) నట్లు గొప్పగా; పూర్ణకాముఁడవు = కోరికలు నెఱవేఱిన వాఁడవు; నాయనుజన్ముఁడవు = నాతమ్ముఁడవు.

తే. అక్క యీరీతి నయము ప్రియంబుఁ గలుగ, నానతిచ్చిన సద్బుద్ధి యాదరించెఁ
జాలదినములనుండియు మైనపడిన, బడుగు గావున వాఁ డన్నపానకాంక్ష. 45

టీక. మైలపడిన = అశుచిగా నున్న; బడుగు = చిక్కినవాఁడు; అన్నపానకాంక్షన్ = కూడు పైని, నీటిపైనిగల ఆశచే.

సీ. రాజాలయమునకు రాకపోకలు సేయు మానినచదువులు మరలఁ జదువు
నిన్నాళ్లు నెచ్చెలు లెదురైనఁ దలవంచుఁ [2]గులవధూరత్నంబుఁ గుస్తరించు
నాచార్యజనముఁ [3]బ్రత్యహము సంభావించు నర్చావళికి నుపహార మిచ్చు
నర్చించుఁ [4]గుతపవేళాగతాతిథికోటిఁ బసి నేదు దర్శించుఁ బైరుపచ్చ

తే. దండ్రి యుద్గమనీయంబుఁ దానె యుదుకు, నత్తికాభర్తతో నవ్వు నల్పసరణి
గ్రామకార్యంబుఁ దీర్చు నంగడికి వచ్చి, తేనెపూసినకత్తి ధాత్రీసురుండు. 46

టీక. రాజాలయమునకున్ = దివాణమునకు; మానిన = మఱచిన; కులవధూరత్నంబున్ = ధర్మపత్నిని; కుస్తరించున్ = ఊఱడించును; ఆచార్యజనమున్ = గురుజనులను; ప్రత్యహమున్ = ప్రతిదినమును; సంభావించున్ = గౌరవించును; అర్చావళికిన్ = దేవతావిగ్రహములకు; ఉపహారము = నైవేద్యమును; కుతపవేళాగతాతిథికోటికిన్ = అపరాహ్ణసమయమున వచ్చిన యతిథిబృందమును; పసిన్ = పసులమందను; ఏదున్ = కాపాడును; దర్శించున్ = గమనించును; ఉద్గమనీయంబున్ = దోవతిని; అత్తికాభర్తతోన్ = అక్కపెనిమిటితో; అల్పసరణిన్ = మెల్లఁగా; అంగడికిన్ = రచ్చపట్టునకు; గ్రామకార్యంబున్ = తీర్పుచెప్పుట మొదలగు పనిని; తేనెపూసినకత్తి = మేకవన్నెపులి - కపటనటనా నటుఁడు); ధాత్రీసురుండు = బ్రాహ్మణుఁడు. అలం. స్వభావోక్తి. రూపకము.

వ. అతం డొక్కనాఁడు. 47

1. చ లో ఈపద్యము లేదు. 2. క. కులవధూ. 3. క. ప్రత్యహము. 4. కుతపవేళా.

సీ. గోమేధికోపలాంకుర మానితంబులు [4]పుష్యరాగచ్ఛటాపుంఖితములు
వైడూర్యసంఘాతవర్ణనీయంబులు హరినీలకీలనాభ్యంచితములు
కురువింద సందర్భగురుతరంబులు చతుర్విధవజ్రదళసమావేల్లితములు
మహనీయతరహరిన్మణిపరీతంబులు సకలుషస్థూలముక్తికయుతములు
తే. పద్మరాగపరిస్ఫుటభాస్వరములు,దంతవిద్రుమకృతసముద్గకభృతములు
మాతృభూషలు నత్తికామండనములు,నిజయువతి దాల్చుసొమ్ములన్నియుహరించి.

టీక. గోమేధి......తంబులు = గోమేధికమాణిక్యముల పొళ్ళు కూర్పఁబడినవియు; పుష్య...
...తములు = పుష్యరాగముల సమూహముచే పొదుగఁబడినవియు; వైడూర్య......నంబులు =
వైడూర్యములకూర్పుచే బాగయినవి; హరి......తములు = ఇంద్రనీలములు చెక్కఁబడుటచే మిక్కిలి
యొప్పిదమయినవియు; కురువింద......బులు = కెంపులకూరుపుచే గొప్పవైనవియు; చతు......
తములు = నాల్గు రకముల వజ్రదళములచే బాగుగా ప్రకాశించునవియు; మహా......తంబులు =
గొప్పపచ్చలచే పొదుగఁబడినవియు; అకలుష......యుతములు = దోషములేని మంచిముత్యములతో
కూడినవియు; పద్మరాగ......ములు = పద్మరాగములు పొదుగుటచే ప్రకాశించునవియు; దంత...
ములు = దంతముతోను, పగడములతోను తయారుచేయఁబడిన బరిణలందుంచఁబడినవి; అత్తికామండన
ములు = అక్కనగలు; (ఈపద్యమున నవరత్నములవర్ణనయుఁ గలదు.)

క. ఒకనాటిరాత్రి పడు పడు,కకుఁ జెప్పక యిల్లువెడలి గాఢతరతమో
నికరము తన [1]తగుతోడుగ,నొకరుఁడుఁ బే రడవిత్రోవ నూడనిబాడెన్. 49

టీక. పడు = పండుకొన్న; గాఢతమోనికరము = కాఱుగ్రమ్మినచీఁకటియే; తనతగుతోడుగన్ =
తనకుఁదగిన సాయము కాఁగా; పేదరవిత్రోవన్ = కాఱడవిదారిని; ఊడనిబాడెన్ = పరుగెత్తి
పోయెను.

సీ. [2]శోకించు వృద్ధభూసురుఁ డాత్మపితృదత్త దర్భముద్రికకుఁ జిత్తంబు[3]గలఁగి
నత్తగా రిచ్చిన హరిసువర్ణనపుఁ బేరునకు ముత్తయిదువ వనటఁబొందుఁ
గ్రొత్తగాఁ జేయించు*కొన్న ముక్కరకు[4]నై యడలు దుర్వారరయి యాఁడుబిడ్డ
జామాత వెతఁబొందు వ్యామోహియై నవగ్రహకర్ణవేష్టనభ్రంశమునకు
తే. నెంత దుర్బుద్ధి యెంత దుర్భ్రాంతి యహహ!
సర్వధనములు నద్దురాచారశీలుఁ
దూచ ముట్టుగ నిలుదోఁచి యుఱికి చనుట
యెఱుఁగరోగాక [5]యవ్వేళ యెఱుకగలదె! 50

టీక. వృద్ధభూసురుఁడు = ముసలిబ్రాహ్మణుఁడు - తండ్రి; ఆత్మ......ముద్రికకున్ = తన
తండ్రిగారివలన ఈయఁబడిన దర్భముడియుంగరమునకు; కలఁగి = కలఁతపడి; ముత్తయిదువ = తల్లి;
వనటన్ = దుఃఖమును! దుర్వారయై = ఇతరులచే నూదార్పరానిదయి; ఆఁడుబిడ్డ = పుత్రిక;
అడలున్ = విచారించును. జామాత = అల్లుఁడు; వ్యామోహియై = (ఆ నగపైని) మమతకలవాఁడై;
నవ...మునకున్ = నవగ్రహముల చెవిపోగు పోవుటకయి; వెతఁబొందున్ = విచారమును పొందును;
దుర్భ్రాంతి=చెడ్డభ్రాంతి; దురాచారశీలుఁడు = చెడ్డనడతకు అలవాటుపడినవారు; ఊచముట్టుగన్ =
కొంచెమైనను మిగులకుండ - పూర్తిగా; అవ్వేళ=పోయేకాలము; ఎఱుకగలదె? = తెలియఁగలదా?

1. చ. ట. పుష్యరాగ. 2. క. దగు. చ. శ. ర. 3. చ. శోకించ. 4. క. గలగ. ట. శ. ర.
గలఁగి. 5. చ. గా. శ. ర. కొనిన. శ. ర. 6. క. యెవ్వేళ. చ. యెవ్వేళ.

ఉ. మోవఁ దరంబుగాని ధనముల్ బెనుమోపుగ వాఁడమర్చి యే
త్రోవయుఁ[1]గాని పేరడవి దూఱి హుటాహుటి నొక్కరుండు లోఁ
జావున [2]కంగవించి పెలుచం జనుచుండఁగ నొక్కనాఁటి సం
ధ్యావసరంబునం దొక పురాంతికఘోరవనాంతరస్థలిన్. 51

టీక. మోవఁదరంబుగాని = మోయుటకు సాధ్యపడని; పెనుమోపుగన్ = పెద్దమూటగా; అమర్చి = కూర్చి - కట్టి; ఏ త్రోవయున్, గాని = దారియు, తెన్నును లేని; పేరడవిన్ = పెద్ద యడవిని; హుటాహుటిన్ = మిక్కిలి వేగముగా; లోన్ = మనస్సులో; అంగవించి = సిద్ధపడి; సాహసించి - పెలుచన్ = అతిశయముతో; పురాంతిక......స్థలిన్ = పట్టణమునకు సమీపముననున్న కాఱడవిలో. [మీఁదిపద్యమున సమన్వయము.]

ఉ. కరుణాదూరులు చోరు లంధతమసాకారుల్ పదార్థాపహృ
త్వరితాంతఃకరణుల్ దురాసదులు విశ్వద్రోహు లుద్బాహులై
తెరువొక్కుమ్మడిఁ గ్రమ్మి [3]బొమ్మఁగల సందీప్తాశుగశ్రేణి నే
సిరి ధాత్రీసురసూనుఁ గార్ముక[4]రవాళిప్తాశులై యీసునన్. 52

టీక. కరుణాదూరులు = దయలేనివారు; చోరులు = దొంగలు, అంధతమసాకారుల్ = కాఱుచీఁకటివలె నల్లనైనవారు; పదార్థా......కరణుల్ = వస్తువులను అపహరించుటయందు తొందరపడు మనస్సుకలవారు; దురాసదులు = అసాధ్యులు; విశ్వద్రోహులు = ప్రపంచమునకు ద్రోహముచేయువారు; ఉద్బాహులై = చేతులెత్తినవారై; ఒక్కుమ్మడిన్ = ఒక్కపెట్టున; తెరువు = మార్గమును; క్రమ్మి = ఆక్రమించి; బొమ్మఁగల = బొమ్ము పగులునట్లుగా - గుండెబ్రద్దలగునట్లు; సందీప్తాశుగశ్రేణిన్ = ప్రకాశించు బాణముల సమూహముచే; ఈసునన్ = కోపముతో; కార్ముకరవాళిప్తాశులై = ధనుష్టంకారముచే కూడిన (మార్మోగిన) దిక్కులు కలవారై; ధాత్రీసురసూనున్ = బ్రాహ్మణుని; ఏసిరి = కొట్టిరి.

క. కాయంబునఁ బెదపెదపలు,గాయంబులు సేసెఁగాని కడువాఁడిమి[5]మై
నాయమ్ము లమ్మహీసురు,నాయమ్ములు దాఁకవయ్యె నాయుర్మహిమన్. 53

టీక. కాయంబునన్ = దేహముపైని; పెద......గాయంబులు = చాల పెద్దపెద్దగాయములు; ఆ, యమ్ములు = ఆబాణములు; ఆయుర్మహిమన్ = ఆయుస్సుండుటవలన; ఆయమ్ములు = మర్మస్థానములను; తాఁకవయ్యెన్.

క. ఒకనెత్తురుబొట్టున కూ,రక యసురులు వేవు రొడియుక్రమమున దొంగల్
బకనిభు లా పతితుని దోఁ,చికొని రయం బడరఁ జనిరి [6]చెట్టుకొకరుండై. 54

టీక. ఊరక = విడువక; అసురులు = రాక్షసులు; వేవురు = వేయిమంది; ఒడియుక్రమమునన్ = క్రమ్మికొనెడిరీతిని; బకనిభులు=బకాసురునివంటివారు; పతితున్ = భ్రష్టుని; రయంబు, అడరన్ = వేగముగా; చెట్టుకొకరుండై = చెట్టునకొక పిట్టఁగా-చెల్లాచెదరై; చనిరి = పోయిరి. అలం. ఉపమ.

క. కాఁపుకొడు కొక్కరుం డా,కాపురుషుం దెచ్చె నింటికడ కనుకంపా
టోపోద్దీపితబుద్ధిఁ ద,దాపద్వినివారణక్రియాభిముఖుండై. 55

టీక. కాఁపుకొడుకు = శూద్రుఁడు; కాపురుషున్ = చెడ్డవానిని - నీచుని; అనుకంపా......బుద్ధిన్ = ఎక్కువ దయచేఁ ప్రకాశించు బుద్ధితో; తదాప......ముఖుండై = అతని (బ్రాహ్మణుని) యాపదను తొలఁగించునట్టి పనియం దాసక్తుఁడయి.

1. చ. గాచి. 2. క. ర. కంగవించి. చ. కగ్గవించి. 3. బొమ్ముగల. 4. చ. రవాళిప్తాసులై. 5. చ. కుయిన్. 6. చ. ట. చెట్టొకరుండై.

సీ. పితృపరిత్యాగవర్ధితకిల్బిషమువోవ [1]నొత్తుకై వడి వ్రేళ్ల నెత్తురొత్తి
[2]కూర్కుప్రాణముల మేల్కొలుపుచాడ్పున గంట్ల శాకినీకాండంబు సణపి చూచి
సమయంబుగా దని శమనుదూతలఁ ద్రోయుజాడ [3]మైనాటు నస్త్రములు పెఱికి
పతయాళువగు బొంది పడకుండుటకు [4]గండ్రపురు లిచ్చుగతిఁ జాల పొత్తు లునిచి
తే. వట్టికూడును [5]వేన్నీళ్లు పెట్టి యొఱ్ఱ, గలుగు వీశ్యంబు లిప్పించి [6]వలఁతియైన
వెజ్జు నెచరించి యరయించె విప్రసుతునిఁ, [7]గంట వత్తిడుకొని సైరికప్రభుండు.

టీక. పితృ......కిల్బిషము = తండ్రిని విడుచుటవలన వృద్ధిపొందిన పాపము; కూర్కుప్రాణములన్ = నిండ్రించుచున్న (పోవనున్న) జీవములను; శాకినీకాండంబున్ = పెరుగుతోఁటకూరకాడలను; ['వత్తుల సమూహమును' పూర్వటీక.] సణిపి = చొప్పించి; సమయంబు = ప్రాణములను గొనిపోవుటకుఁ దగిన యదను; శమనుదూతలన్ = యమకింకరులను; మైనాటు = దేహమున నాటుకొనియున్న; అస్త్రములు = బాణములను; పెఱికి = ఊడఁదీసి; పతయాళువు = పడుటకు సిద్ధమయినది; బొంది = శరీరము; గండ్రపురులు = ఊఁతకోలలు; గాయపడినవారికిఁ జేయునొక ఉపచారము; పొత్తులు = పొత్తిగుడ్డలు; వట్టి కూడును = వ్యంజనములు లేని యన్నమును; ఒఱ్ఱగలుగు = కారమైన; వలఁతి = సమర్థుఁడు; వెజ్జున్ = వైద్యుని; ఎచరించి = హెచ్చరించి; సైరికప్రభుండు = కాఁపు పెద్ద; కంట, వత్తిడుకొని = మిక్కిలి జాగరూకతతో; విప్రసుతునిన్ = బ్రాహ్మణకుమారుని; అరయించెన్ = చూచునట్లుచేసెను.

క. నిరనిలసంచారస్థల, మరయిక సుస్నేహపూరమాయుఃస్థితి యా
యిఱుదెఱగు బలిమి దుర్దశఁ, బొరయక [8]దీపమ్ముపగిది భూసురుఁ డెసఁగెన్. 57

టీక. నిరనిలసంచారస్థలము = గాలిలేనిచోటు; అరయిక = భద్రముగాఁ జూచుట; సుస్నేహపూరము = పూర్తియగుమక్కువ, మంచినూనె నిండుగా నుండుట; ఆయుస్స్థితి = ఆయుర్దాయపుటునికి, నిలిచియుండుట; ఇఱుదెఱఁగుబలిమిన్ = రెండువిధములగు బలములచే; - అనఁగా దైవ, పౌరుష ప్రయత్నములు రెండింటిచేతను; [ఇఁట నిరనిలసంచారస్థలము, నాయుఃస్థితియు దైవబలములు; అరయికయు, సుస్నేహపూరమును మానుషబలములు.] దుర్దశన్ = చెడ్డస్థితిని; పొరయక = పొందక; భూసురుఁడు = బ్రాహ్మణుఁడు; ఎసఁగెన్ = ప్రకాశించెను.

[ఇచట ప్రాఁతటీకలో 'సుస్నేహపూరము = (మెదటియందలి) మంచిచమురుయొక్క సమృద్ధి' అని వ్రాయఁబడినది. అది యుక్తముగాఁ గానరాదు.] అలం. శ్లేష, ఉపమ.

ఉ. తాన ప్రసంగముల్ దిగిచి తత్సరణిన్ దనపెంపు పెద్దగాఁ
బూని వచించు నక్కపటపూరుషు నిక్కము నమ్మె నెమ్మదిన్
జానపదాగ్రగామి తనజాతియు నాతియుఁ గూడి దేవునిం
గా నిజదేశికోత్తమునిఁగాఁ [9]బరమాప్తునిగాఁ దలంచుచున్. 58

టీక. జానపదాగ్రగామి=పల్లెపట్టులం దుండువారిలో ముఖ్యుఁడు - కాఁపుపెద్ద; తానప్రసంగముల్ =అధిక ప్రసంగము; దిగిచి = విడిచిపెట్టి - అనఁగా తా నా బ్రాహ్మణునితో ఎక్కువ మాటలాడక; తత్సరణిన్ = అధికప్రసంగపద్ధతిని; తన పెంపు = తా నాతనిని రక్షించి, పెంచుట; పెద్దగాన్, పూని= గొప్పగా గ్రహించి; వచించు = మాటాడునట్టి; అక్కపటపూరుషున్ = ఆ కుచ్చితపువానిని;

1. క. నెత్తుకైవడి. చ. నొత్తుకైవడి. 2. చ. జాట 3 క. మైనాటుశస్త్రములు. చ. మైనాటు నస్త్రములు. ట. మైనానునస్త్రములు. 4. చ. ఖండ. 5. చ. వేనీరు. 6. చ. వలఁతులైన. 7. క. కంట. 8. దీపకము. చ. 9. చ. పరమాత్మునిగా.

నెమ్మదిన్ = నిండుమనమున; తనజాతియుఁన్ = తనశూద్రకులమును; నాతియుఁన్ = భార్యయును; నిజదేశికోత్తమునిగాన్ = తమ గురువువలెను; పరమాప్తునిగాన్ ప్రాణమిత్రునివలెను; నమ్మెన్.

క. తలలోపల నాలుక పూఁసలలో దారంబు పాలఁజల్లిన నీరుం
బలె వెలి యెఱుఁగక మనసులు, గలసి యభేదముగఁ గాపుకడ నతఁ డుండెన్.

టీక. పాలన్, చల్లిన = పాలతోఁగలిపిన; వెలి, యెఱుఁగక = ఎరుసులేక; అలం. మాలోపమ.

క. కల దా శూద్రవసతి శశికల దా ననఁజాలు నొకవికారపుఁగోడల్
చలదాలోలకటాక్షాంచలదామనిబద్ధతరుణజనఖంజనయై. 60

టీక. ఆ, శూద్రవసతిన్ = ఆకాఁపుటింటియందు; తాన్ = తాను; శశికలయనఁగఁజాలు = చంద్రకళయనఁదగిన; చల ....జనయై = చలించుచు, అంతటను తిరుగుచున్న కడకంటిచూపులనెడి యుఱిత్రాళ్లచేఁ గట్టివేయఁబడిన యువకులనెడి కాటుకపిట్టలు కలదై; అలం. రూపకము.

ఉ. [2]ఇంటను నడ్డమాఁక యొక యింతయు లేక చరించువా[3]నిఁ జే
నంటినఁ గందు కెందళుకు లంగముఁ గలవాని మిక్కిలిం
గంటికి నించువానిఁ దెలికన్నులవానిఁ బసాలిబాఁపనిం
బంటది [4]గోరుఁ జారుకుచపంజరకీరము[5]గా రచింపఁగన్. 61

టీక. అడ్డము = ఎదురు; ఆఁక = ఆటంకము; చేనంటినన్ = చేతితోఁ దాఁకినను; కందు = ఎఱ్ఱఁబడిపోవు; కెందళుకులు = ఎఱ్ఱని (చక్కని) కాంతులు; కంటికిన్, ఇంచువానిన్ = నచ్చిన వానిని; తెలికన్నులవానిన్ = అందమై, విప్పారిన కన్నులు కలవానిని; పసాలిబాపనిన్ = పంచఁదగు బ్రాహ్మణుని; పంటది = కాఁపుపడఁతి; చారుకుచపంచరకీరముగాన్ = చక్కని చన్నులను పంజరమునకుఁ జిలుకయైనవానినిగా; రచింపఁగన్ = చేయుటకు; గోరున్; ['కీరమున్' = 'చిలుకను' అని పూర్వటీక.] అలం. రూపకము.

సీ. పలువికా[6]రంబుల కలగల్పు[7]చూపుల రాకపోకలు బయల్ ప్రాకఁ జేయుఁ
దమకంబు గమకంబుఁ దత్తరంబును హత్తి మనసు సాఁగిన పజ్జఁ జొనుపుఁ గోర్కె
కుదురుపాలిండ్లపైఁ గొంగుజాఱఁగఁ గొప్పువీడ నూఱక నవ్వు వెఱ్ఱినవ్వు
నేరాలిపట్టి బిట్టెత్తి చెక్కిలి నొవ్వఁ గఱచి వాఁ డేడ్చినఁ గౌఁగిలించు
తే. [1]దండసకిమెడఁ బుంజాలదండఁ బెట్టుఁ, దిట్టు మెట్టెలు బిగువంచుఁ దెగి కళాదు
వనిత చిన్నారిపొన్నారి వయసువాని, విప్రనందనుఁ గన్నంత వెకలి యగుచు. 62

టీక. పలు.....పోకలు = ఎక్కువ వికారములకలుపుగోలుతనము గలిగిన చూపులయొక్క రాకపోకలను - [ప్రసారోపసంహారములను]. బయల్ = బయట; ప్రాఁకఁజేయుఁన్ = వ్యాపింపఁజేయును - అనఁగా వికారపుఁజూపులను ప్రసరింపఁజేయుచును, చూపులను మరలించుకొనుచుండును; తమకంబుగమకంబు = మోహముయొక్క ఆధిక్యమును; తత్తరంబును = తొందరపాటును; హత్తి = పొంది; సాఁగినపజ్జన్ = వెళ్లినవైపున; చొనుపున్ = వ్యాపింపఁజేయును; ఏరాలిపట్టిన్ = తోడికోడలిబిడ్డను; బిట్టు = మిక్కిలిగా; ఎత్తి = మీఁదికెత్తి; చెక్కిలినొవ్వన్ = వాని బుగ్గనొచ్చునట్లు; దండసకిమెడన్ = దగ్గఱనుండు వెలికత్తెమెడలో; పుంజాలదండన్, పెట్టున్ = ఒకవిధమగు కంఠమాల నుంచును - తెగి = సాహసించి; కళాదున్ = కమసాలిని; చిన్నారిపొన్నారివయసువానిన్ = మంచి వయసుకలవానిని; విప్రనందనున్ = బ్రాహ్మణపుత్రుని; వెకలి = ఆసక్తురాలు - మదనవికారముకలది.

---

1. క. ఇంటికి. చ. ఇంట(ను) 2. క. నిచే. 3. క. గోరుచారు. 4. క. గారవింపఁగన్. 5. క. రంబులఁగల. 6. చ. చూపులు. 7. చ. ట. దండసఖి.

క. దుర్లలితాతనువిలసన [1]నిర్లజ్జస్వాంత కాంత నేరుపు మెఱయన్
జెర్లాటమాడు మోహము, లేర్లయి వర్తిల్ల నమ్మహీసురుతోడన్. 63

టీక. దుర్లలితా......స్వాంత = దుష్టమయిన ఒయ్యారముతోడి మన్మథోద్రేకముచేత సిగ్గు లేని మనస్సుగలది; మోహములు = వలపులు; ఏర్లయి, వర్తిల్లన్ = ఏఱ్లుగా ప్రవహింపఁగా; చెర్లాటమాడున్ = ఎక్కువ పరిహాసపుటాట లాడును.

తే. దృష్టిపాతంబు నోడిచి మైఁ దెరలఁ [2]బెట్టు, ఫాలపట్టిక గనుపట్టు బాల చేల
నిఱియఁ దలఁగట్టి యొకమూల నొఱగు నేల, గ్రుడ్లనీరుట్టఁబఱచినకొంగు మీఁద.

టీక. దృష్టిపాతంబు, నోడిచి = దృష్టికొట్టినదని చెప్పి; మైన్ = దేహమును; తెరలఁబెట్టు = క్రాఁగఁజేయునట్టి; ఫాలపట్టిక = నుదుటిభాగము; కనుపట్టన్ = కనఁబడఁగా; చేలన్ = వస్త్రముతో; ఇఱియన్ = బిగముగా; గ్రుడ్లనీరు = కన్నీరు; ఉట్టన్ = కాఱఁగా; నేలన్; ఒఱగున్ = పండుకొనును.

ఉ. తేలెడు కన్నదోయి వడ దేఱెడు ముద్దుమొగంబు సారెఁ గై
వ్రాలెడు గొప్పకొప్పు వసివాడెడు సన్నపుకౌను కాఁకలం
దూలెడు లేఁతమేను నయి తొట్రి నమ్మగవాలి నాలిబా
గా లఘువర్తనుం డరసి యంగజబాధితగాఁ దలంచుచున్. 65

టీక. ఆ, లఘువర్తనుఁడు = ఆ, చెడునడతగల నిగమశర్మ; తేలెడుకన్నుదోయి = తేలిపోవు రెండు కన్నులును; వడదేఱెడు = బడలికపడుచున్న; సారెన్ = మాటిమాటికిని; కైవ్రాలెడు = చేతికి వ్రాలిపోవుచున్న - విడిపోవుచున్న; వసివాడెడుసన్నపుకౌను = మిక్కిలివాడిపోయిన సన్నని నడుము; కాఁకలన్ = తాపములచేత; అమ్మగవాలి, నాలిబాగు=జీవద్భర్తృక యగు (మగఁడు జీవించియున్న) ఆ కాఁపుపడఁతియొక్క కుచ్చితపుబాగును; అరసి = చూచి; అంగజబాధితగాన్ = మన్మథవికారమును పొందినదానినిగా; తలంచుచున్ = ఊహించును.

క. ఎవ్వనికి [3]వలచెనొకో యీ, జవ్వని యని రవ్వ మీఱు సరసోక్తులు లే
నవ్వులు ముడిచిన పువ్వుల, [4]రువ్వులుఁ దనయందె సమధిరూఢము లగుటన్. 66

టీక. ఎవ్వనికిన్ = ఎవ్వనిఁగూర్చి; రవ్వమీఱు = పోకిరితనముగల; ముడిచినపువ్వుల రువ్వులు = (తలలో) ముడుచుకొన్న పువ్వులను విసరుటలు; తనయందె = విషయముననే; సమధిరూఢములు, అగుటన్ = బాగుగా ఎక్కినవి - అన్వయించునవి అగుటవలన; [ముందుపద్యముతో అన్వయము.]

మ. బళిరా! తేరకుఁ దేర *దక్కె నిటు లీ బంగారుకుం డంచుఁ జం
కలు దాటించుచుఁ గెంపుమోవి దొడుకంగా గుబ్బపాలిండ్లు బి
ట్టలమంగా ముఖగంధపారణము సేయంగాఁ గటీసీమ ను
[5]త్పలపత్రాళి ఘటింపఁగాఁ దివురు మిత్రద్రోహి మోహాంధతన్. 67

టీక. తేరకుతేరదక్కెన్ = మిక్కిలి సులభముగా (కష్టములేక) చిక్కినది; దాటించుచున్ = (ఆనందమున); ఎగురవేయుచు; కెంపుమోవిన్ = ఎఱ్ఱని పెదవిని; తొడుకంగాన్ = (దంతములతో) ఒడిసి పట్టుటకును; బిట్టు = ఎక్కువఁగా - గాఢముగా; అలమంగాన్ = కౌఁగిలించుటకును; [ఆక్రమింపను - పట్టను' అని పూర్వటీక.] ముఖ......ణము, చేయంగాన్ = ముఖమునుండి వెలువడు సువాసనను, వాసనచూచుటకును; కటీసీమన్ =పిరుదులపైని; ఉత్పలపత్రాళిన్ = నితంబసీమయందుంచు

1. క. నిర్లజ్జా. చ. శ. ర. నిర్లజ్జ. 2. చ. భెట్టు. క. బట్టు శ. ర. మెడఁబుంజాలదండవెట్టు
3. చ. గలచె. 4. చ. రవ్వలు. *చిక్కె. శ. ర. 5. ట. పత్రంబు

కుముదపత్త్రములను పేరిటి నక్షత్రములను; ఘటింపఁగాన్ = కూర్పుటకు - ఉంచుటకు; తివురున్ యత్నించును - ఉబలాటపడును.

సీ. తలపుండ్లు గడిగించి తను బ్రతికించెఁగా యడవిఁ జోరాహతుండైనఁ దెచ్చి
కన్నబిడ్డలకన్న గారవంబునఁ జనవిచ్చెఁగా నిచ్చలు నింటిలోన
గ్రాసవాసఃక్లేశ కశ్మలత్వ మడంచి యనురక్తిఁ బెనిచెఁగా యనుదినంబు
గురువుగా వేల్పుగాఁ గూర్పుచుట్టంబుగా భావించి కొలిచెగా భక్తియుక్తి

తే. నెవ్వఁ డా[1]రెడ్డియింటికి నెగ్గు చాలఁ, జేయుఁ గుడినుండి గుడి[2]తాళ్లు దీయుకరణిఁ
గపటనటనానటుఁడు త్రాటిఁగట్టుబోయ, కాయజా[3]మేయసాయ కాఘాతభీతి. 68

టీక. చోరాహతుండు = దొంగలచేఁగొట్టఁబడినవాఁడు; గారవంబునన్ = (ఎక్కువ) గౌరవముతో; చనవు = పరిచయమును; గ్రాస......త్వము = అన్న, వస్త్రములకయిన కష్టమనెడి నీచత్వమును; అడంచి = పోఁగొట్టి - కూడు, గుడ్డలిచ్చి; అనురక్తిన్ = ప్రేమతో; కూర్పుచుట్టంబుగాన్ = ప్రియమైన బంధువుగా; భావించి; భక్తియుక్తిన్ = భక్తితోఁగూడుకొనునట్లు; ఎగ్గు = హాని - అపకారమును; కపటనటనానటుఁడు = కపటములను నటించుటయందు నేర్పరి; త్రాటిగట్టుబోయ = పెద్ద బ్రాహ్మణుఁడు (త్రాటిగట్టు = యజ్ఞోపవీతధారి - పాఱుఁడు) కాయ......భీతిన్ = మన్మథుని ఎదురులేని బాణములు పడుటయను భయమువలన; అలం. ఉపమ, లలితము.

చ. కరఁగిన డెందముల్ విడువు గానని కోర్కులు పారవశ్యముం
బొరసిన నిట్టచూపులు గుమురొ్కను ముత్పులకాంకురావళుల్
చిరిగిన సిగ్గులుం గలిగి చీఁకటి[4]వేకటిరేలఁ జాల [5]వ్రా
లిరి తలిరాకుబోఁడియు నళీకవిశిష్టుఁడు దుష్టచేష్టలన్. 69

టీక. కరఁగిన = ద్రవించిన - మెత్తపడిన; డెందముల్ = మనస్సులు; విడుపు, గానని = హద్దులేని - ఎడతెగని; పొరసిన = పొందిన; నిట్టచూపులు = కదలికలేని చూపులు - ఒకరినొకరు చూచుకొనుటలు; గుమురొ్కను = దట్టమైన; ముత్పులకాంకురావళుల్ = ఆనందమువలనఁగలుగు గగురుపాటు మొలకలగుంపులు; - సంతోషపుజలదంపులు; చిరిగిన=పోయిన; చీఁకటివేకటిరేలన్ = చీఁకటితోనిండిన రాత్రులయందు; తలిరాకుబోఁడియున్=చిగురుబోఁడియు - సుందరియుం; అళీకవిశిష్టుఁడున్=కపటపు యోగ్యతకలవాఁడును - నిగమశర్మయు; దుష్టచేష్టలన్ = చెడునడతలతో - కూడికలతో; వ్రాలిరి = ఒఱిగిరి - పరవశతఁ బొందిరి.

క. మతిఁ బాప మనక ప్రాణ,చ్యుతికరముగు తెగువ కతఁడు చొరఁబడె 'నరకే
సతి కో దోషో మరణే,సతికిం భయ' మన్న చదువు చదువంబోలున్. 70

టీక. మతిన్ = మనసులో; ప్రాణచ్యుకరము = ప్రాణాపాయమును కలిగించునది; తెగువకున్ = సాహసమునకు; చొరఁబడెను = సిద్ధపడెను; నరకే సతి కో దోషః=నరకమునకు సిద్ధపడఁగా - అంతకుఁగాని తప్పేమున్నది? మరణే సతి కిం భయమ్ = చావునకుఁదెగింపఁగా అంతకంటె భయమేమున్నది? చదువంబోలున్ = చదివి యుండవచ్చును.

ఉ. అర్ధమరేయిదాఁక పొల మూరసి మారశిలీముఖాహతిన్
నిద్దురఁ గాచియున్న మగనిన్ జగినీలిపిసాళిజంత య

1. చ. దెప్పి 2. చ. త్రాళ్లగోయు ట. త్రాళ్ళదీయు. 3. ట. మయ. 4. చ. ట. వ్రేకటిరేల. 5. చ. వ్రాలిరి. క. వాలిరి.

ష్మున్నియ సేవసేయ దొరక ముచ్చట యాడదు మూఁగఁబోలె నే
సుద్దియు లేక కన్మొగిచి చూచు మనోగతిఁ దోఁచు చెల్వునిన్. 71

టీక. అర్ధమరేయిదాఁకన్ = సగమురాత్రివఱకును; పాలము, అరసి = పొలముపనులు చూచి కొని; మారశిలీముఖాహతిన్ = మన్మథునిబాణములవలని దెబ్బలవలన - కామోద్రేకమువలన; మగనిన్ = భర్తనుగూర్చి - అతనికొఱకయి; జిగనీలిపిసాళిజంత = మాయలాఁడి యగు ధూర్తురాలు; (అగు) ఏసుద్దియున్ = ఏమంచిమాటయును; కన్మొగిచి = కన్నులుమూసి; మనోగతిన్, తోఁచు = మనస్సులో కన్పించు; చెల్వునిన్ = ప్రియుని - నిగమశర్మను; చూచున్.

సీ. పొన్నాకు[1]పైఁ దేనె సన్న[2]చెంద్రికమోవి మాధుర్య[3]మనక వేమాఱుఁ బొగడి
యామని బుగబుగ లంగచంపకదామగంధం[4]బనక పెక్కుగతుల నెన్ని
పడనున్నపండ్లసంపదపెంపు పాలిండ్లబీరం బనక సారె సారెఁ దలఁచి
తెలియ నభ్రచ్ఛాయ వలమానకచభరప్రకటనం బనక మాటికిని మెచ్చి
తే. దినదినంబును గసికాటు[5]చెనకువలన, దప్పితీఱని తమకంబు దెప్పరంబుఁ
బాప సమకట్టి జారుఁ[6]డక్కాఁపుసతిని, నెత్తుకొనిపోవ నిందందు నెడరువేచె. 72

టీక. సన్న . . . మాధుర్యము = సన్ననై యెఱ్ఱనున్న పెదవియందలి తీపి; పొన్నాకుపయిపడిన తేనె వంటిది అస్థిరమైనది; అనక = అని తలఁపక; వేమాఱు = పెక్కుసారులు; అంగచంపకదామగంధంబు= శరీరమను సంపంగిపూలదండయొక్క సువాసన; ఆమనిబుగబుగ, యనక = వసంతర్తువుయొక్క పరిమళముయొక్క ప్యాపనమని తలంపక - అస్థిరమనుకొనక; పెక్కుగతులన్ = అనేకవిధముల; ఎన్ని = కొనియాడి; పాలిండ్లబీరంబు = స్తనముల బిగువు; పడనున్న . . . . . పెంపు = పడిపోవుటకు సిద్ధముగా నున్న పండ్లయొక్క సౌందర్యము - అనిత్యము; సారెసారెన్ = మాటిమాటికిని; తలఁచి = కొనియాడి; వలమాన కచభరప్రకటనంబు = గుండ్రముగా చుట్టఁబడుచున్న - సిగచుట్టఁబడుచున్న కొప్పును ప్రకాశింపఁజేయుట; తెలియన్ = ఆలోచింపఁగా; అభ్రచ్ఛాయ = మేఘకాంతి - కొలఁదికాలముండునది; కసికాటుచెనకువలనన్ = తగిలీతగలనికాటువలన - తృప్తితీరనిరతివలన; దప్పితీఱని = దాహముతీఱని - తనివితీరని; తమకంబు = మోహమును; దెప్పరంబున్, పాపన్ = శక్యమగునట్లుగా - తృప్తితీఱునట్లుగా; సమకట్టి = సిద్ధపడి; జారుఁడు = ఱంకులాఁడు - నిగమశర్మ; ఎడరున్ = యుక్తసమయమును; వేచెన్ = ఎదురుచూచెను. ఈ పద్యమునందు మోవితేనెకును-మకరందమునకును, దేహమునకును-సంపంగి పూవునకును; పాలిండ్లకును - పండ్లకును, కేశభారమునకు - మేఘమునకును సామ్యములు చూపఁబడినవి. ఉపమ వ్యంగ్యము.

క. ఆ తఱి నన్నగరిపతి, జాతర * సాటించెఁ బశువిసర మనితరసా
ధ్యాతతవాతామయనిర్ఘాతాహతిఁ దూల గాలిగంగల కెల్లన్. 73

టీక. తన్నగరీపతి = ఆపట్టణపు రాజు; పశువిసరము = పశువులగుంపు; అనితర . . . . . హతిన్ = ఇతరమార్గములచే సాధింపరాని ఎక్కువైన, గాలిసోఁకుడు రోగము అను పిడుగుదెబ్బచే; తూలన్ = ఎగిరిపోఁగా - నశింపఁగా; గాలిగంగలకున్, ఎల్లన్ = గాలిరూపున నున్న క్షుద్రదేవతల కన్నింటి కిని; జాతర, చాటించెన్ = పండుగను చాటించెను.

సీ. గోర్వెచ్చ [7]చమురంటుకొనిరి మస్తకముల జలకమాడిరి నిశామిళితవారిఁ
గట్టిరి చిలుతచౌకముల క్రొంబుట్టముల్ కాటుకదీర్చిరి కన్నుగవల

1. క. పైతేనె. 2. క. చంద్రిక. 3. చ. మునక. 4. చ. బునక. 5. చ. చెనకు. శ. ర. కాటుఁ జెనకు. 6. క. పాఱుఁడక తె. చ. క్కాపుసతిని. * శ. ర. చాటించె. 7. చ. ట. తెలియంటి.

దిద్దిరి సిందూరతిలకంబు బటువుగా నిక్కఁగొప్పుల నిరుల్ ద్రుక్కి రర్థి
నింబప్రసూనమాల్యంబులు వైచిరి చిట్టి[1]బొట్టు ధరించి రిట్టునట్టు
తే. తరుణధావనధగధగద్దశనమణుల, హత్తుకొలిపిరి శ్వేత†పీడ్యముల డాలు
పర్వదినములఁ బామరప్రమద లుదిత, నియమసంభావనారంభనిర్భరబుద్ధి. 74

టీక. పర్వదినములన్ = ఆ పండుగరోజులలో; పామరప్రమదలు = పల్లెటూరి కాఁపుపడఁతులు; ఉదిత......బుద్ధిన్ = ఆ యా నియమములను ఆదరించు ప్రయత్నమునఁగల శ్రద్ధతో; గోర్వెచ్చ చమురు = గోరువెచ్చనినూనెను; మస్తకములన్, అంటుకొనిరి = తలయంటుకొనిరి; నిశామిళితవారిన్ = పసుపుకలిపిన నీటిలో; జలకమాడిరి = స్నానముచేసిరి; చిఱుతచాఁపముల క్రొంబుట్టముల్ = చిన్నచిన్న గడులు గల క్రొత్తకోకలను; బటువుగాన్ = గుండ్రముగా; దిద్దిరి = తీర్చిరి; అర్థిన్ — ప్రీతితో; ద్రుక్కిరి = ముడిచిరి; నింబప్రవాళమాల్యంబులు = వేఁపచిగుళ్ల మాలికలను; వైచిరి = వేసికొనిరి - ధరించిరి; ఇట్టునట్టున్ = వ్యత్యస్తముగా - అన్యాపరముగా; చిట్టిబొట్టు = చిన్న మంగళసూత్రపు సొమ్మును; [ఇచట పూర్వటీకాకారులు 'చిట్టిపొట్టి' అను పాఠమును గ్రహించి 'చిన్నచిన్నసొమ్ములను' అని అర్థమును వ్రాసిరి.] తరుణ......మణులన్ = క్రొత్తగా (అప్పుడే) తోముటచే దగదగలాడు ముత్యాలవంటి పలువరుసను; [ఇచట 'సమయమునందుఁ దోముకొఁబడిన దగదగ ప్రకాశించెడి రత్నములవంటి పండ్లయందు' అని పూర్వటీకాకారులు అర్థమును వ్రాసిరి. అది సరికాదు.] శ్వేతపీడ్యముల డాలున్ = శ్వేత తాంబూలపురాగమును; హత్తుకొలిపిరి = కూర్చిరి. అలం. స్వభావోక్తి.

క. ఎడ్డెతనపుఁ గయిసేతల, రడ్డులు [2]నడచిరి పురస్సరద్భార్యముగా
గుడ్డంబుచక్కిఁ గట్టం, బడ్డ మహాశక్తిదివ్యభవనంబునకున్. 75

టీక. ఎడ్డెతనపుఁగయిసేతలన్ = మోటుతనపుటలంకారములతో; పురస్సరద్భార్యముగాన్ = ముందు నడచుచున్న భార్యలు కలుగునట్లుగా - తమ భార్యలు ముందుగా నడువఁగా వారివెంట ననుట; గుడ్డంబుచక్కిన్ = (ఊరిపొలిమేరను) - ఊరిపొలమువైపు; కట్టంబడ్డ = కట్టఁబడిన; మహా......నకున్ = గ్రామదేవతగుడికి; రడ్డులు = రెడ్లు; నడచిరి.

వ. అమ్మహోత్సవ మజప్రధాన మగుట విబుధ[3]సభంబోలియు [4]మహాసురోద్ధారంబును, తమోవికృతివిధేయం బగుట విధుబింబంబునుంబోలియుఁ దారావియోగ ముదితంబును, బహుళధ్వనిపరీతం బగుట సత్కవిత్వంబునుంబోలియు నసాధువర్ణసంబాధబంధురంబు [5]నయ్యె నయ్యెడ. 76

టీక. అమ్మహోత్సవంబు = ఆ గ్రామదేవత పండుగు; అజప్రధానంబగుటన్ = మేఁక(వేఁట) ప్రధానముగాఁ గల దగుటచే - అని ఉత్సవపక్షమునను; బ్రహ్మ ప్రధానముగాఁ గల దగుటచే నని విబుధసభపక్షమునను అర్థము. విబుధసభంబోలియున్ = దేవసభవలె నున్నను; మహాసురోద్ధారంబును = గొప్ప మద్యములనుద్ధరించుదని యుత్సవపక్షమున నర్థము; దేవసభపక్షమున 'గొప్ప రాక్షసుల నుద్ధరించున'దని విరోధము; ఏలయన దేవసభ రాక్షసుల నుద్ధరించుట అసంభవము. 'మహాసుర+ఉద్ధారంబును' అను పదవిభాగమువలన 'గొప్పదేవతల నుద్ధరించునది' అని యర్థమును గ్రహించిన మీఁది విరోధము అపాస్తమగును. ఇచట 'అజప్రధానంబు, మహాసురోద్ధారంబు' అను రెండు పదములును ఉత్సవ, దేవసభలు రెండిటికిని సామ్యమును కల్గించుచున్నవి. ఇందు మొదటిది కేవల శ్లేషమూలకము; రెండవ విశేషణము విరోధముతోఁ గూడినది; ఇట్లే తక్కిన విశేషణములయెడను విరోధ, తదాభాసములను తెలియునది.

---

1. ట. బొట్టు. క. పొట్టి. † శ. ర. పిడ్యము. 2. చ. గడిచిరి. 3. క. సభయుం. చ. ట. సభం 4. క. దారం ట. ద్ధారం 5. క. బయ్యె. చ. ట. బునయ్యె.

[ఇచట పూర్వటీకలో 'మహాసురోదారంబు = అధికమైన కల్లుచేత హెచ్చినది, గొప్ప యసురులచేత దొడ్డది'అని మాత్రము తెలుపఁబడినది.] తమోవికృతివిధేయంబగుటన్ = తమోగుణవికారమున కునికిపట్టగుటచేతను - అని మహోత్సవపక్షమునను, చీఁకటిమాఱిపోవుటకు లొంగినదగుటచేత - (చీఁకటిని నశింపఁజేయఁ దగుటచేత)నని విధుబింబపక్షమునను అర్థము. విధుబింబంబునుంబోలె నుండన్ = చంద్రబింబమువలె నుండియు; తారావియోగముదితంబును = కనుగ్రుడ్లయెడఁబాటుచేత సంతోషించునది - అనఁగా (మద్యపానమున)కన్నులు తేలవేయుటచేత సంతోషించునదని మహోత్సవపక్షమున నర్థము; చంద్రబింబపక్షమున 'తారయొక్క వియోగముచేత సంతసించునదని విరోధము; ఏలయన చంద్రుఁడు తారయొక్క కూడికవలన సంతసించునుగాని, వియోగమువలన సంతసింపఁడు; 'తారా+అవియోగముదితంబును'అను పదవిభాగమువలన 'తారయొక్క అవియోగము(కూడిక)వలన సంతసించునది'అని యర్థమును గ్రహించిన మీఁది విరోధము నశించును. ఇచటను వెనుకటివలెనే 'తమోవికృతివిధేయంబు, తారావియోగముదితంబు'అను రెండు సాధారణధర్మబోధక విశేషణములందును మొదటిది శ్లేషమూలకము; రెండవది విరోధవిశిష్టశ్లేషమూలకము.

[ఇచట పూర్వటీకలో 'తమోవికృతివిధేయంబు = తమోగుణవికారమునకు ఉనికిపట్టయినది; చీఁకటివికారముచేత లోఁకువైనది; ......తారావియోగముదితంబు = కంటిగ్రుడ్లయెడఁబాటుచేత సంతోషించినది - అనఁగా కన్నులు తేలవేయుటచేత సంతోషించినది; తారయెడఁబాటుచేత సంతోషించినది'అని కలదు. ఇది అసంపూర్ణము.]

బహుళధ్వనిపరీతంబగుటన్ = గొప్ప ధ్వనిచేత ఆవరింపఁబడినదగుటచేతనని మహోత్సవపక్షమునను, పెక్కుధ్వనిరూప (ఉత్తమ)కావ్యములతోఁగూడినదగుటచేతనని సత్కవిత్వంబుపక్షమునను అర్థము. సత్కవిత్వంబునుంబోలియున్ = సత్కవిత్వమును పోలియున్నపుటికిని; అసాధువర్ణసంబాధబంధురంబును = నీచజాతుల ప్రజల యొఱపిడిచేత ఒప్పిదమైనదని మహోత్సవపక్షమున నర్థము. సత్కవిత్వపక్షమున 'తప్పుటక్కరములు ఇఱుకుకొనుటచే (చేరుటచే) చక్కనిదని విరోధము; ఏలయన మంచి కవిత్వమునందు తప్పుటక్కఱము లుండనేఱవు; తప్పుటక్షరములను బాధించుటచే - చేరకుండఁజేయుటచే చక్కనిదని యర్థమును చెప్పినచో మీఁది విరోధము పోవును. సంబాధశబ్దమునకు మీఁది రెండర్థములును కలవు. [ఇచట వెనుకటి టీకలో సత్కవిత్వపక్షమున అసాధువర్ణసంబాధబంధురంబనుదానికి 'తప్పు అక్షరముల నింపుచేత ఒప్పిదమైనది'అని మాత్ర మర్థము చెప్పఁబడియున్నది.] అలం. శ్లేష, విరోధాభాసము.

సీ. అంభోధరముక్రింద నసియాడు నైరావతియుఁబోలె సిడి వ్రేలెఁ దెఱవయొూర్తు
చెందమ్మికొలన రంజిల్లునంచయు బోలె నెప్పు లేట [1]నటించె నెలఁతయొూర్తు
తొలుసంజయెండ వర్తిలు జక్కవయుఁబోలె నీఁగెఁ బందిరి [2]గుండమింతి యొూర్తు
జలనీలిపై [3]నిక్కు కలువమొగ్గయుఁబోలె ననఁటాకు [4]నర్తించె నతివ యొూర్తు

తే. కాంత యొక్కర్తు మూఁపునఁ గండ [5]లిచ్చె
మాఱుగా [6]లిచ్చె నొక సుధామధురవాణి
లలన యొక్కర్తు నోరి తాళంబు లిచ్చె
శక్తిజాతరఁ [7]దమభక్తిశక్తు లెసఁగ. 77

---

5. క. జరించె. చ. నటించె. 6. చ. కొండనెత్త. 7. క.నెక్క చ. ట. నిక్క. 8. చ.ట. వల్లించె. 1. చ. గండవించె. 2. చ. ట. మాఱుగావించె. 3. క. సద్భక్తి. *చ. ట. తమభక్తి. క. ఘోర, శ. ర. దార.

టీక. అంభోధదరముక్రిందన్ = మబ్బుక్రింద; అసియాడు = చలించుచున్న; ఐరావతి యునుబోలెన్ = మెఱుపువలె; తెఱవ, యోర్తు = ఒక స్త్రీ; సిడిప్రేలెన్ = సిడిమ్రానియందు ప్రేలాడెను; చెందమ్మికొలనన్ = ఎఱ్ఱతామరల చెఱువున; రంజిల్లు = ప్రకాశించునట్టి; అంచయుంబోలెన్ = హంసవలె; నిప్పుటేటన్ = నిప్పుల యేటి(ప్రవాహమున)యందు; నెలఁత, యోర్తు = ఒక యాఁడుది; నటించెన్ = నాట్యముచేసెను; తొలుసంజయెండన్ = ప్రాతఃకాలపు లేఁతయెండయందు; వర్తిలు= ఉండు; జక్కవయునుబోలెన్ = చక్రవాకపక్షివలె; పందిరిగుండమున్ = పందిరిలోని నిప్పుగుండమును; ఇంతి; యోర్తు; ఈఁగెన్ = ప్రవేశించెను.

జలనీలిపైన్ = పాఁచిపయి; నిక్కి = విజృంభించి నిలుచు; అనఁటాకున్ = అరఁటియాఁకు పయి; నర్తించెన్ నాట్యమాడెను. మూఁపునఁ గండలు = (తన మ్రొక్కుబడి ననుసరించి) భుజము మీఁదిభాగములోని కండలను; సుధామధురవాణి = అమృతము వలె మధురములగు మాటలు కల స్త్రీ; మారుఁగాలు = (నాట్యమున) ఇంకొకరి కాలికి బదులు కాలు ఇచ్చుట; లలన = స్త్రీ: శక్తిజాతరన్ = గ్రామదేవతపండుగున; ఎసఁగన్ = ప్రకాశింపఁగా - వానికి తగినట్లు. అలం. ఉపమ.

క. బత్తులు నునువాకత్తుల, మొత్తిరి పశుసమజముండములు చండములౌ
నెత్తురు ధారలు*దారవి,పత్తిమిరనవారుణప్రభలు ప్రబలం[1]గాన్. 78

టీక. బత్తులు = భక్తులు; [శ. ర. లో కమసాలులని అర్థమీయఁబడినది.] చండములౌ = భయంకరములగు; ఘోర......ప్రభలు = భయంకరములగు ఆపదలను చీఁకట్లకు క్రొత్తసూర్యకాంతులైనవి; [ఇట పూర్వటీకలో 'భయంకరమయిన యాపత్కాలమునందలి క్రొత్తవియగు ఎఱ్ఱనికాంతులు' అని అర్థ మీయఁబడినది. ఇది సరికాదు] నెత్తురుధారలు, ప్రబలఁగన్ = వ్యాపింపఁగా; పశుసమజముండములు = పశువులగుంపుల తలలను; నునువాకత్తులన్ = మిక్కిలివాడియైనకత్తులతో; మొత్తిరి = నఱికిరి. అలం. రూపకము.

తే. పెలుచఁ గలుచొక్కు చెలువలతలకు నెక్కఁ
దోన దిక్కులతల కెక్కఁదొడఁగెఁ దమము
దేవిగుడిలోన నొక్కొక్కదివియ దోఁపఁ
దోన నొక్కొక్కచుక్కయుఁ దోఁచె మింట. 79

టీక. పెలుచన్ = అధికముగా; కలుచొక్కు = కల్లుత్రాగుటవలనిమత్తు; చెలువలతలకున్ = స్త్రీలతలలకు; తోనన్ =దానితోఁగూడ-వెంటనే; తమము=చీఁకటి; దిక్కులతలకున్, ఎక్కన్ =దిక్కుల వ్యాపించెను; దివియ=దీపము; మింటన్ = ఆకాశమున; తోఁచెన్ = కన్పించెను. అలం. సహోక్తి.

క. ఎడ రగుట దెలిసి పాఱుం, [2]బోడవఁడు గొని చనియె మాఱుభూమికి నఁట సం
దడి బొమ్మ*ను పెండ్లాడెడు, వడుపునఁ గసుగాఁపు [3]పూఁప వయసుమిటారిన్.80

టీక. ఎడరు = మంచిసమయము - తరుణము; పాఱుంబోడువఁడు = దుష్టబ్రాహ్మణుఁడు - నిగమశర్మ; అఁటన్ = అచ్చట; సందడిన్ = సమ్మర్దమునందు; కసుగాఁపుఁబూపవయసుమిటారిన్ = పసిదియు, పూవువలె మనోజ్ఞమైన వయసుకలదియు నైన కాఁపుపడుచును; బొమ్మను; పెండ్లాడెడివడుపునన్ = పెండ్లియాడినరీతిని - అనాయాసముగా - అఱమరలేక; కొని = తీసికొని; మాఱుభూమికిన్ = దేశాంతరమునకు; ఏఁగెన్.

[ఇచట పూర్వటీకలో 'పాఱుంబోడువఁడు = దుష్టబ్రాహ్మణుఁడు'అని అర్థము ఈయఁబడినది; మూలల 'బొమ్మఁడు = బ్రాహ్మణుఁడు'అను నర్థమును అందు కలదు; ఈరీతి టీకయందు పౌనరుక్త్య దోషము కలుగుట స్పష్టము.]

1. క. గన్. చ. గాన్. 2. ట. బోడవంబు. * బొమ్మఁ. క. బొమ్మను. ట. 3. చ. బిన్న.

తే. కాఁపుఁగోడలు కంచంత కాఁపురంబుఁ
బాలవంటి[1]కులంబుఁ *గాడ్పఱచి [2]యుఱికె
మగని నటువెట్టి రెండవమగనివెంట;
నువిదలకు బుద్ధి [3]పెడతల నుండుఁగాదె!

టీక. కాఁపుఁగోడలు = కాఁపుటింటికోడలు - కాఁపుపడుచు; కంచంతకాఁపురంబును 'కంచి' అనుపట్టణమంత(పెద్ద)సంసారమును; [కంచి+అంత = కంచంత; ఇత్వసంధి] పాలవంటికులంబున్ = పాలవలె స్వచ్ఛమైన జాతిని; కాడ్పఱచి = చెఱచి; అటువెట్టి = త్రోసి; రెండవమగనివెంటన్ = ఉపపతి(ఱంకుమగని)వెంట; ఉఱికెన్ = పాఱిపోయెను. ఉవిదలకున్ = స్త్రీలకు; పెడతలన్ = తల వెనుకప్రక్కను - తల్లక్రిందుగ; అలం. అర్థాంతరన్యాసము.

ఉ. ఆకుమఱుంగు [4]పిందె [5]యటు లంతిపురంబు[6]నఁబోలె యున్న రా
కాకుముదప్రియాస్య భయగాఢతరత్వర నేఁగుఁగాని లో
నాఁకలి దప్పియున్ రవికరార్తియు నెన్నదు; మన్మథాస్త్రకీ
లాకులతప్తచిత్తలకు లక్ష్యమె తక్కిననొప్పు లెవ్వియున్. 83

టీక. ఆకుమఱుంగుపిందెయయి = ఆకుమఱుఁగుననున్న పిందెవలె పెద్దలచే సంరక్షింపఁబడి; అంతిపురంబునఁబోలెన్ = అంతఃపురమునందున్న రీతిని; రాకాకుముదప్రియాస్య = పున్నమనాఁటిచంద్రుని వలె చక్కనైన ముఖముకలస్త్రీ; భయగాఢతరత్వరన్ = (తమవారు వెదకి పట్టుకొందురేమో యను) భయముచేత మిక్కిలి హెచ్చయిన వేగిరపాటుచేత; ఏఁగున్ = పోవును; లోన్ = మనసులో; రవికరార్తియున్ = ఎండతాకువలనిబాధను; ఎన్నదు = లెక్కింపదు; మన్మథా.....లకున్ = మన్మథుని బాణములవలని మంటలచేత కలఁతపడి, తపించునట్టి మనస్సు కలవారికి; లక్ష్యమె=లెక్కకురావు. అలం. అర్థాంతరన్యాసము, ఉపమ.

సీ. కఠినకంఠీరవాక్షతనఖక్షతజరత్కరిశిరశ్శుక్తిశార్కరిలతలము
[7]లాచాంతజంతుకంఠాసృగుగ్రవ్యాఘ్రి ముఖగుహాఘాంకారముఖరితంబు
లశ్వద్విషద్విషాణాగ్రనిగ్రహ వహత్త్వక్స్తర ప్రసవసౌరభమయంబు
లజ్ఞాతరవికరవ్యాపారభూరుహచ్ఛాయానపాయాతిశైత్యఖనులు
తే. గహనఘుంటాపథంబులు గడచి నడచి,యొక్కపక్కణ మీక్షించి యూఁడిల్లి
యపరవర్ణస్నుషయు బ్రాహ్మణాధముండు,బోయకులమునఁ గలసిరి పొలుపుదక్క.

టీక. కఠిన.....తలములు - కఠిన = వాఁడియైన; కంఠీరవాక్షతనఖ = సింహములయొక్క మొక్కవోని గోళ్లవలని; క్షత = గాయములు కల - దెబ్బతినిన; జరత్కరి = ముసలియేనుఁగులయొక్క; శిరశ్శుక్తి = కపాలభాగములచేత; శార్కరిలతలములు = గులకరాళ్లుగలవైనట్లు చేయఁబడిన చోటులు గలవియు; [ఈ పద్యమున ఎత్తుగీతములోఁగల 'గగనఘుంటాపథంబులు' అనుదానికి ఇది విశేషణము. తక్కిన సీసపాదములు మూఁడును ఇట్లే యని గ్రహింపఁదగినది.] [పూర్వటీకలో ఇచ్చట "శిరః = తలల యందలి శుక్తి = ముత్తెపుఁజిప్పలచేత; శార్కరిల = గులకగలవియగు' అని యర్థము వ్రాయఁబడినది. గజములకుంభస్థలములందు ముత్తెములుండుట కవిసమయసిద్ధము.....అందుకొఱకు ముత్తెపుఁజిప్పలుకూడ ఉండఁబనిలేదు ఉండవు కూడ.]

---

1. చ. కులము గాడు. * శ. ర. గీడ్పఱచి. 2. చ. నుఱకె. 3. చ. కట. 4. చ. టందె. 5. చ. ట. యటు. క. యయి. 6. క. బును. చట. బునఁ. 7. చ. లాకాంత.

సింహములు ఏనుఁగుల కుంభస్థలములను బ్రద్దలుకొట్టగా వాని తలయెముకలభాగములు నేలపైఁబడి కంకరజాళ్లవలె కాలికి గ్రుచ్చుకొనుచున్నవని భావము.

ఆచాంత......ముఖాంతంబులు-ఆచాంత = పీల్చఁబడిన; జంతుకంఠాసృక్ = జంతువుల కంఠము లందలిరక్తము కలవైన; ఉగ్ర = భయంకరములైన; వ్యాఘ్ర = పులులయొక్క; ముఖగుహా = గుహ వంటి ముఖమువలని ['ముఖగుహా = నోళ్ళవలన వెడలెడి' అని పూర్వటీక.] భాంకార = బొబ్బరింతల చేత; ముఖరితంబులు = ప్రతిధ్వనించునట్లు చేయఁబడినవియును; అశ్వ.....మయంబులు - అశ్వ ద్విషత్ = అడవిదున్నలయొక్క; విషాణాగ్ర = కొమ్ముల మొనలచేత; నిగ్రహా = పొడుచుటచేత; వహత్ = వహించుచున్న - పొందుచున్న; ప్రస్తరప్రసవసౌరభమయంబులు = రాతిపువ్వులపరిమళ ముతోఁగూడినవియును; అజ్ఞాత......ఖములు - అజ్ఞాత = తెలియఁబడని; రవికరవ్యాపార = సూర్య కిరణములపని (ఎండ) కల - ఎండ చొచ్చుటకును సాధ్యపడని; భూరుహా = చెట్లయొక్క; ఛాయా = నీడచేత; అనపాయ, అతిశైత్యఖములు = అపాయములేని ఎక్కువచల్లఁదనమునకు గనులైనవియు; [అగు నట్టి] గగనఘంటాపథంబులు = అడవిమార్గములను; కడచి = దాఁటి; ఒక్క పక్కణమునక్ = ఒక్క బోయపల్లెను; ఈక్షించి = చూచి; ఊరడిల్లి = శాంతిని బొంది; అవరవర్ణస్నుషయుక్ = కాఁపుకోడ లును; పొలుపుదక్కి = ఒప్పిదమును విడిచి అలం. ఉదాత్తము.

తే. ఎన్ని జన్మంబులేనియుఁ జన్నపిదపఁ,గాని ప్రాపింపరాని ధరానిలింప
జాతి [1]గడెలోన నప్పాపజాతి తొఱఁగి,కల్లు [2]పెల్లాను; వేటాడుఁ; [3]గఱచు నెఱచి.

టీక. చన్నపిదపఁగాని = ఎత్తినతరువాతఁగాని; ప్రాపింపరాని = పొందరాని; ధరానిలింప జాతిన్ = బ్రాహ్మణకులమును; అప్పాపజాతి=పాపాత్ముఁడగు నిగమశర్మ; గడెలోనన్ = గడియలో- నిముసములో; తొఱఁగి = విడిచి; పెల్లు, అనున్ = అధికముగా త్రాఁగును; కఱచున్, ఎఱచిన్ = మాంసము కొఱుకును - తినును. ['గరుసు = మేర' అని పూర్వటీక.]

క. స్వఘ్రాణానిలసౌరభ, మాఘ్రాణింపఁగ మదాపలాఖేటగతిన్
[4]వ్యాఘ్రాధికభయదాటవి, శీఘ్రగతిన్ మెలఁగు నసతి చెలువుఁడుఁ దానున్.

టీక. అసతి = దుర్వినీతురాలైన కాఁపుపడుచు; స్వఘ్రాణానిలసౌరభము = (చెలువుఁడు) తన యూర్పుగాలిపరిమళమును; ఆఘ్రాణింపఁగన్ = వాసనచూడఁగా — అనుభవింపఁగా; మదాకులాఖేట రతిన్ = మత్తుచేఁ గూడిన వేఁటతమకముచే; శీఘ్రగతిన్ = వేగముగ; చెలువుఁడున్, తానున్, వ్యాఘ్రాదికభయదాటవిన్ = పెద్దపులులు మున్నగువానిచే మిక్కిలి భయంకరమగు నడవియందు; మెలఁగున్ = తిరుగును.

మ. గతి మధ్య స్తన కుంతల స్తబక వీక్షాగర్వదుర్వార యీ
సతిచే మానమె యూనమయ్యె నిఁక [5]నిస్సారంపుఁ బ్రాణంబు దా
ల్చు తగుల్ గాదని రోసి యా వృషలివాలుందూపుఁగ్రొమ్మంట కా
కాహుతియౌ బర్హి మృగేంద్రకుంభిచమరీయూథంబు నేణంబులున్. 86

టీక. గతి......దుర్వార = నడక, నడుము, కుచములు, జుట్టు, చూపులు అనువాని (చక్కఁ దనము)చే నగు గర్వమువలన అడ్డరానిది - (ఎక్కువ గర్వించునది) అగు; ఈ సతిచే = ఈ స్త్రీవలనఁ మానమె = మనమర్యాదయే; ఊనమయ్యెన్ = తగ్గిపోయినది - నశించినది; నిస్సారంపుఁ బ్రాణంబున్ = సారములేని జీవమును; తాల్చు తగుల్ = ధరించుకోరిక; కాదు = తగదు; రోసి = ఏవగించి; బర్హి... యూథంబున్ = నెమలి, సింహము, ఏనుఁగు (కుంభస్థలముకలది), చమరీమృగములగుంపును; ఏణంబు

1. చ. నడె. 2. క. పెల్లాను. 3. క. గరుసునొరసె. చ. ట. కలచు నెఱచి. 4. క. దిక. చ. ధిక. 5. క. స్సారంబు. చ. ట. స్సారంపు.

లున్ = జింకలును; ఆ వృషలివాలుందూపుఁ గ్రొమ్మంటకున్ = ఆశూద్రస్త్రీయొక్క వాఁడియైన బాణములవలని అగ్నిజ్వాలలకు; ఆహుతి యౌన్ = కాలిపోవును - చనిపోవును.

'ఆ శూద్రస్త్రీయొక్క యవయవము లిదివఱకే తమ మానము హరించినవి; ఇంకవ్యర్థములగు ప్రాణములుండిమాత్ర మేమి ప్రయోజన'మని తలంచి యడవిమృగములు ఆమెబాణముల కెఱ యగుచున్నవని భావము. ఆమెనడక నెమలినడకను, నడుము సింహమునడుమును, స్తనములు కరికుంభములను, కేశపాశము చమరీమృగవాలమును, చూపులు లేఁడిచూపులను బోలి యున్నవని కవి వర్ణనము. ఆమె వానిని వేఁటాడుచున్నదనియు నర్థము. అలం. ఉపమ, క్రమము.

సీ. జళుకులువార లెస్సగ దంచి వెదురుబియ్యమును బువ్వులవలె నలఁతిలోవి
వార్చి డించిన క్రొత్త వంటకం బతిమాత్ర ధౌతశరావపాత్రమునఁ జాల
వడ్డించి పలువన్నెవన్యామిషంబులు చుట్టువారఁగ నుంచి చొక్కటముగఁ
గాచిన గురునెయ్యి చేచాఁచఁ జాలినంతయుఁ గుమ్మరించి తత్తక్రపూర
తే. మొక యలాబుశలాటుఖండోదరమునఁ, బూన్చి యటు డించి తానునుఁ బొత్తుగలసి
సామిదష్టాన్నకబళముల్ సామి[1]కొసఁగు,నగుచుఁ జవు లెచ్చరించుచు నిగురుఁబోఁడి.

టీక. జళుకులువాఱన్ = మెఱుఁగులు కల్గునట్లు - తెల్లనగునట్లుగా; ['జళుకులు = పొట్టు'అని పూర్వటీక. ఈ టీకకు 'సీ. జళుకులువాఱ......వార్చి. ఇక్కడ జళుకులు అనఁగా పొట్టు అని తోఁచెడి. పాండు. 3. ఆ.' అను శబ్దరత్నాకరము ఆధారమై యుండవలెను.] అలఁతిలోవిన్ = చిన్నవంట కుండయందు; వార్చి=వండి, గంజివార్చి; డించిన = దింపిన - సిద్ధముచేసిన; అతిమాత్రధౌతశరావపాత్రమునన్ = బాగుగా తోమఁబడిన మూఁకుటియందు; పలువన్నెవన్యామిషంబులు = పెక్కువిధముల అడవిమృగముల మాంసములను; చుట్టువాఱఁగన్ = చుట్టును ఉండునట్లు; చొక్కటముగన్ = స్వచ్ఛముగ - బాగుగ; గురునెయ్యి = గవయమృగసంబంధమగు నేయి; [ఆవును బోలియున్న యడవిమృగము గవయము.] కుమ్మరించి = పోసి; తత్తక్రపూరము = ఆగవయమృగముమజ్జిగను; అలాబుశలాటుఖండోదరమునన్ = వెట్టిసొరకాయచిప్పలో; పూన్చి = నిండారఁబోసి; అటు డించి = ఒకప్రక్కనుంచి; పొత్తుఁగలసి = బంతిలోఁగూర్చుండి; ఇగురుఁబోఁడి = చిగురువంటి దేహము కల కాఁపుపడఁతి; నగుచున్ = నవ్వుచును; చవులు, ఎచ్చరించుచున్ = ఆ యా రుచులను తెలియఁజెప్పుచు - లేక ప్రశ్నించుచు; సామిదష్టాన్నకబళముల్ = సగముకొఱికిన యన్నపుఁ బిడుచలను; సామికిన్ = భర్తకు-నిగమశర్మకు; ఒసఁగున్ = ఇచ్చును. అలం. స్వభావోక్తి.

శా. కాఁపుం గెంజిగురాకుఁబోఁడి పరలోకం బంత ప్రాపింపుడున్
వ్యాపాదంబున నాతఁ డొండుకడ రూపాజీవ రాజాననం
దాపింఛచ్ఛదగుచ్ఛసచ్ఛవి మదాంధన్ బంధురశ్రోణి వీ
ణాపాణిం ధమపాణి నొక్క ప్లవకన్యం గూడి క్రీడింపఁగన్. 83

టీక. అంతన్ = పిదప; కాఁపుంగెంజిగురాకుఁబోఁడి = కాఁపుపడఁతి; పరలోకంబు, ప్రాపింపుడున్ = మరణింపఁగా; వ్యాపాదంబునన్ = ద్రోహచింతతో - మోసముచేత; ఆతఁడు = ఆ నిగమశర్మ; ఒండుకడన్ = వేఱొకచోట; రూపాజీవన్ = బోగముదానిని; రాజాననన్ = చంద్రముఖిని; [పూర్వటీకలో 'రూపాజీవరాజాననన్ = బోగముదానిని' అని యున్నది. ఆ యర్థము 'రూపాజీవ' పదమునకే చెప్పఁదగియున్నది; 'రాజాననన్' అనునది విశేషణము.] తాపింఛచ్ఛదగుచ్ఛసచ్ఛవిన్ = చీఁకటిమ్రానియాకుల గుత్తులతో సమానమగు (నల్లని) కాంతి కలదానిని; మదాంధన్ = క్రొవ్విన

1. చ. కొసఁగ.

దానిని; బంధురశ్రోణిక్ = చక్కని పిరుదులు గలదానిని; వీణాపాణింధమక్ = వీణను వాయించుదానిని; ప్లవకన్యక్ = మాలపడుచును; క్రీడింపఁగక్ = రమింపఁగా.

వ. అపవిత్రంబగు పుత్రలాభంబు దత్కళత్రంబు[1]నందు సంభవించె నిట్లా నష్టపూర్వ *ద్విజన్ముండు [2]కష్టమార్గంబున [3]నెలసి నెలఁతయుం [4]దానును బాలుమాలి మృణాళనాళపేశలంబగు [5]ఫణాధరపరివృఢఫణాఫలకతలిమంబున నంటసిలంబడ నెడనెడం బెక్కు పాతకంబు లుపార్జించుచు వర్తించి వర్తించి యొక్కనాఁ డొక్కరుండును గుర్కురకుమారయుగళంబుఁ, గుపితశరభనిభం బగుదాని గళగళాయమాన గళనిగళనియమితంబుగఁ [6]గేలం గీలించి యొంటిపాటున వేఁటపైఁ గల తివుట నూటాడుచు సమీపాటవీమధ్యంబుఁ జొచ్చి యాస్ఫోటించి పిక్క [7]సెవరక [8]దిక్కులు పరిభ్రమించి యదభ్రమదవిభ్రమభూయిష్ఠంబులగు మృగంబులం దెగఁజూచి యేచి కన్నిచ్చకు [9]వచ్చు పెక్కు నంజుడులు †చేవడించక కావడించి ప్రొద్దస్తమించునంతకు నిజనిశాంతంబునకుఁ బఱతెంచునప్పుడు. 89

టీక. తత్కళత్రంబునందుక్ = ఆ భార్యయందు - మాలపడుచునందు; సంభవించెక్ = కలిగెను; నష్టపూర్వద్విజన్ముండు = ఇదివఱకే నశించిపోయిన బ్రాహ్మణుఁడు; కష్టమార్గంబునక్, ఎలసి= చెడునడతఁ బ్రవేశించి; నెలఁతయుక్ = భార్యయు; పాలుమాలి = లెక్కసేయక; మృణాళనాళపేశలంబు, అగు = తామరతూఁటిలోనిదారమువలె సుకుమారమైన; ఫణాధరపరివృఢ = నాగరాజుయొక్క; ఫణాఫలకతలిమంబునక్ = బల్లపరుపుగానుండు పడగయను తల్పమున; అంటసిలంబడక్ = అంటుకొనునట్లు పడురీతిని - తమ్ము అధఃపాతాళమునకు అణఁచివేయుటకుఁ జాలునట్లుగా; ఎడనెడక్ = నడుమనడుమ; పాతకంబులు = ఘోరపాపములను; ఉపార్జించుచుక్ = సంపాదించుచు; కుర్కురకుమారయుగళంబుక్ = కుక్కపిల్లలజంటను; కుపితశరభనిభంబు = కోపించిన శరభమృగముల కీడైనదానిని; గళ......తంబుగక్ =గళగళమని ధ్వనిచేయు మెడగొలుసులచేఁ గట్టఁబడినదానినిగా; కేలం గీలించి = చేతిలో పట్టుకొని; ఒంటిపాటునక్ = ఏకాంతముగా - రహస్యముగా; తివుటక్ = పట్టుదలతో; ఊటాడుచుక్ = సంచరించుచు; సమీపాటవీమధ్యంబునక్ = దగ్గఱనున్న అడవినడుమను; చొచ్చి= ప్రవేశించి; ఆస్ఫోటించి = భుజములు చఱచి; పిక్కసెవరక = పిక్కలబలము తగ్గకుండఁగా; పరిభ్రమించి = తిరిగి; అదభ్రమదవిభ్రమభూయిష్ఠంబులగు = ఎక్కువ మదవిభ్రాంతి కలవైన - మిక్కిలి మదించిన. ['మిక్కుటమయిన త్రిప్పటచే నిండుకొన్నవి - మిక్కిలి త్రిప్పటచేత అలసినవి'అని పూర్వటీక.] తెగఁజూచి = చంపి; ఏచి = విజృంభించి; కన్నిచ్చకుక్, వచ్చు = కంటికి నచ్చిన; పెక్కునంజుడులు = చాల మాంసములను; చేవడించక = తగ్గించక - ఎక్కువగాఁదీసి; కావడించి = కావడివేసి - కావడిలోనుంచి, మోసికొనుచు; ప్రొద్దు, అస్తమించునంతకుక్ = సూర్యాస్తమయమగుసరికి; నిజనిశాంతంబునకుక్ = తనయింటికి; పరతెంచునప్పుడు = రాఁగా.

మాలిని కుపితశమన చక్షుఃక్రూరదుర్వారకీలా
స్ఫుటిత మగు వహ్నిన్ దద్దివాకీర్తియిల్ మ్రు
గ్గిపడియె మధుపానక్షీబజాయాతనూజా
తపరిజనయుతంబై దైవదుర్భావదృష్టిన్. 90

---

1. క. నందును. చ. ట. నందు. *ద్విజుండు. శ. ర. 2. చ. నష్ట. 3. చ. నెలయ. 4. చ. దానును మోవం. ట. నెలయందును మోవంజాలు. 5. చ. ఫణి. 6. క. గేల. చ. గేలం. 7. చ. (శిథిలము) 8. చ. రిక్కక. ట. పెక్కునిక్కలు. 9. ట. పచ్చి. † శ. ర. బ్రావడించక.

టీక. కుపిత.....స్ఫుటితము, అగు = కోపించిన యమునికన్నులవలని (కన్నులనుండి పుట్టి) తీక్ష్ణమై, అడ్డులేనిదగు మంటలచే ఆక్రమింపఁబడినదైన; తద్దివాకీర్తియిల్ = ఆ మాలవానియిల్లు; దైవదుర్భావదృష్టిన్ = దైవముయొక్క చెడ్డచూపుచే; మధు.....యుతంబై = కల్లుత్రాగుటచే మత్తుగొన్న భార్య, పుత్త్రులు, సేవకులతోఁగూడ; మగ్గి, పడియెన్ = కాలి, పడిపోయెను - నశించెను.

చ. తనగృహ మిట్లపత్యపశుదారధనాదులతోడ [1]మగ్గఁగాఁ
గని వెఱఁగంది కంది కనుఁగ్రంతల ముంతలఁబోసి[2]నట్లు బో
రనఁ గడుఁబాష్పపూరములు గ్రమ్మఁగ నేడ్చుచు మూర్ఛవోయి య
ల్లనఁ దెలిసెన్ వినిందితకులవ్యవహర్త మనోబలంబునన్. 91

టీక. తనగృహము = తనయిల్లు; ఇట్లు = ఈరీతిని; అపత్యపశుదార ధనాదులతోడన్ = బిడ్డలు, పశువులు, భార్య, ధనము మొదలగువానితోఁగూడ; మగ్గఁగాన్ = కాలిపోఁగా; కని = చూచి; వెఱగు, అంది = ఆశ్చర్యపడి; కంది = పరితపించి; వినిందితకులవ్యవహర్త = నిందింపఁబడిన కులాచారములు కలవాఁడు - చెడిపోయినవాఁడు - నిగమశర్మ; కనుఁగ్రంతలన్ = కన్నులరంధ్రముల (కన్నుల)నుండి; ముంతలన్, పోసినట్లు = ముంతలతోఁ గుమ్మరించినట్లు; బోరనన్ = శీఘ్రముగ; కడున్ = ఎక్కువఁగా; బాష్పపూరములు = కన్నీటిధారలు; క్రమ్మఁగన్ = వ్యాపింపఁగా; మనోబలంబునన్ = ధైర్యముకలిమిని; అల్లనన్ = మెల్లగా; తెలిసెన్ = తెలివొందెను.

క. ఇలఁ జది[3]కిలఁబడి పలుమఱు, తల[4]దోర్చుచు వికృతమగు వదనమున లాలా
జలములు తీఁగెలుపాఱఁగఁ, బలుకు నతం డాలిఁగుఱిచి పరిచితరక్తిన్. 92

టీక. ఇలన్ = భూమిపయి; పలుమఱు = పెక్కుసారులు; తల, దోర్చుచున్ = తల వ్రేల వేయుచు; వికృతమగు = వికారముగనున్న; వదనమునన్ = నోటినుండి; లాలాజలములు = చొంగ నీళ్లు; అతండు = నిగమశర్మ; పరిచితరక్తిన్ = ఎక్కువప్రేమతో; ఆలిగుఱిచి = భార్యనుగుఱించి - భార్యను దలఁచి; పలుకున్.

ఉ. ఎల్లరు నెల్లచో ధనము లిచ్చి మృగాక్షులఁ గొంద్రుగాని యో
పల్లవపాణి! యేఁ బరమపావనవంశము నిచ్చి కొంటి నీ
నల్లనిరూపు నిక్కమని నమ్మి; ధ్రువం బదిగాక నేడు వి
ద్యుల్లతికాధికాభినయధూర్వహమౌట యెఱుంగ నింతయున్. 93

టీక. ఎల్లరున్ = అందఱును; మృగాక్షులన్ = స్త్రీలను; కొంద్రుగాని = కొందురుగాని - గ్రహింతురుగాని; ఓ పల్లవపాణి!=చిగురువంటి (సున్నితమగు) చేయిగల ఓ ప్రియురాలా! పరమపావనవంశమున్ = మిక్కిలి పవిత్రమగు బ్రాహ్మణజాతిని; ఇచ్చి; నిక్కమని, నమ్మి=నిజమని (శాశ్వతమని) నమ్మి; కొంటిన్; అది = ఆరూపు; ధ్రువంబుగాక = శాశ్వతమైనదికాక; విద్యు.....వహము, ఔట= మెఱుపుతీగకంటె ఎక్కువైన అభినయభారమును వహించినది - మెఱుపు మెఱసినంతలో నశించునది యగుననుటను; ఇంతయున్ = కొంచెమైనను; ఎఱుంగన్.

ఉ. సన్నపుసిబ్బెముల్ గలుగు చన్నులఁ బయ్యెదకొంగు[5]వాలఁగాఁ
గిన్నెరవీణె మోసి శ్రుతి గీల్కొన సారెలు చక్క నొత్తి యు
ద్యన్నఖరప్రఘాణములఁ దంత్రులు మీటుచు నాలపించు * నీ
తిన్ననియెల్గు నాచెవులఁ దేనియలొల్కుచవుల్ దలంచెదన్. 94

1. చ. నట్లు. 2. చ. నట్లుగా. 3. చ. కెల. 4. చ. ట. ధార్చుచు. 5. చ. వాలుగా.

టీక. సన్నపుసిబ్బెముల్ = చిన్న (నల్లని) మచ్చలు - (చూచుకములు) కల; చన్నులన్ = స్తనములపయి; వాలఁగాన్ = జాఱఁగా; కిన్నెరవీణెన్ = (మేలుజాతి వీణను) - ఒకవిధమైన వీణను; శ్రుతి, గిల్కొనన్ = స్వరము కూడఁగా; సారెలు, చక్కన్; ఒత్తి = వీణమెట్లను బాగుగా నొక్కి; ఉద్యన్నఖరప్రఘాణములన్ = ఎత్తఁబడినగోళ్ల చేత; తంత్రులు=వీణతీగలను; ఆలపించు=ఆలాపన చేయు; నీ తిన్ననియెల్గు = నీ మధురమైన కంఠధ్వని; తేనియలలొల్కు చవుల్ = తేనెలుకారు రుచులను; తలంచెదన్. అలం. స్వభావోక్తి.

ఉ. ఈకడజాతినాతి కిహిహీ! మహిదేవుఁడు చిక్కె సంచు నన్
రాకకుఁ బోకకున్ జనపరంపర కెంపుగు మాడ్కిఁ జూచి యం
బూకృత మాచరించుటకు బుద్ధిఁ దలంకఁ [1]గలంకముక్తచం
ద్రాకృతిఁ బొల్చు నీ ముఖమునం దమృతస్థితిఁ గాంచి మించుటన్. 95

టీక. ఈ కడజాతినాతికిన్ = ఈ మాలపడుచునకు; మహిదేవుఁడు = బ్రాహ్మణుఁడు; చిక్కెన్ = దొఱకెను; రాకకున్, పోకకున్ = నా రాకపోకలకు; జనపరంపర=జనులగుంపు; కెంపగు మాడ్కిన్ = ఎఱ్ఱనైన చూపుతో - కోపముతో; అంబూకృతము, ఆచరించుటకున్ = ఉమ్మి వేయుటకు; కలంకముక్త చంద్రాకృతిన్ = మచ్చలేని చంద్రునిరూపున; పొల్చు = ప్రకాశించు; అమృతస్థితిన్ = అమృత ముండుటను; కాంచి = చూచి; మించుటన్ = అతిశయించుటచే; బుద్ధిన్, తలంకన్ = నామనస్సు నుండి చలింపను. [నీయందుఁగల మోహముచే నన్నెవ్వరేమి నిందించినను, నన్ను జూచి యుమ్మివైచినను గూడ లెక్కచేయనైతినని నిగమశర్మ మాలపడఁతిం బలఁచి దురపిల్లుచున్నాఁడు.]

ఉ. పుత్త్రులు లేరె యెవ్వరికి భూమి మదన్వయ[2]వర్ధకుల్ భవ
త్పుత్త్రులవంటివారు మును పుట్టరుగాక తదాస్యకాంతి త
ద్గాత్రవివృద్ధి తద్భుజయుగస్ఫురణంబు తదుక్తిలక్ష్మి త
న్నేత్రసరోజపత్త్రరమణీయత చూపఱఁ జొక్క[3]జేయవే! 96

టీక. భూమిన్ = ప్రపంచమున; ఎవ్వరికిన్, పుత్త్రులు లేరె? మదన్వయవర్ధకుల్ = నావంశమును వృద్ధిపొందించువారు - నావంశమును నిలుపువారు; భవత్పుత్త్రులవంటివారు = నీపుత్త్రులఁబోలినవారు; తదాస్యకాంతి = వారి ముఖకాంతి; తద్గాత్రవివృద్ధి = వారి దేహముల పుష్టి; తద్భుజయుగస్ఫురణంబు = రెండు భుజములయొక్క విజృంభణము; తదుక్తిలక్ష్మి = వారిమాటలసొంపు; తన్నేత్రసరోజపత్త్రరమణీయత = తామరపూవులవంటి వారి కన్నుల చక్కఁదనము; చూపఱన్ = చూచువారిని; చొక్కఁజేయవే? = పరవశులనుగాఁజేయవా?

క. అని తనయాలినిఁ [4]దనయాలిని గని మఱికాని కుడవలేఁ గూడు జలం,
బును ద్రావలే ననుచు నన,శనమున నతఁ డేఁగఁజొచ్చె జనరహితమహిన్. 97

టీక. అని = ఇట్లు విచారించి; తన, యాలినిన్ = తనభార్యను; తనయాలిని = తనయుల సమూహమును; కని, మఱికాని = చూచిన తరువాతఁ గాని; కూడు, కుడువలేన్ = తిండి తినలేను; అనశనమునన్ = తిండిలేకయే; అతఁడు = నిగమశర్మ; జనరహితమహిన్ = మనుష్యులులేని భూమియందు; ఏఁగఁజొచ్చెన్ = పోసాగెను.

క. కాఁగలపుణ్యుఁడు దుఃఖపు,వ్రేగు సహించుటనెపోలె విషమాటవిలోఁ
దూఁగుచుఁ [5]దూలుచు నీరము, లీఁగుచుఁ దలవాంచి యురక యేఁగుచునుండెన్.

* శ. ర. సూర్య. నా. 1. క. కలంక. 2. శ. వర్ధనుల్. చ. వర్ధకుల్. 3. చ. చేయదే 4. క. తనయూ. 5. చ. దూరుచు. 6. చ. బడు.

టీక. కాఁగలపుణ్యుఁడు = ముందు పుణ్యాత్ముఁడు కాఁబోవువాఁడు; దుఃఖపుభ్రేగుక్ = దుఃఖముయొక్క బరువును; సహించుటవోలెన్ = సహించియుండురీతిని; [నిగమశర్మ] విషమాటవిలోన్ = కాఱడవిలో; తూఁగుచున్ = ఊఁగులాడుచు; తూలుచున్ = తూలిపడుచు; ఈరములు, ఈఁగుచున్ = పొదలలోదూరుచును; తలవాంచి = తలను వంచుకొని, ఉరక = ఊరకయే - పనిలేకయే; ఏఁగుచునుండెన్ = పోవుచుండెను. అలం. ఉపమ, స్వభావోక్తి.

తే. నీచమగు మేను పాఱంగవైచుకరణిఁ, బడి సరోరుహనేత్రు నపారకరుణ
నధమలోకంబువిడిచియయ్యమరపథముఁ, జూచుటకు బోలెఁదనుతాన లేచునతఁడు.

టీక. పాఱంగవైచుకరణిన్ = పారవేయునట్లుగా; అతఁడు = నిగమశర్మ; పడి= నేలపైఁబడి; సరోరుహనేత్రునపారకరుణన్ = అంతములేనిదైన విష్ణునిదయచే; అధమలోకంబున్ = నరకలోకమును; విడిచి; అయ్యమరపథమున్ = ఆ శ్రీవైకుంఠమును; చూచుటకుఁబోలెన్ = చూచుటకో యనునట్లుగా; తనుతాన, లేచున్ = తనంతట తానే మఱల లేచును.

నిగమశర్మ నేలపైఁ బడుట - అతఁడు నీచదేహమును నేలపై పాఱవేయునట్లును, అతఁడు తిరిగి లేచుట విష్ణునిదయవలన అధమలోకమును విడిచి, వైకుంఠమును జేరఁజూడఁదలఁచినట్లును ఉత్ప్రేక్షింపఁబడినవి. అలం. ఉత్ప్రేక్ష.

వ. ఇట్లనుద్దిష్టప్రయోజనుండై బహుయోజనంబులు నిరోభ్భజనుండు నిరంబుభజనుం[1] డునై యాకుజనుండు పెక్కుదినంబు లాక్రాంతమహాగహనవిహారణుండై [2]యెచ్చోటఁ నిశాటపతి వక్షఃకవాటపుటవిఘటనపటుచటులఘటనఖరముఖరత్నాభరణాయమాన త్రిభువనభరణుండగు నృసింహుం డుపసంహృతవైకుంఠనగరనివాసుండై విజయంచేసియుండు నప్పుణ్యప్రదేశంబుం బ్రవేశించి. 100

టీక. అనుద్దిష్టప్రయోజనుండై = ఎట్టి ప్రయోజనమును ఉద్దేశించనివాఁడై; నిరోభ్భజనుండున్ = తిండిలేనివాఁడును; నిరంబుభజనుండునై = నీరుత్రాగనివాఁడునయి; ఆ, కుజనుండు = ఆ దురాత్ముఁడు; ఆక్రాంతమహాగహనవిహారణుండై = పొందిన గొప్పయడవుల విహారముల కలవాఁడై - పెక్కు కాఱడవులను తిరిగినవాఁడై; ఎచ్చోటన్ = ఏక్షేత్రమునందు; నిశాట......భరణుండు- నిశాటపతి = రాక్షసుని (హిరణ్యకశిపుని) యొక్క; వక్షఃకవాటపుట = తలుపువంటి ఱొమ్ముయొక్క; విఘటన = భేదించుటయందు; పటు = సమర్థమైన; చటుల = మనోహరముగా; ఘట = కూర్చుటయందు (తగిన); నఖరముఖ = కొనగోళ్లే; రత్నాభరణాయమాన = రత్నములయలంకారములుగాఁ గల; త్రిభువనభరణుండు = ముల్లోకములను రక్షించువాఁడు; అగు = అయియున్న; ఉప...ండై= వైకుంఠమును విడిచినవాఁడై ; విజయంచేసియుండున్ = వేంచేసియున్నాఁడో; అప్పుణ్యప్రదేశంబున్ = ఆనరసింహక్షేత్రమును.

ఉ. చేరువ చేరువై కడుఁ బచేళిమమై తనుడాయు పూర్వసం
స్కారతపఃఫలంబున [3]భజద్వ్రజసావళినాశకృన్నృకం
ఠీరవదేవ నిత్యసవనీకృతసంగమతీర్థరాజవా
ర్ధారల నాడి తత్పరమధామపతిన్ బలుమాఱుఁ జూచుచున్. 101

టీక. చేరువచేరువై = మిక్కిలి సమీపించినదై; కడున్ = మిక్కిలి; పచేళిమమై = పరిపక్వమైనదై; తను, డాయుం = తన్ను చేరుచున్న; పూర్వసంస్కారతపఃఫలంబునన్ = వెనుకటి జన్మమునఁజేసికొన్న తపస్సుయొక్క ఫలముచేత; భజత్......వార్ధారలన్-భజత్ = సేవించువారియొక్క;

---

1. ట. భోజనుండు. 2. క. యచ్చోట. చ. యెచ్చోట. 3. చ. భవద్వ.

వృజినావళినాశకృత్ = పాపసమూహములను నశింపఁజేయునట్టి; నృకంఠీరవదేవ = శ్రీనృసింహస్వామికి; నిత్యసదనీకృత = స్థిరనివాసముగాఁ జేయఁబడిన; సంగమతీర్థరాజవార్ధారలన్ = సంగమతీర్థ జలములందు; ఆడి = స్నానముచేసి; [కర్త నిగమశర్మ] తత్పరమధామపతిన్ = ఆ వైకుంఠప్రభువును-నరసింహస్వామిని; పలుమాఱు = పెక్కుసారులు; చూచుచున్.

సీ. ఒకయింత తెప్పవేయక చూచుఁ బెఱవారిఁ దలకొట్టుకొని దుఃఖజలధిమునుఁగు
[4]బిలము తెలుపుమంచు బృథివిలోఁ జొరఁబాఱుసమధిక స్తంభోద్భవముగమించుఁ
[5]దిరియువాఁడునుబోలె దెసలకుఁ జెయిచాఁచుఁ దొరఁగున స్రాంబుధి దొప్పదోఁగు
హా! పోయితే యనియఱచు భార్యగుఱించి [1]బహువిధైరాసక్తి భ్రాంతిఁ బొందుఁ
తే. జేరఁగారాని దర్శనస్థితి వహించు, బాడబస్ఫూర్తి లోఁగొన్నపగిదినుండు
దానవారాతి కాఁబూని తదవతార, దశకమును మున్నె తాల్చెనా ధరణిసురుఁడు.

టీక. ఈ పద్యమునందు నిగమశర్మచేష్టలు భగవంతుని పది యవతారములతోఁ బోల్పఁబడినవి. ధరణిసురుఁడు = బ్రాహ్మణుఁడు - నిగమశర్మ; దానవారాతి, కాఁబూని = (తాను) విష్ణువు కాఁదలఁచి-తాను విష్ణుసారూప్యమును పొందఁదలఁచి; మున్నె = ముందుగానే; తదవతారదశకమును=ఆ దేవుని పది యవతారములను; తాల్చెనాన్ = ధరించెనో యనునట్లు; పెఱవారిన్=ఇతరులను; ఒకయింత = కొంచెమైనను; తెప్పవేయకచూచున్ = తెప్పపాటులేక చూచుచుండును; [ఇఁట మత్స్యావతారము సూచితము; చేఁప తెప్పవేయక చూచుట సహజము.] తలకొట్టుకొని, దుఃఖజలధిన్ = దుఃఖసముద్రమునందు; మునుఁగున్; [ఇందు కూర్మావతారము కానగు. ఆదికూర్మము సముద్రమున మునిఁగియుండుట సాజము.]

బిలము = రంధ్రమును; తెలుపుము = తెలుచుకొనుము; అంచున్ = అని పల్కుచు; పృథివిలోన్ = భూమిలో; చొఱఁబాఱున్ = ప్రవేశింపఁబూనును; [వరాహావతార మిచట ఊహ్యము; వరాహము భూమిలోఁచొచ్చుట ప్రసిద్ధము.] సమధిక స్తంభోద్భవమున్ = మిక్కిలియెక్కువైన కొయ్యబాఱినస్థితిని; గమించున్ = పొందును. [ఇచట నరసింహావతారము సూచితము. నరసింహస్వామి స్తంభమునుండి పుట్టుట ప్రసిద్ధము.] తిరియువాఁడునుబోలెన్ = బిచ్చమెత్తువానిరీతిని; దెసలకున్ = నలుప్రక్కలకును; చెయిచాచున్ = చేతులుచాచును. [ఇఁట వామనావతార మూహ్యము, వామనుఁడు తిరిపమెత్తుట ప్రసిద్ధము.] తొరఁగు నస్రాంబుధిన్ = కాఱుచున్న కన్నీటిసముద్రమున; తొప్పఁదోఁగున్ = ఎక్కువగా మునుఁగును; [పరశురామావతారపక్షమున నిచట 'ప్రవహించుచున్న రక్తసముద్రమున బాగుగ మునుఁగునని యర్థము; అస్రమనకు రక్తమనియు నర్థము.]

(నిగమశర్మ) భార్యగుఱించి హా! పోయితే! అని యఱచును; విష్ణువు శ్రీరామావతారకాలమునను సీతనుగూర్చి యట్లే యఱచెను.

బహువిధైరాసక్తిన్ = పెక్కువిధములుగ దప్పిచే; భ్రాంతినొందున్ = విభ్రాంతిని పొందును; [బలరామావతారపక్షమున 'పెక్కురకముల మద్యములం దాసక్తి కలుగుటచే మత్తుపొందు'నని యర్థము.] [ఇర = కల్లు, జలము.] చేరఁగారాని = సమీపింపఁగా లేని; దర్శనస్థితిన్ = చూపుయొక్క యునికిని-చూపు చెడిపోవుటను; వహించున్ = పొందును. [బౌద్ధావతారపక్షమున 'దగ్గఱకుఁ జేరఁగారాని మతముయొక్క (బౌద్ధమతముయొక్క) స్థితిని పొందునని యర్థము. దర్శనము = చూపు, శాస్త్రము.] బాడబస్ఫూర్తిన్ = బడబాగ్నియొక్క తోఁపికను; లోన్ = ఉదరములో; కొన్నపగిదిన్ = గ్రహించినరీతిని; ఉండున్ - బడబాగ్ని కడుపులోఁ బ్రవేశించినరీతిని ఆందోళనపడును. [కల్కిపక్షమున 'గుఱ్ఱముయొక్క స్వరూపమును వహించెననుట. బాడబము = బడబాగ్ని, గుఱ్ఱము.] అలం. రత్నావళి, శ్లేష.

4. క. బిలముఁ-చ. ట. బిలమూ! 5. క. తిరియు. క. బహువిధాసక్తి విభ్రాంతి. 1. చ. ధైరాసక్తి.

క. ఉడుగని పస్తులఁ జెవులను, గడియలుపడ మేను వడఁకఁ గాలము గడవం
బడమిఁ బుడమివేలుపు వడి, చెడి పుడమింబడియెఁ; [1]విగతజీవుఁడు నయ్యెన్. 103

టీక. ఉడుగనిపస్తులన్ = ఎడతెగని ఉపవాసములచే; గడియలుపడన్ = వినివింపకపోఁగా; కాలము = రోజులు; కదవంబడమిన్ = కడవకపోఁగా; పుడమివేలుపు = బ్రాహ్మణుఁడు - నిగమశర్మ;

ఉ. ఈవిధమైనయయ్యధము హీనపుమే నపుడెక్కఁ గాకఘూ
కావలి దావకీలలగు [2]నల్కలు ముంగల మొల్కలెత్త దం
తావళిజాలనీలమగు దండధరానుచరాగ్రణీబలం
బావలఁ ద్రోవలాఁచి వెస యాతనపుందనువాఁగి రేఁగఁగన్. 104

టీక. కాకఘూకావలి = కాకులయొక్కయు, గుడ్లగూబలయొక్కయు గుంపు; దావకీలలగు = దావాగ్నిజ్వాలలగు - దావాగ్నిజ్వాలలను బోలినవైన - ఎఱ్ఱనివైన; అల్కలు = అలుకలు - కోపములు; ముంగలన్ = ముందట; మొల్కలెత్తన్ = అంకురింపఁగా; దంతావళిజాలనీలమగు = ఏనుఁగుపిండువలె నల్లనైన; దండ......బలంబు = యమునియొక్క భటశ్రేష్ఠుల గుంపు; త్రోవలు, ఆఁచి = దారులందు అడ్డగించి; యాతనపుందనువు = యాతనాదేహము; ఆఁగి = నిలిపి; రేఁగఁగన్ = విజృంభింపఁగా;

సీ. లలనాజనోష్ఠలాలాజలా[3]విలముగఁ గోరె మద్యముపేరికులమునెల్ల
వావివర్తనలతా[4]వావంత దలఁపక కన్నిచ్చవడ రేఁచెఁ గామవికృతి
జనులు పుర్వ్వఁగఁ దిట్ట సడికోర్చి యార్జించెఁ బశ్యతోహరవృత్తిఁ బసిఁడి[5]ప్రోఁగు
కన్నపెట్టియుఁ ద్రోవగాచి కొట్టియుఁ జంపె లెక్కకు మిగులు భూలేఖవరుల

తే. మఱియు నీ రీతిఁ గ్రూరుల మైత్రి వడసె
నితరపాతకములు చేసె నెన్నియేని
వీనిఁ బొదువుఁడు కట్టుఁడు వ్రేయుఁ డనుచు
జమునిదూతలు బాధింప జడిసె నతఁడు. 105

టీక. లలనా......ముగన్ = స్త్రీజనముయొక్క పెదవిచొంగతోఁ గూడునట్లుగా; మద్యము పేరికులము నెల్లన్ = రకరకములగు మద్యములనన్నింటిని; [వీఁడు కర్త.] కోరెన్; వావివర్తనలతావు = వావి వరుసలరీతిని; ఆవంత=(ఆవ+అంత) కొంచెమైనను; కామవికృతిన్ = మన్మథవికారమున; కన్నిచ్చవడన్ = తనకంటికినచ్చునట్లు-తనకంటికి నచ్చిన స్త్రీనిపొంది; రేఁచెన్ = విజృంభించెను; జనులు = ప్రజలు; పుర్వ్వఁగన్, తిట్టన్ = తన్ను పురుగులు కాఱునట్లు తిట్టఁగా; సడికిన్, ఓర్చి = అవమానమును సహించి; పశ్యతోహర వృత్తిన్ = చూచుచుండఁగా దొంగిలించు పద్ధతిని - బందిపోటుదొంగతనపుపద్ధతిని; పసిఁడిప్రోఁగు = బంగారపుప్రోకలను; ఆర్జించెన్ = సంపాదించెను; కన్నపెట్టియున్ = (కన్నము 'ము' లోపము) ఇండ్లకు కన్నములు వేసియు; లెక్కకుమిగులు = లెక్కించుటకు ఎక్కువైన - లెక్కలేనంతమందిని; భూలేఖవరులన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను; చంపెన్; ఇతరపాతకములు = తక్కిన మహాపాపములను; జమునిదూతలు = యమభటులు; అతఁడు = నిగమశర్మ; జడిసి = భయపడి.

క. ఆక్రోశం బొనరించె దిశాక్రామన్నాదముగ విశంకటగతి నూ
త్నక్రమమగు నామొఱ విని, సక్రోధాక్రమణనిపుణసంభ్రమ మడరన్. 106

టీక. దిశాక్రామన్నాదముగన్ = దిక్కులందు వ్యాపించు ధ్వనికలుగునట్లుగా - దిక్కులు ప్రతిధ్వనింపఁగా; ఆక్రోశంబు, ఒనరించెన్ = మొఱపెట్టెను; విశంకటగతిన్ = గొప్పరీతిని; నూత్న

1. చ. జీవుండయ్యెన్. 2. క. వాల్కలు. చ. ట. నల్కలు. 3. క. న్వితముగ. చ. విలముగ. 4. చ. నావంత. 5. చ. ప్రోవు.

క్రమమగు = వింతరీతినున్న; ఆ మొఱన్ = ఆ యాక్రందనమును; సక్రోధ.....మము, అడరన్ = కోపముతోఁగూడ ఆక్రమించుకొను తొందరపాటు అతిశయింపఁగా.

మ. అమరద్రోహివిరోధి మున్న చట రక్షార్థంబుగా నిడ్డ చ
క్రము విక్రాంతి వహించి భాస్కరసహస్రక్రూరమై వచ్చి య
య్యమదూతావళిహావళిం దెరల విప్రాధీనబంధప్రతా
నము ఖండించె నఖండితార[1]శిఖసన్నాహంబు దిగ్వ్యాహిగన్. 107

టీక. అమరద్రోహివిరోధి = దేవతలకు శత్రువులగు రాక్షసులకు విరోధియైన విష్ణువు; మున్ను = పూర్వము; అచటన్ = ఆనృసింహక్షేత్రస్థలమున; రక్షార్థంబుగాన్ = కాఁపుదలగా; ఇడ్డ = ఉంచిన; చక్రము = సుదర్శనమాయుధము; విక్రాంతి, వహించి = విక్రమించి; భాస్కరసహస్రక్రూరమై = వేయిమంది సూర్యులవలె తీక్ష్ణమైనదై, వచ్చి; అయ్యమదూతావళిహావళిన్ = ఆ యమభటుల యుపద్రవముకూడ; తెరలన్ = తొలఁగఁగా; సన్నాహంబు = (తన) ప్రయత్నము; దిగ్వ్యాహిగన్ = దిక్కులను వ్యాపించునట్లు - ప్రసిద్ధమగునట్లు; అఖండితాశిఖన్ = మొక్కవోని యంచు చేత; విప్రాధీనబంధప్రతానమున్ = బ్రాహ్మణునికి గట్టఁబడిన కట్టులగుంపును; ఖండించెన్ = కోసివేసెను.

క. [2]సీకులును గాందిశీకులు, నై కాలానుగులు గునుక నపు డరుదెంచెన్
శ్రీకాముకపారిషదా, నీకములు సుదర్శనాసి [3]నీరజములతోన్. 108

టీక. కాలానుగులు = యమభటులు; సీకులును = చెదరిపోయినవారును; ['శీకులు = హింస కలవారు' అని టీక.] కాందిశీకులునై = భయపడినవారు నయి; కునుకన్ = తరలిపోఁగా - జాఱిపోఁగా; శ్రీకాముకపారిషదానీకములు = విష్ణుదూతల సమూహములు; సుదర్శనాసినీరజములతోన్ = సుదర్శనము, నందకము, పాంచజన్యములతోఁగూడ; అపుడు; అరుదెంచెన్ = వచ్చెను ['సుదర్శనాదినీరజములతోన్ = సుదర్శనచక్రము లోనగువానితోను, శంఖములతోను, అని పూర్వటీక.]

క. అరుదెంచి జముపురికిఁ జను, తెరువున మరలించి తెల్లదీవి తెరువునన్
హరిభృత్యులు నడపించిరి, గరుడాంచితయానమున నిగమశర్మాఖ్యున్. 109

టీక. హరిభృత్యులు = విష్ణుదూతలు; అరుదెంచి = వచ్చి; జముపురికిన్ = యమునిపట్టణమునకు; చను తెరువునన్ = పోవుదారినుండి; మరలించి = తప్పించి; తెల్లదీవి తెరువునన్ = శ్వేతద్వీపము దారిని; నిగమశర్మాఖ్యున్, గరుడాంచితయానమునన్ = గరుడవాహనముపై (కూర్చుండఁబెట్టి;) నడపించిరి.

సీ. ఉత్తాలఫణిభుగ్గరుత్తాలవృంతానిలాశాంతఘర్మాంబు వయ్యె మేను
ప్రత్యగ్రముక్తాతపత్రీభవచ్ఛేషవారితాతపమయ్యెఁ జారుమౌళి
సూత్రవతీశదోర్వేత్రదత్తావకాశామరంబయ్యెఁ గటాక్షవిభ్రాంతి
భృగుభరద్వాజప్రభృతి కృతస్వస్తివాగ్భరముఖరములయ్యెఁ బార్శ్వతలము
తే. లరుణకిరణసహస్రాభ మభ్రగంబు, నగు విమానంబుపై నెక్కి నిగమశర్మ
తేంద్రఁ బుండ్రేక్షుకోదండుతండ్రిఁ బోలి, పరమధామంబునకుఁ బోవుపథమునందు.

టీక. నిగమశర్మ; అరుణకిరణసహస్రాభము = వేయిమంది సూర్యులకాంతిగలదియుఁ; అభ్రగంబున్ = ఆకాశముపైఁ బోవునదియుఁ; అగు; విమానంబుపైన్; ఎక్కి; తేంద్రన్ = తేజస్సుచేత; పుండ్రేక్షుకోదండుతండ్రిఁబోలి = చెఱకువిల్లు గలుగు మన్మథునికి తండ్రియగు విష్ణువువలె; పరమధామంబునకున్ = వైకుంఠమును; పోవు పథమునందున్ = పోవుదారిలో; మేను = అతని దేహము; ఉత్తాల

1. చ. శిక. 2. క. శీకులును. 3. క. నాది. చ. నాని. ట. నాళి.

......బువు - ఉత్తాల = ఉన్నతమైన; ఫణిభుక్ = గరుత్మంతునియొక్క; గరుత్తాలవృంత = ఱెక్కలను విసనకఱ్ఱలవలని; అనిల = గాలిచేత; ఆశాంతఘర్మాంబువు = బాగుగా శమించిన (పోయిన) చెమటనీరుకలది; అయ్యెన్; గరుడుఁడు అతనికి చెమటపోవునట్లు ఱెక్కలతో విసరుచుండెనని భావము. చారుమౌళి = చక్కని శిరస్సు; ప్రత్యగ్ర......తపము, అయ్యెన్ - ప్రత్యగ్ర = క్రొత్త; ముక్తాత పత్రీభవత్ = ముత్యాలగొడుగుగా అగుచున్న; శేష = ఆదిశేషునిచే; వారితాతపము = పోఁగొట్టఁబడిన ఎండగలది; అయ్యెను; శేషుఁడు నిగమశర్మకు ముత్యాలగొడుగుగా పడగను విప్పి, అతనికి ఎండ తగులకుండునట్లు చేసెనని భావము. కటాక్షవిహృతి = కడకంటిచూపులవిహారము; సూత్రవతీ...... మరంబు, అయ్యెన్-సూత్రవతీశ = సూత్రవతీదేవిభర్తయగు విష్వక్సేనునియొక్క; దోర్వేత్ర = చేతియందలి బెత్తముచే; దత్తావకాశంబు = ఇవ్వఁబడిన ఎడముకల దేవతలుకలది; అయ్యెను; నిగమశర్మ దారి చేయవలెనని క్రేఁగంటితో సూచింపఁగా విష్వక్సేనుఁడు దేవతలందఱిని తొలఁగించి దేవునియొద్దకుఁ బోవుటకు అతనికి దారి చేసెనని భావము. పార్శ్వతలములు = తన ప్రక్కభాగములు; భృగు...... ముఖరములు, అయ్యెన్ = భృగుభరద్వాజప్రభృతి = భృగువు, భరద్వాజుఁడు మొదలగు మునులచే; కృత = చేయఁబడిన; స్వస్తివాగ్భరముఖరములు = స్వస్తివచనములచేఁ బ్రతిధ్వనించినవి, అయ్యెను.

ఇతని ప్రక్కలఁజేరి భృగువుమొదలగు మునులు స్వస్తిచెప్పుచుండిరని భావము. కాఁగా నిగమశర్మ భగవత్సారూప్యమును బొందెనని తాత్పర్యము.

సీ. ఆజానుదీర్ఘంబులై హరిన్మణిమయ స్తంభంబులకుఁ గులస్వాము లగుచు
దివ్యగంధముల నుద్రేకించి విద్యుదంకుర రేఖలకు జోడుకోడె లగుచుఁ
దలచుట్టుఁదిరిగి రాఁ గలిగి పాండురపద్మ పత్రంబులకుఁ బ్రాణబంధు లగుచు
సకలంబు వెలిగింపఁజాలి బాలార్కబింబములకు ననుబింబపంక్తు లగుచు

తే. నాల్గుచేతులుఁ గాంచన నలినమాలి
కలు వెడఁదకన్ను లాస్యప్రభలు చెలంగఁ
గుముదుఁ డనుపేరఁ బరమేశుఁ గొలిచి నిలిచి
యున్నవాఁ డాతఁ డిప్పుడు నో మునీంద్ర! 111

టీక. ఈ పద్యమున సీసపాదములు నాలుగింటికిని ఎత్తుగీతలోని మొదటి రెండు పాదములకును క్రమసమన్వయసంబంధము; ఆజానుదీర్ఘంబులై = మోకాలిపఱకును వ్రేలుచున్నవై; హరి......లకున్ = పచ్చలు తాపిన స్తంభములకు; కులస్వాములు, అగుచున్ = మాతృకలగుచు - వానిని పోలుచునున్న; - 'నాల్గుచేతులు;' దివ్యగంధములన్ = గొప్పపరిమళములచే; ఉద్రేకించి = విజృంభించి; విద్యుదంకురరేఖలకున్ = మొలకమెఱుపులకాంతులకు; జోడుకోడెలగుచున్ = సమానమగుచున్న; 'కాంచననలినమాలికలు' = బంగారుకమలముల మాలికలును; తలచుట్టున్, తిరిగి రాఁగలిగి = (చెవులను దాటుకొని) తలవెనుకకుఁబోయి మఱలరాఁగలిగి - మిక్కిలి విశాలములయి; పాండురపద్మపత్రంబులకున్ = తెల్ల తామరరేకులకు; ప్రాణబాధులగుచున్ = దగ్గఱిచుట్టములగుచు - సమానములగుచు నున్న; 'వెడఁద కన్నులు' = విశాలనేత్రములును; సకలంబున్ = ప్రపంచమునంతటిని; వెలిగింపఁజాలి = వెలుతురుతో నిండునట్లు చేయఁగల్గి; బాలార్కబింబములకున్ = లేఁతసూర్యుని బింబములకు; అనుబింబపంక్తులు, అగుచున్ = ప్రతిబింబములసమూహము లగుచు - వానితో సమానములగుచున్న; ఆస్యప్రభలు=ముఖము యొక్క కాంతులును; వెలుఁగన్ = ప్రకాశింపఁగా; ఆతఁడు = ఆ నిగమశర్మ; ఇప్పుడు; కుముదుఁ డను పేరన్; పరమేశున్ = విష్ణుని; కొలిచి నిలిచి, యున్నవాఁడు.

నిగమశర్మ బాహువులు పచ్చలుతాపిన స్తంభములపగిదిని, ధరించిన బంగరుపూలమాలలు మెఱుపులరీతిని, విశాలనేత్రములు తెల్లతామరపూవురేకులవలెను, ముఖము లేఁతసూర్యునిబింబమువలెను ఉన్నవనిభావము. అలం, క్రమము, ఉపమ.

తే. పుండరీకుండు [1]శంఖకర్ణుండు వాము
నుండు కుముదాక్షుఁడును విజయుండు జయుఁడు
[2]సర్వనేత్రుండు నను పార్శ్వచరులలోన
హరికిఁ గుముదుండు మాననీయత వహించు. 112

టీక. పార్శ్వచరులలోనన్ = సేవకులలో; మాననీయతన్, వహించున్ = గౌరవమును (ఎక్కువగా) పొందును.

క. అమృతమయమూర్తి బుధహిత, [3]విమలవిభోద్భాసి మసృణవిలసనశుభల
క్ష్మమహితవక్షుఁడు విధుఁ డఁట, కుముదానందప్రదానకుశలుఁడు కాఁడే? 113

టీక. ఈ పద్యమున విష్ణువునకును, చంద్రునికిని శ్లేష చెప్పఁబడుచున్నది.—

విష్ణుపక్షమున - అమృతమయమూర్తి = జలరూపదేహము కలవాఁడు-లేక మృతి గానని రూపు కలవాఁడు; బుధహితవిమలవిభోద్భాసి=విద్వాంసులకు మేలుకూర్చు నిర్మలమగు విశేషకాంతితో ప్రకాశించువాఁడు; మసృణ......వక్షుఁడు = మెఱుఁగులుదేఱు ప్రకాశముకల్గి శుభకరమగు శ్రీవత్సాంకముచే గొప్పదగు ఱొమ్ము కలవాఁడు; విధుఁడఁట! = దేవుఁడఁట! కుముదానందప్రదానకుశలుఁడు = కుముదుఁ డను పార్శ్వవర్తికి ఆనందమునిచ్చుటలో నేర్పరి; చంద్రునిపక్షమున-అమృతమయమూర్తి = అమృతముచేఁ జేయఁబడిన దేహముకలవాఁడు; బుధ......ద్భాసి = బుధునకు మేలుకూర్చు నిర్మలమగు కాంతితో - వెన్నెలతోఁ బ్రకాశించువాఁడు; మసృణ......వక్షుఁడు = దట్టముగానుండి ప్రకాశించు చక్కని మచ్చతోఁ గూడిన నడిమిప్రదేశము కలవాఁడు; విధుఁడు = చంద్రుఁడు; కుముదా...... కుశలుఁడు = కలువలకు ఆనందము నిచ్చుటలో నేర్పరి. [ఇట పూర్వటీకలో 'బుధ......వక్షుఁడు' అని ఏకపదముగా గ్రహింపఁబడి 'బుధ = పెద్దలకు, దేవతలకు; హిత = మేలైన; విమల = నిర్మలమైన; విభా = విశేషకాంతిచేత, ఉద్భాసిత(?) = ప్రకాశించునట్టి; మసృణ = మెఱుఁగులుదేరునట్టి; విలసన= ప్రకాశముగల; లక్ష్మ = చిహ్నముచేత; మహిత = పూజ్యమయిన; వక్షుఁడు = ఱొమ్ముకలవాఁడు' అని యర్థ మీయఁబడినది.] అలం. శ్లేషము.

శా. ఏవంభూతమహాప్రభావనిధి లోకేశుం జితక్లేశు మం
[4]దావిర్భావహాసైకమాత్రదళితోద్యద్దైత్యగర్వాంధకా
రావేశున్ నరకేసరిన్ గొలిచి నిత్యప్రీతి నున్నారు వా
గ్దేవీవల్లభముఖ్యనిర్జరులు తత్క్షేత్రాధికారంబునన్. 114

టీక. ఏవంభూతమహాప్రభావనిధిన్ = ఇట్టి గొప్పప్రభావములకు ఉనికిపట్టగువానిని; జితక్లేశున్ = జయింపఁబడిన కష్టములు కలవానిని; మందా......రావేశున్ = కొంచెముగా పుట్టుచున్న నవ్వుచేతనే - (కేవలమైన చిఱునవ్వుచేతనే - ఆయాస మించుకంతయుఁను లేకయే.) భేదింపఁబడిన గర్వించిన రాక్షసులదైన అహంకారపుటావేశము గలవానిని; నరకేసరిన్ = నృసింహదేవుని; వాగ్దేవీవల్లభముఖ్యనిర్జరులు = బ్రహ్మ మొదలుగాఁగల దేవతలు.

క. ఆ నెలవుల నర్ధనిశల, వీనులకుం దోఁచు నేచి విధినందన! వై
మానికనాయకకృతఘుం, టానాదము నృహరిబిగువునగవుంబోలెన్. 115

టీక. ఆ,నెలవునన్ = అచ్చోట - ఆక్షేత్రమున; అర్ధనిశలన్ = అర్ధరాత్రులందు; ఏచి = అతిశయించి; విధినందన! = నారదుఁడా! నృహరిబిగువునగవుంబోలెన్ = నరసింహుని అట్టహాసము

1. చ. శంఖు. 2. చ. సర్వ 3. చ. దివో. 4. చ. హాసైక.

వలె; వైమానిక......నాదము = ఇంద్రునిచే చేయఁబడిన ఘంటాధ్వని; వీనులకున్, తోఁచున్ = వినఁబడును. అలం. ఉపమ.

క. ఆ క్షేత్రంబున నృహరికి, దక్షిణదిశ నే వసింతుఁ దత్పరమతి నీ
యక్షుఁడతో నీప్రమథా, ధ్యక్షులతో నీ నగేశ్వరాత్మజతోడన్. 116

టీక. ఆ క్షేత్రంబునన్; నృహరికిన్; దక్షిణదిశన్; తత్పరమతిన్ = మిక్కిలి ఆసక్తితో; ఈ ప్రమథాధ్యక్షులతోన్ = ఈ ప్రమథగణములతోను; ఈ నగేశ్వరాత్మజతోడన్ = ఈపార్వతితోను గూడ.

క. మాతృవధంబు పితృవధమును, భ్రాతృవధము గురువధంబుఁ [2]బ్రకటించియు నో
ధాతృసుత! [3]యీల్గి సురపుర, నేతృతఁ దెలివొందు నెట్టి నీచుఁడు [4]నచటన్.

టీక. ఓ ధాతృసుత! = ఓ నారదుఁడా! ప్రకటించియున్ = చేసినను; అచటన్; ఈల్గి = మరణించి; సురపురినేతృతన్, తెలివొందున్ = ఇంద్రపదవిని బొందును.

క. కావున నరులకుఁ దత్క్షేత్రావాస మొసఁగు నైహికాముష్మికముల్
చేవలఁతు లగుచుఁ [5]దక్కొను, నావుడు నా మృడుగణించి నారదుఁ డనియెన్.

టీక. ఐహికాముష్మికముల్ = ఈ లోకపు సుఖములు, పరలోకసుఖములును; చేవలఁతులగుచున్ = చేతికిఁజిక్కి వశములయి; తక్కొనున్ = పూనుకొనుచు - కల్గుచు.

క. దేవ! భవత్కృప నరమృగ, దేవమహాక్షేత్రమహిమఁ దెలిసితి నస్మ
ద్భావము ప్రమోదమేదుర, భావముఁ గైకొనియెఁ జనియె భ్రమమున్ దమమున్.

టీక. భవత్కృపన్ = నీదయవలన; తెలిసితిన్ = తెలిసికొంటిని; అస్మద్భావము = నాయాత్మ; ప్రమోదమేదురభావమున్ = ఆనందముచే గొప్పదగు నభిప్రాయమును; భ్రమమున్ = భ్రాంతియు; తమమున్ = అజ్ఞానమును; చనియెన్ = నశించెను.

క. దైవము [4]క్షేత్రము తీర్థము, నా వాచంయములు గుహుఁడు నడిగిన వీరల్
భావించి తెలుపు తత్త్వము, నావీనులఁ జొనుపు మనుపు ననుఁ బురవైరీ! 120

టీక. ఆ వాచంయములు = ఆ మునులును; గుహుఁడున్ = కుమారస్వామియును; మనుపు = రక్షింపుము; పురవైరీ! = త్రిపురశత్రువవగు శివుఁడా!

తే. అనుడు నుడురాజమకుటుఁ డిట్లను నృసింహ, తీర్థమునకు భిదేళిమదిక్కునందు
సిద్ధమానవవినుతప్రసిద్ధి వెలయు,నాద్యమై ఘర్మవీరామహాప్రవంతి. 121

టీక. ఉడురాజమకుటుఁడు = చంద్రశేఖరుఁడు; భిదేళిమదిక్కునందు - ఎదుటిదైన దిక్కునందు - ఎదురుగా; ఘర్మవీరామహాప్రవంతి = ఘర్మవీర యను గొప్ప నది; ఆద్యమై = ప్రధానమై; సిద్ధమానవవినుతప్రసిద్ధిన్ = సిద్ధులచేతను, మనుష్యులచేతను కొనియాడఁబడు ప్రసిద్ధితో; వెలయున్ = ప్రకాశించును.

తే. తీర్థ[5]సార్థావతంస మత్తీర్థ మభిమ
తార్థదశ్రీలఁ జంద్రభాగాఖ్య నందు
నందుఁ దప మాచరించి మున్నింద్రుఁ డొందె
నమర[1]తతిలోన [7]రుంద్రభోగాతిశయము. 122

---

1. క. తత్పర. 2. క. ప్రకటిం. 3. చ. యిలిగిపుమ్కర. 4. క. తీర్థముక్షేత్రము చ. క్షేత్రము. 5. చ. సార్థ. 6. చ. వతి. 7. చ. రుద్ర.

టీక. తీర్థసార్థావతంసము = తీర్థములగుంపునకు ప్రధానము; అయిన; అత్తీర్థము; అభిమతార్థదశ్రీలన్ = కోరిన కోరికలను ఇచ్చు సంపదలచే; చంద్రభాగాఖ్యన్, అందున్ = చంద్రభాగ యను పేరు పొందును; అమరతతిలోనన్ = దేవతలగుంపులో; ఱంద్రభోగాతిశయమున్ = విశేషమగు భోగములను; ఒందెన్ = పొందెను.

ఉ. తైర్థికు లర్థిఁ గొల్వఁదగుదానికి యోజనమాత్రభూస్థలిన్
తీర్థపదాస్పదం బఖిలదివ్య మతివ్యవహారయోగ్య మి
ష్టార్థసమర్థనక్షమము నై [1]తమమున్ విరియించుఁ బాతకా
నర్థము పౌండరీక మనునర్థము దూషితరోష[2]పోషణా! 123

టీక. తైర్థికులు = తీర్థయాత్రాపరులు; అర్థిన్ = ప్రీతితో; కొల్వఁదగు = సేవింపఁదగిన; దానికిన్ = ఆ తీర్థమునకు; తీర్థపదాస్పదంబు = తీర్థ మను పేరు ఉంచుకొనఁదగినది - నిజమైన తీర్థమగునది; అఖిలదివ్యము = అన్నింటికన్నను శ్రేష్ఠము; అతివ్యవహారయోగ్యము = ఉపయోగించుటకు మిక్కిలి తగినది; ఇష్టార్థసమర్థనక్షమము = కోరిన కోరికలను నెఱవేర్చుటకు మిక్కిలి తగినది; పాతకానర్థము = గొప్ప పాపములను నశింపఁజేయునది; పౌండరీకమను నర్థము = పౌండరీకమను పేరుగల వస్తువు - తీర్థము; తమమున్ = అజ్ఞానమును; విరియించున్ = పోఁగొట్టును; [అర్థము, తమమును విరియించు ననఁగా - వస్తుయథార్థజ్ఞానము తద్విషయకమగు నజ్ఞానమును నశింపఁజేయు నను విశేషార్థము ఇచట వ్యక్తమగును.] దూషితరోషపోషణా!=దూషింపఁబడిన కోపముకలవారిని - (శాంతము కలవారిని) పోషించువాఁడా! [పూర్వటీకలో 'దూషితరోషభూషణా! = దూషింపఁబడిన కోపముగలవారికి అలంకారమైనవాఁడా! - కోపము నణఁచినవారి నేలువాఁడా!' అని కలదు.]

శా. నక్షత్రంబులకున్ క్షపాధిపతికిన్ నాకున్ ద్రియామాచరా
ధ్యక్షద్వేషికి భానుపుత్రికి మరుత్కల్లోలినీవేణికిన్
బక్షిశ్రేణికిఁ బక్షివల్లభునకున్ భాసిల్లు [3]వాసిన్ సమ
స్తక్షేత్రంబులలో ననూనమగు నేతత్క్షేత్ర మీక్షింపఁగన్. 124

టీక. అనూనమగు = తక్కువకాని - గొప్పదైన; ఈక్షింపఁగన్ = చూడఁగా; క్షపాధిపతికిన్ = చంద్రునికిని; త్రియామా......ద్వేషికిన్ = రాత్రించరులగు రాక్షసుల ప్రభువును ద్వేషించు విష్ణునకును; భానుపుత్రికిన్ = యమునకును; మరుత్కల్లోలినీవేణికిన్ = గంగానదికిని; పక్షివల్లభునకున్ = గరుడునకును; వాసిన్ =వాసియును - ఆధిక్యము కూడ; భాసిల్లున్ = ప్రకాశించుననుట.

క. ఇదమిత్థ [4]మ్మని యేనును,మది మితిసేయంగ నేర మౌనీశ్వర! త
ద్విదితప్రభావ మోపిన,విధమున వినిపింతు నీకు విను దృఢబుద్ధిన్. 125

టీక. ఇదమిత్థమ్మని = ఇది యిట్టిదని - దీని రూపిట్టిదని; మితి సేయంగనేరన్ = ప్రమాణమును చెప్పలేను; ఓపినవిధమునన్ = (నాకు) శక్తమగునట్లు - తెలిసినంతవఱకును.

తే. జముని చెలియలు నిర్జరశైవలినియు, బెఱసి మెఱసిన నడుచక్కిఁ బేరు గ్రుచ్చి
ఋషులు తెల్పిన తీర్థములెల్లఁ బౌండ,రీకషోడశకళఁ బోలలేక జ[5]డియు. 126

టీక. జమునిచెలియలు = యముని చెల్లెలు - యమునానదియును; నిర్జరశైవలినియున్ = గంగానదియును; బెఱసి = కూడి; మెఱసిన = ప్రకాశించిన; నడుచక్కిన్ = మధ్యభాగమున; పేరు

---

1. చ. తవమున్. 2. క. భూషణా! చ. భీషణా! ట. పోషణా! 3. క. ధానన్. చ. ట. వాసిన్ 4. ఘ. [illegible]. 5. చ. యుండు.

గ్రుచ్చి = దండగాఁగూర్చి; ['పేరుచెప్పి'యని పూర్వటీక.] పౌండరీకషోడశకళన్ = పౌండరీకతీర్థము యొక్క పదాఱవవంతు కాంతిని; జడియుఁన్ = తొలఁగును - ఓడిపోవును.

సీ. పాతకవ్రాతభూజాతజాతానలం బాశ్రితాభీష్టపాకావసరము
విషధిరాట్పర్యంకవిహరణస్థానంబు నిఖిలపుణ్యక్షేత్రముఖముకురము
నమదస్మదాదినానామర[1]న్నాథంబు వర్ణితాఖిలపుణ్యవైజనము
దైత్యభిన్నగరయాత్రాపరస్థానంబు [2]వాఙ్మనసామేయవైభవంబు
ఆ. [3]వంకువామదేవ వాల్మీకి వరతంతు,గర్గగాధిపుత్రగౌతమాత్రి
జహ్ను జామదగ్ని జాబాలి జైమిని,ప్రియకరంబు పౌండరీక మనఘ! 127

టీక. పౌండరీకము = పౌండరీకక్షేత్రము; పాతక...తానలంబు = పాపములగుంపునకు చెట్లనుండి తనంతటపుట్టిన యగ్ని - కారుచిచ్చు; ఆశ్రితాభీష్టపాకావసరము=ఆశ్రయించిన వారికోరికలకు పంటకాలము; విషధిరాట్పర్యంకవిహారణస్థానంబు = సముద్రతల్పుఁడగు విష్ణువునకు విహరించుచోటు; నిఖిల......ముకురము = సమస్తపుణ్యస్థలముల ముఖములకును - (వానిబాగోగులు చూచుటకుఁదగిన) అద్దము; నమత్......నాథంబు = నమస్కారముచేయుచున్న మావంటి దేవశ్రేష్ఠులు కలది; వర్ణితాఖిలపుణ్యవైజనము = కొనియాడఁబడిన సమస్తపుణ్యములను పుట్టించు (కలుగఁజేయు)నది; దైత్య... పరస్థానంబు = విష్ణునగరమునకు (వైకుంఠమునకు) పోవుయాత్రకు పరస్థావమైనది (మజిలీయైనది.) వాఙ్మనసామేయవైభవంబు = మాటలకు, మనస్సునకు అగోచరమగు వైభవము కలది; వంకు...... ప్రియకరంబు = వంకువు మొదలగు మునుల కందఱికిని ప్రీతిని కలిగించునది; అలం. రూపకము.

మహాస్రగ్ధర. కననీ గొడ్డ్రాలు బిడ్డన్ గగనకుసుమముల్ గల్గనీ రాయి మాటల్
విననీ ముక్తుండు వెండిన్ విపులఁ బొడమనీ వింటివా పాండురంగా
వనిఁ [4]బౌనఃపున్య జన్మవ్యవహృతిఁ గన నేవంక దుష్పంకశంకల్
వనరాశిం జొచ్చు నేర్లై వడి*సెడి యడఁగుఁన్ వారిజభ్రూణసూతీ! 128

టీక. గొడ్డ్రాలు = వంధ్య; వెండిన్ ('యు'లోపము) = వెండియును - మఱల; విపులన్ = భూమిపై; పొడమనీ = పుట్టనిమ్ము; పౌనఃపున్యజన్మవ్యవహృతిన్ = మరల మరలఁబుట్టుటచేత - అచట పునర్జన్మములను ఎత్తుటచేత; ఏవంకన్ = ఎవ్విధమునను; దుష్పంకశంకల్ = పాపములనెడి సందేహములు; కనవు = చూడవు - ఉండవు; అవి - వనరాశిన్ = సముద్రమును; చొచ్చు = ప్రవేశించు నట్టి; వడిసెడి = వడిచెడి - వేగముచెడి; ]'వడిసడి = వేగముచెడి' అని పూర్వటీక.] అడంగున్; వారిజభ్రూణసూతీ! = కమలగర్భుఁడగు బ్రహ్మయొక్క పుత్రుఁడవగు నారదుఁడా! 'కననీ, కల్గనీ' ఇత్యాదులందు ఇమ్మునకు ఈకారాదేశము.

తే. తీఁతిఁ గురుక్షేత్రముఖమహాక్షేత్రతలము
లందుఁ జేయ ననశ్వరం బగుచు నిగుడు
దురితతతిఁ గిట్టి నిజశక్తిఁ దునుము గాన,
మేటి యాక్షేత్ర మొక పరిపాటి గాదు. 129

టీక. కురుక్షేత్ర......లందున్ = కురుక్షేత్రము మొదలగు గొప్పక్షేత్రములందు; అనశ్వరంబు = స్థిరమైనది; నిగుడు = వ్యాపించునట్టి; దురితతతిన్ = పాపములగుంపును; కిట్టి = తాఁకి; తునుమున్ = సంహరించును; ఒక పరిపాటి = ఒక సాధారణమైనది.

---

1. చ. న్నాదంబు. 2. క. వాఙ్మాన. చ. వాఙ్మన. 3. క. లే. 4. చ. హీనపుణ్యాజన్యవ్యవహృతి. * క. సడి.

క. దాన స్నాననిధనవాః,పానాదులు [1]నెట్టియెట్టి ఫలములు పెఱచో
నౌ నవి సకలముఁ జేకుఱు, మానవులకు నందు నిమిషమాత్రమునందున్. 130

టీక. దాన.....దులన్ = దానము, స్నానము, మరణము, నీరుత్రాగుట మొదలగువానిని; ఎట్టియెట్టి ఫలములు = ఏయేరీతిఫలములు; పెఱచోన్ = తక్కిన చోట్లయందు.

శా. భర్మస్తేయము బ్రహ్మహత్యయు సురాపానం బగమ్యారహః
కర్మంబుల్ గృహదాహధేనువధవాక్పారుష్యముల్ మున్నుగా
దుర్మార్గుల్ పచరించుదుష్కృతతతుల్ దూలున్ [2]మృగేంద్రధ్వనిన్
మార్గోముల్ వడులేటిమూఁకలనఁ దన్నామంబు వాక్రుచ్చినన్. 131

టీక. భర్మస్తేయము = బంగారును దొంగిలించుట; బ్రహ్మహత్యయును = బ్రాహ్మణుని చంపుటయును; అగమ్యారహఃకర్మంబుల్ = పొందరాని స్త్రీలను సంగమించుటయును; గృహ.....ముల్ = ఇల్లుకాల్చుట, గోవధము, తిట్టుట; మున్నుగాన్ = మొదలైన; పచరించు = జరపు - చేయునట్టి; దుష్కృతతతుల్ = పాపపుంజములు; తన్నామంబు = పౌండరీకక్షేత్రము పేరు; వాక్రుచ్చినన్ = పలుకఁగా; మృగేంద్రధ్వనిన్ = సింహగర్జనచే; మార్గోముల్, వడు = వెనుకకుఁబాఱిపోవు; లేటిమూఁకలు, అనన్ = జింకలగుంపులో (గ) సునట్లు; తూలున్ = చెదరిపోవును - నశించును. అలం. ఉత్ప్రేక్ష.

సీ. ఉరసిజాదృతవీణ సరసిజాసనురాణి పూర్వ[4]కోటిగ మహాద్భుతచరిత్ర
గజవైరివాహ దుర్గాదేవి పశ్చిమ[5]కోటిగ లస్తకక్రోడసీమ
భువననాయకిగాఁగఁ బొగడొంది యోజనార్ధము విస్తృతియుఁ దదర్ధంబు నిడువు
గలిగిన తత్ క్షేత్రకార్ముకంబు ధరించి జగదేకధన్వి శ్రీశార్ఙ్గపాణి

తే. తీర్థశరములు దొడివి యుదీర్ణకలుష,విషమలక్ష్యపరంపరల్ విఱుఁగనేయుఁ
గాన [1]నదియ శరణ్యమై [2]వీను మిగులు,నైహికాముష్మికాకాంక్షులగు జనులకు.

టీక. మహాద్భుతచరిత్ర = మిక్కిలి యాశ్చర్యకరమగు చరిత్రకలదియు; ఉరసిజాదృతవీణ = స్తనములచే గౌరవింపఁబడిన - (స్తనముల కానించుకొన్న) వీణకలదియు (నగు); సరసిజాసనురాణి = బ్రహ్మభార్య - సరస్వతి; పూర్వకోటిగన్ = వింటియొక్క మొదటిచివఱగను; గజవైరివాహ=సింహము వాహనముగాఁ గలదైన; దుర్గాదేవి = పార్వతీదేవి; లస్తకక్రోడసీమన్ = వింటినడుమైన లోపలి ప్రదేశమునందు; భువననాయకిగాఁగన్ = లోకమునకు నాయకురాలుగా; యోజనార్ధము = నాలుగు మైళ్లు; విస్తృతియున్ = పొడవును; తదర్ధంబు = అందులో సగము; నిడుపున్ = వైశాల్యమును; క్షేత్రకార్ముకంబున్ = క్షేత్రమను వింటిని; జగదేకధన్వి = లోకములన్నింట సాటిలేని విలుకాఁడైన; శ్రీశార్ఙ్గపాణి = శ్రీవిష్ణువు; తీర్థశరములు = తీర్థ మను బాణములను; తొడివి = సంధించి; ['శరములు = జలములనెడి బాణములు' అని పూర్వటీక.] విషమలక్ష్యపరంపరల్ = మిక్కిలి అసాధ్యములైన లక్ష్యముల సమూహములను; విఱుఁగనేయన్ = పడఁగొట్టును; ఐహికాముష్మికాకాంక్షులు = ఈ లోకముసుఖములను, పరలోకసుఖములను గోరువారు; శరణ్యమై = దిక్కయి; వీనుమిగులున్ = ప్రసిద్ధికెక్కును. అలం. రూపకము.

1. క. జేయునెట్టి. చ. నెట్టియెట్టి. 2. చ. మృగాం. 4. చ. కోటియు. 5. ట. కోటిగా.
1. చ. యది. 2. క. దీను చ. వీను. శ. ర. వీను.

తే. ఆత్మనామవసచ్చతురక్షరముల, యందుఁ బురుషార్థములు నాల్గు నడఁగి పెనఁగి
తలలు ముదిరిన దురితదంతావళములఁ, బౌండరీకంబు హరిలీలఁ జెండివైచు. 133

టీక. ఆత్మనామవసచ్చతురక్షరములయందున్ = తన పేరునున్న నాల్గక్షరములందును; పురుషార్థములు = ధర్మార్థకామమోక్షములు; అడఁగి పెనఁగి = కలిసిమెలిసియుండి; తలలు ముదిరిన = బలిసిన తలలు కల - క్రొవ్వియున్న; దురితదంతావళములన్ = పాపములను ఏనుఁగులను; హరిలీలన్ = సింహమురీతిని; చెండివైచున్ = నఱికివైచును. అలం. రూపకము, ఉపమ

శా. ఆ క్షేత్రంబున నుండు నట్టనఘుఁ డా యక్షాక్షకేళీరతుం
డక్షోభ్యుం డజరుం డనాదినిధనుం [1]డక్షామరక్షామయుం
డీక్షామాత్రకృతాఖిలుండు నవశక్తీశుండు కృష్ణుండు ప్ర
త్యక్షుండై యనుదున్ మరున్ముని యుమాప్రాణేశుతో నిట్లనున్. 134

టీక. యక్షాక్షకేళీరతుండు = కుబేరాక్షమను నాట యాడుటయం దాసక్తికలవాఁడు; అక్షోభ్యుండు = కలఁచుటకు సాధ్యపడనివాఁడు; అజరుండు = ముదిమి లేనివాఁడు; అనాదినిధనుండు = పుట్టువు, చావు లేనివాఁడు; అక్షామరక్షామయుండు = తక్కువ కాని-కఱవులేని రక్షణస్వరూపుఁడు; ఈక్షామాత్రకృతాఖిలుండు = చూపుమాత్రముచేతనే సమస్తమును సృజించువాఁడు - చూపుచేతనే సమస్తలోకములను కలుగఁజేయువాఁడు; నవశక్తీశుండు = తొమ్మండుగురుశక్తులకును భర్త; [ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ప్రభుత్వశక్తి, ఉత్సాహశక్తి; మంత్రశక్తి; సత్త్వశక్తి, రజశ్శక్తి, తమశ్శక్తి అని శక్తులు తొమ్మిది.] మరున్ముని - దేవముని = నారదుఁడు.

క. అద్భుత మయ్యెడు నిఖిలజ, గద్భరితుఁడు యోగిహృదయగమ్యుం డచ్చో
నుద్భవ మొందుట కీ కథ, సద్భద్రా! నొడువు సుప్రసన్నత ననుడున్. 135

టీక. సద్భద్రా! మంచిమేలుకలవాఁడా! - శుభముల నొసఁగువాఁడా!

ఉ. ఆపురవైరి పల్కఁ గలహాశి కుశేశయపౌత్ర! విన్ముమున్
ద్వాపర ముజ్జగిల్లుతఱి దాంతుఁడు శాంతుఁడు హృద్విపక్షశి
క్షా[2]పటుశక్తి విష్ణుపదసంభృతభక్తియునై జనించె ని
ష్పాపుఁడు పుండరీకుఁడను బ్రాహ్మణుఁ డొక్కరుఁ డక్కజంబుగన్. 136

టీక. పురవైరి = త్రిపురసంహారి - శివుఁడు; కలహాశిన్ = జగడమే తిండిగా కల నారదుని గూర్చి; కుశేశయపౌత్ర! = పద్మమునకు మనుమఁడైనవాఁడా! [పద్మమునకు బ్రహ్మ పుత్త్రుఁడు - ఆ బ్రహ్మకు పుత్త్రుఁడు నారదుఁడు.] ఉజ్జగిల్లుతఱిన్ = తొలఁగునట్టి సమయమునందు - ముగియునప్పుడు; దాంతుఁడు = మనోనిగ్రహముకలవాఁడు; శాంతుఁడు = ఇంద్రియనిగ్రహము కలవాఁడు; హృద్విపక్షశిక్షాపటుశక్తి = హృదయములోని శత్రువులగు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను శిక్షించుట (అణఁచుట) యందు దృఢమైన శక్తికలవాఁడు; విష్ణుపదసంభృతభక్తియున్ = విష్ణువు పాదములందు పూర్ణమైన భక్తికలవాఁడును; అక్కజంబుగన్ = ఆశ్చర్యముగా.

సీ. పాతకంబులఁ [3]బంచబంగాళముగఁ జేయుఁ గనుఁగొన్నమాత్ర మోక్షంబు నొసఁగు
†ముస్నుణ్ణుపుష్కరంబునకు *నల్లణ్ణుపంపకు నిది యనఁదగుఁ [4]బ్రకటమహిమ
బిందుసరఃప్రతిబింబమై పర్వె స్వర్గద్వారమునకంటెఁ గరము మేటి
యగుఁ జంద్రభాగామహాపుష్కరిణితటంబునఁ జాతఖర్జూరపనసజంబు

1. చ. దక్షామయుం డవ్యయుం. 2. చ. పద. 3. క. పంచ. †శ. ర. ద్గు. ‡శ. ర. దుగు. 4. చ. ప్రౌఢ.

తే. కాంచనయుతంబు నృత్యచ్ఛిఖండికూజ, దిష్టపరిపుష్టగాయదళీంద్రజుష్ట
మలసకల్హారపవనవ్రాగ్రదళము, నైన యాశ్రమ మమరించి యందు నతఁడు.

టీక. పాతకంబులన్ = పాపములను; పంచబంగాళముగన్ = చీలికలయి పాఱునట్లు- చెల్లాచెదరగునట్లు - శూన్యముగా; ముమ్మణ్ణు = మూఁడంతలు; నల్మణ్ణు = నాలుగంతలు; బిందుసరః ప్రతిబింబమై = బిందుసరస్సునకు సమానమై; పర్వి = వ్యాపించి; చూత, ఖర్జూర, పనస, జంబు, కాంచనయుతంబు = మామిడి, ఖర్జూరము, పనస, నేరేడు, సంపంగులతో, కూడినది; నృత్యచ్ఛిఖండి = నాట్యముచేయుచున్న నెమళ్లుకలది; కూజదిష్టపరపుష్ట = కూయుచున్న ఇష్టమైన కోయిలలు కలది; గాయదళీంద్రజుష్టము = పాడుచున్న గండుతుమ్మెదలచే సేవింపఁబడినది; అలసకల్హారపవనవ్రాగ్రదళమున్ = మెల్లని సౌగంధికములమీఁది గాలిచేత వంగిన మీఁది యాఁకులుకలదియును; అమరించి = ఏర్పఱచి; అందున్; అతఁడు; ముందుపద్యమున నన్వయము. అలం. ఉదాత్తము.

సీ. ఏండుమనంబున ‡నుంచు నారాయణుండెటీఁగించెనో *నీట వఱలు నునికి
నొసలిలోపలిచక్కి నెసఁగు చంద్రుఁడు దిద్దెనో మింట ప్రేలెడు దీమసంబు
మూలాలవాలస్థలీ లేలిహానంబు గొలిపెనో పవనంబుఁ గ్రోలు నేర్పు
కమలంబు [1]లిరుమూఁడు కఱపెనో సూర్యావలోకనంబున కాత్మ లోఁగని ధృతి

తే. యనఁగఁ దత్తత్క్రియలయందు నలఁత లేక, భూరికైవల్యసామ్రాజ్యభోగకాంక్ష
బాఢనిష్ఠానురక్తిఁ దపంబొనర్చుఁ,గుదిసి ముల్లోకములును గగ్గోలుపడఁగ. 138

టీక. నీటన్, వఱలునునికిన్ = నీటిలో ఉండుపద్ధతిని; లోపలి చక్కిన్ = లోప్రదేశమునందు; ఎసఁగు చంద్రుడు = ఉండెడు చంద్రుఁడు; దిద్దెనో = నేర్పెనో; దీమసంబున్ = ఉపాయమును; [నొసలు చంద్రునివలెనున్నదనుట] మూలాలవాలస్థలీ, లేలిహానంబు=మూలముయొక్క పాదున నుండెడి పాము; గొలిపెనో = సరిపఱిచెనో - శోధించెనో; క్రోలు = పీల్చునట్టి; ఇరుమూఁడు = ఆఱు; [మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత - విశుద్ధ - అజ్ఞలు.] కఱపెన్ = బోధించెనో; సూర్యావలోకనంబునకున్ = సూర్యుని చూచుటకు: లోఁగని = తగ్గని; ధృతి = ధైర్యమును; అలఁత = అలయుట; భూరికైవల్యసామ్రాజ్యభోగకాంక్షన్ = గొప్పసామ్రాజ్యము ననుభవించు కోరికతో; బాఢనిష్ఠానురక్తిన్ = దృఢమైన నియమమునందలి యాసక్తితో; కుదిసి = అణఁగి; గగ్గోలుపడఁగన్ = కలఁతనొందఁగా; తపంబున్; ఒనర్చున్ = చేయును. అలం. ఉత్ప్రేక్ష.

తే. భక్తిసంయుక్తి యను పోఁతపాల నొయ్యఁ, జెట్టుకట్టుచు మునిశాఖి [2]నిట్టచూప
నిజమనోమార్గసంవసన్నీలవర్ణ, కైతవంబున [3]లోఁజేగ గలయనూరె. 139

టీక. పోఁతపాలన్ = పోసినపాలతో; ఒయ్యన్ = తిన్నగా; చెట్టుకట్టుచున్ = చెట్టుగా నేర్పడుచు - వృద్ధిపొందుచు; మునిశాఖి = మునియనెడి వృక్షము; నిట్టచూపన్ = నిక్కును చూపఁగా; నిజమనోమార్గ సంవసన్నీలవర్ణకైతవంబునన్ = తనమనోమార్గమున నివసించుచున్న విష్ణుదేవుడను మిష చేత; లోఁజేవగలయన్ = లోపలి, చేవ, (సారము) వ్యాపించఁగ; ఊరెను. = అధికమయ్యెను; అలం. రూపకము, అపహ్నుతి.

తే. పుండరీకాఖ్యుఁ డగుటనో పుండరీక,నేత్రభృంగంబు తనలోన నెలవుకొనఁగ
తీలిసురేంద్రుండు తప మిట్లుచేయుచున్న,కాలమున నేఁగె ధరవిష్ణుఁ గనుగొనంగ

‡శ. ర. లోనుండు. *శ. ర. యిట. 1. చ. లీముడు. 2. చ. నెట్టు. 3. చ. జేవ.

టీక. అగుటనో = అగుటచేతఁ గాఁబోలు; పుండరీకనేత్రభృంగంబు = తామరపూవులవంటి కన్నులు కల భగవంతుఁడనెడి తుమ్మెద; తనలోనన్; నెలవుకొనఁగన్ = తనహృదయమున నివసింపఁగా; క్షితిసురేంద్రుఁడు = బ్రాహ్మణుఁడు; ధర = భూమి (కర్తృపదము ) అలం. ఉత్ప్రేక్ష.

తే. డెందమునఁ [1]బుట్టు నలఁత ముకుందువలనఁ
దీర్ప నూహించి చను మహీదేవి కొసఁగెఁ
[2]గలశపాథోనిధానంబు కన్ను[3]గవల
తెలివి లలి[4]తంపు నమృతవర్తియునుబోలె. 141

టీక. మహీదేవికిన్ = భూదేవికి; డెందమునన్ = మనస్సునందు; అలఁతన్ = శ్రమను - ఆయాసమును; కలశపాథోనిధానంబు = పాలసముద్రము; లలితంపునమృతవర్తియునుబోలెన్ =అమృతమమరుగు (పోయిన దృష్టినిచ్చు) కాటుకవలె; కన్నుగవల తెలివిన్ = చూపును; ఒసఁగెన్ = ఇచ్చెను. అలం. ఉపమ.

సీ. నీరజోదరయోగనిద్రా[5]వరణసీమ చతురంబు సితసామజప్రభునకుఁ
[6]పానలుబ్ధాబ్ధప్రపాకల్పనము సూతికానికేతనము పుష్కరసదనకుఁ
కామధు[7]క్సందానసీమధ్యదేశంబు రసవతి దేవతావిసరమునకు
గోత్రభిల్లోకచకోరదృగ్గోత్రంబు మందురాస్థాన మమర్త్యహారికిఁ
తే. [8]గాయమానంబు బలిగృహాంగణవసుధకు, సకలవాహినులకు జనాంతికపదంబు
సారలోహాకరము భూధ్రవైరిబద్ధబుద్ధిఁ జొరఁ బొంచియున్న దంభోళి కబ్ధి. 142

టీక. అబ్ధి = సముద్రము - క్షీరాబ్ధి; నీరజోదరయోగనిద్రావరణసీమ = పద్మము గర్భమందుఁ గల విష్ణువుయోగనిద్ర నావరించు చోటు; - [విష్ణువు పరుండుచోటనుట]; సితసామజప్రభునకున్ = తెల్లనైనదైన ఐరావతమునకు; చతురంబు = గజశాల; [ఐరావతము పుట్టినచోటనుట.] పానలుబ్ధాబ్ధిప్రపాకల్పనము = దప్పిగొన్న మేఘములు చలివేంద్రమైనది; [మేఘములు సముద్రజలమును త్రాగుననుట.] పుష్కరసదనకున్ = పద్మాసన యగు లక్ష్మికి, సూతికానికేతనము = పురిటిల్లు - పుట్టుచోటు; [లక్ష్మి పాలసముద్రమునఁ బుట్టినదనుట.] కామధుక్సందానినీమధ్యదేశంబు = కామధేనువునకు గోశాలయందలి మధ్యభాగము; [కామధేనువు పుట్టుచోటనుట.] (ఇచట పూర్వటీకలో 'సందానసీ = దామెన త్రాటిదైన?' అనువ్రాత కలదు; అది తప్పు; సందానని యనఁగా గోవులశాల.) దేవతావిసరమునకున్ = దేవతలగుంపునకు; రసవతి = వంటయిల్లు; [దేవతలు అచటనే తమ కాహారమగు నమృతమును సంపాదించిరనుట.] [ఇచట పూర్వటీకలో 'రసవతి = రసముకలది' అని కలదు; అది తప్పు.] గోత్రభిల్లోకచకోరదృగ్గోత్రంబు = ఇంద్రలోకములోని స్త్రీలకు వంశము - జన్మస్థానము; [అప్సరసలలో నొక జాతి క్షీరోదధినుండి పుట్టినదనుట.] అమర్త్యహారికిన్ = దేవతల యశ్వమునకు - ఉచ్చైఃశ్రవమునకు; మందురాస్థానము =అశ్వశాల; [ఉచ్చైశ్శ్రవము పుట్టినచోటనుట.] బలిగృహాంగణవసుధకున్ =బలియింటి ముంగిటికి; కాయమానంబు=పందిరి. [సముద్రమును బ్రవేశించి పోయినఁ బాతాళము కనఁబడుననుట.] సకలవాహినులకున్ = నదులన్నింటికి; జనాంతికపదంబు = ఏకాంతభూమి-అంతఃపురము; [నదులన్నియు దీనికి భార్యలనుట.] [పూర్వటీకలో 'జనాంతికపదంబు=రచ్చపట్టు' అని కలదు.] భూధ్రవైరిబద్ధబుద్ధిన్ = కొండలశత్రువగు నింద్రునియెడ లగ్నమైన బుద్ధితో; చొరన్ =లోఁబ్రవేశించుటకు; పొంచియున్న=

1. చ. బట్టు. 2. క. కలశ. 3. చ. ట. గవకు. 4. చ. తంబు. 5. చ. పరక. ట. వరక. 6. చ. పాలనద్భార్థ. 7. ట. సంధాన. 8. క. కాయమానంబు.

నక్కియున్న; దంభోళికిన్ = వజ్రాయుధమునకు; సారలోహశరరము=బలమైన యినుపతలుపు. [వజ్రము తనలోఁ బ్రవేశింపఁబోఁగా నిది పోనీయదనుట.] అలం. రూపకము.

చ. అమితపిశాచభర్త త్రిపురాంతకుఁ [1]డొందిన రాజశేఖర
త్వముఁ బెనుగొల్లఁ డచ్యుతుఁడు బాలుచు శ్రీపతిభావమున్ మరు
త్కమనులు [2]కూటిపేద [3]లటుగాక సదా యమృతాన్నభోజులౌ
క్రమము సుధాబ్ధిపుణ్యమునఁ గల్గిన [4]వంచు నుతించు లోకముల్. 143

టీక. అమితపిశాచభర్త = సమస్తభూతములకును నాయకుఁడైన; త్రిపురాంతకుఁడు = శివుఁడు; ఒందిన = పొందిన; రాజశేఖరత్వమున్ = చంద్రచూడుఁడగుటయును; పెనుగొల్లఁడు = గొల్లపెద్దయైన; శ్రీపతిభావమున్ = లక్ష్మీవల్లభుఁడగుటయు; మరుత్కమనులు = దేవతలు, వాయుభుక్కులు; కూటిపేదలటుగాక = తిండికి లేక; సదా = ఎల్లపుడును; అమృతాన్నభోజులౌ, క్రమమున్ = అమృతమును భుజించురీతియును; సుధాబ్ధిపుణ్యమునన్ = పాలకడలి యుండుటఁబట్టియే; లోకముల్; నుతించున్. [పాలసముద్రమునఁ జంద్రుఁడు పుట్టఁబట్టియే అతనిని శివుఁడు శిరోభూషణముగా ధరించెను; లక్ష్మి కలుగఁబట్టియే విష్ణు నొక యింటివాఁ డయ్యెను; అమృతము పుట్టుటచేతనే దేవతలు కడుపునిండుగ నింత తిని బ్రతుకుచున్నారని భావము.]

ఉ. ధేనుగజాశ్వరత్నసుదతీప్రముఖాఖిలవస్తుకోటి వై
మానికభర్త ము న్గొనియు మచ్చరమారఁ బయోధిలోఁతు గై
కో నెస కొల్పెనో బలు[5]మొగుళ్ల విప్లుష్టకరీషపిండరే
ఖానిభవృత్తి న[6]త్తెఱఁగుగాకఁట నీరవి ద్రావనేటికిన్. 144

టీక. వైమానికభర్త = విమానములపైఁ దిరుగు దేవతలకు ప్రభువగు నింద్రుఁడు; ధేను......కోటిన్ = కామధేనువు, ఐరావతము, ఉచ్చైఃశ్రవము, చింతామణి, అప్సరసలు మొదలగు వస్తువుల సమూహమును; మున్ = మునుపు; కొనియున్ = గ్రహించియుం; మచ్చరమారన్ = పగ విజృంభింపఁగా; పయోధిలోఁతున్; కైకోన్ = గ్రహించుటకు; విప్లుష్టకరీషపిండరేఖానిభవృత్తిన్=మిక్కిలి కాల్పఁబడిన ఎండుపేడ పిడుకలవిధమున నున్న; బలుమొగుళ్లన్ = గొప్పమేఘములను; ఎసకొల్పెనో = ప్రేరేపించెనో, యేమో! అత్తెఱఁగుగాక = ఆ విధమేకానిచో; అవి = మేఘములు; అటన్ = ఆ సముద్రమున; నీరు; త్రావనేటికిన్ ? అలం. ఉత్ప్రేక్ష, ఉపమ.

శా. అంతర్మగ్నదిగంతదంతికటనిర్యద్దానధారాఝురా
క్రాంతంబుల్ నిజవేగభగ్నవపురుగ్రగ్రాహముల్ మేఘఘో
షాంతేవాసి విశంకటధ్వనులు నాగావాసగాహుల్ పయ
స్సంతానంబులు గ్రాలుఁ [7]బాలకడలిన్ జాగ్రత్ప్రచారంబులై. 145

టీక. అంతర్మగ్న......క్రాంతంబుల్ - అంతర్మగ్న = లోపలిభాగమున మున్గియున్న; దిగంతదంతి = దిగ్గజములయొక్క; కట = గండస్థలములనుండి; నిర్యత్ = కారుచున్న; దానధారాఝురాక్రాంతంబుల్ = మదజలప్రవాహములచే ఆక్రమింపఁబడినవి - వానిమదజలప్రవాహములతోఁ గూడినవి; ['ఝుర=సెలయేళ్లచేత' అని పూర్వటీక.] నిజ......గ్రాహముల్ = తనవేగముచేత పగిలినదేహములుగల తిమింగలములు కలవి; మేఘ......ధ్వనులు = ఉఱుములకు శిష్యప్రాయములైన గొప్పహోరుధ్వనులు కలవి; నాగావాసగాహుల్ = పాతాళమువఱకును వ్యాపించునవి; అగు; పయస్సంతానంబులు=

1. చ. నొందిన ప్రభా. 2. చ. ట. కూటిబీద. 3. చ. లట. 4. చ. వచ్చు. 5. చ. ట. మొగుల్గమి. 6. క. కల. చ. కట. 7. క. పాలకడలిన్.

జలముల గుంపులు; ['జలచరముల సమూహములు' అని పూర్వటీక.] జాగ్రత్ప్రచారంబులై = ఎక్కువ వ్యాప్తి కలవై; పాలకడలిన్ = పాలసముద్రమున; క్రాలున్ = ప్రకాశించును. అలం. ఉదాత్తము.

శా. మాణిక్యంబులు మున్నుగా నిగుడు భ్రామ్యద్భంగసత్వంబు ల
తిక్షీణశ్రీఁగెరలన్ జలద్విపకరచ్ఛిన్నప్రవాళద్రుమ
శ్రేణీగర్వము డిగ్గి యౌర్వదవసంకీర్ణంబులై కానన
శ్రేణుల్ వోలెఁ దలిర్చు నిచ్చలు సుధాకూపారపారస్థలుల్. 146

టీక. మున్నుగాన్ = మొదలుకొని - వానితోఁగూడ; నిగుడు = వ్యాపించునట్టి; భ్రామ్యద్భంగసత్వాంబులు = అలలయందుఁ దిరుగుచున్న జలచరములు; అతిక్షీణశ్రీన్ = ఎక్కువైన శోభతో; కెరలన్ = రేఁగఁగా; జల......గర్వము = నీటియేనుఁగుల తొండములచేఁ బెల్లగింపఁబడిన పగడపుఁ జెట్ల యాధ్యత్యము; డిగ్గి = జాతి - నశించి; ఔర్వదవసంకీర్ణంబులై = బడబాగ్నియను కాఱుచిచ్చుతోఁ గూడి; కాననశ్రేణుల్ వోలెన్ = అడవికుత్తులవలె; సుధాకూపారపారస్థలుల్ = పాలసముద్రపు టొడ్డు; నిచ్చలున్ = ఎల్లపుడును; తలిర్చున్ = ప్రకాశించును.

[అడవి అంటుకొనినప్పుడు జంతువులు దారితెలియక తిరుగుచుండును; చిచ్చు వ్యాపించును. ఆ రీతినే పాలసంద్రపుటొడ్డు అలలలోఁ దిరుగుచున్న జలచరములతోఁగూడి, నీటియేనుఁగులు పెల్లగించి విసరిన పగడపు (ఎఱ్ఱని) మ్రాఁకులతో నిండియున్నవని భావము; కార్చిచ్చువలె నిచటి బడబాగ్నియుఁ గలదు.] అలం. ఉపమ.

క. తరుణప్రవాళశోణో,దరతలమై శంఖచక్రధరమై వరపు
ష్కరపుష్కలమై హరికర,సరసీరుహ మనఁగఁ గలశజలనిధి చెలఁగున్. 147

టీక. ఈపద్యమున పాలసముద్రము విష్ణునిచేతితోఁ బోల్పఁబడుచున్నది. విష్ణుపక్షమున - తరుణ......తలమై = లేఁతపగడమువలె ఎఱ్ఱనైన లోపలిభాగము (అఱచేయి) కలదై; శంఖచక్రధరమై; వరపుష్కరపుష్కలమై = శ్రేష్ఠమగు తామరపూవువలె చక్కనిదై; చెలఁగున్; కలశజలనిధి పక్షమున - తరుణ......తలమై = లేఁతపగడములచేత ఎఱ్ఱని గర్భప్రదేశముకలదై; శంఖచక్రధరమై= శంఖములు, సుడిగుండములు కలదై; వర......పుష్కలమై = ఉత్తమజలముచేత నిండినదై; [పూర్వటీకలో నిటఁ గొన్నిపదములకు మాత్రమర్థము ఈయఁబడినది; అదియును పాలసముద్రపక్షమునసే.]

తే. నూత్నవీచుల సముపోఢరత్న పుష్ప, నికరనిబిరీస మగునీరు నించి తెచ్చి
యబ్ధి [1]వేలాసమాభ్యాగతాతురాచ, లార్థులకు నర్థిఁ బాదార్ఘ్య మాచరించు.

టీక. అబ్ధి = సముద్రము; నూత్నవీచులన్ = క్రొత్తయలలచే ['అలలయందు' అని పూర్వటీక.] సముపోఢ......నిబిరీసము = మీఁదికి లేవనెత్తిన రత్నములనెడి పుష్పములతో నిండినది; ['సముపోఢ = మంచి పండుఁపోఁకవఁటి' అని పూర్వటీక.] వేలా......అర్థులకున్=ఒడ్డునకు వచ్చిన ఆతురులగు (శ్రమపడిన) కొండ లను అతిథులకు; అర్థిన్ = ప్రీతితో: పాదార్ఘ్యము = పాదపూజనమును; ఆచరించున్ = చేయును. [ఇచట అలలు చేతులు; రత్నములు పూవులు; కొండలు అతిథులు.] అలం. రూపకము.

తే. వార్ధి నావర్తగర్తప్రవర్తు లగుచు,నుదరరత్నాంశువులు గ్రమ్ము త్రిదశు లమర
తరులు నటుకంగఁ దన్మూలతలములమృత,సేకమున వెండి[2]చిగిరించు [3]చిగురు లనఁగ.

టీక. వార్ధిన్ = సముద్రమునందు; ఉదరరత్నాంశువులు = లోపలనున్న రత్నముల కాంతులు [కర్తృపదము.] ఆవర్తగర్తప్రవర్తులు, అగుచున్ = సుడులను గోతులయందు తిరుగుచు; ['ఆవర్త

1. చ. రేలా. 2. చ. నిగురించు. 3. చ. చినుకు.

గర్త = సుళ్లునెడి చోక్కులయందు' అని పూర్వటీక.] త్రిదశులు = దేవతలు; అమరతరులు = కల్పవృక్షములను; నఱకంగన్; తస్మూలతలములు = ఆచెట్లమొదళ్ళు; అమృతసేకమునన్ = అమృతముతో తడుపుటచేత; వెండి = మఱల; చిగురులనఁగన్ = చిగుళ్లోయనునట్లు; క్రమ్మున్ = వ్యాపించును.

[పూర్వము దేవతలు పారిజాతవృక్షములను నఱికి తీసికొనిపోఁగా మొదళ్లుమాత్రము గోతులలో నుండినవి; వానిపై అమృతము చిలుకరింపఁబడుటచే నవి చిగిర్చినట్లు సముద్రములోని రత్నముల కాంతులు కన్పించుచున్నవి. అని భావము] అలం. ఉత్ప్రేక్ష.

వ. ఇట్లగణితగుణాభిరామంబగు నద్ధామంబు సంగ్రామాభీరుండగు శూరుం డునుంబోలెఁ బెనువాలుఁగంటలం గనుపట్టి [1]కుశలభటవిముక్తంబగు విశిఖంబునుంబోలె నెల్లకందువలనుమీఱి, [2]పాటలస్ఫురితంబగు జరఠవిలోచనంబునుం బోలె [3]సిరుపాపలం బొడువుట కలిగి, పేదవడిన పుడమివేలుపుంబోలె బలియింటి వాకిట నడంగి, వీరభద్రగదావిదారితంబగు పూషాస్యవదనగహ్వరంబునుం బోలెఁ బలువరస బిగిదెరల నొరలి, మతంగకులకన్యక[4]యుంబోలె బలుకందగు సలుకడ దాల్చి, విభావరీవిరామసమయంబునుంబోలె [5]వెల్లదీవియల మించుటకు గఱియై, మఱియు నొక్కొక్కచోటఁ గుముదోదరవిశదంబులు, నొక్కొక్క గొడ నీలోత్పలమాలికామేచకంబులు, నొక్కొక్కకడ శుక[6]చంచూపుట పాటలంబులు, నొక్కొక్కచక్కి [7]శుక్తి[8]శబలోదరంబులు, వరుణోపలపట్టంబులం బొట్టు వెంచుచు నిట్టలంబుగ మిట్టించు వేలానిలసముద్ధూత నూతనశీకరనికరంబులవలన నలినభవాండంబునకుఁ గర్పూరకరండభావంబు నుత్పాదించుచు నుత్తాలకాల[9]స్కంధపలాశకులాసితద్యుతికూలంకషంబులగు బాలశైవాలవల్లీమతల్లికల నల్లిబిల్లిగొను నుల్లోలప్రవాళశాఖాశిఖలవలన నుదవాసక్లేశంబున [10]నుద్దుకుడిచి వెలుప*టికిం బుటమెగయుచు, నుద్దామధూమధోరణీవ్యాజంబునం దలలు[11]వీడ [12]నీడాడం బొడసూపు నిబిడబడబానలకీలాకలాపంబులశంక నంకురితంబుసేయుచు, సలిలకరటి చటులతరరదనశిఖర [13]విఘట్టితగర్భగిరిగైరికసంక్రమణారుణంబులగు మృదుసముదితతరంగకిశోరంబులచేతఁ [14]బిహితావకాశంబై, లక్ష్మీనారాయణశరీరారూఢవిస్మృమరఘుసృణరజోరంజితంబును, [15]దదీయవిలుంఠనావిర్భూత [16]పీడాపీడనంబు నగు తలిమంబువిలసనంబు వశీకరించుచు, సాత్త్వికక్రియ విధుఃజృంభణముదితంబుఁ [17]బంటకారుపఁగిదిం బ్రసన్న[18]శరంబును, సత్యలోకంబు నాకృతిం గమల[19]భూయిష్ఠంబును, విలాసినీకరంబుకరణి వివిధమణికిరణపుంజరంజితోర్మికంబును, [20]బరబ్రహ్మంబు విధంబున నహార్యపదంబునై యొదవు నాఱవకడలి పుడమిముద్దియకుఁ దద్దయుఁ బ్రియంబు పుట్టించె నిత్తెఱంగున. 150

1. చ. లో శ లేదు. 2. క. పాటలస్ఫురికంబై. చ. ఫలస్ఫుటితంబై. 3. చ. నిరు. 4. చ. ట. లో క లేదు. 5. చ. తెల్లదీవియర. ట. దివియల. 6. చ. చంచు. 7. క. ముక్తాశుక్తి. చ. శుక్తి. 8. క. శబరో. చ. శబలో. 9. చ. కంద. 10. చ. నుండు. * టికిం. శ. ర. 11. చ. విడ. 12. చ. నిడాడం. 13. చ. విఘటిత. 14. క. పిహితా. చ. బిహితా. 15. క. తదీయ. 16. క. ప్రీడా. చ. ట. పీడా. 17 క. పంట. 18. క. శరీరంబు. చ. ట. శరంబు. 19. చ. ట. గమత. 20. క. పర.

టీక. అగణిత......రామంబు = లెక్కలేని గుణములచే మనోహరమైనది; మీనధామంబు = సముద్రము; సంగ్రామాభీరుండగు = యుద్ధమున వెఱదివియని; వెఱవాలుగంటులం గనుపట్టి = (శూర పక్షమున) పెద్దకత్తులవలని గాయంబులచేఁజూపట్టి; (సముద్రపక్షమున) పెద్దలైన వాలుగలను చేఁపల సంబంధముచేఁ జూపట్టి; కుశల......ముక్తంబగు = నేర్పరి యగు భటునిచే విడువఁబడిన; విశిఖంబునుం బోలెన్ = బాణముపగిది; ఎల్ల, కందువలను = (బాణపక్షమున) అన్ని జాడలను-గుఱులను, (సముద్ర పక్షమున) అన్నిచోట్లను; మీఱి = దాటి; [కందువలను = జాడలచేతను, సంకేతస్థలములచేతను' అని పూర్వటీక.] పాటల......బై = లేఁతయెఱ్ఱకాంతి గలిగినదై; (సముద్రపక్షమున) ఎఱ్ఱచేఁపలుగలదై; జరఠవిలోచనంబునుంబోలెన్ = ముసలివానికంటివలె; నీరుపాపలంబొదువుట గలిగి = (కంటిపక్షమున) నీరు, కంటిపాపలపయి వ్యాపించుట గలిగి, (సముద్రపక్షమున) నీటిబిడ్డలను పెంచుటకల్గి; ['పాటల స్ఫురితంబు = పండఁబాఱుటను తోఁపించునది' అని పూర్వటీక.] పుడమివేలుపుంబోలెన్ = బ్రాహ్మణుని రీతిని; బలియింటివాకిట నడంగి = (బ్రాహ్మణపక్షమున) అధికారము కలవాని యింటిముంగిట నిలిచి, (సముద్రపక్షమున) బలిచక్రవర్తియింటి (పాతాళపు) వాకిట నుండి; వీరభద్ర......బగు = వీరభద్రుని (చేతిలోని) గదచే చీల్చఁబడిన; పూషార్కు......బోలెన్ = పూషార్కుని గుహవంటినోటిరీతిని; పలువరుస బిగిచెఱల నొరలి = (పూషార్కుపక్షమున) పండ్లవరుస బిగువువదలఁగా, (సముద్రపక్షమున) అనేకములగు వరుసల బిగువుతోడి కెరటములతో ధ్వనించి; మతంగకులకన్యకంబోలెన్ = మాలపడుచు రీతిని; పలుకందగు నిలుకడఁబొల్చి = (పడుచుపక్షమున) నిందింపఁదగు నిలుకడను బొంది, (సముద్ర పక్షమున) చెప్పఁదగిన (కొనియాడఁదగిన) నిలుకడఁబొంది; విభావరీవిరామసమయంబునుం బోలెన్ = తెల్లవాఱుజాముపగిదిని; వెల్లదీవియలన్, మించుటకున్, గుఱియై=(కాలపక్షమున) తెల్లఁబాఱిన దీపములచే అతిశయించుటకు లక్ష్యమయి, (సముద్రపక్షమున) శ్వేతద్వీపములచే మించుటకు లక్ష్యమై; ['శ్వేతద్వీపమును ఆక్రమింపఁజేయుటకు' అని పూర్వటీక.] కుముదో......లును = తెల్లగలువలోపలి భాగమువలె మిక్కిలి తెల్లనివియు; నీలోత్పల......లును = నల్లకలువలగుంపువలె నల్లనివియును; శుక......లును = చిలుకముక్కువలె లేఁతయెఱుపురంగు కలవియు; ఒక్కొక్కచక్కిన్ = ఒక్కొక్క చోట; ముక్తా......బులు = మంచిముత్యములవలె చిత్రవర్ణములుగల లోపలిభాగములు కలవియు; ['శబరోదరంబులు=చేఁపకడుపులు, నీటి లోపలిభాగములు' అని పూర్వటీక.] [ఈపైవన్నియును ముందు రాఁబోవు తరంగకిశోరముల విశేషణములు] అరుణోపలపట్టంబులన్ = కెంపులపలకలపయి; పొట్ట పెంచుచున్ = దేహమును పెంచుచు; ఇట్టలంబుగన్ = అధికముగా; మిట్టించు = పైకెగయు; వేలా......వలనన్ = ఒడ్డునందలి గాలినుండిపుట్టిన క్రొత్తతుంపురులవలన; నలినభవాండంబునకున్ = బ్రహ్మాండమునకు; కర్పూరకరండభావంబున్ = కర్పూరపుబరిణెయగుటకును; ఉత్పాదించుచున్ = కలిగించుచు; [అలలుఎఱ్ఱని కెంపుపలకకుఁదగిలి మీఁదికి లేవఁగా, ఒడ్డునుండి వీచినగాలి ఆ యలలపై వ్యాపించి నీటితుంపరల నెగఁజిమ్మఁగా, ఆ తుంపరలు కర్పూరమువలెను, కెంపుపలక భరణివలెను. ఉన్నదని భావము.] ఉత్తాల......షంబులగు = పొడవైన చీఁకటిమ్రాని యాకుల నల్లనికాంతిచే ఒడ్డు నొరయుచున్నవై; బాల......మతల్లికనన్ = ప్రశస్తమైన లేఁతనాచుతీగలతో; అల్లిబిల్లిగొను = పెనఁగొను; ఉల్లోలప్రవాళశాఖాశిఖలవలనన్ = మిక్కిలి ఎక్కువగాఁ దిరుగుచున్న పగడపుఁదీగల కొనలవలన; ['ఉల్లోల = పెద్దయలలలోని' అని పూర్వటీక.] ఉదవాసక్లేశంబునన్=నీళ్లయందే నివసించుట వలని శ్రమచేత; ఉడ్డుకుడిచి = ఊపిరి త్రిప్పలేక - తికమకలాడి; పుటమెగయుచున్ = దాఁటుచు; ఉద్దామ......వ్యాజంబునన్ = పెద్దపొగవరుసయను మిషచే; ఈడాడన్ = ఇక్కడక్కడ; పొడ చూపు = కన్పించు; నిబిడ......శంకన్ = దట్టమైన బడబాగ్నిజ్వాలలగుంపను సందేహమును; అంకురితంబు, సేయుచున్ = కలిగించుచు; ['అంకురితము = మొలచినది' అని పూర్వటీక.] [నల్లనిపాఁచి తీగలు ఎఱ్ఱని పగడపుమ్రానికొమ్మలకుఁ జుట్టుకొనఁగా, ఆకొమ్మలు మిక్కిలి యెక్కువగాఁ గదలాడు

చున్నవి; అట్లుండుట - నీటిలో నివసింపలేక బడబాగ్ని బయటికిరాఁ బ్రయత్నించుచున్నట్లున్నది. పాఁచి తీఁగలు పొగలవలెను, ప్రవాళశాఖలు అగ్నిజ్వాలలవలెను ఉన్నవని భావము.] సలిల......అరుణంబులు, అగు, సలిలకరటి = నీటియేనుఁగులయొక్క; చటులతర మిక్కిలివాఁడియైన; రదనశిఖర = దంతముల కొనలచే; విఘట్టితగర్భ = భేదింపఁబడిన లోపలిభాగములు గల; గిరి = కొండలయందలి; గైరిక = జేగురు మట్టియొక్క; సంక్రమణ=అంటుకొనుటచే; అరుణంబులు, అగు = ఎఱ్ఱవైన; తరంగకిశోరంబులచేతన్ = పిల్లయలలచేత; పిహితావకాశంబై = కప్పఁబడిన యెడము కలదై - అంతటను వ్యాపించినదయి; లక్ష్మీ ......రంజితంబును = లక్ష్మీనారాయణుల శరీరములందు పూయఁబడిన దట్టమగు కుంకుమపువ్వాడిచే ఎఱ్ఱనైనదియును; తదీయ......పీడనంబు నగు = వారి పొరలికవలనఁ బుట్టిన బాధయే అలంకారముగ గలిగినది యగు; తలిమతలంబువిలసనంబున్ = పడకయొక్క ప్రకాశమును; వశీకరించుచున్ = వశపఱచుచు - తాను పడకగా నేర్పడుచు; [పాలసముద్రము విష్ణుని పాన్పనుట] సాత్త్వికుక్రియన్ = సత్త్వగుణముకలవానివలె; విధువిజృంభణముదితంబును = (సాత్త్వికపక్షమున) విష్ణుని విజృంభణము వలన సంతోషించినది, (సముద్రపక్షమున) చంద్రోదయమువలన సంతసించినది; పంటకారుపగిదిన్ = శరత్కాలమువలె; ప్రసన్నశరంబును = (కాలపక్షమున) వికసించినరెల్లుకలది, (స. పక్షమున) నిర్మల మగు జలముకది; ['ప్రసన్నశరీరము = తేటపాఱిన దేహముకలది' అని పూర్వటీక.] సత్యలోకంబు నాకృతిన్ = సత్యలోకమువలె; కమలభూయిష్టంబును = (సత్యలోకపక్షమున) బ్రహ్మకు ఇష్టమయినది. (సముద్రపక్షమున)ఎక్కువనీరు కలది; [''కమలములచేత అతిశయించినది''అని పూర్వటీక.]విలాసినీకరంబు కరణిన్=విలాసముగల స్త్రీచేతివలె; వివిధ...కంబును = (కరపక్షమున) వివిధములగు మణులకాంతిసమూహముచే ప్రకాశించు ముద్రికలుకలది, (సముద్రపక్షమున) వివిధములగు రత్నముల కాంతిసమూహమున రంజించు అలలుకలది; పరబ్రహ్మంబువిధంబునన్ = పరమాత్మవలె; అహార్యపదంబునై = (బ్రహ్మపక్షమున) చలింపనిస్థితి కలది, (సముద్రపక్షమున) కొండలకు స్థానమైనదియునయి ఒదవు=కలుగు-ఉండు; ఆఱవ కడలి = లవణేక్షుసురాసర్పిర్దధిక్షీరజలార్ణవములలో ఆఱవదగు పాలసంద్రము; పుడమిముద్దియకున్ = భూదేవికి; తద్దయున్ = మిక్కిలి.

ఉ. ఎన్నఁగ నింత రత్నచయ మింత గభీరిమ యింత దానసం
పన్నత యింతశుద్ధి యని బ్రహ్మయుఁ నోరు మెదల్పలేని య
త్యున్నతిఁ గన్న పెన్కడలి నుత్థితమై వెలిదీవి చెన్నగున్
వెన్నెలయేటిలోనఁ బ్రభవించిన కప్రపుఁగొండకైవడిన్. 151

టీక. రత్నచయము = రత్నములగుంపు; గభీరిమ = లోఁతు; దానసంపన్నత = వదాన్యత - త్యాగము; నోరు, మెదల్పలేని = వర్ణింపఁజాలని; అభ్యున్నతిన్ = గొప్పతనమును; పెన్కడలిన్ = పెద్దదైన - పాలసముద్రమున; ఉత్థితమై = లేచినదై - పుట్టినదై; వెలిదీవి=శ్వేతద్వీపము; చెన్నగున్ = ప్రకాశించును. అలం. ఉదాత్తము, ఉపమ.

శా. భూతాతంక మపేతపంకము బుధస్తుత్యంబు నిత్యంబు వి
ఖ్యాతం బాతపశీతవాతసహసాంద్రానందయోగీంద్రసం
కేతం బాతతభూతి భూతిలకలక్ష్మీకారి[1]తోరంబునై
శ్వేతద్వీపము దీపితంబగు జగత్సేవ్యైకభవ్యోన్నతిన్. 152

టీక. భూతాతంకము = పోయిన భయముకలది; అపేతపంకము = పోయిన పాపములుకలది; ఆతత......సంకేతంబు = ఎక్కువయైన చలిని, గాలిని సహింపఁజేసి, ఎల్లపుడును ఆనందముకల్గిన యోగీంద్రులు చేరఁదగిన చోటు; ['సంకేతము = గుఱుతుకలది' అని పూర్వటీక.] ఆతతభూతి=ఎక్కువ

1. చ. కోరంబు.

సంపదకలది; భూతిలకలక్ష్మీకారి=భూమికి తిలకముయొక్క సంపదను కూర్చునది - భూమి యను పడఁతికి తిలకమైనది; తోరంబు = గొప్పది; జగత్సేవైకవిభవోన్నతిన్ = లోకముచే సేవింపఁదగిన మిక్కిలి గొప్పగౌరవముతో; శ్వేతద్వీపము, దీపితంబగున్ = ప్రకాశించును. అలం. పరికరము, రూపకము.

ఆ. పణఁకుగుబ్బలికిని వైడూర్యశృంగంబు, మొలచినట్లు మిన్ను మోచియున్న
తెల్లదీవియందు దీపించు వైకుంఠ,పురము కనకవప్రపరివృతంబు. 153

టీక. పణఁకుగుబ్బలికిని = హిమాలయమునకు; మిన్ను మోచియున్న = ఆకాశమునంటియున్న; తెల్లదీవియందున్ = శ్వేతద్వీపమున; కనకవప్రపరివృతంబు = బంగరుప్రాకారముతోఁగూడినదైన.

తెల్లని మంచుకొండపయి పచ్చనివైడూర్యశిఖరమున్నట్లు, తెల్లని శ్వేతద్వీపముపయిఁ బచ్చని బంగారుకోటగోడలుకల వైకుంఠనగర మున్నదని యర్థము. అలం. ఉపమ.

ఉ. సారసువర్ణనీరమయసాలవిశాలము నీలవర్ణసం
చారచమత్క్రియాచరణశాలియునై పురి చెన్నగున్ మహా
మేరువుకౌఁగిటం బొలుపుమీఱి మహోత్కటకూటసంచర
ద్వారణరాజమై సొబగు దాల్చిన రోహణశైలమో యనన్. 154

టీక. సార...విశాలము=చక్కని బంగారు నీటిపూఁతగల ప్రాకారముచేత విశాలమైనది; నీలవర్ణ ...శాలియునై=విష్ణుదేవునియొక్క సంచారముచే చమత్కారముకలుగునదియునైన; పురి=వైకుంఠము; పొలుపుమీఱి = చక్కదనముమీఱి; మహోత్కట......రాజమై = మిక్కిలిఎత్తయిన శిఖరములపయిఁ సంచరించు గొప్పయేనుఁగుగలదై; సొబగుదాల్చిన = అందగించిన; రోహణశైలమో యనన్=రోహణాద్రియో అనునట్లు చెన్నగున్ = ప్రకాశించును. [ఇచట సాలము మేరువువలెను, పురము రోహణము వలెను, విష్ణువు గజమువలెను ఉన్నట్లు వర్ణింపఁబడినది.] అలం. ఉత్ప్రేక్ష.

సీ. త్రైవిక్రమాంఘ్రి మున్ [1]దవిలి వీడిన పద్మజాండఖండములీల నలరుఁ గోట
పలుమాఱు కమఠాధిపతి పూని డించు మందరములభాతి సౌధములు వెలయు
నిజవిహారార్థంబు నృహరియై హరిచేయు వసతులో యనఁ గేళివనము లెసఁగు
శాంబరీమత్స్యసంచారోచితాపరశరధులక్రియఁ [2]బద్మసరసు లమరు
తే. నఖిలభువనాంతరాళపురాధిదేవ,తావితానంబు తత్సేవకై [3]చరించు
సరణిఁ జూపట్టుదురు శరత్సమయపూర్ణ,రాజవదనలు వైకుంఠరాజధాని. 155

టీక. వైకుంఠరాజధానిన్ = వైకుంఠనగరమునందు; కోట; మున్ = పూర్వము; త్రైవిక్రమాంఘ్రిన్ = త్రివిక్రమస్వామియగు విష్ణునియొక్క పాదమును; వీడిన=జారిపడిన; పద్మజాండఖండము లీలన్ = బ్రహ్మాండగోళపుతునకవలె; అలరున్ = ప్రకాశించును పలుమాఱు = పెక్కుసార్లు - అనేక యుగాంతరములయందు; కమఠాధిపతి = ఆదికూర్మము; పూని = ప్రయత్నించి; డించు = తనపైనుండి దించునట్టి; మందరములభాతిన్ = మందరపర్వతములరీతిని; సౌధములు = మేడలు; వెలయున్. నృహరియై = నరసింహుఁడై; హరి = విష్ణువు; నిజవిహారార్థంబు = తాను విలాసముగ సంచరించుట కొఱకు; చేయు వసతులో = చేయునట్టి నివాసములో యనురీతిని; కేళివనములు = ఉద్యానములు; శాంబరీ.....క్రియన్ = మాయామత్స్యమగు మత్స్యావతారవిష్ణుని సంచారమునకుఁ దగిన వేఱు సముద్రములరీతిని; పద్మసరసులు = పద్మతటాకములు; ఎసఁగున్ = ప్రకాశించును. అఖి.....వితానంబు = సమస్తలోకములలోని పురములలోని అధిదేవతలగుంపులు; తత్సేవకై = విష్ణుని సేవించుటకు;

1. క. తవిలి. 2. క. పద్మ. 3. ట. వసించు.

చరించుసరణిక్ = తిరుగుచుండునట్లు; శరత్......వదనలు = శరత్కాలపు [1]సంపూర్ణచంద్రులవంటి ముఖములు కల స్త్రీలు; చూపట్టుదురు. అలం. ఉదాత్తము, ఉపమ, ఉత్ప్రేక్ష.

సీ. జలధివీచీవాత్యఁ జలిదాఁకెఁగా యని యక్కున నందంద యలమి యలమి
ప్రామఱ్ఱియా కొత్తిరాయిడెఁబొందెఁగా యని సన్నపొత్తుల నునిచి యునిచి
వాపోయి వాపోయి వసివాడి యాఁకటఁ బెగడెఁగా యని యుగ్గు వెట్టి పెట్టి
పెనుఁజీఁకటులు గ్రమ్ము పెక్బైట వసి యుంచి వెఱచెఁగా యని పుల్ల విఱిచి విఱిచి

తే. మంచిలక్షణముల పుట్టుమచ్చవాఁడు
నేత్రములు విప్పనట్టి యీ*నెత్రుగందు
[1]వరద నేతెంచె నెవ్వారివాఁడొ యనుచు
విలయహరిఁ దెచ్చి పెనుతు రవ్వీటిసతులు. 156

టీక. అవ్వీటిసతులు = ఆ పట్టణము (వైకుంఠము)లోని స్త్రీలు; మంచి...వాఁడు = శుభలక్షణములతోఁగూడిన (శ్రీవత్సమను) పుట్టుమచ్చ కలవాఁడు; నేత్రములు విప్పనట్టి = కన్నులయినను తెరవనట్టి; ఈ నెత్రుగందు=ఈ పుట్టుగుడ్డు; వరదక్ = వరదలో - ప్రవాహమునఁగొట్టుకొని; ఎవ్వారివాఁడొ !=పాప, యెవ్వరిపిల్లవాఁడో!; అని; విలయహరిక్ = ప్రళయకాలమందలి విష్ణువును; తెచ్చి; జలధివీచీవాత్యక్ = సముద్రపుకెరటములమీఁది చలిగాలిచే; చలిదాఁకెఁగా యని; అక్కునక్ = ఱొమ్మునక్; అందంద = మఱిమఱి; అలమియలమి=అదిమియదిమి; (ఆ వెచ్చదనముచేఁ జలి పోవునని భావము) ప్రామఱ్ఱియాకు, ఒత్తి = ప్రాఁతదైన (శయ్య యగు) వటపత్రము మృదుదేహమున కొత్తుకొని; రాయిడిఁబొందెఁగా, యని = ఒరసికొనిపోయెనని; సన్నపొత్తులక్ = మెత్తని పొత్తిగుడ్డలపయి; ఉనిచియునిచి=ఉంచియుంచి; వాపోయి వాపోయి = మిక్కిలిఏడ్చి; వసివాఁడి=మిక్కిలి యలసిపోయి; ఆఁకట బెగడెఁగా, యని=ఆఁకలిచే బెంగటిల్లెనని; ఉగ్గు = బిడ్డలకుఁబోయు చనుబాలుకలిసిన ఆముదము, నేయి మొదలగునది; పెనుఁజీఁకటులు గ్రమ్ము = గాఢాంధకారములు వ్యాపించు; పెక్బైటక్ = బట్టబయట; వెఱచెఁగా యని = జడుసుకొనెనని; పుల్లవిరిచి, విరిచి = దృష్టితీసి, తీసి; పెనుతురు = పెంచుదురు. ప్రళయకాలమునందును వైకుంఠనగరమున కెట్టి యిక్కట్టును లేదనియు, నందలి జనులు అపుడును సుఖముగ నుందురనియు భావము. అలం. స్వభావోక్తి, ఉదాత్తము.

వ. మఱియు నప్పురంబు పలుదెరలు తిరిగివచ్చుట నాఖేటస్థలంబును, నర్తనప్రదేశంబునుం[2]బోలె; లెస్స వారిం గలిగి గజగ్రహణసంవిధానంబును, సుజనునింబోలెఁ; బెక్కుపట్టులఁ గనుపట్టి కురువిందమందిరంబును, కశ్యపమునీశ్వరునింబోలె; హరికి గిరిగుహాయును; మాధవునకు నుపవనవిశేషంబును; [3]జక్రికి శ్రీఖండతరుకోటరంబునై యడరం బుడమినిడువాలుగంటి తడవు మెచ్చుచుం జొచ్చి వియచ్చరసంబాధబంధురంబు నిసర్గశృంగారతరంగితంబు నగు రాజమార్గంబునం జని చని ముందట నేత్రసన్నిహితజగత్త్రయంబునుంబోలె బహువిధజనాకీర్ణంబై యుదీర్ణవైభవంబున పర్ణింపఁదగి బృందారకద్విరదంబుచందంబున వలభిదారూఢోపరిభాగంబును; జాంగలక్షేత్రంబువైచిత్రి యవనికామహితంబును; నాటకసంస్థానంబునకైవడి శుద్ధమిశ్రవిష్కంభసంభృతంబును; దధీచిశరీరంబుకరణి సురభిగో[4]ము

* నెత్రుకందు. శ. ర. 1. క. వఱల. చ. ట. వరద. 2. చ. బోలి. 3. క. చక్రికి. చ. ఇది మొదలు 'రాజమార్గంబునం' వఱకు లేదు. 4. చ. ముస్తాబ.

ఖావిద్ధంబునై యొప్పు [1]గూఢపాత్తల్పుదివ్యభవనంబు దఱిసి విరసజనహృదయం
బులం దగులుకొడని[2]బ్రహ్మవిద్యయుంబోలె నరజిహ్వాప్రకారంబున సప్తకక్ష్యాంత
రంబు లతిక్రమించి ముందట. 157

టీక. (౧) పలుదెరలు, తిరిగివచ్చుటక్ = పెక్కుఅడ్డములుదాఁటి వచ్చుటచే; ఆఖేటస్థలంబును = వేటాడుచోటును [పురపక్షమున తెరలు = అడ్డువలలు.]; నర్తనప్రదేశంబునుంబోలెక్ = నాట్యరంగము [ఈ యర్థమున తెఱ = తెఱచీర;] నుబోలి; (౨) లెస్సవారింగలిగి=(పట్టణపక్షమున) మంచినీటిని గలిగి; గజగ్రహణసంవిధానంబును=ఏనుఁగులను పట్టుకొను పద్ధతిని [ఈయెడ లెస్సవారి = మంచిగొయ్యి-గజబంధనస్థానము]; సుజనునింబోలెక్ = మంచివానిని [ఇయ్యెడ మంచివారిక్=మంచిమనస్సుకలజనులను] బోలి; [పూర్వటీకలో నిచ్చట 'సంవిధానము = కబళము, మంచియాజ్ఞగలది' అని యున్నది. అనఁగా నేమో తెలియలేదు.] (౩) పెక్కుపట్టులంగనుపట్టి = (నగరపక్షమున) చాల నివాసస్థానములతో - ఇండ్లతో కనఁబడి; కురువిందమందిరంబును = అద్దపుటింటిని (ఈపక్షమున పెక్కుపట్టులనఁగా పలు తావులయందు); కశ్యపమునీశ్వరుని (ఈపట్టున పెక్కుపట్టులంగనుపట్టుట యనఁగా పెక్కువిధముల బంధుత్వమును కలిగియుండుట - ప్రపంచములోని జీవజాలము లన్నింటికిని కశ్యపుఁడే మూలపురుషుఁడనుట) బోలియు. [ఇఁకమీఁద వచ్చు మూఁడు పోలికలు విరోధమూలకములు.]

(i) హరికిక్ = విష్ణునకు; గిరిగుహాయుక్=కొండగుహయైనదియు; [ఇది విరోధము; దానిని పోఁగొట్టుటకు హరిశబ్దమునకు సింహ మను నర్థము గ్రాహ్యము.] (ii) మాధవునకుక్=లక్ష్మీకిభర్తయగు విష్ణువునకు; ఉపవనంబును = ఉద్యానవనమైనదియుఁ; [ఇది విరోధము; దానింబోఁగొట్టుటకు మాధవశబ్దమునకు 'వసంతఋతువు' అను నర్థము గ్రాహ్యము] (iii) చక్రికిక్ = చక్రాయుధముగల విష్ణునకు; శ్రీఖండతరుకోటరంబును = చందనవృక్షపు తొఱ్ఱయైనదియు; [ఇది విరోధము; దానిఁబోఁగొట్టుటకు 'చక్రి'కి 'పాము' అను నర్థము గ్రాహ్యము.] అడరక్ = ప్రకాశింపఁగా; పుడమినిడువాలుగంటి=భూమి యను పొడవువాలికకన్నులుగల పడఁతి; తడవు = చాలసేపు; చొచ్చి = ప్రవేశించి; వియచ్చరసంబాధబంధురంబుక్ = దేవతల సమ్మర్దముచే మనోహరమైనదియు; నిసర్గశృంగారతరంగితంబు నగు = స్వభావసిద్ధమగు నలంకారములచే నింపుగొల్పునదియునైన; నేత్ర...బునుంబోలెక్ = కన్నులయెదుట నుంచఁబడిన మూఁడు లోకములు వలె, నాయకుఁడు లేని ముల్లోకములవలెననియు; బహువిధజనాకీర్ణంబై = అనేకవిధములుగా నున్న జనులతో నిండియున్నదై; [విష్ణుసేవార్థము ముల్లోకముల జనులును వచ్చిరనుట.] ఉదీర్ణవైభవంబునక్=గొప్పఐశ్వర్యముతో; [ఇఁకమీఁది నాల్గు పోలికలు శ్లేషమూలకములు.] బృందారకద్విరదంబుచందంబునక్ = ఐరావతముపగిది; వలభిదారూఢోపరిభాగంబును = ఇంద్రునిచే [వ-బలకు అభేదమును గ్రహింపవలెను.] అధిష్ఠింపఁబడిన వీఁపు కలది; విష్ణునిభవనము (వలభి+దారు+ఊఢ+ఉపరిభాగంబు =) ముంజూరుపట్టెపయి ఉంచఁబడిన మీఁదిభాగము కలది; లాంగలక్షేత్రంబువై చిత్రిక్ = మెట్టపొలమువిధమున; యవనికామహితంబును = (యవ+నికామ+హితంబును) యవధాన్యముచే మిక్కిలి హితమైనది, లేదా-బ్రహ్మాదర్భచే గొప్పదైనదియు; (భవనపక్షమున) యవనికలచే (తెఱలచే) అలంకరింపఁబడినది; ['యవనికామహితంబు=ఓమముచేత పూజ్యమయినది, తెరచీరచేతదొడ్డది' అని పూర్వటీక.] నాటకసంవిధానంబుకై వడిక్=నాటకరచనముపగిది; శుద్ధ......సంభృతంబును=శుద్ధవిష్కంభము, మిశ్రవిష్కంభములతోఁ గూడినదియు; (భవనపక్షమున) శుద్ధముగాను (ప్రత్యేకముగాను) మిశ్రముగాను (వేఱొకదానితోఁగలసియు) నున్న గడెమ్రానిచేఁగూర్పఁబడినది. దధీచిశరీరంబుకరణిక్ = దధీచిమహర్షి దేహమువలె; సురభిగోముఖావిద్ధంబునై = మనోహరమగు సురభిగోముఖాదులచే చూడఁబడినదై, (భవనపక్షమున) మంచి వాసనగలద్రవ్యముచే అలుకఁబడినది. గూఢపాత్తల్పు = పాము పడకగాఁగల

1. క. గూఢపాదతల్పు. చ. గూఢపాత్తల్పు. 2. క. జిహ్వా. చ. జిహ్మా.

విష్ణునియొక్క; తఱిసి = సమీపించి; విరసజనహృదయంబులన్ = చెడ్డమనుష్యులమనస్సులందు; తగులు వడని = అంటని; బ్రహ్మవిద్యయుంబోలెన్ = పరమాత్మజ్ఞానమువలె; అజిహ్మప్రకారంబునన్ = వంకర లేనిరీతిని - తిన్నని నడకతో; సప్తకక్ష్యాంతరంబులు = ఏడు లోపలినగళ్లను; అతిక్రమించి = దాటి.

సీ. నవసుధాపరిఖాంబునివహ మొప్పెడుచోట మెఱుఁగుఁబుత్తడికోట మించుచోట
నిగిడి యీఁగులకెంపు నెలకట్టుగలచోటఁ గల్వకావిరి కారుగ్రమ్ముచోటఁ
నలరు మొగ్గమొనలకట్టావు లూరెడుచోటఁ గెలఁకులకొలఁకులు దొలఁకుచోట
గంధర్వగాంధర్వ[1]గంధ మింపగుచోట గరుడకేతనములు గ్రాలుచోటఁ
తే. బరమయోగివరేణ్యనిర్భరసమాధి, సౌఖ్యసంపద నిరపాయసంప్రదాయ
సిద్ధిఁ [2]దిలకించుచోట నశేషభువన, వివిధధర్మంబు లావిర్భవించుచోట 158

టీక. నవ.....నివహము = క్రొత్తదైనయమృతపుటగడ్తలోని జలప్రవాహము; మెఱుఁగుఁ బుత్తడికోట = తళతళలాడు బంగారుకోట; నిగిడి = విజృంభించి; ఈఁగులకెంపునెలకట్టు = చింతామణితోఁ జేయఁబడిన కట్టడపుఁబని; కల్వకావిరి = కలువలనల్లనికాంతి; కారుగ్రమ్ముచోటన్ = దట్టముగా వ్యాపించుచోట; అలరుమొగ్గమొనలకట్టావులు = పూవులయగ్రభాగములనుండి పెద్దశ్వాసములు (పరిమళయుక్తవాయువులు) ఊరెడుచోటన్ = ఎడతెగక పుట్టుస్థలమున; కెలఁకులకొలఁకులు = ప్రక్కనున్న చెఱువులు; తొలఁకుచోటన్ = తొణుకుచున్న (నీటితో నిండి యందమైన) చోటు; గంధర్వ..... గంధము = గంధర్వుల పాటలయొక్క అతిశయము; ['గాంధర్వగంధము = పాటలవలనివాసన' అని పూర్వటీక.] క్రాలుచోటన్ = ప్రకాశించుచోటు; పరమ.....సమాధి = గొప్ప యోగీశ్వరుని హెచ్చగు యోగనిష్ఠయొక్క; సౌఖ్యసంపద; నిరపాయసిద్ధిన్ = అపాయములేనట్టి సిద్ధిని; తిలకించుచోటన్ = కనుగొనుచోటు. ['తులకించు = ప్రకాశించు' అని పూర్వటీక.] అశేష.....ధర్మంబులు= సమస్తలోకముల ధర్మములన్నియును; ఆవిర్భవించుచోటన్ = (పుట్టు) ఉత్పత్తియగుచోట-(వైకుంఠమున) ముందు పద్యమున అన్వయము. అలం. ఉదాత్తము.

క. బహుయోజనవిస్తీర్ణము, బహునారీజనయుతంబు బహువిధమహిమా
వహము నగు నొక్కకేళీ, గృహమున నానందకోరకితమానసుఁడై. 159

టీక. కేళీగృహమునన్ = విలాసమందిరమున; ఆనంద.....మానసుఁడై = సంతోషముచే చిగురెత్తిన మనస్సుకలవాఁడై (కర్త - విష్ణువు.)

మ. కలదోఃకంకణఝంకృతంబుల మరుత్కన్యల్ సుధాబిందు పి
చ్ఛిలనీహారమయూఖ[3]బింబసదృశస్విన్నాననశ్రేణి వ
ర్తిల నొయ్యొయ్యన [4]నూఁప నూఁగు ఫణభృత్పర్యంకికన్ లచ్చిని
[5]ట్టిఱపుం జన్గవఁ[6]బోలు [7]మునొన్నరగు మేన్ డాచేసి యుల్లాసియై. 160

టీక. మరుత్కన్యలు = దేవతాస్త్రీలు; సుధా.....శ్రేణి - సుధాబిందుపిచ్ఛిల = అమృతబిందువులచే పేరుకొనిన; నీహారమయూఖబింబ = చంద్రబింబముతో; సదృశ = పోలియున్న; స్విన్నాననశ్రేణి=చెమటపట్టిన ముఖముల సమూహము; వర్తిలన్ = ప్రవర్తిల్లఁగా - ఉండఁగా; కలదోఃకంకణఝంకృతంబులన్ = చేతులయందలి కంకణముల గలగలమను మధురధ్వనులతో; ఒయ్యొయ్యనన్ = మెల్లఁగా; ఊఁపన్; ఊఁగు = ఊఁగుచున్నట్టి; ఫణిభృత్పర్యంకికన్ = పాము అను నుయ్యాలయందు;

---

1. చ. గాంధమంపగు. 2. క. దులకించు. చ. ట. దిలకించు. 3. చ. పించ. 4. చ. ట. యూఁప. 5. చ. ట్టఱపుం. 6. చ. ట. పొల్పు. 7. చ. నెరుగు.

లచ్చి......బోలు = లక్ష్మీదేవియొక్క ఎత్తయిన (ఉన్నతమైన) స్తనద్వయమువలెనున్న; మున్నెరగు= ముందుంచుకొను దిండును; ముక్, డా, చేసి = ముందుభాగమున దగ్గఱగా (ఆధారముగా) నుంచుకొని; ఉల్లాసియై = సంతోషించువాఁడై - ఆనందించువాఁడై.

[దేవతాస్త్రీలు సర్పపుటుయ్యాల నూఁపఁగా అందు విష్ణువు ముందఱిదిండును ముందుంచి పాని నానుకొని సంతోషమున నున్నాఁడని భావము.] అలం. స్వభావోక్తి, ఉపమ.

క. దీపించువానిఁ ద్రిభువన, దీపకుఁ డగువానిఁ జంద్రదినకరమయ వీ
క్షాపాతదళితనిజభ, క్తాపద్ధ్వాంతప్రవాహుఁ డనఁదగువానిన్. 161

టీక. దీపించువానిన్ = ప్రకాశించువానిని; త్రిభువనదీపకుఁడు = ముల్లోకములను ప్రకాశింపఁజేయువాఁడు; చంద్ర......ప్రవాహుఁడు - చంద్రదినకరమయ = చంద్ర, సూర్యులరూపున నున్న; వీక్షా = చూపులయొక్క; పాత = (వ్యాపనము న) పడుటవలన; దళిత = ఛేదింపఁబడిన; భక్తాపద్ధ్వాంతప్రవాహుఁడు = భక్తుల యాపద లను చీఁకటిపరంపరలు గలవాఁడు. అలం. రూపకము.

తే. నగవు నురువులు మణిపూరనలినహంసి
[1]కుండలగ్రాహములు నేత్రకుముదరుచియుఁ
గలుగు తనుకాంతికాళిందిఁ గన్న తరుణ
తరణియును బోని యురమురత్నంబువాని. 162

టీక. [ఈ పద్యమున శ్రీవిష్ణుని నల్లనిదేహము యమునానదిగా వర్ణింపఁబడుచున్నది. ] ఈదేవుని తనుకాంతి యను కాళిందికి (యమునకు)] నగవు నురువులు = తెల్లనినవ్వులే నురుగులు; మణిపూరనళిన హంసి = మణులప్రవాహములే (గుంపులే) పద్మములును, హంసలును; కుండలగ్రాహములు = (చెవుల నలంకరించిన) మకరకుండలములే మొసళ్ళు; నేత్రకుముదరుచియున్ = కన్నులే కలువల కాంతికలవి; (ఇవి) కలుగు, తనుకాంతికాళిందిన్; కన్న; తరుణతరణియునుబోని = లేఁతసూర్యునివలెనున్న; ఉరము రత్నంబువానిన్ = వక్షస్స్థలమునందలి కౌస్తుభమాణిక్యముకలవానిని - శ్రీవిష్ణుని. ఇందు మణిపూరకమను పద్మమునకు శ్రీకృష్ణుఁడు హంసయగుటయు, కుండలియు సూచితములు.] [ముందుపద్యముతో అన్వయము ] అలం. రూపకము, ఉపమ.

తే. పుండరీకతపోజాతభువనపీడ, విన్నపము సేయు నజానంపవీథిఁ గేలు
సాచి హేమాద్రి*కందరాసక్తమేఘ, మాలికంబగు గగనంబుఁ బోలువాని. 163

టీక. పుండరీక......పీడన్ = పుండరీకుని తపస్సువలనఁగలిగిన ప్రపంచబాధను; విన్నపము చేయునజానంపవీథిన్ = మనవిచేయుచున్న బ్రహ్మభుజముపై; కేలుసాచి = చేయివేసి; హేమాద్రి......మాలికంబగు= మేరువుపర్వతపు చరియపై వ్యాపించిన మేఘపఙ్క్తులు గల; గగనంబుఁ బోలువానిన్ = ఆకాశమువలె నున్నవానిని; [ముందుపద్యముతో సమన్వయము ] [విష్ణువు ఆకాశమువలెను, అతని బాహువు మేఘములవరుసవలెను, బ్రహ్మ మేరువువలెను ఉన్నట్లు వర్ణితము.] అలం. ఉపమ.

తే. లలితలక్ష్మీనఖాం[2]కూరలాల[3]సమునఁ, గమ్రకల్హారదళగంధగౌరవమున
నతులనైపథ్యరత్నచంద్రాతపమున, నొప్పుమీఱిన నునుసేసకొప్పువాని. 164

టీక. లలిత...లాలసమునన్ =లక్ష్మీదేవి చక్కనికొనగోళ్లతో దువ్వుటచేతను; కమ్ర...... గౌరవమునన్ = మనోజ్ఞమగు కల్హార (ఎఱుపుకలిసిన తెలుఁపురంగు కలిగి మిక్కిలిపరిమళముతో నిండి యున్న కలువల)ముల రేఁకులయొక్క ఎక్కువపరిమళముతోను; అతుల......తమునన్ = బాగుగా

1. క. కుంతల. చ. కుండల. 2. చ. శమన. * క. స్కంధరాసక్త. శ. ర. 3. క. షుర. చ. కూర.

నలంకరింపఁబడిన రత్నములవలని వెన్నెల (వెన్నెలవంటి కాంతి)తోను; ఒప్పుమీఱిన = బాగుగానున్న; నునుసిసకొప్పువానిన్ = చిన్న కొండెసిగగలవానిని; మీఁది పద్యముతో నన్వయము.

[విష్ణునితలను లక్ష్మీదేవి బాగుగా దువ్వి జుట్టువేసి, అందు కల్హారదళములను, రత్నములను అలంకరించినదని భావము.]

తే. ఊరుయుగళంబుమీఁదఁ జెల్వారు నడిమి, తానపంబునెపంబున దనుజనదన
నిర్మిత స్తంభసంభవనిజపురాణ, పురుషహరిలీలఁ దెలిపెడు పొలుపువాని. 165

టీక. ఊరుయుగళంబుమీఁదన్ = రెండుతొడలపైని; చెల్వారు = ప్రకాశించు; నడిమితానపంబునెపంబునన్ = మధ్యముయొక్క సన్నదన మను మిషచే; దనుజ.....లీలన్ = రాక్షసుఁడగు హిరణ్యకశిపుని యింటి స్తంభమునుండి పుట్టిన తన పూర్వపుగాథ - (నృసింహావతారచరిత్రము) విలాసమును; తెలిపెడు పొలుపువానిన్ = తెలుపుచున్న అందముకలవానిని; మీఁదిపద్యముతో అన్వయము.
[విష్ణునియూరువులు స్తంభములవలెను, నడుము సింహపునడుమురీతిని ఉన్నవనుట. అలం. అపహ్నుతి.

తే. అభినవాయాతుఁ దనపుత్రు నజునిఁ గాంచి
సంతసంబున నాభివేశంతజలజ
ముబ్బి వెలిగ్రాయు పుష్పాడియొఱపు నెఱపు
[1]హాళఁదిపుట్టంబు కటిసీమ [2]నలరువాని. 166

టీక. అభినవాయాతున్ = అప్పుడే వచ్చిన; ['అభినవాయాతున్ = క్రొత్తగా వచ్చినవానిని' అని పూర్వటీక.] అజునిన్ = బ్రహ్మను; నాభివేశంతజలజము = (కర్త) నాభియను మడుగునందలి తామరపూవు; ఉబ్బి = పొంగి; వెలిగ్రాయు = వెడలఁగ్రక్కునట్టి; పుష్పాడియొఱపున్ = పుష్పాడియందమును; నెఱపు = వ్యాపింపఁజేయునట్టి; హాళఁదిపుట్టంబు = పసుపువన్నెబట్ట; [ముందున కన్వయము.] విష్ణువు పుష్పాడివలె పచ్చనైన వస్త్రమును ధరించెనని భావము. అలం. ఉపమ.

తే. అడుగునడుగులఁ బొడము చిహ్నంపుమీల, మేనిచిప్పలువోలె నానానిలింప
కనకకోటీర హీరాగ్రఘర్షణమున, మెఱుఁగువచ్చిన నఖపంక్తి మించువాని. 167

టీక. అడుగునడుగులన్ = అఱపాదములందు; పొడము = పుట్టిన - ఉన్న; చిహ్నంపుమీలమేని చిప్పలువోలెన్ = చిహ్నములుగా నున్న మత్స్యముల పీఁపులవలె [ఉపమేయము నఖపంక్తి.]; నానా......ఘర్షణమునన్ = వివిధదేవతలయొక్క బంగారుకిరీటములందలి వజ్రములయంచుల యొరపిడిచేత; మెఱుఁగువచ్చిన; నఖపంక్తిన్ = గోళ్లచే; మించువానిన్ = అతిశయించువానిని. [ముందున కన్వయము.] అలం. ఉపమ, ఉదాత్తము.

తే. ఆద్యుఁ బ్రణవస్వరూపు వేదాంతవేద్యు, మోక్షవిద్యోపదేష్టనిర్ముక్తజనను
విష్ణుఁ బ్రభవిష్ణు నిత్యవర్ధిష్ణుఁ గాంచి, మ్రొక్కె నారీజనోచితంబుగ ధరిత్రి. 168

టీక. ఆద్యున్ = మూలపురుషుని; ప్రణవస్వరూపున్ = ఓంకారస్వరూపుని; వేదాంతవేద్యున్ = ఉపనిషత్తులచే నెఱుఁగఁదగువానిని; మోక్షవిద్యోపదేష్టన్ = ముక్తికొఱకగు విద్యను బోధించువానిని; నిర్ముక్తజననున్ = విడువఁబడిన పుట్టుక కలవానిని - జన్మరహితుని; ప్రభవిష్ణున్ = ప్రభువును; సర్వవర్ధిష్ణున్ = అంతటను వృద్ధిపొందు - (పెరుగు)వానిని; విష్ణున్ = సర్వవ్యాపకుఁడగు భగవంతుని; ధరిత్రి = భూమి (కర్తృపదము) నారీజనోచితంబుగన్ = స్త్రీలకుఁదగినరీతిగా; మ్రొక్కెన్. అలం. పరికరము.

1. ట. హారిది. 2. క. నమరు. చ. నలరు.

క. మ్రొక్కి [1]వినిపించెఁ దనమదిఁ, నొక్కను నెగులెల్ల నేలనెలఁతుక కన్నీ
రొక్కొక్కటఁ బొట్టు మెఱుఁగుం, జెక్కుల [2]డిగజాఱఁ గోరఁజిమ్ముచు హరికిన్. 169

టీక. నేలనెలఁతుక = భూదేవి; తనమదిన్ = తనమనస్సులో; నొక్కను = పొదుకొనియున్న; నెగులెల్లన్ = దుఃఖమునంతటిని.

క. బలువ్రేగు[3]నొవ్వి నిమ్మై, నిల పలికిన పలుకుకతన హృదయముగలఁగెన్
నళినోదరునకు విలయా, నలయాతాయాతచలిత నీరధివోలెన్. 170

టీక. బలువ్రేగునొవ్విన్ = అధికభారమునగుబాధచే; ఇమ్మై = యుక్తమై - స్పష్టమై ఇల పలికినపలుకు కతనన్ = భూదేవి పలికిన మాటలవలన; నళినోదరునకున్ = పద్మనాభుఁడగు విష్ణునకు; విలయా......నీరధివోలెన్ = ప్రళయకాలము గాలియొక్క రాకపోకల (ప్రసారణములన) వలన చలించు సముద్రమువలె, హృదయము; కలఁగెన్ = కలఁతపడెను. అలం. ఉపమ.

వ. ఇవ్విధంబున నమ్మధుమథనుండు వసుంధరవిన్నపంబుల కనికరంబునం దరంగితం బగు నంతరంగంబు తదభిరక్షణంబున కభిముఖంబుఁ గావించి యటమున్న యకాండప్రళయంబగు పుండరీకుతపోదహనంబు దురవగాహంబును, ద్రిభువన [4]దాహదోహళంబు నగునని విన్నపంబుసేసి డాసియున్నవిరించిం గించిత్ప్రహసితాననుండై కనుంగొనుచు. 171

టీక. అమ్మధుమథనుండు = మధురాక్షసుని చంపిన ఆ విష్ణువు; తరంగితంబగు = పొంగిపొరలిన; అంతరంగంబు = మనస్సు; అభిముఖంబు = ఎదురైనది - అనుకూలమైనది; అటమున్న = అంతకుఁ బూర్వమే; అకాండప్రళయంబగు = కాలముకానికాలమునఁబుట్టిన ప్రళయమైన; దురవగాహంబును = తెలిసికొన నసాధ్యమును; త్రిభువనదాహదోహళంబును = ముల్లోకములను గాల్పు సమర్థమైనదియు; కించిత్ప్రహసితాననుండై = చిరునవ్వుతోఁగూడిన ముఖము కలవాఁడై.

సీ. శాంబరీకచ్ఛపేశ్వరకంఠసందీప్తతాపింఛవల్లీమతల్లి యనఁగఁ
బవనపారణపతి స్ఫాటికస్తంభజంభద్విషన్మణిసాలభంజి యనఁగ
సవనవరాహదంష్ట్రాఖనిత్రప్రోత కనకాక్ష ఘనకాల[5]ఖండ మనఁగఁ
గకుబంతకరివరస్కంధసింధుద్వీప సాంసారికాసితహాంసి యనఁగ

తే. భూరిభూభృచ్ఛిఖోద్యన్మయూరి యనఁగ, నృగుభగీరథభరతాది నృపభుజాగ్ర
ఘటితకాలాగరుస్థానకం బనంగఁ, దగువసుంధరఁ గృపఁబల్కు దైత్యవైరి. 172

టీక. శాంబరీ......మతల్లి - శాంబరీకచ్ఛపేశ్వర = కపటకూర్మముయొక్క - కూర్మరూపుఁడగు విష్ణునియొక్క; కంఠ = మెడపై; సందీప్త = ప్రకాశించునట్టి; తాపింఛవల్లీమతల్లి = చీఁకటిమ్రాని రెమ్మ; పవన......సాలభంజిక - పవనపారణపతి = గాలియే ఆహారముగాఁ గల పాములకు రాజైన అనంతుఁడను; స్ఫాటికస్తంభ = స్ఫటికమయమగు స్తంభమునందలి; జంభద్విషన్మణిసాలభంజిక = ఇంద్రనీలములతో చెక్కిన బొమ్మ; [సాలభంజిక = పుత్తడిబొమ్మ' అని పూర్వటీక] సవన......ఖండము - సవనవరాహ = యజ్ఞవరాహమూర్తియొక్క; దంష్ట్రాఖనిత్ర = కోరయను గొడ్డలిచేత; ప్రోత = గ్రుచ్చఁబడిన; కనకాక్షఘనకాలఖండము = హిరణ్యాక్షుని కాలిజము; కకుబంత......హాంసి - కకుబంతకరివర = దిక్కుల చివఱనుండు గొప్పగజములయొక్క - దిగ్గజములయొక్క; స్కంధ = స్కంధభాగములనెడి; సింధుద్వీప =

1. క. వినుతించె. చ. వినిపించె. 2. క. దిగ. చ. డిగ. 3. చ. నొవ్వి. 4. ట. దోహాలంబు, 5. ట. కండ.

ఏఁటిదిబ్బలయందలి; సాంసారికాసితహంసీ=కాఁపురముగా నున్న నల్లని యాఁడుహంస; భూరిభూభృచ్ఛిఖోద్యన్మయూరి=గొప్ప పర్వతముల శిఖరములపైఁ దిరుగు నాఁడునెమలి; [విస్తారమయిన కొండలనెడి శిఖలు పుట్టుచున్న ఆఁడునెమలి' అని పూర్వటీక. ఇది అననుగుణము] నృగ......స్థానకంబు=నృగుఁడు, భగీరథుఁడు' భరతుఁడు మొదలగు రాజులమూఁపులపయి నున్న నల్లని యగురు మొదలగువానిపూఁత; (ఇవి యన్నియుం భూమికి విశేషణములు.) వసుంధరన్=భూమినిగూర్చి; దైత్యభేది=విష్ణువు. అలం. ఉత్ప్రేక్ష.

శా. ఓ యంభోరుహపత్త్రనేత్ర! మది నీయుద్వేగమున్ మాను దై
తేయప్రాయనృపాన్వవాయముల మర్దింతున్ భవ[1]ద్భారమున్
బాయం ద్రోయుదుఁ జేయుదున్ సుఖులగా శుద్ధభక్తియుక్తాత్ములన్
మాయామానుషమూర్తినై పొడమి నానావిక్రమక్రీడలన్. 173

టీక. ఓ అంభోరుహపత్త్రనేత్ర! =తామరపూవురేకులవంటి కన్నులుకల ఓ భూదేవీ! మదిన్ = మనస్సులో; ఈయుద్వేగమున్ = ఈ యలజడిని; దైతేయప్రాయనృపాన్వవాయములన్ = రాక్షససమానులగు రాజులవంశములను; మర్దింతున్ = సంహరింతును; భవద్భారమున్ = నీబరువును; ప్రాయం ద్రోయుదున్ = పోఁగొట్టుదును; మాయామానుషమూర్తినై = మాయవలన మనుష్యుఁడనుగా; పొడమి = పుట్టి.

సీ. క్రూరాసిధారావిదారితద్విపకుంభకూటముక్తాశుక్తిగోస్తనములఁ
బటుగదాపాతనిర్భగ్నసైంధవశిరస్స్రవదస్రకుంకుమ[2]స్థాసకముల
శరలూనరథకేతుసౌవర్ణకింకిణీకుసుమగుచ్ఛచ్ఛటాగుంభనముల
ముసలమర్దితపదాతిసహస్రభూషానవీన రజః[3]పటీవేల్లనముల

తే. విజయలక్ష్మికి నైపథ్య విభవ మొసఁగి, చటులరోషకషాయితాశయవిరోధి
యూథమథనక్రియాహేతుయుద్ధకేళిఁ, దేలి నీకిత్తు నానంద[4]మే లతాంగి! 174

టీక. క్రూరాసి ... గోస్తనములన్-క్రూరాసిధారా = వాడియైనకత్తియంచుచే; విదారిత = నఱకఁబడిన; ద్విప = ఏనుఁగులయొక్క; కుంభ = కుంభస్థలములయొక్క; కూట = శిఖరములనెడి; ముక్తాశుక్తి = ముత్యములచిప్పలచేనైన; గోస్తనములన్ = నలువదిపేటల ముత్యాలహారములచేతను; పటు......స్థాసకములన్-పటుగదాపాత = బలిష్ఠమగు గదదెబ్బచే; నిర్భిన్న = పగులఁగొట్టఁబడిన; సైంధవశిరః = గుఱ్ఱముల తలలనుండి; స్రవత్ = కాఱుచున్న; అస్ర = రక్తమను; కుంకుమస్థాసకములన్ = కుంకుమపుఁబూఁతలచేతను; శర......గుంభనములన్, శరలూన = బాణములచేఁ గొట్టఁబడిన; రథకేతుసౌవర్ణకింకిణీ = రథములజెండాలకుఁగల బంగారు చిఱుగంటలనెడి; కుసుమగుచ్ఛచ్ఛటాగుంభనములన్ = పూలగుత్తులగుంపుల కూర్పులచేతను; ముసల .....వేల్లనములన్ - ముసలమర్దిత=ముసలమను నాయుధములచే మర్దింపఁబడిన; పదాతిసహస్ర = వేలకొలఁదిగనున్న భటులకు; భూషా=నగయైన; నవీనరజః = క్రొంగ్రొత్తమన్ను అనెడి; పటీవేల్లనములన్ = మేలిముసుఁగులచేతను; నైపథ్యవిభవము = అలంకారసంపదను; ఒసఁగి = ఇచ్చి; చటుల......కేళిన్ = చలించుచున్న రోషముచే శత్రువులగుంపుయొక్క సంహారమునకు కారణమైన యుద్ధవిహారమున; లతాంగి!; ఏన్ = నేను; నీకున్; ఆనందమిత్తున్ = సంతోషమును గలుగఁజేయుదును. [శత్రువులను సంహారించి నీ బరువు తగ్గించెదననుట.]

---

1. చ. ద్భాగమున్. 2. చ. స్థాపకములు. 3. చ. పటా. 4. క. మో లతాంగి. చ. మే లతాంగి.

వ. మత్కృతంబులు, మదీయరచితంబులు నగు నగణితాహవక్రీడనంబుల సక్రోధ విరోధివధం [1]బొనరించి తదీయకంఠనాళకరాళరుధిరధారాసారంబుల నీకుం దాపోపశమనం బాపాదించెదం బాప[2]కారి నిరసనంబు నాకు నవశ్యకృత్యం బగుట యెఱుంగవే! [3]యుత్తరంబగు భవద్భారంబు తొలఁగించుటయ కాదు సముత్పాదితత్రిభువనోపప్లవంబగు పుండరీకతపోదహనవిహారంబు వారించు తలంపు నున్న యది యిన్నలువ యిప్పు డిట మున్న తన్నిమిత్తం బని పనివిన్నవాఁడ, యెన్నిక దినంబుల నిన్నియు శుభోదర్కంబు లయ్యెడు నని పుడమిపడఁతియడ లుడిపి సగౌరవంబుగా వీడుకొలిపి [4]యప్పరమపురుషుం డంతర్ధానంబు నొందె; శతానందుండును సానందంబుగ యథాస్థానంబునకుం జనియె నిట్లు. 175

టీక. మత్కృతంబులు = నాచే జేయఁబడినవి; ; మదీయరచితంబులు = నాచేఁదొలుత కల్పింపఁబడినవి; ఆహవక్రీడనంబులన్ = యుద్ధపుటాటలందు; సక్రోధవిరోధివధంబు = కోపముతోఁగూడిన శత్రువుల సంహారమును; ఒనరించి = చేసి; తదీయ......సారంబులన్ = వారిగొంతుక్రోవులందలి భయంకరమై ఎడతెగని రక్తధారలచే; తాపోపశమనంబున్ =నీ తాపము (వేఁడిమి) చల్లారుటను; ఆపాదించెదన్ = కలుగఁజేసెదను; పాపకారినిరసనంబు = దుష్టజనశిక్షణము; అవశ్యకర్తవ్యంబు = ప్రధానముగాఁ జేయఁదగినది; ఉత్తరంబగు = మిక్కిలి అధికమైన; భవద్భారంబు = నీబరువును; సముత్పాదితత్రిభువనోపప్లవంబగు = పుట్టింపఁబడిన ముల్లోకముల యుపద్రవము కల; పుండరీకతపోదహనవిహారంబు= పుండరీకమహర్షి తపస్సువలనఁ గల్గిన చిచ్చుయొక్క వ్యాప్తిని; వారించు = పోఁగొట్టు; ఇన్నలువ = నాలుగుమోములు గల యీ బ్రహ్మ; పనివిన్నవాఁడు = ఆజ్ఞానువర్తియై యున్నవాఁడు; ఎన్నికదినంబులన్ = లెక్కపెట్టఁదగిన రోజులలో - కొలఁదిదినములలోనే; శుభోదర్కంబులు = మేలుకలిగించునవి - సానుకూలములు; పుడమిపడఁతియడలు = భూదేవిదుఃఖమును; ఉడిపి = పోఁగొట్టి; వీడుకొలిపి = పంపి; ఆప్పరమపురుషుండు = ఆవిష్ణువు; శతానందుండును = బ్రహ్మయును.

ఆ. పుండరీకుతపము భూదేవిభారంబు, ఫలము నందఁజేయఁ దొలఁగఁద్రోయఁ
గోరి మర్త్యుఁడయ్యె శౌరి; పరార్థమై, పురుషవరులు వికృతిఁ [5]బొరయుట యొప్పు.

టీక. శౌరి = విష్ణువు; మర్త్యుఁడు = మనుష్యుఁడు; పరార్థమై = ఇతరులకొఱకు; పురుషవరులు = మహాత్ములు; వికృతిన్ = వికారమును - మార్పును; పొరయుట = పొందుట; ఒప్పున్ = తగును. అలం. క్రమము, అర్థాంతరన్యాసము.

## శ్రీకృష్ణావతారచరిత్రము

సీ. వసుమతీభారనిర్వాపణోద్యక్తుఁడు వర్ధితయాదవాన్వయపయోధి
దేవకీవసుదేవశేవధి నందమందిర[6]రసాలావాసపరభృతంబు
పూతనాప్రాణసంఘాతవాతూలాహి శకటాంగవిఘటనచటులబుద్ధి
సముదతృణావర్తసంవర్తసమవర్తి పాతితార్జునపాదపద్వయుండు

తే. వత్సవ్యాత్తాస్యకం బభివ్యధితబకుఁడు, మర్దితాఘుండు కాళియమానభేది
నిష్ఠురానలపారణనైష్ఠికుండు, కృష్ణుఁ డాశ్రితలోకవర్ధిష్ణుఁ డలరు. 177

1. చ. బాచ. 2. చ. కార. 3. క. యుత్తరం. చ. యుత్తరంగం. ట. యంతరంగం. 4. క. ఘరమ. చ. యప్పరమ. 5. క. పొరయు. 6. చ. సౌరసా.

టీక. వసుమతీ......ద్యక్తుండు = భూభారమును తగ్గించుటయెడఁ బ్రయత్నించువాఁడు; వర్ధిత......పయోధి = యాదవకులవంశ మను సముద్రమును వృద్ధిఁబొందించువాఁడు - యాదవవంశ మను సముద్రమునకు చంద్రుఁడైనవాఁడు; దేవకీవసుదేవశేవధి = దేవకీవసుదేవులకు (తల్లిదండ్రులకు) నిధి యైనవాఁడు; నంద......పరభృతంబు = నందుని యిల్లను తీయమామిడిచెట్టున నివసించు కోకిలము; పూతనా......లాహి = పూతన (అను రాక్షసి) యొక్క ప్రాణవాయువులకు పాము; శకటాంగ......బుద్ధి = శకటాసురుని దేహమును విరుచుటయందు కదలాడు బుద్ధికలవాఁడు - శకటాసురుని సంహరించినవాఁడు; సమద......సమవర్తి = మదించిన తృణావర్తుఁడను రాక్షసునికి ప్రళయమునందలి యముఁడైనవాఁడు; పాతితా......ద్వయుండు = పడఁగొట్టఁబడిన రెండు తెల్లమద్దిచెట్లు కలవాఁడు - వత్సహృత్సాయకంబు = వత్సాసురుని హృదయమునకు బాణమైనవాఁడు; అభివ్యధితబకుఁడు = బకాసురుని బాధించి (చంపి)నవాఁడు; మర్దితాఘుండు = అఘాసురుని చంపినవాఁడు; కాళియమానభేది = కాళియుఁడను పాము గర్వము నడఁచినవాఁడు; నిష్ఠురా......నైష్ఠికుండు = క్రూరమైన దవానలమును భక్షించునట్టి నియమము కలవాఁడు - ఆశ్రితలోకవర్ధిష్ణుఁడు = తన్నాశ్రయించిన ప్రజలకు వృద్ధిని కలుగఁజేయువాఁడైన; కృష్ణుఁడు = కృష్ణావతారము; అలరుఁ = ప్రకాశించును. అలం. పరికరము.

సీ. కనుగట్టి గాంగేయ[1]గర్భు డాఁగురుమూఁత లాడించె వత్సాపహారణవేళ
నాలమందలఁ బ్రోవ శైల మెత్తెడి పూన్కిఁ గేలిమై కందుకక్రీడ సలిపెఁ
బాటించెఁ గంబాలయాఁట రాసక్రీడ నాభీరభీరుమధ్యాంకపాళి
వెలయించె [2]యక్షౌక్షవిహారణం బలకాధిరాజకింకర శిరోరత్నరాజిఁ
తే. దన్నుబిల్లాడె నంగుష్ఠదళితసర్పతను సుదర్శననామవిద్యాధ[3]రేంద్ర
కఠినజఠరచ్ఛలమున నగ్రజుఁడుఁ దాను, నందసూనుండు బృందావనంబునందు.

టీక. నందసూనుండు = నందుని (పెంపుడు) కొడుకైన శ్రీకృష్ణుఁడు; వత్సాపహరణవేళఁ = దూడలను అపహరించుకొని పోయినపుడు; కనుకట్టి = ఇంద్రజాలవిద్య నుపయోగించి - మాయచేసి; గాంగేయగర్భుఁ = హిరణ్యగర్భుఁడగు బ్రహ్మను; డాఁగురుమూఁత లాడించెఁ = కన్నులుకప్పి ఆడు ఆటను ఆడించెను. [బ్రహ్మ యొకప్పుడు శ్రీకృష్ణునిఁ బరీక్షింపఁగోరి, మందలోని గోవత్సముల నన్నింటిని మాయముచేసెను; అపుడు శ్రీకృష్ణుఁడు తానే గోవులుగను, వత్సములుగను మాఱి బ్రహ్మను విభ్రాంతుని చేసెను.] ఆలమందలఁ = గోగణమును; శైలము = గోవర్ధనపర్వతమును; కేలిమైఁ=విలాసముగా; కందుకక్రీడసల్పెఁ = బంతియాఁట యాడెను - బంతివలె నా కొండను సునాయాసముగ నెత్తెననుట. [శ్రీకృష్ణుఁడు తన పూజ నాటంకపఱచెనని కోపించి దేవేంద్రుఁడు గొప్ప వానలను కురిపించి గొల్లలను బాధింపఁగా కృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తి, దానిక్రింద వా రందఱును సుఖముగా నుండునట్లు చేసి వానిని రక్షించెను.] రాసక్రీడఁ = రాసక్రీడయందు; ఆభీరభీరుమధ్యాంకపాళిఁ = గొల్లపడుచుల కౌఁగిలింతలయందు; కంబాలయాఁటఁ = స్తంభములనడుమ నాడు నాఁటను; పాటించెఁ = జరిపెను. ఈయాఁటయందు స్తంభములను గౌఁగిలించుకొనుట యుండుట నీతఁడు గోపస్త్రీల కౌఁగిళ్లఁ దేలియాడెనని గ్రావ్యాము. అలకా......రాజిఁ = అలకాధిపతియగు కుబేరుని సేవకుని శిరస్సునందలి రత్నములచే; యక్షౌక్షవిహారణంబుఁ, వెలయించెఁ = కుబేరాక్షమను ఆఁట నాఁడెను; నందసూనుండు = కృష్ణుఁడు - తానును, అగ్రజుఁడుఁ = బలరాముఁడును; బృందావనంబునందుఁ; అంగుష్ఠ......తనుఁ = కాలిబొటనవ్రేలితోఁ జిమ్ముఁగొట్టఁబడిన పాము దేహము కలవాఁడైన; కఠినజఠరచ్ఛలమునఁ = కఠినమైన దేహము మిషతో తన్నుబిల్లాడెఁ = తన్నుబిళ్లయను నాఁట నాడెను. [తనుపైకివచ్చిన సుదర్శనుని సంహరించెననుట.]

1. ట. గర్భుఁడు గడమూఁత. 2. చ. నక్షౌక్ష. 3. చ. రేంద్రు.

ఈ మీఁదఁ జెప్పఁబడిన దాఁగిలిమూఁత, బంతియాట, స్తంభాలయాట, సోగటాలయాట, తన్నుబిళ్లాట పిల్లలు చిన్నతనమున నాడునట్టివి.

### శ్రీరాధాదేవీచరిత్రము

వ. ఇవ్విధంబున నమ్మధుకైటభవిరోధి మాయామానుషవిగ్రహంబు నంగీకరించియు నమానుషంబులగు విక్రమవిశేషంబులం బ్రవర్తించుచుండె నంత నటఁ మున్న [1]యవ్వెన్నునకు మనఃప్రీణనంబుఁ గావింపం దలంచి విరించి నిఖిలభువనమోహిని యగు నొక్కశక్తిం [2]బుట్టించుటయు నమ్మత్తకాశిని తదాదేశంబున నందు [3]సుఱంది యగు శతగోపుం డను గోపాలునకుం గూరిమిపుత్త్రియై పెరుఁగుచుండె నంత దంతావళమరాళశిఖావళగమనంబుల గమకంబు దమకుం దోడ వగుచు నిగుడు నడవడులం జెడంగారి బంగారంపుమెట్టకెందమ్ములకు నెత్తురుంబొత్తుచుట్టంబులనం జూపట్టు చిగురుటడుగులును; దారక[4]గారవంబును, ముత్తియంబుల[5]క్రొంపళుకును, [6]జంద్రమండలంబు నఖండలావణ్యంబును సేవగించు చరణ[7]నఖరముకురంబులును; మకరధ్వజశరధిశాలికన్యగోపుచ్ఛకాహళాసందర్భంబులసౌభాగ్యంబు నావరించుచిఱుతొడలును; [8]వలుదతనంబులు సలపందనంబులు [9]నిద్దంపుఁదనంబులు తద్దయుం గలిగి కరికరాకారంబులై కరభనిభంబులై కనకకదళీమృదులంబులునైన పెందొడలును; కరటిశిరఃశిఖరంబును రథాంగరమాధురంధరంబును [10]బులినఘనంబు నగు జఘనంబును; [11]నావర్తవర్తులంబును, నితాంత[12]పున్నాగలతాంతకాంతంబును నతిగంభీరంబు నగు నాభిసరోవరంబును; [13]నసితబిలేశయ[14]జాలకంబునకు నేలికయై, చలిచీమచాలునకుం బోలికయై, శైవాలవల్లికిం దల్లియై చెలువారు నూఁగారును; [15]నాగడపులం గడచివైచి వీచీరేఖలం బోఁద్రోచి కుసుమనారాచుకేళాకూళిం గల జాళువా[16]సోపానంబులఁ బ్రతిఘటించు త్రివళి[17]విభాగంబును; [18]గమలకోరక కనకకలశకరికుంభప్రముఖంబు[19]లగు నుపమాద్రవ్యంబుల క్రొవ్వడంచి[20]పంచారించి పిక్కటిల్లి పెరిగి నిక్కి కక్కసించి కవజక్కవలఁ బెక్కువలలం బెట్టుచుఁ [21]జూపట్టి దోర్మూలకూలంకషంబులగు కుచలికుచంబులును; [22]బ్లతుకల్లవపల్లభంబును [23]జపేట పుటపరిస్ఫుటంబును నగు వేదిమధ్యవిభమధ్యంబును; ఫణిఫణాఫలకభాసురంబులును [24]దాంబూలీవళితరుణంబులునునై నిగనిగనిపసిండి[25]తగడుం దెగడు కరమూలంబులును; [26]గంధర్వ[27]కళలచెన్నునం బూవుటెత్తులయొత్తున సోగతీగలబాగున

---

1. చ. వెన్నునకు. 2. క. బుత్తెంచు. చ. బుట్టించు. 3. చ. సురంది. 4. క. గౌరవ. చ. గారవ. 5. చ. క్రొత్తళుకు. 6. క. చంద్ర. 7. క. నఖ. చ. నఖర. 8. చ. లో ఇది మొదలు 'తొడలును, వఱకు లేదు. 9. క. నిద్దంపు. 10. క. పులిన. 11. క. ఆవర్త. 12. చ. 'పున్నాగలతాంత' లేదు. 13. క. అసిత. 14. ట. జాలకం. క. బాలి. 15. క. ఆగడపు. చ. నాగడపు. గదియవైచి). శ. ర. 16. క. సోబనంబు. చ. సోపానంబు. ట. శోభనంబు శ. ౕ. సోపనం. సూర్య. 17. క. విభాగంబులును. చ. భాగంబును. 18. క. కమల. 19. చ. లకు. 20. క. పచారించి. చ. ట. పంచారించి. 21. క. పట్టు. 22. క. ప్లవ. 23. క. చపేట. 24. క. తాంబూలీ. 25. చ. ట. తగటుం. 26. క. కందర్ప. 27. కళల. చ. ట. కళల. క.

[1]బుజగలిగిన[2]బుజంబులును; [3]గలువ తేకుల చెలువున జోకమీఱు వాలారు కొనగోరులును; [4]బవడంపు జివురులపగిదిం గల రక్తాంగుళిప్రవాళంబులునుం గలిగి నెత్తురుట్టిపడు కరతలంబులును; [5]గంబు [6]బిబ్బోకాపహంబును [7]గ్రముక[8]ఫల కమనీయంబును [9]గోమలాంశుమత్ఫలాముకుళమోహానంబు నగు కంధరాభోగం బును; సమ్మిశ్రకటఫలద్వయశోభాద్వైతనిబిడం బగు చిబుకంబును; [10]జక్కెఱల ధిక్కరించి తేనెలంబోనాడి చెఱకురసంబుల నిరసించుచు మధురిమ నమరు సధర బంధుజీవప్రసూనంబును; మొల్లల నుల్లసంబాడి యాణిముత్తియంబుల నుత్తరించి సుధాబిందువులం బలువరుసల[12]సరసంబులాడు పలువరుసయు; సంధ్యారాగరంజితం బగు కళారాజరేఖపొత్తు వడయు నుత్తరోష్ఠపుటంబును; [13]బరిస్ఫుటనాసికా సుగంధనిశ్శ్వాసధారాధోరణీనిశిత మార్గంబునుంబోని యయ్యార్ధ్వోష్ఠబింబ ఫలంబుమీఁది నిమ్నభావంబును; సూనసాయకుదోనివిల్లును [14]బల్లవకరవాలు లాంగలాయుధంబును సామివికసిత [15]చంపకకోరకంబును నువ్వుంబువ్వును నవ్వుచు నివ్వటిల్లు నుల్లసిత నాసికాశిఖరంబును; [16]సితిమయూఖరేఖాసఖంబగు నొసలును; నింబకిసలయంబుల [17]కపనయం బొందించు ముక్కును; నరంటి[18]మొక్క మొదలి యాకుతెక్కలనెక్కసక్కెంబు సేయుచుం గాయజు[19]సింగిణులవంగడంబగు నెల వంక కన్నుబొమలకొమలును; [20]జకోరంబుల ప్రకారంబును జేరలతీరును సార సంబుల[21]దారసంబును మీలమేలును మెఱపులయొఱపును మరుతూపులకోపును నుత్పలంబులయొప్పును [22]గైరవంబుల [23]గౌరవంబును నేణనేత్రంబులవైచిత్రియు విసూత్రితంబులు గావించి [24]మించి శ్రవణపుటకూపపతయాళువులగు విలోల విలోచనంబులును; దర్పణంబులదర్పంబును సరోజంబులరోజయు సుధాకల శంబులవిలసనంబును నంబు[25]రుహబింబంబు మదంబునుం బోషించియు నశేషకళా కలాపపాణింధమస్వరభాస్వరంబగు వదనవలయంబును; శ్రీకారంబులజోకయుం దొమ్మిదింటిలెక్కలయొమ్మికయు మోదుగువిరులసిరు[26]లును [27]బోసరించి వాసివడ యు శ్రుతిశష్కులికలును; నిక్కలంకంబులై నిబిడంబులై నిద్ధంబులై [28]నీరంధ్రం బులై నీలంపుగుంపులసొంపు లామతించు మంచినెఱికురులునుం గలిగి వలరాజు నెత్తపలక * తమకునం గనుపట్టు వీఁపున నేపారి యాపారిజాతామోదమేదుర విలాసంబుల [29]భాసిల్లు వెండియు, 179

1. చ. భుజ. 2. భుజం. 3. క. కలువ. 4. క. పవడం. 5. క. కంబు. 6. చ. బింబోకా 7. క. క్రముక. 8. క. తరు. చ. ఫల. 9. క. కోమలాం. 10. క. చక్కెఱ. 11. చ. సించుచు. 12. సరసంబాడు. చ. ట. సరసంబులాడు. 13. క. పరి. 14. క. పల్లవ. 15. చ. చమ్పక. 16. చ. శిత. 17. చ. ట. కపసలం. 18. ట. మొగ్గ. 19 చ. సింగిణివంగడం. 20. క. చకోరం. 21. చ. ట. గౌరవంబును. 22. క. కైరవం. 23. చ. గారవంబును. 24. క. మించు. చ. ట. మించి. 25. చ. రుహాంబుమ. ట. బింబాంబుమ. క. బింబాంబులమ. 26. చ. లను. 27. బోసన. 28. చ. లో. లేదు. * క. ర. తమకు. సూర్య. తళుకు. 29. క. భాసిల్లె. చ. భాసిల్లు.

టీక. అమ్మధుకైటభవిరోధి = మధు, కైటభు లను రాక్షసులకు పగవాఁడగు విష్ణువు; మాయామానవవిగ్రహంబుఁ = మాయచేనైన మనుష్యశరీరమును; అమానుషంబులగు = మనుష్యుల కతీతము లగు; అఁటమున్న = అంతకుఁబూర్వమే - అతని యమానుషచర్యలకు ముందుగనే; అవ్వెన్నునకుఁ = ఆ విష్ణువునకు; మనఃప్రీణనంబు = మనస్సంతోషమును; విరించి = బ్రహ్మ; నిఖిలభువనమోహిని=సమస్త లోకములను మోహింపఁజేయునది; శక్తిఁ = స్త్రీదేవతను; అమ్మత్తకాశిని = ఆ యుత్తమవనిత; తదాదేశంబునన్ = ఆ బ్రహ్మయాజ్ఞవలన; [ఇఁకమీఁద రాధయొక్క యవయవములు వర్ణింపఁబడును.] దంతావళ......గమకఁబు = ఏనుఁగులయు, హంసలయు, నెమిళ్లయు నడకల మనోజ్ఞత; తొడవు = అలంకారము; నిగుడు = వ్యాపించు; నడవడులన్ = గమనములచే; బెడంగారి = అందము నిచ్చి; బంగారంపుమెట్టకెందమ్ములకుఁ = నేలపైఁబుట్టిన బంగారుపద్మములకు; నెత్తురుంబొత్తుచుట్టంబు లనఁ = రక్తసంబంధముగల.మిక్కిలిదగ్గఱి (సోదర సంబంధ) బంధువులా! యనురీతిని; చిగురుటడుగులును = చిగుళ్లవంటి పాదములును; [రాధిక పాదములు చిగుళ్లవలెను బంగారుపద్మములవలెను ఉన్నవనియు, ఆమెనడక గజాదుల నడకతోఁబోలి యున్నదనియు భావము] తారల గారవఁబును = నక్షత్రములగొప్పతనమును; ఏవగించు = అసహ్యపడు - తిరస్కరించు; చరణనఖరముకురంబులును = అద్దములవంటి [నిగనిగలాడు] కాలివ్రేళ్లును; [ఆమెకాలివ్రేళ్లు చుక్కలను, ముత్యములను, చంద్రబింబమును, అద్దమును పోలి యున్నవని భావము.] మకర...సౌభాగ్యంబుఁ, మకరధ్వజశరధి=మన్మథుని యమ్ములపొది; శాలిగర్భ = వరిపొట్ట; గోపుచ్ఛ=ఆవుతోఁక; కాహళా=బాకా; ఏనిసందర్భంబుల=కూర్పులయొక్క సౌభాగ్యంబుఁ = చక్కఁదనమును; ఆవరించు=ఆక్రమించుకొన్న; చిఱుతొడలును=పిక్కలును; [రాధికపిక్కలు మన్మథుని యమ్ములపొది మొదలగువానివలెనున్నవనుట] వలఁదతనంబులుఁ=లావుగా నుండుటలును; నలపందనములున్ = నిద్దంపుఁదనములు - నున్నగానుండుటలును; తద్దయున్ = మిక్కిలి; కరికరాకారంబులై = ఏనుఁగుతొండములవలె నున్నవయి; కరభనిభంబులై = మనికట్టుమొదలు చిటికెనవ్రేలిమొదటిదాఁకఁగల చేతి వెలుపలిభాగముతో సమానములయి; కనకకదళీమృదులంబులునైన = బంగరుటనఁటిబోదెలవలె మృదువులైన; పెందొడలును = తొడలును; [ఆమెతొడలు లావై, ఇంపై, నునుపుగలవై, ఏనుఁగు తొండములను, బంగారుటనఁటిబోదెలను పోలుచున్నవని భావము.] కరటిశిరఃకఠినంబును = ఏనుఁగు తలవలె కఠినముగ నున్నదియును; రథాంగరమాధురంధరంబును=చక్రమువంటి చక్కఁదనము కలదియును; పులినఘనంబును = ఇసుకతిన్నెవలె పెద్దదియు; జఘనంబును = పిఱుదును; [ఆమెపిరుదులు చక్రమువలె గుండ్రనై, ఇసుకతిన్నెలవలె పెద్దవై, ఏనుఁగుతలలవలె గట్టివై యున్నవనుట.] ఆవర్తవర్తులంబును=సుడివలె గుండ్రమైనదియు; నితాంతపున్నాగలతాంతకాంతంబును = లోకోత్తరమైన పొన్నపువ్వువలె మనోహరమైనదియును; ['పున్నాగలతాంతకాంతంబు = పువ్వువంటి మనోజ్ఞత కలది' అని పూర్వటీక.] అతిగంభీరంబు = మిక్కిలి లోతైనది; నాభిసరోవరంబును = సరస్సువంటి బొడ్డును; [రాధికనాభి సరస్సువలె లోఁతయి, సుడివలె గుండ్రనయి, పొన్నపువ్వువలె మనోజ్ఞమై యున్నదనుట.] అసితబిలేశయజాలకంబునకుఁ = నల్లనిత్రాచుపాముపిల్లకు; ఏలికయై = పాలకమయి - సమానమై; చలిచీమలచాలునకుఁ = చలిచీమలబారునకు; శైవాలవల్లికిఁ = నాఁచుతీగకు; తల్లియై = సమానమై; [ఆమె నూఁగారు నల్లత్రాచుపిల్లవలెను, చలిచీమలబారువలెను, నాఁచుతీగవలెను అందముగా నున్నదనుట.] ఆగడపలఁ, గడచివైచి = దొంతిమబ్బులను త్రోసిపుచ్చి - తిరస్కరించి - [వానితో సమానమై]; వీచీరేఖలఁ=అలలవరుసలను; పోఁద్రోచి = తిరస్కరించి - సామ్యమును పొంది; కుసుమసాయకకేళీకూళింగల = మన్మథుని క్రీడాసరస్సునందుఁగల; జాళువాసోపానంబులఁ = బంగారుమెట్లను; ప్రతిఘటించు= ఎదిరించు - పోలు; త్రివళీవిభాగంబును = కడుపుమీఁది మూఁడు మడతలును; [రాధాదేవివళిత్రయము దొంతిమేఘములను, అలలను, క్రీడాసరస్సునకుఁగల బంగారుమెట్లను పోలి యున్నదని భావము.] కమల......ప్రముఖంబులు, అగు = తామరమొగ్గలు, బంగారుకలశములు, ఏనుఁగుకుంభస్థలములు

మొదలగు; ఉపమాద్రవ్యంబుల క్రొవ్వు = సరిపోల్చువస్తువుల గర్వమును; ['పచారించి = వ్యాపించి' అని పూర్వటీక.] పంచారించి = కుదురునిండి నెలవుకొని; పిక్కటిల్లి = కదిసి; కక్కసించి = బాధించి; కవ జక్కవలన్ = చక్రవాకపక్షిద్వంద్వమును; పెక్కు వలలన్, పెట్టుచున్ = చాల వలలలో చిక్కుకొనునట్లు చేయుచు - బాధించుచు; చూపట్టు = కనఁబడు; దోర్మూలకూలంకషంబులగు = చంకలవఱకును వ్యాపించియున్న; లికుచకుచంబులును = గజనిమ్మపండ్లవంటి స్తనములును; [రాధ స్తనములు తామర మొగ్గలు, బంగరుకుండలు, ఏనుఁగుకుంభములు, చక్రవాకములు, నిమ్మపండ్లు అనువానిని పోలి కుదురు నిండి చంకలవఱకు వ్యాపించి వ్యామగ్రాహ్యములై యున్నవనుట.] ప్లక్షపల్లవవల్లభంబును = జువ్విచిగురు వలె మనోహరమును; చపేటపుటపరిస్ఫుటంబును = చాఁచిన వ్రేళ్లుగల అఱచేతిలోభాగమువలె ప్రకాశించునదియును; వేదీమధ్యనిభమధ్యంబును = యజ్ఞవేదికయొక్క నడిమిభాగముతో సమమగు నడుమును; ఫణిఫణాఫలకభాసురంబులును = పలకవంటి పాముపడగలవలె ప్రకాశించునవియును; తాంబూలీదళ తరుణంబులును = లేతమలపాకులవలె లేఁతవియు - అందమైనవియు; నిగనిగని = నిగనిగలాడు; పసిండి తగడున్ = బంగారు రేకును; తెగడు = తిరస్కరించు - పోలిన; కరమూలంబులును = కక్షములును (చంకలును); [ఆమెకక్షలు పాముపడగలవలెను, తమలపాకులరీతిని, బంగారురేకులవలెను ప్రకాశించుచున్నవనుట.] కందర్పకళలచెన్నునన్ = మన్మథునికొరడాలరీతిని; పూవుటెత్తులయెత్తునన్ = పూలసరములవిధమునను; ఋజు, గలిగిన = వట్రువతనము కలిగిన; జోకమీఱు = ఎక్కువ అందముగానుండు; వాలారుఁగొనగోరులును = వాఁడియైనకొనలుగల గోళ్లును; రక్తాంగుళిప్రవాళంబులునున్ = ఎఱ్ఱనివ్రేళ్లను చిగుళ్లు; నెత్తురుట్టిపడు = నెత్తురుగ్రక్కుచున్న - ఎఱ్ఱనైన; కరతలంబులును = అఱచేతులును; కంబుబిబ్బోకావహంబును = శంఖమునకు అనాదరము కలిగించునదియును - శంఖముచు తిరస్కరించునదియును; ['శంఖమునకు అందమును గలిగించునదియును' అని పూర్వటీక.] క్రముకఫలకమనీయంబును = పోఁకకాయవలె అందమైనదియును; ['క్రముకతరుకమనీయంబు = పోఁకమ్రానిమనోహరత్వము కలది' అనిప్రాఁతటీక] కోమలాంశుమత్ఫలాముకుళమోహనంబు = మృదువైన యరఁటిమొగ్గవలె చక్కనైనదియును; కంధరాభోగంబును = మెడయొక్క పరిపూర్ణతయును; సమ్మిశ్ర......నిబిడంబు, అగు = కలిసి - చేరియున్న రెండు మఱ్ఱిపండ్ల చక్కఁదనముచే దట్టమైనదగు; చిబుకంబును = గడ్డంబును; మధురిమన్, అమరు = తియ్యదనము కల; అధరబంధుజీవప్రసూనంబును = మంకెనపువ్వువంటి పెదవియును; మొల్లలన్ = మల్లెపువ్వులను; ఉల్లసంబాడి = పరిహసించి; ఆణిముత్తియంబులను = గుండ్రనిముత్యములను; ఉత్తరించి = దాటి-మీఱి; సుధాబిందువులన్ = అమృతపుఁజినుకులను; పలునరసులన్ = అనేకములగు బావ, మామ, మొదలగు వావుల చేత; పలువరుసయు = దంతపంక్తియును; సంధ్యారాగరంజితంబగు = సాయంకాలపు ఎఱ్ఱనికాంతిచే రంగుపూయఁబడిన; కళారాజరేఖపొత్తు = కళామాత్రపురూపుగల చంద్రుని స్నేహమును - చంద్రుని పోలికను; పడయు = పొందు; ఉత్తరోష్ఠపుటంబును = మీఁదిపెదవియును; పరిస్ఫుట......మార్గంబునుం బోని = స్పష్టముగనున్న ముక్కునుండి వచ్చు సువాసనతోడి యూర్పులవ్యాపనమునకు సమర్థమైన దారివలెనున్న; ['మంచివాసనతోడి యూర్పుల ప్రసరణముయొక్క అడ్డములేని చుఱుకుగల దారి' అని పూర్వటీక.] అయ్యూర్ధ్వోష్ఠబింబఫలంబుమీఁది = దొండపండువలెనున్న ఆ మీఁదిపెదవిపైనున్న; నిమ్నభావంబును = పల్లమును; సూనసాయకు దోనివిల్లును = మన్మథుని అల్పమైన ధనుస్సును; పల్లవకరవాలు = చిగురు కత్తిగాఁ గల మన్మథునియొక్క; లాంగలాయుధంబును = పుష్పాయుధంబును; సామివికసితచంపకకోరకంబును = సగమువిచ్చిన సంపంగిమొగ్గను; నివ్వటిల్లు = అతిశయించు; ఉల్లక్షిత నాసికాశిఖరంబును = మీఁదికి నిక్కిన ముక్కుమొనయును; శీతమయూఖరేఖాసఖంబు = చంద్రరేఖతో సమానమైనది; నింబకిసలయంబులకున్ = వేఁపచిగుళ్లకు; అపనయంబు = త్రోసివేయుట - తిరస్కారము; ఎక్కసక్కెంబు సేయుచున్ = పరిహసించుచు; కాయజు సింగిణులవంగడంబు = మన్మథుని విండ్ల వంశము; నెలవంకకన్నుబొమలకొమలును = చంద్రవంకలవలెనున్న కన్నుబొమలచివళ్లును;

సారసంబుల దారసంబును = సారసపక్షుల అతిశయమును - గొప్పతనమును; మెఱపులయొఱపును = మెఱపుల యందమును; మరుతూపులకొప్పును = మన్మథబాణముల విధమును; ఏణనేత్రంబులవైచిత్రియుఁన్ = జింకకన్నులచమత్కృతియును; విసూత్రితంబులు = సూత్రములు లేనివి - విఘటితక్రములైనవి - ఒక ఏర్పాటు లేనివి; శ్రవణపుటకూపపతయాళువులగు=చెవులను నూఁతులందు పడు స్వభావముకల; దర్పణంబుల దర్పంబును = అద్దముల గర్వమును, ఓజయున్ = విధమును; సుధాకలశంబుల = అమృతభాండముల; విలసనంబును=చక్కఁదనమును; (పెదవులందు సుధ యుండుటచే ముఖము అమృతకలశముతోఁ బోల్పఁబడెను.) అంబురుహాబింబంబుమదంబును = చంద్రబింబముగర్వమును; అశేష......భాస్వరంబగు = సమస్తకళాసమూహమును అలపించు వాద్యముయొక్క స్వరముచే ప్రకాశించునట్టి; [" పాణింధమము = ఊఁదుతిత్తి" అని పూర్వటీక.] వదనవలయంబును = గుండ్రనిముఖమును; జోక = విధము; ఒప్పికయున్ = అందమును; పోసరించి = పోత్రరించి - అతిశయించి; వాసివడయం = అందము పొందిన; శ్రుతిశష్కులికలును = చక్కిలములవంటి చెవులును; నిష్కలంకంబులై = లోపములేనివై; నిబిడంబులై = నిండుకలిగినవై; స్నిగ్ధంబులై = నునుపుగలవయి; నిరంధ్రంబులై = సందులేనివై; నీలంపుగుంపులసొంపులు = ఇంద్రనీలముల మొత్తముల యందములను; ఆమతించు = పూజించునట్టి-పోలునట్టి; నెఱికురులున్ = నొక్కులుగలజుట్టును; వలరాజునెత్తపలక ఠలకునన్ = మన్మథుని సొగటాల పలక విధమున; వీఁపునన్ = వీఁపుతోను; ఏపారి = అతిశయించి; ఆ పారిజాతామోద = పారిజాతము వంటి పరిమళముగల యా రాధిక; మేదురవిలాసంబులన్ = అతిశయించిన విలాసములతో; భాసిల్లెన్ = ప్రకాశించెను. [ఇచట 'ఆమోదమేదుర=పరిమళాతిశయముయొక్క' అని పూర్వటీక. అది అననుగుణము.]

ఆ. వివిధయువతికోటి వేమఱు సృజియించి, యవ్వధూటిఁ జేయ నజుఁడు తలఁచి
కేలుదోయిఁ గడుగ వ్రేళులతుద నంటు, జలకణంబులేమొ సతి[1]నఖాళి. 180

టీక. అజుఁడు = బ్రహ్మ; వేమఱు = పెక్కుసారులు; వివిధయువతికోటిన్ = పెక్కురకముల స్త్రీలగుంపును; సృజియించి = సృష్టిచేసి - (ఆమీఁదనే); అవ్వధూటిన్ = ఆ రాధాదేవిని; కేలుదోయిన్ = రెండు చేతులను; సతినఖాళి = రాధవ్రేలిగోళ్లు; అలం. ఉత్ప్రేక్ష.

తే. అంబుజానన పెందొడ లరఁటు లగుట, [2]వానఁ గలిగిన లావణ్యసూనభరము
వలనిపైరేకు లొకరెండు వ్రాలి బోరగిలఁబడినరీతి మీఁగాళు లలరు సతికి. 181

టీక. అంబుజాననపెందొడలు = రాధాదేవియొక్క ఊరువులు; అరఁటులగుటన్ = అరఁటి బోదెలగుటచేత; వానన్ = వానినుండి; కల్గిన = పుట్టిన, లావణ్యసూనభరమువలనిపైరేకులు = లావణ్యమను పూగుత్తియందలి దళములు; మీఁగాళులు = పాదములమీఁదిభాగములు. [ఇచట 'వానఁగలిగిన' అనుటఁబట్టి వానవలన అరఁటులు పుష్పించు నను నర్థమును ధ్వనితమగుచున్నది.] అలం. ఉపమ, రూపకము.

క. మదిరాక్షీజంఘ లంగజు, గదబగు [3]నూహింపఁగావు కాహళు[4]లైన
[5]న్నదుకువడక [6]గీపెట్టక, పదను దివిసి రాగిదేటి పలుకకయున్నే. 182

టీక. మదిరాక్షిజంఘలు = మదమును కలిగించు - మోహింపఁజేయు చూపులుకల రాధయొక్క పిక్కలు; అంగజుగదలు, అగున్ = మన్మథుని గదలయి యుండును; ఊహింపన్ = ఆలోచింపఁగా; కాహళులు, కావు = బాకాలు కాఁజాలవు; ఐనన్ = బాకాలయి యుండినయెడ; అదుకు

---

1. ట. సఖాళి. 2. క. దాన.చ. వాన. 3. చ. నూయింప. 4. చ. ట. లైతే. లలియేనదుగు. శ. ర. 5. చ. నదుకు. 6. చ. ని. ట.గ్గిపెట్టక.

వడక = ఆతుకులు లేక; గీపెట్టక = ధ్వనిచేయక; పదను దివిసి = పరిపాకదశను సారమును ఆకర్షించి; రాగదేఱి = ఎఱుపెక్కి, అనురాగమును పొంది; పలుకకయున్నె = (స్వరములను) పలుకకుండునా?

కాహాళులు పదనున పడుటకు ఆతుకులు పడును - గీమనును; రాగిదేఱునట్లు చేయఁబడును. ఈ రాధికజంఘులకు అతుకులులేవు; ఇవి గీపెట్టవు. అయినను పరిపాకదశను పొంది, ఆకర్షణీయములై యున్నవని భావము. అలం. రూపకము, వ్యతిరేకము.

తే. కరికరంబులు త్వగ్దోషకల్మషంబు, నపనయింపంగ సతియూరువులై పొడమియుఁ
బుష్కరంబులతగులంబు బూనెఁ [1]జరణదంభమునఁ; బూర్వవాసన† తలఁగు నెట్లు?

టీక. కరికరంబులు = ఏనుఁగుతొండములు; త్వగ్దోషకల్మషంబున్ = చర్మమునందలి కాఠిన్య మను పాపమును (లేక - చర్మమునందలి దోషమైన నలుపును); అపనయింపంగన్ = పోఁగొట్టు కొనుటకయి; సతియూరువులై = రాధయొక్క తొడలయి; పొడమియున్ = పుట్టియును; చరణదంభమునన్ = పాదములను నెపమున; పుష్కరంబులతగులంబున్ = పుష్కరములతోడి - (తామరపూవుల తోడి) సంబంధమును పొందెనని యూరుపక్షమునను, తొండముచివఱఁగల యంగములయొక్క సంబంధమునని తొండములపక్షమునను అర్థము; పూనెన్ = పొందెను - వహించెను. పూర్వవాసన వెనుకటి జన్మపువాసన; తలఁగుట, ఎట్లు? = ఎట్లు తొలఁగిపోఁగలదు? అలం. విషమము. అర్థాంతరన్యాసము.

తే. బిసరుహాననకటిసీమ పృథివి యగుట
నిక్క; మటుగాకయున్నఁ బై నెలవుకొనునె?
కాంచియును మధ్య మాయయుఁ గమ్రనాభి
లక్ష్మియును ద్వారవతియు సలక్షణముగ. 184

టీక. బిసరుహాననకటిసీమ = పద్మముఖియైన రాధయొక్క మొల; పృథివి = భూమి; పైన్ = దానిపైభాగమునందు; కాంచియును = (భూమిపక్షమున) కంచియనుపట్టణమును, (కటిపక్షమున) మొల నూలును; మధ్యమాయయున్ = (భూ. ప.) మధ్యమున హరిద్వారక్షేత్రమును, (క. ప.) మాయయైన ఆకాశరూపమైన నడుమును; కమ్రనాభి లక్ష్మియును = (భూ. ప.) చక్కని నడిమిభాగపు శోభయును, (క. ప.) చక్కని బొడ్డుయొక్క అందమును; ద్వారవతియున్ = (భూ. ప.) ద్వారకయను పట్టణమును, (క. ప.); ద్వారముకలదియు సలక్షణముగన్ = బాగుగ; నెలవుకొనునె? = స్థిరమయి యుండునా? అలం. రూపకము, కావ్యలింగము.

తే. సకియనాభియమునసుండి జవ్వనంపు, బాలకృష్ణుండు వెడలింప బయలుపడిన
కాళియఫణీంద్రుఁ డేమొ రోమాళి మధ్యవిష్ణుపదమున [2]కణఁగినవిధముగలిగె.

టీక. వెడలింపన్ = తఱిమివేయఁగా; బయలుపడిన = బయటకు వెడలిన; కాళియఫణీంద్రుఁడేమొ! కాళియుఁడను పామేమోయేమో! రోమాళి = నూఁగారు; మధ్యవిష్ణుపదమునకున్ = నడుము అను నాకాశమునకు; విష్ణువుయొక్క పాదములకు; అణఁగినవిధము = లొంగినరీతి-నమస్కరించు పద్ధతియుఁ; కలిగెన్ = ఏర్పడెను. అలం. రూపకము, ఉత్ప్రేక్ష.

శా. మానవతీలలామతనుమధ్యము నన్ గజవైరి కుల్క త
ద్ధ్యానమరున్మదావళము యౌవనపుంబొదరిల్లు దూఱఁ [3]బైఁ
గానఁగవచ్చుకుంభములు కావుగదా కుచకుంభయుగ్మకం!
బొ; నటులైన వల్లభ[4]నఖాంకుశరేఖలు [5]గల్గు మీఁదటన్. 186

1. క. చరణ. †నఁదలఁగు. సూర్య. 2. చ. నడిగి. డ. కడగిన. 3. క. గా. చ. ట. బై. 4. చ. నఖాంకుర. క. గల్గి. క. నణఁగి. ట. నఖాంకుశయోగ్యతగల్గు. 5. క. మీటగున్. చ. ట. మీఁదటన్.

కటీ. మానవతీలలామతనుమధ్యమమర్ = రాధికయొక్క సూక్ష్మమైన (సన్నని) నడుము అను; గజవైరికిన్ = సింహమునకు; [మధ్యమునకు సింహసామ్యము కవిసమయసిద్ధము.] ఉల్కి = భయపడి; తద్యానమరున్మదావళము = ఆమె గమన (నడక) మను దేవతలయేనుఁగు - ఐరావతము; యావనపుంబొదరిల్లు = యౌవనమనెడి పొదరుటింటిని; దూఱన్ = ప్రవేశింపఁగా-అందు దాఁగుకొనఁగా; కుచకుంభయుగ్మకంబు=కుంభమువంటి స్తనములు; పైన్=(అమీఁదగా)అమీఁదుగా-బయటికి; కానఁగవచ్చు=కనఁబడుచున్న; కుంభములు, కావుగదా! = (ఏనుఁగు) కుంభస్థలములేమో! కాన్ = అగుచు - అవి కుంభస్థలములే; అటులైనన్ = అట్లగుటవలన; మీఁదటన్ = ముస్తుందు; వల్లభనఖాంకుశరేఖలు = ప్రియునియొక్క గోళ్లనెడి యంకుశముల చిహ్నములు - నఖక్షతములు; కల్గున్; అలం. రూపకము.

తే. వఱలు లావణ్యవారిధివలన నిగుడు, వీచిలతికలు కాఁబోలు వెలఁదికేలు
విపులకంకణమంగుళివిద్రుమంబు, మత్స్యరేఖాంకితము నగు మహిమకలిమి. 137

టీక. వెలఁదికేలు = రాధయొక్కహస్తములు; వరలు = ప్రకాశించు; లావణ్యవారిధివలనన్ = తళుకుదనమను సముద్రముచుండి; నిగుడు = వ్యాపించు - పుట్టు; వీచిలతికలు, కాఁబోలున్ = తీఁగలవంటి అలలు కాఁబోలును; విపులకంకణము = విస్తారమగు జలకణము; గొప్పదైన చేతికడియమును; అంగుళీవిద్రుమంబున్=వ్రేళ్లను పగడములును; ['విద్రుమంబు = చిగురు, పగడము' అని పూర్వటీక. ఇఁట చిగురు అప్రసక్తము.] మహిమ, కలిగి; మత్స్యరేఖాంకితమున్ = చేఁపలచాలు (వరుస)తో గూడినది, చేప రేఖలతోఁగూడినదియును. అగున్; అలం. ఉత్ప్రేక్ష, ఉపమ.

తే. ముదితకరమూలముల యొప్పు మ్రుచ్చిలించి
యీకయుండిన నొక్కొ నాళీకభవుఁడు
[1]ఫణిగణంబులఁ దదోభగపద్మరాగ
యోగమున జాలు మోపించుచున్న వాఁడు. 138

టీక. ముదితకరమూలములయొప్పున్ = రాధయొక్క చంకల చక్కదనమును; మ్రుచ్చిలించి = (కర్త - ఫణిగణము) దొంగిలించి; ఈయకుండిననొక్కొ! = ఈయకపోవుటచేతఁగాబోలును; నాళీకభవుఁడు = బ్రహ్మ; ఫణిగణంబులన్ = పాములగుంపులచేత; తదోభగపద్మరాగయోగమునన్ = వాని పడగలయందు మణులు కూర్చుటచేత; జాలు = జాళ్లను; మోపించుచున్న వాఁడు = మోయునట్లు చేయుచున్నాఁడు. దొంగలకు జాళ్లుమోయునట్టి శిక్ష ప్రసిద్ధము. అలం. ఉత్ప్రేక్ష, లోకోక్తి.

ఆ. కంబుపాణి తనకుఁ గాంతుండుగాఁగల్గు, టెఱిఁగి కంఠకంబు నింతి దాల్చె
నొక్కొ! యొప్పుగాదె యుత్తమసతులకుఁ,బతులు పూనినట్టి వ్రతము దాల్ప.189

టీక. కంబుపాణి = శంఖము చేతియందుఁ గల విష్ణువు; కాంతుఁడు = భర్త; కాఁగల్గుట = కాఁబోవుటను; ఇంతి = స్త్రీ - రాధ; కంఠకంబున్ = శంఖమువంటి కంఠమును; తాల్చెనొక్కొ! = కలిగియుండెనా యేమి? అలం. అర్థాంతరన్యాసము, ఉత్ప్రేక్ష.

తే. సోమబింబాస్య [2]దళనవాసోమతల్లి, †యొప్పుఁజంద్రిక నెఱి[3]డాలు గుప్పళించి×
జిలుగుఁబలుచనివాసోవిశేషములకుఁ,జెన్నొసఁగుఁగాదె యెటువంటి [4]వన్నెకలిమి.

టీక. సోమ......మతల్లి = రాధయొక్క మేలైన పెదవి; చంద్రికనెఱడాలు = వెన్నెలయొక్క చక్కనికాంతిని - కుసుంభా వర్ణమును; గుప్పళించి = పుట్టించి; ఒప్పున్ = వెలయును; వాసోవిశేషములకున్ = వస్త్రములకు; వన్నెకలిమి = రంగుయొక్క సంపదయు; చెన్ను = కాంతిని;

---

1. చ. క. ఫణంబులు. 2. చ. వదన. శ. ర. కొప్పు. 3. చ. వాలు. 4. క. కన్నె. చ. వన్నె. చెన్ను. శ. ర.

ఒనఁగుఁగాదె! = కలుగఁజేయును. గదా! ['కన్నెకలిమి = నూతనసంపద' అని పూర్వటీక.] అలం. దృష్టాంతము.

తే. అలరుఁదేనియ నానిచి మొలకగట్టి,శర్కరాబీజములు* సుధాశాదభూమి
భావజుఁడు విత్తమొలచినపైరు[1] నెఱపె,రదవిలాసంబు పూఁబోఁడిపెదవిపదవి,

టీక. భావజుఁడు = మన్మథుఁడు; అలరుఁదేనియన్, నానిచి = పూఁదేనెయందు నానవేసి; [అట్లు నానవేసిన మొలకలెత్తుట సులభము.] శర్కరాబీజములు = చక్కెరమొలకలను; సుధాశాద భూమిన్ = అమృతముచే పదనుచేసిన నేలపయి; విత్తన్ = నాటఁగా; పైరు = పంటయే; రదవిలాసంబు = దంతముల శోభను; పూఁబోఁడిపెదవిపదవి = రాధయొక్క పెదవియొక్క సౌభాగ్యమును; నెఱపెన్ = వ్యాపింపఁజేసెను. అలం. ప్రౌఢోక్తి.

తే. దాడిమీబీజరాజికెందళుకు మొల్ల,మొగ్గలపిసాళమును [2]ముత్తెముల సుపాణి
తమ్మి[3]పూవింటఁ గొలువున్న నెమ్మి వడయు,దంతురాలకసుస్నిగ్ధదంతపంక్తి. 192

టీక. దంతు......పంక్తి = నొక్కులతోఁగూడిన ముంగురులు కల రాధయొక్క పలువరుస; దాడిమీబీజరాజికెందళుకు = దానిమ్మగింజల యెఱ్ఱనికాంతియు; మొల్లమొగ్గల పిసాళము = మల్లెమొగ్గలకాంతియు; ముత్తెములసుపాణి = ముత్యముల స్వచ్ఛమైన మెఱుఁగును; తమ్మిపూవింటఁగొలువున్ననెమ్మిన్ = పద్మమను పద్మమున కింజల్కముల చక్కఁదనమును; పడయున్ = పొందును.

[రాధ దంతములు దానిమ్మగింజలయు, మల్లెలయు, ముత్తియములయు పద్మములకింజల్కముల ముత్యములయుం గాంతిపలెను ఉన్నవనుట.] అలం. ఉపమ.

తే. క్షీరకంఠంబు* లని బ్రహ్మవారువముల
గెంటసంబాడు నడగల్గు కిసలయోష్ఠి
సుస్వరము లెక్కగనునోటు! †సూడ నిత్య
పల్లవగ్రాహిపాండిత్య*పరభృతముల. 193

టీక. బ్రహ్మవారువములన్ = బ్రహ్మకు వాహనములైన హంసలను; క్షీరకంఠంబులని=ఇంకను పాలు త్రాగుచున్నవని - పసివని - నేర్పు లేనివని; [హంసములు క్షీరమును త్రాగునవనుట ప్రసిద్ధము.) గెంటసంబాడు = పరిహాసముచేయునట్టి - అతిక్రమించునట్టి; నడగల్గు = నడక కలిగిన; కిసలయోష్ఠి సుస్వరము = చిగురువంటి పెదవిగల ఆ రాధాదేవియొక్క చక్కని గొంతుక; చూడన్ = ఆలోచింపఁగా; నిత్య......తములన్ = ఎల్లపుడును పూర్తిగాఁగాక, చివఱ నందుకొను పాండిత్యముగల కోకిలములను; [కోకిలములు ఎల్లపుడును పల్లవములను (చిగుళ్లను) గ్రహించి (తిని) పాండిత్యమును పొందుచుండుట ప్రసిద్ధముకదా!] లెక్కసేయునోటు ! లెక్కచేయుఁనా? - చేయదు.

[రాధికనడక హంసనడకను, స్వరము కోకిలస్వరమును అతిక్రమించి యున్నవని భావము.] [ఇచట 'ఓటు = ఓటమి - అపజయము; పల్లవగ్రాహి = చిగుళ్లను గ్రహించునది - విటులను గ్రహించునది' అని పూర్వటీక. అది అననుగుణము.]

క. వదనారవిందదళముస, మృదుగతిఁ జను మందహాసమిషచంద్రిక ల
ష్మదదంతావళిగమనకు, సుదధిశయన దృక్చకోరయుగహర్షదముల్. 194

* శ. ర. ముల. 1. చ. రెల (ర) - ట. నేర. క. పేర, వెద శ. ర. నెఱపె, రద. 2. క. ముత్యముల. చ. ముత్తెముల. 3. క. పువ్వింట. చ. ట. పూవింట. † క. సూపి. * క. పరభృతములు.

టీక. వదనారవిందదళమునన్ = ముఖమనెడి తామరపూవు రేకుపయి; మృదుగతిన్ = మెల్లగా; చను = నడుచు - వ్యాపించునట్టి; మందహాసమిషచంద్రికలు = చిఱునవ్వులనెడి నెపముగల వెన్నెలలు; ఉద......హార్షదముల్ = విష్ణుని రెండు కన్నులు అను చకోరములకు సంతోషమును కలిగించునవయి; అమ్మదదంతావళగమనకున్ = గజయాన యగు నా రాధకు; [అమరునని శేషము.] అలం. ఉపమ, రూపకము, అపహ్నుతి.

తే. యువమనోజాంగలక్షేత్ర [1]మొత్తరించి
గరుసువడ దున్ను మదనలాంగలికు హాలము
కామినీమణిముక్కుటుగాక యున్న
నాసికాభరణపుఁ[2]గట్టు నాటునోటు. 195

టీక. యువ......క్షేత్రము = యువకుల మనస్సనెడు మెరకనేలను; ఒత్తరించి=ఆక్రమించి - (మొక్కలు మొదలగువానిని కొట్టివేసి) సరిచేసి; గరుసువడన్ = అనుకూలమగునట్లు - మెత్తపడఁగా అనుట; దున్ను = దున్నునట్టి; మదనలాంగలికు హాలము = మన్మథుఁడను కర్షకుని నాఁగలియే; కామినీమణిముక్కు = రాధికముక్కు; నాసికాభరణపుఁగట్టు = అడ్డిగయను నాఁగటినక్కును; నాఁటునోటు?= నాఁటునాయేమి? అలం. రూపకము, కావ్యలింగము.

క. బిసరుహారజమునఁ బైకం, దుసిమిన [3]ధగధగ వెలుంగు నుడురాజుక్రియన్
[4]కిసలయపాణిముఖాంబుజ, మసమాయుధు [5]సౌధకుంభ మై జృంభించున్. 196

టీక. బిసరుహారజమునన్ = తామరపుప్పొడితో; పైకందు = పైనున్న నలుపును; (మచ్చను); ఉసిమినన్ = (తోమి) తుడువఁగా; ఉడురాజుక్రియన్ = చంద్రునివలె; కిసలయపాణిముఖాంబుజము = రాధముఖపద్మము; అసమా......కుంభమై = మన్మథుని భవనముమీఁది కలశమయి; జృంభించున్ = విజృంభించును - ప్రకాశించును. అలం. ఉపమ.

క. ఆవృ[6]త్తోన్మీలితరా, జీవములకు మరుపతాకజీవంబులకున్
జీవంజీవంబులకా, జీవంబులు చెలువకన్నుసిరులమెఱుంగుల్. 197

టీక. చెలువ......మెఱుఁగుల్ = రాధికన్నులకాంతులు; ఆవృత్తోన్మీలితరాజీవములకున్ = వర్తులమయి, విరిసిన తామరపూవులకును; మరుపతాకజీవంబులకున్ = మన్మథుని ధ్వజములగు చేఁపలకును; జీవంజీవంబులకున్ = చకోరములకును; ఆజీవంబులు = బ్రతుకుతెఱువులయినవి - ఆశ్రయింపఁదగినవి. అలం. ఉపమ.

తే. [7]వాసుదేవ నానాశక్తివైభవంబు
రుక్మిణీసత్యభామల[8]రూపరేఖ
యిదియె [9]వహియించునని నల్వ యిడిన[10]పదునొ
కొంటి లెక్కనఁ గనుబొమ్మ లువిద కమరు. 198

టీక. వాసుదేవ......వైభవంబున్ = భగవంతుని తొమ్మిదిశక్తుల సంపదలును - [శక్తులు 9. ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి. ఉత్సాహశక్తి, ప్రభుత్వశక్తి, మంత్రశక్తి, సత్త్వశక్తి, రజశ్శక్తి, తమశ్శక్తి] ఇదియె = ఈ లెక్కయే; నల్వ = బ్రహ్మ; ఇడిన = ఉంచిన - ఏర్పఱచిన; పదునొకొంటి లెక్కనన్ = ఏకాదశ (౧౧) సంఖ్య యనునట్లు; ఉవిదకున్ = రాధకు; అమరున్. అలం. ఉత్ప్రేక్ష.

---

1. ట. శ. ర. మొత్తరించి. 2. చ. ట. గీర్తి. 3. దగదగ. 4. క. బిసరుహ. ట. శ. ర. కిసలయ 5. క. యుష. చ. యుధు. 6. క. త్తోర్మిలులిత. చ. త్తోన్మీలిత. 7. క. వాసుదేవాదినవ చ. వాసుదేవ నానా. ట. వామదేవ్యాది. 8. చ. రూపు. 9. చ. వసియించు. 10. చ. పదనొ.

మ. పడఁతి[1]ముఖాంశునిష్కములు భాసురవర్ణలలాటపత్త్రకం
బిడి ఋణలీలఁ గైకొనియె నిందుఁడు నర్ధము సాక్షిగాఁగ నె
న్నఁడొ; జలజాత మప్పు జతనంబుగఁ దీర్పనిబల్మినొక్కొ పే
రడుసున నీట నెండ నిల నాఁగిన దూఁగిన నోర్చుచుండుటల్. 199

టీక. జలజాతము = పద్మము; ఎన్నఁడో = ఎప్పుడో - చాలకాలముక్రిందటనే; పడఁతి ముఖాంశునిష్కములు = రాధముఖకాంతులనెడు నాణెములను; ఇందుఁడుఁ = చంద్రుఁడును; అర్ధముఁ, సాక్షిగాఁగఁ; భాసుర......పత్త్రకంబు, ఇడి=ప్రకాశించు వర్ణములు కల [వర్ణములు = అక్షరములు (పత్త్రకపక్షమున) (చందనాదికముల పూఁతలు అని లలాటపక్షమున అర్థములు.] నుదురు అను పత్త్రమును, వ్రాసి; ఋణలీలఁ = అప్పుగా; కైకొనియెఁ = తీసికొనెను; అప్పు = ఆ యప్పును; జతనంబుగఁ = ప్రయత్నముతో - ప్రయత్నించి; తీర్పనిబల్మినొక్కొ! = తీర్పకపోవుటచేతనైన బల వంతముచేఁగాఁబోలు! పేరడుసునఁ = పెద్దబురదలోను; నీటఁ; ఎండఁ; ఆఁగినఁ = (బురదయందు) ఆఁటంకపఱచినను - నిలిపినను; దోఁగినఁ = (నీటియందు) ముంచినను; ఓర్చుచుండుటల్ = సహించుటలు; [ఇట్టివన్నియును అప్పుతీర్చనివారికిఁజేయు శిక్షలని గ్రాహ్యము.] అలం. రూపకము, ఉత్ప్రేక్ష.

తే. సితకరశ్రీఁ బయోరుహశ్రీని జేయుఁ, గాంత[2]మొగ మని శ్రుతిపుటకైతవమున
నలువ వ్రాసిన శ్రీకారములయుగంబు, వర్ణనాతీతరుచి మించు కర్ణయుగళి. 200

టీక. కాంతమొగము = రాధముఖము; సితకరశ్రీఁ = చంద్రుని'శ్రీ'ని - శోభను; పయోరుహశ్రీని = పద్మముల'శ్రీ'ని-సొగసును; చేయును+అని; నలువ = బ్రహ్మ; శ్రుతిపుటకైతవమునఁ = కర్ణములను నెపమున; వ్రాసిన; శ్రీకారములయుగంబు = (రెండుప్రక్కల) రెండు శ్రీకారములుగా; కర్ణయుగళి; వర్ణనాతీతమయి = వర్ణింప నసాధ్యమయి; ఒప్పుఁ = ప్రకాశించును అలం. ఉత్ప్రేక్ష.

సీ. ముఖమంబురుహమని ముమ్మరంబుగ నప్పళించు తేనియ[3]దిండి [4]లెంక లనఁగ
నాననచంద్రుని యంకకర్దమ మొకకడ కోసరించిన పొడ వనఁగ
నధరసుధాపూరితాస్యహేమకలశి మూసిన నీలంపుమూఁకు డనఁగ
వదనపద్మనిధిపై వ్రాలిన యువమనో మోహాంధకారసమూహ మనఁగఁ

ఆ. గఱకుఁదనముఁ జాలఁ దఱచుఁదనంబును, నెరులసిరులు గలిగి విరులపేరి
కీర్తి [5]బుగులుకొనఁగఁ గిసలయాధర కొప్పు, కొప్పుకప్పు మీఱి [6]యొప్పుటొప్పు

టీక. అంబురుహము, అని = పద్మమని; ముమ్మరంబుగఁ = దట్టముగా; అప్పళించు = కప్పు నట్టి; తేనియదిండిలెంకలు = తుమ్మెదబంట్లు; ఆనన......కర్దమము = ముఖచంద్రుని మచ్చయను బురదను; ఓసరించిన = త్రోసివేసిన; పొడవు = రూపు; అధర......కలశిఁ =పెదవియందలి అమృతము గల ముఖ మను బంగారుచెంబును; వదనపద్మనిధిపైఁ = ముఖమను పద్మరూపనిక్షేపముపయి; యువ......సమూహము = యువకుల మనస్సులోని ప్రేమరూపమగు నజ్ఞానపుగుంపు; కఱకుఁదనముఁ = కఠినత్వమును; తఱచుఁదనంబును = దట్టముగా నుండుటయుం; నెరులసిరులుఁ = వెంద్రుకలసంపదలును; విరుల పేరికీర్తి = పూవులనెడి కీర్తి - కీర్తివలె తెల్లనైన పూలు; బుగులుకొనఁగఁ = వ్యాపింపఁగా; కప్పుమీఱి= నలుపును అతిశయించి. అలం. ఉత్ప్రేక్ష.

క. వలరాజు కేలివాలుం, బలుకయు బలె నలరు వేణి పాణింధమమై
లలితాంగి వెన్నుకట్టియ, *తళతళ మను కుంపసంపుఁ [7]దగఁ జూడఁ దెగడున్. 202

---

1. చ. ముఖంబుశుమ్మ. 2. చ. ముఖమని. 3. చ. దండిలేగలనఁగ. 4. శ. ర. లేకలనఁ
5. చ. బులుగు. 6. చ. యిప్పుడొప్పు. *క.ధళధళ.శ. ర. తళతళ. 7. చ. తగదఁ.

టీక. వేణి= రాధజుట్టు; వలరాజుకేలివాలుంబలకయుంబలెన్ = మన్మథునిచేతిలోని కత్తి, డాలు వలె; కుందనంపుంద్రగడున్ = బంగరు రేకను; తెగడున్ = తిరస్కరించును. అలం. ఉపమ.

శా. ఈ ధారన్ భువనైకమోహనకళాహేలావిలాసంబులన్
రాధాకన్యక ధన్యకాంతిఁ దనరారన్ దద్వశా[1]శారతిన్
గోధుగ్బాలకదివ్యమూర్తి యగు శ్రీగోవిందుఁ డంభోజినీ
మాధుర్యంబున కగ్గలించు నళిసమ్రాడాకృతిం గైకొనున్. 203

టీక. ఈధారన్ = ఈవిధముగ; భువనైక.....విలాసంబులన్ = లోకములను మోహింపఁ జేయు కళావిలాసములచే; తనరారన్ = ప్రకాశింపఁగా; తద్వశాశారతిన్ = ఆమెయెడఁగల కోరిక యందలి ఆసక్తిచే; గోధుగ్బాలకదివ్యమూర్తి = గొల్లపిల్లవానిరూపున అవతరించినవాఁడు - కృష్ణుఁడు; అంభోజినీమాధుర్యంబునకున్ = పద్మమకరందమునకు; అగ్గలించు = ఉత్సహించునట్టి; అళిసమ్రాడాకృతిన్ = తుమ్మెదరాజునాకారమును; కైకొనున్ = గ్రహించును. అలం. ఉపమ.

క. ఆ రాధామాధవులకుఁ, గోరిక లన్యోన్యహృదయకోటరముల నం
కూరితము లయ్యె దినముఖ, వారిజగర్భముల నుబ్బు వాసనల క్రియన్. 204

టీక. అన్యోన్యహృదయకోటరములన్ = పరస్పరము చెట్టుతొఱ్ఱలవంటి మనస్సులలో; అంకూరితములు = పుట్టినవి; దినముఖవారిజగర్భములన్ = ప్రాతఃకాలమునందలి పద్మముల గర్భములందు; ఉబ్బు = పొంగు; వాసనలక్రియన్ = పరిమళములవలె. అలం. ఉపమ.

శా. చాణక్య[2]ప్రతిభావభావ! సుషమాసర్వస్వపుష్పాస్త్ర! శ్రీ
వాణీనిత్యనివాసనేత్రముఖ! సేవాసావధానాఖిల
క్షోణీనాథ! చమూపనందన! భుజాకోదండలంకారి! య
క్షీణోదర్క జితార్క! సూనృతలతాశృంగారచైత్రాగమా! 205

టీక. చాణక్యప్రతిభావభావ! = చాణక్యునితో సమమగు స్వభావము కలవాఁడా! సుషమాసర్వస్వపుష్పాస్త్ర! = పరిపూర్ణమగు శోభకు మన్మథుఁడైనవాఁడా! శ్రీవాణీనిత్యనివాస నేత్రముఖ! = సంపదయు, సరస్వతియు నెల్లప్పుడును నెలకొనియుండు నేత్రములు, నోరు కలవాఁడా! [కన్నులందు సిరియు, నోట విద్యయు కలవాఁడవనుట.] సేవా......నాథ! = సేవించుటకు వచ్చిన సమస్తభూపాలురును కలవాఁడా! చమూపనందన! = సేనాధ్యక్షునికిఁ బుత్త్రుఁడవైనవాఁడా! భుజాకోదండలంకారి! = భుజశక్తిచే శ్రీరాముఁడైనవాఁడా! అక్షీణోదర్కజితార్క! = తక్కువకాని ఫలములచే జయింపఁబడిన యింద్రుఁడు కలవాఁడా; ['అక్షీణోదర్క! = తక్కువకాని భవిష్యత్ఫలములు కలవాఁడా! జితార్క! = (తేజస్సుచేత) జయింపఁబడిన సూర్యుఁడు కలవాఁడా!' అని పూర్వటీక.] సూనృత... ...గమా! = సత్యమను లతకు శృంగారమైన వసంతర్తువయినవాఁడా!

క. సకలాస్థానసరోవర, నికరమరాళాయమాన! నిజకీర్తివిభా
ముకురప్రతిఫలితదయా, సుకృతవితరణప్రతాపశుభముఖ్యగుణా! 206

టీక. సకలా......మరాళాయమాన! = సమస్తములగు నాస్థానములను సరోవరములకును హంస యగువాఁడా! నిజ...గుణా! = స్వకీయమగు కీర్తియొక్క విశేషకాంతి యను అద్దమునందు ప్రతిబింబించు దయ, సుకృతము, త్యాగము, ప్రతాపము మొదలగు ప్రధానములైన శుభగుణములు కలవాఁడా! అలం. రూపకము.

---

1. చ. శారతిన్. 2. క. ప్రథిత. చ. ప్రతిభావ.

మాలిని. వితరణరణదక్షా! [1]వేదపద్యాసపక్షా!
చతురమతివిశేషా! సారసంగీతపోషా!
క్రతుభు[2]గధిపభోగా! కార్యదత్తానురాగా!
ప్రతిభయభుజగర్వా! భక్తికాభ్యాసశర్వా! 207

టీక. వితరణరణదక్షా! = త్యాగమునను, యుద్ధమునను సమర్థుఁడగువాఁడా! వేదపద్యాసపక్షా! = వేదమార్గమునకు మిత్రుఁడగువాఁడా! క్రతుభుగధిపభోగా! = ఇంద్రభోగము కలవాఁడా! ప్రతి......గర్వా! = శత్రువులకు భయముగొల్పు భుజదర్పము కలవాఁడా! భక్తికాభ్యాసశర్వా! = సేవకుల తరిబీతున శివుఁడైనవాఁడా!

గద్యము. ఇది [3]శ్రీమత్పరమపదసనాథనిరవధికకృపాపరిపాకపరిచిత సరసకవితానాథ రామకృష్ణకవినాథ ప్రణీతంబైన పాండురంగమాహాత్మ్యంబను పరమభాగవత చరిత్రంబునందుఁ దృతీయాశ్వాసము.

టీక. ప్రథమాశ్వాసపు గద్యమునకువలెనే.

ఇది శ్రీ గౌతమసగోత్రపవిత్ర బులుసూపనామక సీతారామస్వామ్యవధానిసుపుత్ర విద్వజ్జనవిధేయ వేంకటరమణనామధేయగ్రథితంబైన పాండురంగమాహాత్మ్యటీకయందుఁ దృతీయాశ్వాసము.



1. ట. వేదవేద్యా. 2. క. గధిప. చ. గధిక. 3. క. శ్రీపరమ చ. శ్రీమత్పరమ.

శ్రీ ర స్తు

# పాండురంగమాహాత్మ్యము

## చతుర్థాశ్వాసము



ద్యుతి సువర్ణరేఖా
విద్యోతిత సదననికష! విద్వదనీక
ప్రద్యోతను సుత! గుణశత
వేద్యా! రామాను[1]జేంద్రు వేదాద్రీశా! 1

టీక. శ్రీద్యుతి......నికష! సంపదయొక్క కాంతి యను బంగారుగీటుచే ప్రకాశింపఁజేయఁబడిన సౌధ మను గీటురాయి కలవాఁడా! [గీటురాయి బంగారపు గీటుచే ప్రకాశించునట్లు నీ సౌధము సంపదలతోఁ బ్రకాశించుచున్నదనుట.] ['నికష=సానరాయియైన' అని పూర్వటీక.] విద్వ......సుత!= పండితసమూహమునకు (దానముచే) సూర్యపుత్రుఁడగు కర్ణుఁడైనవాఁడా! గుణశతవేద్యా! = వందల కొలఁది గుణములచే తెలియఁదగినవాఁడా! - శతాధికగుణములు కలవాఁడా! అలం. రూపకము.

వ. ఆకర్ణింపు మా నిలింపనదీకిరీటుండు హాటకగర్భసంభవునితో నిట్లనియె [2]నట్లు దిన దినప్రవర్ధమానంబగు ననురాగంబు చిగురుం[3]గొమ్మయునుం జేగయై గొనసాగుచునికిం దనికి రాధ మాధవుం దనకు నధినాథుంగాఁ గోరి గోవర్ధనాచలసమీపవర్తి యగు ఋణవిమోచనతీర్థంబునం దపంబు సేయంగడంగి. 2

టీక. నిలింప......టుండు = గంగానది కిరీటముగాఁగల శివుఁడు; హాటకగర్భసంభవునితోన్= నారదునితో; దినదినప్రవర్ధమానంబు = రోజురోజునకు వృద్ధిపొందునది; చిగురుంగొమ్మయునుంజేగయై= లేత - క్రొత్తదయినను సారవంతమయి; గొనసాగుచునికిన్=విజృంభించుచుండుటకు; తనికి = తపించి; ['ప్రకాశించి'యని పూర్వటీక.] మాధవున్ = శ్రీకృష్ణుని; అధినాథుఁగాన్ = భర్తఁగా; కడంగి = ప్రారంభించి.

సీ. ననలక్రొం[4]దొడిమ యొత్తినఁ గంటగిలు మస్తకం *బెట్టులోర్చెనో కలికిజడలు
కస్తూరితిలకంబు [5]గాలివాఁజిననేర్చు నొస లెట్లు ననిచెనో భసితమునకు
వజ్రాలనూలు నోర్వని కటీతటి యెట్లు తాళెనో పటుదర్భదామకాంచి
జిలుగుదువ్వలు వింత [6]బెళకిన గరు[7]దాల్చు తను వెట్టు లోర్చెనో ధాతువస్త్ర
తే. భరణమున కంచు జనము లచ్చెరువు నొందఁ
గొమ్మ గావించెఁ దప మట్టి క్రూరనిష్ఠఁ
[8]గడలి కంపించు క్రియ జగం బడలి [9]వణఁకఁ
దత్సమయజాత హేమంతతరుణవాత్య. 3

1. క. జేంద్ర. చ. జేంద్రు. 2. ట. ట్లనుదిన. 3. క. గొమ్మనుం. 4. చ. తొడమె. *బెట్లు మోచెనో. శ.ర.5.చ. గాలుపా. 6.చ. వెళకిన. 7.చ. ట. ద్రాల్చు. 8. క. కడలి. 9. ఛ. ట. వణకె.

టీక. ననల క్రొందోడిమ=పూవుల లేఁతతోడిమ; ఒత్తినన్ =ఒత్తుకొనఁగా; కంటగిలు మస్తకంబు= బాధపొందు తల; కఱకు జడలన్ = మోటుగానుండు జడలను; గాలివాఱినన్ = తడియిగిరిపోఁగా; ఏర్పు = మండునట్టి; భసితమునకున్ = విభూతికి; ననిచెనో = ఇష్టపడెనో? వజ్రాలనూలున్ = వజ్రాలుతాపిన మొలత్రాటినిగూడ; ఓర్వని = సహింపలేని; కటీతటి = మొల; పటుదర్భదామకాంచిన్ = బిఱుసైన దర్భత్రాటిమొలనూలిని; తాళెనో = సహించెనో? జిలుగుదువ్వలువ = సన్ననిచీర; ఇంత = కొంచెము; బెళికినన్ = ఒరసికొన్నను; గరుదాల్చు తనువు = గగుర్పాటుపొందు దేహము; ధాతువస్త్రభరణమునకున్ = కావిగుడ్డను కట్టుటకు; అచ్చెరువునొందన్ = ఆశ్చర్యపడఁగా; కొమ్మ = స్త్రీ - రాధ; తత్సమయ......వాత్యన్ = ఆసమయమునఁబుట్టిన హేమంతర్తువునందలి దట్టమైన చలిగాలిచేత; కడలి, కంపించు క్రియన్ = సముద్రము గడగడలాడునట్లు; జగంబు = లోకము; అడలి = భయపడి; అట్టి క్రూరనిష్ఠన్ =మీఁదిరీతిని కఠినమగు నియమమున; తపము, కావించెన్ =తపస్సుచేసెను. అలం. విషమము.

శా. తత్తాదృఙ్మదజృంభమాణ తరుణీతారుణ్యసంపద్దశా
ప్రోత్తుంగ స్తన[1]ని స్తలోష్మకవచంబుల్ పూనఁగా నోఁ[2]చుటన్
[3]జిత్తానందము కల్గు భోగులకు నిస్త్రింశోగ్రసంపాతమై
యుత్తాలంబగు సీతుకందువ కరం బుద్వేగ మొందింపఁగన్. 4

టీక. తత్తాదృఙ్......కవచంబుల్ - తత్తాదృఙ్మద = సాటిలేని పొంకముచే; జృంభమాణ = విజృంభించుచున్న; ['తాదృఙ్మదజృంభమాణ = దానివంటిమదముచే విజృంభించుచున్న' అని పూర్వ టీక.] తరుణీ = యువతులయొక్క; తారుణ్యసంపద్దశా = యౌవనసంపదచే; ప్రోత్తుంగ = మిక్కిలి యున్నతములైన; స్తన = కుచములపైని; నిస్తలోష్మకవచంబుల్ = గుండ్రఁదనముగలిగి, వేఁడిమిని కలిగించు ఱవికలను;—పాముపక్షమున 'గుండ్రమై, వేడిమిని గలిగించు కుబుసములను; పూనఁగా, నోఁచుటన్ = ధరించినకారణముచే; చిత్తానందము, కల్గు = (అంతకుమున్ను) మనస్సున నానందము పొందిన; భోగులకున్ = భోగపురుషులకు, పాములకును; ఉత్తాలంబగు = అధికమైన; సీతుకందువ = చలికాలము; నిస్త్రింశోగ్రసంపాతమై = గట్టి కత్తివ్రేటైనదై - కత్తివ్రేటువంటిబాధను కలిగించునదై; కరంబు = మిక్కిలి; ఉద్వేగము, ఒందింపఁగన్ = ఆందోళనమును కల్గింపఁగా. భయముగా.

"ఇంతకుఁబూర్వము స్త్రీలు చలి లేనందున కంచుకములను ధరింపకపోఁగా, వారిప్రియులు యువతుల స్తనములను కౌఁగిలించుకొని ఎక్కువ ఆనందమును పొందుచుండిరి. కాని యిప్పుడు శీతకాలమగుటఁ జలిచే యువతులు వెచ్చని ఱవికలను ధరింపఁగా, యువకులకు ప్రత్యక్షముగా వారి స్తనాలింగన భాగ్యము దొఱకలేదు" అని భావము. ఆఁడుపాములును పొరలతో నుండుటచే నాగములకును వానితో అనఁగి పెనఁగి యుండుట కవకాశము లేకపోయినదనియు భావము. అలం. కావ్యలింగము, శ్లేషము.

తే. చంద్రబింబాస్య కుచశైలజన్మభూమి, గాన రా†రూపువోలె నక్కడిఁదిచలికి
నించుకంతయుఁ గంపింప దివముకొనుచు, ముజ్జగంబులు పచరింప మూటిలెక్క.

టీక. చంద్రబింబాస్య = చంద్రబింబమువంటిముఖముకల రాధ; కుచశైలజన్మభూమి, కానన్ = స్తనములను కొండలకు పుట్టిన చోటు - భూమి యగుటచే; ఇవముకొనుచున్ = చలిఁగొనుచు; ముజ్జగంబులున్ = ముల్లోకములును; మూటిలెక్క, పచరింపన్ = మూఁడంకెవేసినట్లు ముడుచుకొని పరుండఁగా; రారూపువోలెన్ = ఱాతిబొమ్మవలె; ఇంచుకంతయున్ = కొంచెమైనను; కంపింపదు = చలింపదు. అలం. ఉపమ, రూపకము.

---

—1. క. నిస్తులోష్ణ. చ. ట. నిస్తులోష్మ. 2. క. చుటల్. 3. క. చిత్తా. † రూపువోలె. ళ. ర. రూపుఁబోలె. క.

తే. పారదంబునఁ దోఁచిన పసిఁడితీఁగ,పగిది రాజిల్లె రాధ చంపక[1]సవర్ణ
వర్ణ మగు మేను కుముదధవళతుషార,పటలకంచుకవెల్లనఘటనకలిమి. 6

టీక. చంపకసవర్ణవర్ణము=సంపంగిపూవుతో సమాన కాంతి గలది; మేను=శరీరము; కుముద... కలిమిన్ = తెల్లకలువవలె తెల్లనైన మంచుసమూహము అను రవికను ధరించినశోభచే; రాధ=రాధాదేవి; పారదంబునన్ = పాదరసమునందు; తోఁచిన = మెరిసిన; పసిఁడితీఁగపగిదిన్ = బంగారుతీఁగవలె; రాజిల్లెన్ = ప్రకాశించెను. అలం. ఉపమ, రూపకము.

తే. నవ్యకాలాగరూద్వర్తనముల సతుల,చన్నుఁగొండల [2]నూష్మాగ్ని సంభవించె
మతిసమగ్రులు ధూమానుమానకలన, నగ్ని సాధింతు రచలంబులందు నెపుడు.

టీక. నవ్యకాలాగరూద్వర్తనములన్ = క్రొత్తకస్తూరిపూఁతవలన; [‘ఉద్వర్తనము=నలుఁగు’ అని పూర్వటీక.] సతులచన్నుఁగొండలన్ = కొండలఁబోలు స్త్రీలచన్నులమీఁద; ఊష్మాగ్ని = వేఁడిమియను నగ్ని; సంభవించెన్ = కలిగెను; మతిసమగ్రులు = బుద్ధిమంతులు - పండితులు; ధూమానుమానకలనన్ = పొగయొక్క అనుమానమువలన; అచలంబులందున్ = కొండలపయి; అగ్నిన్ = అగ్నిని; సాధింతురు= నిశ్చయింతురుకదా! పర్వతముపయి వ్యాపించియున్న పొగను చూచి తార్కికులు ఆ పర్వతముపయి అగ్ని యున్నదని నిశ్చయింతురు. అట్లు నిశ్చయించుటయే అనుమితి; అగ్ని లేనిచోట ఉండని ధూమము అక్కడ ఉండుటవలన పర్వతముపయి అగ్ని యుండితీరుననియే వారి యూహ. ఆ సిద్ధాంతము రాధవిషయమున రూపకమూలమున సిద్ధింపఁబడినది. ఇచట కాలాగరు ధూమముగాను, ఆమె స్తనములు కొండలుగను, వేఁడిమి అగ్నిగాను రూపింపఁబడినవి. అలం. రూపకము.

తే. సురలు కళలెల్లఁ గ్రోలిన సోము తనువు,కప్పురము గ్రుమ్మరించిన[3]కనక క్రోవి
పువ్వుఁదేనియ చనిన యం[4]భోరుహంబు, ననఁగ మంచింక బ్రహ్మాండ మగలెఁ జలికి.

టీక. సురలు = దేవతలు; కళలెల్లన్ = సమస్తకళలను; క్రోలిన=పీల్చివేసిన [‘క్రోలి = త్రాగి; అని పూర్వటీక.] సోముతనువు = చంద్రబింబము; కప్పురము గ్రుమ్మరించిన = ఎక్కువగా ఒలుకఁబోసిన; కనకక్రోవి = బంగారు బరణి; [మిశ్రసమాసము] చనిన = పోయిన; అంభోరుహంబున్ = తామర పువ్వును; అనఁగన్ = అనునట్లుగా; మంచు; ఇంక; బ్రహ్మాండము = ప్రపంచము; చలిని = చలి కాలమున; అగలెన్ = భేదిల్లెను. అలం. ఉత్ప్రేక్ష.

క. [5]అగరుం గుంకుమపువ్వును, దొగరుం జేలలును సీతుఁ ద్రోవంగలవే!
పొగలేని ముర్మురంబులు, మగువల[6]పాలిండ్లు భోగమహనీయంబుల్. 9

టీక. అగలున్ = అగరును; తొగరుంజేలలును = ఎఱ్ఱని చీరలును; సీతున్ = చలిని; త్రోవం గలవే? = పోఁగొట్టఁగలవా? పొగలేని, ముర్మురంబులున్ = పొగలేనట్టి ఊకకుంపట్లును; మగువల పాలిండ్లున్; భోగమహనీయంబుల్ = (చలికాలమున) అనుభవింపఁదగినవి. ‘హసంతీం చ హసంతీం చ హసంతీం వామలోచనాం, హేమన్తే యే న సేవన్తే తే నరా దైవవంచితాః’ అని అభియుక్తోక్తి.

క. పైఁగురియు మంచు[7]తువ్వర, వానలచేఁ దడిసి కమలవనలక్ష్మి హరి
ధ్యాననిమీలితలోచన,యా నలరాధావధూటి కనఁగల మయ్యెన్. 10

టీక. కమలవనలక్ష్మి = (కొలఁకులలోని) తామరసంపద; మంచుతువ్వరవానలచేన్ = మంచు బిందువులవర్షముచే; తడిసి = (తడిసి - మూసికొనిపోయి.) హరి......లోచనయా = విష్ణుధ్యానమున

---

1. క. సువర్ణ. చ. ట. సవర్ణ. 2. నుష్ణాగ్ని. చ. ట. నూష్మాగ్ని. 3. చ. కనవ. ట. కనర. 4. క. భోరుహాంబోయన. చ. ట. భోరుహాంబునన. 5. క. అగలుం. చ. అగరుం. 6. క. పాలిండ్లు. చ. పాలిండ్ల. 7. చ. తుంపర. ట. తుప్పర. శ. ర. మంచుఁదువ్వర.

కన్నులుమూసికొనియున్న; రాధావధూటికిన్ = రాధాదేవికి; అనుగలము, అయ్యెన్ = సమానమయ్యెను - ఆమెను పోలియుండెను. ['అనుగలము = అనుకూలము' అని పూర్వటీక.] అలం. ఉపమ.

తే. కాలుఁగాలును గేలును గేలు మోవి,మోవియును దార్చి భోగిసమూహ మమరెఁ;
నూహసేయంగ భోగిసమూహమునకుఁ,బొసఁగ మసకంపుఁబెనకువ లెసఁగుఁగాదె.

టీక. తార్చి = దగ్గరగా కూర్చి - చేర్చి; భోగిసమూహము = యువతీయువకుల గుంపు; భోగిసమూహమునకున్ = పాములగుంపునకు; మసకంపుఁబెనకువలు = సంభోగమునందలి యిచ్చచే పెనఁగులాటలు; ఎసఁగుఁగాదె! = కలుగునుగదా! అలం. అనుప్రాసము శ్లేషము.

క. శ్యామలకాలాగురు నవ,ధూమ మెదకు సుఖ మొనర్పఁ దోరపుఁగన్నుల్
వే మొగుచుకరణి సౌధ,స్తోమ మమరెఁ గప్పఁబడిన సోరణగండ్లన్. 12

టీక. శ్యామల......ధూమము = నల్లని కస్తూరి ధూపపుఁబొగ; ఎదకున్ = హృదయమునకు; తోరపుకన్నుల్ = విశాలనేత్రములను; వే = వేగముగా; మొగుచుకరణిన్ = (సుఖపారవశ్యమున) మూయుఁరీతిని; కప్పఁబడిన = మూయఁబడిన; సోరణగండ్లన్ = గవాక్షముల చేత; సౌధస్తోమము = మేడల వరుస; అమరెన్ = ఒప్పెను. అలం. ఉత్ప్రేక్ష.

క. అంత వసంతము జితహే,మంతము దీపించె మత్తమధురకకలభా
క్రాంత మురుపుష్పరసవే,శంతము సకలద్రుములఁ [1]బిసాళము [2]చెలఁగన్. 13

టీక. జితహేమంతము = గెలువఁబడిన చలికాలముకలది - చలికాలమును త్రోసి, వచ్చినది; మత్త...క్రాంతము = మదించిన కోదమతుమ్మెదలచే ఆక్రమింపఁబడినది; ఉరుపుష్పరసవేశంతము = అధికమైన పూవుఁదేనెవడియలుకలది; అగు - వసంతము = వసంతర్తువు; సకలద్రుములన్ = అన్ని వృక్షములందును; పిసాళము = వికాసము; చెలఁగన్ = అతిశయింపఁగా; దీపించెన్ = ప్రకాశించెను.

ఉ. కెంజిగురాకుడాలు దులకించినధాతుపటంబు[3]చాయఁ జే
యం [4]జదు కెక్కు-పుప్పొడుల నంటిన[5]తేఁటులు భూతిభృజ్జటా
పుంజముఁబోలఁగా విపినభూములలో మధులక్ష్మి పొల్చె నీ
లాంజనవర్ణుఁ గోరి తప ము ట్లొనరించు మృగాక్షికై వడిన్. 14

టీక. కెంజిగురాకుడాలు = ఎఱ్ఱనిలేఁజిగురుకాంతి; తులకించిన ధాతుపటంబుచాయన్, చేయన్ = ప్రకాశించినకావిబట్టకాంతిని పొందఁగా; చదుకెక్కు- = రాలిన; ['బురదలుదేఱునట్టి' అని పూర్వటీక.] పుప్పొడులన్, అంటిన = పుప్పొళ్లను తాఁకిన - తమపైఁ బుప్పొడిని అంటించుకొన్న; తేఁటులు = తుమ్మెదలు; భూతిభృజ్జటాపుంజమున్, పోలఁగాన్ = బూడిద పూసికొనిన జడలగుంపువలె నుండఁగా; మధులక్ష్మి = వసంతశోభ; విపినభూములలోన్ = అడవినేలలందు; నీలాంజనవర్ణున్, కోరి = నల్లనికాటుకవన్నెకలవానిని - కృష్ణుని; మృగాక్షికైవడిన్ = రాధాదేవివలె; పొల్చెన్ = ప్రకాశించెను.

వసంతశోభకు కెంజిగురాకుకాంతి కావివస్త్రమువలెను, పుప్పొడియంటిన తుమ్మెదలు విభూతి పూసికొన్న జడలవలెను ఉండుటవల్ల ఆ వసంతలక్ష్మి తపస్సుచేయుచున్న రాధతోఁబోలుచున్నదని భావము. అలం. ఉపమ.

క. ఆవిర్భవించె నీల,గ్రీవాలికకీలికీలకేవలసఖమై
పూవులకా రుడివోవం,గా వేసవి హాసవిపులఖరకర మగుచున్. 15

1. చ. లవిసాళము. 2. ట. చెలఁగున్. 3. చ. చేతఁజాయం. 4. చ. ట. చదురెక్కు-. 5. చ. తేఁటుల. 6. క. బోలెపద్మినీ.

టీక. పూవులకారు = వసంతఋతువు; ఉడివోవఁగాన్ = ఉడిగిపోఁగా - పోఁగా; నీల... నఖమై = శివుని నొసటి యగ్నిజ్వాలలకు ముఖ్యమిత్రమయి - వానితో సమానమయి; హాసవిపుల ఖరకర మగుచున్ = ఆనందముచే అతిశయించిన సూర్యుఁడు కలదై; వేసవి; ఆవిర్భవించెన్ = వచ్చెను.

వ. అప్పు డప్పటుగభస్తి హస్తియుంబోలెఁ బద్మినీప్రమోదావహాకరప్రచారుండై, దవదహనంబు కురుమహీవిభుండునుంబోలె స్వగోత్రనిర్భేదననిపుణంబై, మల్లియలవెల్లు కన్నడకవితావితానంబునుంబోలె షట్పదవృత్తవిలాసభాసురంబై, సరసులు సరసులుంబోలె వనితావిహారకమనీయంబులై రహింవహించె. అంచలంచలఁ జంచలాచపలంబులును, విపులంబులు నగు పడమటిపవనంబులు పొరుగుల [1]యుపవనంబులం బెరుగు కరువలివారువంబులకు గమనాధ్యయనగురువులుంబోలె వడి మెఱసి సుడిసి, యసితము నగు వసుధఁ గాఁడి, నెఱియలువాఱినం దమదరవిస్ఫురితాంత్రలతామతల్లికల*వెల్లనం బాతాళవ్యాళంబులు గానవచ్చె. పెచ్చుపెరుగు ఖరకరకరనిపాతంబుల [2]నాతప్తంబులగు నెలవులం దోరఁగి [3]పరఁగు వెలఁది [4]వెన్నెలల నీర్వట్టువెన్నెలపిట్టలు పొట్టలు నిండ నాస్వాదించె [5]రక్కసజవ్వనులు మద్వంపుమచ్చికల నిచ్చలుఁ గ్రీడింప నాక్రీడాపతుల యతులనాభీవివరంబుల నింకినవియుంబోలె నదులయుదకంబు లింకె. విచికిలమాలికాలంకృతమౌళిభాగులును, నారంజితధాతు[6]పట పరభాగులు నగు భోగులబాగున గ్రుడ్డు[7]మోచు నెఱచీమలచాలు [8]చెమ్మయిమ్ములం గ్రుమ్మరం దొడం[9]గె. [10]వ్యావహారికసత్యంబు ప్రకటించు ప్రపంచంబుచేత వంచితులగు నెఱుక లేని కఱటులకరణి హరిణంబులు మరీచికావీచికాపానవివశంబులై దిశలఁ బరిభ్రమించె. ముంచుకొను సంపెఁగల సౌరభంబునకుం [11]దాళని రోలంబులలీల వియోగి[12]లోకంబులు విషయవిము[13]ఖంబు లయ్యె. ఇసుక [14]మెదవు నెలవులం బన్నిన పసుపుటాఁకుంజప్పరంబుల లోనం గుప్పళించిన కప్పురంబుతోడి [15]కురువేరుపరిమళం[16]బులును, జాజివిరులవలపును, వట్టివేళ్లవాసనలుం గల ప్రపాపాలికా[17]పఘునవర్జితంబులగు కలశోదకంబులు గ్రోలి సేద దేఱి తెరువరులు తాలవృంతానిలంబులు బలుపు కొలిపి మున్ను పరిక్షీణంబులగు ప్రాణపవనంబులం [18]బోసరింపం జేసిరి; తత్కాలంబున. 16

టీక. పటుగభస్తి = వాఁడికిరణములు గల సూర్యుఁడు; హస్తియుంబోలెన్ = ఏనుఁగుపోలిక; పద్మినీ......ప్రచారుండై = పద్మలతకు సంతోషము కలుగఁజేయు కిరణముల వ్యాపనముకలవాఁడై; [ఏనుఁగు పద్మినికి (ఆఁడుయేనుఁగునకు) సంతసమును కలిగించు తుండప్రసరణముకలదని శ్లిష్టమగు నర్థము. ఈ యర్థము పూర్వటీకలో లేదు.] దవదహనంబు = కాఱుచిచ్చు; కురుమహీవిభుండునుంబోలెన్ = దుర్యోధనునివలె; స్వగోత్రనిర్భేదననిపుణంబై = తనదగు వనమును (తా నాశ్రయించిన వనమును)

---

1. చ. యుపవనంబులును పొరు. ట. లో ఈపదము లేదు. * క. వెల్లునం. 2. చ. నతప్తం. 3. చ. వరుగు. 4. క. వెన్నెల. చ. వెన్నెలల. 5. చ. కక్కస. 6. క. పటల. చ. పట. 7. చ. మ్రోచు. ట. నోచు. 8. చ. చెమ్మల. 9. చ. గి. 10. చ. వ్యాపహా. 11. ట. తాళక. 12. చ. లోకంబు. 13. ఖంబయ్యె. 14. చ. మెదవు. శ. ర. మెదువు. 15. చ. కుసు. 16. చ. బుకుబొదిరి. ట. బుబొదిరి. 17. చ. పవర్జి. 18. చ. బోసరిం.

దహించుటయందు నేర్పుకలవాఁడై; దుర్యోధనుఁడు స్వగోత్ర-తన వంశమువారిని - (సోదరులను) నశింపఁ జేయుటయందు నేర్పు కలవాఁడని శ్లిష్టార్థము. మల్లియలపెల్లు = మల్లెపూలసంపద; కన్నడకవితావితానంబునుంబోలెన్ = కన్నడభాషయందలి కవిత్వపు పరంపరవలె; షట్పదవృత్తవిలాసభాసురంబై = తుమ్మెదల యునికివలని విలాసముచేత ప్రకాశించునదై; కన్నడకవిత షట్పదము అను వృత్తముయొక్క విలాసమున ప్రకాశించునదని శ్లేషార్థము. సరసులు = చెఱువులు; సరసులుంబోలెన్ = రసికులపగిది; వనితావిహారమహనీయంబులై = స్త్రీలవిహారముచేత గొప్పవయి; రసికులపక్షమున-స్త్రీలతోడి విహారముచే గొప్పవారనుట; రహిన్, వహించెన్ = బాగుమీఱెను. అంచలంచలన్ = ప్రతిపార్శ్వమునను; చంచలాచపలంబులును = మెఱుపులవలెఁ జలించునవియు; విపులంబులు = ఎక్కువైనవియును; అగు; పొరుగుల యుపవనంబులన్ = ప్రక్కనుండు ఉద్యానవనములందు; కరువలివారువంబులకున్ = గాలికి వాహనములైన జింకలకు; గమనాధ్యయనగురువులుంబోలెన్ = నడకను నేర్పు గురువులవలె; వడిమెఱసి = వేగముగలిగి; సుడిసి = చుట్టిచుట్టిపిఁచి; అసితయగు = నల్లనైన; వసుధన్ = భూమిపైని; కాఁడి=నాఁటి; నెఱియలు వాఱినన్ = బీటలుపడఁగా; తదుద......పెల్లనన్ = దానికడుపులో (లోపలిభాగమున) ప్రకాశించునట్టి పెద్ద ప్రేగుల యాధిక్యమో (సంపదయో) యనునట్లు; పాతాళవ్యాళంబులు=పాతాళలోకములోని పాములు; [పెల్లునన్ = అతిశయముచేత' అని పూర్వటీక.] పెచ్చుపెరుగు = మిక్కిలి ఎక్కువైన; ఖరకరకరనిపాతంబులన్ = సూర్యుని (వాఁడి) కిరణములవలన; అతప్తంబులగు=బాగుగా తపింపఁజేయఁబడిన; నెలవులన్ = చోట్లయందు; తొరఁగి = ప్రవహించి; పరఁగు = ఒప్పిదమైన; వెలఁదివెన్నెలలన్ = స్వచ్ఛములగు చంద్రకాంతులను — (అందలి మంచును); నీర్వట్టు = దప్పిగొన్న; వెన్నెలపిట్టలు = చకోరపక్షులు; ఆస్వాదించెన్ = త్రాగెను. రక్కసజవ్వనులు = రాక్షసయువతులు; మవ్వంపుమచ్చికలన్=ఎక్కువ వేడుకలతో; క్రీడింపన్ = జలక్రీడ లాడఁగా; ఆవ్రీడావతుల, అతుల నాభీవివరంబులన్=అ స్త్రీల లోఁతైన నాభీరంధ్రములందు; ఇంకినవియుంబోలెన్ = ఇంకినవో యనునట్లు; విచికిల......భాగులును = మల్లెపూలమాలలచే అలంకరింపఁబడిన సిగలు కలవారును; అరంజితధాతుపటపరభాగులును = అంతట ఎఱ్ఱనైన బట్టలచే ప్రకాశించువారును; భోగులబాగునన్ = విలాసపురుషులరీతి; ఎఱచీమలచాలు=ఎఱ్ఱచీమలబారు; చెమ్మయిమ్ములన్ = చెమ్మగల చోట్లయందు; వ్యావ......సత్యత్వంబు = లేని యథార్థమును - మోసపుసంగతులను; ప్రకటించు = వెల్లడించు; వంచితులు = మోసగింపఁబడినవారు; ఎఱుకలేని = జ్ఞానములేని; కఱటులకరణిన్ = మూఢులరీతిని; హరిణంబులు = జింకలు; మరీ......శంబులై = ఎండమావులప్రవాహమును త్రాఁగ నిచ్ఛగించినవై; దిశలన్=దిక్కులందు; పరిభ్రమించెన్ = తిరిగెను. ముంచుకొను = దట్టమై వ్యాపించు; సౌరభంబునకున్ = సువాసనకు; తాళని = సహింపలేని; రోలంబంబులలీలన్ = తుమ్మెదలపగిదిని; వియోగిలోకంబులు = విరహుల గుంపులు; విషయవిముఖంబులయ్యెన్ = భోగముల కిష్టపడనివయ్యెను; ఇసుకమెదువునెలవులన్ = ఇసుకచే మెత్తనైన నేలలందు; పన్నిన = వేసిన; పసుపుటాకుంజప్పరంబులలోనన్ = పచ్చనిపందిళ్లయందు; గుప్పళించిన = చల్లిన; ('నిండించిన' అని పూర్వటీక.) వలపును = వాసనయు; ప్రపా......తంబులగు= చలిది పందిరులందుండుపడుచుల అవయవములనుండి; (చేతులనుండి) విడువఁబడినవైన; ['దేహములనుండి' అని పూర్వటీక.] క్రోలి = త్రాగి; తెరువరులు = బాటసారులు; తాలవృంతానిలంబులన్ = వీవనల గాలులవలన; బలుపుకొలిపి = వృద్ధిపొందఁజేసి; మున్ను = (శ్రమతీర్చుకొనుటకు) పూర్వము; పరిక్షీణంబులగు = క్షీణములైయున్న; ప్రాణపవనంబులన్ = ప్రాణవాయువులను; పోసరింపఁజేసిరి = విజృంభింపఁజేసిరి - తెప్పరిలఁజేసిరి.

క. ఆ పద్మిని దినకరకర,తాపమునకు నోర్వ ఘోరతప మొనరించెన్[1]
శ్రీపతి పదగొడుగుల, ప్రాపొద[2]వినవారిఁ దాపభర మేలంటున్? 17

టీక. పద్మిని = పద్మినీజాతిస్త్రీయగు రాధ, తామరతీగయును; దినకరకరతాపమునకున్ = సూర్యుని కిరణముల వేడిమికి; శ్రీపతి.....ప్రాపు = శ్రీవిష్ణువుయొక్క పాదములను గొడుగుల యాశ్రయము; ఒదవినవారిన్ = కలిగినవారిని; ఏల, అంటున్? = అంటుకొనదు.

తే. ఇట్లు లత్యుగ్రమగు గ్రీష్మ మేసరేఁగి[3]
కాలవశమునఁ దనుదాన దీలుపడియె
పెచ్చుపెరుగుట దిగుఁ [4]బెచ్చి పేర్చుటెల్ల
ప్రగ్గుటకె యని లోకోక్తి చాటుగాదె. 18

టీక. ఇట్టులు = ఈరీతిని; అత్యుగ్రమగు = మిక్కిలి భయంకరమగు; గ్రీష్మము = వేసవి; ఏసరేఁగి = మిగుల విజృంభించి; తనుదాన = తనంతతానే; దీలుపడియెన్ = క్షీణించెను; ('దీలుపడియె' అని పూర్వటీక.) పేర్చుట = అతిశయించుట; ప్రగ్గుటకె = తగ్గుటకే; అలం. అర్థాంతరన్యాసము.

క. దీప[5]ముడుగఁ జీఁకటియును,గోప ముడుగ శాంతగుణముఁ గోల్కొనుక్రియ నా
టోపోద్భట మగు వేసవి,కైపు [6]సడిలఁ దోఁచెఁ గారుకాలము దళమై. 19

టీక. దీపము, ఉడుగన్ = దీప మారిపోఁగా; ఉడుగన్ = నశింపఁగా; కోల్కొనుక్రియన్ = వర్ధిల్లునట్లు; ఆటోపోద్భటము = మిక్కిలి ఆర్భాటము కలది; వేసవికైపు = వేసవివిజృంభణము; సడిలన్ = తగ్గిపోఁగా; కారుకాలము = వర్షకాలము; దళమై = దట్టమై; తోఁచెన్ = వచ్చెను. అలం. ఉపమ.

క. ఆకాశతత్త్వతనుఁడగు,కాకోలగ్రీవుకంఠకాళిమ యనఁగాఁ
గోకిలనీలము జలధర,పాకము పర్యాయవృద్ధిఁ బ్రబలఁదొడంగెన్. 20

టీక. ఆకాశ.....తనుఁడు = ఆకాశతత్త్వదేహుఁడు; కాకోలగ్రీవుకంఠకాళిమ = గరళము కంఠమునందుఁ గల శివుని కంఠముయొక్క నలుపు; కోకిలనీలము = కోయిలవలె నల్లనైనది; జలధరపాకము = పిల్లమేఘము; పర్యాయవృద్ధిన్ = క్రమక్రమాభివృద్ధిచే; ప్రబలఁదొడంగెన్ = పెరుఁగసాగెను. అలం. ఉత్ప్రేక్ష, ఉపమ.

సీ. ధళుధళుక్కన నింగిఁ దాటించెఁ బలుమారు [7]నీరాళ్లగొందిఁ గన్నియమెఱుంగు
పౌలస్త్యపవనసంపాతజాత[8]ప్రీతి నివిరినమ్రాఁకుల కెలమి వచ్చెఁ
బ్రథమోదబిందుసంభారంబు మొదనూనియ యయ్యెఁ బగిలిన నేలమేని
కుఱుము మంతురపానియునుబోలెఁ గనుపించెఁ దోరంపుమణులవిమారభూమిఁ
తే. గెరలి సకిలించె షణ్ముఖు[9]మఱుపమావు,పరిమళము చూచెఁ గరి శుష్కపల్వలంబు
గడిమి చిగిరించె [10]గ్రాఁజవంగడము ననిచె,నఖిలహితమైన మేఘోదయంబునందు.

టీక. నింగిన్ = ఆకాశమున; నీరాళ్లగొందిన్ = ఈశాన్యదిగ్భాగమున; [అని. సూర్య. ని] కన్నియమెఱుంగు = క్రొత్తమెఱుపు; తాటించెన్ = తాఁకునట్లు (కొట్టినట్లు) చేసెను; పౌలస్త్య...... ప్రీతిన్ = ఉత్తరపుగాలి సోఁకుటవలనఁ బుట్టిన ప్రీతిచేత; ఇవిరిన మ్రాఁకులకున్ = ఎండిపోయిన చెట్లకు; ఎలమి = వికాసము; వచ్చెన్ = కలిగెను; ప్రథమోదబిందుసంభారంబు = తొలుకరివాన చిను

1. చ. ట. చున్. 2. చ. ట. నయేని. 3. ట. మెసగరేఁగి. 4. చ. ట. హెచ్చి. 5. క. మణఁగ. చ. ముడుగ. 6. చ. సడలి. 7. ట. నీరాళ. 8. చ. స్ఫూర్తి. 9. ట. మఱుత. 10. చ. క్రాజ. ట. క్రౌంజ.

కుల సమూహము; మంతురసానియునుబోలెన్ = మంత్రసానివలె; తోరంపుమణులవిదూరభూమిన్ = పెద్ద మణులుగల విదూరపర్వతప్రదేశమున; కనుపించెన్; కెరలి = విజృంభించి; షణ్ముఖుమఖవమావు = కుమారస్వామియొక్క మూఁగగుఱ్ఱమయిన నెమలి; శుష్కపల్వలంబు = ఎండిపోయిన బురదగుంట; గ్రాజవంగడము = గ్రాజజాతిచెటవంశము; ననిచెన్ = పూచెను; మేఘోదయంబునందున్ = వాన కాలమున. అలం. స్వభావోక్తి.

తే. కారుచిచ్చును భృగురాముకారణమునఁ, బెటిలి నిర్వంశమైన భూభృత్కులంబు
క్షేత్రముల వంశవృద్ధి రాజిల్లె మఱియు, జలధరోదయవిప్రప్రసాదలబ్ధి. 22

టీక. కారుచిచ్చు = దావాగ్ని; భృగురాముకారణమునన్ = పరశురామునికతమున; పెటిలి = కాలి, బ్రద్దలయి; నిర్వంశమైన, భూభృత్కులంబుక్షేత్రములన్ = (దావాగ్నిపక్షమున) వెదురులు నశించిన కొండలగుంపులపొలములందు; (పరశురామపక్షమున; వంశములు నశించిన రాజుల భార్యల యందు; మఱియున్ = మఱల - తిరిగి; జలధరోదయవిప్రప్రసాదలబ్ధిన్ = వానకాల మను బ్రాహ్మణుల యనుగ్రహమును పొందుటవలన; వంశవృద్ధి = (కాలపక్షమున) వెదుళ్లసమృద్ధి, (బ్రాహ్మణపక్షమున) రాజవంశపువృద్ధి; రాజిల్లెన్ = ప్రకాశించెను. అలం. రూపకము, శ్లేష.

తే. [1]ప్రబలువడగండ్లు నింద్రగోపములు జంబు
ఫలములును బోల్చెఁ బచ్చికపట్టులందు
వనధినీరాన[2]దోరలు నమ్మణులనెల్ల
నంబుదంబులు వెలిగ్రాసె నఱుగకనఁగ. 23

టీక. ప్రబలు = ఎక్కువైన; ఇంద్రగోపములు = ఆరుద్రపురుగులు; జంబుఫలములున్ = నేరేడుపండ్లును; పచ్చికపట్టులందున్ = పచ్చని పచ్చికబయళ్లయందు; అంబుదములు = మేఘములు; వనధినీరు = సముద్రపునీటిని; ఆనన్ = త్రాఁగఁగా; దోరలు, నమ్మణులనెల్లన్ = (నీటితో) కలిసి యున్న తెల్లని, ఎఱ్ఱని, నల్లనిమాణిక్యముల నన్నింటిని; ('తెరలు = బయలువెడలు' అని పూర్వటీక.) అరుగక; వెలిగ్రాసెననఁగన్ = వెడలఁగ్రక్కెనవో అనునట్లుగా; పోల్చెన్ = ఒప్పెను. అలం. ఉత్ప్రేక్ష.

తే. మోవిచెలువంబు గేదంగిపూవుచేకు, సోయగము నూపుఁగన్నులసొబగుఁ జికుర
బర్హిబర్హప్రభయుఁ జూపి ప్రతిఘటించె, నంబుధరకాలసౌభాగ్య మంబుజాక్షి.

టీక. అంబుధరకాలసౌభాగ్యము = వర్షకాలపుశోభ; మోవిచెలువంబున్ = మోవియను చెట్టు సొరును, పెదవిసొరును; గేదంగిపూవుచేకుసోయగమున్ = మొగలిఱేకునందమున; ఊఁపుఁగన్నుల సొబగున్ = చలించుచున్న నేత్రములచక్కదనమును; [ఇచట పూర్వటీకలో 'చలింపఁజేయఁబడునట్టి నెమలిపురికన్నులయొక్క యందము' అని అర్థాంతరమును వ్రాయఁబడినది. అది ప్రకృతాననుగుణముగ తోఁచుచున్నది.] చికురబర్హిబర్హప్రభయున్ = కేశములవంటి నెమలిపించెపుకాంతిని; నెమలిపించెము వంటి=చికురములకాంతిని; చూపి; అంబుజాక్షిన్ = రాధాదేవిని; ప్రతిఘటించెన్ = ఎదురుకొనెను.

ఇచటఁగల మూఁడు పోలికలలోను మొదటిది శ్లేషరూపము; రెండవది వ్యస్తము; మూఁడవది సమస్తమయి రూపకోపములతోడి శ్లిష్టము.

క. సలిలంపువృద్ధజలధర,ములు పూనిన యూఁతకోలమొత్తముల క్రియన్
దొలువానకాళు లెసఁగెన్, గలహంసకులంబులెల్లఁ గలఁకంబడఁగన్. 25

టీక. సలిలంపువృద్ధజలధరములు = నీటితో నిండిన కారుమబ్బులు; పూనిన = పట్టుకొనిన; (ముసలితనమున నడుచుట కనుకూలముగా ధరించిన) ఊఁతకోలమొత్తముల క్రియన్ = ఆధారరూపము

1. చ. ప్రబల. 2. క. తెరలు. చ. ట. దోరలు.

లగు కజ్జలవలె; కలహంసకులంబులెల్లన్ = హంసల మొత్తము లన్నియు; కలఁగంబడఁగన్ = బెదరు పాటు పొందఁగా; తొలువానకాఱులు = తొలుకరి వానచినుకుల ధారలు; ఎసఁగెన్ = ప్రకాశించెను. అలం. ఉపమ.

శా. అద్రిగ్రావము లుర్విఁ రాల [1]బలిఘోషాడంబరంబుల్ వియో
గిద్రోహం [2]బొనరింప వారినిధి కెంగే లంటఁగా వాహినుల్
భద్రేభప్రతిమానమూర్తి యగుచున్ [3]బాథోధరశ్రేణి కుం
భద్రోణంబులు గుమ్మరించె విమలాంభఃపూరధారావళిన్. 26

టీక. పాథోధరశ్రేణి = మేఘములగుంపు; భద్రేభప్రతిమానమూర్తి, యగుచున్ = భద్రజాతి (గొప్ప) గజమును పోలినదగుచు; అద్రిగ్రావములు = కొండలఱాళ్లు; ఉర్విన్ = భూమిపై; రాలన్ = దొర్లిపడఁగా; బలిఘోషాడంబరంబుల్ = గొప్పబలము కల ఉఱుముల ఆర్భాటములు; వియోగిద్రోహంబు = విరహులకు కష్టమును; ఒనరింపన్ = కలిగింపఁగా; వాహినుల్ = నదులు; వారినిధి కెంగేలు = సముద్రపుహస్తమును; అంటఁగాన్ = గ్రహింపఁగా - అనఁగా నదులు సముద్రముతోఁ గలిసికొనఁగా; విమలాంభఃపూరధారావళిన్ = నిర్మలజలప్రవాహపూరమును; కుంభద్రోణంబులు = కుండలు, తూములునుగా - కడవలతోఁ గుమ్మరించినట్లుగా; కుమ్మరించెన్ = ఎక్కువగా వెడలఁ గ్రక్కెను. అలం. స్వభావోక్తి, ఉపమ.

క. పాపటతెఱువున డిగి నా,సాపుటముక్తాఫలప్రచారంబై రా
ధాపృథువక్షోరుహముల,పైపైఁ బ్రథమోదబిందుపటలము నిగిడెన్. 27

టీక. ప్రథమోదబిందుపటలము = తొలుకరి మొదటివానచినుకులగుంపు; పాపటతెఱువునన్ = సీమంతమార్గమున; డిగి = దిగి - జాఱి; నాసాపుటముక్తాఫలప్రచారంబై = ముక్కుచివఱ, ముత్యముల వలె నున్నదయి; రాధాపృథువక్షోరుహములపైపైన్ = రాధాదేవియొక్క పెద్దస్తనములమీఁదు మీఁదుగా; నిగిడెన్ = వ్యాపించెను.

ఈ వర్ణనమునకుఁ గాళిదాసమహాకవి కుమారసంభవమున కూర్చిన "స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః, పయోధరోత్సేధనిపాతచూర్ణితాః; వళీషుతస్యాః స్ఖలితాః ప్రపేదిరే, చిరేణ నాభిం ప్రథమోదబిందవః" అను ప్రసిద్ధశ్లోక మాధారముగాఁ గన్పడుచున్నది. అయినను ఆ వర్ణన మిందు చాల వఱకు మాఱినది. పాపటతెఱువనుటచే సీమంతము, ఒక మార్గమును పోలియున్నదనియు, ముక్కుకొనకు జాఱిన నీటిబిందువు ముత్యమువలె నున్నదనుటయు, ఉన్నతములగు స్తనముల పైపైఁబడుటయు రమణీయములగు కల్పనములు. అలం. స్వభావోక్తి, ఉపమ.

సీ. పెరిగి సూచీముఖాభేద్యంబులగు నంధకారధారాచ్ఛటల్ గాఱుకొనినఁ
గర్ణజ్వరాపాదకంబులై దంభోళి గంభీరరవములు గడలుకొనిన
ముజ్జగంబుల ముచ్చుముణిగింపఁగాఁజాలు నీఁదగాడుపులు బిట్టెదురుకొనిన
దుర్దమకర్దమస్తోమసంఛన్న[4]భూముల సోనవానలు ముంచుకొనినఁ

తే. బెదర [5]కఱకాలఁ గన్నువచ్చినవిధాన, నాథసంకేతముల కేఁగు నడికిరేలు
కాయసంభవబాధానహాయ మగుచు, స్వైరిణీకోటి నిర్భయస్వైరథాటి. 28

టీక. పెరిగి = దట్టములై; సూచీముఖాభేద్యంబులు=సూదిమొనచేతఁగూడ భేదింపరానివి-సూది మొనమోపుటకును సందులేనివి; అంధకారధరాచ్ఛటల్ = చీఁకటుల తెరల గుంపులు; కారుకొనినన్ =

1. క. బల. చ. ట. బలి. 2. చ. ట. బునొనర్ప. 3. క. పాథో. 4. చ. ట. ములు. 5. చ. కటుకాళ్ల. (తే. లో ౧, ౨ పాదములు వ్యత్యస్తములు.)

వ్యాపించినను సరే; దంభోళిగంభీరరవములు = గొప్పపిడుగుల ధ్వనులు; ['వజ్రాయుధముయొక్క వెలితిలేని ధ్వనులు' అని పూర్వటీక.] కర్ణజ్వరాపాదకంబులై = చెవులకు బాధను కలిగించునవై - చెవులు బ్రద్దలుచేయునవై; కడలుకొనినన్ = దిక్కులన్నిటవ్యాపించినను సరే; ముజ్జగంబులు=మూఁడు లోకములను; ముచ్చముడిగింపఁగాఁజాలు = మిక్కిలి ముడుఁగుకొనునట్లు (చలికి కాళ్లు దగ్గఱగా ముడుచుకొనునట్లు) చేయునట్టి; ఈఁదగాడుపులు; = చలిగాలులు, బిట్టు = వేగముగా; ఎదురుకొనినన్ = ఎదురుగా వీచి, బాధించినను సరే; సోనవానలు = ముసురువానలు; దురమ......భూములన్ = ఎక్కువైన బురదగుంపులచే కప్పఁబడిన నేలలపయి; ముంచుకొనినన్ = ఎక్కువగా వ్యాపించినను సరే; బెదరక = జడియక; అఱకాలన్, కన్నువచ్చినవిధానన్ = అఱకాలిలో కన్నుఉన్నట్టుగా - దారితప్పిపోకుండునట్లు; నడికిరేలు = అర్ధరాత్రులందు; స్వైరిణీకోటి = కులటలగుంపు - (ఇది కర్తృపదము) కాయ......సహాయము = మన్మథబాధయే సహాయముగాఁగలది; అగుచున్; నిర్భయస్వైరథాటిన్ = భయములేని స్వేచ్ఛాగమనమున; నాథసంకేతములకున్ = ప్రియులు ఉన్న తావులకు; ఏఁగున్. అలం. విశేషోక్తి, లోకోక్తి.

క. త్రిదశగురుప్రతిమానులు, నిది పగలిది రాత్రి యనుచు నేఱుపఱుపలే
రు దళితహరినీలమణి, చ్ఛదనీలము మొగులు సూర్యచంద్రుల ప్రింగన్. 29

టీక. దళిత......నీలము = కోఁతకోయఁబడిన ఇంద్రనీలమణికాంతివంటి కాంతి కల్గినదయిన; మొగులు = మేఘము; ప్రింగన్ = కప్పివేయఁగా; త్రిదశగురుప్రతిమానులున్ = (బుద్ధియందు) బృహస్పతితో సమానులును; వేఱుపఱుపలేరు = నిర్ణయింపలేకైరి. అలం. ఉపమ.

క. తరణిలయానంతరమునఁ, గర మమరు దిగంతములను ఖద్యోతంబుల్
మరలఁగఁ దైజసస్సృష్టికిఁ, బరమాణుచయంబు గూడఁబడుచందమునన్. 30

టీక. తరణిలయానంతరమునన్ = సూర్యాస్తమయమునకుఁ దరువాత; ఖద్యోతంబుల్ = మిణుఁగురుబురుగులు; మరలఁగన్ = తిరిగియు; తైజసస్సృష్టికిన్ = తేజస్విసృజింపఁబడుటకు; పరమాణుచయంబు = తేజఃపరమాణుపుంజము; కూడఁబడుచందమునన్ = దగ్గఱదగ్గఱగాఁ జేరుచున్నట్లుగా; దిగంతములను = దిక్కులకొనలందు; కరము = మిక్కిలి; అమరున్ = ఉండును - ప్రకాశించును. అలం. ఉత్ప్రేక్ష.

సీ. ఇంద్రచాపంబు గా దిది మౌళితలమున[1] సవరించు బర్హిపింఛంబుగాని
భిదుర[2]ఘోషంబు గా దిది పాంచజన్యసంజాతగంభీరఘోషంబుగాని
యాశ్రయించిన బలాకావళి గా దిది హారిముక్తాహారయష్టిగాని
యిది కోలమెఱుఁగుగా దుదిరిబంగారంపుఁబసిమి గ్రమ్మెడు పచ్చపట్టుగాని
తే. వృష్టిగా దిది కరుణాంబువృష్టిగాని, నీలమేఘంబు గా దిది నీలవర్ణుఁ
డౌర! నామ్రోలఁ బ్రత్యక్షమయ్యె ననుచు,హర్షపులకితతనువయ్యె నవ్వధూటి.

టీక. రాధాదేవి సదా విష్ణుధ్యానతత్పరయై యుండుటచే వర్షకాలపు విలసనముఁన్నియు నామెకు విష్ణువిలసములుగనే కనఁబడిన ట్లిందు వర్ణింపఁబడుచున్నది. ఇంద్రచాపంబు = ఇంద్రధనుస్సు; మౌళితలమునన్ = శిరస్సుపై; సవరించు = అలంకరించిన; బర్హిపింఛంబు = నెమిలిపించెము; భిదురఘోషంబు= పిడుగుచప్పుడు; పాంచ......ఘోషంబు = పాంచజన్యమను పేరిటి శంఖముచుండి పుట్టిన గొప్పధ్వని; బలాకావళి = కొంగలగుంపు; హారిముక్తాహారయష్టి = మనోహరమైన ముత్యాలహారముయొక్క పేట; కోలమెఱుఁగు = వంకరలేని మెఱుపు; ఉదిరి బంగారంపుఁబసిమి = మేలిమిబంగారపుకాంతి; క్రమ్మెడు=

1. చ. తటమున. 2. చ. ఘాతంబు.

వ్యాపించునట్టి; వృష్టి = వర్షము; కరుణాంబువృష్టి = దయయను వర్షము; అవ్వధూటి = ఆస్త్రీ - రాధాదేవి; హర్షపులకితతనువు = సంతోషమున గగుర్పాటుపొందిన దేహము కలది. అలం. అపహ్నుతి.

వ. ఇట్లనవరత ధ్యానధారాప్రవాహమగ్నహృదయ యగు నా గగనావలగ్నకు
నిఖిలజగద్వలయంబును విష్ణుమయంబై తోఁచె; నంత భక్తవత్సలుం డగు
శ్రీవత్సవక్షుండు. 32

టీక. అనవరత......హృదయ = ఎడతెగని ధ్యానమను ప్రవాహమున మునిగిన మనస్సుకలది; గగనావలగ్నకున్ = ఆకాశమువంటి (శూన్యమగు) నడుము గల రాధాదేవికి; నిఖిలజగద్వలయంబును = సమస్తభూమండలమును; శ్రీవత్సవక్షుండు = శ్రీవత్సమను మచ్చ ఱొమ్మున కలవాఁడు - శ్రీకృష్ణుఁడు.

సీ. అరచంద్రులోని చిహ్నాం[1]శకంబునుబోలె నుదుటఁ గస్తురిబొట్టు పదనుకొనఁగ
గగనంబునందలి ఖరమరీచియుఁబోలె నురమునఁ గౌస్తుభం బొఱపుమీఱ
సురభూజశాఖలఁ జుట్టు తేఁటులుఁబోలెఁ గేలఁ [2]బచ్చలకడియాలు మెఱయఁ
గొదమ సంపెఁగ మొగ్గతుదఁ[3] బొన్నవిరి బోలె ముక్కున ముంగఱముత్తె[4]మమర

తే. నీలగిరిఁ గప్పు వెన్నెలనిగ్గు బోలె, నవకమగు మేన హరిచందనంబు పొదువ
వివిధమణిభూషణప్రభల్ వెలయ ఫలిత, కల్పతరులీల రాధయగ్రమున నిలిచి.

టీక. అరచంద్రులోని = చంద్రవంకలోని; చిహ్నాంశకంబునుబోలి = చిన్నమచ్చవలె; పదను కొనఁగన్ = చెమ్మగిల్లఁగా; కృష్ణునినుదురు చంద్రవంకవలెను, అందలి నల్లని కస్తురిబొట్టు మచ్చవలెను ఉన్నవనియు, చంద్రునిలోని యమృతమువలన మచ్చ చెమ్మగిల్లినట్లు, చెమర్పుటచే కస్తురిబొట్టు చెమ్మగిల్లినదనియు భావము. ఖరమరీచియుఁబోలెన్ = సూర్యునివలె; ఒఱపుమీఱన్ = అందగింపఁగా; [గగనవక్షములకును, సూర్యకౌస్తుభములకును సామ్యము.] సురభూజశాఖలన్ = కల్పవృక్షపుఁగొమ్మలను; చుట్టు = చుట్టుకొనియున్న; కేలన్ = హస్తములందు; (బాహువులు శాఖలవలెను, గరుడపచ్చల కడియాలు తుమ్మెదలవలెను గలవనుట;) కొదమసంపెగమొగ్గతుదన్ = లేఁతసంపగిమొగ్గచివఱ; ముంగఱ ముత్తెము=నాసామణియైన ముత్యము; (ముక్కు సంపెగమొగ్గవలెను, ముత్యము పొన్నపువ్వువలెను ఉన్నవని భావము.) కప్పు = ఆక్రమించిన; వెన్నెలనిగ్గుపోలెన్ = తేఁటవెన్నెలవలె; నవకమగు = మృదువైన; మేనన్ = శరీరమున; హరిచందనంబు = పచ్చని గంధము; పొదువన్ = క్రమ్మఁగా; ఫలితకల్పతరు లీలన్ = పండిన కల్పవృక్షమువలె, [పండిన కల్పవృక్షమున రంగురంగుల పండ్లుండుననుట.] రాధ యగ్రమున్ = రాధయెదుట. అలం. ఉపమ.

ఉ. శ్రీదనరన్ గృపారసము చిల్కఁ దపోఽనలజాయమానహృ
త్ఖేదము మానిపించి తనకేలను గేల్దెమలించి నిర్భరా
హ్లాద మెలర్ప నయ్యువతి నర్ధశరీరము నట్లు ప్రోచె న
య్యాదవరాజవంశమణి యద్రిజ నేలిన శూలిపోలికన్. 34

టీక. శ్రీ, తనరన్ = శోభ, ప్రకాశింపఁగా; కృపారసము = దయ; చిల్కన్ = ప్రసరింపఁగా; అయ్యాదవరాజవంశమణి = యాదవరాజులలో శ్రేష్ఠుఁడయిన శ్రీకృష్ణుఁడు; తపోఽనల...ఖేదమున్ = అగ్నివంటి తపస్సువలన కలిగిన శరీరాయాసమును; మానిపించి = పోఁగొట్టి; తనకేలను = తనచేతితో; కేల్, తెమలించి = రాధచేతిని కదలించి; నిర్భరాహ్లాదము = అంతములేని సంతసము; ఎలర్పన్ = అతిశయింపఁగా; అయ్యువతిన్ = ఆరాధను; అర్ధశరీరమునట్లన్ = తనదేహములోని సగభాగమునట్లు—

1. క. అంశంబునుం. చ. అంశకంబును 2. చ. బచ్చని. 3. చ. తుది. 4. క. ముత్యా. చ. ట. ముత్తె.

(భార్యనుగాఁజేసికొని); అద్రిజన్ = పార్వతీదేవిని; శూలిపోలికన్ = శివునివలె; ప్రోచెన్ = కాపాడెను - బాధలేకుండ రక్షించెను. అలం. ఉపమ.

క. రాధాసంగమ ముదితుని, మాధవుఁ గని యోటుపడినమాడ్కిఁ దెరలె శం
పాధరము తనదువర్ణము, బాధిత మగు నేని వెలుకఁబాఱు ఘనుండున్. 35

టీక. రాధాసంగమముదితునిన్ = రాధ చేరికచే సంతోషించినవానిని; మాధవున్ = శ్రీకృష్ణుని; ఓటువడినమాడ్కిన్ = జయింపఁబడినట్లు; శంపాధరము = మేఘము; తెరలెన్ = కలఁతపడెను; తన దువర్ణము = తనరంగు, తనజాతియు; ఘనుండున్ = మేఘమును, గొప్పవాఁడును కూడ; వెలుకఁ బాఱున్ = వెలవెలపోవును; (ఘనుఁడు వెలివేయఁబడుననియు గ్రాహ్యము.) జాతిభ్రష్టుఁడు వెలివేయఁ బడుట ఆచారసిద్ధము. [శరద్వర్ణనము.] ['తెరలెన్ =చలించెను' అని పూర్వటీక.] అలం. ఉత్ప్రేక్ష, శ్లేష.

క. నీలాంజనవర్ణుఁడు రా, ధాలీలావతిఁ [1]బెనంగి తన రెడుకరణిన్
గాలము శరత్సమాగమ, హేలాసౌభాగ్యమహిమ నేపు వహించెన్. 36

టీక. నీలాంజనవర్ణుఁడు = నల్లకాటుక కాంతి కల శ్రీకృష్ణుఁడు; పెనఁగి = కలసిమెలసి; తనరెడు కతనన్ = అతిశయించునట్లుగా; కాలము = ఆ సమయము; శరత్...మహిమన్ = శరత్కాలపురాక యొక్క విలాసపుగొప్పతనముచే; ఏపున్ = ఆధిక్యమును; వహించెన్ = పొందెను. అలం. ఉపమ.

సీ. కలఁకనీ రెంతయు గతకల్మషముఁ జేసెఁ, గతకాఫలముఁ రీతిఁ గలశసూతి
పాపటదీర్చె భూభాగంబు [2]నాశ్యాన, శాదంబు శకటౌఘచక్రధార
శిఖి తాండవము *కళాసిగఁ జేసి సడలించెఁ గఱకుటీఁకల పేరి కానెబిగువు
లుడిగిన జడివాన లుదయించె వెండియుఁ గరిఘటామదవృష్టికైతవమున

తే. తెల్లు శోభిల్లె మంకెన లుల్లసిల్లెఁ, గాలకంధర వాహంబు గజ్జు[3] రేఁగె
ముదిత[4]శతగోపకన్యకావదనతులిత, లలితరుచిఁ బొల్చె రాకాకళాధరుండు. 37

టీక. కలశసూతి = అగస్త్యుఁడు; కలఁకనీరు = బురదనీటిని; కతకాఫలమురీతిన్ = ఇండుగ వలె; గతకల్మషమున్ = మురికిలేని దానిని - పరిశుద్ధమైనదానినిగా; ఆశ్యానశాదంబున్ = ఎండిన బురదగల; భూభాగంబున్ = భూమిని; శకటౌఘచక్రధార = బండ్లచక్రములఅంచులు; పాపటదీర్చెన్ = పాపట. ఏరుపడునట్లుచేసెను—(ఎండిన బురదనేలలపయి బండ్ల వరుసగా నడువఁగా, చక్రములచాళ్లు ఏర్పడెననుట.) శిఖి = నెమిలి; తాండవమున్ = నృత్యమును; కళాసిగఁజేసి = అలసిపోవునట్లు - విపరీత మునఁజేసి; కఱకుటీఁకల పేరికానెబిగువులు = బిఱుసువెండ్రుకలను దట్టిబిగువు; సడలించెన్ = జాఱ విడిచెను-తాల్చెను. [ఇచట'కళాసిక'అను పాఠముప్రకారము 'కళాసికఁజేసి=నాట్యక్రియావిశేషముచేత' అని పూర్వటీకయందును, 'కళాసిక = తాండవాదులచివఱఁ గావించు కృత్యవిశేషము? అని కొంత సందిగ్ధ ముగ సూర్యరాయాంధ్రనిఘంటువునను అర్థ మీయఁబడినది. కాని శిఖి కళాసిగన్ తాండవము, చేసి, కఱకు......బిగువులు, సడల్చెన్' అని యుండుటచే మీఁది యర్థము లనుగుణములు కావని తెలియకపోదు.] ఉడిగిన = ఆగిపోయిన; కరి......వమునన్ = ఏనుఁగుగుంపులయొక్క మదవర్షపునెప మున; వెండియున్ = మఱల; ఉదయించెన్ = పుట్టెను - ప్రారంభమయ్యెను. కాలకంధరవాహంబుగజ్జు= నీలకంఠుని వాహనమగు వృషభముయొక్క మదము; రేఁగెన్ = విజృంభించెను. రాకాకళాధరుండు= సంపూర్ణచంద్రుఁడు; ముదిత......రుచిన్ = సంతోషించిన రాధాదేవి ముఖకాంతితో సమానమగు కాంతితో; పొల్చెన్ = ప్రకాశించెను. అలం. ఉపమ, స్వభావోక్తి.

---

1. క. తిని పెనఁగి చ. తిబెనంగి. 2. చ. నాస్యసస్యాదం. *క. కళాసిక. సూర్య. కళాసిక. చ. కళాసిగ 3. చ. వెగె. 4. చ. శత.

క. చనుమొలకలు గల కన్యా,జనములఁ [1]బురుడించెఁ బద్మసర[2]సీరేఖల్
ననవిలుతు మిట్టకోలలు,వనరుహముకుళములు గానవచ్చుటకతనన్. 38

టీక. ననవిలుతు మిట్టకోలలు = పూవులు విండ్లుగాఁ గల మన్మథుని మిట్టకోలలయిన; [చివఱ కొంచెము గుండ్రముగా, మొద్దుగా నుండు బాణములు మిట్టకోలలు; ఇచట పూర్వటీకాకారులు 'మిట్ట=తీక్ష్ణము' 'మిట్టకోల' అను శబ్దరత్నాకరము ననుసరించి 'కఱకుబాణములు' అను నర్థమును గ్రహించిరి. అది సరికాదు.] వనరుహముకుళములు = తామరమొగ్గలు; కానవచ్చుటకతనన్ = కనఁబడుటచేత; పద్మసరసీరేఖల్ = తామరకొలఁకులు; చనుమొలకలు, గల = మొలకచన్నులు కల; పురుడించెన్ = అనుకరించెను - పోలెను. అలం. ఉపమ.

చన్నులకు మిట్టకోలలతోడి సామ్యము ప్రథమాశ్వాసమునను చెప్పఁబడి(ప. 126) యున్నది.

క. అలరాధికాధరాధర, [3]దళమున యదుభర్త [4]నిసుచు దంతక్షతరే
[5]ఖలువోలెఁ గ్రొత్త మంకెన, యలరులపైఁ దేఁటు లమరె నా సమయమునన్.39

టీక. అల = ప్రసిద్ధమైన; రాధికాధరాధరదళములన్ = రాధయొక్క క్రిందిపెదవిపయి; యదుభర్త = శ్రీకృష్ణుఁడు; నిసుచు = నింపు - ఉంచు; దంతక్షతరేఖలువోలెన్ = పంటికాటుల చిహ్నములవలె; క్రొత్తమంకెనయలరులపైన్ = అప్పుడు పూచిన మంకెనపూలపయి; తేఁటులు = తుమ్మెదలు; అమరెన్. అలం. ఉపమ.

తే. పాంచజన్యంబు రాధికాచంచలాక్షి, [6]కంధరకునోడి యొచటనో క్రాఁగిపోవఁ
దద్గతధ్వని తద్భర్తదాయ యనియొ,చేరె వృషభంబుకంఠకుటీరవాటి. 40

టీక. పాంచజన్యంబు = విష్ణువుశంఖము; రాధికాచంచలాక్షికంధరకున్ = రాధయొక్క మెడకు; క్రాఁగిపోవన్ = క్రాఁగగా -నశించిపోఁగా; ['క్రాఁగి = తపించి' అని పూర్వటీక.] తద్గతధ్వని= పాంచజన్యపుధ్వని; తద్భర్తదాయ యనియొ = రాధభర్తయగు కృష్ణుని శత్రువగు కారణముచేతనో ఏమో; వృషభంబుకంఠకుటీరవాటిన్ = వృషభముయొక్క కంఠమను గుడిసెచాటున; చేరెన్=దాఁగుకొనెను. రాధకంఠము ఆకారమున పాంచజన్యము నోడించుటచే ఆ రెండిటికిని శత్రుత్వము ఏర్పడెను. కావున రాధమగఁడగు కృష్ణుఁడును శత్రువయ్యెను. అందువలన శంఖముయొక్క ధ్వనియు కృష్ణునకు పగయగుటచే అతని శత్రువగు వృషభమును శరణుజొచ్చెను. [కృష్ణునకు వృషభాసురుఁడు పగవాఁడగుట ప్రసిద్ధము.] రాధమెడ పాంచజన్యమువలె నున్నదనియు, ఆ శరత్కాలములోని యెద్దులఱంకెలు పాంచజన్యధ్వనిని పోలుచున్నవనియు తాత్పర్యము. పగవానికోడిన దాయ, ఆ పగవానికి పగవాఁడగువానిని ఆశ్రయించుట రాజనీతి. శత్రువుయొక్క శత్రువు మిత్రుఁడగునుకదా!

తే. పుండరీకుని రక్షింప భూమిభార, నణఁప నవనీతలంబున నవతరిలిన
యల్లునిగఁ జంచి వచ్చు దుగ్ధాబ్ధి యనఁగఁ,జంద్రికాపాండుజలధరచ్ఛాయవొదలె.

టీక. అవనీతలంబునన్ = భూమిపై; అవతరిలిన = పుట్టిన; అల్లునిగఁజంచి = అల్లుఁడగు విష్ణువు కొఱకయి; దుగ్ధాబ్ధియనఁగన్ = పాలసముద్రమో యన్నట్లు; చంద్రికా......చ్ఛాయ = వెన్నెల వలె తెల్లనైన మేఘములకాంతి; పొదలెన్ = వ్యాపించెను. శరదృతువున మేఘములు వెల్లనగుట స్వభావము. అలం. ఉత్ప్రేక్ష.

---

1. చ. బురణించె. 2. చ. సరసిజ. 3. చ. దళమున. క. దళముల. 4. క. నిలుచు. చ. నిసుచు. 5. క. ఖలుబోలె. 6. చ. కందరకు.

సీ. కలుగకుండిన నేమి కడిమిపువ్వులతావి ననిచిన మరువ మెంతటికి నోప?
దొదవకుండిన నేమి మదకేకినటనంబు చాలదె యంచల సంభ్రమంబు?
[1]మెఱవకుండిన నేమి మెఱుఁగులపోలప మేతన్మాత్రములె శాలిధళధళములు?
సుడియకుండిన నేమి సోనవానలపెల్లు గజదానవృష్టికిఁ గడమ కలదె?
తే. కారుకాలానఁ గలిగిన గౌరవంబు, చౌకయై తోఁచె శరదృతుసాంధ్రవమున
[2]నురిలి తొల్లిఁటి యధికారి యోసరిలిన, వెనుక యధికారియవి కావె విభవకళలు.

టీక. ననిచిన = చిగిరించిన; ఎంతటికిన్ = దేనికి? ఓపదు? = తగదు? మదకేకినటనంబు = మదించిన నెమళ్ళనాట్యము; ఒదవకుండినన్, ఏమి? = కలుగకపోయిన (నష్టము) ఏమి? మెఱుఁగులపోలపము = మెఱుపులకాంతి; శాలిధళధళములు = శాలిధాన్యపుఁజేల తళతళకాంతులు; ఏతన్మాత్రములె? = సామాన్యమైనవా? (సాటిలేనివని భావము.) సోనవానలపెల్లు = జల్లువానలమొత్తము; సుడియకుండిన నేమి? = చుట్టిచుట్టి రాకున్న ఏమి నష్టము? గజదానవృష్టికిన్ = ఏనుఁగుల మదజలవర్షమునకు; కడమ, కలదె? = హద్దు లేదు. శర......వమునన్ = శరత్కాలపు సంపదవలన; కారుకాలానన్ = వర్షర్తువున; గౌరవంబు = గొప్పతనము; చౌకయై = తేలికయై; తోఁచెన్; ఏలయన - శరదృతువు తన ధర్మములను కలిగియుండియు, వర్షకాలపు ధర్మములనుగూడ చూపఁజాలియుండుటచే ఈ ఋతువు ముందు వర్షర్తువు తీసికట్టయ్యెనని భావము. ఉరిలి = (తనయధికారమును) విడిచి; ఓసరిలినన్ = తప్పుకొన్నచో - (అధికారమును విడిచి) పోఁగా; విభవకళలు = ఐశ్వర్యపుకళలు - అధికారములు; వెనుకయధికారియవి కావె != అతనిక్రింద నుండిన అధికారివే కదా! పెద్దయధికారి యొకఁడు విశ్రాంతిదీసికొని వివరింపఁగా అటుపైని అధికారమంతయును క్రిందియధికారిదే కదా! అలం. విభావన, అర్థాంతరన్యాసము.

ఉ. పాఁడియుఁ బంటయుం గలిగి పంకవిహీనమనోహరాంబువుల్
[3]వేఁడినచోట నెల్లఁ బ్రభవింపఁగ, భానుఁడు శీతభానుఁడున్
గాఁడినమేఘకాళిమవికారము దూరముసేయు నెంతయున్
నాఁడెముచూపె శారదదినంబులు నిర్మలమౌక్తికాకృతిన్. 43

టీక. పంకవిహీనమనోహరాంబువుల్ = బురదలేని స్వచ్ఛజలములు; వేఁడినచోటనెల్లన్ = కోరిన స్థలములన్నింటను; ప్రభవింపఁగన్ = పుట్టఁగా - కలుగఁగా - ఊరఁగా; భానుఁడున్ = సూర్యుఁడును; శీతభానుఁడున్ = చంద్రుఁడును; కాఁడిన = నాఁటుకొన్న; మేఘకాళిమవికారమున్ = మేఘముల యొక్క వికారపునల్లరూపును; శారదదినంబులు = శరత్కాలపురోజులు; నిర్మలమౌక్తికాకృతిన్ = స్వచ్ఛములగు ముత్యములవలె - నిర్మలములయి యనుట; నాఁడెముచూపెన్ = గొప్పతనమును చూపెను; [ముద్రితప్రతిలో ఇట 'వేఁడిననెల్లచోట' అనుపాఠము కలదు; టీకాకర్తలు 'వేఁడినన్ = కోరినను.' అని అర్థమును వ్రాసిరి.]

సీ. రతుగట్టిరి మహీరమణు లశ్వములకు భూరినీరాజనపూర్వకముగ
ఫలకగ్రహణముఁ జౌపదములగరిమంబుఁ బరఁగె బాలకులకు గురువులిండ్ల
దుమికి చిచ్చఱతోరణములు దాఁటినవారు దాఁటరైరి కృతాంతుతోరణములు
భుజియించెఁ బ్రజ భుజాభోజనంబులు సిగబంటిగాఁ [4]దొలుక్రొత్తవంటకములు
తే. నఖిలదిగ్జయకాంక్షఁ బుష్పాయుధుండు, వెలిగుడారంబులో వచ్చి విడిదిచేసె
మురళి మ్రోయించెఁ ద్రిభువనమోహనముగ, రాధ కింపుగ నాదినారాయణుండు.

1. చ. ట. మఱవ. 2. చ. నురివి. 3. క. నెల్లచోట. చ. ట. చోటనెల్ల. 4. క. తొలి. చ. తొలు

టీక. మహీరమణులు = రాజులు; భూరి......కముగన్ = గొప్పహారతులిచ్చుటతోఁగూడ - తొలుత హారతుల నిచ్చి; రక్షగట్టిరి = రక్షణమున్నకైన మాలికాదికమును కట్టిరి; గురువులిండ్లన్=గురువుల గృహములందు; ఫలకగ్రహణముగన్=పలకలు పట్టుకొనుటయు; చౌపదములగరిమంబున్ =(గీతికల) గిలకలపద్యముల గొప్పతనమును; పరఁగెన్ = జరిగెను; [''చౌపదముల = చిందులు త్రొక్కుటల యొక్క'' అని పూర్వటీక.] దుమికి = గంతులువేసి; చిచ్చుఱతోరణములు = జ్వాలాతోరణములను; [ఎండుటరఁటిమాకులు మొదలగువానిని తోరణములుగఁ గట్టి, వానికి నిప్పు అంటించి, అవి జ్వలించుచున్నపుడు వానిక్రిందినుండి పోవుట కుపయోగించు తోరణములు; ఈ యుత్సవము కార్తికపూర్ణిమనాఁడు. శరదృతువున వచ్చును.] [ 'చిచ్చుఱతోరణములు = నిప్పుగుండములచాళ్లు' అని పూర్వటీక.] కృతాంతుతోరణములు = యమునిచే ఏర్పఱుపఁబడిన దుర్గమములగు తోరణములను; దూరరైరి = ప్రవేశింపరైరి; ఈ లోకమున జ్వాలాతోరణముల క్రిందనుండి పోవువారికి యమలోకమున తోరణములను దూరు బాధ లేదని భావము. ప్రజ = జనము; భుజాభోజనంబులు = విందుభోజనములుగా - తేరగా వచ్చిన భోజనములుగా; తొలుక్రొత్తవంటకములన్ = అప్పటికప్పుడు తయారయిన ఆహారవస్తువులను; సిగబంటిగాన్ = తలమునుఁగ - సమృద్ధిగా; భుజియించెన్; [ఈ 'భుజాభోజనములు' 'భుగాభోజనములు'గా వాడుకలో నున్నది.] పుష్పాయుధుండు = మన్మథుఁడు; అఖిల దిగ్జయకాంక్షన్ = అన్నిదిక్కులను జయించు కోరికతో; వచ్చి; వెలిగుడారంబులోన్ = బయటి (పొలిమేర పన్నిన) గుడారములో; విడిదిచేసెన్ = బసచేసెను - రాధకు సమీపముననే పొంచి యుండెననుట; ఆదినారాయణుండు = విష్ణువు; త్రిభువనమోహనముగన్ = ముల్లోకములు పరవశము లగునట్లు; మురళిన్ = పిల్లనగ్రోవిని; మ్రోయించెన్. - ప్రత్యక్షమై యామెకోరిక నీడేర్చెననుట. అలం. స్వభావోక్తి, ఉదాత్తము.

వ. ఇట్లు నిజజలనిమజ్జజ్జంతుజాలంబులకు ఋణత్రయమోచనహేతువగు నా ఋణవిమోచనతీర్థంబునం దపంబు సేసి రాధ కృతార్థ యయ్యె, నయ్యాదవకి [1]శోరుండును గృశోదరీసహాయుండై మాయాశబలితుండగు జీవపురుషుని [2]పరుసున వివిధభోగపరాయణుండై [3]ప్రవర్తించుచుండె నయ్యెడఁ బుండరీకుని ప్రకారం బాకర్ణింపుము. 45

టీక. నిజ......జాలంబులకున్=తన నీటియందు మునిగిన ప్రాణులకు; ఋణత్రయవిమోచనహేతువగు=దేవఋణము, ఋషిఋణము, పితృఋణము అను ముత్తెఱఁగుల ఋణములను తీర్చుకొనుటకు కారణమైన; [జప, పూజా, హోమాదులవలన దేవఋణమును, వేదాధ్యయనమువలన ఋషిఋణమును, పుత్రసంతానమువలన పితౄణమును తీర్పవలెనని పెద్దలందురు.] అయ్యాదవకిశోరంబును = ఆ గోపబాలకుఁడగు కృష్ణుఁడును; కృశోదరీసహాయుండై = ఆ రాధతోఁగూడి; మాయాశబలితుండగు=మాయచే ఆవరింపఁబడిన; జీవపురుషునిపరుసునన్ = జీవాత్మవిధమున; వివిధభోగపరాయణుండై = అనేకములగు భోగముల ననుభవించువాఁడై.

క. ఉపమింపఁగ రాని తప, స్తపమునఁ గడువాఁడి మీఱు [4]ధరణీసుమన
స్తపనుఁడు కమలవికాసం, బెపుడును నుడివోని తావి నింపువహింపన్. 46

టీక. ఉపమింపఁగరాని = సాటిలేని; తపస్తపమునన్ = తపస్సనెడి వేసఁగియందు; వాఁడిమీఱు = విజృంభించుచున్న; ధరణీసుమనస్తపనుఁడు = బ్రాహ్మణుఁడైన (పుండరీకుఁడను) సూర్యుఁడు;

1. క. కిశోరంబును. చ. కిశోరుండును. 2. చ. పరుసన. 3. క. పరంగు. చ. ట. ప్రవర్తించు. 4. చ. ధారుణి.

ఎపుడును = ఎల్లప్పుడును; ఉడివోని తావిన్ = మానని - విడువని పరిమళముచేతను, పరమాత్మసాక్షాత్కార రూపపరిమళముచేతను; కమలవికాసంబు = తామరపూవులు వికసించుట, హృత్కమలము వికసించుట యును. అలం. శ్లేష.

క. ఆద్యశివాధిష్ఠితమై, యుద్యజ్జ్యోతిర్విలాసయుక్తమై స్వశిరః
[1]పద్యోద్భవమై కడు నన, వద్యమునౌ దళశతారపనజమునందున్. 47

టీక. ఆద్యశివాధిష్ఠితమై = పరమాత్మకు ఉనికిపట్టయి; ఉద్యత్......యుతమై = బయలు దేఱుచున్న కాంతుల విలాసముతో కూడినదై; ["ఉద్యత్ = వెలుఁగుచున్న" అని పూర్వటీక.] స్వశిరః......వమై = తన శిరోమార్గమునందు పుట్టినదయి; కడున్ = మిక్కిలి; అనవద్యమునౌ = దోషరహితమును అయిన; దళ......నందున్ = సహస్రదళపద్మమునందు; అలం. పరికరము.

చ. జొటజొట ధారగా వడియుచుం గడలెత్తు సుధారసంబు [2]గ్రుం
గుటగుట నప్పటప్పటికిఁ గ్రోలుచు నాలుగురెండుమూలలన్
గుటిలత దాల్చు భోగిని గగుర్పొడవించుచు దక్షిణశ్రవ
స్తటవిసరత్ప్రమోదనినదంబునఁ జొక్కుచు మబ్బు[3]గ్రక్కుచున్.

టీక. ధారగాన్ = ప్రవాహముగా; వడియుచున్ = కారుచు; కడలెత్తు = పొంగుచున్న; సుధారసంబున్ = అమృతరసమును; [గ్రుంగుటగుట యనునది త్రాగుటయందలి అనుకరణము.] క్రోలుచున్ = త్రాగుచు; నాలుగురెండుమూలలన్ = ఎనిమిదిదిక్కులను; కుటిలతఁదాల్చు = వంగియుండు- తిరుగుచుండు; భోగిని = కుండలిని; దక్షిణ......నన్, చొక్కుచున్ = కుడిచెవినుండివ్యాపించు మేఘధ్వనికిఁ బరవశమగుచు; మబ్బుఁగ్రక్కుచున్ = చైతన్యముతప్పుచు.

ఉ. విచ్చిన కమ్మదమ్ములకు విందులుపెట్టు వెడందకన్నులున్
బచ్చనిపట్టుఁబేరురముఁ బ్రాఁకిన మచ్చయుఁ బీలి నెట్టెమున్
బచ్చికచాయయుం జిఱుత[4]పాయము గల్గువెలుంగు నిచ్చలో
రచ్చ యొనర్ప నందలి పరాకునఁ దేలుచు వేడ్క నేలుచున్. 49

టీక. = విచ్చిన = విప్పిన; కన్నుదమ్ములకున్ = పద్మములఁబోలు కన్నులకు; విందులు పెట్టు = ఆనందమునుకలుగఁజేయు; వెడందకన్నులున్ = విశాలనేత్రములును; పచ్చనిపట్టున్ = పీతాంబరమును; పేరురమున్ = విశాలవక్షముపయి; ప్రాఁకిన = వ్యాపించిన; మచ్చయున్ = శ్రీవత్సాంకమును; పీలినెట్టెమున్ = పికిలిపిట్టయీఁకలశలపాగయును; పచ్చికచాయయున్ = పచ్చికవలె శ్యామలమైన రంగును; వెలుంగున్ = కాంతి-దివ్యజ్యోతియు; ఇచ్చలోన్ = మనస్సునందు; రచ్చయొనర్పన్ = కొలువు తీర్చియుండఁగా - భగవంతుఁడు మనస్సున తోఁచగా; అందలిపరాకునన్ = అందలి ఆసక్తియందు; తత్పరత్వమునందు; అలం. పర్యాయోక్తము.

చ. గురుజనభక్తియుం గపటగోపకుమార[5]పదాబ్జభక్తియున్
[6]దరులుగఁ బాపభూరుహవితానము [7]లీనముగాఁ జెలంగు భా
స్వరతరయోగసింధువున సౌఖ్యము నొందుచుఁ జిద్విసాంకురా
హరణ మొనర్చి భూమిసురహంసము చాలఁ బ్రశంస నొందఁగన్. 50

టీక. కపట......సక్తియున్ = శ్రీకృష్ణావతారమెత్తిన భగవంతుని పాదములయెడఁ గల ఆసక్తియును; దరులుగన్ = ఒడ్డులుగను; [ఇచట పూర్వటీకలో 'తరలఁగన్ = చలింపఁగా' అని

---

1. చ. ప్రద్యోద్భవమై. 2. చ. ట. గ్రగ్గుటుకున. 3. చ. ట. వ్రక్కుచున్. 4. ట. ప్రాయము. 5, చ. కుమారు. 6. క. దరలఁగ. చ. శ. ర. ట. దరులుగ. 7 వినీలము.

యున్నది; అది తప్పు.] పాపభూరుహవితానము=పాపములనెడి వృక్షముల గుంపు; లీనముగాన్=మునిఁగి పోవునట్లుగా - నశించునట్లుగా; చెలంగు = ప్రకాశించు; భాస్వరతరయోగసింధువునన్ = మిక్కిలి ప్రకాశించు యోగమను నదియందు; చిద్బిసాంకురాహారణము, ఒనర్చి = జ్ఞానమనెడి తామరతూండ్ల అంకురములను తిని; భూమిసురహంసము = బ్రాహ్మణుఁడను (పుండరీకుఁడను) హంసము; అలం. రూపకము.

సీ. తన మొగంబులు ప్రాఁతఖనిమణీనికరముల గము లుద్భవిల్లెడు కనులుగాఁగఁ
దన కమండలువారి దనుజారిపాదార్ఘ్య ములవరించుట [1]కూట చెలమగాఁగఁ
దనమది నెద్దిదోఁచిన నది యొక్కొక్క రూపాంతరంబునఁ బ్రోదిపడయఁ
దన కట్టునజినరత్నము సృష్టిదీక్షకై [2]కట్టినయది వోలెఁ గప్పుదేర
తే. వీఁచు వీవన చేఁబూని వెనుకఁ దనకు
చిఱుతచనుదోయి యొరగుగాఁ జేసి పలుకుఁ
జెలువ కొలువంగఁ దోలుకారు [3]కలఁకపులుఁగు
మావురావుత్తు నిలిచె బ్రాహ్మణునిమ్రోల. 51

టీక. ప్రాఁత......గములు = వేదములనెడి రత్నములగుంపులు; ఉద్భవిల్లెడు = పుట్టునట్టి; కమండలువారి = కమండలములోని జలము; దనుజారిపాదార్ఘ్యము = విష్ణువునకు కాళ్లుకడుగుటను; అలవరించుటకున్ = కూర్చుటకు; తనమదిన్ = తనమనస్సునందు; ఎద్ది, తోఁచినన్ = ఏది (చేయుటకు) తోఁచినను; అది = అయ్యది; ఒక్కొక్క రూపాంతరంబునన్ = వేఱువేఱు రూపున; ప్రోది, పడయన్ = రక్షణను పొందఁగా; తనకట్టునజినరత్నము = తాను కట్టుకొన్న శ్రేష్ఠమయిన చర్మము; సృష్టిదీక్షకై = సృష్టిచేయవలెనను దీక్షకొఱకయి; కప్పుదేఱన్ = నలుపెక్కఁగా - దీక్షావస్త్రము చాల రోజులవఱకును విడువరాని దగుటచే అది ముఱికికలదయి నలుపెక్కినదనుట; ఒఱుగుగాఁ జేసి = ఆనుకొనుదిండుగాఁ జేసి; పలుకుఁజెలువ = సరస్వతీదేవి; తోలుకారు......రావుత్తు = వర్షాకాలమున కలఁతపొందు పక్షియగు హంస వాహనముగాఁగల బ్రహ్మ. అలం. ఉదాత్తము, పర్యాయోక్తము.

చ. నిలిచి నిలింపలోకతటినీతటనీరజహేమనీరజో
జ్జ్వలబిసనాళఖాదనమువంకన పొంకము [4]మీఱు క్రొవ్వునన్
గళము గదల్పలేని తురగంబుఁ దటాలున డిగ్గి నమ్రతా
కలితశరీరునిం దిగిచి కౌఁగిటఁ జేరిచెఁ బుండరీకునిన్. 52

టీక. నిలింప......వంకన - నిలింపలోకతటినీ = స్వర్గంగానదియొక్క; తట = ఒడ్డునఁగల; నీరజ = నీటిలోఁబుట్టిన; హేమనీరజ = స్వర్ణకమలములయొక్క; ఉజ్జ్వల = మిక్కిలి ప్రకాశించు; బిసనాళఖాదనమువంక = తామరతూండ్లకాఁడలను తినుటయందే; పొంకముమీఱు = అతిశయించు; క్రొవ్వునన్ = మదముచే; గళమున్=మెడను; తురగంబున్ = వాహనమైన హంసనుండి; నమ్రతాకలితశరీరునిన్ = వినయముతోఁగూడిన - వంచఁబడిన దేహముకల; పుండరీకునిన్; దిగిచి = చేరఁదీసి; కౌఁగిటన్, చేరిచెన్ = కౌఁగిలించెను. అలం. ఉదాత్తము.

ఉ. చేరిచి నేమమే? సితకుశేశయలోచనగోచరాత్మ! నీ
వారికి నీకు నన్న విని వారిరుహాసనుఁ బల్కు నమ్మహా
దారుఁ డమేయభద్రసముదాయ[5]నిదానము నీవు వచ్చుటన్
సారసగర్భ! యింకఁ గొనసాఁగుఁ జుమీ కుశలంబు [6]మాదెసన్. 53

---

1. చ. కూటు. 2. క. కప్పి. చ. కట్టి. 3. శ. ర. కలుగు. 4. క. మీరు. చ. మీఱు. 5. క. నిదానము. చ. నిదానమ. 6. చ. మీదెసన్.

టీక. సిత......రాత్మ! = తెల్లదామరలవంటికన్నులుగల విష్ణువు గోచరమగు మనస్సుకల పుండరీకుఁడా! వారిరుహాసనుక్ = బ్రహ్మనుగూర్చి; సారసగర్భ! = ఓబ్రహ్మా! అమేయభద్రసముదాయ నిదానము = సాటిలేని శుభములగుంపునకు మూలకారణమైనవాఁడవు.

క. అని పరమాసన మిడి [1]తా, ననిమిషు లర్చించి[2]నట్ల యర్చించె జగ
జ్జననస్థితిలయకారణు, జని నజునిక్ సుజనమతిరజనిరజనీశున్. 54

టీక. పరమాసనము, ఇడి = గొప్ప ఆసనమును వేసి; తాను = పుండరీకుఁడు; అనిమిషులు = రెప్పపాటు లేని దేవతలు; అర్చించినట్లు = పూజించువిధమున - గొప్పగా; జగత్......జనిక్ = లోకములఉత్పత్తి, స్థితి, లయములకు కారణమగువానిని; సుజన...రజనీశుక్ = మంచివారిమనస్సు అనెడి రాత్రికి చంద్రుఁడైనవానిని; అజునిక్ = బ్రహ్మను; [ముందుపద్యముతో సమన్వయము.] అలం. పరికరము.

క. అర్చించి నిలిచి చేతులు, గూర్చి పురఃస్థలికిఁ జాఁచి గోవిందపదా
బ్జార్చా[3]రసపాకవిధుఁ డ,నర్చిత తదితరుఁడు, క్షితిసురాగ్రణి పల్కెన్. 55

టీక. చేతులు కూర్చి=చేతులు జోడించి; పురఃస్థలికిక్,= ముందునకు; గోవింద......విధుఁడు= శ్రీవిష్ణుపాదారవింద పూజయను రసపాకమునకు చంద్రుడైనవాఁడు; అనర్చితతదితరుఁడు = పూజింపని యితరులు కలవాఁడు - ఇతరదేవతలను పూజింపనివాఁడు; క్షితిసురాగ్రణి = బ్రాహ్మణుఁడు - పుండరీకుఁడు. అలం. రూపకము, పరికరము.

సీ. విజ్ఞానవంద్యుఁ డీవిశ్వనిర్మాత యాత్మారాముఁ డీత్రిలోకాధికారి
భ్రూమధ్యజనితరుద్రుం డీమహామతి యజ్ఞాతచర్యుఁ డీప్రాజ్ఞతముఁడు
సర్వావయవజప్రజావ్రజుం డీవేల్పు ముఖ్యాత్ముఁ డీత్రయీమూలభూతి
దక్షాదికప్రజోద్భవహేతు వీయయ్య కర్మైకసాక్షి యీనిర్మలుండు
తే. శాశ్వతుం డీతఁ డద్భుతైశ్వర్యుఁ డితఁడు
శాంతుఁ డీతఁడు వాఙ్మనఃకాంతుఁ డితఁడు
ననఁగ వెలుఁగొందు నీవు నా కతిథి వైతి
వేను [4]వొలిమేనఁ జేసిన దెట్టి నోమొ ! 56

టీక. విజ్ఞానవంద్యుఁడు-విజ్ఞాన=విశేషజ్ఞానము కలుగుటచే (కలవాఁడగుటచే); వంద్యుఁడు=నమస్కరింపఁదగినవాఁడు; విశ్వనిర్మాత = లోకసృష్టికర్త; త్రిలోకాధికారి = ముల్లోకములకును ప్రభువు; ఆత్మారాముఁడు = ఆత్మయందు క్రీడించి ఆనందించువాఁడు; మహామతి = గొప్పబుద్ధికలవాఁడు; భ్రూమధ్యజనితరుద్రుఁడు = కనుబొమలనడుమపుట్టిన శివుఁడు కలవాఁడు; ప్రాజ్ఞతముఁడు = ప్రాజ్ఞులలో శ్రేష్ఠుఁడు; అజ్ఞాతచర్యుఁడు = తెలియరాని చిత్రచర్యకలవాఁడు; వేల్పు = దేవత; సర్వా...... వ్రజుండు = (తనయొక్క) అన్ని అవయవములనుండియు పుట్టిన ప్రజల సమూహము కలవాఁడు; ముఖ్యాత్ముఁడు = ప్రధానమైనవాఁడు; త్రయీమూలభూతి = వేదములకు మూలకారణము; దక్షాదిక ప్రజోద్భవహేతువు = దక్షుఁడు మొదలగు ప్రజాపతులపుట్టుకకు కారణమైనవాఁడు; కర్మైకసాక్షి = (మనముచేయు)కర్మలకు ముఖ్యసాక్షి; వాఙ్మనఃకాంతుఁడు = సరస్వతీదేవికి భర్త.

మ. అరుణావిష్కృతి భాస్కరోదయముఁ బద్మామోద మంభోరుహా
కరముక్ వెలుఁగువిల్ ప్రవర్షణము నోంకారంబు మంత్రాక్షర

1. తన్నుమి. 2. క. నట్టుల. చ. ట. నట్లయ. 3. క. పాన. చ. ట. పాక. 4. క. తొలు.

స్ఫురణంబుఁ బ్రకటింపఁగా మొదల నుద్భూతంబు లైనట్లు [1]శ్రీ
శ్వరుఁ డేతెంచుటకుఁ ద్వదాగమ[2]మహా! సంసూచకం బయ్యెడున్. 57

టీక. అరుణావిష్కృతి = అనూరునిపొడుపు; భాస్కరోదయముఁ=సూర్యోదయమును; పద్మామోదము = తామరలపరిమళము; అంభోరుహాకరముఁ = పద్మసరస్సును; వేలుపువిల్ = ఇంద్రధనుస్సు; ప్రవర్షణముల్ = ఎక్కువవర్షమును; ప్రకటింపఁగాన్ = తెలియఁజేయుటకు; ఉద్భూతంబులు, ఐనట్లు = పుట్టినట్లు; త్వదాగమము = నీరాక; శ్రీశ్వరుఁడు = విష్ణువు; ఏతెంచుటకున్ = వచ్చుటకు; అహా! = ఎంతసంతోషము! సంసూచకంబు, అయ్యెడున్ = తెలియఁజేయునదై యున్నది. అలం. మాలోపమ.

ఉ. త్వాదృశులందు నందకము [3]దాలుచు వేల్పు వసించు[4]నట్లు ల
ర్చాదుల నూఁదియుండుఁ డని యాడుదు; రట్లగుటన్ సమస్తవ
స్తూదయహేతుభూతి వెలుఁగొందెడు మీరిట కిట్లు వచ్చుటన్
శ్రీదయితాగమంబు కడుఁ జేరువయౌ నని నిశ్చయించితిన్. 58

టీక. త్వాదృశులందున్ = నీవంటివారియందు; నందకము దాలుచు వేలుపు = నందకమను పేరిటి కత్తిని ధరించు విష్ణువు; అర్చాదులన్=పూజమొదలగువానియందు; ఊఁది = పూని; ఆడుదురు= పలుకుదురు. సమస్తవస్తూదయహేతుభూతి = అన్నిపదార్థముల అభ్యుదయమునకును కారణభూతుఁడైనవాఁడవు - బ్రహ్మవు; శ్రీదయితాగమంబు = శ్రీవిష్ణుదేవునిరాక.

క. నావిని నగుమొగమున న,ద్దేవజ్యేష్ఠుండు వాసుదేవప్రియు సం
భావించి సజలజలధర,రావనిభగభీర[5]కంధరాధ్వనిఁ బలుకున్. 59

టీక. దేవజ్యేష్ఠుండు = దేవతలకుపెద్ద - బ్రహ్మ; వాసుదేవప్రియుఁ = విష్ణుభక్తుని - పుండరీకుని; సంభావించి = గౌరవించి; సజల...ధ్వనిన్ = సజలజలధర = నీటితోఁగూడిన మేఘముయొక్క; రావ = ధ్వనితో; నిభ=సమానమైన; గభీరకంధరాధ్వనిన్ = గంభీరమైనకంఠస్వరముతో. అలం. ఉపమ

చ. ఒసఁగెద [6]వేఁడు నీకు వరమో పరమవ్రత! యొద్దియేనియుఁ
మసలక యన్న నన్నయసమన్వితుఁ డిట్లను నట్టి[7]దేనియుఁ
బిసరుహగర్భ! దుర్భవవిభేదనుపైఁ దలఁపుం దదీయసం
గసుఖ మఖండధర్మపరికర్మముఁ గూర్మి నొసంగు నాకొగిన్. 60

టీక. పరమవ్రత! = గొప్ప నియమముగలవాఁడా! (పుండరీకుఁడా!) మసలక = ఆలసింపక; అన్నయసమన్వితుఁడు = ఆ నీతిమార్గయుక్తుఁడగు పుండరీకుఁడు; బిసరుహగర్భ! = బ్రహ్మా! దుర్భవవిభేదనుపైన్=చెడ్డవైన పుట్టుకలను నశింపఁజేయు విష్ణువుపయి; తదీయసంగసుఖము = అతనిం జేరుటవలనఁ గల్గు సుఖమును; అఖండధర్మపరికర్మము=అడ్డులేని ధర్మమార్గప్రవర్తనమును; ఒగిన్=బాగుగా-ప్రీతితో.

చ. అనవుడు నట్ల యిచ్చి కమలాసనుఁ [8]డా శమశాలిఁ బల్కె నో
మునివర! నీవు సేయుతపముం జపముం బెరరేప నెల్లి నేఁ
టన భవదగ్రవీథిఁ గడారపటుం డిటు వచ్చు; మున్నె యా
యన నిను నేలినాఁడు చరితార్థుఁడ వీవు చతుర్థసంపదన్. 61

---

1. క. లీ. చ. ట. శ్రీ. 2. క. ముహా. చ. మహా. 3. చ. దాల్చుచు. 4. చ. నట్ల. 5. క. కంధర. చ. ట. కంధరా. 6. క. నీకువేఁడు. చ. వేఁడునీకు. 7. చ. లేనియున్. 8. చ. డద్దమ.

టీక. కమలాసనుఁడు = బ్రహ్మ; శమశాలిన్ = శాంతగుణముచే ఒప్పు మునిని - పుండరీకునిఁ గూర్చి; పెరరేపన్ = ప్రేరేపింపఁగా - ప్రోత్సహింపఁగా; కడారపటుండు=కపిలవర్ణముగల వస్త్రమును ధరించినవాఁడు - పీతాంబరుఁడు - విష్ణువు; ఎల్లి, నేటన = నేఁడు రేఁపులలో; భవదగ్రవీథికిన్ = నీయెదుటికి; ఈవు = నీవు; చతుర్థసంపదన్ = మోక్షసంపదచేత; చరితార్థుఁడవు= కృతార్థుడవయితివి.

క. నీ యీక్షేత్రము నోమునినాయక ! దేవర్షి [1]నరగణప్రార్థితని
శ్శ్రేయసవదాన్య మగు నని, పోయెం బయోజాతసూతి; పోయిన నతఁడున్. 62

టీక. దేవర్షి......వదాన్యము = దేవతలు, మునులు, నరులు మొదలగువారి సమూహముచే కోరఁబడిన శుభములనొసఁగునది; పయోజాతసూతి = కమలోద్భవుఁడు - బ్రహ్మ.

ఉ. ధాతఁ దలంచి మ్రొక్కి యవదాతసరోజదళాక్షుఁ [2]గాంచు లో
బ్రాఁతి [3]పెనంచి యన్నలువపల్కులు సత్యములొక్కొ వాక్కథా
[4]ప్రోత ముకుందుఁ [5]డెందు ననుబోటికి దక్కునె? దక్క కేమి? భ
క్తాతురతాపహారి దనుజారి యనా విన మే బుధోక్తులన్. 63

టీక. ధాతన్ = బ్రహ్మను; అవదాతసరోజదళాక్షున్=తెల్లదామరలవంటి కన్నులుగల విష్ణుని; కాంచు = చూచునట్టి; లోబ్రాఁతి = మనస్సులోని ఆసక్తిని; పెనంచి = పెనమకొని - అతిశయింపఁ జేసికొని - విష్ణుఁజూచు ఆతురత ఎక్కువ కాఁగా-అని భావము; అన్నలువపల్కులు = ఆబ్రహ్మమాటలు; వాక్కథాప్రోత=వాక్కులచేతను, కథలచేతను కూర్పఁబడినవాఁడు - కొనియాడఁబడినవాఁడు; ముకుందుఁడు=మోక్షదాత; దనుజారి=రాక్షసులకు శత్రువగు విష్ణువు; భక్తాతురతాపహారి=భక్తులయొక్కయు, విపన్నులయొక్కయు బాధను పోఁగొట్టువాఁడు. [క్రిందిపద్యముతో సమన్వయము.] అలం. అనుప్రాసము.

సీ. అవచూడ బర్హిబర్హమున నొండొంటి [6]సిక్కము లంటి చల్లిచిక్కము దలిర్పఁ
బంటకార్వోలిదమ్మి[7]దంట గెంటసమాడు వెడఁదకన్నులకాంతి [8]వెల్లివాడువ
మెఱుఁగుఁజెక్కులమీఁద మిట్టించి మొసలివాగడమద్దికాయల[9]కళుకు లమర
వక్షఃస్థలమున శ్రీవత్సకౌస్తుభవైజయంతు లిందిరతోడి వంతు వడయ

తే. నిమ్ననాభియుఁ ద్రివళీ[10]వల్గితజఠరము
కరకలితచిత్రభద్రశంఖములు నమర
[11]మన్మనస్సీమ నేప్రొద్దు మలయుచున్న
ధూర్తబాలుఁడు నామ్రోలఁ దోఁచునొక్కొ ! 64

టీక. అవచూడబర్హిబర్హమునన్ = సిగయందలి నెమిలిపింఛమున; ఒండొంటి...లంటి = ఒక దానియల్లిక నింకొకటి చిక్కుకొని; అమరన్ = అమరియుండఁగా - తగినట్లుండగా; పంటకార్వోలిదమ్మి జంటన్ = శరత్కాలమునందలి మేలైన తెల్లతామరలను; గెంటసమాడు = తిరస్కరించు; వెడఁద = విశాలమైన; వెల్లివాడువన్ = వ్యాపింపఁగా; మిట్టించి = మీఁదికెగిరి - విజృంభించి; మొసలివాగడ మద్దికాయలకళుకులు = మకరకుండలముల తళుకులు; ఇందిరతోడన్ = లక్ష్మీదేవితోఁగూడ; వంతు వడయన్=వంతువేసికొనఁగా - లక్ష్మితోఁబాటు అవియును వక్షఃస్థలమున ఉండఁగా; నిమ్ననాభియున్ = లోతైన బొడ్డును; త్రివళివల్గితజఠరము=మూఁడు మడతలతోనుకూడిన కడుపు; కర...శంఖములు = చేతిలోని రంగులసంచియు, శంఖమును; మలయుచున్న = తోఁచుచున్న - తిరుగుచున్న; ధూర్తబాలుండు = అల్లరిపిల్లవాఁడైన శ్రీకృష్ణుఁడు. అలం. స్వభావోక్తి, ఉదాత్తము.

1. చ. సుర. 2. క. గాంచి. చ. ట. గాంచు. 3. చ. ట. పెనంచి. 4. చ. ప్రోతు. 5. చ. ట. నంద. 6. చ. సిద్ధము. 7. ట. దంటు. 8. చ. లోలేదు. 9. క. తళుకు. చ. కళుకు. 10. చ. వర్ధిత. 11. క. మన్మనంబున. చ. ట. మన్మనస్సీమ.

క. అని యీగతి మీమాంసా,వని మానసమ్మృగముఁ ద్రిప్పు వైష్ణవరత్నం
బునకు నిజదక్షిణేక్షణ,వనజచ్ఛద మదరె శుభనివహాపిశునంబై. 65

టీక. ఈగతిన్ = ఈరీతిని; మానసమ్మృగమున్ = మనస్సను జింకను; మీమాంసావనిన్ = సందేహమను అడవియందు; నిజ...చ్ఛదము = తామరపూవురేకువంటి తన కుడికన్ను; శుభనివహాపిశునంబై = శుభసమూహమునకు సూచకమై; అదరెన్; కుడికన్ను దరుట మగవారికి శుభసూచకమని సంప్రదాయసిద్ధమగు సిద్ధాంతము.

తే. నాఁడు మఱునాఁడు నవ్విప్రనందనుండు, ధాతమాటలచందంబు దానవారి
తనకడకు[1]వచ్చురాములుదలఁచితలఁచి, ముచ్చటలయేటితరఁగలమునిఁగి మునిఁగి.

టీక. అవ్విప్రనందనుండు = ఆ బ్రాహ్మణకుమారుఁడు - పుండరీకుఁడు; దానవారి = రాక్షసులకు శత్రువగు విష్ణువు. అలం. రూపకము.

వ. మూఁడవనాఁడు యథాకాలప్రబుద్ధుండై పూర్వాశ్రితసిద్ధాశ్రమంబున బద్ధపద్మాసనాసీనుండై. 76

టీక. యథాకాలప్రబుద్ధుండై = యుక్తకాలమున మేల్కొన్నవాఁడై; బద్ధపద్మాసనాసీనుండై = పద్మాసనబంధము వేసికొని కూర్చున్నవాఁడై.

క. కరివదనదేవతామిళ,దరుణాభచతుర్దళాఢ్య వాదిమసాంతా
క్షరయుత మగు నాధారాం,బురుహంబునఁ గలుగు వలపు బుగులుకొనంగన్. 63

టీక. కరి...యుతము - కరివదనదేవతామిళత్ = విఘ్నేశ్వరుఁడు దేవతగాఁగలదియు; అరుణాభ = ఎఱ్ఱని కాంతి గలదియు; చతుర్దళాఢ్య = నాలుగు ఱేకులు కలదియు; వాదిమ, సాంతాక్షరయుతము = వకారము మొదలు సకారమువఱకుఁగల అక్షరములు - వశషస-అను నక్షరములు కలది; అగు; ఆధారాంబురుహంబునన్ = మూలాధారకమలమునందు; కలుగు వలపు = ఉన్న పరిమళము; బుగులుకొనంగన్ = నిండుకొనఁగా.

క. [2]పూనఁ దటిత్ప్రభ షడ్దళ,మై నలువ వసింప బాది లాంతాక్షరసం
ధానస్ఫుట మగు స్వాధి,ష్ఠానాబ్జమునందు వెడల సత్సౌరభముల్. 69

టీక. తటిత్ప్రభ = మెఱుపుయొక్క కాంతివంటికాంతితో; షడ్దళమై = ఆఱు ఱేకులుకలదయి; నలువ వసింపన్ = బ్రహ్మ అధిష్ఠానదేవత కాఁగా; బాదిలాంతాక్షరసంధానస్ఫుటము=బ మొదలుకొని ల వఱకుఁగల—(బభమయరల - అను) నక్షరములకూర్పుచే ప్రకాశించునది; స్వాధిష్ఠానాబ్జమునందున్ = స్వాధిష్ఠానపద్మమునందు; సత్సౌరభముల్ = మంచిపరిమళములు; వెడలన్ = బయట వ్యాపింపఁగా.

క. డాద్యము ఫాంతిమమును నీ,ల ద్యుతియుఁ బురాణపురుషలాలితము సుధీ
వేద్యము నగు దశపత్ర స,ముద్యన్మణిపూరకమున మొలవఁగఁ దావుల్. 70

టీక. డాద్యము = డకారము మొదటఁగలది; ఫాంతికము = ఫకారము చివఱఁగలది - అనఁగా; డ ఢ ణ త థ ద ధ న ప ఫ అని నక్షరములుకలది; నీలద్యుతియున్ = నల్లనికాంతియు; పురాణపురుషలాలితము = విష్ణుదేవతచే లాలింపఁబడినది - ఇంపైనది;—విష్ణు వధిదేవత యగుటచే చక్కనిదనుట. సుధీవేద్యము = పండితులచేఁ దెలియఁదగినది; దశపత్రసముద్యన్మణిపూరకమునన్ = పదిఱేకులచే వెలుగు మణిపూరకకమలమునందు; తావుల్ = పరిమళములు; మొలవఁగన్ = పుట్టఁగా.

క. శైవము ద్వాదశదళరే,ఖావళితకఠంబు క్రమ్రకనకచ్ఛాయా
శ్రీనహము నౌ ననాహత, మే వేళం జెడని గంధ మిగురొత్తింపన్. 71

---

1. 'వారి' అని ఒకప్రతిపాఠమని. శ. ర. 2. చ. ఊన.

టీక. శైవము = శివుఁడు దేవతగాఁ గలదియును; ద్వాదశ...శంబు = పండ్రెండు ఱేకులచేతఁ జుట్టఁబడిన క మొదలు ఠ వఱకుఁగల - క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ - అను పండ్రెండక్షరములు కలది; కమ్రకనకచ్ఛాయాశ్రీవహము = ప్రకాశించు బంగారువన్నెకలిమిని వహించినది - బంగారు వన్నెకలిగి ప్రకాశించునది; అనాహతము = అనాహతకమలము; ఏ వేళన్ = ఎల్లప్పుడును; చెడని గంధము = చెడిపోని గొప్పపరిమళమును; ఇగురొత్తింపన్ = చిగుర్చునట్లు చేయఁగా - అతిశయింపఁజేయఁగా.

క. పదియాఱు ఱేకులందును, బదియాఱుసొరంబు లుండఁ బరమజ్యోతి
ష్పదమై సురమునివశతన్, బొదలు విశుద్ధమునఁ బొంకముగఁ బరిమళముల్. 72

టీక. పదియాఱుసొరంబులు = స్వరములగు పదునాఱచ్చులును - అ - ఆ - ఇ - ఈ - ఉ - ఊ - ఋ - ౠ - ఌ - ౡ - ఏ - ఐ - ఓ - ఔ - అం - అః అనునవి; పరమజ్యోతిష్పదమై = గొప్ప వెలుఁగునకు స్థానమై; సురమునివశతన్ = నారదుఁడు అధిదేవతగాఁ గలదగుటచేత; విశుద్ధమునన్ = విశుద్ధకమలమునందు; పొంకమునన్ = పొందికగానుండఁగా; - పొందిక కాఁగా.

క. దళయుగమున హంక్షంబులు, పొలుపొందఁ జిదంశ మగుచు భూరిమణివిభా
వళిఁ దగు నాజ్ఞాపురమునఁ, గలవాసన లేసరేఁగి కడలుకొనంగన్. 73

టీక. దళయుగమునన్ = రెండుఱేకులందు; ['రెండుఱేకులచేత' అని పూర్వటీక.] పొలుపొందన్ = ప్రకాశింపఁగా; చిదంశమగుచున్ = జ్ఞానాంశమైనదగుచు; భూరిమణివిభావళిన్ = ఎక్కువైన మణుల కాంతిపంక్తులచే; తగు = తగియున్న; ఆజ్ఞాపురమునన్ = ఆజ్ఞాచక్రమయిన కమలమునందు; వాసనలు = పరిమళములు; ఏసరేఁగి = మిక్కిలి రేఁగి; కడలుకొనంగన్ = వ్యాపింపఁగా.

ఉ. ఇంతను నూర్ధ్వమై శిరసు నిక్క నధోముఖమూర్తిఁ బొల్చి య
త్యంతవికాసశాలియయి [1]యాద్యశివాశ్రయమై సహస్రప
త్త్రాంతరచిత్సుధారసమహాఝరదుర్దిన మాచరించు న
ద్దొంతరపువ్వునం గలుగు తోరపుఁగంపులు పెంపుమీఱఁగన్. 74

టీక. ఇంతకున్, ఊర్ధ్వమై = ఈ యాఱుకమలములకును మీఁదుగానుండి; శిరసునిక్కన్ = శిరస్సను స్థానమున - శిరోభాగమున; అధోముఖమూర్తిన్ = క్రిందుగానుండుముఖముగలరూపుతో - తలక్రిందుగా; పొల్చి = ప్రకాశించి; అత్యంతవికాసశాలి, యయి = మిక్కిలిప్రకాశించుచున్నదయి; ఆద్యశివాశ్రయమై = మొదటివాఁడైన - మూలపురుషుఁడైన భగవంతునికి (పరమాత్మకు) నివాసమయి; సహస్ర.....దుర్దినము- సహస్రపత్త్ర = వేయిఱేకులు గల సహస్రారకమలముయొక్క; అంతర = లోపలనున్న; చిత్సుధారస మహాఝర = జ్ఞానామృతరసముయొక్క గొప్పప్రవాహముచే; దుర్దినము= (మేఘములుకప్పిన) వర్షాకాలపుదినమును; ఆచరించు = చేయు - కలిగించు; అద్దొంతరపువ్వునన్ = సహస్రారమున; తోరపుఁగంపులు = ఎక్కువైన పరిమళములు.

మీఁదియాఱు కమలములకును మీఁదుగా శిరోభాగమున సహస్రారపద్మమున్నదనియుఁ, అది పరమాత్మకు నివాసమనియు అందుండి చిదానందామృతము వెల్లువలయి పాఱుచుండుననియుఁ, అట్టి పద్మముపరిమళములు నలుగడల వ్యాపించుననియు భావము.

చ. కనదరుణప్రభావిభవగర్వ మఖర్వముగా నొనర్చుచుం
దనువు తళుక్కునన్ మెఱవఁ దత్సరసీరుహపంక్తిపేరి ని
చ్చెన వడి నెక్కి నిక్కి నిజజిహ్వికఁ జాఁచి లలాటమధ్యసం
జనిత సుధామయూఖసుధ సర్పపుకంద్రిక క్రోలి సోలఁగన్. 75

1. చ. యాద్యుఁ.

టీక. కనద.....గర్వము = ప్రకాశించు ఎఱ్ఱనికాంతి సంపదయొక్క అతిశయమును; అఖర్వముగాన్ = ఎక్కువగా (తక్కువకాని దానినిగా); ఒనర్చుచున్ = చేయుచును; తత్సరసీరుహపఙ్క్తిపేరి నిచ్చెనన్ = మీఁది కమలములసమూహమనెడి నిచ్చెనను; నిజజిహ్వకన్ = తననాలుకను; లలాట.....సుధన్ = నొసటిమధ్యమునఁ (సహస్రారమున) బుట్టిన చంద్రునియందలి అమృతమును; సర్పపురంధ్రిక = ఉత్తమజాతినాగుఁబాము; ప్రోలి = త్రాగి; సోలగన్ = పరశముకాఁగా.

క. హృన్మణి సూత్రాకృతి యగు, చిన్మూర్తిఁ బురాణపురుషు [1]శేషావాసుం
గన్మోగిచి లోనిచూపున, సన్మాన్యుఁ డతండు చూచు సమయమునందున్. 76

టీక. సన్మాన్యుఁడు = గొప్పవారిచే పూజింపఁదగినవాఁడు; (ఆతఁడు = పుండరీకుఁడు); హృన్మణిసూత్రాకృతి = హృదయమనుమణియందు సూత్రముయొక్క ఆకారముకలవానిని - సూత్రమైనవానిని; చిన్మూర్తిన్ = జ్ఞానస్వరూపుని; పురాణపురుషున్ = మిక్కిలిప్రాచీనుఁడైన పురుషుని - ఆదిపురుషుని; శేషావాసున్ = శేషునిపై నుండువానిని - శేషతల్పమున శయనించువానిని; కన్మోగిచి = కన్నుమూసి; లోనిచూపునన్ = అంతర్దృష్టితో.

దండకము. కడిఁది [2]యసురధేనుకున్ ధేనుకుత్కీల దంభోళి [3]సంస్తంభిదోస్తంభసంభూతశౌర్యాగ్నిచేఁ గ్రాఁచి గోలోకముం గాచి గోవర్ధనక్షోణిభృత్కందరక్షోణి. గ్రీడించు విన్మాణి - పెన్నాటకంబైన క్రొన్నాన్నులం గల్గు పెందళ్కులన్ [4]నల్గడం జిల్కు నెమ్మోముజాబిల్లి శోభిల్ల, నుత్ఫుల్ల గల్లద్వయిన్ హత్తి మత్తిల్లి వర్తించుచున్ మాకరాకారరేఖాభిరామంబులౌ కుండలంబుల్ సమగ్రప్రభామండలంబుల్ చలింపన్, నిలింపాశుగాసాకృతిన్ మాసరంబైన మాయూరపింఛంబుతో నైక్యముం బొందు చిక్కంబుచే గొప్పయై కొప్పు గన్పట్టఁ, గన్పట్టఁగా[5]రాని వేడ్కన్ మహాఫాలపట్టంబుపై నెట్టుకో నిగమకమలగంధముల్ సంధిలం జేయు నాసాపుటిన్ ప్రస్ఫుటస్ఫూర్తి వర్తింప దృప్యద్ధనుస్సంపదల్ పెంపుమీఱంగ, రంగద్రుచిన్ శాక్వరస్కంధబంధుత్వగంధంబు రూపించు మూఁపుల్ పురాయింప, సింపారురేఖత్రయీమైత్రి నేత్రప్రియం బిచ్చుచున్ గఁబు [6]పాకంబుపాకంబునన్ బంధురంబై వలత్కంధరం బొప్పఁ, గప్పెక్కు నీలంపుఁగంబంబులంబోలు బల్గేలు లీలావిభూషావళిం జాల భాసిల్ల, నుల్లోకసౌందర్యధుర్యస్థితిన్ విస్తృతంబౌ నురస్సీమ జీమూతమై హారవర్షోపలశ్రేణి రాణించు మించుం బురాణింపఁగాఁ జేయు నచ్చోన యచ్చూచ్ఛన[7]భానుచ్ఛవిం దుచ్ఛముం జేసి కంజాతవాసాంఘ్రికంజాతలాక్షాంకశంకావహంబైన పంకేజరాగం బిగుర్పంగ, శ్రీచరణ[8]యుగళహాటకంబై కన[9]ద్ధాటకోద్యత్తులాకోటు లూటాడుచున్ జాటువాచాటతన్ [10]జాటి ముప్పేటగాఁ జుట్టినన్ దీఁగచుట్టుల్ గటిన్ సంఘటిల్లన్, దటిల్లేఖ లేఖర్షభుం జేరి రంజిల్లునా నల్లలత్కాంతిగోయష్టి యుత్కృష్టమై హెచ్చుగా నిచ్చకున్ వచ్చుచున్ గ్రచ్చకాయల్ కరాధిష్ఠితాజాండషండంబు

1. ట. చింతింపుచుఁదా. 2. క. యసురు. చ. ట. యసుర. 3. చ సస్తాభ. ట. సస్తంభ. 4. చ. ట. నల్గడం. క. నల్గడల్. 5. చ. గోరి. 6. క. లో మొదటి 'పాకఁబు' లేదు. చ. ట. లలో ఉన్నది. 7. క. భాను. చ. ట. భాను. 8. చ. యుగళీ. 9. చ. ధాటకో. 10. చ. జాటు.

లోనాఁ గడుఁ జిత్రభస్త్రంబునన్ [1]నిల్పినం బోల్పఁగాఁ గల్పక స్వచ్ఛగుచ్ఛంబు
సత్యార్థమై నిత్యముం గ్రొత్తగాఁ బూనియున్నాఁడనన్ భవ్యశంఖంబు సవ్యాగ్ర
హస్తంబునం [2]దిమ్ముగా దివ్యభూషావిశేషార్భటుల్ గ్రమ్మ, లేఁదెమ్మెరల్
గ్రమ్మఁగా నమ్రదిక్పాలకప్రస్తుతుల్ స్వస్థలం బంటఁగా, నంటఁగా రాకరాకా
సుధాభాను భానూజ్జ్వలజ్జ్వాల కీలాకులప్రౌఢ[3]రీఢాకృదారూఢగాఢత్విడౌఘంబు
మోఘంబుగా [4]మేఘవీథిం [5]ధరాధోజగద్ధోణిన్ [6]దోరణాల్ గట్ట, యాదవ
రమణుండు నాభిసంజాతకంజాతజాతుం డఖండాంఘ్రిపీఠీభవద్విశ్వవిశ్వంభరా
భాగుఁ డాభోగవద్భోగిభోగాసనుం డాసవామోదమాధుర్యధుర్యాస్యుఁ శ్రీ
కపోలద్వయీపత్త్రరేఖాపకారక్రియాక్రూరచక్రాంకుఁ డోంకారసర్వస్వనిర్వా
హకుం డుర్విచే దుర్వహాంగప్రభాగుర్వి చే నోషధుల్ గన్న పృథ్వాఖ్యపృథ్వీశ
ముఖ్యుండు పుండ్రేక్షుకోదండలక్ష్మీభుః డంచద్దరస్మేరసారుం డుదారుండు
[7]దారోత్తమల్ నీలయున్ బాలయున్ లక్ష్మియున్ పక్ష్మలాక్షీశిరోరత్నమున్
భూమియున్ భామయున్ బ్రేమఁ గామించి వెన్నాడఁగా మించి పంచాబ్దుఁ
డయ్యుం గడుం బ్రోడలౌ బోడలుం జూడఁగాలేని పెన్నిక్కు నిక్కంబ యావి
ష్కృతిం జూపి దీపించి యుండన్. 77

టీక. కడిందియసురున్ = అసాధ్యుఁడైన రాక్షసుఁడగు; ధేనుకున్ = ధేనుకుఁడనువానిని; ధేను......శౌర్యాగ్నిచేన్, ధేనుకుత్కీలదంభోళి = గోవర్ధనపర్వతమను పిడుగును; సంస్తంభి=అడ్డుకొను - పడకుండఁజేయు; దోఃస్తంభ = స్తంభములఁబోలు భుజములనుండి; సంభూత = పుట్టిన; శౌర్యాగ్నిచేన్ = పరాక్రమమను అగ్నిచే; క్రాఁచి = దహించి - అనఁగా ధేనుకాసురుని సంహరించి [ధేనుకుత్కీల = గోవర్ధనపర్వతముచేత, అని పూర్వటీక.] గోలోకముంగాచి = గోవులగుంపును రక్షించి; గోవర్ధన......ద్రోణిన్ = గోవర్ధనపర్వతపు గుహాప్రదేశమున; క్రీడించు = ఆటలాడు; విన్నాణి = నేర్పరి - శ్రీకృష్ణుఁడు; పెన్నాటకంబైన = మిక్కిలి చలించుచున్న - నటించుచున్న; క్రాల్గన్నులన్, కల్గు = ప్రకాశించుకన్నులనుండి వెలువడు; పెన్దళ్కులన్ = ఎక్కువైన కాంతులను; నల్గడన్ = నాల్గుదిక్కులను; చిల్కు = చిమ్మఁజేయు - ప్రసరింపఁజేయు; నెమ్మోముజాబిల్లి = ముఖచంద్రుఁడు; శోభిల్లన్ = ప్రకాశింపఁగా; ఉత్ఫుల్లగల్లద్వయిన్ = ప్రకాశించు రెండు చెక్కిళ్ళయందును; హత్తి = అంటుకొని; మత్తిల్లి = మదించి; మకరాకారరేఖాభిరామంబులౌ = మొసలియొక్క రూపమువంటి రూపముచే ఇంపయినవైన; సమగ్రప్రభామండలంబుల్ = నిండు వెలుఁగుల సముదాయము కలవి; చలింపన్ = కదలాడఁగా; నిలింపాశుగాసాకృతిన్ = ఇంద్రధనుస్సుయొక్క ఆకారమున; మాసరంబైన = అతిశయించి యున్న; మాయూరపింఛంబులోన్ = నెమలిపించెముతో (నెమలిపించెము కృష్ణునికి శిరో ఽలంకారమనుట); ఐక్యముం బొందు = కలిసియుండు = కూడియుండు; కొప్పు = జుట్టు; కన్పట్టఁగారాని = చూడఁగా రాని - హద్దుమీఱిన; వేడ్కన్ = మక్కువతో; మహాఫాలపట్టంబుపైన్ = విశాలమగు నుదుటిపయి; కట్టి కొన్; నిగమకమలగంధముల్ = వేదములను పద్మముల పరిమళములను; సంధిలంజేయు = కలిగించు - వ్యాపింపఁజేయు; నాసాపుటిన్ = నాసికయందు; ప్రస్ఫుటస్ఫూర్తి = మిక్కిలిస్ఫుటమగు ప్రకాశము; దృష్య......దల్ = గొప్పవైన విండ్లశోభలు; పెంపుమీఱంగన్ = అతి

1. క. నిల్చినం. చ. 2. నిల్పినం. ట. చ. బోల్పఁగా. 3. చ. లీఢా. 4. చ.ఖవిరి. 5. చ. ట. ధరాధో. 6. చ. దోరణుల్. 7. చ. రోత్తముల్.

శయింపఁగా; రంగద్రుచిన్ = నాట్యము చేయు కాంతితో - తొలుకాడు కాంతితో; శాక్వరస్కంధబంధుత్వగంధంబున్ = ఎద్దుమూఁపురము బంధుత్వవాసనను - ఎద్దుమూఁపురపుఁబోలికను. ['శాక్వర......గంధంబునన్ = ఎద్దుమూఁపురముఁబోలి నిక్కుగల గర్వము' అని పూర్వటీక.] రూపించు = ప్రకాశింపఁజేయు; మూఁపుల్ = భుజములు; పురాయింపన్ = వర్ధిల్లఁగా - విజృంభింపఁగా; ఇంపారు రేఖత్రయీమైత్రిన్ = చక్కనైన మూఁడుగీఱలకూడికచే; కంబుపాకంబుపాకంబునన్ = చిన్న శంఖమువిధమున; బంధురంబై = నిమ్నోన్నతములు కలదై - ఒప్పిదమై; వలత్కంధరంబు, ఒప్పన్ = గుండ్రనిమెడ ప్రకాశింపఁగా; కప్పెక్కు = నల్లని; నీలంపుఁ గంబంబులంబోలు = ఇంద్రనీలముల స్తంభములవలెనున్న; బల్గేలు = గొప్పచేతులు; లీలావిభూషావళిన్ = విలాసార్థమయిన నగలసమూహముచే; చాలన్ = ఎక్కువఁగా; భాసిల్లన్ = ప్రకాశింపఁగా; ఉల్లోకసౌందర్యధుర్యస్థితిన్ = లోకాతీతమయిన (గొప్ప) సౌందర్యమును వహించుస్థితితో; విస్తృతంబౌ = విశాలమయిన; ఉరస్సీమ = వక్షఃస్థలము; జీమూతమై = మేఘమై; హారవర్షోపలశ్రేణి= ముత్యాలహారము లను వడగండ్లు; రాణించు మించున్ = ప్రకాశించు మెఱుపును; పురాణింపఁగాఁజేయు = వృద్ధిపొందఁజేయునట్టి; అచ్చోన = ఆప్రదేశముననే - వక్షమునందే; ఉచ్చైనభానుచ్ఛవిన్ = (దట్టమయిన) సూర్యకాంతిని; తుచ్ఛముం జేసి = అణఁగఁద్రొక్కి - తిరస్కరించి; కంజాత.....వహంబు = లక్ష్మీదేవియొక్క లత్తుకగుఱుతు లనెడి సందేహమును కలిగించునది; పంకేజరాగంబు = పద్మరాగము - కౌస్తుభమణి; ఇగుర్పంగన్ = చిగిరింపఁగా - ప్రకాశింపఁగా; [విష్ణువక్షముమీఁది కౌస్తుభమాణిక్యము ఎఱ్ఱనిదగుటచే-లక్ష్మీదేవి అతనిని పాదముతోఁ దాఁకుటవలన ఆ పాదమందలి లత్తుకగుఱుతు అచట అంటుకొన్నట్టున్నదని వర్ణితము.] చరణయుగళహాటకంబై=పాదములకుఁద్రిశూలమై-అనఁగా-బంధించునదై;కనద్ఘాటకోద్యత్తులాకోటులు=ప్రకాశించు బంగారుమయమగు అందియలు; ఊటాడుచున్=కదలాడుచు; చాటువాచాటతన్, చాటి=చాటుగర్వోక్తులను పలికి-చమత్కారయుక్తముగా మాటనేర్పును వెల్లడించి; ముప్పేటగాన్=మూఁడు పేటలుగా-మూఁడు చుట్లు వచ్చునట్లుగా; కటిన్=మొలయందు; సంఘటిల్లన్=కూర్పఁబడఁగా - ఉండఁగా; [ఇచట "చాటు = చాటించు; వాచాటతన్=మాటకారితనమును" అని పూర్వటీక.] తటిల్లేఖ=మెఱుపుతీగ; లేఖర్షభున్ చేరి = ఇంద్రునిజేరి; రంజిల్లునాన్-ప్రకాశించునోయనునట్లు; ఉల్లసత్కాంతి = తళతళ మను కాంతు లీనుచున్నది; గోయష్టి = ఆవులను తోలెడి కఱ్ఱ; ఇచ్చరున్, వచ్చుచున్=మనస్సు నాకర్షించుచు; కరా......లోనాన్ = చేతియందుంచుకొనఁబడిన బ్రహ్మాండగోళములసమూహములో యనునట్లు; చిత్రభస్త్రంబునన్ = రంగురంగుల సంచియందు; పొల్పుగాన్=అందముగా; కల్పకస్వచ్ఛగుచ్ఛంబు = పారిజాతపుఁబూగుత్తి; సత్యార్థమై = సత్యభామకిచ్చుటకొఱకు; భవ్యశంఖంబు = గొప్ప శంఖము - పాంచజన్యము; సవ్యాగ్రహస్తంబునందున్ = ఎడమయగుచేతియందు; ఇమ్ముగాన్ = భద్రముగా ఉండఁగా; దివ్య.....టుల్ = గొప్పగొప్పనగల ఆర్భాటములు; క్రమ్మన్=వ్యాపింపఁగా; లేఁదెమ్మెరల్ = లేఁతవాయువులు; నమ్ర.....స్తుతుల్ = వినతులగు దిక్పాలకులపొగడ్తలు; స్వఃస్థలంబు = స్వర్గమును; అంటఁగా = అంటుకొనఁగా - స్వర్గమున వ్యాపింపఁగా; రాకా......ఘంబు - రాకాసుధాభాను = నిండుచంద్రునియొక్క; భాను = కిరణములనుండి; ఉజ్జ్వలజ్వాల = ప్రకాశించుచున్న జ్వాలయొక్క; కీలాకుల = మంటలచేత కలఁతనొంది; ప్రౌఢబాధాకృత్ =ఎక్కువ అవమానకలిగించున; ఆరూఢ = మీఁదికిలేచుచున్న; గాఢత్విడోఘంబు = అధికకాంతిసమూహము; మోఘంబుగాన్ = వ్యర్థమగునట్లు; మేఘవీథిన్ = గగనమార్గమునందును; ధరాధోజగద్ధోరణిన్ = క్రిందిలోకమునందును; యాదవరమణుండు = యాదవులకు ప్రభువగు శ్రీకృష్ణుఁడు; నాభి.........జాతుండు = నాభికమలమున పుట్టిన బ్రహ్మకలవాఁడు; అఖండాం......భాగుఁడు = (తనకు) గొప్ప పాదపీఠముగాఁజేయఁబడిన సమస్తభూభాగములను కలవాఁడు; ఆభోగవద్భోగిభోగాసనుండు = పరిపూర్ణమైన శేషునిదేహము పీఠముగాఁ గలవాఁడు; ["ఆభోగవత్ = పరిపూర్ణత్వమువంటి" అని పూర్వ

టీక.] ఆసవా......చక్రాంకుఁడు = ఆసవామోద = మద్యపరిమళముయొక్క; మాధుర్య = తియ్యదనమును; ధుర్య = వహించిన; అసురస్త్రీ = రాక్షసస్త్రీలయొక్క; కపోలద్వయీ = రెండుచెక్కిళ్ళయందలి; పత్రరేఖా = మకరికలకు; అపకారక్రియా = అపకారముచేయుటయందు; క్రూర = కఠినమైన; చక్రాంకుఁడు = చక్రాయుధము చిహ్నముగాఁగలవాఁడు, దుర్వ.....గుర్విచేఁ = మోయరాని దేహముకాంతిచే బరువైన; ఉర్విచేఁ = భూమివలన; కన్న = కనఁజేసిన - సంపాదించిన; పృథ్వాఖ్య పృథ్వీశముఖ్యుండు = పృథువను పేరుగల రాజురూపమునఁ బుట్టినవాఁడు; పుండ్రేక్షుకోదండలక్షాభుఁడు = లక్షమంది మన్మథులను పోలినవాఁడు; అంచద్దరస్మేరసారుండు = ఒప్పిదమైన చిరునవ్వుసారము కలవాఁడు; దారోత్తమల్ = ఉత్తమభార్యలు; పక్ష్మలాలాక్షీశిరోరత్నముల్ = శ్రేష్ఠురాలయిన ఉవిదయు; పంచాబ్దుఁడు = ఐదేండ్లవయసువాఁడు; ప్రోడలు = ప్రౌఢులు; బోడలు= మునులు; పెన్నిక్క = గొప్ప ఆశ్రయము - ఆశ్రయమైనవాఁడు ఆవిష్కృతిఁ, చూపి=ప్రత్యక్షమయి.

క. కనుదెఱచి తనదు[1]లోనం, గను[2]తేజము మ్రోలఁ గాంచి కమలాసనుఁ డా
డినయట్ల నిక్కమయ్యెనె, విన గన నిది క్రొత్త యనుచు వెసఁ నుత్థితుఁడై. 78

టీక. తనదులోనఁ = తనహృదయమునందు; మ్రోలఁ = ఎదుటను; వెసఁ = వేగముగా; ఉత్థితుఁడై = లేచినవాఁడై.

సీ. చామరధ్వజశంఖ చాపప్రముఖ చిహ్నలలితపదార్పణాలంకృతమహీ
దళితోపరిత్వగుజ్జ్వలదంశుమత్ఫలాస్తంభాభిరామోరుదండయుగళు
వరదానముద్రాబ్జభరణభూషితకటిన్యస్తకుంచితసమున్నతభుజాఢ్యు
సింహావలగ్నలక్ష్మీపరిహాసి [3]తోయజగర్భగర్భవృత్తావలగ్ను

తే. జలదసంకాశు నిర్వ్రీడజఘనదేశుఁ, గోటికందర్పలావణ్యుఁ గుణశరణ్యు
విష్ణు నిజభక్తవర్ధిష్ణుఁ గృష్ణుఁ గాంచి, పఱచె సాక్రోశుఁ డగుచు నాబ్రాహ్మణుండు.

టీక. చామర.....మహిఁ = చామరము, కేతువు, శంఖము, విల్లు మొదలగు చిహ్నములు కల పాదములుంచుటచే - (అట్టిపాదములతో నడచుటచే) (వానిచే) అలంకరింపఁబడిన భూమికలవానిని; దళితో......యుగళుఁ - దళిత = ఒలువఁబడిన; ఉపరిత్వక్ = మీఁదితోలు కలదగుటవలన; ఉజ్జ్వలత్ = ప్రకాశించుచున్న; అంశుమత్ఫలాస్తంభ = అరఁటికంబములవలె; అభిరామ = మనోహరమైన; ఊరుదండయుగళుఁ = దండములవంటి రెండు తొడలును కలవానిని; వర.....భుజాఢ్యుఁ - వరదానముద్రాబ్జధరణ = వరము, దానము, ముద్ర, పద్మము అను వానిని ధరించుటచే; భూషిత = అలంకరింపఁబడి; కటిన్యస్త = మొలయందుంచఁబడినదయి; కుంచిత = వంపఁబడిన; సమున్నతభుజాఢ్యుఁ = మిక్కిలి పొడవైన భుజములు కలవానిని. [శ్రీకృష్ణుఁడు వరాదులనుధరించి, ఒయ్యారముగ మొలపయి చేతులు వేసికొన్నాఁడని భావము.] సింహా.....వలగ్నుఁ - సింహావలగ్నలక్ష్మీపరిహాసి = సింహము నడుమునందమును నవ్వుచున్నదయి; తోయజగర్భగర్భ = బ్రహ్మకుపుట్టువుకారణమయి; వృత్త = వర్తులమైన - గుండ్రమైన; అవలగ్నుఁ = నడుముకలవానిని; జలదసంకాశుఁ =మేఘమువంటివానిని - మేఘశ్యాముని; నిర్వ్రీడజఘనదేశుఁ = సిగ్గులేని కటికలవానిని - దిగంబరుని; కోటికందర్పలావణ్యుఁ = కోటిమంది మన్మథులచక్కఁదనము కలవానిని; గుణశరణ్యుఁ = గొప్పగుణములు కలవానిని; విష్ణుఁ= సర్వవ్యాపకుని; నిజభక్తవర్ధిష్ణుఁ = తనభక్తులను వృద్ధిపొందించువానిని; ఆ బ్రాహ్మణుండు = ఆ పుండరీకుఁడు; సాక్రోశుఁడగుచుఁ = (రక్షణకొఱకు) అఱచుచున్నవాఁడగుచు; పఱచెఁ = పరుగిడిపోయెను. [ఇట 'సాక్రోశుఁడు = తిట్టుటతోఁగూడినవాఁడు' అని వెనుకటి వ్యాఖ్య కలదు. అది అత్యంతానను గుణము.] అలం. ఉదాత్తము, ఉపమ.

1. ట. లోలన్. 2. క. దేజము. 3. చ. తోషిత.

చ. పఱచిన దేవకీసుతుఁడు పక్కన నవ్వినఁ [1]గ్రమ్మఱిల్లి మైఁ
దఱచుగ రోమహర్షణ ముదంచితభక్తిభరాలసత్వ మే
ర్పఱచుచుఁ గేల్మొగిడ్చి [2]పలుపల్కుల తళ్కులసన్నవెన్నెలన్
బఱపుచుఁ బ్రస్తుతించె ముని బంధవిభంజను భక్తరంజనున్. 80

టీక. క్రమ్మఱిల్లి = మరలివచ్చి; మైన్ = దేహమున; రోమహర్షణము = గగుర్పాటు; ఉదంచిత......సత్వము = ఎక్కువయిన భక్త్యతిశయమువలని కలఁతపాటు; పలుపల్కులతళ్కులన్ = ఎక్కువమాటలకాంతులచే; ['తళ్కుల = తళతళలాడుచున్న' అని పూర్వటీక.] సన్నవెన్నెలల్ = సన్ననివెన్నెలలవంటికాంతులను; పఱపుచున్ = వ్యాపింపఁజేయుచు; బంధవిభంజనున్ = సంసారబంధములను నశింపఁజేయువానిని; భక్తరంజనున్ = భక్తులను సంతోషపఱచువానిని - శ్రీకృష్ణుని; ముని = మునియైన పుండరీకుఁడు; ప్రస్తుతించెన్ = కొనియాడెను.

మాలిని. విధి శివ సనకాదుల్ వేదముల్ గూడి నిన్నో
మధుమథన! యితం డిమ్మాడ్కివాఁ డంచు నెన్నన్
విధురు లయినచోటన్ నేర్చునే గాఢమోహాం
బుధి వడిఁ బడుచు న్నాబోఁటి నీవాట మెన్నన్. 81

టీక. మధుమథన! = మధువను రాక్షసుని సంహరించినవాఁడా! ఇమ్మాడ్కివాఁడు = ఈరీతినుండువాఁడు; ఎన్నన్ = గుర్తెఱుఁగుటకు; విధురులు = వికలత్వమునొందినవారు - నిష్ప్రయోజకులు; గాఢమోహాంబుధిన్ = దట్టమైన అజ్ఞానసాగరమున; నీ వాటము=నీ మహిమను; నాబోఁటి = నావంటివాఁడు; నేర్చునే! అలం. అర్థాపత్తి.

తరల. హరిహయోపలభూధరాకృతి నంద మొందినయట్టి నీ
యురుభృగుస్తుతిపాత్రమున్ గటకోజ్జ్వలంబు [3]నఖౌఘర
త్నరుచిమిత్రము నైన పాదమునం జనించిన గంగ ని
త్యరతిఁ బూని తలంతుఁ దాపనిదాఘవృత్తినివృత్తికిన్. 82

టీక. హరి......కృతిన్ = ఇంద్రనీలమణిపర్వతాకారమున; ఉరుభృగుస్తుతిపాత్రమున్ = గొప్పచరియలచేఁ గొనియాడఁదగినది, గొప్పవాఁడగు భృగుమహర్షిచేఁ గొనియాడఁబడినది యగుచు; కటకోజ్జ్వలంబున్ = కొండమీఁది చదరపునేలచేఁ బ్రకాశించునది, కడియముచేఁ బ్రకాశించునదియును; నఖౌఘరత్నరుచిరంబున్ = గోళ్లవంటిరత్నములపొందిక కలదియు గోళ్లనెడి రత్నములపొందికకలదియు; జనించిన = పుట్టిన; తాప...... నివృత్తికిన్ = తాపత్రయమనెడి వేసవికాలపుఁబ్రవర్తనము పోవుటకయి; తలంతున్. [వేసవితాపము పోవుటకు వర్షమావశ్యకము; ఆ వర్షమునకు సహాయకారణమయినది పర్వతము; కాన తద్ధ్యానమిట శ్లేషచే సమర్థితము; తాపత్రయనాశనమునకు విష్ణుపాదభజనమే శరణ్యమని భావము.] అలం. శ్లేష, రూపకము.

భుజంగప్రయాతము.—

స్ఫురన్నాభిగర్తప్రభూతాంబుజాతో,దరక్షోణిలో [4]వేల్పుతాతన్ విధాతన్
నిరాతంకసర్గైకనిర్ణేతఁ గంటన్, హరీ! తాతకుం దాతవై యుంట యొప్పున్. 83

టీక. స్ఫురత్......క్షోణిలోన్ = ప్రకాశించు నాభియను గోతియందు పుట్టినతామరపూవు గర్భభాగమునందు; వేల్పుతాతన్ = దేవతలకు తాత అయినవానిని; విధాతన్ = బ్రహ్మను; నిరా...

1. చ. గ్రుమ్మిఱిల్లిపై. 2. చ. ట. పలుబల్కు. 3. చ. నఘౌఘ.

...నిర్ణేతన్ = అడ్డులేనిసృష్టికి నిర్ణాయకుఁడైనవానిని; కంటన్=కనుటచే - పుట్టించుటచే; తాతకున్= తండ్రికి; బ్రహ్మకు; తాతవై = తండ్రివయి; అలం. కావ్యలింగము.

స్రగ్విణి.—

నీతిమై వైన్యభూనేతవై రత్నసం,ఘాతదివ్యౌ[1]షధి గ్రామముల్ భూతహృ
త్ప్రీతిఁ [2]గన్పట్టవే స్ఫీతహర్షోత్కటన్, భూతధాత్రీగవిన్ బూతనాఘాతనా! 84

టీక. వైన్యభూనేతవై = వేనుఁడనురాజుయొక్క పుత్త్రుఁడగు పృథుచక్రవర్తివయి; ['వైన్యభూనేత=వైన్యుఁడనురాజు-పృథుచక్రవర్తి అని పూర్వటీక] రత్నసంఘాతదివ్యౌషధిగ్రామముల్ =రత్నములసమూహములు, ఓషధులసమూహములును; భూతహృత్ప్రీతిన్ = ప్రాణులమనస్సులకు సంతోషము కలుగునట్లుగా; స్ఫీతహర్షోత్కటన్ = అధికసంతోషమున మదించినదానిని; భూతధాత్రీగవిన్ = భూమియను ఆవును; కన్పట్టవే! = కనుపడునట్లు చేయలేదా! పూతనాఘాతనా!=పూతనయను రాక్షసిని చంపినవాఁడా! పూర్వము పృథుచక్రవర్తి భూమిని గోవుగాను, హిమవంతమును దూడగాను, మేరువును (పాలు)పిదుకు గొల్లవానినిగాను జేసి, రత్నములను, ఓషధులను పిదికించెనని గాథ. ఆ చక్రవర్తి వేనుని కొడుకు; భగవంతుని అవతారము.]

లయగ్రాహి.—

ఆగమసముద్ధరణరాగరసలంపట! సుధాగమనియామక! రసాగరిమకారీ!
భోగపదవీనిహితభాగవత! భూగగన భాగపరిపూర్ణపరభాగవపురగ్రా!
త్యాగగుణధుర్య! మునియాగపరిరక్షక! హాలాగతసమిద్విజయ! సౌగతమతాగ్రో
ద్యోగ!కలికాలకలుషాగకులిశాంక!కొనసాగినకృపన్ మనుపు యోగిహిత!మమ్మున్.

టీక. ఆగమ......లంపట! = వేదముల నుద్ధరించుటయందలి ప్రేమ యను రసమున (నీరమున) తగిలియున్నవాఁడా! [ఇందు మత్స్యావతారము సూచితము.] సుధాగమనియామక! = అమృతప్రాప్తిని నియమించినవాఁడా-కూర్మమూర్తీ! [ఇందు కూర్మావతారము గోచరించుచున్నది.] రసాగరిమకారీ! = భూమికి గొప్పతనమును కలిగించినవాఁడా? ఆపన్నమగు భూమిని రక్షించినవాఁడా! [ఇట వరాహావతారము గ్రాహ్యము.] భోగపదవీనిహితభాగవత! = ఐశ్వర్యమార్గమున ఉంచఁబడిన (గొప్పభోగముల నొసంగిన) గొప్పభక్తుఁడు (ప్రహ్లాదుఁడు) కలవాఁడా! [ఇట నృసింహావతారము ఊహ్యము.] భూ...వపురగ్రా! = భూమ్యాకాశములు నిండిన మహోత్కృష్టమైన పాదములుకలవాఁడా! [ఇందు వామనావతార మూహ్యము.] [ఇచట పూర్వటీకలో "వపురగ్రా = దేహముకొన గలవాఁడా!" అని యున్నది.] త్యాగగుణధుర్య! =గొప్పగా దానముచేయుగుణముచే పేరుపడినవాఁడా! [ఇందు పరశురామావతారము సూచితము. పరశురాముఁడు రాజులను చంపి సంపాదించిన భూమిని కశ్యపునకు దానము చేసెననుట.] ముని...రక్షక! = మునియైన విశ్వామిత్రుని యాగమును రక్షించినవాఁడా! [ఇట రామావతారము స్పష్టీకృతము.] హాలాగతసమిద్విజయ! = నాగఁటివలన వచ్చిన యుద్ధవిజయము కలవాఁడా! [ఇందు బలరామావతారము స్పష్టము; అతనికి హలము ఆయుధము.] సౌగతమతాగ్రోద్యోగ! = బౌద్ధమతమునకుఁదగిన ప్రయత్నముకలవాఁడా! [ఇచట బౌద్ధావతారము గ్రాహ్యము.] కలి......శాంక! = కలికాలమునందలి పాపములనెడి పర్వతములకు వజ్రాయుధమైనవాఁడా! [ఇందు కల్క్యవతారము సూచితము; ఇట్లీపద్యమున దశావతారములును వర్ణితములు.] మనుపు = రక్షింపుము. అలం. రూపకము.

1. షధ. క. షధి. చ. 2. చ. గన్పట్టి.

మ. రవిధామంబులు సిద్ధమంత్రములు చంద్రజ్యోత్స్నికల్ సన్మణి
ప్రవరశ్రేణులు భవ్యభేషజతతుల్ పాథోధరంబుల్ సుధీ
భవనిస్తారక! నేమ మిచ్చి జగమున్ బాలించు మర్యాద నీ
యవతారంబు లశేషలోకహితచర్యాధుర్యసంచారముల్. 86

టీక. ఈ పద్యమునం దవతారంబుల యౌత్కృష్ట్యము రూపకమూలమున రూపింపఁబడుచున్నది. రవిధామంబులు = సూర్యుని తేజస్సులు; చంద్రజ్యోత్స్నికల్ = చంద్రుని వెన్నెలలు; సన్మణిప్రవరశ్రేణులు = ఉత్తమమాణిక్యముల (చింతామణుల) గుంపులు; భవ్యభేషజతతుల్ = గొప్పమందుల సమూహములు; పాథోధరంబుల్ = నీటిని ధరించు మేఘములు; సుధీభవనిస్తారక! = విద్వాంసులను (తత్త్వవేత్తలను) జన్మమునుండి తప్పించి కాపాడువాఁడా! అశేష......సంచారముల్ = సమస్తజీవుల మేలికొరకు ప్రవర్తించునట్టివైన; [ఈ పదమును సూర్యకాంతులు మొదలగువాని కన్నింటికిని విశేషణముగా గ్రహింపనగును.] నీయవతారంబులు; నేమమిచ్చి; మర్యాదన్ = మర్యాదతో; జగమున్; పాలించున్. అలం. రూపకము.

ఉ. అంజనపుంజనవ్యతరమై తగు నీ తిరుమేనికప్పు క
ల్మిం జులుకంగఁ జేకురుఁజుమీ కమలేక్షణ! సూక్ష్మదృక్కు[1]లౌ
కంజభవాదివృద్ధులకు గాఢతరాక్షరలక్ష్మి [2]యెందుఁ గా
నం జనుఁగాదె కప్పుకతనన్ మును దోఁపని యక్షరస్థితుల్. 87

టీక. అంజన......తరమై = కాటుకకుప్పవలె మనోజ్ఞమయి; తిరు...కల్మిన్ = శుభప్రదదేహమునలుపుశోభవలన; చులుకంగన్ = సులభముగా; సూక్ష్మదృక్కులు=సూక్ష్మదృష్టి కలవారు - బుద్ధిమంతులు; కంజ.....వృద్ధులకున్ = బ్రహ్మ మొదలగు పెద్దలకు; గాఢ.....లక్ష్మి = ఉత్కృష్టము నాశము లేనిదియు నగు (మోక్ష)సంపద; చేకురుఁజుమీ! = కలుగునుగదా! కప్పుకతనన్ = నలుపువలన - నల్లనిరంగు పూయుటవలన; మును, దోఁపని = పూర్వము (మొదట) కనఁబడని; అక్షరస్థితుల్ = అక్షరములపోలికలు; ఎందున్; కానంజనుఁగాదె! = కనవీలగునుగదా! [(తాళ)పత్రములపయి వ్రాయఁబడిన యక్కరములపోలిక తొలుత తెలియకపోఁగా, దానిపై నల్లనిరంగు పూయుదురు; అపుడు అక్షరములన్నియు స్పష్టముగా కన్పడును.] అలం. దృష్టాంతము.

క. కమిచి యణురేణుతృణకాష్ఠములం బరిపూర్ణవృత్తి సమకూరిన నీ
యమితమహామహిమాబ్ధికిఁ, గమలభవప్రముఖు లెన్నఁగా బుద్బుదముల్. 88

టీక. కమిచి = గ్రహించి - లోపలనణఁచుకొని; అణు .....ములన్ = అణువులు, రేణువులు, గడ్డి, కట్టె, మొదలగువానివలన; సమకూరిన = ఏర్పడిన; అమితమహామహిమాబ్ధికిన్ = హద్దులేని మాహాత్మ్య మను సముద్రమునకు; కమలభవప్రముఖులు, ఎల్లన్ = బ్రహ్మ మొదలగు దేవత లందఱును; ఎన్నఁగాన్ = లెక్కింపఁగా; బుద్బుదముల్ = నీటిబుగ్గలు. అలం. రూపకము.

పృథ్వి. జగత్పతి! భవత్పదాబ్జయుగభక్తిసంయుక్తి [4]లో,
గగుర్పొడువ నన్యథా గతి యొకింత కెవ్వాఁడు నీ
యగణ్యగుణకీర్తనం బధిగమించుటన్ మించెనే,
నగాధభవసాగరం బతఁడు దాఁటు నొక్కెత్తునన్. 89

1. క. లాఁగంజ. 2. చ. యంద. 3. క. కూరెను. చ. ట. కూరిన. 4. క. తో. చ. ట. లో.

టీక. జగత్పతి! = లోకప్రభువగు విష్ణువా! భవత్......సంయుక్తి = నీరెండు పాదకముల భక్తియుక్తి; లోన్ = హృదయములో; అన్యథాగతి = వేఱేదిక్కు; ఎఱుంగక = తెలిసికొనక - తలంపక; అగణ్యగుణకీర్తనంబు = లెక్కింపరాని గుణముల స్తుతిని; అధిగమించుటన్ = పఠించుటచే; మించెనేన్ = మించినట్లయితే; ఒక్కత్తునన్ = ఒక్కసారిగా; అగాధభవసాగరంబు = లోతైన సంసార సముద్రమును. దాఁటున్. అలం. రూపకము.

క. భవదంఘ్రిదూరునకుఁ బుణ్యవసతి సులభంబె? వెఱతు [1]నన్యభవంబుల్
సవరింప; యుష్మదర్చాప్రవణరుతిం జేయు [2]నను [3]బరమధామపతీ! 90

టీక. పరమధామపతీ! = పరమపదమగు వైకుంఠమునకు ప్రభువా! భవదంఘ్రిదూరునకున్ = నీపాదములకు దూరమైనవానికి - నిన్నుకొలువనివానికి; అన్యభవంబుల్ = వేఱుజన్మములు - పునర్జన్మములు; సవరింపన్ = ఎత్తుటకు; వెఱతున్=భయపడుచున్నాను; ననున్ = నన్ను; యుష్మ...మతిన్= నీపూజయందు దాసక్తమైన బుద్ధి కలవానినిగా; చేయు = చేయుము. [ములోపము.]

క. జయ విజయ[4]పూర్వవిభవ! వి,జయ జయకల్పనధురీణ! సమదదనుజరా
డ్జయ! సంరక్షితభువనా!, జయ జయ! సగుణా! గుణాత్మ! జయ శార్ఙ్గధరా! 91

టీక. విజయపూర్వవిభవ! = విజయము పూర్వముగా (ముందుగా) గల సంపదకలవాఁడా! [నీకెచ్చట విజయము కలిగినను తోడనే సంపదయు లభించుననుట.] జయ! =జయముపొందుము; జయ కల్పనధురీణ! = జయము కూర్చుటయందు బాధ్యత వహించువాఁడా! విజయ! = విజయమును పొందుము; సమద......జయ! =మదించిన రాక్షసరాజులను జయించినవాఁడా! సంరక్షితభువనా != రక్షింపఁబడిన లోకములు కలవాఁడా! = సుగుణా! గుణవిశిష్టుఁడా! శార్ఙ్గధరా! = శార్ఙ్గమను విల్లు ధరించినవాఁడా!

సీ. నడతు నీక్షేత్రంబునకుఁ; జేయి చాచి యర్చింతు నీ నమ్మినసేవకు[5]లను;
మ్రొక్కుదు నీపాద[6]ములకు; జిహ్వావీథి నీనామములు [7]వక్కణింతు నెపుడు;
నర్పింతు నీసేవకై సర్వదేహంబుఁ; జింతింతు నీలీలఁ జిత్తసరణిఁ;
దనివోక నీచక్కఁదనము సంవీక్షింతు; నీయవధానంబు నెమ్మి విందు;
తే. బ్రహ్మరుద్రాదులకుఁ గానఁబడని నీవు, నేడు నామ్రోల నిలిచితి నీలవర్ణ!
వర్ణనాతీతమత్ప్రాగ్భవప్రవృత్త, పుణ్యపరిపాక మేరికిఁ బొగడఁదరమె! 92

టీక. వక్కణింతును = పలుకుదును; చిత్తసరణిన్ = మనోమార్గమునందు; తనివోక = తనివి తీరక - తృప్తితీరక; నీయవధానంబున్ = నీహెచ్చరికను - నిన్నుగూర్చినప్రసంగమును; వర్ణనా... పరిపాకము = వర్ణింపనలవికాని నాపూర్వజన్మకృత పుణ్యములపంట.

ఉ. నిత్యసూ్క్తిసనాథులైరి విధికంఠేకాలముఖ్యుల్ కృత
కృత్యానంద! [8]యనాదిమూర్తివగు నీచేఁ దత్సనాథత్వసం
పత్త్యావిష్కృతి నాకునుం గలుగుఁ దత్ప్రాయుండనే కాన, [9]నీ
మృత్యుక్రూరభయంబుఁ బాసితిని జుమ్మీ నీదయాసంపదన్. 93

---

1. క. నయ్య. చ. నన్య. 2. క. నన్ను. చ. ట. నను. 3. క. బరధామ. చ. పరమధామ ట. పరంధామ. 4. క. పూర్ణపార్శ్వ. చ. పూర్వవిభవ. 5. చ. లన. 6. చ. ములక. 7. వకాణింతు శ. రు. వక్కణింతు. 8. చ. యనాథ. 9. చ. ట. యా.

టీక. కృతక్షిత్యానంద ! = చేయఁబడిన భూమ్యానందముకలవాఁడా ! - భూప్రజలకు ఆనందమును కల్గించువాఁడా ! అనాదిమూర్తివగు = ఆదిలేని స్వరూపముగల - అనాదివగు; నీచేన్ = నీవలన; విధి......ముఖ్యుల్ = బ్రహ్మ, శివుఁడు మొదలగు దేవతలు; నిత్యస్ఫూర్తిసనాథులు, ఐరి = శాశ్వతమైన స్ఫురణతోఁ గూడినవారు - ఎల్లపుడును ఉండువారు - అయిరి; తత్ప్రియుండనే, కాన = (నేనును) వారివంటివాఁడనే యగుటచే - వారివలెనే నేనును నీభక్తుఁడ నగుటచే; తత్......ఆవిష్కృతి = ఆ నిత్యస్ఫూర్తితోఁ గూడుట యను సంపద ఆవిష్కరించుట; ['ఆ కూడుకొన్నతనపు కలిమియొక్క వెలయుట' అని పూర్వటీక.] కలుగున్.

మ. అని లోకత్రయమోహనుండగు రమాప్రాణేశు నెమ్మోమునం
దన చూడ్కుల్ నిగుడంగ భూమిసురరత్నం బూరకున్నంత[1] నే
మునుగా ధాతృసమన్వితాఖిలమరున్ముఖ్యుల్ దగన్ మ్రొక్కి మో
దమ్మునకే లింపుగ నమ్మునీశ్వరుగుణంబుల్ సారె గీర్తించినన్. 94

టీక. లోకత్రయమోహనుండు = ముల్లోకములను మోహింపఁజేయువాఁడు - ముల్లోకములను చక్కనివాఁడు; రమాప్రాణేశుఁడు = విష్ణువు; ఊరకున్నంతనే = ఊరకయుండఁగా, నేన్, మునుగాన్ = నేనాదిగా; ధాతృ......ముఖ్యుల్ = బ్రహ్మతోఁగూడి వచ్చిన దేవముఖ్యులు; ఇంపుగన్ = ఇంపుగానుండఁగా; సారె = మాటిమాటికిని.

క. విని ముగ్ధహాసరుచిరా, ననుఁడై తనచుట్టునున్న నానామరరా
జనికాయముతోఁ బలుకున్, దనుజారి మహీసురాస్యదత్తేక్షణుఁడై. 95

టీక. దనుజారి = రాక్షసులకు వైరియగు విష్ణువు; ముగ్ధ........ననుఁడై = చిరునవ్వుచేఁ జక్కని ముఖముకలవాఁడై; మహీ......క్షణుఁడై = బ్రాహ్మణుఁడైన పుండరీకుని ముఖముపయి ఉంచిన చూపు కలవాఁడై; నానా...నికాయముతోన్ = అనేకులైన దేవతాశ్రేష్ఠులసమూహముతో.

సీ. దాంతుండు సత్య[2]సంధాధురంధరుఁడు మద్భక్తుండు పితృహితోద్యముఁడునైన
యిద్ధరామరసూతి కీప్సితం బొసఁ[3]గ నే వచ్చుచో మీరెల్లవారు నితని
కర్మిలి సా[4]హాయ్య మాచరించుటకునై యేతెంచినారు; నా కెవ్వరేని
హితులు వారలపనులెల్ల మీయవి కానఁ [5]బరతాపతప్తులు పరము[6]దేక

తే. ముదితు లస్మత్ప్రశంసాభిముఖులునైన, వారు నాభక్తులగువారు; వారియందుఁ
బ్రీతిగలవారి నే నుద్ధరింతుఁ గృప,వలన; వారలకంటె నవశ్య[7]ముగుట. 96

టీక. దాంతుండు = ఇంద్రియనిగ్రహము కలవాఁడు; సత్యసంధాధురంధరుఁడు = సత్యవాది; పితృహితోద్యముఁడు = తండ్రికి హితమైన ప్రయత్నముకలవాఁడు; ధరామరసూతికిన్ = బ్రాహ్మణపుత్రునకు; అర్మిలిన్ = ప్రీతితో; పర......తాపతప్తులు = ఇతరులబాధచే బాధపడువారు; పరముదేకముదితులు = ఇతరులసంతోషమున సంతసించువారు.

క. సద్భక్తసేవచేతన్, మద్భావము తుష్టిఁగన్నమాడ్కిఁ దరుశిలా
ద్యుద్భూతప్రతిమార్చల, ముద్భరితము గాదు సిక్కముగఁ దలపోయన్. 97

టీక. మద్భావము = నామనస్సు; తరు......ర్చలన్ = మ్రాను, ఱాయి మొదలగువానినుండి ఏర్పడిన విగ్రహముల పూజలచేత; ముద్భరితము = సంతోషముతోఁగూడినది.

1. చ. ట. యే. 2. చ. సంధా. 3. చ. గు. 4. చ. హార్య. 5. క. పర. 6. ట. లేక. 7. ట. ముగుదూ.

మ. [1]వలనా యేటికి నాశ్రయించి మనఁగా వానీరముల్ నీరముల్?
దలవెత్తే పచరింప నేటికి సమిద్ధానంబు దానంబు? న
చ్చలమా యేటికి నెత్తిగొట్టుకొనఁగా సన్న్యాసముల్ న్యాసముల్?
గలిఁ దేఁజాలు మదీయభక్తి రుచి భక్తశ్రేణికశ్రాంతమున్. 98

టీక. వానీరముల్ = నీటిప్రబ్బలిచెట్టును; నీరముల్ = నీటిని; తలవెత్తే = పిచ్చియా? పచరింపక్, ఏటికిక్? = చేయనేల? సమిద్ధానంబు = సమిధలనిచ్చుట - హోమము; అచ్చలమా? = పట్టుదలయా? సన్న్యాసముల్ = లౌకికసంబంధములను పూర్తిగ విడుచుట; న్యాసము = అంగన్యాసాదికము; అశ్రాంతముల్ = ఎల్లపుడును; కలిన్ = కలికాలమందు; మదీయభక్తి = నాయెడఁగల భక్తి; రుచిన్ = తేజస్సును; తేఁజాలున్ = కలిగింపఁగలుగును.

తే. సర్వధర్మవిహీనప్రచారుఁడైన, నాత్మ మద్భక్తి గలదేని యతఁడ చూవె
నాకు నత్యంతహితుఁడు సుశ్లోకరతుఁడు, నిఖిల ధర్మప్రవర్తననిశ్చితుండు. 99

టీక. ఆత్మన్ = మనస్సున; సుశ్లోకరతుఁడు = మంచికీర్తియందు ఆసక్తుఁడు; నిఖిల...... నిశ్చితుండు = సమస్తధర్మములను నెఱవేర్చుటలో నిశ్చయముకలవాఁడు.

ఆ. అస్మదంకధారి యగు భక్తవ[1]రుమేను, నాకుఁ గూర్చినట్లు నాకులార!
వదలకే వసించు వైకుంఠనగరంబు,నందుఁ గొలుప దంతరంగమునకు. 100

టీక. నాకులార! = దేవతలారా! అస్మదంకధారి = నా చిహ్నములగు శంఖచక్రాదులను ధరించినవాఁడు; కూర్చినట్లు = ఇష్టపడునట్లు; కొలుపదు = సరిపడదు.

క. నాయందు భక్తుఁ డుండున్, బాయక యే నధివసింతు భక్తునియందున్
మాయిరువురకుం గలుగున్, గాయప్రాణానుకూల్యకౌశల్యంబుల్. 101

టీక. పాయక = విడువక; కాయ... ..కౌశల్యంబుల్ = దేహమునకు, ప్రాణమునకును గల్గు సంబంధములు.

ఆ. మహితపుణ్యులైన మద్భక్తవరులకుఁ, గానివాఁడు నాకుఁ గానివాఁడు
భాగవతుల నన్ను భావించి [2]యొకటిగాఁ, గన్నవాఁడు నన్ను గన్నవాఁడు. 02

టీక. భాగవతులన్ = భక్తులను; ఒకటిగాన్ = భేదము లేనట్లుగా.

క. మీరాయెడ మద్భక్తిగుణో,చ్ఛ్రాయము గనుగొంటి నేను సత్యంబు బహూ
పాయంబుల మద్భక్తుని,కై యీట [3]కేతెంచుటన్ వియచ్చరులారా! 103

టీక. వియచ్చరులారా! దేవతలారా! మత్......చ్ఛ్రాయముల్ = నాయెడ భక్తియొక్క ఆధిక్యమును.

మ. సురకర్మంది హిరణ్యదైత్యసుతు వ్యాసున్ శౌనకున్ శ్రీపరా
శరు రుక్మాంగదు నంబరీషు నరమాజానిన్ వసిష్ఠున్ బురం
దరపుత్రున్ శుకు దాల్భ్యు భీష్ము వెలగొందంజేయు మద్భక్తిత
త్పరుఁ డీపుణ్యుఁడు పుండరీకుఁడితనిన్ [4]బాలింతు మేలీవులన్. 104

1. చ. రమేను. 2. క. యొకట. చ ట. యొకటి. 3. చ. యేతెంచు. 4. క. భావింతు చ. ట. బాలింతు.

టీక. సురకర్మందిక్ = నారదుని; హిరణ్యదైత్యసుతుక్ = ప్రహ్లాదుని; నరమాజానిక్ = విభీషణుని; పురందరపుత్రుక్ = అర్జునుని; వెఱఁగు, ఒందఁజేయు = ఆశ్చర్యపడునట్లు చేయు - వారికంటె గొప్పభక్తినిజూపు; మేలీవులక్ = గొప్పవరములచేతను.

ఈపద్యమునకు 'ప్రహ్లాద నారద పరాశర పుండరీక, వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాక్; రుక్మాంగ దార్జున వసిష్ఠ విభీషణాదీక్, పుణ్యా నిమాక్ పరమభాగవతాక్ స్మరామి' అను శ్లోకము మూలము.

ఆ. వినుఁడు మీకు నేని గవరాని [1]యీప్సితం,బితపస్వివరుని కిత్తు నేఁడ
దెద్ది వేఁడె భక్తుఁ డద్దియ యొసఁగంగఁ, గట్టివాఁడఁ గేలఁ గంకణంబు. 105

టీక. ఈప్సితంబు = అభీష్టము - కోరిక.

క. అని దేవకీకుమారుఁడు, మునివదనముఁ జూచిపలుకు మోదాంబుదగ
ర్జనమునఁ బ్రసాదసాగర;జనితధ్వని యనఁగ నిగుడు సరసారభటిన్. 106

టీక. మోదాంబుదగర్జనమునక్ = సంతోషమేఘముయొక్క ఉఱుమువలన; ప్రసాద...... ధ్వని = అనుగ్రహ మను సముద్రమున పుట్టిన ధ్వని; సరసారభటిక్=చక్కని వాక్పద్ధతితో; పలుకున్. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. నీపితృభక్తి నీతపము నీవనిశంబు నొనర్చునర్చ యు
ద్దీపితహర్షుఁ జేసె జగతీసురవందన! నన్ను, నీకు నా
రూపము భక్తిమత్సదనరోహణశైలము చాల[2]దక్కఁ గాం
క్షాపరిపూర్తిగా వర మొసఁగెద వేఁడు యథారుచి[3]ప్రథన్. 107

టీక. అనిశంబుక్ = ఎల్లపుడును; ఉద్దీపితహర్షుక్ = ఎక్కువ సంతోషముకలవానిని; భక్తిమత్సదనరోహణశైలము = భక్తికలవారి (భక్తుల) ఇండ్లలోని రోహణ (రత్నములుగల) పర్వతము; కాంక్షాపరిపూర్తి = కోరిక నెఱవేఱుట; కాన్ = అగునట్లు; యథారుచిప్రథక్ = నీకోరికకు అనుగుణముగా. అలం. రూపకము.

క. భాగ్యమనై యిహాపరపరి, భోగ్యార్థమనై యగణ్యపుణ్యమనై వై
రాగ్యజ్ఞానోన్నతులగు, యోగ్యతములపాల వాలియుండుదుఁ జుమ్మీ! 108

టీక. భాగ్యమనై = సంపదనయి, ఇహ......ర్థమనై = ఈ లోకమునను, పరలోకమునను కూడ అనుభవింపఁదగిన వస్తువునయి; అగణ్యపుణ్యమనై = లెక్కలేని పుణ్యస్వరూపము కలవాఁడనయి; వైరాగ్య......న్నతులు = వైరాగ్యముచేతను, జ్ఞానముచేతను గొప్పవారు; వాలి = వంగి; ప్రేమగలిగి; ఉండుదుక్ = ఉందును.

వ. విశేషించి నీయెడం బ్రసన్నుండనై యున్నవాఁడ; నభీష్టవృష్టిఘనాఘనంబగు మదీయఘృణాగుణంబునకు భాజనంబవైతివి; జగజ్జాలంబున వస్తుజాలంబు నీకు దుర్లభంబు లేదని పలుకు యదువల్లభువలనం బ్రబోధితుండై. 109

టీక. ప్రసన్నుండనై = అనుగ్రహించినవాఁడనయి; అభీష్ట.....ఘనంబు = కోరికలను వర్షమునకు వర్షాకాలపుమేఘము; మదీయఘృణాగుణంబునకుక్ = నాయొక్క దయాగుణమునకు; భాజనంబవు = పాత్రమవు; ప్రబోధితుండై = మెలఁకువ పొందింపఁబడినవాఁడు - ప్రోత్సహింపఁబడినవాఁడు; అలం. రూపకము.

---

1. క. యీహి. చ. ట. యీప్సి. 2. చ. దక్కె. 3. క. ప్రభక్. చ. ట. ప్రథన్.

సీ. పుండరీకుఁడు పల్కు 'బుద్బుదాభములైన సిరులు నీఁ గామింపఁ, జేరి కల్ప
విటపిఁ గుల్మాషముల్ వేఁడు వెఱ్ఱిఁ గలాఁడె? నిఖిలదుర్లభుఁడగు నీవు నన్నుఁ
గరుణింతు, వరమిత్తు, గాతు, నీడేరుతు నని యున్కి భయ మేది? యభీష్టార్థ
మర్థింతు, నిపుడున్నయట్ల యస్మన్నామచిహ్నితైతన్మహాక్షేత్రతీర్థ
తే. మధ్యతలమున నిలువు నాయనవిఁ జేసి, సకలజనులకు మోక్షరాజ్యము నొసఁగుచు,
నిదియ నాకోర్కి జగదేకహితము నిదియ, దీనిమీఱిన సిరియొల్ల దేవదేవ!' 110

టీక. బుద్బుదాభములు = నీటిబుగ్గలవంటివి; సిరులు = సంపదలను; కామింపన్ = కోరఁగా; కల్పవిటపిన్ = కల్పవృక్షమును; కుల్మాషముల్ = గుగ్గిళ్లను; కలాఁడె? = ఉండునా? నిఖిలదుర్లభుఁడు= అందఱికిని లభింపనివాఁడవు; అస్మత్......తలమునన్ = నా పేరితో చిహ్నితములైన (నాపేరుగల) యీ క్షేత్రముయొక్కయు తీర్థముయొక్కయు మధ్యప్రదేశమునందు; నాయనవిఁ జేసి = నాప్రార్థన వలన; మీఱిన = అతిశయించిన; ఒల్లన్ = అంగీకరింపను.

వ. అని వెండియు నతండు చాపలాతిశయంబునఁ జర్వితచర్వణంబుగా సర్వసుపర్వదుష్ప్రాపం[1]బగు నీ రూపంబు కృపాపరతంత్రం బగుచు నాకు నగపడుటకు భూతవ్రాతంబులు ప్రభూతాద్భుతరసమసృణమానసంబు లగుచు నున్నయవి; భవదీయంబగు నకారణ[2]సుకృతిత్వంబునకు నియంతయుం గలండె? యుత్తరంగంబగు సంసారతరంగమాలి మునుంగుచుఁ బొనుంగుపడి యనంగీకృతవిజ్ఞానజ్ఞాన[3]విలాసులై దోసంబులం జేసిన కరువులనందగు నలసులకు వెల సులభంబు నధికఫలంబునగు యుష్మద్దర్శనంబు భవభయకర్శనంబు నుపసర్గజలదవర్గస్పర్శ[4]నంబు నపవర్గదర్శన నిదర్శ[5]నంబు నగుఁగాక! ఏతత్ క్షేత్రంబు నీయాజ్ఞ నశేష క్షేత్ర విశేషోత్తంసం బగుంగాక! ఈ తీర్థంబు నస్మన్నామాంకితసమర్థనంబున నుత్తమం బగుంగాత[6]మని. 111

టీక. చర్వితచర్వణంబుగాన్ = చెప్పినదానినే మఱలఁజెప్పునట్లుగా; సర్వసుపర్వదుష్ప్రాపంబు = సమస్తదేవతలకును పొందరానిది; భూతవ్రాతంబులు = జీవరాసులు; ప్రభూత......మానసంబులు = ఎక్కువ ఆశ్చర్యముచే చిక్కనైన మనస్సుకలవి; సుకృతిత్వంబునకున్ = మేలుచేయు పద్ధతికి; నియంత = నియమించువాఁడు - ఆజ్ఞాపించువాఁడు; ఉత్తరంగంబగు = పైకిలేచు (విజృంభించు) అలలు గల; సంసారతరంగమాలిన్ = సంసారసాగరమున; పొనుంగుపడి = తేజస్సుచెడి; అనంగీ......విలాసులై = గ్రహింపని (ఎఱుఁగని) విజ్ఞాన జ్ఞానముల లీలలు కలవారయి; దోసంబులన్ = దోషములతో - పాపములతో; కరువులు = పోఁతపోయు అచ్చులు; భవభయకర్శనంబు = పునర్జన్మభయమును క్షీణింపఁజేయునది; ఉపసర్గజలదవర్గస్పర్శనంబు = ఉపద్రవములను మేఘములగుంపునకు గాలియగునది; అపవర్గదర్శననిదర్శనంబు = మోక్షదర్శనమునకు తార్కాణమైనది; అశేషక్షేత్రవిశేషోత్తంసంబు = గొప్పక్షేత్రము లన్నిటియందును ఉత్తమమైనది; అస్మన్నామాంకితసమర్థనంబునన్ = నా పేరిచే చిహ్నితమగునట్లు నెఱవేర్చుట (చేయుట) చేత.

ఉ. ఆనతమౌళియై [7]యిటులఁ బ్రార్థనసేయు మునీంద్రు శాంబరీ
మానుషవేషధారి దయమానమనఃస్థితి [8]బిగ్గ నవ్వుచున్

1. చ. బున. 2. క. సుకృతత్వ. చ. ట. సుకృతిత్వ. 3. చ. సంబులై. 4. చ. నంబున. 5. చ. నఁబగు. 6. చ. ట. యని 7. క. యటలు. చ. ట. యిటుల. 8. చ. బిగ్గ.

వీనులఁ దాఁకు గన్నడల వేమఱు చూచుచుఁ బల్కుఁ జిల్కుపూఁ
దేనియ సోనవెల్లువలఁ దెప్పలఁ దేలెడు మేలిపల్కులన్. 112

టీక. ఆనతమౌళియై = వంచిన తల కలవాఁడై; శాంబరీమానుషవేషధారి = మాయామానుష విగ్రహమును ధరించినవాఁడు - శ్రీకృష్ణుఁడు; దయమానమనఃస్థితిన్ = దయతలఁచిన మనోవ్యాపారమున; బిగ్గన్ = గట్టిగా; చిల్కు......వెల్లువలన్ = కారుచున్న పూవుఁదేనెవానవలని ప్రవాహములందు; తెప్పలఁదేలెడు = ఓలలాడెడి; మేలిపల్కులన్ = మంచిమాటలతో; పల్కున్.

సీ. అతిదుర్లభంబు వేఁడితి దుర్లభుఁడనైన [1]యే నీకుఁ దక్కుట మానివర్య!
త్వత్ప్రియార్థముగ నీ స్థలమునఁ బరివారయుక్తుండనై నిల్చి యున్న నన్ను
సేవించువారెల్లఁ జిరపుణ్యవంతులు నిహపరసుఖలాభహృష్టమతులు
కలికాలకల్మషగరళకూటాటోపకాకోలకంఠులు [2]గళితభవులు
తే. నయ్యెదరు; సర్వదివ్యోత్తమాస్పదాజ్ఞఁ
బూని [3]యీ క్షేత్రమును దీర్థమును సమస్త
భువనవర్ణితవిఖ్యాతిఁ బొదలుఁగాత
[4]మెల్ల పుణ్యస్థలములకు నెక్కుడగుచు. 113

టీక. దుర్లభుఁడను = లభింపనివాఁడను; దక్కుటన్ = అధీనుఁడనగుటచే; ఇహ............మతులు=ఈలోకపుసుఖములతోను, పరలోకసుఖములతోను సంతోషించిన మనస్సు కలవారు;కలి......కంఠులు=కలికాలమునందలి పాపము లనెడి విషసమూహములయొక్క విజృంభణమునకు శివులైనవారు-కలికాలపాపములను నశింపఁజేయువారు; గళితభవులు = నశించినజన్మ కలవారు - జన్మరహితులు; ఎల్ల పుణ్యస్థలములకున్=అన్ని పుణ్యస్థలములకంటె; ఎక్కుడు=గొప్పది; పొదలుఁగాత!=ప్రసిద్ధమగుఁగాత!

క. త్వన్నామచిహ్నితంబగు, నిన్నేలయె తెల్లదీవి; యేనుండుటకున్
మన్నించి భక్తవాంఛా,భ్యున్నతు లొసఁగుటయె నాకు యుక్తవ్రత[5]మ్మున్. 114

టీక. ఇన్నేలయె = ఈ క్షేత్రమే; తెల్లదీవి = శ్వేతద్వీపము; మన్నించి = గౌరవించి; యుక్తవ్రతమున్ = తగిన నియమముకూడ.

సీ. విను ధాతృసుత! యప్పు డనిమిషు లసురారి కృపకు నచ్చెరువంది కేలు మొగిచి
'పరమేశ! యో భక్తపరతంత్ర! భావానువర్తి! పరబ్రహ్మ! వరద! నిన్ను
నరచేతిమణిఁ జేసి యవనివారల కెల్ల నపవర్గ మొసఁగు నీయయ్య [6]నెట్లు
వోలు విశ్రాణనసాలంబు యాచకకాంక్షితమాత్రాప్తికారణంబు
తే. [7]నీకె తగు నీత[8]నికె తగు నిఖిలగమ్య
పూజ వడయంగఁ బూజించి పొగడువడయ'
నని మురద్వేషిఁ, బుండరీకుని బొగడుచుఁ
జనిరి సమ్మదముగఁ నిజ[9]స్థానములకు. 115

1. క. నే. చ. ట. యే. 2. చ. కలిత. 3. చ. యా. 4. యెల్ల. 5. చ. ట. ముల్. 6. చ. యొట్లు. 7. చ. నీక. 8. చ. నీక. 9. సదన. ట.

టీక. ధాతృసుత! = నారదుఁడా! అపవర్గము = మోక్షము; విశ్రాణనసాలంబు = ఈవి ప్రాసు=కల్పవృక్షము; యాచక......కారణంబు = యాచకులు కోరినకోరికలను మాత్రము ఇచ్చునది - అధికముగా ఈయనిది; మురద్వేషికిన్ = విష్ణుని.

ఆ. పొగడి రఖిలమునులు జగము లానందించె, నాఁటపాట చూపి రమరరమణు
లా దినంబు సుదిన[1]మయ్యు దుర్దినమయ్యె, విబుధతరులతాంతవృష్టి గురియ. 116

టీక. అమరరమణులు = అప్సరసలు; సుదినము = మంచిదినము - మంచిరోజు; దుర్దినము = చెడ్డరోజు, మేఘములు కప్పుటచే చీఁకటియైన రోజు; విబుధ......వృష్టి = కల్పవృక్షపు పూలవాన. అలం. విరోధాభాసము.

సీ. శిఖిపింఛధారియై చేదోయి కటి నిల్పి హరితీర్థమునఁ బశ్చిమాభిముఖుఁడు
క్షేత్రంబునందుఁ బ్రాగ్దిగభిముఖుండునై రెండు మూర్తులు దాల్చుచుండు; నతని
పదపీఠమై యొప్పు ఫణిభర్త; రమ గొల్చు హ్రీ యన శ్రీ యన రెండుగడలఁ
జామరహస్తలై; ఛందోమయాకృతి ఖగలోకనాథుఁ [2]డగ్రమున వెలయు;
తే. దక్షిణంబున సనకప్రధానమునులుఁ, దామ పొగడుచు సేవించుఁ దమ్మిచూలి;
యేను రుద్రులు సేవింతు మెడమవలన;, వెనుక నుందురు రింద్రాదివిబుధవరులు.

టీక. శిఖిపింఛధారియై = నెమలిపురిని (తలపై) ధరించినవాఁడై; చేదోయి = రెండు చేతులు; ప్రాగ్దిగభిముఖుండు = తూర్పుదిక్కునకు ఎదురుగా ఉన్నవాఁడు; ఫణిభర్త = సర్పరాజు - శేషుఁడు; రమ = లక్ష్మీదేవి; రెండుగడలన్ = రెండు దిక్కులందును; ఛందోమయాకృతిన్ = వేదస్వరూపముతో; ఖగలోకనాథుఁడు = గరుడుఁడు; అగ్రమునన్ = ఎదుట; తమ్మిచూలి = బ్రహ్మ.

వ. వత్సా! శ్రీవత్సలాంఛనుభక్తవత్సలత్వంబు నీవు నెఱింగినయదియకదా! వినుమత్తెఱంగున మెఱుంగు టొల్లియ గొల్లదొర కరకలితచిత్ర[3]భస్త్రజలజశుక్తియు, విరచిత వినత [4]ముక్తియుఁ,గుటిలకోమలవినీలకుంతలనికరుండును,నపరిమితకరుణాకరుండును,గటితటఘటితదోఃస్తంభయుగళుండును, జటులనిశాట[5]గళనిగళుండును,మకరకుండలమండితకపోలఫలకుండును, యమునాకులతిలకుండును, ఫుల్లకాశి[6]కసఖ్యాభిరామమృదులోరుద్వయుండును, నద్వయుండును, పుండరీకప్రభృతి మునిజనసేవ్యమానుండును, ననూనుండును, నఖండజ్ఞానానందైకవిగ్రహుండును, విగళితజగన్నిగ్రహుం[7]డునునై; పంచాబ్దంబును, [8]బంచశరసహస్రాతిశాయి విలసనసరసంబును, నిచ్ఛాదిగంబరంబును నైన ప్రాయంబును, నవరత్నసానుప్రాయంబును, బాహ్యాభ్యంతరికద్వా[9]రాష్టకవిసృష్టంబు, నదభ్రంబు, నభ్రంకషంబును నగు మహాప్రాసాదంబునందు వాసవవైశ్రవణ[10]వరుణవైవస్వతప్రముఖ ముఖభుగలఘుకిరీటమణిగణ ఘృణిమంజరీపింజరీకృతంబగు శేషపీఠంబు నధిష్ఠించి, చరణద్వయాంతరాళోపలాలితగోయష్టిలతామతల్లియై భువనత్రితయకామితకల్పవల్లియునైన తన యాకృతి యవికృతభావంబునం బ్రభవింపఁ దత్క్షేత్రతీర్థమధ్యంబుల నంగీకృతాధ్యాసీనుండై వాసుదేవాదివ్యూహంబులు, జ్ఞానక్రియాదిశక్తులు,

1. చ. ట. మయ్యె. 2. చ. డుగ్ర. 3. చ. భస్మజల 4. చ. యుక్తి. 5. చ. దళ. 6. చ. సిక్య. 7. క. డునై. చ. డునునై. 8. క. పంచ. 9. చ. రాంతక. 10. క. లో 'వరుణ' లేదు.

వసురుద్రాదిత్యాదిమరుద్విశేషంబులు, నశేషనిగమంబులు, నఖిల[7]సిద్ధాంతంబులు,
సమస్తతీర్థసార్థంబులు, సకలమంత్రరహస్యంబులు, సర్వ[1]గాంధర్వసర్వస్వంబులు,
విశ్వవిశ్వాధికైశ్వర్యంబులు, ననశ్వరసంపదలం బొదలి సేవింపఁ బెంపు మెఱసి
యుండె నని వెండియుఁ [2]గుండలికుండలుం డిట్లనియె. 118

టీక. శ్రీవత్సలాంఛనుఁడు = విష్ణువు; మెఱుఁగు......దొర = మెఱయుచున్న వస్త్రమును ధరించిన గొల్లరాజు - శ్రీకృష్ణుఁడు; కర......శుక్తియుక్ = చేతియం దున్న విచిత్రమైన సాఁచియు, శంఖమును కలవాఁడును; విరచితవినతముక్తియుక్ = కూర్పఁబడిన నమ్రుల మోక్షము కలవాఁడును; కుటిల......నికరుండును = వంగినవియు, మృదువైనవియు, నల్లనివియు నగు తలవెండ్రుకలు కలవాఁడును; కటి......యుగళుండును = మొలపై నుంచిన స్తంభములవంటి రెండు భుజములు కలవాఁడును; చటుల.....నిగళుండును = క్రూరులైన రాక్షసుల మెడలకు సంకెల అయినవాఁడును; క్షుల్లకా......ద్వయుండును = చిన్నచిక్కుపు కూడికచే (జాలెసంచిని కట్టుకొనుటచే) ఇంపయిన మెత్తని రెండు తొడలును కలవాఁడును; అద్వయుండును = తనకు రెండవది లేనివాఁడును; అనూనుండును = తక్కువ కానివాఁడును - గొప్పవాఁడును; అఖండ......విగ్రహుండును = శాశ్వతజ్ఞానానంద స్వరూపుఁడును; విగళితజగన్నిగ్రహుండును = నశింపఁజేయఁబడిన లోకభయము కలవాఁడును; పంచాబ్దంబును = ఐదేండ్ల వయస్సు కలదియు; పంచ......శరసంబును = వేయిమంది మన్మథుల నతిక్రమించిన చక్కఁదనముచే ఇంపైనదియును; ఇచ్ఛాదిగంబరంబును = కోరి వస్త్రమును విడిచినదియుఁ; ప్రాయంబు = వయస్సు; నవ......ప్రాయంబును = నవరత్నముల ప్రోఁగు అను కొండకు చరియవంటిదియు; బాహ్య......విసృష్టంబు = బయటను, లోపలను ఎనిమిది ద్వారములచే విడువఁబడినదియు - (ద్వారాష్టకవిశిష్టంబు - అని యుండునేమో!) - ఎనిమిది ద్వారములు కలదియు; అదభ్రంబుక్ = గొప్పదియు; అభ్రంకషంబుక్ = ఆకాశము నంటుచున్నదియు; మహాప్రాసాదంబునందుక్ = గొప్ప సౌధమునందు; వాసవ...పింజరీకృతంబు - వాసవ = ఇంద్రుఁడు; వైశ్రవణ = కుబేరుఁడు; వైవస్వత = యముఁడు; ప్రముఖ = మొదలైన; మఖభుక్ = దేవతలయొక్క; అలఘుకిరీట = గొప్ప కిరీటములందలి; మణిగణ = మణుల సమూహముయొక్క; ఘృణిమంజరీ పింజరీకృతంబు = కాంతిసమూహముచే ఎఱుపుకలిసిన పసుపువన్నె కలదిగాఁ జేయఁబడినది; చరణ......మతల్లియై = రెండుకాళ్ల నడుమ నిఱికించిన సన్ననిగొప్ప నెలకోల (పశువులను తోలెడి కఱ్ఱ)కలవాఁడయి; భువన...వల్లియుక్ = మూఁడు లోకములకు కోరిన కోరికల నిచ్చుటకు కల్పవృక్షమును; ఆకృతి = ఆకారము; అవికృతిభావంబునక్ = వికారములేనట్లు - సహజముగా; అంగీకృతాధ్యాసీనుండై = అంగీకరింపఁబడిన ఉనికి కలవాఁడై - స్థిరముగా కూర్చున్నవాఁడై; వ్యూహములు = గుంపులు; మరుద్విశేషంబులు = దేవతలు; అశేషనిగమంబులు = సమస్తవేదములు; సార్థంబులు సమూహములు; సర్వ...సర్వస్వంబులు = సమస్త సంగీత సంపదలు; అనశ్వరసంపదలు=నాశములేని (స్థిరమైన) సంపదలు; కుండలికుండలుండు = పాము కుండలముగాఁ గల శివుఁడు.

క. నారద! ధృతహేమరసా,సారచ్ఛురితంబు విష్ణుసదనం బది వే
దీరచితారాత్రికతతి, భూరమణీమణికిరీటముం [3]బురుడించున్. 119

టీక. ధృత......చ్ఛురితంబు = ధరింపఁబడిన బంగారురసప్రవాహముచే పూయఁబడినది - బంగారుపూఁత కలదనుట; విష్ణుసదనంబు = విష్ణునియిల్లు - దేవాలయము; వేదీరచితారాత్రికతతి =

---

7. క. శుద్ధాంత. చ. ట. సిద్ధాంత. 1. క. గంధర్వస్వరసారస్యం. చ. ట. గాంధర్వసర్వస్వం.
2. ట. పుండరీకం. 3. చ. బురణించున్.

తిన్నైపైఁగూర్పఁబడిన హారతులగుంపుకలది; భూ...కిరీటమున్ = భూమియను స్త్రీయొక్క మణికిరీటమును; పురుడించున్ = అనుకరించును. అలం. ఉపమ.

క. అల తీర్థస్థలి క్షేత్రస్థలి లీలావిగ్రహ ద్వితయంబు నుద్దై భా
సిలు పౌండరీకవల్లభుఁ, దలఁచినఁ గనుఁగొన్నఁ గరగతము లిహపరముల్. 120

టీక. పౌండరీకవల్లభున్ = పుండరీకుని క్షేత్రమునకు ప్రభువగు శ్రీవిష్ణుని; కరగతములు = చేతికి చిక్కినవి.

క. వినఁబడఁడు చెవులఁగన్నులఁ, గనఁబడఁ డత్యుగ్రనారకవ్యథచేతన్
బొనుఁగుపడి జడియు వైష్ణవుఁ, డనవధిదురితప్రవర్తి యయ్యుఁ గుమారా! 121

టీక. అత్యుగ్ర......చేతన్ = మిక్కిలి భయంకరమగు నరకలోకమందలి బాధచేత; బొనుఁగుపడి = తేజోవిహీనుఁడయి; జడియు = తొలఁగునట్టి; వైష్ణవుఁడు = విష్ణుభక్తుఁడు; అనవధి దురితప్రవర్తియయ్యున్ = హద్దులేని పాపముల నాచరించినవాఁ డయినను.

చ. ఇరుగడలం ద్విరూపములఁ గృష్ణుఁడు దైత్యనిరాకరిష్ణుఁ డ
ప్పురుసున నుండ నన్నడిమిభాగమునందు వసింతు రెప్డు రా
నరులు మనుష్యరూపభరణంబునఁ గ్రీడ యొనర్చు యక్షకి
న్నరగరుడోరగద్యుచరనాథులుగాఁ గొని మ్రొక్కఁగాఁ దగున్. 122

టీక. ఇరుగడలన్ = తూర్పు, పడమరలు రెండుదిక్కులందును; దైత్యనిరాకరిష్ణుఁడు = రాక్షసులను తిరస్కరించువాఁడు - విష్ణువు; అప్పురుసునన్ = ఆరీతిని.

ఉ. ఎయ్యది దివ్యసేవ్యతర మెయ్యది మానిమనోఽభిగమ్యమా
నెయ్యది నీవు నేను భజియింపఁగ నింపగు నెల్లనాఁడు నా
దయ్యపువెల్గు సుమ్ము సతతస్థితి వెల్గెడుఁ [1]బుండరీకవా
గ్ధాయ్యలఁ బ్రజ్వరిల్లుచు జగత్త్రయదుష్కృతదాహదక్షమై. 123

టీక. మానిమనోఽభిగమ్యము = మునుల మనస్సులచే పొందఁదగినది; దయ్యపువెల్గు = దివ్యజ్యోతి; సతతస్థితిన్ = శాశ్వతముగా; పుండరీకవాగ్ధాయ్యలన్ = పుండరీకమునియొక్క మాటలనెడి హోమసాధకబుక్కులచేత; జగత్......దక్షమై = ముల్లోకముల పాపములను దహించుటకు సమర్థమై. అలం. రూపకము.

మ. అలసంబుల్ మునిరాట్ప్రణీతములు ప్రాయశ్చిత్తముల్ పాతకం
బుల నిర్జింపఁగ; విష్ణుభక్తియ తగున్ బో దానికిం బూనఁ; బా
ములపల్గాటులు చీరలం దుడిచినం బోనేర్చునే మాంత్రికా
కలితాహిప్రతివీరమంత్రపదరేఖాశ్లాఘచేతంబలెన్. 124

టీక. పాతకంబులన్ = పాపములను; నిర్జింపఁగన్ = జయించుటకు - నశింపఁజేయుటకు; మునిరాట్ప్రణీతములు = గొప్పమునులు ఏర్పఱచినవైన; అలసంబుల్ = మాంద్యముగలవి - అసమర్థములు; దానికిన్ = ఆపాపనాశనమునకు; తగున్, బో = తగియున్నదికదా! మాంత్రిక...బలెన్ = మంత్రగాండ్రు వేసిన విషమునశింపఁజేయు మంత్రపదముల ఉచ్చారణచేతవలె; పాముల పల్గాటులు = పాముల దంతములకాటులు; పోనేర్చునే! అలం. దృష్టాంతము.

---

1. క. పుండ.

సీ. జగదధిష్ఠానంబు సచ్చిదానందాత్మకము [1]నందనందనాత్మకము క్షేత్ర
తీర్థస్థితము పృథగ్దీపితంబు నృసింహరామమత్స్యాదివిగ్రహము లెట్టి
యవి యనఁదగియుండు నట్టిద యగు దాని [2]హైతుకు లఘతమఃప్రోతమతులు
గాంచి యర్చ్యలయం దొకటిగాఁగఁ దలఁచి వికత్థనం బొనరించి గరుసులేక

తే. రౌరవంబుల డిందిపారంబులేక, వనరుచుండ్రు; గాని విజ్ఞానవంతులైన
వారు శిలగాఁగఁ దలఁచ రెవ్వారు దృష్టిగోచరబ్రహ్మ మని చూచి కొలిచియునికి.

టీక. జగదధిష్ఠానంబు = జగత్తు స్థానముగాఁగలది - జగమంతటను వ్యాపించినది; సచ్చిదానందాత్మకము = సత్తు, చిత్తుల స్వరూపము ఆనందముగాఁగలది; పృథగ్దీపితంబు = వేఱుగా ప్రకాశించునది; అఘ...మతులు = పాపములను చీఁకట్లచే కుట్టబడిన (ఆక్రమింపఁబడిన) బుద్ధికలవారు - జ్ఞానహీనులు; హైతుకులు = హేతువాదులు; [పూర్వటీకలో 'హైతికులు = ఆయుధములు పూసినవారు' అని కలదు; ఆ మూలము, వ్యాఖ్యానమును అసంగతములు.] వికత్థనంబు = లేనిపోనిపొగడ్త; గరుసు = హద్దు; డింది = మునిఁగి; పారంబు = అంతము; వనరుదురు = దుఃఖింతురు; శిలగాఁగన్ = ఱాతినిఁగా; దృష్టిగోచరబ్రహ్మము = కనుల కగపడుచున్న పరమాత్మ.

శా. ఆ వాణీరమణుండు ప్రార్థనము సేయన్ దేవకీదేవియం
దావిర్భావమునొంది యేరికి నలభ్యంబైన శోభన్ జగ
జ్జీవాతుస్థితి నుండు నిండుదొర విస్మేరాననున్ నిత్యసం
సేవం దెల్పు జితేంద్రియుండు తమముం జించుం గసుం దత్త్వమున్. 126

టీక. వాణీరమణుండు = బ్రహ్మ; ఆవిర్భావమును, ఒంది = జనించి; శోభన్ = సొబగుతో; ['శోభన్ = విధమున' అని పూర్వటీక.] జగజ్జీవాతుస్థితిన్ = లోకము నుజ్జీవింపఁజేయు జీవనౌషధ విధమున; నిండుదొరన్ = పరిపూర్ణుని; విస్మేరాననున్ = చిరునవ్వుతోఁగూడిన ముఖము కలవానిని; నిత్యసంసేవన్ = సదా - నిత్యము సేవించుటచే; తెల్పు = తృప్తిపొందించు; స్తుతించునట్టి; తమమున్ = అజ్ఞానమును; చించున్ = చెదరఁగొట్టును - నశింపఁజేయును.

తే. భక్తిగద్గదరీతి వాగ్భరము [4]లొలయ, నటనమునఁగూడి[5] గోపికానాథుమ్రోల
నిలిచి కీర్తించుపుణ్యుండు నళిన[6]బంధుదళన మొనరించి తత్త్వపదమున కరుగు.

టీక. భక్తి......రీతిన్ = భక్తిచే గొంతుక హీనమగురీతిని; వాగ్భరములు = మాటలు - స్తుతులు; ఒలయన్ = నటనమునన్ = నాట్యమునందు; నళినబంధుదళనము, ఒనరించి = సూర్యుని భేదించుట నొనర్చి-సూర్యమండలమును ప్రవేశించి; [ముక్తులయాత్మ సూర్యమండలమును భేదించుకొని విరజానదిని దాఁటి పిదప బ్రహ్మపదమును పొందునని శ్రుతి.]

క. హరి సోపహారు లక్ష్మీశ్వరు నెవ్వరు చూతు రట్టివారలు సకలా
మరపూజ్యులు; వారందునఁ, బొరసిన పుణ్యము లగణ్యములు గుణజలధీ! 128

టీక. సోపహారున్ = కానుకతోఁ గూడినవానిని = [ఏదేని కానుక నిచ్చి, హరిని జూడవలెనని భావము.] పొరసిన = పొంది; అగణ్యములు = లెక్కలేనివి.

క. ఇతిహాసపురాణకథా, [7]శ్రుతిస్మృతులు నందగోపసుతుకట్టెదురన్
సతతము పఠియించు మహామతి పరమపదంబు నందు మతిమన్ముఖ్యా! 129

---

1. చ. నంద్యాంగకము. 2. చ. ద్వైతి. ట. హైతి. క. హేతి. 3. ట. సేవన్. 4. చ. లొలియ. 5. చ. ట. గూడ. 6. చ. బంధ. 7. చ. స్మృతి శ్రుతు.

టీక. మతిమన్ముఖ్యా! = బుద్ధిమంతులలో ప్రధానుఁడా! పరమపదంబున్ = వైకుంఠమును; అందున్ = పొందును.

క. తీర్థమున నాడి బ్రహ్మాభ్యర్థితలీలావతారు భక్తాధారున్
పార్థసఖుఁ గొల్వఁగల మోర్త్యోత్తములకున్ గలవు సచ్చిదానందంబుల్. 130

టీక. ఆడి - స్నానమాడి; బ్రహ్మాభ్యర్చితలీలావతారున్ = బ్రహ్మచే పూజింపఁబడిన విలాసార్థపుటవతారము కలవానిని; భక్తాధారున్ = భక్తులకు ఆధారమైనవానిని; పార్థసఖున్ = అర్జునుని మిత్రమును; సచ్చిదానందంబుల్ = శాశ్వతజ్ఞానసంతోషములు; కలవు = కల్గును.

సీ. భ్రూణహంతయు సురాపుఁడు బ్రహ్మఘాతియు గురుతల్పగుఁడు స్తేయి గోవధోప
జీవి పితృద్రోహి శిశు[1]హంతపరదార[2]రతుఁడు నిందకుఁడు సర్వస్వభోక్త
[3]సత్పరిత్యక్తుండు సర్వాభిమర్శి[4]హైతుకుఁడు సర్వాపలాపకుఁ డశుచియు
నిజధర్మవిద్వేషి నీచుండు పాషండషండప్రవణుఁడు స్వేచ్ఛావిహారి

తే. కృత మెఱుంగనివాఁడు సూనృతము లేని
వాఁడు నమ్మినఁ జెడఁ జూచువాఁడు మొదలు
పాపకారులకేనియుఁ బౌండరీక
తీర్థహరిమూర్తియుగ మిచ్చు దివ్యపదము. 131

టీక. భ్రూణహంతయు = కడుపులోని పిండమును చంపినవాఁడును; సురాపుఁడున్ = మద్యమును త్రాగువాఁడును; బ్రహ్మఘాతియున్ = బ్రాహ్మణహత్య చేసినవాఁడును; గురు......రతుఁడు = గురుద్రోహి, బంగారము దొంగిలించినవాఁడు, గోవులను జంపి జీవించు కసాయివాఁడు, తలిదండ్రులకు ద్రోహముచేయువాఁడు, బిడ్డలను చంపువాఁడు, పరస్త్రీలయెడ ఇష్టము కలవాఁడు; నిందకుఁడు = ఇతరులను నిందించువాఁడు; సర్వస్వభోక్త = అందఱిసొత్తును భుజించువాఁడు; సత్పరిత్యక్తుండు=మంచివారిచే వెలివేయఁబడిన (విడువఁబడిన) వాఁడు; [పూర్వటీకలో 'సత్యరిక్తుండు = నిజము లేనివాఁడు' అనియున్నది.] సర్వాభిమర్శి = అందఱిని విమర్శించువాఁడు; ['అన్నింటి నంటువాఁడు' అని పూర్వటీక.] హైతుకుఁడు = హేతువాది; సర్వాపలాపకుఁడు = సర్వమును దాఁచుకొనువాఁడు; పాషండ...... ప్రవణుఁడు = నాస్తికులగు పాషండులయందును, నపుంసకులందును ఆసక్తుఁడైనవాఁడుగు; కృతము=చేసినయుపకారమును; సూనృతము = సత్యము; పౌండరీక......యుగము = పౌండరీకక్షేత్రమున నున్న విష్ణువుయొక్క రెండు మూర్తులును; దివ్యపదమున్ = మోక్షమును; ఇచ్చున్.

చ. అలఁతి పిసాళినవ్వు మధురాధరబింబఫలంబు తమ్మితే
కుల నగు సోగకన్నులు ప్రకుంచితకుంతలచారుఫాలమున్
బలుచనిచెక్కులం గలయఁ బర్విన కుండలరత్నకాంతులున్
గల శిఖిపింఛలాంఛనుమొగంబు గనందగు ధూపవేళలన్. 132

టీక. అలఁతిపిసాళినవ్వు = చిన్న, చక్కని నవ్వు; మధురా......ఫలంబు = దొండపండువంటి మధురమగు పెదవి; ప్రకుంచిత......ఫాలమున్ = మిక్కిలి వంగియున్న జుట్టుగల (వంకరముంగురులు గల) నుదురును; కలయఁబర్విన = అన్నియెడలను వ్యాపించిన.

1. చ. హంత. హంతృ. క. 2. చ. రతుడు. రతులు. క. 3. క. సత్యరిక్తుండును. చ. సత్పరిత్యక్తుండు. 4. క. హేతికుడు. చ. హైతికుడు.

క. క్షణము క్షణార్ధంబైనఁ ద్రి,క్షణలలితం బగు పయోధిశయనువదన మీ
క్షణ మొనరించు కృతికి నా,క్షణమునఁగల యఖిలసుకృతజాతఫలంబుల్. 133

టీక. క్షణార్ధంబు = క్షణములో సగము; త్రిక్షణలలితంబు = మూఁడు కన్నులతో అందముగనున్న; (ఆక్షేత్రమున విష్ణునకు మూఁడుకన్నులు గలవఁట) పయోధిశయనువదనము = విష్ణుని ముఖమును; ఈక్షణము, ఒనరించు = చూచు; కృతికిన్ = కృతార్థునకు.

సీ. మువ్వంకమురువుతో మురళి యొక్కొకవేళ
మోగించు భువనైకమోహనముగఁ
గ్రీడించు నొకవేళఁ దోడిబాలురఁగూడి
యత్నీణగతిఁ గుబేరాక్షకేళి
సవరించు నొకవేళ జలవిహారము చాలఁ
బ్రేమ భీమరథీగభీరవారిఁ
[1]గొలువుండు నొకవేళ నలినసంభవపుండ
రీకాస్త్రదాసులు ప్రీతిఁ గొలువ

తే. నురగరిపువాహనమున నొక్కొక్కవేళ, వేడ్క వేంచేసి మెఱయుఁ దిర్వీథులందు
నెన్నికల్పంబు లరిగిన [2]నేనయేండ్ల, వెలయు ప్రాయంబుగలకొయ్య విట్ఠలయ్య.

టీక. మువ్వంకమురువుతోన్ = మూఁడు వంకలు వచ్చునట్లు నిలిచిన (త్రిభంగి) చక్కఁదనముతో; భువనైకమోహనముగన్ = లోకమునంతటిని మోహమున మునుఁగునట్లు; అత్నీణగతిన్ = గొప్పరీతిని; కుబేరాక్షకేళి = బాలక్రీడావిశేషము - వెన్నెలకుప్పయాఁటను; సవరించున్ = చేయును; భీమరథీగభీరవారిన్ = భీమరథీనదియొక్క లోతైన నీటియందు; ఉరగరిపువాహనమునన్ = గరుడవాహనముపయిని; ఏనయేండ్లన్ = ఐదేండ్లతోనే; కొయ్య = ఒకరికి లొంగనివాఁడు.

శా. శ్రీరంగంబున ద్వారకన్ గయఁ గురుక్షేత్రంబున న్నైమిశా
ఖ్యారణ్యాంజనశైలపుష్కరమహేంద్రానంతశయ్యా హరి
ద్వారశ్రీపురుషోత్తమంబుల నయోధ్యన్ సేతు [3]గంగాబ్ధిసం
గాయాధస్థలిఁ బౌండరీకమున దైత్యారాతి యుండుం గడున్. 135

టీక. గంగా...స్థలిన్ = గంగాసాగరసంగమమున గొప్పదైన చోట; దైత్యారాతి = విష్ణువు.

క. హరియుత్తరభాగంబునఁ, బురుషుఁడు దాఁ బాపమైనఁ బుణ్యం బైనన్
సురకానియంత చేసినఁ, బరిణతమై మేరుకుధరభారముఁ జూపున్. 136

టీక. సురకాని = చిన్నకాని; పరిహితమై = మాఱి - వృద్ధిపొంది; మేరుకుధరభారమున్ = మేరువుపర్వతపు బరువును - (ఎత్తును.) అలం. ఉపమ.

కాకము, హంస, చిలుక, పాము, తేనెటీఁగ, ఆవు మోక్షమునొందిన కథ

సీ. సమ్మార్జనమున ధ్వాంక్షము, నుపలేపనంబున మరాళము, రంగమున విచిత్ర
శుకము, దీపాంకురప్రకటనంబునఁ బాము, పదపద్మతీర్థానుభవముకతన
సరఘయు, నూధస్యపరిషేచనంబున ధేనువు మోక్షంబు తెరువు [4]గనియెఁ
గాన నేతత్పరికల్పనంబునఁ బాండురంగాధినాథుఁ జేరంగవలయు

1. క. కొలువు. 2. క. యేన. 3. క. గంగాబ్ధి. చ. ట. గంగాబ్ధి. 4. చ. గలిగె.

తే. ననిన నారదుఁ డిట్లను 'నభవ! జ్ఞాన
విరహితంబులు జడములు, వీని కెట్లు
మనుజకృత్యంబు చేకూరె? మధువిరోధి
యెట్లు వరమిచ్చె' నని వేఁడ నీశుఁ డనియె. 137

టీక. సమ్మార్జనము = తుడుచుట; ధ్వాంక్షము = కాకి; ఉపలేపనంబునన్ = అలుకుటవలన; మరాళము = హంస; రంగమునన్ = ముగ్గువలన; విచిత్రశుకము = రంగురంగుల చిలుక; దీపాంకుర ప్రకటనంబునన్ = చిన్నదీపమును కలిగించుటచే; పద......కతనన్ = పద్మములవంటి పాదములవలని జలము ననుభవమువలన; సరఘయున్ = తేనెటీఁగయు; ఊధస్యపరిషేచనంబునన్ = పాల యభిషేకమువలన; ధేనువు = ఆవు; కనియెన్ = పొందినవి; అభవ! = శివా! మధువిరోధి = విష్ణువు.

ఉ. మూర్తిమదిక్షుకార్ముకసముజ్జ్వలకీర్తి యనఁబోని చంద్రికా
స్ఫూర్తి వెలుంగఁజేయుచు నభోవనకేసరి చంద్రుఁ డుబ్బఁగాఁ
గార్తికపూర్ణిమన్ యదుశిఖామణి యొక్కనాఁడు చూళికా
నర్తితపింఛగుచ్ఛలసనంబున భీమరథీతటంబునన్. 138

టీక. మూర్తిమత్......కీర్తియనఁబోని = రూపు ధరించిన మన్మథుని ప్రకాశించుకీర్తివలె; చంద్రికాస్ఫూర్తిన్ = వెన్నెలవెలుఁగును; నభోవనకేసరి = ఆకాశమను అడవికి సింహమైనవాఁడు; చూళికా......లసనంబునన్ = సిగజుట్టున నాట్యమాడు నెమలిపింఛెముతో మనోహరమగునట్లు; అలం. ఉపమ, రూపకము.

మ. సురలీలావతులున్ నరాంగనలు చక్షుశ్శ్రోత్రకన్యల్ స్మర
జ్వరపీడాశయలై తనుంగొలువ రాసక్రీడఁ [1]బెన్ ప్రోఢయై
కరలీనోర్మిక లంగుళీచలనరింఖత్కాంతులై క్రాలఁగా
మురళీనాదవినోదకేళిఁ దవిలెన్ మోదం [2]బసాదంబుగన్. 139

టీక. సురలీలావతులున్ = దేవతాస్త్రీలును; చక్షుశ్శ్రోత్రకన్యల్ = నాగకన్యకలు; స్మరజ్వరపీడాశయలై = మన్మథజ్వరముచే పీడింపఁబడిన హృదయములు కలవారై; పెన్ ప్రోఢయై=గొప్ప నేర్పరియై; కరలీనోర్మికలు = చేతులందలి యుంగరములు; అంగుళీ......కాంతులై=వ్రేళ్లు కదలుటచే చలించు కాంతులయి; క్రాలఁగాన్ = ప్రకాశింపఁగా; మోదంబు = సంతోషము; అసాదంబుగన్ = ఎక్కువకాఁగా; ['సాదంబుగన్ = గతికాఁగా' అని ముద్రితప్రతియుఁ, దద్వ్యాఖ్యానమును.]

క. ఆనాదము [3]తద్వనజగతీనివసన్మునిహోమధేను [4]వొకటి సాం
ద్రానంద మొదవ విని తన, మేను మఱచి కురిసె నపరిమితదుగ్ధంబుల్. 140

టీక. ఆనాదము=ఆ ధ్వని; తద్వన...ధేనువు=అచటి వనమున నివసించుచున్న మునిహోమధేనువు; సాంద్రానందము, ఒదవన్ = అధికసంతోషము కలుగఁగా; అపరిమితదుగ్ధంబుల్=ఎక్కువైన పాలు.

ఉ. కానన గంధవాహవశగం బగుటన్ వెస నొండు [5]తత్పయః
ఫేనకణంబు వచ్చి మురభేదను మౌళి నలంకరించె; శ్రీ
జానియుఁ బాటమాని నిజసౌధమునందు సుఖించుచుండె; నా
ధేనువు లెస్సఁగా ముదిసి దేహము నూడ్చి భవాంతరంబునన్. 141

---

1. క. పెన్ ప్రోఢ. చ. పెన్ ప్రోఢలై. 2. క. బుసారంబు. చ. బసారంబు. 3. క, దద్వన. చ. దద్వన. 4. క. వుకటి. చ. వొకటి. 5. చ. దత్పయః

టీక. కాననగంధవాహవశగంబు = అడవిలోని గాలికి స్వాధీనమైనది; తత్పయఃఫేనకణంబు = ఆ పాలనురుగుబిందువు; ఒండు = ఒకటి; మురభేదనుమౌళిన్ = విష్ణునితలను; శ్రీజాని = లక్ష్మీభర్త - విష్ణువు; ముదిసి = ముసలిదయి; దేహము, డిగ్గి = శరీరమును విడిచి; భవాంతరంబునన్ = వేఱొక జన్మమునందు.

## సుశీల యను పతివ్రత చరిత్రము

క. హరిమౌళిపతిత నిజదుగ్ధరసోత్కరఫేనకణకృత పరమసుకృత
స్ఫురణంబున నొక వైష్ణవవరునకుఁ దనుజాత యగుచు వసుధం బుట్టెన్. 142

టీక. హరి......స్ఫురణంబునన్ = విష్ణువుతలపై పడిన తన పాలనురుగుబిందువువలనఁ గలిగిన గొప్ప పుణ్యవిశేషమున; తనుజాత = పుత్రిక; వసుధన్ = భూమిపై.

వ. సుశీలాభిధాన యగు నబ్బాల గుణగణభాస్వరయై యథోచితకాలంబున. 143

టీక. సుశీలాభిధాన = సుశీల యను పేరు కలది; గుణగణభాస్వర = గుణసమూహముచేఁ బ్రకాశించునది; యథోచితకాలంబునన్ = తగిన సమయమున - యుక్తకాలమున.

ఉ. తాళి విభుండు గట్టినమొదల్ పతిదేవత యా సుశీల పెన్
గోలతనంబునన్ మగఁడు కొట్టినఁ దిట్టిన [1]రట్టుపెట్టినన్
దాళి దినంబుఁ దచ్చరణతామరసంబులు గొల్చు నేలయున్
బోలునె యీపె కంచుఁ గృతబుద్ధులు [2]వృద్ధులు ప్రస్తుతింపఁగన్. 144

టీక. విభుండు = భర్త; తాళి = మంగళసూత్రము; కట్టినమొదల్ = కట్టినది మొదలుకొని; పతిదేవత = భర్తయే దైవమని యెంచునది; పెన్గోలతనంబునన్ = పెద్ద అమాయకత్వమున; రట్టుపెట్టినన్ = అల్లరిపెట్టినను; తాళి = సహించి; దినంబున్ = ప్రతిదినమును; తచ్చరణతామరసంబులు = అతనిపాదపద్మములు; కృతబుద్ధులు = బుద్ధిమంతులు; ప్రస్తుతింపఁగన్ = కొనియాడఁగా.

సీ. రూపహీనుఁడు మహాక్రోధనుఁ డతిలోభి బద్ధమత్సరుఁ డన్యబుద్ధి మాయి
చంచలస్వాంతుండు సకలబంధువిరోధి బహుళపథాసక్తిలంపటుఁడు శఠుఁడు
సంతతావిశ్వాస సస్యప్రరోహుండు గర్వపర్వతమస్తకస్థితుండు
కలహశీలుఁడు కుతర్కక్రియాకుశలుండు సంగతోన్మాదోత్తమాంగకుండు

తే. నగునరయేనియు నటువంటి మగనితోడఁ
గాఁపురముసేయు సతి దొడ్డగరిత యగుచుఁ[4]
గసిడికోఁతకు నోర్చి లో విసివికొనక
ధాత దూఱక తండ్రి[6]సేతకు వగవక. 145

టీక. మహాక్రోధనుండు = మిక్కిలి కోపముకలవాఁడు; అతిలోభి = పెద్ద పిసినిగొట్టు; బద్ధమత్సరుఁడు = అసూయాపరుఁడు; అన్యబుద్ధి = వేఱు (చెడ్డ) బుద్ధికలవాఁడు; మాయి = మోసగాఁడు; చంచలస్వాంతుండు = చలచిత్తము కలవాఁడు; బహు......లంపటుఁడు = (ప్రతివిషయమునకు) ఎక్కువ ఒట్టులు పెట్టుకొనుటయం దాసక్తి కలవాఁడు; శఠుఁడు = మూర్ఖుఁడు; సంతత......ప్రరో

1. క. రట్టుచేసినన్. చ. నడ్డపెట్టినం. ట. రట్టుపెట్టినన్. 2. చ. పెద్దలు. 3. క. నుండుకర్క. చ. ట. నుడుకుతర్క. 4. క. యగుచు. 5. క. విసిగి. చ. ఓకిచి. శ.ర. విసివి. 6. చేతకు. శ. ర.

హుండు = ఎల్లప్పుడును అపనమ్మిక యను పంటను పండించువాఁడు; గర్వ......స్థితుండు = గర్వమను పర్వతముయొక్క శిఖరమునఁ గూర్చుండువాఁడు; కలహాశనుఁడు = జగడాలకోరు; కుతర్కక్రియా కుశలుండు = చెడ్డ (వంకర) యుక్తులను వేసి మాట్లాడుటలో నేర్పరి; సంగతో......మాంగకుండు = తలయందు కూడిన పిచ్చి కలవాఁడు - పిచ్చియెత్తినవాఁడు; దొడ్డగరిత = ఉత్తమవనిత; కసిడిఖ్యోత్తకున్ = రాపాడుటకు; ధాతన్ = బ్రహ్మను; దూఱక = నిందింపక; తండ్రిసేఁతకున్ - తండ్రిచేసిన పనికి - ఇట్టివానితోడి వివాహము కూర్చినందులకు; వగవక = విచారింపక.

శా. ఆ తీవ్రాంశుని వేఁడికోర్చి మను ఛాయాదేవియుంబోలె స
త్యాతివ్రత్యగుణాభిరామ యగు నా భామాలలామంబు సం
ప్రీతిం జేయు నసహ్యదర్శనములం బీర్వీకులం బెట్టు దు
ర్జాతున్ *వీతదయున్ [1]బ్రియున్ దదుచితాచారంబుల న్నిచ్చలున్. 146

టీక. తీవ్రాంశుఁడు = సూర్యుఁడు; మను = జీవించు; భామాలలామంబు = స్త్రీరత్నము; అసహ్యదర్శనములన్ = ఓర్వరానివానిని చూపించుటలచే; పీర్వీకులంబెట్టు = బాధించు; దుర్జాతున్ = చెడ్డవానిని; వీతదయున్ = దయలేనివానిని; ప్రియున్ = భర్తను; తదుచితాచారంబులన్ = వానికి అనుకూలములగు పనులను; ప్రీతిన్, చేయున్.

ఉ. కొన్ని గొణింగి [2]కొన్నిగినిసి కొన్ని తుటారములాడి మానరా
కెన్నిక నిన్నినాళ్లకివి యున్నని కూటికిఁ బిచ్చపాటి కొ
మ్మన్న మహాప్రసాదమని హర్షరసోల్లసదాననాబ్జయై
యన్నలినాక్షి భర్తయిడి[3]నన్నియ గైకొను [4]ముక్కధాన్యముల్. 147

టీక. అన్నలినాక్షి = ఆ సుశీల; గొణింగి = మనస్సులో సణిగి; = కొన్ = కొన్ని; కినిసి = కోపించి; తుటారములు, ఆడి = నిందమాటలు ఆడి; మానరాక = (విధిలేక) మానివేయుటకు వలనుగాక; ఎన్నికన్ = లెక్కగా; ఇన్నినాళ్లకున్ = ఇన్ని రోజులకు; పిచ్చపాటి =తక్కువకొలఁత; కొమ్మన్నన్ = తీసికొనుమని పలుకఁగా; మహాప్రసాదము, అని = చిత్తము అని; హర్ష - అబ్జయై = సంతోషమున కలకలలాడు పద్మమువంటి ముఖము కలదయి; ముక్కధాన్యమున్ = ముక్కిపోయిన (ప్రాఁతగిల్లి, సారముచెడిన) వడ్లను; కైకొనున్ = గ్రహించును.

సీ. చతురసమ్మార్జనాచరణంబు దొలునాటి [5]ప్రాఁచివన్నియ [6]త్రోపువడుటగాఁగ
గోమయ గోముఖశ్రీ ముంగిట ఘటించుటలు సుఖమజ్జనకలనగాఁగఁ
గమనీయపూర్ణకుంభముల పూజాక్లృప్తి కుచలికుచాకల్పరచనగాఁగ
నన్నసంపాదనార్హాగ్నిఁ బుట్టిన ధూమపటలి సంస్కారధూపంబుగాఁగ
తే. విఘటిత కవాటకద్వార విశదనయన, యర్చితాధర గేహాళి కాధరోష్ఠ
భాండ గోపనయవనికాంబరపరీత, యింతి గృహలక్ష్మి [7]యత్యంతకాంతిఁ దనరు.

టీక. చతుర......చరణంబు = నేర్పుగా కసవూడ్చుట; ప్రాఁచివన్నియ = నిర్మాల్యము; త్రోపువడుటగాఁగన్ = తీసివేయురీతికాఁగా; గోమయగోముఖశ్రీ = ఆవుపేడతో అలుకునట్టి అలంకారము; ఘటించుటలు = కూర్చుటలు; సుఖ......గాఁగన్ = సుఖస్నానవిధికాఁగా; కమనీయ...

---

* క. వీతదయామతిన్. చ. వీతదయుఁన్. 1. చ. ట. లలో 'బ్రియున్' కలదు. క. లో లేదు. 2. క. కొన్నినిసి. శ. ర. కొమ్మనిసి. 3. క. యిడున. శ. ర. యిడిన. 4. క. ముక్క. చ. ముక్క. శ. ర. ముక్క. 5. చ. వహ్నియ. 6. చ. తోడుపు. 7. చ. సత్యంత.

...క్షప్తి = చక్కని పూర్ణకుంభముల పూజావిధి; కుచ......కాఁగన్ = నిమ్మపండ్లవంటి స్తనముల అలంకారముకాఁగా; అన్న......అగ్నిన్ = అన్నము వండుటకుఁ దగిన యగ్నివలన; విఘటిత...... నయన = కూర్పఁబడిన తలుపులు గల ద్వారములు, స్పష్టములగు కన్నులుకలదియు; ఆర్చితా...... రోష్ఠ = పూజింపఁబడిన క్రిందిగుమ్మము అను అధరోష్ఠము కలదియు; భాండ - పరీత = కుండలను కప్పుటకుపయోగించు తెరయే చీరగాఁగలది; ['యవనికాంబరపరీత = తెరచీరచే ఆవరింపఁబడినది' అని పూర్వటీక.] ఇంతిగృహలక్ష్మి = ఆ సుశీల గృహముయొక్క (శోభ); పూజింపఁబడు లక్ష్మీదేవి; అలం. రూపకము.

సీ. 'ప్రస్తుతంబని పదార్థములు రాజుల వేఁడి కొనితెచ్చి యమ్మిం[1]చుఁ గోమటిండ్ల
మూసి ముల్లడిచి గుమ్ములకొల్చు పై మెత్తులూడ్వఁడు పస్తైన నుండుఁగాని
ఎట్టిచుట్టం[2]బైన యింటి కేతేర రెండవ సూతకము దెల్పి యవలఁ [3]జొనుపుఁ
మును[4]ప్రతిశ్రుతము చేసిన పైఁడి రాకున్న ముచ్చిచ్చునను ప్రేఁగు వచ్చుదనుక
తే. వనరు 'శాకాయ లవణాయ వా' యటంచుఁ
బెనఁగు 'ధూళిః పరిగృహాదపి' యను నాస
ముంచి 'యీఁగకుఁ గాటు, పామునకు బలియు
నొసఁగఁ' డని భర్తకై పొక్కు నువిద మదిని. 149

టీక. ప్రస్తుతంబు = వివాహాదికార్యము; మూసి = (ధాన్యపురాసులను) కప్పి; ముల్లడిచి = మూఁతలకు మేకులు కొట్టి; గమ్ములకొల్చుపైన్ - గోఁతులలోని (పాతరలలోని) ధాన్యముపై; మెత్తులు = మెత్తఁబడిన పూఁతలు; ఊడ్వఁడు = తీయఁడు; రెండవ సూతకము = మృతాశౌచము; అవలఁజొనుపున్ = బయటికి తరుమును; మును = పూర్వము; ప్రతిశ్రుతముచేసిన = వాగ్దత్తమైన; ['ప్రతిశ్రితము=ఒకరి యధీనము' అని పూర్వటీక.] పైఁడి = బంగారము - ధనము; ముచ్చిచ్చునను = ఆహవనీయాదులగు మూఁడగ్నులందును; [అగ్నులు 3. ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అని.] శాకాయ, లవణాయవా యటచున్ = (ఎవరే మిచ్చినను అది కూరకుఁగాని, ఉప్పునకుఁగాని యగుననుచు - తనకుఁ జాలదనుచు; వనరున్ = దేవురించును; 'ధూళిః పరగృహాదపి' అను నాసన్ = ఇతరులయింటినుండి దుమ్మయినను తీసికొని రావలెనను ఆశచే; పెనఁగున్ = బాధపడును.

'ఈఁగకు కాటు, పామునకు బలి' అనునది అసంభవములనుగూర్చిన లోకోక్తి; సుశీలభర్త అట్టి వానినికూడ అనుకొనసీయని స్థితి నుండునని భావము. ఉవిద = సుశీల; పొక్కున్ = దుఃఖించును.

వ. ఇవ్విధంబున నవ్విధుబింబవదన విధుతకుటిలాచార చతురుండగు జీవితేశ్వరు నీశ్వరుంగాఁ దలంచుచుఁ దదుపాసనంబు తనకు నిహపరసిద్ధి సంసూచకంబుగ నిండు డెందంబునం గోచరింపంజేయుచుఁ గీర్తితచరిత్రంబునం బ్రవర్తిల్లుచుండు నంత.

టీక. విధుబింబవదన = చంద్రమండలముఁబోలు ముఖము కల సుశీల; జీవితేశ్వరున్ = భర్తను; ఈశ్వరునిఁగాన్ = దేవునిగా; తదుపాసనంబు = అతనిని సేవించుట; ఇహ......సంసూచకంబు = ఏతల్లోక, పరలోక సుఖసిద్ధిని సూచించునది; కీర్తితచరిత్రంబునన్ = కొనియాడఁబడిన సత్ప్రవర్తనతో.

క. అంట [5]నొకనాఁడా భూసుర,కుటుంబినీ సదనమునకుఁ గుహనాపటువుఁ
బటు[6]వై మైజిగిఁ దెగడుం,బటువగు నొక వడుగు వచ్చె భుక్త్యాపేక్షన్. 151

టీక. అంటన్ = పిదప; భూసుర.....సదనమునకున్ = ఆ బ్రాహ్మణస్త్రీ (సుశీల) గృహమునకు; కుహనావటువున్ = కపటబ్రహ్మచారి యైన వామనుని; పటువగు = మిక్కుటమైన; మైజి

1. క. చుకోమ. 2. చ. బైనని. 3. చ. జొన్పు. 4. క. ప్రతిశ్రితము. చ. ప్రతిశ్రుతము.
5. చ. ట. యొక. 6. క. వగు. చ. వై.

గిన్ = దేహకాంతిచేత; తెగడుంబుటువు = తిరస్కరించు పుట్టువు కలవాఁడు - చక్కనివాఁడు; వడుగు = బ్రహ్మచారి; భుక్త్యాపేక్షన్ = భోజనముచేయు కోరికతో; వచ్చెన్. అలం. ఉపమ.

వ. వచ్చిన నమ్మచ్చెకంటి గెంటనినెయ్యంబు [1]లియ్యంబగు నంతఃకరణంబున నడలు
గడలుకొన గ్రామాంతరాసక్తుం డగు ప్రాణనాథుండు తనుం బిలిచినయట్లయిన
[2]లోనింటి బోనమాని తొంగి చూచుతఱిం బోడకట్టి, బొట్టునకు మేదావి [3]మేదు
నలవాటునం గందిన యంగుళీద్వితయంబు దేఁటి గుట్టినం బృథగ్వర్ణమూర్తులగు
[4]సంవర్తికలు గల జలరుహంబనఁ బ్రశస్తంబగు హస్తంబెత్తి 'స్వస్త్యస్తుతే' యని
యాశీర్వదించుటయుఁ గృతనమస్కారయై యా సారసామోద మృదులస్వరం
బున నిట్లనియె. 52

టీక. మచ్చెకంటి = చేఁపలవంటి కన్నులు కల సుశీల; గెంటని = తొలఁగని; నెయ్యంబు లియ్యంబు = స్నేహమున లగ్నమగునది; అడలు=భయము; కడలుకొనన్ =అతిశయింపఁగా - కలుగఁగా; లోనింటన్ = లోపలియింట; బోనము? ద్వారమనియుండునేమో! ఊని = పట్టుకొని; పొడకట్టి=కనఁబడి; బొట్టునకున్; మేదావి = ఔపాసనచేసిన నిప్పు మసి; మేదు నలవాటునన్ =మెదుపునట్టి అభ్యాసమువలన; కందిన = ఎఱ్ఱఁబాఱిన; అంగుళీద్వితయంబు = రెండు వ్రేళ్లు; పృథగ్వర్ణమూర్తులు వర్ణము మాఱిన స్వరూపము కలవి - రంగుమాఱినవి; సంవర్తికలు = క్రొత్తఱేకులు; 'స్వస్తి, అస్తు, తే = నీకు శుభము కలుగుగాక! కృతనమస్కార = చేయఁబడిన నమస్కారము కలది - నమస్కరించినది; సారసామోద = తామరవాసనవంటి సువాసనగల (దేహము) కలది - సుశీల.

సీ. 'ఎందుండి రాక? యిం దేతేరఁ గత మేమి? గ్రాసార్థిభావంబు గానవచ్చె'
'నగు'నన్న 'నట్లేని మొగసాల నుండుఁ; డాయన యూర లేఁడు; యామార్ధమునకె
కావింతు [5]నన్నసంస్కారంబు; మీ రారగింతురుగాని వేగిరమె' యనుడు
మాణవకుఁడు పల్కు 'ముగుద! నే [6]నేన్నాళ్లనుండియుఁ గుడువఁ గూ డొదవకునికి
తే. వేఁడి యగుదాఁక నోరువ; మూఁడుగలిగె, బులిసినది గల్లె నన్నంబు పోఁకయంత
యొసఁగి త్రుత్తార్పు; వెసఁ [7]జద్ది మెసవనైన,పాప ముడిపించుకొందుఁ దపంబుకలిమి.'

టీక. ఏతేరన్ = రాఁగా; కతము = కారణము; గ్రాసార్థిభావంబు = భోజనమునపేక్షించు అభిప్రాయము; మొగసాలన్ = చావడియందు; ఆయన = (భర్తయనుట); యామార్ధమునకె = గంటన్నరలోనే; ఆరగింతురుగాని = తినవచ్చును; మాణవకుఁడు = వటువు; ఏనాళ్ళనుండియున్ = ఐదు రోజులనుండియు; కుడువన్ = భుజించుటకు; కూడు, ఒదవకునికిన్ = తిండి దొరకనందున; వేఁడి యగుదాఁకన్ = వేఁడియన్నము తయారగునంతవఱకును; ఓరువన్ = తాళలేను; మూఁడు, కలిగెన్ = గిన్నెయడుగున అంటుకొనిన దున్నను; పులిసినది; కల్గెన్ = చల్దియున్నను; పోఁకయంత = పోఁకకాయయంత-స్వల్పమనుట. త్రుత్తు=ఆఁకలిని; ఆర్పు = ఆర్పుము-పోఁగొట్టుము; చల్దిమెసవన్ = చద్దన్నము తినుటవలన; తపంబుకలిమిన్ = తపస్సంపదచే.

తే. అనుడు నెలనాగ యిట్లను 'నసఘ! నీకుఁ
జలిది యేనెట్టు లిడనేర్తు? క్షణములోన

1. చ. వియ్యంబు. 2. చ. లోనింతి బోనరు. 3. చ. ట. మెదవునెల. 4. చ. సంవృత్తికలు. 5. నళనసం. శ. ర. పాఠము. 6. క. దేన్నాళ్ల. సూర్యా నేన్నాళ్ల. 7. క. చల్ది.

వంటి గాపెంతు; భుజియించి వలయునెడకు
నేఁగు' గా పెని పతిఁ బుచ్చు తాఁగవడుగు. 154

టీక. ఎలనాగ = స్త్రీ - సుశీల; వలయునెడకున్ = ఇచ్చవచ్చినచోటికి; తాఁగవడుగు = ధూర్తుఁడైన బ్రహ్మచారి.

తే. త్రోవ గమియించుచోట నో పూర్వుఁబోఁడి!
యవరవర్ణసమాచారమైనఁ జెడదు
బ్రాహ్మ్య; మీ తడ వేటికి? బ్రాణరక్ష
నెఱపు మొకయింత మెసు కిన్ని నీళ్లు నొసఁగి. 155

టీక. త్రోవన్ = దారియందు; గమియించుచోటన్ = నడచునపుడు - ప్రయాణసమయమున; అవరవర్ణసమాచారమైనన్ = శూద్రుని యాచారమువంటి యాచారమైనను; బ్రాహ్మ్యము = బ్రాహ్మణత్వము; చెడదు; ఈ, తడవు = ఈ యాలస్యము. ['పథి శూద్రవదాచరే' త్తని అభియుక్తోక్తి గ్రావ్యము.]

తే. వాఙ్మనఃకాయకర్మప్రవర్తనముల
సంభవించిన పాపంబు సంహరించి
యతిథి గృహమేధి కిచ్చు శాశ్వతసుఖములు;
వినవె 'యభ్యాగతః స్వయం విష్ణు' [1]నంగ. 156

టీక. అతిథి = అనుకోనకుండ ఇంటికి ఆహారార్థము వచ్చినవాఁడు; వాఙ్మన...... ప్రవర్తనములన్ = మాట, మనస్సు, శరీరము, పని అనువాని నడతలవలన; సంహరించి = నశింపఁజేసి; గృహమేధికిన్ = గృహస్థునకు; అభ్యాగతః స్వయం విష్ణుః = ఇంటికి వచ్చిన యతిథి సాక్షాత్తుగా విష్ణువే; అలం. లోకోక్తి.

తే. అతివ! తీర్థా[2]దరత్వర సహగు దెంచి
త్రోవ నాఁకటివేళకు దొరకకునికి
[3]కాంతు నీయాన యోఁగూటి[4]కలలె; జఠర
వహ్ని [5]నొక యేన కా; దెట్టివాఁడు నెరియు. 157

టీక. తీర్థాదరత్వరన్=పుణ్యతీర్థములయెడఁగల మక్కువచేఁతనయిన తొందరపాటున; నీయాన = నీపై ఒట్టు; జఠరవహ్నికిన్ = ఆఁకటిచిచ్చునకు; ఎరియున్ = మండును - తపించును.

వ. నాతోడం గూడియాడు వడుగులు బడుగులయ్యును, వడిచెడక కడఁక మెఱసి, యేము సంకల్పించి మున్నే తేర సమకట్టిన పౌండరీకంబునకుఁ బాండురంగ సేవా సావధానులై చనిరి; నేను కూటబీద తోడుదప్పినతెఱంగున నిచ్చటం దడసితి వెండియు వినుము. 158

టీక. వడుగులు = బ్రహ్మచారులు; బడుగులు = చిక్కినవారు - బడలినవారు; కడఁక మెఱసి = ప్రయత్నించి - పూనికకలిగి; సమకట్టిన = సిద్ధపడిన; 'కూటిబీద తోడుతప్పె'నను నది లోకోక్తి. తిండి కాళపడినవాఁడు - (వెనుకబడినవాఁడు) తన తోడిప్రయాణికులను తప్పునని దీనిభావము. తడసితిన్ = ఆలసించితిని - నిలిచితిని.

---

1. చ. ట. వనుట. 2. చ. పర. 3. క. కాంచ. చ. కాంతు. 4. క. కలన. చ. కలతె. ట. కలరె. 5. చ. నొకయన.

క. తరుణి! "క్షుధాతురాణాం, న రుచి ర్న చ కాల" మనుచు నరు లాడుట లో
నరసి వివే[1]కింపందఁ గుఁ, [2]దెరువరులకుఁ బాయసంబు తిరిసినఁగలదే ? 159

టీక. 'క్షుధాతురాణాం న రుచి, ర్న చ కాలం'=ఆఁకలిచే బాధింపఁబడినవారికి రుచి అక్కఱ లేదు - వేళయు నుండదు - వారి కన్నివస్తువులును రుచికరములే యనియు, అన్నివేళలును యుక్త సమయములే యనియు భావము. ఆడుట = పలుకుట; లోన్ = మనస్సులో; అరసి = ఆలోచించి; వివేకింపందగున్ = మంచిచెడ్డల నెఱుఁగఁదగును. తెరువరులకున్ = బాటసారులకు; తిరిసినన్ = బిచ్చమెత్తఁగా; [కూటికి లేక బిచ్చమెత్తువాఁడు ఏది దొరకినను తృప్తిపడవలెను; పాయసము కావలె ననిన అది యెట్లు లభించును?] అలం. లోకోక్తి.

ఆ. ఎంత భాండశుద్ధి! ఎటువంటి గృహశుద్ధి!, యెట్టి చిత్తశుద్ధి! యిచటఁ [3]జలిది
కూడు [4]దక్క నేడఁ బురోడాశమునకు నో, -మ్మ! సాటివచ్చు; నదియుఁగాక.

టీక. భాండశుద్ధి! = పాత్రశుద్ధి! దక్కనెకన్ = లభించినయెడల; పురోడాశమునకున్, సాటి = (పవిత్రమైన) హోమశేషపిష్టమునకు సమానము. అలం. ఉపమ.

క. అనుచితశతము లొనర్చియుఁ, దనువులు రక్షించుకొనరె? దమశమతేజో
ధనులగు గాధిసుతాదులు, తన ప్రాణము నిలుపుకన్న ధర్మము కలదే ? 161

టీక. దమ......ధనులు = ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహములవలని తేజస్సే ధనముగాఁ గలవారు; గాధిసుతాదులు = విశ్వామిత్రుఁడు మొదలగువారు; అనుచితశతములు = వందలకొలఁదియైన తగని పనులను; తనువులు = దేహములను; నిలుపుకన్న = నిలుపుటకంటె. అలం. లోకోక్తి.

తే. తొలుత నే వేఁడినప్పుడు చలిది నీకు, ననఘ! నేనెట్టు లిడుదాన నంటి;గాన
యశనశేషస్థితికి సందియంబువలదు;, చాలుఁ జాలదో యను వృథాశంక వలదు.

టీక. అశనశేషస్థితికిన్ = అన్నము మిగిలి యుండుటకు; సందియంబు = సందేహము; వలదు = లేదు; వృథాశంక = వ్యర్థపుసందేహము.

క. సతి! యాత్మస్తుతి యతిగర్హిత మని నాపెంపు దెలుపు; నే నొకఁడ మనో
గతిఁ దృప్తిఁ గనిన భువన[5]త్రితయమ్మును [6]బరమతృప్తిఁ దిలకించుఁ జుమీ!.163

టీక. సతి! = అమ్మా! ఆత్మస్తుతి = తన్ను తాఁ బొగడుకొనుట; అతిగర్హితము = మిక్కిలి నిందింపఁబడినది; నా పెంపున్ = నా గొప్పతనమును; మనోగతిన్ = మనస్సునందు; పరమతృప్తి = ఎక్కువతృప్తి; తిలకించుఁజుమీ = కనునుగదా! - పొందునుగదా! [తానే భగవంతుఁడనని ఇందు పటువుసూచించెను.]

వ. అని యంత నిలువక. 164

టీక. అంత, నిలువక = అంతటితో ఊరకయుండక.

క. పెట్టక పో నని యాకటఁ, [7]దొట్టిగిలంబడుచుఁ బడుచు దురదురఁ జని వే
నట్టింటఁ గూరుచుండిన, నెట్టు ననంజాల [8]కమ్రగేక్షణ భీతిన్. 165

టీక. పెట్టక = నీవన్నము పెట్టనిదే; పోను; తొట్టిగిలంబడుచున్ = తత్తఱపడుచు; పడుచు = బ్రహ్మచారి; దురదురన్ = త్వరత్వరగా.

---

1. క. కిం పఁగఁదగు. చ. కింపఁగనగు. శ. ర. కింపందగు. 2. క. తెరు. 3. క. చలిది. 4. క. చిక్క. చ. ట. దక్క. 5. చ. త్రితయమునకు. క. త్రితయమ్మునకు. 6. చ. పరమతృప్తి. క. బరితృప్తి 7. క. ర. తొట్టగిలం. 8. శ. ర. కామ్రగేక్షణ.

సీ. పరిహరించుట కీడు తెలిసిరి బలిబిడ్డ సర్థి నాఁకటిచేత నలయువానిఁ;
బర్యుషితమును నర్పణసేయఁజాలఁ; బాపముగాదె ¹యపచారపరత మెలఁగ;
మిను కొక్కటిచ్చి పొమ్మనినఁ బోవునొ; పోనఁ డధ్వప్రయాసవిహ్వాలుఁ డితండు;
చాలునో చాలదో కలిసినయ మస్మత్తృప్త్యర్థ శేష మల్పంబె యగుట;

తే. జాలకుండిన నగుఁ జెట్ట; బాలుఁ డితఁడు
కొసరి గొంతెమకోరికల్ గోరఁ డేల
²యిడకపోఁబోల దిడఁబోల; దీను దివియఁ
జేను రాకున్నె? తైర్థికుల్ ³పెళుచులంద్రు. 166

టీక. పరిహరించుట = విడుచుట - లేదు, పొమ్మనుట; అలయువానిన్ = బాధపడువానిని; పర్యుషితమును = చల్దియన్నమును; అపచారపరతన్ = చెడ్డపనియందాసక్తితో; మినుకు = చిన్న మెత్తు బంగారునాణెము; అధ్వ......విహ్వాలుఁడు = దారిబడలికచేత స్వాధీనము తప్పిన అవయవములు కలవాఁడు; మద్......శేషము = నాతృప్తికు దాచిబత్తెముగా నీయఁగా మిగిలినది; చాలకుండినన్ = చాలకపోయినచో; 'చెట్ట = కీడు; అగున్ = కలుగును; గొంతెమకోరికల్ = అసాధ్యమైన (కోరరాని) కోరికలను; పోలదు = తగదు; తైర్థికుల్ = తీర్థయాత్రాపరులు; పెసచలు=మోటువారు - మూర్ఖులు. ['విరసపుమాటలాడువారు' అని పూర్వటీక.] అలం. లోకోక్తి. అర్థాంతరన్యాసము.

తే. వంట యగుదాఁక నుండఁ డీ యడుగు; బండి
మీఁదఁ⁴బోవుచు నున్నాఁడు; మేటి⁵ధాటి
నైన దయ్యెడుఁ గాకేమి? యప్పటికిని
మీఁదుగడకట్ట నేలంచు మించుఁబోఁడి. 167

టీక. బండిమీఁదఁ బోవుచున్నాఁరు - అనునది మిక్కిలి తొందరపడుచుండినవానిఁగూర్చిన లోకోక్తి; బండిమీఁదఁబోవుచుండువాఁరు నిలిచి ఒకచోటనుండుట అసాధ్యముకదా! మేటిధాటిన్ = గొప్పవేగముతో; ఐనది, అయ్యెడుఁగాక, ఏమి? = ఆమీఁద ఎట్లు జరుగునో యట్ల జరుగనిమ్ము; అప్పటికిని = ఆ జరుగుదానింగూర్చి; మీఁదుగడ, కట్టనేల? = పైపైయాలోచనలేల? మించుఁబోఁడి = మెఱుపువంటి దేహముగల స్త్రీ - సుశీల.

శా. రారయ్యా! యని శుద్ధిమచ్చరణు గోత్రాదేవతాపుత్త్రు వి
స్మేరాగ్నిప్రభుఁ గూరుచుండ నిడి మ్రోల్చేఁబట్టు గావించి నీ
రారం బండిన ప్రాఁతరాజనపుదివ్యాన్నంబు నొక్కింత వా
ర్ధారాధౌతముఁ గుండ ⁶యూడ్చి యిడియెన్ రంభాపలాశంబునన్. 168

టీక. రారయ్యా! = రండయ్యా! శుద్ధిమచ్చరణున్ = కాళ్లు కడుగుకొన్నవానిని; గోత్రాదేవతాపుత్త్రున్ = బ్రాహ్మణపుత్త్రుని; విస్మేరాగ్నిప్రభున్ = వెలుగుచున్న అగ్నివంటి తేజస్సు కలవానిని; మ్రోల్ = (అతని) ముందుండు స్థలమును; చేపట్టు గావించి = చేతితో పట్టుచేసి అలికి, శుద్ధిచేసి; నీరారన్, పండిన = నీటిసమృద్ధివలన బాగుగా పండిన; వార్ధారాధౌతమున్ = నీటిచే బాగుగాఁ గడుగఁబడినదానిని; రంభాపలాశంబునన్ = అరఁటియాఁకున; ఇడియెన్ = పెట్టెను.

1. క. యుఁపచార. చ. యపచార. 2. చ. రాదు యిదిపో. 3. చ. పెలుచ. 4. చ. బోడిపించుచున్నాఁడు. 5. చ. తాడిదైన. 6. చ. యూడ్చి. యిడియెన్. క. యొసఁగెన్.

తే. ఒసఁగి [1]సవ్యంజనంబు దధ్యోదనంబు, నారగింపుఁడు క్షమియింపుఁ డనుచుఁ బలికి
ముదిత ముదితాత్మభావసంపదయుఁ బోని, సలిలపరిపూర్ణమగు గిండి నిలిపి చనిన.

టీక. సవ్యంజనంబున్ = పచ్చళ్లతోఁ గూడినది; [‘అవ్యంజనంబు = కూరలు లేనిది’ అని పూర్వటీక.] దధ్యోదనంబున్ = పెరుగన్నమును; ముదిత = స్త్రీ; ముదితా......బోని = సంతోషించిన తన మనోభావసంపదవలెనున్న; సలిలపరిపూర్ణము = నీటితో నిండినది; గిండి = చిన్ననోరు గల చెంబు; నిలిపి = (ప్రక్కను)ఉంచి. అలం. ఉపమ.

క. చేనాపోశన [2]మున్పుచ్చు, ధ్యానం బొనరించి [3]యతఁడు తగ ననుమతిఁ జం
ద్రాననచేఁ గొని మెసఁగున్, బ్రాణాహుతి [4]విరహితముగఁ బర్యుషితంబున్. 170

టీక. చేన్ = చేతియందు; చంద్రాననచేన్=ఆ స్త్రీ (సుశీల)వలన; పర్యుషితంబున్ = చద్దన్నమును; ప్రాణాహుతివిరహితముగన్ = ప్రాణాహుతులను తొలుత గ్రహింపకయే.

తే. తిరిగి చూచినయంత [5]నాద్రిమ్మరీఁడు, సిక్థ మొక్కటియేనియుఁ జిక్కనీక
మ్రింగి మీఁదులు చూచుచు మృదులఫణితిఁ, బిలిచియిట్లనుశరదిందుబింబముఖిని.

టీక. ద్రిమ్మరీఁడు = స్వేచ్ఛగా ప్రవర్తించువాఁడు - దేశద్రిమ్మరి; సిక్థము = మెదుకు; చిక్కనీక = మిగులనీయక; శరదిందుబింబముఖిని = శరత్కాలచంద్రమండలమువలె చక్కని ముఖముకలస్త్రీని - సుశీలను; మృదులఫణితిన్ = మెత్తని పద్ధతిని. అలం. ఉపమ.

తే. చూడు మీసారి [6]భాండ మోశోభనాంగి!, [7]భిస్సటం బొండె దాఁటితప్పినది యొండె
కలుగు; లేకుండ; [8]దూడ్చి తెమ్మలఘుజఠర, జాతవేదంబు హెచ్చె నీస్వల్పభుక్తి.

టీక. ఓ శోభనాంగి! = చక్కనిశరీరముకలదానా ! భాండము = కుండ; భిస్సటంబు + ఒండె= మాఁడు (కుండకంటుకొన్నది)గాని; దాఁటి, తప్పినదియొండె = (నీచేతికిఁజిక్కక) తప్పిపోయినమెదుకు గాని; కలుగున్ = ఉండును; లేకుండదు = ఉండకపోదు; అలఘు......జాతవేదంబు = గొప్పజఠరాగ్ని - ఆఁకలిచిచ్చు; ఈ స్వల్పభుక్తిన్ = ఈ కొద్దిపాటిభోజనముచేత; హెచ్చెన్.

చ. అనుటయు సంభ్రమం బడర నంగన తొల్తటినాటియామినిం
దనకని వండి డించికొని నాథుఁడు పల్లియ కేఁగు నెంజలిం
దనికి భుజింపకున్కి భరితంబయి యట్టుక నట్టుకట్టి యొ
ప్పూ నభిన[9]వోదనం బొసఁగెఁ బూని [10]తదాజ్ఞనె శ్రావమూకుటన్. 173

టీక. అనుటయున్ = అని పల్కఁగా; సంభ్రమంబు, అడరన్ = తొందరపాటు, కలుగఁగా; తొల్తటినాఁటియామినిన్ = కడచినరాత్రియందు; నెంజలిన్ = విచారముచేత; తనికి = సంతాపించి; భరితంబయి = నిండుగనుండి; అట్టుకన్ = మట్టిపాత్రలో. అట్టుకట్టి = అట్టుగా నేర్పడి; శ్రావమూఁకుటన్ = గంజిమూఁకుటివంటి పాత్రమున - కంచమువంటి పాత్రమున; అభినవోదనంబున్ = సరిక్రొత్తయన్నమును - పొడియన్నమును; ఒసఁగెన్ = ఉంచెను.

తే. ఒసఁగి [11]యొడపేర్పులోఁ గాఁగుచున్నయాల,పాలు వడ్డించుటయు మానిపాల! వేళ
మునలివారలచేతికి నందియిచ్చు, వడువున భుజించె వడు విపుర్వ్యంటకంబు. 174

---

1. క. యవ్యంజ. చ. సవ్యంజ. 2. చ. ముచ్చుమ. 3. చ. యపుడు. 4. చ. ట. విరహితముగ క. విరచితముగ. 5. చ. ట. దిమ్మరీఁడు. 6. చ. చేరియో. 7. ట. భిప్సటం. 8. క. నూడ్చి. చ. దూడ్చి. 9. క. వోదనం. చ. ట. వొదనం. 10. క. తదాజ్ఞను. చ. తదాజ్ఞనె. 11. చ. యడ.

టీక. ఒసఁగి = ఉంచి; ఎడపేర్పులోన్ = దాలియందు; మానిపాల! = నారదమునీ! (ఇది శిష్యునిమాట) వేళము = శీఘ్రముగ; వడువ్రన్ = విధముగ; ఇవుర్వంటకంబున్ = పొడిమన్నమును; ['ఇగురపెట్టిన యన్న' మని పూర్వటీక.]

క. భుజియించి మజ్జిగయుఁ దెమ్మని, గజిబిజిసేయుటయు పతియుఁ గలఁగక వికస
న్నిజవదన యగుచు హస్తాంబుజములు మొగిడించి పల్కె భూసురసూతిన్. 175

టీక. గజిబిజ = గడబిడ; కలఁగక = కలఁతపాటుకొనక; వికసన్నిజవదన = వికసించిన - ప్రసన్నమగు తన ముఖముకలది; మొగిడించి = జోడించి; భూసురసూతిన్ = బ్రాహ్మణపుత్రుని.

శా. అన్నం * బొండిఁక లేదు చల్డి యది; విన్మధ్వశ్రమారూఢ! తె
మ్మన్నం దెచ్చెద సాధుగుప్తములు కజ్జాయంబుల్ కడాయంబు లిం
దెన్నే [1]యున్నవి క్రొత్తపట్టికలఁ; గాదే లేచి వార్వ్వుండు; వే
గన్నిర్మించెదఁ గూరఁ, గూర మజ్జిగయుం గైకోలు మేల్భుక్తికిన్. 176

టీక. ఒండు = వేఱు; ఇఁకన్ = ఈపైని; ['ఒండొక = కొంచెమైనను' అని పూర్వటీక]. అధ్వశ్రమారూఢ! = త్రోవను నడచి బడలినవాఁడా-ఓబాటసారీ! సాధుగుప్తములు = బాగుగా (జాగ్రత్తగా) దాఁచఁబడినవి; కజాయంబులు = కజ్జాయంబులు - పిండివంటలు; కాదేన్ = కాదందురేని - అవి అక్కఱలేదందువేని; వార్వ్వుండు=(చేయికడుగుకొని) యాచమనము చేయుఁడు; భుక్తికిన్ = భోజనమునకు; కైకోలు = (తాము) అంగీకరించుట; మేల్ = మంచిది - మీరంగీకరింపవలెను.

ఉ. నావిని నాతిఁ బల్కెఁ గుహనావటు వోవనితామతల్లి! యో
పావనశీల! తైలపరిపక్వము లెన్నియుఁ దెమ్ము; గాదనన్
లేవడియైనభుక్తి గొని లేవ [2]దిగంబడ దాఁక లింతయున్
ధావన మాచరించుకతనన్ దడవున్ నిలఁబోలదిప్పటన్. 177

టీక. కుహనావటువు = కపటబ్రహ్మచారి; వనితామతల్లి! = ఉత్తమయైనస్త్రీ! - అమ్మా! తైలపరిపక్వములు = పిండివంటలు; ఎన్నియున్ = ఎన్నియైనను; లేవడియైన = స్వల్పమైన; భుక్తిన్ = ఆహారమును; లేవన్ = లేచిపోవుటకు; ఇంతయున్ = కొంచెమైనను; దిగఁబడదు = తగ్గదు; ధావనము, ఆచరించుకతనన్ = పరిగెత్తిపోవలసియుండుటచేత; తడవున్ = చాలకాలము; నిలఁబోలదు = నిలువ వీలుకాదు.

మహాస్రగ్ధర. అనినన్ వడ్డింపఁబొచ్చెన్ హరిణనయన నిండారు డెందంబుతో వే
గన భావిప్రాణనాథాగ్రహసహమతితోఁ గమ్మనై కారమై నే
తన వండం బొల్చి చేతం దడపినఁ దుమురై తాఱుటల్ లేక సద్యో
జనితంబుల్ వోలెఁ [3]జాలం జవులొదవు † సముత్స్వండికాపూపపంక్తుల్. 178

టీక. హరిణనయన = జింకకన్నులవంటి కన్నులు గల సుశీల; నిండారు, డెందంబుతోన్ = నిండుమనస్సుతో - ఆనందముతోననుట; భావి.....మతితోన్ = ముందుఁగల్గఁబోవు ప్రాణనాథుని కోపమును సహించు బుద్ధితో - ప్రాణనాథుఁడు కోపించి యెట్లు శిక్షించినను ఆ శిక్షకు సిద్ధపడు బుద్ధితో; పొల్చి = ఒప్పి; కారమై = ఘాటుకల్గి; తుమురై = పొడిపొడిగా - చేతికంటుకొనకయుండి; తాఱుటల్, లేక = చెడిపోవుటలులేక - పాడుగాక; సద్యోజనితంబుల్ వోలెన్ = అప్పుడు తయారయినవానివలె;

---

* క. బొండొక. చ. బొండిక. 1. చ. ట. యున్నవి. 2. క. డిగం. శ. ర. దిగం. 3. చ. జాలెం. † క. సమచ్చండికా?

సమత్స్యండికాపూపపంక్తుల్ = [మత్స్యండికయన కండచక్కెఱ.] కండచక్కెఱపాకమున తయారయిన అప్పముల సమూహములను; వడ్డింపఁజొచ్చెన్.

వ. [1]ఇట్లు ఋణగ్రహణప్రవణపురుషో[2]పదీకృతంబులు, ప్రాణవల్లభసమ్యగభిరక్షితంబులు, తదుపహితగణనావహంబులు, నచ్ఛిద్రముద్రాముద్రితంబులునై సజ్జనవితరణంబులగతి [3]మహితభాజననిహితంబులు, ననురక్తవధూహృదయంబులపగిది నతిస్నేహపిచ్ఛిలంబులు, నుపవనంబులయుపమ [4]సురభిష్ఠంబులునైన పిష్టవికారంబులు నిర్వికారుండై భూసురకుమారుండు నిరవశేషంబుగా [5]నాహారించియు, వెండియు నవనతాననం బగు మిథ్యాలజ్జాభినయంబునఁ దన బహుభోక్తృత్వంబు [6]నపశ్లోక[7]కలుషితం బగునని విశంకమానమానసుండునుంబోలెఁగానందగు నాపొట్టి [8]నెట్టికసీల[9]దిట్టపడుచు కడుపునిండమి యోటింగి తరంగితాద్భుతాంతరంగయై యా కురంగనయన యిట్లని వితర్కించు. 179

టీక. ఋణ......కృతంబులు = ఋణము తీసికొనుటయందు నేర్పుగల పురుషునిచే బహుమానముగా నీయఁబడినవి; [‘అరుణగ్రహణప్రవణపురుషోపధికృతంబులు = ఎఱుపు అనఁగా కోపమును పొందుటయందు ఆసక్తుఁడైన పెనిమిటిచేత కపటముగా చేయఁబడినవి’ అని పూర్వటీక.] తదుపహితగణనావహంబులు = అతఁడుంచిన లెక్కగలవి - అతనిచే లెక్కపెట్టి యుంచఁబడినవి; అచ్ఛిద్రముద్రాముద్రితంబులు = సందులులేక (స్పష్టమైన) ముద్రలచే ముద్ర వేయఁబడినవి; సజ్జనవితరణంబులగతిన్ = ఉత్తము లొసఁగు దానములవలె; మహితభాజన నిహితంబులు=గొప్పపాత్రలయందుంచఁబడినవి, ఉత్తములగు అర్హుల కీయఁబడినవి. అనురక్త......పగిదిన్ = ప్రేమించుచున్న స్త్రీలమనస్సులరీతిని; అతిస్నేహపిచ్ఛిలంబులు = ఎక్కువ స్నేహముకలవి, నేతిజిడ్డుచే పేరుకొన్నవి; ఉపవనంబుల యుపమన్=ఉద్యానవనంబులరీతి; సురభిష్ఠంబులు = పరిమళించునవి; పిష్టవికారంబులు = పిండివంటలు; నిరవశేషంబుగాన్ = మిగులకుండ - పూర్తిగా; ఆహారించియున్ = తిని కూడ; అవనతాననంబు = వంచఁబడిన తలగలది; మిథ్యాలజ్జాభినయంబునన్=అబద్ధపునిగ్గు నటించుటచే; బహుభోక్తృత్వంబు = తిండిపోతుఁదనము; అపశ్లోకకలుషితంబు = దృష్టికొట్టఁబడినది; విశంకమానమానసుండునుంబోలెన్ = మిగుల సందేహించుచున్న మనస్సుకలవానివలె; నెట్టికసీల = అడ్డిగసీలయంత చిన్నవాఁడు; [‘నైష్ఠికశీలుఁడైన’ అని పూర్వటీక.] దిట్టపడుచు = ధైర్యశీలుని - మొండివానిని; తరంగితాద్భుతాంతరంగయై = అతిశయించిన యాశ్చర్యముతోడి మనస్సుగలది; వితర్కించున్ = ఆలోచించును.

క. ఇసుమంతగాని లేఁడీపసిబాలుఁడు [10]కుడుకగూటిప్రాయమువాఁడు [11]డిల్లిసరి బహుభక్ష్యరాసులు, మెసఁగెడి; విసువఁడు; ప్రతుష్టి [12]మేకొనఁడుగదే!

టీక. ఈ పసిబాలుఁడు; ఇసుమంతగాని = ఇసుకరేణువంతైనను; లేఁడు; - (మిక్కిలి చిన్నవాఁడనుట.) కుడుకగూటిప్రాయమువాఁడు = కుడికెఁడన్నము మాత్రము తిను వయస్సుకలవాఁడు; ఎసరి = విజృంభించి; మెసఁగెడిన్ = తినుచున్నాఁడు; విసువఁడు = (తినుటలో) విసుఁగుపొందఁడు; ప్రతుష్టిన్ = సంతృప్తిని; మేకొనఁడుగదే! = పొందఁడుకదా!

---

1. క. ఇట్లరుణ. 2. క. పధికృతంబులు. చ. పదికృతంబులు. ట. పధీకృతంబులు. 3. చ. మహా. 4. చ. సురభిళంబులు. 5. చ. నాహారిం. 6. చ. నుష్ఠ్లోక. 7. చ. కలుషం. 8. చ. ట. నట్టిక. 9. చ. తిట్టపడుచు. ట. యంతదిట్టపడుచు. 10. క. కూడుగూటి. చ. ట. కుడుకగూటి. శ. ర. కుడువగూటి. 11. చ. డ్డిసగి. 12. చ. మేకొనుడు.

ఉ. మాయపు బిడ్డ యీ నిసువు మానిసిపుట్టువు[1]గాదు; దేవతా
నాయకుఁడో చతుర్ముఖుఁడొ నా భవబంధము లూడ్వనున్న నా
రాయణమూర్తియో యెఱుఁగరా దొకయించుకయుఁ; బుభుక్షుపైఁ
జేయి దొఱంగఁ దప్పములు చెల్లె నమస్తము నంచు నివ్వెఱన్. 181

టీక. ఈ నిసువు = ఈ బిడ్డఁడు; దేవతానాయకుఁడో! = ఇంద్రుఁడో; చతుర్ముఖుఁడో! = బ్రహ్మయో! భవబంధములు = సంసారబంధములను; ఊడ్వనున్న = త్రెంప సిద్ధముగా నున్న; బుభుక్షు పైన్ = తినునాసపయి; తొఱఁగఁడు = విడువఁడు - తీయఁడు; నివ్వెఱన్ = ఎక్కువ ఆశ్చర్యముతో.

చ. తలఁచు మనంబులోన [2]వసుధాధిపయాజకధర్మపత్ని ని
ర్మలకనకావదాతముఁ గరాళత[3]రాలఘుకీలమాలికో
జ్జ్వలము [4]జగత్క్రియాచరణసాక్షి ముదక్షిముదంగ[5]భాగితా
తిలకితవిభ్రమంబగు [6]నుదీర్ణమహత్త్వము దివ్యతత్త్వమున్. 182

టీక. వసుధా.....పత్ని = రాజులచే యజ్ఞములు చేయించు బ్రాహ్మణుని కులసతి; - సుశీల; నిర్మలకనకావదాతము = పరిశుద్ధమగు బంగారువలె స్వచ్ఛమైన; కరాళ.....జ్జ్వలమున్ = మిక్కిలి భయంకరములయిన గొప్ప జ్వాలల సమూహముచే ప్రకాశించు (మండు) చున్న; జగత్......సాక్షిన్ = లోకులు చేయు కర్మలకు సాక్షిభూతమైన; ముదక్షి.....విభ్రమంబు = సంతోషముతోఁ గూడిన కన్నుల విలాసము గలది; ఉదీర్ణమహత్త్వమున్ = గొప్ప అద్భుతశక్తి కలదానిని; దివ్యతత్త్వమున్ = పరతత్త్వమగుదానిని; మనంబులోనన్ = తలఁచు - అగ్నిదేవుని ప్రార్థించెనని భావము. అలం. పరికరము.

క. సతి యీగతి 'శ్రియమిచ్ఛేద్ధుతాశనా' త్తనుట యెఱిఁగి హుతవహు నఖిలే
ప్సితవితరణగుణలీలాచతురుం బ్రార్థింపఁ దత్ప్రసాదముకలిమిన్. 183

టీక. 'శ్రియమిచ్ఛేత్, హుతాశనాత్' = అగ్నివలన సంపదను కోరవలెను; హుతవహున్ = అగ్నిని; అఖిల.....చతురున్ = సమస్తములగు కోరికలను నెఱవేర్చు గుణవిలాసమున నేర్పరి యగువానిని; తత్ప్రసాదముకలిమిన్ = అతనియనుగ్రహమువలన; ['ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్, శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్' అని పెద్దల వచనము.] అలం. పరికరము.

సీ. ఒకకొన్ని వడియంబు లొకకొన్ని వరుగులు నొకకొన్ని తెఱఁగుల యొలుపుఁబప్పు
లొకకొన్ని ద్రబ్బెడ లొకకొన్ని తాలింపు లొకకొన్ని విధముల యొజ్జచేరు
లొకకొన్ని కలకల్పు లొకకొన్ని [7]బజ్జులు నొకకొన్ని రీతుల యూర్పువగలు
నొకకొన్ని [8]సిగరులు నొకకొన్ని యంబళ్లు నొకకొన్ని [9]వహులపూపోత్కరములు
తే. వివిధఫలకందమూలంబు లవియుఁ గొన్ని
యూరుఁబిండులు నొకకొన్ని యొక్కకొన్ని
యూరుఁ[10]గాయలుఁ [11]బచ్చళ్లు నొక్కకొన్ని
పెరుగు పాల్ తేనె నేతులు పెచ్చు[12]పెరుగ. 184

---

1. చ. గాడు. 2. క. వసుధామర. చ. వసుధాధిప. ట వసుధావిబుధాధిప. 3. చ. రాలము గీల, ట. రాలఘుకీల. 4. చ. జగత్ప్రియా. 5. క. భాగతా. చ. భాగితా. 6. చ. నదిర్న. 7. చ. బజ్జీలొక్క. 8. చ. శిఖరులు. 9. చ. వగల. 10. క. గాయలు పచ్చ. శ. ర. గాయలుఁ బచ్చళ్లు. 11. చ. పచ్చడు లొక్క. 12. చ. వెరుగ.

టీక. వరుగులు = వేపుళ్లు; తెఱఁగుల=విధముల; ఓలుపుఁబప్పులు = పైతోలు తీసి శుభ్రపఱచిన పప్పులు; ద్రబ్బెడలు = భక్ష్యవిశేషములు? తాలింపులు = తిరుగమోత వేసి వండిన వస్తువులు; ఒట్టి చేరులు = కారముగల ద్రవద్రవ్యములు; కలకల్పులు = పెక్కుతెగలకూరలు కలిపి వండిన వ్యంజనములు; బజ్జులు = కొంచెము పలుచని పచ్చళ్లు; ఊర్పువగలు = పిండిమిరియములవిధములు; శిగరులు = శిఖరులు; అంబళ్లు = కొంచెము చిక్కని పానీయములు; వహుల = విధముల; పూపోత్కరములు = అప్పములగుంపులు; కందమూలంబులు = దుంపలు; ఊరుఁబిండులు = పప్పుపచ్చళ్లు; పెచ్చువెరుగన్= అధికముకాఁగా;

చ. అమితములై మహానసమునం దపు [1]డుద్భవ మొందుచున్న య
న్నములు సుపక్వగంధముల నందములై యటువోవుచోట న
య్యమరతరుప్రసూనతతు లంగనపైఁ గురియంగఁ బుట్టు గం
ధము లిటు డిగ్గుచోటఁ దగుఁ దద్ద్వితయారచితోపగూహముల్. 185

టీక. అమితములై = ఎక్కువయి; మహానసమునందున్ = వంటయింటిలో; ఉద్భవ మొందన్ = పుట్టఁగా - తయారుకాఁగా; సుపక్వగంధములన్ = బాగుగా వండుటవలని కమ్మని వాసనలతో; అమరతరుప్రసూనతతులు = కల్పవృక్షపుపూలసమూహములు; అంగనపైన్ = స్త్రీపై - సుశీలపయి; తద్......గూహముల్ =ఆ రెండు పరిమళములచేతను కూర్పఁబడిన (చేయఁబడిన) ఆలింగనములు; తగున్ = ఒప్పును; [సుశీలవంటకముల కమ్మనివాసనలు మీఁదికి - ఆకాశమువైపు పోవుచున్నవి; దేవతలు ఆమెపైఁ గురిపించిన పూవులతావులు క్రిందికి దిగుచున్నవి; ఈరెండును దారినడుమ కలిసికొని పరస్పరాలింగనసౌఖ్యము ననుభవించుచున్నవనుట.]

శా. ఆ లీలావతి నిత్యసత్యశమధైర్యౌదార్యసంశుద్ధులం
జాలన్ మెచ్చి వటుత్వముం దొఱఁగి సాక్షాత్కారముం బొందె ను
ద్వేలాలోలకృపాజపాప్రసవకాంతిభ్రాంతికృల్లోచనా
బ్జాళిందాశ్రితరాధికాసురతరాగాంకూరుఁ డా శౌరియున్. 186

టీక. ఆ లీలావతి......శుద్ధులన్ = ఆ సుశీలయొక్క నిత్యములైన సత్యము, శాంతి, ధైర్యము, త్యాగము, పరిశుద్ధి అనువానిచే; చాలన్ = ఎక్కువగా; వటుత్వమున్, తొఱఁగి = బ్రహ్మచారివేషమును తీసివైచి; ఉద్వేలా...గాంకూరుఁడు - ఉద్వేల = మిక్కిలియైన; ఆలోల = అంతటను చలించుచున్న; కృపా = దయ యను; జపాప్రసవ = దాసనపుఁబూవుయొక్క; కాంతి=కాంతి యను; భ్రాంతికృత్ = భ్రమను కలిగించుచున్న; లోచనాబ్జ = తామరపూవులవంటి కన్నులయొక్క; ఆళింద = ముంగిటిని; ఆశ్రిత = ఆశ్రయించిన; రాధికాసురతరాగాంకూరుఁడు = రాధాదేవితోడి కేళియందలి ప్రేమయొక్క మొలక కలవాఁడు [అతని కన్నులు చలించుచున్నవనియు, దయారసము నొల్కుచు జపాపుష్పమువలె నెఱ్ఱనై యున్నవనియును, ఆ చూపులలో రాధికతోడి కేళియందలి ఆసక్తి మొలకలెత్తుచున్నదనియు భావము.] ఆ, శౌరియున్ =ఆవిష్ణువును; సాక్షాత్కారముఁబొందెన్ =ప్రత్యక్షమయ్యెను. అలం. ఉపమ.

సీ. నీలంబు భక్తానుకూలంబు హరిదంతచేలంబు నవనీత[2]చోర మాది
మూలంబు కరుణావిశాలంబు [3]ధృతజగజ్జాలంబు [4]శ్రీలతావాల మమర
[5]మాలంబు భవవ[6]నోత్కీలంబు తల్పితవ్యాళంబు శిక్యాపచూళ మమిత
లీలంబు హృతమరుత్సాలంబు [7]శశిసఖఫాలంబు వరదానశీల మఖిల

---

1. చ. డద్భుతమందు. 2. చ. ట. లోల. 3. క. కృత. చ. ధృత. 4. చ. శ్రీలతావాల. క. శ్రితలతా. 5. క. మేలంబు. చ. ట. మాలంబు. 6. చ. నత్కీలంబు. 7. చ. ట. శిఖసఖ.

తే. కాలజంఘాల [1]మశనకృత్క్ష్వేళ మరికరాళ మాపత్పయోదవాతూలము నగు
యదుకులసరోమరాళంబు నతివ గాంచి, నతియు నుతియు నొనర్ప ననగధరుండు.

టీక. అతివ = ఆ సుశీలాదేవి; నీలాంబుక్ = నల్లనిదియు ['నీలాంబు-'మన్నగునవి యదుకుల సరోమరాళంబు - అనుదానికి విశేషణములు.] హరిదంతచేలాంబు = దిగంబరము-దిస్సమొలగలది; ఆది మూలాంబు = ప్రధానమూలమగునది; ధృతజగజ్జాలంబు = ధరింపఁబడిన లోకముల గుంపు కలది; శ్రీలతావాలము = లక్ష్మియను లతకు పాదయినది; ['ఆలవాలము = పాదియైనది' అని పూర్వటీక.] అమరమూలంబు = దేవతలందఱికిని మూలభూతమగునది; ['అమరమేలంబు = దేవతల కూడికగలది' అని పూర్వటీక.] భవవనోత్కీలంబు = జన్మములనెడి వనమునకు దావాగ్నియైనది - నశింపఁజేయునది; కల్పితవ్యాళంబు = పడకగాఁజేయఁబడిన పాము కలది; శిక్యావచూళము = చలిదిచిక్కముతోడి సిగ గలది; అమితలీలంబు = ఎక్కువ విలాసములు కలది; హృతమరుత్సాలంబు = హరింపఁబడిన వేల్పుచెట్టు (పారిజాతవృక్షము) కలది-[శ్రీకృష్ణుఁడు సత్యభామకోరికపయి స్వర్గమునకేఁగి నందనవనమునందలి కల్పవృక్షమును పెల్లగించి తెచ్చెనను గాథ యిట గ్రాహ్యము.] శశిసఖఫాలంబు = చంద్రునితో సమానమగు నుదురు కలది; వరదానశీలము = వరములను ప్రసాదించు స్వభావము కలది; అఖిలకాలజంఘాలము = ఎల్లకాలములందును పరుగిడునది; అశనకృత్క్ష్వేళంబు = ఆహారము (అన్నము)గాఁ జేయఁబడిన విషము కలది. [కృష్ణుఁడు బాల్యమున పూతనాస్తన్యమును విషమిశ్రితమును త్రాగెనను కథ యిట గ్రహింపఁదగినది.] అరికరాళము = శత్రువులకు భయంకరమైనది; ఆపత్పయోదవాతూలము = ఆపదలను మేఘములకు సుడిగాలి యైనది; అగు; యదుకులసరోమరాళంబుక్ = యాదవవంశమను సరస్సునకు హంస యగు శ్రీకృష్ణుని; నతి = నమస్కారము; నుతి = పొగడిక; అనగధరుండు=(గోవర్ధన) పర్వతము నెత్తిన శ్రీకృష్ణుఁడు. అలం. రూపకము.

ఉ. ఆసతిఁ బల్కు నీహృదయ మారయఁ గోరియొ[2] యిట్లొనర్చితిక్
గాసి; కుశేశయాననలు గల్గిరయేనియుఁ గల్గనిమ్ము నీ
చేసినభాగ్య మేసతియుఁ జేయదు నీయెదుటక్ మునీశ్వరా
భ్యాసదురాసదం బగు మదాకృతి యీగతి నుల్లసిల్లుటన్. 188

టీక. ఆ సతిక్ = ఆ, సుశీలనుగూర్చి; ఆరయఁగోరియొ = పరీక్షింపఁదలఁచియే; ఇట్లు; గాసి, యొనర్చితిక్ = కష్టపెట్టితిని; కుశేశయాననలు = తామరలవంటి ముఖములు కల స్త్రీలు; మునీశ్వరాభ్యాసదురాసదంబు, అగు = మునుల యోగాభ్యాసముచేతఁగూడ పొందరానిది, అయిన; మదాకృతి = నా రూపము; భాగ్యము = అదృష్టము.

క. సుచరిత్ర! నేఁడు నీచేతిచలిది భుజియింపఁ జాల తృప్తి యొదవెడిం
బచరణగా; [3]దిమ్ముల మును, రుచియింపదు శబరివిందు ద్రోవదివిందున్. 189

టీక. సుచరిత్ర! = మంచినడతకలదానా! సుశీలా! పచరణ = ఇచ్చకపుమాట - అసత్యపుమాట; ఇమ్ములక్ = బాగుగా; ద్రోవదివిందు = ద్రౌపది పెట్టిన విందుభోజనము - పర్యుషితము.

క. అతిమానుష మసిధారావ్రతమగు; [4]మను వంట నిప్పువంటి దిది యనక్
బతిదేవతవై మను [5]నీగతి భావారూఢ మయ్యెఁగా [6]జగములకున్. 190

1. చ. మసురకృత్ 2. క. గోరియయట్లొ. చ. గోరియొ యిట్లొ. 3. ట. దీగతము. 4. క. మను. చ. మన. 5. చ. నివి. 6. చ. జనములకున్.

టీక. అసిధారావ్రతమగు = కత్తిదారుపయి నిలుచుటవంటిదగు - అసాధ్యనియమములు కల; మనువు = బ్రదుకు; అతిమానుషము = మానవులకు అతీతమయినది; అంటక్ = తాకుటకు; అనక్ = అనుటకు; పతిదేవతవై = పతివ్రతవయి; మను = జీవించు; నీ గతి = నీపద్ధతి; జగములకున్ = లోకములకు; భావార్థము, అయ్యెన్ = ప్రసిద్ధమైనది - తార్కాణమైనది.

చ. తనుశతకోటు లెత్తి బహుధర్మవినిర్మితిఁ బేర్మిగాంచినన్
నను [1]గనలేని లేఁతలకు నాతి! యభోగ్యము భాగ్య; మీవు ప్రా
గ్జననమునం దొనర్చితి వొకానొకయర్చన నన్నుఁగూర్చి; దా
నన సమకూరెఁ జుమ్ము సుజనవ్రజనందితచర్య నీదెసన్. 191

టీక. తనుశతకోటులు, ఎత్తి = వందలసంఖ్య కల కోటిజన్మములు ఎత్తియుండి; బహుధర్మవినిర్మితిన్ = ఎక్కువ ధర్మకార్యాచరణమున; పేర్మిగాంచినన్ = పెంపువహించినను; ననున్; కనలేని = చూడలేని - గ్రహింపలేని; లేఁతలకున్ = అజ్ఞులకు; భాగ్యము = నా దర్శనసంపద; అభోగ్యము = లభింపరానిది; నాతి! = అమ్మా! ఈవు = నీవు; ప్రాగ్జననమునందున్ = వెనుకటిజన్మమున; అర్చన = పూజ; ఒనర్చితివి = చేసితివి; దానన = దానివలననే; సుజనవ్రజనందితచర్య = మంచివారల గుంపుచే కొనియాడఁబడిన పద్ధతి; నీదెసన్ = నీయెడల; సమకూరెఁ జుమ్ము.

తే. అతివ! తొల్లింటిపుట్టువునందు నొక్క, మాని వేలిమిజన్నైవై మన్ననాఁడు
నా మధురవేణుగానంబున మది గరఁగి, తొరఁగఁ జేసితి సుస్నిగ్ధదుగ్ధరసము. 192

టీక. వేలిమిజన్నైవై = హోమధేనువవయి; మన్ననాఁడు = జీవించియున్నప్పుడు; సుస్నిగ్ధదుగ్ధరసమున్ = మిక్కిలి చిక్కనయిన క్షీరమును; తొరఁగఁ జేసితి = స్రవించితివి.

క. ఆ పాలనురువు పవన, వ్యాపారముచేతఁ దెరలివచ్చి నిలిచె లీ
లాపింఛచ్ఛవిభర్త్సిత, తాపింఛ మదీయమౌళితటిఁ గుచలికుచా! 193

టీక. పవనవ్యాపారముచేతన్ = గాలి వీచుటచేత; తెరలి = ఎగిరి; కుచలికుచా! = నిమ్మపండ్లవంటి స్తనములు కల సుశీలా! లీలా......తటిన్ - లీలా = విలాసార్థమయిన; పింఛ = నెమిలిపించెము యొక్క; ఛవి = కాంతిచే; భర్త్సిత = తిరస్కరింపఁబడిన; తాపింఛ = చీఁకటిమ్రాఁకుగల; మదీయమౌళితటిన్ = నా తలపయిని; నిలిచెన్.

క. దానఁ బయస్సంతా[2]నపు, దానంబున నన్ను [3]దడపు దానవయితి చం
ద్రానన! తత్ఫలమునఁ గా, దా నీకును [4]దక్కితిన్ ముదము మదిఁ బొదలన్. 194

టీక. దానన్ = ఆ కారణమువలన; పయస్సంతానపుదానంబునన్ = పాలనుదానముచేయుట వలన; దక్కితిన్ = లభించితిని; ముదము = సంతోషము. పొదలన్ = వృద్ధిపొందఁగా.

ఆ. ఒక్కఁ డకృతసత్క్రియుండను విప్రుండు, గలఁడు ఘోర[5]కలుషకఠినబుద్ధి
వసుధయెల్లఁ దిరుగు వసుధాను వను పేరి, పట్టణమున నుండుఁ బుట్టువడుగు. 195

టీక. అకృతసత్క్రియుఁడు = మంచిపనులు చేయనివాఁడు; పుట్టువడుగు = ఘోటకబ్రహ్మచారి; వసుధ = భూమి.

సీ. ధనవంతుఁడయ్యు నుద్వాహంబు దొలఁగి మూఁ
తులు [6]నాకుఁ బెఱవితంతువులఁ దగిలి

---

1. చ. గనరేని. 2. క. నము. చ. నపు. 3. క. దనుపు. చ. ట. దడపు. 4. క. దక్కితిన్ చ. ట. దక్కితిన్. 5. క. కఠినకలుష. చ. ట. కలుషకఠిన. 6. క. నాకుపై.

కులవంతుఁడయ్యుఁ బెద్దలఁ బాసి విహరించుఁ
        బాషండమండానుబంధి యగుచు
మతిమంతుఁడయ్యు నామ్నాయముల్ చెవిఁబెట్టఁ
        డశ్లీలలేఖనవ్యసన మెసఁగి
స్థితిమంతుఁడయ్యు లక్ష్మికిఁగాక [1]త్రిమ్మరుఁ
        బలుగూడు మరిగి యాఢ్యుల భజించి

తే. తలఁచు బ్రహ్మస్వదేవస్వములకు నెగ్గుఁ,[2]గుప్పఁ జిచ్చిడి [3]పేలాలు గొఱుకఁ దివురు
గ్రహణకాలంబునందు మున్గఁడు జలముల,సెబ్ర[4]చెంచడ మాబ్రాహ్మణబ్రువుండు.

టీక. ఉద్వాహంబు, దొఱఁగి = పెండ్లివిడిచి - పెండ్లి చేసికొనక; పెఱవితంతువులన్ = విధవ లయిన ఇతరుల భార్యలను; మూఁతులు, నాకున్ = వారికై యాశించునుట - లేదా - పెదవులు చప్పరించును. పాసి = విడిచి; పాషండమండానుబంధి = నాస్తికులగుంపుతో చేరినవాఁడయి; విహరించున్ = తిరుగును; ఆమ్నాయముల్ = వేదములు; అశ్లీలలేఖనవ్యసనము = అసభ్యపుమాటలనాడుటయందలి అలవాటు; ఎసఁగి = విజృంభించి; స్థితిమంతుఁడయ్యున్ = కలిగినవాఁడై యున్నను; లక్ష్మికిఁగాక =అనుభవింపక; పలుగూడు, మరిగి = వివిధములగు అన్నములను తిని; [మధుకరవృత్తి నవలంబించి యనియుఁ జెప్పిన చెప్పనగును.] ఆఢ్యులన్ = ధనికులను; భజించి = సేవించి; త్రిమ్మరున్ = తిరుగును, బ్రహ్మస్వదేవస్వములకున్ = బ్రాహ్మణుల సొత్తునకును, దేవద్రవ్యమునకును; ఎగ్గున్ = హానిని; తలఁచున్; ఆ బ్రాహ్మణబ్రువుండు = నీచుఁడగు నా బ్రాహ్మణుఁడు; సెబ్రచెంచడము = చెడ్డడేగ - దురాత్ముఁడు; కుప్పన్ = వడ్లగూటియందు; చిచ్చు, ఇడి = అగ్నినుంచి - అనఁగా ధాన్యపుఁగుప్పకు నిప్పంటించి; పేలాలు కొఱుకన్ = పేలాలను తినుటకు; తివురున్ = ప్రయత్నించును - అనఁగా తనకు అత్యల్పలాభము కలుగుటకొఱకయి ఇతరులకు మహాపకారము నొనర్చునని భావము. ["కుప్పన్ = పెంటదిబ్బయందు" అని పూర్వటీక. అది అత్యంతము అసంగతము.] అలం. రూపకము, లలితము.

వ. వాఁడొక్కకందువ నొక్కవెలయాలికిం జిక్కి మహీమండలకుండలంబగు పౌండరీకంబునం గొండొకకాలం బుండి యొక్కపెనుఁబండువునఁ గన్నులపండువగు మదీయనైవేద్యప్రకల్పనంబు భూపోత్సవానంతరంబున నెడముగాచి [5]చూచ్చి, తన వలయు లెఱుంగునం జని బహు[6]విధంబగు కాలంబు మని ముదిసి, తనువు విడిచి యత్యుత్తమంబగు ధరామరవంశంబునంబుట్టి పుట్టిననాఁటనుండియుం జదువు చదువు *నన చదురుండై, నిండుప్రాయంబున నిన్నుం జెట్టవట్టించి యిట్లున్నవాఁడు వినుము. 197

టీక. కందువన్ = సమయమునందు; వెలయాలికిన్ = భోగపుస్త్రీకి; మహీమండలకుండలంబగు = భూమండలమునకు కుండలమను నగరైనది - ప్రధానమైనది; కొండొక = కొంత; పెనుఁబండువునన్ = గొప్ప పర్వదినమునందు; ఎడము, గాచి = అవకాశమును ప్రతీక్షించి; ముదిసి=ముసలియయి; ధరామరవంశంబునన్ = బ్రాహ్మణకులమున; చదువునన = విద్యయందుమాత్రము; చదురుఁడై = నేర్పరియయి; నిండుప్రాయంబునన్ = యౌవనమున; చెట్టపట్టించి = చేయిపట్టుకొనఁ జేసి - వివాహమాడి.

తే. తరుణి! [7]మద్భుక్తదర్శనోత్సవసుకృతము,పాపవహ్నికి సలిలమై భద్ర మొసఁగెఁ
గాక లేకున్న నితఁడు ప్రాజ్ఞని నొనర్చు,కల్మషములకు నిష్కృతి కలదె? యొందు.

1. క. త్రిమ్మరుపలు. 2. క. కుప్ప. 3. శ. ర. ప్రేఁబ్రాలు. 4. ట. చెంజడము. 5. చ. కొని. 6. తీర్థంబగు. *చ. లవ. 7. చ. మద్భుక్త.

టీక. మద్భుక్తదర్శనోత్సవసుకృతము = నా నైవేద్యమును చూచుటయను ఉత్సవమువలని పుణ్యము; పాపవహ్నికిన్ = పాపములను అగ్నికి; సలిలమై = నీరయి; భద్రము, ఒసఁగెగాక = మేలు కలిగించెనుగదా! ప్రాగ్జనిన్ = వెనుక జన్మమున; ఒనర్చు = చేసిన; కల్మషములకున్ = పాపములకు; నిష్కృతి = ప్రాయశ్చిత్తము. అలం. రూపకము.

వ. అవ్విధంబుగ సోపహారంబగు మదీయరూపంబు నాకస్మికంబ [1]కనుంగొని భస్మసాత్కృతదుష్కృతనీరస[2]యవసరాశియై భూసురకేసరికిశోరంబై వాసి వడసియు నతఁడు, కట్టిఁడి యగుటకుఁ గారణంబు వినుము. 199

టీక. సోపహారంబు, అగు = నైవేద్యముతో కూడిన; భస్మ.....రాశియై = బూడిదగా చేయఁబడిన పాపములను ఎండుగడ్డిమేటయి; భూసురకేసరికిశోరంబై = బ్రాహ్మణశ్రేష్ఠునికి పుత్త్రుఁడయి; కట్టిడి = క్రూరుఁడు. అలం. రూపకము.

క. నీ భావశుద్ధి యారయ, శోభనచారిత్ర! [3]యేన సువ్వె యతినికిన్
లోభక్రోధముల మనఃక్షోభము గావించి బాలిశుం డనిపింతున్. 200

టీక. శోభనచారిత్ర ! = పరిశుద్ధస్వభావము కలదానా ! నీ భావశుద్ధి = నీ మనశ్శుద్ధిని; ఆరయన్ = పరీక్షించుటకయి; లోభక్రోధములన్ = లోభముచేతను, క్రోధముచేతను; మనఃక్షోభము = మనస్సులో కలఁతపాటును; బాలిశుండు = క్రూరుఁడు; అనిపింతున్ = అనఁబడునట్లు చేసితిని.

క. పతి గొట్టినఁ బతి తిట్టినఁ, బతి నిర్దయుఁ డగుచు నెట్టి పాటుపఱిచినన్
మతి నన్యథాత్వ మొందరు, పతిదేవత లతివ! నీకుఁ బ్రతి యగువారల్. 201

టీక. ఎట్టిపాటు, పఱిచినన్ = ఎట్టికష్టపాటు పెట్టినను; నీకు, ప్రతియగువారల్ = నీకు సమానలయిన; పతిదేవతలు = పతియే దైవముగా ఎంచువారు - పతివ్రతలు; మతిన్ = మనస్సులో; అన్యథాత్వము, ఒందరు = మార్పు పొందరు.

తే. నిష్ఠురత్వంబు తొలఁగించి నేఁటనుండి, నీకు ననుకూలుఁడయ్యెడు నీ విభుండు
మత్పదద్వయభక్తి సమగ్రులైన, సుతుల నేవురఁ గాంచె దూర్జితవిభూతి. 202

టీక. నిష్ఠురత్వంబు = కాఠిన్యము; తొలఁగించి = తప్పించి; ఊర్జితవిభూతిన్ = స్థిరమగు సంపదతో; మత్పదద్వయభక్తిసమగ్రులు = నా పాదద్వయసేవచే నిండినవారు - పరమభాగవతులు; ఏవురన్ = ఐదుగురను; కాంచెదు = పొందెదవు.

ఆ. వెండిఁబైఁడి త్రవ్వి తండంబుగా మేలి, కూడుఁబాడి[4] నింటఁ గొలఁదిమీర
నోము లెల్ల నోఁచి నూతేండ్లు బ్రదికి నీ, భర్తతోడఁ బరమపదముఁ గనుము. 203

టీక. పైఁడి = బంగారము; త్రవ్వి తండంబుగాన్ = అపరిమితముకాఁగా; మేలికూడు=మంచి యాహారము; కొలఁదిమీరన్ = హద్దుమీఱి యుండఁగా; పరమపదము = వైకుంఠము.

ఉ. మన్ననచేసినాఁడు మురమర్దనుఁ డంచు నహంకరింప కో
కిన్నరకంఠి! యట్లయినఁ గీడొదవున్; విను తొంటికన్న న
స్మన్నిహితాంతరంగవయి సత్యపమార్జనశుద్ధిలక్ష్మికిన్
వన్నియ పెట్టుమీ మహితవర్తనకీర్తులు వ్యాపించుచున్. 204

1. క. కంబుగఁగను. చ. ట. కంబగను. 2. చ. యవన. 3. క. యేనుజువ్వెయ. చ. ట. యేన సువ్వెయి. 4. క. యింట. చ. నింట. 1. ట. పుచున్.

టీక. కిన్నరకంఠి! = కిన్నెరవంటి కంఠముకల సుశీలా! మురమర్దనుఁడు = విష్ణువు; మన్నన, చేసినాఁడు = గౌరవించినాఁడు; అహంకరింపకు = గర్వింపకుము; కీడు = ఆపద; ఒదవున్ =కలుగును; తొంటికన్నన్ = మునుపటికంటెను ఎక్కువగా; అస్మన్నిహితాంతరంగవు = నాయందు ఉంచఁబడిన మనస్సు కలదానవు; మహితవర్తనకీర్తులు = పేరుపడిన నడకను, కీర్తిని; నిర్వహింపుముక్ = (ఆ రీతినే) నెఱవేర్చుచు; సత్యసమార్జవశుద్ధిలక్ష్మికిన్ = సత్యము; ఋజుభావముల పరిశుద్ధశోభకు; వన్నియ, పెట్టుమీ! = మెఱుగుపెట్టవలయును.

క. తృష్ణారహితులు [1]మత్పద,నిష్ణాతలు నిత్యసత్యనిరతులు నగు శ్రీ
వైష్ణవులఁ గాంచి ననుఁగా, విష్ణుపదవలగ్న! గారవించి కొలువుమీ! 205

టీక. తృష్ణారహితులు = పేరాసలేనివారు; మత్పదనిష్ణాతలు = నా పాదములయెడ నిష్ఠకల వారు - నాపాదభక్తులు; నిత్యసత్యనిరతులు=ఎల్లపుడును సత్యముపల్కుటయందు ఆసక్తి కలవారు; ననుఁ గాన్ = నావలెనే - (నన్ను గాఁదలఁచి) విష్ణుపదవలగ్న !=ఆకాశమువంటి నడుము కలదానా! (సూక్ష్మ మధ్యా!) గారవించి కొలువుమీ!

క. అని వర మిచ్చి మహీసుర, వనితన్ మన్నించి భక్తవత్సలుఁ డరిగెం
దన నెలవునకు సుధారస,మునఁ గుముదినిఁ దేర్చియరుగు పూర్ణేందుఁ డనన్. 206

టీక. మహీసురవనితన్ = బ్రాహ్మణిని: సుధారసమునన్ = అమృతరసముచేత; కుముదినిన్ = కలువతీగను; తేర్చి = తేలించి; పూర్ణేందుఁడనన్ = చంద్రుఁడో యనునట్లుగా అలం. ఉత్ప్రేక్ష.

ఆ. అఁట సుశీలమగఁడు నరుదెంచి యొకకొన్ని, దివసములకు దొరలఁ దిరియు నాస
గోసి తనకుటుంబువాసియు వన్నెయుఁ, దలఁచుకొనుచుఁ దెలివి మొలకలెత్త.

టీక. దొరలన్ = ప్రభువులను; తిరియునాసన్ = యాచించు కోరికను; కోసి = విడిచి; మొలకలెత్తన్ = అంకురింపఁగా.

తే. అతనిఁ దమసొమ్ముచేసి మున్నాఁగియున్న
మోహముఖులైన జ్ఞాతుల మూలఁ [2]ద్రోచి
సంహృతాసురులైన నిర్జరులకరణి
మది వివేకాదివర్గ మభ్యుదయ [4]మొందె. 208

టీక. తమసొమ్ముచేసి = తమసొత్తుగా చేసి - స్వాధీనపఱచుకొని; మున్ను = మునుపు; ఆఁగి యున్న = ఆక్రమించియున్న; మోహముఖులైన = మోహము మొదలుగాఁగల; జ్ఞాతులన్ = దాయా దులను - అంతశ్శత్రువులను; సంహృతాసురులు = సంహరింపఁబడిన (నశింపఁజేయఁబడిన) రాక్షసులు కలవారు; నిర్జరులకరణిన్ = దేవతలవలె; మదిన్ = మనస్సులో; వివేకాదివర్గము = వివేకము మొదలగు నుత్తమగుణముల సమూహము.

క. కోపంబు నాఁగి మిక్కిలి, పాపమునకు లోఁగి బుద్ధి పశ్చాత్తాపా
టోపశిఖిఁ గ్రాఁగి కరుణా, ద్వీపవతీలహరిఁ దోఁగి విప్రుఁడు మఱియున్. 209

టీక. ఆఁగి = అణఁచి; లోఁగి = వెనుదీసి; పశ్చాత్తాపాటోపశిఖిన్ = పశ్చాత్తాపమను గొప్ప (ఆర్భాటముగల) అగ్నియందు; క్రాఁగి = పరితప్తమయి; కరుణాద్వీపవతీలహరిన్ = దయయను నెడి నదీ ప్రవాహమునందు; తోఁగి = మునిఁగి. అలం. రూపకము.

1. చ. లో ఇదిలేదు. 2. చ. వైచి. 3. చ. కణిది. 4. క. మయ్యె. ట. మొందె.

సీ. కాలీచపడ నిండ్లకడ కేఁగి వనరుచుండెడివాఁడు వైరాగ్యనిష్ఠుఁడయ్యెఁ
[1]గయ్యాలక్రచ్చయై కాలుద్రవ్వుచు సదా మండువాఁ డతి[2]శాంతమహితుఁడయ్యెఁ
గసరి యెంగిలిచేతఁ గాకి[3]వ్రేయనివాఁడు సతతాన్నదానప్రశస్తుఁడయ్యె
బ్రహ్మకల్పముదాఁక బ్రతుకు కాసఁగడకట్టువాఁ డస్థిరముగ విశ్వముఁ దలంచెఁ
తే. బాటిగాఁ గొన [4]కల పద్మభవునినైన, నీరసము సేయువాఁడు వినీతుఁడయ్యె
నొరుల లచ్చికి [5]ముచ్చిరి యుడుకువాఁడు, సర్వసముఁడయ్యె విష్ణుప్రసాదమహిమ.

టీక. కాలు, ఈచవడన్ = కాళ్ళు కుంటుపోవునట్లు - కాళ్లరగిపోవునట్లు; ఇండ్లకడకున్ = ఇతరులయిండ్లయొద్దకు; వనరుచుండెడివాఁడు = దేవురించెడివాఁడు; వైరాగ్యనిష్ఠుఁడు = వైరాగ్యమున నియమము (అసక్తి) కలవాఁడు; కయ్యాలక్రచ్చ = జగడగొండి; కాలుద్రవ్వుచున్ = జగడమునకు సిద్ధపడుచు; సదా = ఎల్లప్పుడును; మండువాఁడు = కోపించువాఁడు; అతిశాంతమహితుఁడు = గొప్పశాంతగుణముకలవాఁడు; కసరి = కోపించినమైనను; కాకిన్, వ్రేయనివాఁడు = కాకిని కొట్టనివాఁడు. [అనఁగా ఎంగిలిచేతితోఁ గాకిని కొట్టినయెడల - ఆచేతినుండి రాలిన మెతుకులనుతిని కాకి బ్రతికిపోవునేమో యను సందేహముకలవాఁడనుట.] సతతాన్నదానప్రశస్తుఁడు = నిత్యమును అన్నదానముచేయుటచేత పేరుపొందినవాఁడు; బ్రహ్మకల్పముదాఁకన్ = ద్విపరార్థపరిమితకాలాంతమువఱకును; బ్రతుకు కాసన్ = జీవించునాశను; కడగట్టువాఁడు = ఒప్పువాఁడు-తనజీవితము శాశ్వతమని యూహించువాఁడు; విశ్వమున్ = ప్రపంచమును; పాటిగాఁగొనక = లక్ష్యపెట్టక; పద్మభవునినైనన్ = బ్రహ్మనుకూడ; నీరసముచేయువాఁడు = చులకగా చూచువాఁడు; వినీతుఁడు = వినమ్రుఁడు; లచ్చికిన్ = సంపదకు; ముచ్చిరి = దుఃఖపడి; ఉడుకువాఁడు = తపించువాఁడు - అసూయపడువాఁడు.

ఉ. పాళము మీఱు *పెద్దపెదపాళము[6]లై బలితంపుఁగాఁగులన్
మూలుగుచున్న ప్రాఁబసిఁడి ముంచి ధనార్థుల కిచ్చు; విష్ణుదే
వాలయ[7]సుప్రతిష్ఠలకునై [8]యొసఁగున్ సతి కేల [9]నించు నా
నాలఘుకర్మనిర్మితికి నగ్రకులేంద్రుఁ డనుగ్రహంబునన్. 211

టీక. పాళముమీఱు = హద్దుమీఱిన; పెద్దపెద్దపాళములై = పెద్దపెద్ద కడ్డీలుగా నున్నవై; బలితంపుఁగాఁగులన్ = మిక్కిలి పెద్దవైన బానలయందు; మూలుగుచున్న = స్థిరముగా - కదలకయున్న; ప్రాఁబసిఁడి = చాలకాలముక్రిందటి బంగారమును - లేక ధనమును; ముంచి = తీసి; ధనార్థులకున్ = యాచకులకు; విష్ణుదేవాలయసుప్రతిష్ఠలకునై = దేవాలయములను నిర్మించి, అందు దేవతలను ప్రతిష్ఠచేయుటకయి; ఒసఁగున్ = ఇచ్చును; అగ్రకులేంద్రుఁడు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు; నానాలఘుకర్మనిర్మితికిన్ = పెక్కు విధములగు పనులు జరుపుటకయి; సతికేలన్ = భార్యచేతిని; నించున్ = నిండించును - ఆమెకప్పగించును.

క. ఆ యాలుమగలు విష్ణుప, రాయణులై పెక్కుగతుల వ్రతములు తఱితోఁ
జేయుచు నుండఁగ నఁట ని, శ్శ్రేయసపదమైనపౌండరీకక్షోణిన్. 212

టీక. ఆలుమగలు = భార్యాభర్తలు; విష్ణుపరాయణులై = విష్ణువునెడ భక్తికలవారై; తఱితోన్ = సమయానుసారముగ; నిశ్శ్రేయసపదమైన = మోక్షస్థానమైన; పౌండరీకక్షోణిన్ = పాండురంగక్షేత్రమున.

1. చ. కచ్చ. 2. క. శాంతి. శ. ర. శాంత. 3. క. వేయని. చ. కెయ్యని. ట. వ్రేయని. 4. క. కాచుకల. 5. చ. బచ్చెర్లి. *శ. ర. మీఱఁ బెద్ద. 6. చ. లన్. 7. చ. ట. సం. 8. చ. యొసఁగన్. 9. చ. నెంచు.

మ. యమరాడ్దూతశిఖావతంసము [1]చిరప్రాణంబు దూరప్రియా
గమశంసిస్ఫుటకాకలీకలన మేకప్రక్రియాపాత[2]వీ
క్షము శీతర్తు బలీయ మొక్క బలిభుగ్రాజంబు రాజిల్లు శ్రీ
రమణాగార పురోధరోత్థచలపత్రస్థూలశాఖాశిఖన్. 213

టీక. యమరాడ్దూతశిఖావతంసము = యమునిదూతలలో శ్రేష్ఠమయినదియు - యమదూతలకు తలమానికమైనదియు - [కాకి యరిష్టమగుటచే దానిని చూచువారికి చావుతప్పదని కవిభావము.] చిరప్రాణంబు = చాలకాలము జీవించునది; దూర.....కలనము = దూరప్రదేశమునందున్న యిష్టజనుల రాకను తెలియఁజేయు స్పష్టమైన ధ్వనికలది; [వెనుకటి టీకలో ఈ సమస్తపదము రెండు పదములుగా విభజింపఁబడి "దూర.....శంసి - దూర = దూరమునందలి; ప్రియ = ఇష్టవస్తువుయొక్క; ఆగమ = రాకను; శంసి = కోరునది; స్ఫుటకాకలీకలనము - స్ఫుట = స్పష్టముగా వినఁబడెడి; కాకలీ= సన్ననికంఠస్వరముతోడ; కలనము = కూడినది" అని వ్రాయఁబడినది. ఈ వ్రాఁత సరికాదని చదువరు లెఱుఁగకపోరు.] కాకి యింటిపై వ్రాలి యరచినచో చుట్టములు వచ్చుచున్నారని ఆ యఱపు సూచించుచున్నదనుట ఎల్లరకుఁ దెలిసినవిషయమే గదా! ఏకప్రక్రియాపాతవీక్షము = ఒంటికంటిచూపుకలది; [పూర్వటీకలో ఇచట "ఏకక్రియాపాతదీక్షము" అను పాఠము గ్రహింపఁబడి "ఒకవిధమైన పాటునందలి దీక్ష (నియమము) కలది" అని యర్థము వ్రాయఁబడుట సరికాదని గ్రహింపనగును] బలిభుగ్రాజంబు = బలిమెతుకులు తిని బ్రదుకునది - గొప్పకాకి; శ్రీరమణా.....శిఖన్ = శ్రీరమణాగార = విష్ణుదేవునిగుడియొక్క; పురోధరోత్థ = ఎదుటనున్న స్థలముపై పుట్టిన; చలపత్ర = రావిచెట్టుయొక్క; స్థూలశాఖాశిఖన్ = లావుపాటి కొమ్మచివరను, రాజిల్లున్ = ప్రకాశించెను. అలం. పరికరము.

శా. తాతల్తండ్రులు మామ[3]లల్లుఁగను ముత్తాతల్ సహా
శ్రోతల్ భ్రాతలు సేవకుల్ హితులు మిత్త్రుల్ పుత్త్రు లోలిం దివా
భీతాభీతములై తగం గొలువఁగాఁ బె[4]స్తోకలై వాయస
వ్రాత[5]శ్రేష్ఠము గ్రాలు రేలు పగలున్ బ్రాంతాగమాంతంబులన్. 214

టీక. సహశ్రోతల్ = సహాధ్యాయులు; ఓలిన్ = క్రమముగా; దివాభీత+అభీతములై = గుడ్లగూబలకు భయపడనివయి; పెస్తోకలై = పెద్దగుంపుగా కూడినవయి; తగన్, గొలువఁగా; వాయసవ్రాతశ్రేష్ఠము=కాకులలో ఉత్తమమైనది; ప్రాంతాగమాంతంబులన్=సమీపవృక్షముల చివఱిభాగము (కొన)లందు; రేలుపవలున్ = రాత్రింబగళ్లు; క్రాలున్ = ప్రకాశించును - ఒప్పును.

చ. అది యొకనాఁడు విట్ఠలగృహాంగణభూబలిపీఠవర్తులా
మెదుకులు మేయఁ గన్గొని యమేయగతిన్ బఱవన్ దదాయత
చ్ఛదభవభూరిమారుతవశంబున నయ్యెడ ధూళివోవ న
భ్యుదితములయ్యెఁ బాన గుడి యూడ్చినఁ గల్గు నగణ్యపుణ్యముల్. 215

టీక. విట్ఠల...వర్తులా = పాండురంగని దేవాలయపు వాకిటనున్న బలిపీఠముపయినున్నవైన; అమేయగతిన్ = శీఘ్రగమనమున; పఱవన్ = ఎగురఁగా; తదాయతచ్ఛదభవభూరిమారుతవశంబునన్ = దాని వెడల్పైన ఱెక్కలవలన పుట్టిన పెద్ద గాలివలన; అయ్యెడన్ = ఆచోట; ధూళివోవన్ = దుమ్ము (లేకుండ)పోఁగా; దానన్ = ఆకారణమువలన; అగణ్య పుణ్యముల్ = లెక్కింపరాని పుణ్యములు; అభ్యుదితములు = కలిగినవి; అయ్యెన్.

---

1. చ. నిరప్రాణంబు. 2. క. దీక్షము. చ. ట. వీక్షము. 3. చ. ట. లల్లుఁడులు. 4. చ. ట. న్స్తోకరై. 5. చ. శ్రేష్ఠులు.

వ. ఇట్లతర్కితోపపన్నంబగు పన్నగశయనసదన సమ్మార్జన సముదితసుకృతపరిపాకంబునఁ గాకంబు అతిలోకం బయ్యె వినుము. 216

టీక. అతర్కితోపపన్నంబు = అనుకోనకుండ తటస్థించినది; పన్నగ......పరిపాకంబునన్ = శ్రీవిష్ణుని దేవాలయమును ఊడ్చుటవలన కలిగిన పుణ్యమునకు ఫలముగ; అతిలోకంబు = లోకోత్తరమైనది - గొప్పది.

క. కలహంస యొకటి యదుకుల, కులహంసముగుడిఁ జరించుఁ గుసుమాయుధకీ
ర్తిలతాగుచ్ఛముకైవడి, జలరుహసంభవమరాళసంకాశగతిన్. 217

టీక. యదుకులకులహంసముగుడిన్ = యాదవకులమున ఉత్తముఁడగు శ్రీకృష్ణుని దేవాలయమున; కుసుమా......కైవడిన్=మన్మథునికీర్తి యను లతకు పూవుగుత్తివలెను; జల......గతిన్ = బ్రహ్మవాహనమైన హంసపోలికను; చరించున్ = తిరుగును. అలం. ఉపమ.

వ. ఇట్లు వర్తించి వర్తించి. 218

టీక. వర్తించి = సంచరించి.

మ. కుతుకం బింకక కుంకుమద్రవమిళద్గోరోచనాపంకని
ర్మితపత్త్రాంకకలంకితాంబుధికుమారీహారివక్షోరుహ
ద్వితయాస్ఫాలనలాలనోచితపయోవిస్ఫారికాసారసం
తతి నా నీడభవంబు క్రీడ సలుపున్ దద్దివ్యధామంబునన్. 219

టీక. కుతుకంబు = ఉత్సాహము; ఇంకక = తగ్గక; ఆ నీడభవంబు = గూటిలోపుట్టు ఆ హంస; కుంకుమ......సంతతిన్ - కుంకుమద్రవ = ద్రవరూపమైన కుంకుమతో; మిళత్ = కూడుచున్న; గోరోచనాపంక = ముద్దగా నున్న గోరోచనముచే; నిర్మిత = కూర్పఁబడిన; పత్త్రాంక = మకరికాపత్త్రచిహ్నములచే; కలంకిత = కలంకముకలవిగా - మలినములుగా చేయఁబడిన; అంబుధికుమారీ, హారి, వక్షోరుహద్వితయ = లక్ష్మీదేవియొక్క మనోహరమైన రెండు కుచములయొక్కయు; ఆస్ఫాలనలాలనా= చఱచుటయొక్క విలాసమునకు; ఉచిత=తగిన; పయోవిస్ఫార = ఎక్కువైన నీటితోఁగూడిన; కాసార సంతతిన్ = సరస్సుల సమూహమునందు; తద్దివ్యధామంబునన్=ఆ పుణ్యస్థలమునందు; ['ఆ దేవాలయమున' అని పూర్వటీక.] క్రీడ సలుపున్ = విహరించును.

ఆ క్షేత్రమునఁ గల సరస్సులలో పాండురంగని దేవేరియగు లక్ష్మీదేవి జలక్రీడ లాడుచుండును; ఆమె నీటిలో మునిఁగి తేలుచున్నపుడు అలలవలన ఆ నీరు ఆమెవక్షోజములను చఱచుచున్నట్లుండును. ఆమె తన స్తనములపయి కుంకుమతో కలిపిన గోరోచనముచే మకరికాదుల చిత్రములను చిత్రించుటచే స్నానసమయమున అవి కరఁగి నీటిలో కలియుటచే ఆ నీరు పంకిలమై మనోహరముగ నున్నది; అట్టి గొప్ప సరస్సులందు ఆ హంస విహరించుచు ఆనందించుచుండెనని భావము. అలం. ఉదాత్తము.

సీ. మొన రెండుగాఁగఁ ద్రెవ్విన విద్రుమద్రుకందము నేలు ముక్కునఁ దడవి తడవి
[1]మొగి విచ్చు పసిఁడిగేదఁగిఱేకుగమి మించు విశదచ్ఛద[2]మ్ముల విదిర్చి విదిర్చి
నగుమొగంబుల దాసనపుఁ గ్రొవ్విరులనవ్వుచిగురాకు నడుగులఁ జిమ్మి చిమ్మి
నిద్దంపుఁబండువెన్నెలగుత్తి కడకొత్తి మలయుమైముంపులఁ గలఁచి కలఁచి

1. క. మొగ. చ. శ. ర. మొగి. 2. క. ములను. శ. ర. మ్ముల.

తే. శార్ఙ్గిసౌధప్రమాణకాసారసార
సారసామోదమేదురవారిఁ దేలి
వచ్చి యా యంచ గుడిలోనఁ జొచ్చె నొక్క
నాఁడు పవలింటి ¹పిటెండ వేఁడి దలఁకి. 220

టీక. ఆ యంచ. ఒక్కనాఁడు, మొన = చివఱిభాగము; రెండుగాఁగన్, త్రెవ్విన = రెండుగా చీలిన; విద్రుమప్రకాండము. పేలు = పగడపువృక్షముయొక్క దుంపవు, పోలించు - అనఁగా చివఱ రెండుగా చీలిన పగడపుదుంపవలెనున్న; ముక్కునన్ = ముక్కుతో; మొగివిచ్చు = మొత్తముగా విరిసిన; ['మొగవిచ్చు = ముఖభాగము విరియునట్టి'అని పూర్వటీక.] పసిఁడిగేదఁగిఱేకుగమిన్ = బంగారువన్నెకల మొగలిఱేకులగుంపును; మించు = అతిశయించు; విశదచ్ఛదమ్ములన్ = అందమైన ఱెక్కలను; విద్రిచి, విద్రిచి = విదలించి, విదలించి; నగుమొగంబుల = బాగుగా వికసించిన; సిద్ధంపు = మవుపైన - లేటయైన; వెన్నెలగుత్తి = వెన్నెలగుంపును; కడకొత్తి = త్రోసివేసి; మలయు = విజృంభించు; మైన్ = దేహమును; ముంపులన్ = మునుఁగుటలచే; కలచి = చలింపఁజేసి; శార్ఙ్గి......వారిన్ = విష్ణుదేవుని దేవాలయపుమొగసాలయందలి కొలనిలోని చక్కని కమలముల పరిమళములతోఁగూడిన నీటియందు; పవలింటిపిటెండవేఁడిన్ = మధ్యాహ్నపు మిక్కుటపుటెండయొక్క వేఁడిమిచే; దలఁకి = భయపడి. అలం. ఉపమ, స్వభావోక్తి.

క. అది తనదేహం బప్పుడు, విదళింపం బక్షసలిలవిప్రుషములచేఁ
జొదు కొదవించుచు గాడ్పులు, పొదవెట్టు ²రజోవికారములు దూరముగన్.

టీక. పక్షసలిలవిప్రుషములచేన్ = ఱెక్కలవలని నీటితుంపరలచే; చొదుకు, ఒదవించుచున్ = చలిని, పుట్టించుచు; గాడ్పులు = గాలులు; రజోవికారములు, దూరముగన్ = దుమ్ముయొక్క వ్యాపించుటలు దూరము; అగునట్లుగా; పొదవెట్టున్ = కలిగించును - చేయును. ['పొదవెట్టు = కలుగఁజేయునట్టి' అని పూర్వటీక. ఈ టీకను గ్రహించుచో క్రియాపదము లుప్తమైపోవుచున్నది.]

తే. సలిలఖగమున కేతదాచరణమునన, గలిగె నాతస్తికంబుగఁ గంబుపాణి
గర్భగేహోపలేపసంస్కారసార, సుకృతపరిపాక నిరపాయశోభనంబు, 222

టీక. సలిలఖగమునకున్ = నీటిపక్షికి - హంసకు; ఏతదాచరణమునన = ఇట్లు చేయుటచేత నే- ఱెక్కలనీటితుంపరను విదలించినమాత్రమున; కంబుపాణి......శోభనంబు - కంబుపాణి = శ్రీకృష్ణుని యొక్క; గర్భగేహ = గర్భాలయముయొక్క; ఉపలేపసంస్కార = అలుకుటవలని; సార = మేలైన; సుకృతపరిపాక = పుణ్యఫలమువలన; నిరపాయశోభనంబు = అపాయములేని - నశింపని - శుభము; కలిగెన్ = లభించెను.

క. శుక మొకటి చంచుజితకింశుకమై హరిహయశరాససురుచిరవపుం
శుకమై కుసుమాకరకింశుక ³మానందమున నందసుతు గుడిఁ బెరుగున్. 223

టీక. శుకము, ఒకటి = ఒక్కచిలుక; చుంచుజితకింశుకమై = ముక్కుచే జయింపఁబడిన మోదుగుమొగ్గకలదయి - మోదుగుమొగ్గవంటి యెఱ్ఱని ముక్కు కలదయి; హరిహయశరాస, సురుచిర, వపుంశుకమై = ఇంద్రధనుస్సువలె, చక్కని; శరీరముయొక్క, కాంతులు కలదయి; కుసుమాకరకింశుకము = వసంతఋతువునకు మోదుగు అయినది - ప్రధానమయినదనుట; నందసుతుగుడిన్ = పాండురంగని దేవాలయమున; పెరుగున్. అలం. ఉపమ, రూపకము.

1. చ. ట. పేరెండ. 2. చ. కపో. 3. చ. ట. మను పేరనఁగనంద.

చ. అలమి త్రిలోకముల్ గెలుచు న[1] త్తఱి తేరువహించు [2]తోడిచి
ల్కలు దగదొట్టి ముందఱికి [3]లాగకయుండినఁ దాన తద్ధురం
బెలమి వహింప మెచ్చి మరుఁ డిచ్చు మణీమయమాలికాత్రయిఁ
గళమునఁ [3]దాల్చుఁ జిత్రశుకనాథుఁడు రేఖలపేర నిచ్చలున్. 224

టీక. అలమి = ఆక్రమించి; త్రిలోకముల్ = ముజ్జగములను; గెలుచనత్తఱి = గెలుచునట్టి యా సమయమున; తేరు, వహించు = రథమునులాగుచున్న; దగ, దొట్టి = దప్పిపొందినవయి; తాన = తానే-ఈచిలుకయే; తద్ధురంబు=ఆరథముబరువును; ఎలమిన్ =ప్రీతితో; వహింపన్ = మోయఁగా; మెచ్చి =కొనియాడి; మరుఁడు=మన్మథుఁడు; ఇచ్చు=బహూకరించునట్టి; మణీమయమాలికాత్రయిన్ = మూఁడు మణిహారములను; చిత్రశుకనాథుఁడు = రంగురంగుల - వన్నెలచిలుక; గళమునన్ = మెడయందు; రేఖలపేరన్ =రేఖలనెపమున; నిచ్చలున్ = శాశ్వతముగ; తాల్చున్ =ధరించును. అలం. అపహ్నుతి.

క. కీర మది యొక్క హరి పరిచారిక చేరిక వసించుఁ జదివింపఁగ మే
పాఁసి యొసఁగ భవనమార్జారాదులవలనఁ దన్ను సంరక్షింపన్. 225

టీక. కీరము = చిలుక; హరిపరిచారికచేరికన్ = విష్ణుభక్తురాలిచనవున; మేపు = ఆహారము-తిండి; భవనమార్జారాదులవలనన్ = పెంపుడుపిల్లి మొదలగువానివలన.

క. దేవాలయమునఁ గొన్ని,నిజావాసమునందుఁ గొన్నియహముల్ దగఁ బై
చే వదలక పాటించుచుఁ, బూవుంబలెఁ బువ్వుఁబోఁడి పులుఁగుం బ్రోచున్. 226

టీక. నిజావాసమునందున్ = తన గృహమున; అహములు = దినములు; చేవదలక = విడువక; పాటించుచున్ = గమనించుచు; పులుగున్ = పక్షిని - చిలుకను.

మ. పసుపార్చుం దడియొత్తు నెండసెకఁ గంపం బాఁగి మైదువ్వుచున్
వసయున్ వెన్నయు మేపు మేపు నొసఁగున్ వల్లించు శ్రీరామనా
మసుధామాధురిసాధురీతిః [5]గుచకుంభస్థాయిగాఁ జేయుచున్
బిసపుష్పప్రియవాసరాగమములన్ బింబోష్ఠి రాచిల్కకున్. 227

టీక. పసుపార్చున్ = పసుపుపూసి, స్నానముచేయించును; ఎండసెకన్ = ఎండవలని వేఁడిమి చేతన్; కంపంబు = చలివలనఁగలిగిన వణకును! ఆగి = ఆపి - పోఁగొట్టి; మేపున్ = ఆహారమును; మేపున్ = తినిపించును. శ్రీరామనామసుధామాధురిన్ = శ్రీరామనామామృతమాధుర్యమును; వల్లించున్ = తెలుపును - బోధించును; బిసపుష్పప్రియవాసరాగమములన్ = వసంతర్తుదినములు ప్రవేశింపఁగా; బింబోష్ఠి = దొండపండువంటి పెదవికల వనిత - ఆ హరిదాసి.

తే. కనకమణిపంజరంబుల నునిచి యునిచి
చక్కెఱయు నుక్కెఱయు [6]సారె గుక్కి కుక్కి
యొఱపుఁ బలుకులు పలుమాఱు గఱపి కఱపి
కలికి చిలుకలకొలికి రాచిలుకఁ బెనుచు. 228

టీక. కనకమణిపంజరంబులన్ = మణులు తాపిన బంగారు పంజరములందు; ఉక్కెఱయున్ = బెల్లపుభక్ష్యమును; సారె = మాటిమాటికిని; ఒఱపుఁబలుకులు = చక్కనిమాటలను; కఱపి = బోధించి; కలికిచిలుకలకొలికి = ముద్దుగుమ్మ యయిన ఆ హరిదాసి.

---

1. చ. త్తతి. 2. క. దోడి. 3. చ. లాఁగక. 4. క. దాల్చు చిత్ర. 5. చ. ట. లదుగఁబై. 6. క. తినుచ. . చ. జాల.

మ. కలహంసోపమయానఁ [1]జక్రకుచఁ [2]బ్రేంఖత్ఖంజరీటాక్షిఁ గో
కిలసారస్వర బర్హిబర్హచికురం గీరప్రియాలాపఁ దో
య్యలిఁ జాలన్ మరిగెన్ శుకం బది [3]గరీయఃప్రేమ గావించుచున్
బులుగుం బొందుక నంది పొందినగతిన్ బొత్తొత్తులన్ హత్తుచున్. 229

టీక. శుకంబు, అది = ఆ చిలుక; గరీయఃప్రేమ = ఎక్కువ అనురాగమును; కావించుచున్ = కూర్చుచు; కలహంసోపమయానన్ = హంసనడకలవంటి నడకలు కలదానిని; చక్రకుచన్ = చక్రవాకములవలె గుండ్రనైన కుచములు కలదానిని; ప్రేంఖత్ ఖంజరీటాక్షిన్ = తిరుగుచున్న - కాటుకపిట్టవంటి (నల్లనైన) కన్నులు కలదానిని; కోకిలసారస్వరన్ = కోకిలమువంటి మధురమైన కంఠస్వరము కలదానిని; బర్హిబర్హచికురన్ = నెమలిపించెమువంటి చక్కని జుట్టుకలదానిని; కీరప్రియాలాపన్ = చిలుకవలె చక్కగా మాటాడుదానిని; తొయ్యలిన్ = స్త్రీని - హరిదాసిని; పులుగుంబొందునన్ = పక్షియొక్క చేరికను; అంది, పొందినగతిన్ = ఆరమరలేక యున్నట్లుగా; పొత్తొత్తులన్, హత్తుచున్ = ఎక్కువ చేరిక, చనవులు కలిగినదయి అచట: చాలన్, మరిగెన్ = ఎక్కువగా ప్రేమించి వెంట నంటెను. [పయివర్ణనమునుబట్టి హరిదాసియందు పక్షిసామాన్యగుణములే యుండుటవలన, ఆమె యొక వింతపక్షియే యని భావించి, బెదరు లేక చిలుక ఆమెతో కలిసిమెలిసి, ఆమెను విడువకుండెనని భావము.] పయి వర్ణనమునను, పద్యమునఁగల 'శుక' పదమువలనను ఇట్టి చక్కని యువతిని జూచిన, ఇంద్రియనిగ్రహమున గొప్పపేరు పడసిన శుకుఁడు (మహర్షి) కూడ ఆమెను మోహింపవలసియుండు నని వ్యంగ్యము. అలం. పరికరము.

తే. ఆ శుకద్విజరాజున కంతఁ గొంత,కాల మరుగంగ నొకనాఁడు కలిగె బంధ
మోక్ష; మాకస్మికం బనిర్ముక్తికలిమి,యా శుకద్విజరాజున కద్భుతంబె! 230

టీక. ఆ శుకద్విజరాజునన్ = ఉత్తమమైన ఆ చిలుకకు; బంధమోక్షము = పంజరమునుండి విడుదల; ఆకస్మికంబు = అనుకోనకుండఁగ - తటాలున; శుకద్విజరాజునకున్ = శుకుఁడనెడి బ్రాహ్మణశ్రేష్ఠునకు - మహర్షికి; నిర్ముక్తికలిమి = మోక్షసంపద; అద్భుతంబె? = ఆశ్చర్యముకాదు.

సీ. జనియించెనో కొ పచ్చని మొల్క యను బుద్ధి గ్రుచ్చిన పచ్చలకొమరువలన
సమకూరెనో కొ దాడిమఫలోద్భవబీజమతి పద్మరాగసామగ్రివలనఁ
బొడకట్టెనో కొ [4]జంబుఫలంబు లను మనోభ్రమ మింద్రనీల విభ్రమమువలనఁ
దోఁతెంచెనో కొ మధూకపుష్పము లను నాస హాటకుంజిముత్యములవలన

తే. [5]దాసి యటువెట్టి [6]పసుపాడఁ దలఁగి చనుడు
[7]బరణిమూఁకుట నెలకొన్న బన్నసరముఁ
గఱచికొనిపోయెఁ జిల్క ప్రగల్భవిటుఁడు
బాలికామానసముఁగొను [8]పగిది నపుడు. 231

టీక. గ్రుచ్చిన = కూర్చిన; పచ్చలకొమరువలనన్ = పచ్చల కాంతివలన; పచ్చనిమొల్క యను బుద్ధి = పచ్చని మొలక యను భ్రాంతి; జనియించెనో కొ! = కలిగినదో, యేమో! దాడిమఫలోద్భవబీజమతి = దానిమ్మగింజల నెడి భ్రాంతి; సమకూరెనో కొ; = కలిగినదో, యేమో! పొడకట్టెనో కొ! = కలిగెనేమో! మధూకపుష్పము లను, నాస = ఇప్పపుష్పాల నెడి ఆశ - భ్రాంతి; తోఁతెంచె

1. క. చక్ర. 2. క. ప్రేంఖ. 3. క. మహీయః. చ. గరీయః. 4. క. జంబూఫలంబను. శ. ర. జంబుఫలంబులను. 5. క. దాది. శ. ర. దాసి. 6. చ. వంటి. 7. చ. భరణి. 8. చ. పగిది.

నోకో!=కలిగెనేమో! అటుపెట్టి=అక్కడ, దూరముగా ఉంచి; తలఁగిచనుడున్=తొలఁగి, వెళ్లఁగా; బన్నసరమున్ = రత్నాలహారమును (నానావిధరత్నములనుగూర్చిన హారమును) ప్రగల్భవిటుఁడు = నేర్పరియైన సరసుఁడు; బాలికామానసమున్ = యువతియొక్క మనస్సును; కొనుపగిదిన్ = హరించి, వెడలిపోవునట్లు; చిల్క; కఱచికొనిపోయెన్. అలం ఉపమ, ఉత్ప్రేక్ష.

క. బారాదిసొమ్ము లుండఁగ, హారమునే కొనుచుఁ జనియె నండజము ప్రియం
[1]బారఁగ ఫలకాముకు లగు, వారలు గుణవత్ప్రసక్తి వదల విడుతురే? 232

టీక. బారాదిసొమ్ములు = లెక్కలేనన్ని నగలు; అండజము = పక్షి - చిలుక; ప్రియంబారఁగన్ = ప్రియముతో; ఫలకాముకులగువారలు = ఫలమును గోరువారు; గుణవత్ప్రసక్తిన్ = మంచి గుణములు కలవారి సంబంధమును; (చిలుకవిషయమున - త్రాఁటితోఁగల సంబంధముననుట) - హారమున రత్నములు దారముతో కూర్చఁబడినవనుట.) అలం. అర్థాంతరన్యాసము.

క. ఆ ధవళకిరణముఖికి న,సాధుశుకాచరణ మపు డసహ్యం బయ్యెన్
గోధుక్కృతిసతికి మనో,బాధకమగు కృష్ణధూర్తబాల్యముఁబోలెన్. 233

టీక. ఆ; ధవళకిరణముఖికిన్ = చంద్రునివంటి ముఖము కల ఆ హరిదాసికి; అసాధుశుకాచరణము = ఆ చెడ్డచిలుక చేసిన పని; గోధుక్కృతిసతికిన్ = గోపికాస్త్రీకి; మనోబాధకమగు = మనస్సును బాధించునదైన; కృష్ణధూర్తబాల్యమువోలెన్ = ధూర్తుఁడగు కృష్ణుని చిన్నతనమువలెను; అసహ్యంబు = ఓర్వరానిది - బాధ కలిగించునది; అయ్యెన్. అలం. ఉపమ.

మ. కటిఁ జేలార్థముచుట్టి, చిక్కినది [2]వేగంజుట్టి పాలిండ్లమీఁ
దట సంధించుచు నార్ద్రదేహలత మాద్యద్వర్షధారావల
త్తటిదాకారముఁ జూపఁ [3]దోపికొనుచున్ ధమ్మిల్లబంధంబు ముం
గిటికిన్ సుస్తని వచ్చె గోస్తనహారత్రీకరగ్రహావ్యగ్రయై[4]. 234

టీక. కటిన్ = నడుమును; చేలార్థము = సగముచీర; పాలిండ్లమీఁదటన్ = స్తనములపైగా- అవి కనబడకుండునట్లు; సంధించుచున్ = కూర్చుచు - సరిచేయుచు; ఆర్ద్రదేహలత = (స్నానము చేయుటచే) తడిసిన, తీగవంటి (సన్నని) దేహము; మాద్య......కారమున్ = దట్టమైన వర్షధారలచే చుట్టుకొనఁబడిన మెఱుపుయొక్క ఆకారమును; [ఆమె మెఱుపువలెను, ధరించిన చీర వర్షధారలవలెను ఉన్నవనుట.] ధమ్మిల్లబంధంబు,దోపికొనుచున్ = జుట్టు ముడివేసికొనుచు; ముంగిటికిన్ = ఇంటిముందు భాగమునకు - ఇంటిమొగసాలకు; గోస్తన......వ్యగ్రయై = రత్నహారమును ఎత్తుకొనిపోవుచున్న చిలుకను పట్టుకొనుటయందు తొందరపాటు కలదై; సుస్తని = చక్కనిచన్నులు కల యా పడఁతి; వచ్చెన్. అలం. ఉపమ, స్వభావోక్తి.

తే. వర్షధారావశేషాన్వవాయయుక్తి, వాయువశమునఁ దెరలు మువ్వన్నె[5]విల్లు
వేడ్క వెన్నాడుశశివోలె వెలఁది చాపలమ్మునసరమాహారించు [6]కీరముఁదవులుచు.

టీక. వర్ష...యుక్తిన్ = వర్షము ధారలుగా కురవఁగా మిగిలియున్న (నీటితుంపరల) గుంపుకూడికచే; తెరలు = బయలువెడలిన; మువ్వన్నెవిల్లు = ఇంద్రధనుస్సును; శశివోలెన్ = చంద్రునివలెను - చంద్రుఁడు వెంటనంటినట్లుగా; వెలది = చాన; చాపలమునన్ = భ్రమచేత; సరము, ఆహరించు = హారమును ఎత్తుకొనిపోవునట్టి; తవులుచున్ = వెంబడించుచు; వేడ్కన్; వెన్నాడున్ = వెంటదఱుమును. అలం. ఉపమ.

---

1. క. బారయ. చ. బరసి. శ. ర. బారఁగ. 2. క. మేనం. చ. ట వేగం. 3. క. ద్రోసి. ట. దోపి. 4. చ. ట. వ్యగ్రమై. 5. చ. విల్లు. 6. క. శుక. చ. ట. కీర.

మ. గుహమాతృస్ఫటికాక్షసూత్రము సితేక్షుచ్ఛేదగుచ్ఛచ్ఛటా
స్పృహ నైకొన్న శుకంబొ [1]యేమొ యితఁ డీ జీరాడుపూవాఁగతో
బహిరుడ్డీనత నొడ్డి నిల్చు రతిరాట్పట్టాశ్వమో నాఁగ న
మ్మహిళావిభ్రమకీర మొప్పు ముఖసీమాగామిముక్తాళినై 236

టీక. అమ్మహిళావిభ్రమకీరము = ఆ వారిదాసియొక్క వెంపుడుచిలుక; యితఁడీ; గుహ మాతృస్ఫటికాక్షసూత్రమున్ = పార్వతీదేవియొక్క స్ఫటికముల జపమాలను; సితేక్షు...స్పృహన్ = తెల్లచెఱకుముక్కలగు వెలయొక్క సమూహమను భ్రాంతిచే; ["సమూహమునందలి యపేక్షచేత"నని పూర్వటీక.] నైకొన్న, శుకంబొ = గ్రహించిన చిలుకా యేమి, యిది? జీరాడుపూవాఁగతోన్ = వ్రేలాడుచున్న పూవులగుత్తితో; బహిరుడ్డీనతన్ = బయట ఎగురుటయందు; ఒడ్డి = పందెమువేసి; రతిరాట్పట్టాశ్వమో = మన్మథుని వాహనరాజమగు చిలుకయో; నాఁగన్ = అనునట్లుగా; ముఖ... శినై = ముక్కునఁ గఱచుకొనిన ముత్యాలహారముకలదయి; ఒప్పున్ = ప్రకాశించును. ['అమ్మహిళా విభ్రమకీరము = ఆ యాఁడువాని వినోదపుఁజిలుక' అని పూర్వటీక.] అలం. ఉత్ప్రేక్ష.

వ. ఈ చందంబునఁ గంఠప్రస్యందనంబు విడిందితుండన మందమంద ప్రచారంబును, మలిమ్లుచుండన దుర్గమప్రవేశనిపుణంబు, నవివేకి యన శిథిలీకృతస్వపక్షంబును, దనుజగృహీతజనకజ యన రామానుసరణసముచితంబును నై యున్మత్తుపోలికం జంచు[3]చుంబి లలంతికావ్యాజంబున లాలఁ గ్రక్కుచుఁ, బుష్పవద్బింబంబు విధంబున శరీరప్రభాదంభంబున నంధకారంబులచేతం గప్పఁబడుచు, యోగిబాగున విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలనంబునఁ బాశచ్ఛేదంబు సేయుచుఁ, బరవధూపయోధరంబుపగిదిఁ బట్టరాక, నీతివిదుహృదయంబుగతి దూరదర్శనయోగ్యంబై, కరువలి మురువునం బొడమి యడంగుచు, బరబ్రహ్మంబు చాడ్పున నగోచరంబయ్యును దదీయమాయావిలసితంబునై [4]సకలంబును నిజప్రతిభాసంబున యాథార్థ్యభూమిక నభినయిం[5]చుచు, శశాంకశిలాసౌధవిటంకంబులను నుంకువగొన్నతఱి శరన్నీరద వశంవదంబగు [6]సునాశీర [7]శరాసనశకలంబన మెలంగుచు, నంతరిక్షమహోన్నతుంబునకు [8]నతోన్న[9]చంచూపుట ప్రవాళఖండప్రభాపిండనంబునం దొంకలి సఫలవిటప లక్ష్మి నావహిం[10]చుచుఁ, బ్రమాదవిగళితంబగు నగవిరోధికొలువు పీఠంబు [11]యచ్చరల పచ్చలకడియంబువడువున నిరాలంబనస్థలంబునం బలుమఱు [12]చక్రచంక్రమణ చమత్కారంబు సూపుచు, సమీపాగామశ్యామలపలాశపటలగర్భంబునందు ముకుందవిగ్రహంబునందు భక్తిసముగ్రుండగు పురుషశ్రేష్ఠుండునుంబోలె నేర్పుఱు పరాక డిందుచు, నందంద జాతిపులుఁగులు మనుజగంధధురంధరం బగుటకు జగడంబు దిగిచినం గినిసి విస్మయరతనూపుహాదంతుర[13]కపోలాంతరంబును, విఘూర్ణనవిక్రృతవీక్షణంబునై క్షణంబు మణివలయవలయితంబగు రతియువతి

1. చ. యేవరు. 2. చ. దవంగా. 3. చ. చుంబిత. 4. క. బునై సకలంబును. చ. ట. నెసకంబున. 5. చ. పుచు. 6. క. శునా. సూర్యా. సునా. 7. క. శిలా. చ. ట. శరాసన. 8. క. నతోన్మ. చ. నతోన్మ. 9. క. చంచు. చ. చంచూ. 10. చ. పుచు. 11. చ. యచ్చల. 12. చ. జక్ర. 13. చ. ట. కపోలాంతంబును.

ముంజేతిరీతిం జెలువడరు మెక నిగిడించి మగుడంబడి కాకుప్రకారవికారస్వరం
బుగ వాని నిరాకరిం[1]చుచుం బఱచు నప్పుఱచుం జిలుక [2]కలిగినయదివో తె
నయ్యన్ను వెన్నాడం [3]బెన్నాటకంబై కోటిక త్రియు లుత్తుంగకుచోత్సంగసంగత
కురంగలాంఛనకళావలోకనంబున ముసిముసినగవు [4]లెగయ గోరువంక కాన
వచ్చెంగాని కీరంబు దూరం బయ్యెంగదే యని గర్వోక్తివై దర్భింగూడి
యాడుచుం బాడుచుం [5]బంజరంబును, జిలుకచాలు తెరయుకు చేరికచేసి యెల్ల
యింప నలయించుచు, నడితెక్క గ్రిక్కిఱించుచు నొక్కయెడం గాలువాడిచి
ముక్కున నక్కాంతహారతరళంబు నొక్కుచుం 'జిక్కెం జిక్కె నిక్కడ నిక్కడ
నక్క యక్క' యని చేటికానికరంబు [6]పొలసిన పుబ్బుంగెరలింగి మెఱుంగు[7]మెఱసి
తొలంగిన తెఱంగున డాయ వచ్చి[8]నట్లువ మాయంబగు మాయ[9]లేటిపాటిం
బోవంబోవ దూరంబగుచు నుండు నెండమావులమాడ్కి దివియ[10]వచ్చుట నటించి
మువ్వలోని రాయిసోయగంబున నొక్కింతనడి పట్టువడుట వచరించి, ప్రచురవ
యంబున ఖచరపుర[11]ప్రాసాదంబులు మోహం బూనుపున నెగసి తిరిగి [12]వెఱతెరు
వునం బఱతెంచి పాండురంగాయతనంబు [13]మధ్యరంగంబు చొచ్చి యచ్చట
నిచ్చం దనయిచ్చనుండు దండియంబుపై [14]వ్రాల నిచ్చుట. 237

టీక. ఈ చందంబునన్ = ఈ రీతిని; కందర్పస్యందనంబు = మన్మథునికి రథమైన చిలుక; వినిందితుండనన్ = మిక్కిలి నిందింపఁబడిన జనునివలె; మందమందప్రచారంబును = మెల్లమెల్లని నడకలు గలదియుం [వినిందితుఁడు కూడ ఇతరులముఖము చూడలేక జంకుచు మెల్లమెల్లగనే నడచుట స్వభావము.] మలిమ్లుచుండనన్ = దొంగపోలిక; దుర్గమప్రవేశనిపుణంబు = చేర శక్యముకాని ప్రదేశములను ప్రవేశించు నేర్పుకలది; [దొంగకూడ అసాధ్యములగు చోటులకు పోయి దొంగిలించుట స్వభావము.] అవివేకి యనన్ = తెలివిలేనివానిపోలిక; శిథిలీకృతస్వపక్షంబు = సడలఁజేయఁబడిన తన ఱెక్కకలది; [అవివేకి తనతెలివిలేమిచే తనపక్షము వారినుండి విడిపోవుట సంభవించుచుండును.] దనుజగృహీత = రాక్షసునిచే (రావణునిచే) కొనిపోఁబడిన; జనకజ యనన్ = సీతాదేవివలె; రామానుసరణసముచితంబును=(చిలుకపక్షమున స్త్రీచేత అనుసరింపఁబడుటకు తగినదియుం - (సీతపక్షమున) రామునిచే అనుసరింపఁబడుటకు తగినదియు-[పూర్వటీకలో "శ్రీరాముని ననుసరించుటకు" అనిమాత్రము కలదు.]ఉన్మత్తపోలికన్ = పిచ్చివానిరీతిని; చంచు...ంబునన్ = ముక్కున గఱచుకొన్నహారమను నెపమున; లాలం గ్రక్కుచున్ = చొంగలు కార్చుచు; పుష్పవద్బింబంబువిధంబునన్ = సూర్య, చంద్రుల మండలములవలె; శరీరప్రభావలంబంబున్ = శరీరపుకాంతియను నెపమున; యోగిబాగునన్ = యోగివిధమున; విచ్ఛిన్నచరణశృంఖలాచ్ఛలంబునన్ = తెగిపోయిన కాళ్లసంకెలలను నెపముచేత; (ఇది చిలుకపక్షమున) ['కారణముచేత' అని పూర్వటీక.] పాశచ్ఛేదంబు = త్రాటిని తెంచుటను; [యోగిపక్షమున ఆశలను త్రెంచుటను]; పరవనూపమోఘరంబుపగిదిన్ = ఇతరస్త్రీయొక్క స్తనమువలె నీతివిదుహృదయంబు గతిన్ = నీతివేత్తయొక్క మనస్సువలె; దూరదర్శనయోగ్యంబై = దీర్ఘాలోచనము

1. చ. ట. పుచు 1. కరఁగిన. చ. కలిగిన. 3. చ. బన్నాట. ట. జన్నాట. 4. క. నెఱయ. చ. ట. లెగయ. 5. క. పంజ. 6. చ. ట. నలుసులుగెరిగి. 7. చ. ట. మెఱచి. 8. చ. నట్లునద. 9. చ. లేఁడిపాటుం. 10. క. నచ్చుట. చ. వచ్చుట. 11. చ. ప్రసాదం. 12. చ. పొఱ. 13. చ. లో 'మధ్యరంగంబు' లేదు. 14. చ. వ్రాలిన.

చేయుటకు తగినదయి, (చిలుకపక్షమున) దూరమునుండి చూచుటకుమాత్రము తగినదయి; కరువలిమురువునన్ = గాలిపోలికను; పొడమి; యడఁగుచున్ = పుట్టి, అణఁగిపోవుచు, (చిలుకపక్షమున) కనఁబడి మాయమగుచు; పరబ్రహ్మంబుచాడ్పునన్ = పరమాత్మవలె; తదీయమాయావిలసితంబు నెసకంబును = ఆ బ్రహ్మముయొక్క మాయా రూపమగు ప్రకృతియొక్క కాంతివిలాసమును; నిజప్రతిభాసంబునన్ = తానను తోఁకచేత; - తానను భ్రాంతిచేత; యాథార్థ్యభూమికను, అభినయించుచున్ = నిజమను వేషమును, అభినయించుచు - అనఁగా - నిజమను భ్రాంతిని కలిగించుచు [అని బ్రహ్మముపక్షమున అర్థము.] [ఇఁక చిలుకపక్షమున] అగోచరంబయ్యును = కనఁబడుచున్నను; మాయావిలసితంబు నెసకంబును= మోసముయొక్క విలాసము అనునట్టి; నిజప్రభాసంబునన్ = తననీడచేత; యాథార్థ్యభూమికను, అభినయించుచున్ = యథార్థమగు వేషమును-పక్షియే యను భ్రాంతినిగొలుపుచు. [పరబ్రహ్మము ఏరీతిని మాయారూపమగు ప్రకృతియందు నిక్కము, యథార్థము నను భ్రమను కలిగించునో, అరీతినే ఈ చిలుక యును తన నీడను చూచిన యితరులు ఆ నీడయే చిలుక యని భ్రాంతిపడునట్లు చేయుచున్నదని భావము.] శశాంకశిలాసౌధవిటంకంబులన్ = చలువరాతిమేడల మూజూరునందలి గూండ్లయందు; ఉనుపఁగొన్నతఱిన్ = నిలిచియున్న సమయమున; శరన్నీరదపశంపదంబు, అగు = శరత్కాలపు (తెల్లని) మేఘమునం దణఁగియున్న; శునాసీరశరాసనశకలంబనన్ = ఇంద్రధనుస్సుయొక్క తునుక వలె - [ఈ చిలుక యింద్రధనువువలె చిత్రవర్ణములు కలదని తోఁకతనే వర్ణితము.] మెలఁగుచున్ = వెలయుచు.

[ఇచట పూర్వటీకాకారులు 'సునాసీర శిలా శకలంబు' అను పాఠమును గ్రహించి, దానికి 'ఇంద్రనీలమణిఖండము' అను నర్థమును వ్రాసిరి; అపాఠమును, టీకయు అసంగతములు.]

అంతరిక్షమహాప్లక్షంబునకున్ = ఆకాశ మను గొప్ప జువ్విచెట్టునకు; ['ప్లక్షంబునకున్ = జువ్వి పండునకు' అని పూర్వటీక. అది తప్పు.] అక్షామ......హిండనంబునన్ - అక్షామ = కృశముకాని - చక్కనిదైన; చంచూపుట = ముక్కు అనెడి; ప్రవాళఖండ = పగడపుఁబలుకుయొక్క; ప్రభాహిండ నంబునన్ = కాంతియొక్క వ్యాపనముతో; దొరలి = కలసి; సఫలవిటపలక్ష్మిన్ = ఫలముతోఁగూడిన చిగురుయొక్క శోభను; ఆవహించుచున్ = ధరించుచు - పొందుచు.

[ఇచట ఆకాశము జువ్విచెట్టుగాను, పచ్చనిచిలుక దాని చిగురుగాను, ముక్కు ఫలముగాను రూపింపఁబడినవి. ఎఱ్ఱని పండుతోఁగూడిన పచ్చని చిగురువలె ఎఱ్ఱని పగడపుకాంతిగల ముక్కుతోఁ గూడిన పచ్చని చిలుక ప్రకాశించుచున్నదని భావము.]

[పూర్వటీకలో ఈయెడ "అక్షామచంచూపుట = తెల్లఁబాటు లేని ముక్కుపుటము అనెడి... ...దొరలిన = కలసిన; ఫలవిటపలక్ష్మిన్ = పండ్లతోడి కొమ్మకలిమిని" అని వ్రాయఁబడినది; మీఁది పాఠములును, టీకయు ప్రస్తుతార్థానుకూలములని సహృదయులు తెలియఁగలపోరు] ప్రమాదవిగళితంబగు= ప్రమాదముచేత జాఱిపడిన; నగవిరోధికొలువు వీవనయచ్చరల = పర్వతభేదియగు ఇంద్రుని సేవించుచు, వీవనలను వీచు అప్సరసములయొక్క; పచ్చలకడియంబువడువునన్ = పచ్చలు తాపిన కడియమురీతిని, నిరాలంబనస్థలంబునన్ = నిలుచుటకు ఆధారములేని చోటు; పలుమఱు = పెక్కుసారులు; చక్ర చంక్రమణచమత్కారంబు = చక్రమురీతిని గిఱ్ఱున తిరుగుటలోని నేర్పును.

[ఈ చిలుక నిరాలంబమగు ఆకాశమున చక్రమురీతిని గిఱ్ఱున పల్టీలు కొట్టుచుండఁగా, స్వర్గము నందలి యప్సరసల కాలినుండి జాఱి క్రిందఁ బడుచున్న పచ్చలకడియమువలె ప్రకాశించెనని భావము.]

సమీపా......గర్భంబునందున్ = దగ్గఱితోఁటలయందలి ముదుఱుటాకుపచ్చరంగు గల ఆకుల జొంపములయొక్క లోపలిభాగంబునందు; ముకుందవిగ్రహంబునందున్ = పరాత్పరుని దేహమునందు; భక్తిసమగ్రుఁడగు = పరమభాగవతుఁడగు; పురుషశ్రేష్ఠుండునుంబోలెన్ = గొప్పపురుషునివలె; డిందుచున్ = అణఁగుచున్ - కలిసిపోవును.

పరమభక్తుఁడు భగవంతునియందు ఐక్యమును పొందినట్లు, ఈ చిలుక ఆకులమఱఁగున దూఱి దానితో కలిసిపోవుచున్నదని భావము.

అందంద = అక్కడక్కడ; జాతిపులుఁగులు = తోడి చిలుకలు; మనుజగంధధురంధరంబు, అగుటకున్ = (ఈ చిలుక) మనుష్య సంపర్కమున క్రొత్తవాసన కలదగు కారణమున - విజాతీయ మగుట; జగడంబుదిగిచినన్ = పోట్లాటకు దింపఁగా; కినిసి = కోపించి; విసృమర......లాంత రంబున = విస్తరించిన (నిక్కుచున్న) మేనివెండ్రుకలచేత మిట్టపల్లములుగాఁ జేయఁబడిన చెక్కిటి మధ్యభాగము కలదియును; విఘూర్ణనవికృతవీక్షణంబునై=తిరుగుడుపడుటచేత వికారమయిన చూపులు కలదియు నయి; క్షణంబు = క్షణకాలము; మణివలయవలయితంబు, అగు = మణులుతాపిన కడియముతో చుట్టుకొనఁబడిన (కూడిన); రతియుంవతిముంజేతిరీతిన్ = రతీదేవియొక్క ముంజేతివలె; చెలువు; అడరు = ప్రకాశించుచున్న; మెడ, నిగిడించి = మెడను ముందునకు చాచి; మగుడంబడి = త్రిప్పి; కాకుప్రకారవికారస్వరంబుగన్ = వికారమగు కాకుస్వరపురీతిని - (బెదరించు భయంకరధ్వనితో); వానిన్ = ఆ పక్షులను; నిరాకరించుచున్ = తిరస్కరించుచు; పరచు = పరుగెత్తు - ఎగురుచున్న.

(ఈ చిలుక మనుష్యస్త్రీచే పెంచఁబడుటచే ఆవాసన కలిగినదైనందున దీనిని జూచి జాతిచిలుకలు వేఱగు చిలుకయని భ్రాంతిపడి జగడమునకు సిద్ధపడినవి. అప్పుడిదియుం కోపించినది; ఆకోపముచే దీని చెక్కిళ్లయందు రోమాంచము కలిగి, వెండ్రుకలు నిక్కుటచే ఆ భాగము ఎత్తుపల్లములు గలదిగా అయినది; గ్రుడ్డులను త్రిప్పుచు వికారముగ వానిని చూచినది; హారముతోఁగూడిన యియ్యది మణులు తాపిన కంకణమును ధరించిన రతీదేవిముంజేతివలె ప్రకాశించుచుండినది; ఇట్టి చిలుక కాకుస్వరముచే ఆ తోడిచిలుకలను బెదరించి; తిరస్కరించుచు ఎగిరిపోయినది అని భావము.]

అప్పుఱచుఁజిలుకకున్ = ఆ చెడ్డచిలుకఁగూర్చి; అలిగినయదివోలెన్ = కోపించినదానివలె; అయ్యన్ను = ఆ యువతి - హరిదాసి; వెన్నాడన్ = వెంబడింపఁగా; పెన్నాటకంబై = పెద్దయాట యయి; బోటికత్తియలు = ఆమె చెలులు; ఉత్తుంగ......నంబునన్ = ఉన్నతమయిన కుచముల మీఁదిభాగమున వ్యాపింపఁజేయఁబడిన వెన్నెలఁబోలుచూపుచేత; నెఱయన్ = వ్యాపింపఁగా; గోరువంక = ఒక పక్షి, నఖక్షతమును; గరోభ్యక్తివైదర్భింగూడి = అర్థాంతరముతో గూడిన సుకుమారపద్ధతితోఁగూడి; చిలుకచాలుతెఱయును = చిలుకలవరుసను చిత్రించిన తెఱను; చేరికచేసి = దగ్గఱకు తెచ్చి; ఎలయింపన్ = ఉంచఁగా; ['దగ్గఱకు రప్పింప' అని పూర్వటీక.] అలయించునన్ = అలసిపోవునట్లు చేయుచు - బాధించుచు; నడితెక్క = తెక్కమధ్యభాగమును; క్రిక్కిఱించుచున్ = దగ్గఱగా ఇఱికించుచు - ముడుచుకొనుచు; ఒక్కయెడన్ = ఒక్కచోట; కాలువాడిచి = కాలు నిలిపి; కంఠహారతరళంబున్ = ఆ మణిహారములోని నాయకమణిని; చేటికానికరంబు = చెలికత్తెలగుంపు; పొలసినన్ = సమీపింపఁగా; పులుఁగు = పక్షి - చిలుక; ['జాడ' అని పూర్వటీక.] ఎఱింగి = గ్రహించి; మెఱుంగు = మెఱుపు; డాయవచ్చినట్లన = సమీపించినట్లే కనఁబడి; మాయలేటి పరిపాటిన్ = మాయలేఁడిరీతిని; తివియన్ = తీయఁగా - తీసినయెడల ననుట; వచ్చుట=చిక్కుటను; పచరించి = నటించి; [మువ్వలోని రాయి మువ్వరంధ్రమునుండి తీయుటకు వీలగునట్లు కనఁబడునేగాని ప్రయత్నించినను దానిని తీయుట సాధ్యముకాదు; ఆ రీతినే యీ చిలుకయును.] ప్రచురరయంబునన్ = ఎక్కువ వేగముతో; ఖచరపురప్రాసాదంబులు = అమరావతిలోని భవనములు; మోవన్ = తాఁకునట్లు; పూఁపునన్ = పూనికతో - పట్టుదలతో; ఎగసి = ఎగిరి; పెఱతెరువునన్ = వేఱుమార్గమున; పఱతెంచి=ఎగిరి వచ్చి పాండు......రంగంబు = పాండురంగని దేవాలయపు మధ్యభాగమును; ఇచ్చన్ = తనమనస్సునకు వచ్చినట్లు - స్వేచ్ఛగా; దండియుంబుపైన్ = కఱ్ఱపయి; తనయిచ్ఛన్ = తన కోరిక ననుసరించి.

సీ. మదఘూర్ణ[1]దురుసంకుమదమలీమసకుచద్విపమహోద్ధతిఁ గౌనుఁదీగ నులియ
ఘనసారపుండ్రకగ్లౌబింబనికటఘర్మహిమాప్తి మోముఁదామర చలింప
నాసికానూత్నగంధఫలియూరుపుఁదావి నధరదంతక్షదమత్తాళి విరియఁ
గింకిణీక్వణనశంకితగర్జితప్రస్తకాంచిచంచల[2]గతి యంచ జడియ

తే. బంధనిర్ముక్తశుకసక్తభావ యగుచు, నలపరాశరసుతుచంద మధిగమించు
మించు[3]ననబోఁడిచందంబు మేలుకనిన, వాఁడు తలపోయు కలలోని వార్తయయ్యె.

టీక. మద.....ద్ధతిన్ - మదఘూర్ణత్ = మదముచే తిరుగుచున్న; ఉరు = గొప్పవైన; సాంకుమదమలీమసకుచద్విప = కస్తూరిచే మలినమైన (నల్లనైన) కుచములను ఏనుఁగులయొక్క; మహోద్ధతిన్ = గొప్ప విజృంభణముచేత; కౌనుఁదీగ = నడుము అను లత; నులియన్ = చలింపఁగా. [ఏనుఁగుయొక్క ఔద్ధత్యమున తీగలు చలించినట్లు, కుచముల విజృంభణముచే ఆమె మధ్యము చలించుచున్నదని భావము.] ఘనసార.....మాప్తిన్ - ఘనసారపుండ్రక = కర్పూరపు తిలకముచే; గ్లౌబింబనికట = చంద్రబింబముయొక్క సమీపమునం దుండుటచే; ఘర్మహిమాప్తిన్ = చెమ్మటయను మంచు వ్యాపించుటచే; మోముదామర=ముఖపద్మము; చలింపన్ = కంపింపఁగా. చంద్రకమలములకు విరోధము స్పష్టము. [ఆమెముఖము చంద్రునివలెనున్నదనియు, ఆయాసమువలనిచెమటచేబొట్టుచెదరిన దనియుభావము.] నాసికానూత్నగంధఫలియూరుపుఁదావిన్=అప్పుడే వికసించిన సంపెఁగవంటి ముక్కు గల యా లేమయొక్క నిట్టూర్పుగాలిసువాసనచే; అధరదంతపదమత్తాళి = పెదవియందలి దంతక్షతమను గండుతుమ్మెద; విరియన్ = చెదరిపోఁగా; [ఇచటను గంధఫలీ, మధుపములకుఁ బరస్పరవిరోధము సూచితము. ఆమెనాసిక సంపెఁగవలెను, అధరముపైఁగల పలునొక్కు తుమ్మెదవలెను ఉన్నవనుట.] కింకిణీక్వణన = చిఱుగజ్జెలధ్వనిచే; శంకిత = సందేహింపఁబడిన; గర్జిత = ఉఱుముకల; ప్రస్తకాంచి= జాఱుచున్న మొలనూలు గలదియుఁ; చంచలగతి, యంచ = చలించునడకయనుహంస; జడియన్ = బెదరఁగా: [హంసకును, వర్షర్తువునకును పరస్పరవిరోధము ప్రసిద్ధము. ఇచట మొలనూలిగజ్జెలధ్వని యుఱుమువలెను, ఆమెనడక హంసనడకవలెను ఉన్నదని భావము.] బంధనిర్ముక్తశుకసక్తభావ = పంజరమునుండి విడివడిన చిలుకపయి లగ్నమయిన మనస్సుకలది-(హరిదాసి); సంసారబంధమునుండి విముక్తుఁడయిన (మోక్షార్థియైన) శుకునియెడ లగ్నమగు మనస్సుకలది; పరాశరసుతుఁడు=శుకుఁడు; చందము= రీతిని; అధిగమించు = పొందునట్టి; మించుననబోఁడిచందంబు = సుకుమారము, ప్రకాశమానమునగు దేహముగల యా హరిదాసిరీతి. అలం. రూపకము, ఉపమ, శ్లేష.

తే. కక్కసపువంకగోరులఁ ద్రొక్కి త్రొక్కి, కఱకుముక్కున నందందఁ [4]గఱచి కఱచి
పూసయొకటియుఁ [5]బోఁగునఁ బొందనీక, చెరిపెముత్యాలపేరు విచ్చికపుఁబులుఁగు.

టీక. కక్కసపువంకగోరులన్ = కఱకైన వంకరగోళ్లచే; పోఁగునన్ = సూత్రమునందు; పొందనీక = నిలువనీయక; విచ్చికపుఁబులుఁగు = చెడ్డపక్షియైన చిలుక; చెరిపెన్ = పాడుచేసెను.

క. బహువిధరచనోజ్జ్వలమగు, మహిళామణిమణిసరంబుమణు లన్నియు న
య్యహిశయను సదనశరధికి, నహీనరత్నాకరత్వ మనుసంధించెన్. 240

టీక. బహువిధరచనోజ్జ్వలము = పెక్కువిధములగు కూర్పులచే ప్రకాశించుచున్నది; మహిళామణిమణిసరంబుమణులు = ఆ స్త్రీరత్నముయొక్క మణిహారమునందలి మణులు; అహిశయను సదనశరధికిన్ = శేషతల్పుఁడగు విష్ణుని గృహమగు సముద్రమునకు; అహీనరత్నాకరత్వము=గొప్పదగు రత్నాకరమను పేరుపొందుటను; అనుసంధించెన్ = కలిగించెను - కూర్చెను.

---

1. చ. ధుర. 2. చ. ట. నడ. 3. చ. ట. నును. 4. చ. ట. నఱికి నఱికి. 5. చ. బొసఁగునఁ.

క. శుకమున కొదవె నయత్న, ప్రకటితమణిరంగవల్లిపరికల్పనకో
రకితసుకృతానుకృతి; దా,నికి మెచ్చెఁ బౌండరీక[1]నిలయుం డాత్మన్. 241

టీక. అయత్న......సుకృతి = అప్రయత్నముగా కూర్చిన ముత్యాలముగ్గులను కల్పించుటచే అంకురించిన పుణ్యసామ్యము; శుకమునకున్; ఒదవెన్ = కలిగెను; పౌండరీకనిలయుండు = పాండురంగక్షేత్రవాసి యగు విష్ణువు; మెచ్చెన్.

క. గిరికానుషక్తబుద్ధి న్పరిచరునింబోలు నొక్కపన్నగ మొకనాఁ
[2]డురవడి నెచ్చటనుండియొ, మురమర్దనుదివ్యభవనమున కేతెంచెన్. 242

టీక. గిరికానుషక్తబుద్ధిన్ = చిట్టెలుకయం దాసక్తమయిన బుద్ధియందు (ఇది పాముపక్షమున నర్థము. ఉపరిచరవసువిషయమున - గిరికాదేవియందు లగ్నమయిన బుద్ధిని గ్రహింపవలెను.) పన్నగము = పాము; ఉరవడిన్ = వేగముగా; మురమర్దనుదివ్యభవనమునకున్ = విష్ణుని దేవాలయమునకు; ఏతెంచెన్. అలం. శ్లేషము, ఉపమ.

వ. ఆసమయంబున, 243

క. యమదండచండమగు భుజ,గమునకు వెఱచఱచి యాఖుకన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గురుభీ,తమతికి నాముక్తమాల్యదకు నెన యగుచున్. 244

టీక. ఆఖుకన్యక = ఎలుకపిల్ల; యమదండచండము, అగు = యముని చేతికఱ్ఱవలె భయంకరమగు; భుజగమునకున్ = పామునకు; వెఱచఱచి = భయపడి; గురుభీతమతికిన్ = గురువువలన భయముపొందిన మనస్సు కలదానికి; ఆముక్తమాల్యదకున్ = విష్ణుచిత్తుని కుమార్తెయగు గోదాదేవికి; ఎన, యగుచున్ = సాటియగుచు; కమలారమణాంఘ్రిన్ = విష్ణునిపాదములను; చేరెన్.

[ఇచట ఆముక్తమాల్యదతోడి సామ్యముకొఱకు ఎలుకపిల్ల యనుటకు ఆఖుకన్యక యని గ్రహింపఁబడినది. తనతండ్రియగు పెరియాళ్వారు విష్ణులగ్నమానస యగు తన్ను మానవున కిచ్చి, పెండ్లిచేయు నేమో యను భయముచే ఆండాళ్లమ్మ భగవంతుని ధ్యానించి, తపమొనరించి యతనిపాదములనే ఆశ్రయించెనను విషయ మిట అనుసంధేయము.] అలం. ఉపమ.

క. హరిపదపీఠస్థితి గల, సరియను [3]జిట్టెలుక దాఁగె సంవర్తహతిన్
వెరలి మృకండూద్భవుఁ డా,తురతం దజ్జఠరపేటి దూరినభాతిన్. 245

టీక. హరిపదపీఠస్థితి = విష్ణుని పాదపీఠమున నెలకొనినది; సరియను = సందునందు; సంవర్తహతిన్ = ప్రళయకాలపు దెబ్బచే; వెరలి = ఎగిరి; ఆతురతన్ = ఆప్యాయముతో; తజ్జఠరపేటిన్ = పెట్టెవలె భద్రమయిన ఆ విష్ణుని కుక్షియందు; దూరినభాతిన్ = ప్రవేశించినట్లు.

[మృకండూద్భవుఁడు (మార్కండేయుఁడు) నిత్యజీవియగుటచే ప్రళయకాలమునఁ దక్కిన జీవులతోఁబాటు నశింపక, విష్ణుని కుక్షిలో దూరి సుఖముగా నుండెనను గాథ నిట గ్రహింపనగును. అలం. ఉపమ.

ఆ. వీడిపడినగాజు వెదకంగ వెదకంగ, బద్మరాగ మొదవుపగిది నహికి
దొఱకె నెలుకదూఱి తొలఁగినతఱి రమా,[4]కమనచరణకైతకప్రసవము. 246

టీక. గాజు = కాచమును; పద్మరాగము = కెంపు; ఒదవుపగిదిన్ = లభించినరీతిని; అహికిన్ = పామునకు; తొలఁగినతఱిన్ = తప్పించుకొన్న సమయమున; రమా......ప్రసవము = విష్ణుని పాదములపై నున్న గేదంగిపూవు; దొరకెన్. అలం. ఉపమ.

---

1. చ. యుండుబాత్మన్. చ. దురుపడి. 3. క. చిట్టెలుక. 4. చ. రమణ.

చ. చరణసరోరుహప్రసవశైవలినీనివసద్బిసాంకురా
హరణమనీషఁ జేరిన బిసాశనశాబము రీతిఁ బొల్చు సా
గరశయపూజనాచరణకైతకకోరకముఁ భజించె మ
త్కరవరకంకణంబు మిహికాఘృణి రాహువు గప్పునొప్పునన్. 247

టీక. చరణ......మనీషన్ - చరణసరోరుహ = పద్మములవంటి పాదములపైనున్న - లేదా - పాదములనెడుగల పద్మరూపమగు ప్రసవ = పూవులనెడి; శైవలినీ = నదియందు; నివసత్ = ఉన్న; బిసాంకుర = తామరతూండ్లను; ఆహరణ = తీసికొనుటయందలి; మనీషన్ = కోరికతో; బిసాశనశాబ మురీతిన్ = చిన్నహంసమో యనునట్లు; పొల్చు = ప్రకాశించు; సాగరశయపూజనాచరణకైతక కోరకమున్ = విష్ణునిపూజకొఱకు కుంచఁబడిన గేదంగిని; మత్కరవరకంకణంబు = నా(శివునియొక్క) చేతికంకణమైన పాము; మిహికాఘృణిన్ = మంచు కిరణములందుఁగల చంద్రుని; ['మిహికాఘృణిన్ = మంచువెలుఁగును - చంద్రుని' అని పూర్వటీక.] భజించెన్ = గ్రహించెను. [ఇచట మొగలిపూవు హంసగా ఉత్ప్రేక్షింపఁబడినది. చంద్రుని రాహువు కప్పినట్లు పాము ఆ మొగలిపూవు నాక్రమించిన దని ఉపమ.] అలం. ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము.

తే. మధురమదిరారసామోదమైత్రి నలరు, పొలఁతి నెమ్మోమువలపాను భోగిఁబోలె
హరిపదాబ్జమధూళిమ[1]యంబుఁ గ్రోలె, జాతిగేదంగితావి భుజంగభర్త. 248

టీక. మధురమదిరారసామోదమైత్రిన్ = మధురమైన మద్యముయొక్క రసముయొక్క పరిమళముతోడి కూడికచే; అలరు = ప్రకాశించునట్టి; సుదతినెమ్మోమువలపు = ప్రియురాలియొక్క ముఖపరిమళమును; అను = వాసనచూచుచు; భోగిఁబోలెన్ = విలాసపురుషునివలెనే; హరిపదాబ్జమధూళిమయంబు = శ్రీవిష్ణుపాదపద్మములందలి తేనెతోఁగూడినదైన; జాతిగేదంగితావిన్ = మేలి మొగలిపూవుపరిమళమును; భుజంగభర్త = సర్పరాజు; క్రోలెన్. అలం. ఉపమ.

క. అలరు నల రుచిరమత్కుండలముపయిన్ నిలిపె నవ్యనఖరపదము[2]లై
యలరు నిజకంటకక్షత,విలసన[3]ముల విటునిమేన వేశ్యయుఁబోలెన్. 249

టీక. అలరున్ = ఆ మొగలిపూవునూడ; అల, రుచిరమత్కుండలముపయిన్ = ప్రసిద్ధమగు (ఆ) నా కుండలముగా ఉండు పాముపయిని; నవ్యనఖరపదములై, అలరు=క్రొత్తగా చేయఁబడిన గోటి నొక్కులుగా ప్రకాశించునట్టి; నిజకంటకక్షతవిలసనములన్ = తన ముండ్లగీఱలయొక్క విలాసములను; నిలిపెన్ = ఉంచెను.

[ఆ మొగలిపూవును పాము భజించుటచే ఆపూవుముండ్లు దానికి తగిలి, గాయములుకాఁగా - అవి నఖక్షతములవలెనున్నవని భావము. విటునిమేనిపయి వేశ్య నఖక్షతముల నుంచినట్లు మొగలిఱేకు పాము పయిగీఱలను ఏర్పఱచెనని భావము.] అలం. ఉపమ.

సీ. సరసిజాకల్యాణ సమయార్హ్యజతులక్ష్మి గలిగించుఁ బదనఖాగ్రమునఁ దవిలి
దళుకొత్తుమిన్నేటి తెలినీటిదెసలున ముదురుచెందొవచాలు [4]మొలవఁబెట్ట
సీమంతసీమాంతసిందూరరుచిఁ జేయు మ్రొక్కు లేవని సతుశ్శ్రీతిసతులకు
బీరరూపంబునఁ [5]బెట్టి పెట్టిన శేషఫణరత్నఘృణులకుఁ బ్రాఁకువెట్టుఁ

1. చ. యందు. 2. క. పైనలరు. చ. ట. పైనలరు. 3. క. మును. చ. ట. మున. 4. చ. ట. మొలువ. 5. క. పెట్టినశేషని. క. ర. పెట్టెపెట్టినశేషు.

తే. [1]కైటభాంతకపూజనాకైతకప్రసవనవామోదపారణాసౌఖ్యముదిత
భుజగరాజస్ఫటాభోగభూరిమణిసమాజరాజత్ప్రభాపుంజమంజిమములు. 250

టీక. కైటభాం......మంజిమములు - కైటభాంతక = కైటభాసురుని చంపిన - శ్రీకృష్ణుని యొక్క; పూజనా = పూజకొఱకైన; కైతకప్రసవ = గేదంగిపూవుయొక్క; నవామోదపారణాసౌఖ్యముదిత = క్రొత్తదైన పరిమళమును భుజించుటవలని సౌఖ్యముచే సంతోషించిన; భుజగరాజ = సర్పరాజముయొక్క; స్ఫటాభోగ = విశాలమగు పడగయందలి; భూరి = గొప్పవైన; మణిసమాజ = మణులగుంపులయొక్క; రాజత్ = ప్రకాశించుచున్న; ప్రభామంజిమములు = కాంతులయొక్క మనోజ్ఞతలు; పదనఖాగ్రమునన్ = పాదముల గోళ్లచివఱ; తవిలి = లగ్నమయి; సరసిజాక్షక్యాణజతులక్ష్మిన్ = కమలినితోడి వివాహమునకైన పారాణియొక్క శోభను; కలిగించున్; కుఱకొత్తు = ప్రకాశించునట్టి; మిన్నేటితెలినీటితెమలునన్ = ఆకాశగంగయొక్క స్వచ్ఛజలప్రవాహమున; ['తెమలునన్ = చలనమునందు' అని పూర్వటీక.] ముదురుచెందొవచాలు=గాఢమైన ఎఱ్ఱకలువల వరుసను; మొలవఁబెట్టున్ = మొలచునట్లు చేయును; మ్రొక్కి; లేపని = లేవక యట్లే వంగియున్న; చతుశ్శ్రుతిసతులకున్ = నాలుగు వేదము లను స్త్రీలకు; సీమంతసీమాంతసిందూరరుచిన్ = పాపటచివఱిభాగమునందు సిందూరముయొక్క తేజమును; చేయున్; పీఠరూపంబునన్ = కూరుచుండు ఆసనమురీతిని; పెట్టె వెట్టిన = చుట్టచుట్టుకొనిన; శేషునిఫణరత్నఘృణులకున్ = ఆదిశేషుని పడగయందలి రత్నమణుల కాంతులకు; ప్రాఁకువెట్టున్ = (తీగలకుఁబెట్టు) దన్నుకఱ్ఱగా నుండును.

విష్ణుని పాదపీఠమును చేరిన పాముయొక్క పడగయందలి మణిసమూహపుటెఱ్ఱని కాంతులు విష్ణుని కాలిగోళ్లపై వ్యాపించి కాళ్లకుఁబెట్టు లత్తుకయొక్క శోభను, అచటి గంగయందు వ్యాపించి, ఎఱ్ఱకలువల శోభను, వేదకాంతల పాపటలయందు సిందూరపుశోభను, పీఠమగు శేషుని పడగయందలి మణుల కాంతులకు దన్నుపెట్టుకఱ్ఱలశోభను గల్గి ఉన్నవని భావము.] అలం. ఉపమ, రూపకము.

క. [2]వ్యాపించి తిమిరహారమై, దీపించు నిజోత్తమాంగదివ్యమణిరుచిన్
దీపావళి హరి కిచ్చుచు, నా పుణ్యఫలానుభవము నయ్యహి గనియెన్. 251

టీక. అయ్యహి = ఆ పాము; తిమిరహారమై = చీఁకటిని పోఁగొట్టునదై; దీపించు = ప్రకాశించునట్టి; నిజోత్తమాంగదివ్యమణిరుచిన్ = తన పడగపైనున్న గొప్ప మణుల కాంతిచేత; హరికిన్; దీపావళిన్, ఇచ్చుచున్; ఆ పుణ్యఫలానుభవమున్ = హరికి దీపారాధనము చేయుటవలనఁ గలిగిన పుణ్యముయొక్క అనుభవమును; కనియెన్ = పొందెను.

క. ఆ తఱి నొకకందువ న,వ్వాతాశనశయను కేళివనవసుమతినుం
డేతెంచెన్ సరఘా సం,ఘాతము తమపెరకుఁ గడు విఘాతం బగుటన్. 252

టీక. ఆ తఱిన్ = ఆ తఱువాత; ఒకకందువన్ = ఒక మాఱుమూలను; ఆ వ్వాతాశనశయను = ఆ శేషతల్పుఁడగు శ్రీకృష్ణునియొక్క; కేళివనవసుమతినుండి = ఉద్యానవనమునుండి; సరఘాసంఘము = తేనెటీఁగలగుంపు; తమపెరకున్ = తమ తేనెతెట్టెకు; కడున్, విఘాతంబు, అగుటన్ = గొప్ప అపాయము కలుగుటచే; ఏతెంచెన్. ['వసుమతినుండేతెంచెన్' అని ఇకారసంధి యాదృచ్ఛికము.]

క. కాయద్యుతి జిడ్డుకొనఁగ, నా యీఁగలమొత్త మాక్రాంతాఖిలదిశమై
యాయెడఁ [3]దైలకటాహ,న్యాయం బొనరించె జలధరాధ్వంబునకున్. 253

టీక. ఆ యీఁగలమొత్తము = ఆ తేగెటీఁగలగుంపు; కాయద్యుతి = దేహకాంతి; జిడ్డుకొనఁగన్ = మెఱుఁగుఁదేఱఁగా; ఆక్రాంతాఖిలదిశమై = ఆక్రమింపఁబడిన సమస్తదిక్కులును కలదయి-

1. క. కైట. 2. క. వ్యాపించు. చ. ట. వ్యాపించి. 3. క. తటాక. చ. కటాహ.

అన్నిదిక్కులకు వ్యాపించినదయి; ఆ యెడన్ = ఆచోట; జలధరాధ్వంబునకున్ = ఆకాశమునకు; తైలకటాహన్యాయంబు, ఒనరించెన్=తైలకటాహన్యాయము కలదగునట్లుచేసెను. ఒక పెద్దపాత్రలోని నీటిపై ఒక తైలబిందువు పడినయెడల అది కొలఁదికాలమున ఆ పాత్రము నీటి పైభాగమునంతటిని ఆక్రమించుట తైలకటాహన్యాయము. ఆరీతినే యిచట తేనెటీఁగల మొత్తము గగనమంతయు వ్యాపించె నని భావము.

శా. [1]ఆమండోద్భవబీజమండరుచి పర్యాటించుచున్ మక్షికా
స్తోమం బాతతపక్షగుచ్ఛ మగుచున్ దోతేరఁగా శ్మశ్రులం
బై మిన్నొప్పు దదంగసంగతి ; మధువ్యామోహముం జేయుఁ దో
డ్తో మర్త్యాళికిఁ దద్విహారకలితద్రుస్కంధవీరుచ్ఛిఖల్. 254

టీక. మక్షికాస్తోమంబు = తేనెటీఁగలగుంపు; ఆమండోద్భవబీజమండరుచిన్ = ఆముదపు విత్తుల సమూహపుకాంతిని; ['ఆముదాలరాశివిధమును' అను పూర్వటీక అసంగతము.] పర్యాటించుచున్ = పరిహసించుచు - తిరస్కరించుచు; ఆతతపక్షగుచ్ఛము, అగుచున్=విశాలములగు ఱెక్కలు కలదయి; తోతేరఁగాన్ = రాఁగా; తదంగసంగతిన్=వానిదేహముయొక్క సంపర్కముచే. ['తోతేరఁగాన్ = తోఁచేఁగా' అని పూర్వటీక.] శ్మశ్రులంబై = దట్టమైనదై; ['శ్మశ్రులంబు = గడ్డము, మీసములు గలది' అని పూర్వటీక. అది అసంగతము.] మిన్ను = ఆకాశము; ఒప్పున్ = ప్రకాశించును. తద్విహార......వీరుచ్ఛిఖల్ = ఆ తేనెటీఁగల విహారములోఁ గూడిన (అవి విహరించిన) చెట్టు మొదళ్లను, లేఁగొమ్మలకొనలును; ['చెట్టుమొదళ్లయందలి చిగురుఁగొమ్మలకొనలు' అని పూర్వటీక.] తోడ్తోన్ = వెంటనే; మర్త్యాళికిన్ = మానవుల సమూహమునకు; మధువ్యామోహమున్ = తేనె (గ్రహించుట)యందలి యాసక్తిని; చేయున్.

[తేనెటీఁగలు గగనమున వ్యాపించుటచే వాని కాంతిచే ఆకాశము దట్టమై యున్నదనియు, ఆ యీఁగలు విడిచిన చెట్లమొదళ్లను, కొమ్మలును జనులకు తేనెను గ్రహించుటయందు కోరికను కలిగించుచున్నవనియు భావము.] అలం. ఉపమ.

క. ఆ మధుమక్షికలఁట [2]చని, దామోదరమందిరాగ్రతలగతనిర్మా
ల్యామోద మేదురమధు,ప్రేమాకులబుద్ధిమైఁ జరింపఁగ సంతన్. 255

టీక. ఆ మధుమక్షికలు = ఆ తేనెటీఁగలు; దామోదర......బుద్ధిమైన్ = శ్రీవిష్ణుని దేవాలయముముందుండిన నిర్మాల్యమగు పుష్పములందలి కమ్మని వాసన గల తేనెను గ్రహించుటయందలి కోరికతో; చరింపఁగన్ = తిరుగఁగా.

క. అందు నొక సరఘ గ్రోలె ముకుందపదార్ఘ్యంబుబిందుగుంభితసుమనో
మందమకరందశీకర,మ్ముం దీర్థస్వార్థముల్ సమున్నతి వెలయన్. 256

టీక. సరఘ = తేనెటీఁగ; తీర్థస్వార్థముల్ = దేవుని ప్రసాదమును, స్వప్రయోజనమును; సమున్నతిన్ = గొప్పదనమును; వెలయన్ = ప్రకాశింపఁగా. ముకుంద......శీకరమున్-ముకుంద= విష్ణువుయొక్క; పాదార్ఘ్యంబు = పాదోదకముయొక్క; బిందు = బిందువులచే; గుంభిత = కూర్పఁబడిన; సుమనః =పూలయందలి; అమందమకరందశీకరమున్ = ఎక్కువైన తేనెబిందువులను; గ్రోలెన్= త్రాగెను.[విష్ణువుయొక్క పాద్యమగు జలముతోఁగూడిన పూజార్థపుష్పములమకరందబిందువులను ఆ తేనెటీఁగ త్రాగుటచే దానికి తీర్థ, స్వార్థములు రెండును ఫలించినవని భావము. దేవుని పాదతీర్థపానముచే ముక్తిప్రదమగు తీర్థఫలము లభించినది ; దానియందు మిశ్రితమగు మధువును త్రాగుటవలన క్షున్నివృత్తిరూపమగు స్వార్థమును ఫలించినది.]

1. ట. ఆమండూ. 2. క. ఁజని. చ. ట. చని.

క. కలిగె మధుమతీకమునకుఁ, [1]దలఁపనితలఁ పస్మదాదిధార్యము గంగా
జలవలమానము యదుకుల,తిలకాంఘ్రి సరోజదివ్యతీర్థము గ్రోలన్. 257

టీక. తలఁపనితలఁపు = అనుకోనకుండ తటస్థించినరీతి; మధుమతీకమునకున్ = తేనె టీఁగకు; అస్మదాదిధార్యము = మావంటివారిచే (తలపయి) ధరింపఁదగినది; గంగాజలవలమానము = గంగాజలమును పొందుచున్నది; [విష్ణుపాదతీర్థము శివునికి శిరోధార్యమగుటచే; అది శివునితలపైఁగల గంగయందు కలియునని అభిప్రాయము.] యదు......తీర్థమున్ = శ్రీకృష్ణుని పాదపద్మములు కడిగిన దివ్యతీర్థము; గ్రోలన్, కలిగెన్. అలం. ఉపమ, పరికరము.

ఆ. దాన సంభవించెఁ దేనియయోఁగకు, సోమపానరతుల సుకృతఫలము
భాగ్య మొదవెనేనిఁ బ్రాపించుఁ దనుఁదాన, పుణ్యలక్ష్మి నిధియుఁబోలెఁ బురుషు.

టీక. దానన్=ఆ పానమువలన; సోమపానరతులసుకృతఫలము = యజ్ఞములు చేసి, సోమ పానము చేసిన సోమయాజులకుఁ గల్గు పుణ్యఫలము; నిధియుఁబోలెన్ = పెన్నిధివలె; భాగ్యము ఒదవెనేనిన్ = అదృష్టము ఉన్నయెడల; పురుషున్; పుణ్యలక్ష్మి; తనుదాన=తనంతతానే; ప్రాపించున్= పొందున్. అలం. వికస్వరము.

సీ. జనియించె నే సాధ్వి జాతిస్మరత్వసంపదకల్మి నిజకులాభరణ మగుచు
వర్తించె నే పతివ్రత తాటిమీఁదటి తపమైనతనువునఁ దాల్మి [2]మిగిలి
నెలకొల్పె నే యపాంసుల మానసమునందుఁ బరమవైష్ణవధర్మపాటవంబు
మెప్పించె నే సతి యప్పౌండరీకతీర్థవిభు నిష్టాన్నవిశ్రాణనమున

తే. నా సుశీలకు నక్కాకహంస [3]చిత్ర
శుకభుజంగమసరఘులు సుకథ సులభ
సుముఖ సువ్రత సుకృతినామములు వరుసఁ
దాల్చి జనియించె శుక్తి ముత్యాలువోలె. 259

టీక. ఏ సాధ్వి = ఏ యోగ్యురాలు; జాతిస్మరత్వసంపదకల్మిన్ = పూర్వజన్మజ్ఞానసంపద యుండుటచేత; నిజకులాభరణము = తనవంశమునకు నగయైనది; తాటిమీఁదటి తపమైన, తనువునన్= తాటిప్రమాణమైన (మిక్కిలి ఉన్నతమైన) తపస్సు చేసిన దేహమున; తాల్మి, మిగిలి = ఎక్కువ స్థైర్యము కలిగి; వర్తించెన్ = ప్రవర్తించెనో; అపాంసుల = ఉత్తమురాలు; పరమవైష్ణవధర్మపాట వంబు = విష్ణుసంబంధములగు గొప్ప ఆచారములందు నేర్పును; నెలకొల్పెన్ = సంపాదించెనో; అప్పౌండరీకతీర్థవిభున్ = పాండురంగక్షేత్రపాలకుఁడగు ఆ శ్రీకృష్ణుని; ఇష్టాన్నవిశ్రాణనమునన్ = కోరిన అన్నము నిచ్చుటవలన; శుక్తిన్ = ముత్యపుఁజిప్పయందు. అలం. ఉదాత్తము, క్రమము, ఉపమ.

ఉ. [4]కేసరిశాబశోభిగుహాకీర్తియు భానుమదంశువిస్ఫుర
ద్వాసరలక్ష్మివైభవము వారిధిలగ్నసమగ్రవేల యు
ల్లాసముఁ దాల్చి యొప్పె మహిళాతిలకంబు పతిప్రసాద వి
న్యాసముచేతఁ జేకుఱిన నందను లేవురు నందమందఁగన్. 260

టీక. పతిప్రసాద విన్యాసముచేతన్ = భర్త అనుగ్రహముంచుటచేత; చేకుఱిన = కలిగి నట్టి; నందనులు, ఏవురున్ = ఐదుగురు పుత్రులును; మహిళాతిలకంబు = ఉత్తమవనిత యగు నా

1. చ. దలఁచని. 2. చ. యుంచి. 3. చ. తీర్థ. 4. చ. లో నీపద్యములేదు.

సుశీల; కేసరిశాబశోభిగుహాకీర్తియుక్ = సింహపుఁబిల్లలచే-(అట్టి గొప్పపుత్త్రులచే) శోభించు గుహయొక్క కాంతిని (గొప్పతనమును); ['శాబశోభి = సింహపుఁబిల్లవలెఁ (స్వచ్ఛముగా) ప్రకాశించునట్టి'అని పూర్వటీక.] [ఆమెకుమారులు సింహపుఁబిల్లలవలెను, ఆమె గుహవలె నున్నారని భావము.] భాను......వమున్ =సూర్యుని కిరణములచే ప్రకాశించు పగటిశోభను; [పుత్రులు సూర్యకిరణములవలెను, సుశీల వాసరలక్ష్మివలెను ఉన్నారనుట.] వారిధి......ల్లాసమున్ = సముద్రములతోఁ గూడిన భూమియొక్క సంతోషము (వికాసము)ను; తాల్చి = ధరించి; ఒప్పెన్. [పుత్రులు సముద్రములవలెను, ఆమె భూమివలెను ఉన్నట్లు పోల్పఁబడినది.]

క. గోమునఁ బెరుగుచు [1]ముయ్యాఁడై మెలఁగుచు గర్భవైష్ణవాగ్రేసరులౌ
నా ముద్దు[2]కొమరులం గని, కామిని దీపించె [3]దొండ కాచిన[4]భంగిన్. 261

టీక. గోమునన్ = ముద్దుగా; ముయ్యాఁడై=అందమై - (మూఁడవ యీఁడు-జవ్వనము కలిగి) యున్నవారై; కలిగి గర్భవైష్ణవాగ్రేసరులౌ = పుట్టుకతోనే విష్ణుభక్తాగ్రగణ్యులయియున్న; కామిని = స్త్రీ - సుశీల; దీపించెన్ = ప్రకాశించెను. అలం. ఉపమ.

క. భూలేఖకులుల కేయే,కాలంబున నెట్టియెట్టి కర్మ మొనర్పం
బోలుం దత్తత్ కృత్యము,లోలిం బితృకృతములయి గుణోన్నతిఁ బెనుపన్. 262

టీక. భూలేఖకులులకున్ = బ్రాహ్మణకులమునఁ బుట్టినవారికి - విప్రులకు; తత్తత్ కృత్యములు = ఆ యా సంస్కారములు; ఓలిన్ = క్రమముగా; పితృకృతములయి = తండ్రిచే చేయఁబడినవై.

శా. శాణోత్తేజితరత్నలక్ష్మి గురుశిక్షావత్కిశోరాకృతిన్
రేణుక్షాళనశాలిమూర్తికలభశ్రీ దోహదోద్యన్నవ
క్షోణీజప్రభ ముక్తకంచుకఫణిస్ఫూర్తిన్ సుధీబాంధవ
శ్రేణిప్రీణనకారణోజ్జ్వలకళోత్సేకాఢ్యులై రేవురున్. 263

టీక. ఏవురున్ = ఆ అయిదుగురు పుత్రులును; శాణోత్తేజితరత్నలక్ష్మిన్ = సానపట్టిన మాణిక్యముయొక్క శోభతోను; గురుశిక్షావత్కిశోరాకృతిన్ = గురువుచే విద్యగఱుపఁబడిన బాలురరీతిని; రేణుక్షాళనశాలిమూర్తికలభశ్రీన్ = (శరీరముపై వ్యాపించిన) దుమ్ము కడుగఁబడుటచే (స్వచ్ఛమైన) దేహములు కల గున్నయేనుఁగులవలెను; దోహదోద్యన్నవక్షోణీజప్రభన్ = దోహదము లిచ్చుటచే క్రొత్తగా అంకురించి వృద్ధిపొందిన చెట్లవలెను; ముక్తకంచుకఫణిస్ఫూర్తిన్ = కుబుసము (పొర) విడిచిన పాములపోలికలను; సుధీ......కాఢ్యులు = విద్వాంసులయు, బంధువులయు సమూహమును తృప్తిపఱచుట కగు కారణములైన గొప్ప కళలచేత అతిశయించువారు; ఐరి. అలం. మాలోపమ.

చ. ఒకఁడు నిరూఢకృష్ణరుచి; యొక్కఁడు నిర్మలమానసప్రియుం
డొకఁడు ప్రయత్నయోగ్యఫలుఁ; డొక్కఁ డనాదృతబంధకంచుకుం
డొకఁడు రసానుకూలమతియుక్తుఁడు నై విలసిల్లి [5]రింతిపు
త్త్రకు; [6]లిల నెట్టివారలకుఁ దప్పని తొల్లిటిజన్మవాసనల్. 264

టీక. ఇంతిపుత్త్రకులు = ఆ సుశీలయొక్క ఐదుగురు కుమారులును; ఒకఁడు, నిరూఢకృష్ణరుచి= ఒకఁడు గాఢమై (కృష్ణునివలె) నల్లని కాంతి కలవాఁడు, గాఢమైన కృష్ణవిషయకమగు కోరిక (భక్తి) కలవాఁడును; [మఱియు కాకి ఈ కుమారుఁడుగ పుట్టినందున - ఆపక్షమున గాఢమైన నల్లని రంగు

1. చ. ముయ్యాడై. 2. చ. ట.గొమరు.3. క. దోడఁగాచిన. చ. దొండకాచిన. 4. క. భాతిన్. చ. భంగి. 5. క. రంత. క. అలరుల. చ. ట. రింతి. 6. క. లఁట. చ. ట. లిల.

కలుగు నా పక్షి సూచింపఁబడినది.] ఒక్కఁడు; నిర్మలమానసప్రియుండు=పరిశుద్ధమగు హంస (పరబ్రహ్మ రూపి)య గువాఁడు, తెల్లని రూపము కలవాఁడు, నిర్మలమగు మనస్సున ఇష్టపడువాడు (నిర్మలమగుమనస్సు కలవాడు),నిర్మలమగుమనస్సుకలవారికి ఇష్టుఁడైనవాఁడును; [హంస ఈ పుత్త్రుఁడుగా పుట్టుటయందు సూచితము.] ఒకఁడు; ప్రయత్నయోగ్యఫలుఁడు=(దేవునిఁగూర్చిన)తన యత్నమునకు తగిన ఫలము కల వాఁడు; [చిలుక ఈ కుమారుఁడుగా పుట్టుటచే ప్రయత్నమునను సరించి సంపాదింపఁబడిన వృక్షఫలము గల ఆ పక్షి యిట సూచింపఁబడినది.] ఒక్కఁడు; అనాదృతబంధకంచుకుండు = ఆదరింపఁబడని సంసార బంధమనెడి కవచముకలవాఁడు - [సంసారమున తగుల్కొనని వాఁడనుట. పాము ఈ రూపున పుట్టు టచే ఇష్టపడని బంధరూపమయిన కుబుసము (పొర) గల ఆ పాము సూచితము.] ఒకఁడు; రసానుకూల మతియుక్తుఁడును = భూమికి (భూమిమీఁది జనులకు అనుట) అనుకూలమగు ('ఉపకరించు') బుద్ధితోఁ గూడినవాఁడు, పరబ్రహ్మరూపమగు రసమును అనుభవింపఁదగిన బుద్ధితోఁగూడినవాఁడును. ['రసో వై సః' అని శ్రుతి.] [తేనెటీఁగయే యీ రూపున పుట్టుటచే రసమునందు (తేనెయందు) ఇష్టపడు బుద్ధితోఁ గూడిన ఆ మధుమక్షిక మిట సూచితము.] ఐ=అయి; విలసిల్లిరి = ప్రకాశించిరి; తొల్లిటిజన్మవాసనల్= పూర్వజన్మముల సంస్కారములు; ఎట్టివారలకున్ = ఎట్టి గొప్పవారికిని; తప్పునె. అలం. సమాసోక్తి, అర్థాంతరన్యాసము.

ఉ. లౌకికవైదికాచరణలాలసులై హరిభక్తి నుత్తమ
 శ్లోకులు వీ రసందగిరి; సూనృతలక్ష్మికిఁ బట్టుగొమ్మలై
 యేకడ సర్వభూతదయయే తమసొమ్ముగ దీనమానస
 వ్యాకులతాపనోదనధనాఢ్యులనన్ విలసిల్లి రేవురున్. 265

టీక. ఏవురున్ = ఆ యైదుగురును; లౌకిక, వైదికాచరణలాలసులై = లోకసంబంధములైన పనులను, వేదసంబంధకర్మలను చేయుటయం దాసక్తి కలవారై; హరిభక్తిన్ = విష్ణుభక్తియందు; ఉత్తమశ్లోకులు = గొప్పకీర్తి కలవారు; సూనృతలక్ష్మికిన్ = సత్యసంపదకు; పట్టుఁగొమ్మలై = ఆధా రములై; ఏకడన్ = ఎయ్యెడలను; సర్వభూతదయయే=సమస్తజీవులయెడలను కనికరమే; దీన..... నాఢ్యులు, అనన్ = దిక్కులేనివాని మనస్సులందలి కలఁతపాటును పోఁగొట్టు ధనికులు వీరే యను నట్లుగా; విలసిల్లిరి = ప్రకాశించిరి.

క. అత్తొలుకొల మలరులు*సర, మెత్తినక్రియఁ బాలుపొంగు [1]నెన వికసితమా
 నెత్తమ్మికొలనిచెలువున, దత్తత్సౌభాగ్య[2]ముల నుదాత్తం బయ్యెన్. 266

టీక. అత్తొలుకొలము = ఆ బ్రాహ్మణవంశము; అలరులు = పూవులు; సరమెత్తినక్రియన్ = మాలగా గ్రుచ్చినట్లును; పొంగునెనన్ = పొంగిన విధమునను; వికసితమా = వికసించియున్న; నెత్తమ్మి కొలనిచెలువునన్ = కమలాకరమువిధమునను; తత్తత్సౌభాగ్యములన్ = ఆ యా గొప్పతనములచే; ఉదాత్తంబు = హెచ్చినది - గౌరవము పొందినది.

[ఇందు 'పాలుపొంగునెనన్' అనుచో 'ఎసన్' అను పాఠము గ్రహింపఁబడి పూర్వటీకలో 'అతిశయముతో' అని అర్థము వ్రాయఁబడినది.] అలం. మాలోపమ.

తే. అఖిలకల్యాణగుణశీల యా సుశీల, పెట్టెఁ జేమీఁదుగా నెల్లచుట్టములకు
 భర్తతోఁగూడ ముత్తాటిపండు దినియె, నొత్తె [3]మునిమన్మగుట్టిల నెందతేని. 267

టీక. అఖిల కల్యాణగుణశీల = సమస్త శుభలక్షణములతో ఒప్పుచున్నట్టి; చేమీఁదుగాన్ = తనచేయి మీఁదుగా ఉండునట్లు, (ఇతరులకు దానముచేయునట్లనుట) తాను స్వయముగా; పెట్టెన్ =

* క. అలరుల. 1. చ. ట. నిన. 2. చ. ములు. 3. క. మున్మన్మ. చ. మునిమన్మ.

(విందుభోజనములను) పెట్టెను; భర్తతోఁగూడన్; ముత్తాటిపండు, తినియెన్ =[మూఁడు+తాటిపండ్లు] మూఁడుతరముల తాటిపండ్లను తినెను - అనఁగా భర్తతోఁగూడ పెక్కేండ్లు జీవించెను. [ఒకతాటి పండు తిని దానిలోని టెంకను పాతిపెట్టఁగా అది వృక్షమయి ఫలించును; ఆ పండు తిని దానివిత్తు నాటఁగా అది వృక్షమయి ఫలించును; ఈ రీతిని మూఁడు తరముల చెట్ల ఫలములను తినుటకు పెక్కేండ్లు జీవించి యుండవలెనని భావము; ముత్తాటిపండు తినియె' ననుటకు ఇదియే అభిప్రాయము.]

[పూర్వటీకాకారులు ఈ యర్థమును గ్రహింపక 'ముత్తయిదువతనమువలని ఫలము అనుభవించెను' అని వ్రాసిరి; అది తప్పు; ఆ యర్థమును గ్రహించునపుడు 'భర్తతోఁగూడ' అను దానికి సమన్వయ మెట్లో తెలియరాకున్నది. ఇంతకును ఆ పదసమూహమున కా యర్థము ఎట్లు వచ్చినదో దురూహ్యము.] మనిమన్మగఱ్ఱలన్ = మనుమలకుఁ గుమారులైన బిడ్డలను; ఎందఁజేసిన్ =పెక్కురను; ఎత్తెన్ = ఎత్తు కొనెను-పొందెనని భావము. అలం. పర్యాయోక్తము.

ఉ. ఆ నలినాయతాక్షి ప్రసవాపగమంబునఁ బండఁబాఱుచున్
ప్రాణవిభూపలాలనము ప్రాఁకుడుఁగొయ్యగ నిల్చి మన్మసం
తాన మొనర్చు ప్రోది జరదైన్యము [1]నాఁగ నతీతవర్ష ను
ద్యానలతౌషధిప్రవహాదంబుసమీపనిరూఢిఁ [2]బోలదే. 268

టీక. ఆ నళినాయతాక్షి = (తామరలవంటి విశాలములగు కన్నులు కల) ఆ సుశీలాదేవి; ప్రసవాపగమంబునన్ = కానుపులు ఉడిగిపోవుటచేత (అని స్త్రీపక్షమునను), పూవులు రాలిపోవుటచేత; (అని లతాపక్షమునను.) పండఁబాఱుచున్ =ముదుసలియగుచు; ఎండుటకు సిద్ధముగనుండి; ప్రాణవిభూప లాలనము = భర్తయొక్క బుజ్జగింపు; ప్రాఁకుడుకొయ్యగన్ = తీగ ప్రాఁకుటకు అనుకూలమగు కొయ్య కాఁగా; నిల్చి; మన్మసంతానము = మనుమలు, మునిమనుమలును; ఒనర్చు = చేయునట్టి; ప్రోది = రక్షణము; జర = ముసలితనమును; దైన్యము = అశక్తతయు; ఆఁగన్ = త్రోసివేయఁగా-పోఁగొట్టఁగా; అతీతవర్షన్ = పోయిన వర్షకాలము కల-వర్షములు లేనిదయిన; ఉద్యాన......నిరూఢిన్ = ఉద్యా నమునందలి లతలయొక్కయు, ఓషధులయొక్కయు; నీటిపాఱుదలసాన్నిధ్యమునకైన పెంపును; - [నీరు లేక వాడిపోయి పడుటకు సిద్ధముగనున్న ఉద్యానలతౌషధులకు నీటిసౌకర్యమునఁ గలిగిన నిలుకడను అని భావము.] పోలదే! = అనుకరింపదా! - దానికి తులతూఁగుననుట. అలం. శ్లిష్టరూపకము, ఉపమ.

క. సకలాగమజ్ఞ యగు వి, ప్రకులాంగన యొక్కనాఁడు పలుకు నిజకుమా
రకులఁ గని మును మదాలస, శుకతుల్యులఁ గూర్మిపుత్త్రులఁ బల్కుక్రియన్.

టీక. సకలాగమజ్ఞ = సమస్తధర్మములు తెలిసినది; విప్రకులాంగన = ఉత్తమబ్రాహ్మణి.

మదాలస కువలయాశ్వునిభార్య. విక్రాంత, సుబాహు, శత్రుమర్దన, అలర్కులు ఆమె కుమా రులు. ఆమె వారికి ధర్మతత్త్వమును, బ్రహ్మజ్ఞానమును బోధించెను.

మ. అనుభూతాఖిలభోగఁ బోషితసమస్తార్యం [3]గృతానేకకాం
చనముఖ్యోచితదాన దృష్టిగతయుష్మత్క్షేమ జీవత్పతిన్
జనతామాన్య నశీతివృద్ధ నను నీ సంసారదుర్వారబం
ధనిర్బంధమునందుఁ బాపుటకు యత్నం బింకఁ జేయందగున్. 270

టీక. అనుభూతాఖిలభోగన్ = అనుభవింపఁబడిన సమస్త సుఖములు కలదానిని; పోషితసమ స్తార్యన్ = పోషింపఁబడిన ఉత్తము లందఱును కలదానిని; కృతా.....దానన్ = చేయఁబడిన సువర్ణదానాదికములగు తగిన దానములు కలదానిని - స్వర్ణదానాది మహాదానములను చేసినదానిని;

1. చ. గాఁగ. 2. చ. జాలదే. 3. చ. తన్కృతిన్.

దృష్టిగతయుష్మత్ క్షేమన్ = కన్నులఁ బడిన మీ క్షేమములు కలదానిని- మీక్షేమమును కన్నులార చూచినదానిని; [ఇచట వెనుకటి టీకాకారులు 'దృష్టిగత'పదమును విడఁదీసి 'దృష్టిగతన్ = చూపును పొందినదానిని' అని అర్థము వ్రాయుట సరికాదు.] జీవత్పతిన్ = జీవించియున్న భర్తకలదానిని. ముత్తయిదువను; జనతామాన్యన్ = జనుల సమూహముచే గౌరవింపఁబడినదానిని; అశీతివృద్ధన్ = ఎనుఁబదియేండ్ల ముసలిదానిని; సంసార.....నందున్ = అడ్డుకొనరాని సంసార మను బంధముయొక్క నిర్బంధమునుండి; పావుటకున్ = తప్పించుటకు. అలం. పరికరము.

క. సభవజ్జనకంబుగఁ జని, ప్రభవజ్జగదండషండపరిపూర్ణతనున్
  శుభదాయిఁ బౌండరీక, ప్రభు నారాధించి కాంతుఁ బరమపదంబున్. 271

టీక. సభవజ్జనకంబుగన్ = మీతండ్రి గారితోఁగూడ; ప్రభవ.....తనున్ = పుట్టుచున్న బ్రహ్మాండగోళసమూహముతోడి నిండు దేహము కలవానిని - పొట్టలో బ్రహ్మాండముల నిమిడ్చినవానిని; శుభదాయిన్ = శుభముల నొసఁగువానిని; పౌండరీకప్రభున్ =పాండురంగదేవుని; పరమపదంబున్ = మోక్షమును; కాంతున్. అలం. పరికరము.

క. ఒకబుద్ధి వినుం డొండా, డక సకలాగమమతంబు [1]దక్కఁ దెలిసి మీ
  కకుటిలమతి నెఱిఁగింతు జ, నకసనకశుకాదు లెఱిఁగిన తెరువుఁ దెలియన్. 272

టీక. ఒండు, ఆడక = ఎదురు పలుకక; ఒక బుద్ధి = ఒక మంచిమాట; వినుండు; సకలాగమ మతంబున్ = సర్వవేదసిద్ధాంతములను; దక్కఁదెలిసి = అవగాహన చేసికొని - బోధపఱచుకొని; అకుటిల మతిన్ = తిన్నని దారిని - స్పష్టముగురీతిని; జనక, సనక, శుకాదులు = జనకుఁడు, సనకుఁడు, శుకుఁడు మొదలగు యోగులు; ఎఱిఁగిన; తెఱువున్ = మార్గమును; తెలియన్, ఎఱిఁగింతున్ = బోధపడునట్లు చెప్పెదను.

సీ. అమితభోగాయతనము దేహమనుసర్ప, ముగ్రకృత్యము లేల యుడిగియుండు?
  ధాతుమయంబు గాత్ర మనుధాత్రీధరం, బదియేల రాగంబు నవలఁ ద్రోయు?
  నిచితనానాగుణప్రచుర మీ తనువను [2]పట,మేల చిరుఁగక పదిల మొందు?
  నూర్మిపరంపరాయుత మంగమనువార్ధి యెడ, జీవనభ్రాంతి యేల యుడుగు?
ఆ. నార్జవంబు చాల దతికఠినాశయ, మెపుడు మైల విడువ దెందుఁ జివుకుఁ
  బటికిడొక్క దీనిఁ బాటింప రెవ్వాట, లక్షయేనియును ముముక్షుజనులు. 273

టీక. దేహము, అను, సర్పము; అమితభోగాయతనము = (శరీరపక్షము) ఎక్కువ సుఖ ముల కాకరమైనది - అమితసుఖములను కోరునది; (పాముపక్షము) పెద్ద పడగ కలది; ఉగ్ర కృత్యములు = క్రూరకార్యములు; ఏల ఉడిగియుండున్? = ఏల నశించి యుండును? నశింపవనుట; గాత్రము, అను, ధాత్రీధరంబు = శరీరము అను పర్వతము; ధాతుమయంబు = (శరీరపక్షమున) పంచభూతాత్మకము, (పర్వతపక్షమున) గైరికాది (జేగురు మొదలగు) ఖనిజములతోఁ గూడి నది; రాగంబును = (శ. ప) అనురాగమును, (పర్వత ప) ఎఱుపురంగును; ఏల, అవల, త్రోయున్? = ఏల విడుచును? విడువదని భావము. తనువు అను, పటము = దేహ మను వస్త్రము; విరచితనానాగుణ ప్రచురము=(శ. ప.) వ్యాపింపఁబడిన పెక్కు గుణములతో నిండినది, (వస్త్ర. ప.) ఎక్కువఁగా కూర్పఁ బడిన దారములతో నిండినది; చిరుగక = చినిఁగిపోక - నశింపక; ఏల పదిలము, ఒందున్? = ఎందులకు భద్రముగా ఉండును? ఊర్మిపరంపరాయుతము = (శ. ప.) జరామరణ-క్షుత్పిపాస - శోక, మోహము లను షడూర్ములతో కూడినది; (సముద్ర. ప.) అలలతోఁ గూడినది; అంగము, అను, వార్ధి యెడన్ =శరీర

1- చ. దక్క 2. క. ఫల.

మను సముద్రముపట్ల; జీవనభ్రాంతి=(శ. ప.) బ్రదుకునందలి భ్రమ, (సముద్ర. ప.) నీటియందలి తిరుగుడు-సుడి; ఉడుగుక్? =నశించును? ఆర్జవంబు = తిన్నఁదనము-ఋజుత్వగ ఉండుట (పాము త్రోవున అది వంకరగతినే ఉండును); అతికఠినాశయము = మిక్కిలి కఠినమగు చోటు కలది (పర్వతమగుట దీనికిఁ గారణము.) మైలక్, విడువదు = కలుషము విడిచిపెట్టదు. [వస్త్రమగుటచే మురికిగా ఉండుననుట.] ఎండుక్, చివ్వకక్ -(సముద్రమగుటచే నని భావము.) లక్షయేనియుఁక్ = 'లక్ష చెప్పినను సరే' అను లోకోక్తి. ముముక్షుజనులు = మోక్షము కోరువారు; దీనిక్ = ఈ దేహమును; పాటింపరు = లెక్కగొనరు - దీనిని అప్రరూపముగా చూచుకొనరని భావము. అలం. శ్లిష్టరూపకము, క్రమము.

ఉ. మాయయు జీవుఁడుం జెరసి[1] మైత్రి యొకానొకఁ డాచరించుచుం
బాయక యాఁడుఁబాటు మగపాటు పడన్ వివిధత్వ మొంది ప
ల్చా[2]యల పాంచభౌతికపుఁ బైరుదయించి తలిర్ప మ్రోడుగా
మేయు జరామయవ్యసన మృత్యునియుక్త కడంగరీయముల్. 274

టీక. చెరసి = చేరి - కలిసికొని; మైత్రి, ఒకానొకఁడు, ఆచరించుచుక్ = ఒకానొక - అనిర్వాచ్యమగు స్నేహమును పొందుచు; పాయక = విడువక - శ్రమపడి; ఆఁడుఁబాటు, మగపాటు, పడక్ = మగపనియు, ఆఁడుపనియు చేసికొనఁగా—[మాయ ఆఁడుపనిని, జీవుఁడు మగపనిని అనుట.] పాంచభౌతికపుఁబైరు = పృథివ్యాది పంచభూతముల పంట; వివిధత్వము, ఒంది = అనేకరూపములఁ దాల్చి; పల్చాయలక్ = పెక్కురకములుగా; ఉదయించి = పుట్టి; తలిర్పక్ = ప్రకాశింపఁగా; జరా......కడంగరీయముల్ = ముసలితనము, వ్యాధి, వ్యసనము, మృత్యువు అనువానిచే నియమింపఁబడిన పశువులు; మ్రోడుగాక్ = ఆ పంట మ్రోడగునట్లుగా; మేయుక్ = తినివేయును - వానిని నశింపఁజేయుననుట. [పంచభూతాత్మకమగు శరీరము మాయా జీవుల సంబంధమున పెరుఁగుచుండుననియు, జరాదులవలన ఆ దేహము క్షీణించి తుదకు నశించుననియు, అశాశ్వతమగు నట్టిదానిని నమ్మరాదనియు భావము.] అలం. రూపకము.

శా. అంతర్వాణికుశేశయద్యుమణిఁ బద్మాక్షున్ మదిన్నిల్పి దు
ర్దాంతానంతభవాంధకూపతరణప్రౌఢిన్ దృ[3]ఢస్థేమఁ బా
టింతుర్ పెద్దలు తద్ద నమ్మి; నుయి దాఁటేవానికిన్ జింతయా
కంతైనం గడమేనియుం గడమ గాదా యంచు నూహించుచున్. 275

టీక. పెద్దలు = విజ్ఞులు; తద్ద, నమ్మి = బాగుగా, నమ్మి; అంతర్వాణికుశేశయద్యుమణిక్ = విద్వాంసులు అను తామరపువ్వులకు సూర్యుఁడైనవానిని; పద్మాక్షుక్ = పద్మములవంటి కన్నులు కల విష్ణుని; మదిక్ = మనస్సులో; నిల్పి; దృఢస్థేమక్ = గట్టిపట్టుదలతో; దుర్దాంతా......ప్రౌఢిక్ = భయంకరమును, అంతము లేనిదియు నగు సంసారాంధకూపమును దాఁటు నేర్పును; పాటింతుర్ =లెక్కింతురు - గమనింతురు. నుయి, దాఁటేవానికిక్ = నూతి యీవలియొడ్డునుండి యావలియొడ్డునకు దాఁటువానికి; చింత......కడమేనియుక్ = చింతాకంత స్వల్పమైన మిగులు ఉన్నప్పటికిని; కడమ గాదా= కడమ, కడమేగదా యగును. అలం. రూపకము, లోకోక్తి.

క. తల ముచ్చుట్టులు దిరిగినఁ, [4]దలపోయఁగ నోరిలోనిదయ కడి యన్న
ట్లిల నే తెౕఁగులఁ దిరిగినఁ, గలుగదు గతి విష్ణుసేవ గావింపకయున్. 276

టీక. తలముచ్చుట్టులు=తలకు ముమ్మాఱు చుట్టివచ్చుటలు; తలపోయఁగక్ = ఆలోచింపఁగా; కడి = అన్నపుముద్ద; నోరిలోనిదయ = నోటిలోనిదే కదా - నోటిలోఁ పడవలసినదేకదా! [అన్నపుముద్ద

1. చ. ట. గలసి. 2. చ. ట. ల్వాయల. 3. చ. దుర. 4. క. తల. 5. శ. ర. తిరుగుల.

నోటిని విడిచి వేఱొకచోట పడుటకు తలను ముష్టాఱు తిరిగి వెదకినను దానికి నోరు తప్ప వేఱొక చోటు తగినది లభింపదుకదా! అని భావము.] అన్నట్లు = అనురీతిని; ఏతెఱఁగులన్, తిరిగినన్ = (వేఱు విధముల) నేరీతి తిరిగినను; గతి = మోక్షము. అలం. లోకోక్తి.

మ. పురుషశ్రేష్ఠులు కొంద ఱాత్మచరితంబుల్ జ్ఞానవైరాగ్యభా
స్వరముల్గా విహరించుచుం గురుకృపాసంపన్నులై సాధనాం
తరమంత్రాంతర [1]దైవతాంతరముల న్దర్కించి క్షీరోదక
స్ఫురణం బొప్ప ముకుందలీనతనులై పొంద[2]రుప్పునర్జన్మముల్. 277

టీక. పురుషశ్రేష్ఠులు = ఉత్తమ పురుషులు; ఆత్మచరితంబుల్ = తమప్రవర్తనలు; జ్ఞాన... స్వరముల్గాన్ = జ్ఞాన, వైరాగ్యముచేత ప్రకాశించునట్లుగా; విహరించుచున్ = తిరుగుచు; గురుకృపాసంపన్నులై = గురువుల దయను పొందినవారై; సాధనాం......రములన్ = వేర్వేఱుసాధనములను, వేర్వేఱు మంత్రములను, వేర్వేఱు దేవతలను; తర్కించి = విచారించి - విమర్శించి [అవి తమకు అననుకూలములని గమనించి.] క్షీరోదకస్ఫురణంబు, ఒప్పన్ = నీరక్షీరపద్ధతి ప్రకాశింపఁగా - పాలు, నీళ్లు ఒకదానిలో నొకటి కలసినట్లు కలియఁగా; ముకుందలీనతనులై = విష్ణువునందు ఐక్యము పొందినవారై; పునర్జన్మముల్, పొందర్ = మఱల పుట్టుకను పొందరు - ముక్తులగు వారికి తిరిగి జన్మము లేదనుట.

సీ. విషయాంకురము గిల్లివేయనివారికి, నినుపకచ్ఛడమున కెంతదవ్వు?
తెగఁ[3]గొని గసటు గడుగనివారికిని త్రిషవణంబునకు నెన్నిచాళ్ల[4]పట్టు?
చింతలన్నియు మ్రోడుసేయనివారికి, బోడయౌఁదలలకు [5]నేడకేడ?
యేను తత్త్వంబులు నెఱుఁగనివారికి, నెఱుకకు నేయూరి కేది తెరువు?
ఆ. తమమొగంబుఁ జూడు, తముజూడు; మేనుంగు, మీఁద నున్నవాని మేరమీఱి
నున్న మడుగఁ జూచుచున్నారు హరిభక్తి, గమ్యథామకాంక్షఁ గర్మపరులు.278

టీక. మోక్షమును పొందుటకు హరిభక్తియే ప్రధానకారణ మను సంగతిని గ్రహింపక కొందఱు తదర్థమై కర్మల నాచరించుచుందురు; అట్టి కర్మపరులు ఈ పద్యమున నిందింపఁబడిరి. విషయాంకురము = భోగేచ్ఛ యొక్క మొలకను; గిల్లివేయనివారికిన్ = చిక్కువేయనివారికి - నశింపఁజేయనివారికిని; ఇనుపకచ్ఛడములకున్ = బలమైన కౌపీనములకును; ఎంత, దవ్వు? = చాల దూరము. [ఎంత గట్టిగా బలమైన గోచులు బిగించుకొనినను, భోగేచ్ఛ అంకురించి యున్నంతవఱకును ప్రయోజనము లేదనుట. ఇట్లే మీఁదను గ్రాహ్యము.] తెగగొని = సాహసించి - పట్టుదలపూని; కసటు = మనోమాలిన్యము - ఎదలోని మురికిని; త్రిషవణంబునకును = ముప్పొద్దుల స్నానములకును; ఎన్నిచాళ్లపట్టు? = ఎన్ని వరుసలదూరము;? - మిక్కిలి దూర మనుట. చింతలు = విచారములను; అన్నియున్ = అన్నింటిని; మ్రోడుసేయనివారికిన్ = నశింపఁజేయనివారికిని; బోడయౌఁదలలకున్ = బోడితలలకును; ఏడకున్, ఏడ? = ఎక్కడి కెక్కడ? - కలయిక లేదనుట; ఏనుతత్త్వంబులన్ = ఐదు తత్త్వలను (పృథివ్యాది తత్త్వములను); ఎఱుకకున్ = జ్ఞానమునకును; ఏయూరికి, ఏది, తెరువు? = ఏయూరి కే మార్గము? - సంబంధము లేదనుట; తమ......చూడుము = వారి మొగములకు వారికీ మోక్షమెట్లుకలుగుననుట. ఏనుఁగుమీఁదన్, ఉన్నవానిని = ఉన్నతస్థితియందు - అందరానిస్థితియందు ఉన్నవానిని; మేరమీరి = హద్దు మీఱి-మర్యాద దక్కి; సున్నము, అడుగఁజూచుచున్నారు =

1. క. దేవ. చ. ట. దైవ. 2. చ. దన్పు న. 3. చ. తెగలోని 4. చ. ట. పెట్టు. 5. చ. ట. యేడ.

(ఉన్నతస్థితియందు ఉన్నవారిని అడుగవలసిన సంపదల నడుగక హేయమైన దానిని అడుగుట నీచము-మన్నమడుగుట నీచతనుసూచించును; హరిభక్తిగన్యు, ధామకాంక్షన్ = విష్ణుభక్తిచేతనే పొందఁదగిన మోక్షమునందలి కోరికతో.]

[అంకురములను గిల్లుట, కసటు కడుగుట, చింతలను ప్రోడుచేయుట వానివానికి తగినవి - ఇవి నాటినుడులు.] అలం. లోకోక్తి.

సీ. పరదారపరధనాహరణవైముఖ్యంబు, [1]వశవర్తిగావించువారు దక్క
బరగుణ పరమాణుపర్వతీకరణంబు, వ్రతముగాఁ బాటించువారుదక్కఁ
బరుఁడైనఁ గొడుకైన మరియాదచెడ సమ, త్వమున శిక్ష యొనర్చువారుదక్కఁ
బరమసంపదల నాపద్వేళ సత్యంబు, వదలక భాషించువారుదక్క

తే. దూర మగు కోర్కెఁ గోరనివారుదక్కఁ, గ్రూరకర్మంబు లుడివోవువారుదక్కఁ
బూరుషార్థపరతఁ గ్రాలు వారుదక్కఁ, దక్కువారెల్ల భవవహ్ని [2]దక్కువారు. 279

టీక. పర...వైముఖ్యంబు = పరుల స్త్రీలను, పరుల ధనములను హరించుట కిష్టములేకుండుటను; వశవర్తిఁగావించువారు, తక్కన్ = లొంగించుకొన్నవారు, కాక; [అట్టివారిని విడిచి - అనుట; ఇట్లు ముమ్ముందును.] పర......కరణంబు = ఇతరుల కొద్దిపాటిగుణములను కొండలంతలుగా చేయుట-ఇతరుల గుణములను కొనియాడుట; వ్రతము = తమ నియమము; పాటించువారు = లెక్కించువారు. పరుఁడైనన్ = ఇతరుఁడైనను; సమత్వమునన్ = సమానముగా - భేదము లేక; పరమసంపదలన్ = ఎక్కువ ఐశ్వర్య మున్నప్పుడును; ఆపద్వేళన్ = కష్టకాలమునందునుగూడ; దూరమగు = హద్దుమీరిన-అసాధ్యమైన; ఉడివోవువారు = విడుచువారు; పూరుషార్థపరతన్ = మోక్షమునందలి ఆసక్తిచే; క్రాలువారు = ప్రకాశించువారు; తక్కువారు, ఎల్లన్ = మిగిలినవారందఱును; భవవహ్నిన్, దక్కువారు = సంసారాగ్నిలోఁ బడువారు (అగుదురు.)

క. పలువేల్పులబడి నడవక, యిలువేలుపుగా భజింపుఁడీ మీారలు వి[3]
ట్టలు [4]శిక్యగదధిరసగం, ధిలకేశుం బౌండరీకతీర్థాధీశున్. 280

టీక. పలువేల్పులబడిన్ = పెక్కురు వేల్పుల మార్గమును - పెక్కుమంది దేవతలను కొలుచు పద్ధతిని; నడవక; మీారలు; శిక్యగ, దధి, రస, గంధిల కేశున్ = ఉట్టియందున్న పెరుగుచే సువాసనఁగల జుట్టు కలవానిని; ఇలువేలుపుగాన్ = ఇష్టదైవముగా; భజింపుఁడీ = సేవింపవలెను.

ఉ. మస్తకిరీటహాటకసముంచితకుంభయుతంబు పీవరో
[5]రస్తటరత్నదీప్తిరుచిరంబు రమా [6]సమసాలభంజికా
సక్తమునైన శార్ఙ్గితనుసౌధము నెక్కి సుఖించు బుద్ధికిన్
నిస్తులభక్తిగౌరవము నిచ్చెనయై చననిచ్చు మీాఁదికిన్. 281

టీక. మస్త......యుతంబు = తలపైఁగల కిరీటము అను బంగారుకలశముతో కూడినది; పీవరో......రుచిరంబు = బలిసియున్న ఱొమ్ముప్రదేశమునందలి కౌస్తుభమాణిక్యముచే అందమైనది; రమా......శస్తము = లక్ష్మీదేవి యను సాటిలేని జంత్రపుబొమ్మచే శ్లాఘ్యమైనది; ఐన = అయియున్నట్టి; శార్ఙ్గితనుసౌధమున్ = విష్ణునిశరీరము అను మేడను-ఎక్కి సుఖింపఁదలఁచు మంచిబుద్ధి కల

1. చ. వసు. 2. చ. దనుకు. ట. ద్రగ్గ. 3. చ. ట. పిచ్ఛిల. 4. చ. ట. శిక్యక; 5. క. ఖటి. చ. ఖట. 6. చ. సదు.

వానికి; నిస్తులభక్తిగౌరవము = సాటిలేని గొప్ప భక్తి; మీఁదికిన్ = సౌధముపైకి; చననిచ్చున్ = వెళ్లనిచ్చును - పంపును. [విష్ణుని పరమపదము పొందుటకు భక్తియే ముఖ్యమని భావము. అలం. రూపకము.

క. మీరును గృహస్థధర్మము, మేరకుఁ దలమీఱి చనక మిత్రామాత్యో
దారహితదారదారక,వారకములతోడఁ దీర్థవాసపరులరై. 282

టీక. గృహస్థధర్మముమేరకున్ = గృహస్థధర్మముయొక్క హద్దునకు; తలమీఱి = అతిక్రమించి; మిత్రా......తోడన్ = మిత్రులు, మంత్రులు, గొప్పబంధువులు, భార్యలు, సంతానముల సమూహములతో; తీర్థవాసపరులరై = పుణ్యక్షేత్రమున నివసింపఁ గోరినవారయి; [ముందునకు అన్వయము.]

క. కోమల తులసీపల్లవ,దామాంచిత[1]వత్సలక్ష్మధాముఁ బయోద
శ్యాముఁ బదద్వయనతసు,త్రామున్ మన పౌండరీకధాముఁ గొలువుఁడీ! 283

టీక. కోమల......ధామున్ = మృదువులగు తులసీదళములమాలలతో ఒప్పుచున్న శ్రీవత్స చిహ్నముతో ప్రకాశించువానిని; పయోదశ్యామున్ = మేఘమువలె నల్లనికాంతి కలవానిని; పదద్వయనతసుత్రామున్ = రెండు పాదములపైని వంగిన - (పాదములపై సాష్టాంగపడిన) ఇంద్రుఁడు కలవానిని; పౌండరీకధామున్ = పౌండరీకక్షేత్రము నివాసముగాఁ గలవానిని - విష్ణుని; కొలువుఁడీ. అలం. పరికరము, అనుప్రాసము.

క. అనుచుండ నర్కనిభమగు,ననిమిషయానంబుఁ దెచ్చి హరిపార్శ్వచరుల్
కొని చనిరి సభర్తృకముగ, ఘనశీల సుశీల విష్ణుగాథాలోలన్. 284

టీక. హరిపార్శ్వచరుల్ = విష్ణుదూతలు; అర్కనిభము = సూర్యునితో సమానమైనది - ప్రకాశించునది; అనిమిషయానంబున్ = విమానమును; ఘనశీలన్ = ఉత్తమస్వభావము కలదానిని; విష్ణుగాథాలోలన్ = విష్ణునికథలయం దాసక్త యగుదానిని; సుశీలన్; సభర్తృకముగన్ = భర్తతో కూడుకొనునట్లుగా - భర్తతోఁగూడ; కొని, చనిరి. అలం. పరికరము.

తే. అవనీసురుండు వాయసము నంచ, రాజకీరంబు పాము సరఘుఁడు నిట్లు
ముక్తి కేఁగిన కథ విను భక్తతతికిఁ, బర్వతాగ్రశిలాబ్జసంభవము భవము. 285

టీక. అవనీసురుఁడు = బ్రాహ్మణుఁడు - సుశీలభర్త; భవము = పునర్జన్మము; పర్వతాగ్రశిలాబ్జసంభవము = కొండమీఁది బండతాతిపై తామర మొలుచుట - అసంభవమనుట.

వ. అని వెండియు నిందుధరుండు శతానందనందనునితో నిట్లనియె. 286

టీక. ఇందుధరుండు = నెలతాల్పు - శివుఁడు; శతానందనందనునితోన్ = బ్రహ్మపుత్రుఁడగు నారదమునితో.

సీ. నీలమో కాలాభ్రజాలమో బాలశైవాలమో యీ సిద్ధవరునికాంతి
కెంపులో పవడంపుగుంపులో యీ రెండ సొంపులో యీ మేటిజోగిజడలు
హారమో హారినీహారమో భూరికర్పూరమో యీ యాదిపురుషునగవు
మెఱపులో వజ్రంపుటొఱపులో శశిరేఖ తెఱపులో యీవటూత్తమునికోఱ
తే. లనఁగ శార్ఙ్గికి నాదిక్కునందు నిలిచి, ప్రేతభూతనిశాచరపీడ లడఁచి
క్షేత్రరక్షణదక్షుఁడై క్షేత్రపాలుఁ, డుండువిభునాజ్ఞ తలమోచి యో మునీంద్ర!

1. చ. వక్షలక్ష్మ. ట. వత్సలక్ష్మ.

టీక. ఈ సిద్ధవరుని. కాంతి = ఈ గొప్పసిద్ధుని తేజస్సు; నీలమో = ఇంద్రనీలమో; కాలాభ్రజాలమో = కాఱుమబ్బులగుంపో; బాలశైవాలమో = లేఁతపాఁచియో; ఈ మేటిజోగిజడలు = ఈ గొప్పయోగియొక్క జటలు; ఈ రెండసొంపులో = అరుణకాంతిసొగసులో; ఈ యాదిపురుషునగవు = ఈ పురుషముఖ్యుని నవ్వు; హారినీహారమో = మనోహరమగు మంచో; భూరికర్పూరమో = కర్పూరపుకుప్పయో; ఈ వటూత్తమునికోఱలు = గొప్ప బ్రహ్మచారి యగు నీతని దంతములు; వజ్రంపుటూఱుపులో = రవల వెలుఁగులో; శశిరేఖికలఱుపులో = ముదురు చంద్రవంకలో; శార్ఙ్గికిన్ = విష్ణువునకు; నా దిక్కునందున్ = ఈశాన్యదిశను; క్షేత్రరక్షణదక్షుఁడై = క్షేత్రమును రక్షించుటకు సమర్థుఁడయి; విభునాజ్ఞ = ప్రభువైన విష్ణునియానతిని; తలమోచి = తలపై ధరించి; క్షేత్రపాలుఁడు = క్షేత్రపాలకుఁడగు కాలభైరవుఁడు; ఉండున్. అలం. ఉత్ప్రేక్ష.

క. శిక్యాపచూడు నాజ్ఞా,వాక్యార్థముసేయు భోగివలయు ప్రభావా
ధిక్యంబు మీఁటి యేరికి, శక్యమె తత్క్షేత్రమునఁ బ్రచార మొనర్పన్. 288

టీక. శిక్యాపచూడునాజ్ఞావాక్యార్థము = చిక్కము - ఉట్టి తలపైని గల విష్ణుని యాజ్ఞాపరిపాలనమును; భోగివలయుప్రభావాధిక్యంబున్ = పాములు కడియములుగాఁ గల కాలభైరవుని గొప్ప ప్రభావమును; మీఱి = దాటి - అతిక్రమించి; తత్క్షేత్రమునన్; ప్రచారమొనర్పన్ = సంచరించుటకు! శక్యమె? = సాధ్యమా ?

చ. చెడుగుల విష్ణుభక్తి నిరసించు దురాత్ముల మోక్షలక్ష్మి చే
పడుటకుఁ గాని హీనులఁ బ్రభావతిరస్కృతలోకపాలుఁ డా
బుడిబుడితాల్పుఁ డందు నొకపూఁటయు నుండఁగనీక త్రోచి పో
[1]నడచుఁ గలంచు డెందముల నారటపెట్టు మహోగ్రమూర్తియై. 289

టీక. చెడుగులన్ = చెడ్డవారిని; నిరసించు = నిందించునట్టి; మోక్షలక్ష్మి = ముక్తిసంపద; చేపడుటకుఁగాని హీనులన్ = పొంద వలనుపడని నీచులను; ప్రభావతిరస్కృతలోకపాలుఁడు = గొప్పతనముచే తిరస్కరింపఁబడిన దిక్పాలురు కలవారు; బుడిబుడితాల్పుఁడు = బాలచంద్రుని ధరించిన కాలభైరవుఁడు; అందున్ = ఆ పాండురంగక్షేత్రమునందు; పోనడచున్ = తఱుమును; కలంచున్ = కలఁతపెట్టును; మహోగ్రమూర్తియై = మిక్కిలి భయంకరమైన స్వరూపము కలవాఁడై; డెందములన్ = మనస్సులను; ఆరటపెట్టున్ = పరితాపపెట్టును.

ఉ. పువ్వును బూఁత పుట్టమును భూషయు దివ్యములై చెలంగ లే
జవ్వను లర్థిఁగొల్వ నొక చక్కని ఖేచరుఁ డొక్కనాఁడు ము
న్నవ్వనమాలిహాటకమయావసథోపరివీథిఁ ద్రిమ్మరున్
గ్రొవ్వెసఁగన్ విమానరుచి కోకనదప్రియరోచి [2]నెచ్చఁగన్. 290

టీక. పూఁత=మంచిగంధము మొదలగువానిఁ బూసికొనుట; పుట్టమును = వస్త్రమును; భూషయున్ = ఆభరణమును; లేజవ్వనులు = లేఁతయౌవనము కల స్త్రీలు; అర్థిన్ = ప్రీతితో; కొల్వన్ = సేవింపఁగా; ఖేచరుఁడు = విద్యాధరుఁడు; అవ్వన.....వీథిన్ = ఆ పాండురంగప్రభుని బంగారు దేవాలయమీఁదిమార్గమున; క్రొవ్వు, ఎసఁగన్ = గర్వము, అతిశయింపఁగా; విమానరుచి = అతఁడున్న విమానపుఁగాంతి; కోకనదప్రియరోచిన్ = చంద్రునికాంతిని; ఎచ్చఁగన్ = అతిశయింపఁగా; త్రిమ్మరున్ = తిరిగెను. అలం. ఉపమ.

---

1. క. నడుచు. చ. ట. నడచు. 2. క. యెచ్చఁగన్ చ. నెంచగన్. ట. పించగన్.

ఉ. ఏధితయౌవనోద్ధతమతి న్నెద్దియు మీఁదెఱుఁగంగలేక వి
ద్యాధరుఁ డాతఁ డాత్మరుచి [1]నాకసముఙ్ గనకప్రసూనరా
జీధరణాభిరామముగఁ జేయుచుఁ ద్రిమ్మరి క్షేత్రపాలుఁ డు
త్క్రోధరసోగ్రమూర్తియయి కోయని యార్చె నభంబుఁ జూచుచున్. 291

టీక. అతఁడు, విద్యాధరుఁడు = ఆ విద్యాధరుఁడు; ఏధితయౌవనోద్ధతమతిన్ = వృద్ధిపొందిన యౌవనపదముచే; మీఁద ఎఱుఁగంగలేక = ముందు సంభవించుదానిని గుర్తెఱుఁగఁజాలక; ఆత్మరుచిన్ = తన (దేహ) కాంతిచే; ఆకసమున్ = దేవాలయముమీఁది గగనస్థలమును; కనక.....రామముగన్ = బంగారుపూవుల సమూహమును (మాలను) ధరించుటను మనోహరమగునట్లుగ; త్రిమ్మరన్ = తిరుగఁగా; క్షేత్రపాలుఁడు = కాలభైరవుఁడు; ఉత్క్రోధరసోగ్రమూర్తి యయి = ఎక్కువైన కోపముచే భయంకరమగు రూపు కలవాఁడై; నభంబున్ = ఆకాశమును; చూచుచున్; కోయని; ఆర్చెన్.

సీ. కనువిచ్చి చూచుటగాక [2]దిగ్గున లేచె నమితసమాధి[3]స్థితమునికులము [మూఁక
గ్రద్దులఁ [4]బోదువు ముక్కువలు దక్కుటగాక [5]పొదలాడెఁ జెట్లపైఁ బులుఁగు
పులు మేయు[6]తమకంబు దొలఁగుటగాక విహ్వలబుద్ధియై దాఁటె హరిణకులము
ప్రజ కేలఁ గర్ణరంధ్రములు మూయుటగాక పవిశంక నరనుతిప్రవణమయ్యెఁ
తే. బద్మనాభగృహోపరిభాగసంచ, రిష్ణుఖేచరదర్శనోద్రిక్తహృదయ
కాలభైరవభైరవోద్వేలకంఠ, కుహరనిష్ఠ్యూతరోషనిర్ఘోష[7]విహృతి. 292

టీక. పద్మనాభ.....విహృతిన్ - పద్మనాభ = విష్ణునియొక్క; గృహ = ఆలయము యొక్క; ఉపరిభాగ = మీఁదిభాగమున; సంచరిష్ణు = తిరుగుచున్న; ఖేచర = విద్యాధరుని; దర్శన = చూచుటచే; ఉద్రిక్తహృదయ = ఉద్రేకము పొందిన మనస్సుగల; కాలభైరవ = కాలభైరవునియొక్క; భైరవ=భయంకరమై; ఉద్వేల, కంఠకుహర = అతిశయించిన గుహవంటికంఠమునుండి; నిష్ఠ్యూత = వెడలింపఁబడిన - బయలుదేరిన; రోషనిర్ఘోషవిహృతిన్ = కోపముతోఁగూడిన ధ్వనియొక్క విహారముచే; అమిత.....కులము = సాటిలేని యోగసమాధియందున్న మునుల సమూహము; కనువిచ్చి = కన్ను విప్పి; పులుఁగుమూఁక = పక్షుల సముదాయము; గ్రద్దులఁబోదువుముక్కువలు = గ్రద్దను పొదుగుట యందలి యిష్టమును; దక్కుగాక = విడుచుటయేగాక; చెట్లపైన్; పొదలాడెన్ = ఎగురసాగెను; హరిణకులము = లేళ్లగుంపు; పులుమేయుతమకంబున్ = గడ్డి మేయుటయందలి ఆసక్తిని; తొలఁగుటగాక = విడుచుటయేగాక; విహ్వలబుద్ధియై=కలఁతపడిన మనస్సుగలదయి; దాఁటెన్ = గంతులిడెను. ప్రజ = జనసమూహము; కేలన్=చేతితో; పవిశంకన్=పిడుగు అను భ్రాంతితో; నరనుతిప్రవణము=అర్జునుని కొనియాడుటయం దాసక్తమయినది; అయ్యెన్. [పిడుగు పడినపుడు అర్జునుని పది పేళ్ళను పఠించినచో ఆ పిడుగు తమపైఁ బడదను నమ్మకము జనులకుఁ గలదనుట. ఆ శ్లోకమిది—శ్లో. అర్జునః ఫల్గుణః పార్థః కిరీటీ శ్వేతవాహనః, బీభత్సు ర్విజయః కృష్ణః సవ్యసాచీ ధనంజయః' అలం. ఉదాత్తము.

ఉ. మానని కోప మిట్లు మది మల్లఁడి గొల్పఁగ మింటికిన్ మహా
శ్యేనముపోలె బిట్టెగసి యెక్కుడు నుక్కున నుగ్రవిగ్రహుం
డై నెఱితగ్గ నగ్గగనయాయివిమానముఁ ద్రొక్కి భగ్నముం
గా నొనరిం[8]పుడున్ త్రిదశగాయకనాయకుఁ డుర్విఁ[9]గూలినన్. 293

1. చ. కాకసమున్. 2. చ. ట. దిగ్గన. 3. క. స్థిర చ. ట. స్థిత. 4. చ. బోదముమంకు. 5. చ. ట. పొడవాడె. 6. చ. ట. గమకంబు. 7. చ. ట. వికృతి. 8. క. చుచున్. చ. ట. పుడున్. 9. చ. కూలుడున్.

టీక. మానని, కోపము = విడువని కోపము; మదిన్, మల్లడిగొల్పఁగన్ = కలఁతపడుచుండఁగా; మింటికిన్ = ఆకాశముపైకి; మహాశ్యేనము పోలెన్ = పెద్దడేగవలె; బిట్టు, ఎగసి = వేగముగా ఎగిరి; [క్షేత్ర క్షేత్రపాలుఁడగు కాలభైరవుఁడు] ఎక్కుడుచుక్కునన్ = ఎక్కువ బలముతో; ఉగ్రవిగ్రహుండై = భయంకరమైన స్వరూపము కలవాఁడై; నెఱి, తగ్గన్ = అందము తగ్గునట్లుగా - ఆర్భాటము నశించునట్లుగా; అగ్గగనయాయివిమానమున్ = ఆ విద్యాధరుని విమానమును; భగ్నముగాన్, ఒనరింప్రమున్ = నశింపజేయఁగా, త్రిదశగాయకనాయకుఁడు = దేవతల పాటఁగాఁడైన గంధర్వుఁడు; ఉర్విన్, కూలినన్ = భూమిపైని పడఁగా.

ఉ. కోలు మసంగి ప్రోఁగి బలుకోఱలు దీటుచు గ్రుడ్లు త్రిప్పుచున్
క్ష్వేళ లొనర్చుచున్ మొగము జేవురుముద్దవిధంబునన్ మహా
భీలముగాఁగ వ్యాళవిభుఁ బెన్పులుఁ గిప్పినమాడ్కి నీడ్చె న
బ్బాలిశుఁ గాలభైరవుఁడు పైకుబుసం బొకపోరు వెత్తఁగన్. 294

టీక. కోలుమసంగి = మిక్కిలి విజృంభించి; ప్రోఁగి = గట్టిగా అఱచి; బలుకోఱలు = పెద్ద కోఱలు; క్ష్వేళలు, ఒనర్చుచున్ = సింహనాదము లొనరించుచు; మహాభీలముగాఁగన్ = మిక్కిలి భయంకరమైనది కాఁగా; వ్యాళవిభున్ = పెద్దపామును; పెన్పులుఁగు = గరుడపక్షి; అబ్బాలిశున్ = ఆ మూర్ఖుని - గంధర్వుని; పై కుబుసంబు = పయితోలు; ఒకపోరువు, ఎత్తఁగన్ = ఒక పొర లేచునట్లుగా; ఈడ్చెన్. అలం. ఉపమ.

క. ఈ[1]వడువున బులిదొడికిన, యావుపసిగ నుసురు[2]వోక కాసన్నుండౌ
నా విద్యాధరు భైరవదేవావృతుఁ గాంచి వాసుదేవుఁడు పల్కెన్. 295

టీక. ఈ వడువునన్ = ఈ రీతిని; పులిద్రొడికిన యావుపసిగన్ = పులి ఆక్రమించిన ఆవు రీతిని; ['ఆవుపసిగన్ = గోవు కాఁగా' అని పూర్వటీక.] ఉసురువోకతున్ = ప్రాణము పోవుటకు; ఆసన్నుండౌ = సమీపముగా - సిద్ధముగా - ఉన్న; విద్యాధరున్; భైరవదేవావృతున్ = భైరవునిచే ఆక్రమింపఁబడినవానిని; వాసుదేవుఁడు = శ్రీకృష్ణుఁడు - పాండురంగఁడు. అలం. ఉపమ.

శా. నాగాకల్ప! [3]యొహో పురే! నిలు విమానభ్రష్టుఁడై నేలపై
నీ గంధర్వుఁడు కూలి దర్పముడివోయెన్ జంపఁగా రాదు; గా
ఢాగఃకర్తుఁడె నేనియున్ జడుపువాఁడై యుండ నర్థిన్ మహా
భాగుల్ చంపమి నీవెఱుంగుదువు; కోపం బాఁపు మీపట్టునన్. 296

టీక. నాగాకల్ప! = పాములు ఆభరణములుగా కల భైరవుఁడా! ఒహో సంబోధనార్థకము; పురే విచారార్థమున ఉపయుక్తము; నిలు = నిలువుము - ఆగుము; విమానభ్రష్టుఁడై = విమానమునుండి జారినవాఁడై; దర్పము, ఉడివోయెన్ = గర్వ మణఁచుకొనెను; గాఢాగఃకర్తుఁడేనియున్ = గొప్ప అపరాధమును చేసినవాఁడైనను; జడుపువాఁడై = భయపడినవాఁడై; ఉండన్ = ఉండఁగా; అర్థిన్ = ప్రీతితో - దయతో; మహాభాగుల్ = ఉత్తములు; చంపమి = చంపక విడుచుట; ఈ పట్టునన్ = ఈ యెడ; కోపవంబు, ఆఁపుము = కోపమును నిలుపుము - విడువుమనుట.

క. అని శ్రీపతి యానతి యిచ్చిన [4]ముందల విడిచె నతని సిద్ధవిభుఁడు; వాఁ
డును గులగులలై లా వగ్గలిన మై విదలించుకొనుచు లేచెఁ గిదుకుచున్. 297

---

1. చ. ట. విధమున. 2. క. వోవకాస. చ. ట. వోకకాస... 3. క. యహో. చ. ట. యొహో. 4. క. ముందల. చ. ట. ముందల.

టీక. శ్రీపతి = విష్ణువు; అనతి, ఇచ్చినన్ = ఆజ్ఞాపింపఁగా; మందలన్ = ముందు+తలను; వాఁడును, ఆ విద్యాధరుఁడును; గులగులలై = నలిగిపోయి; లావు, అగలిన, మైన్ = బలము, నశించిన, దేహమును ['లావు = బలము; అగలినన్ = పెల్లగిలగా - నశింపఁగా' అని పూర్వటీక.] కిదుకుచున్ = మూలుగుచు; లేచెన్.

ఉ. లేచి యతండు గాంచెఁ గదళీమృదులోరుయుగున్ హసన్ముఖున్
మేచకమేఘమూర్తి దినమిత్రసమానమరత్నభూషితున్
లోచనధిక్కృతాంబుజదళున్ శతకోటిసుధాకరాగ్నిరు
గ్వీచిపరంపరోపమనవీనతనుప్రభు యాదవప్రభున్. 299

టీక. లేచి; అతండు = ఆ విద్యాధరుఁడు; కదళీమృదులోరుయుగున్ = అరఁటిబోదెలవలె మృదువులైన తొడలుగలవానిని; మేచకమేఘమూర్తిన్ = నీలమేఘమువంటి దేహము కలవానిని; దిన...భూషితున్ = పగలింటి సూర్యునితో సమానమగు (మిట్టమధ్యాహ్నపు సూర్యునివలె ప్రకాశించు) సాటిలేని రత్నాభరణములతో అలంకరింపఁబడినవానిని; లోచనధిక్కృతాంబుజదళున్ = కన్నులచే తిరస్కరింపఁబడిన తామరపూవు రేకులు కలవానిని; శత.....ప్రభున్ =శతకోటిచంద్రులయొక్కయు, అగ్నులయొక్కయుం కాంతుల సమూహముతో సరియగు వింత దేహకాంతులు కలవానిని; యాదవప్రభున్ = శ్రీకృష్ణుని; కాంచెన్. అలం. పరికరము, ఉపమ.

వ. ఇట్లు సచ్చిదానందకందంబగు నచ్చిందంబుదాల్పు ననల్పాద్భుతరస[1]నిమగ్నుండై
కనుంగొనుచు నవతీర్ణగర్వవిద్యాధరుండై యవ్విద్యాధరుం డిట్లని వితర్కించు.

టీక. సచ్చిదానందకందంబు, అగు = సదానందమునకు, చిదానందమునకును మూలమైన; అచ్చిందంబుఁదాల్పున్ = శంఖమును ధరించిన శ్రీకృష్ణుని; అనల్పాద్భుతరసనిమగ్నుండై = ఎక్కువైన ఆశ్చర్యమున మునిఁగినవాఁడై - ఎక్కువ ఆశ్చర్యపడినవాఁడై; కనుఁగొనుచున్ = చూచుచు; అవతీర్ణగర్వవిద్యాధరుండై = దిగిన (నశించిన) గర్వవిద్య కలవాఁడై - నశించిన గర్వము కలవాఁడై; వితర్కించున్ = ఆలోచించెను.

శా. ఈపుంగ్రామణి యెవ్వఁడో కో! హరి యి[2]ట్లొప్పొందె; సందేహ మే
లా? పద్మాక్షుఁడె యంచు లోఁదెలిసి 'యో లక్ష్మీశ! యేఁ దన్నివా
సోపర్యభ్రచరద్విమానగుఁడనై యుండుండి యుఙ్డాక్కయు
త్కోపోదగ్రుఁడు గూల్పఁ గ్రొవ్వ[3]ఱిగి కన్గొంటిన్ సురేశు న్నినున్. 300

టీక. పుంగ్రామణి = పురుషశ్రేష్ఠుఁడు; ఒప్పొందెన్ = కనపడెను; పద్మాక్షుఁడు = తామరలవంటి కన్నులు కల విష్ణువు; తన్నివా......గుఁడనై = నీ దేవాలయపుమీఁదిభాగమున ఆకాశమున తిరుగు విమానమున ఉన్నవాఁడనై; ఉత్కోపోదగ్రుఁడు = గొప్పకోపముచే భయంకరుఁడైనవాఁడు; క్రొవ్వు, అఱిగి = గర్వము నశించి; సురేశున్ = దేవతలప్రభువును; కన్గొంటిన్ = చూచితిని.

క. [4]నిర్మదులకుఁ దోఁచినక్రియ, దుర్మదులకుఁ దోఁప వీ వెదుట' [5]ననుచు మనో
ముర్ముర[6]వాపిఁ బడి మనుజ, ధర్మభటుఁడు తత్పదద్వితయ[7]కృతమతియై. 301

టీక. నిర్మదులకున్ = అహంకారము లేనివారికి; తోఁచినక్రియన్ = కనపడినట్లు; ఈవు= నీవు; దుర్మదులకున్ = దురహంకారులకు; ఎదుటన్; తోఁపవు = కనిపింపవు; మనోముర్మురవాపిన్ = మనస్సనెడి (కుమ్ముబావిలో) ఊకనిప్పుగోతిలో; పడి - పశ్చాత్తప్తుఁడై. మనుజధర్మభటుఁడు = కుబేర

1. క. నిర్మగ్నుండై. చ. ట. నిమగ్నుండై. 2. చ. ట. ట్లుందోంచె. 3. చ. ఱియు. 4. చ. నిర్మలు. 5. చ. నగుచు. 6. ట. వ్యాప్తి. 7. చ. మానసుఁడై.

కింకరుఁడు - యక్షుఁడు; తత్పదద్వితయకృతమతిర్హై = ఆ విష్ణుని పాదద్వయమున స్థిరమైన మనస్సు గలవాఁడై; (ముందుపద్యముతో సమన్వయము.)

స్రగ్ధర. 'పాపోఽహం పాపకోపప్రవణమతిరహం బాలిశోఽహం సుధీస
'ప్రాప్తోఽహం దుష్టకష్టప్రకృతిరహ మహం పామరాత్మాస్మి; నానా
రూపద్రోహాపచారార్బుదనిహితధియం క్రోధినం మా మవ త్వ
చ్ఛ్రీపాదాసక్తియుక్తం శివకర!' యనుచుఁ జిష్ణుఁ గృష్ణు న్నుతించెన్. 302

టీక. పాపోఽహం = నేను పాపాత్ముఁడను; అహం పాపకోపప్రవణమతిః, = నేను చెడ్డదైన కోపముగల బుద్ధికలవాఁడను; అహం బాలిశః, = నేను మూర్ఖుఁడను; అహం సుధీసప్రాప్తః = నేనువిద్వాంసులను పొందరానివాఁడను; దుష్టకష్టప్రకృతిః, అహం = నేను దుష్టమును కష్టమునైన స్వభావము కలవాఁడను; అహం = నేను; పామరాత్మా, అస్మి = అజ్ఞాని నైతిని; నానా......ధియం = పెక్కు విధములగు ద్రోహములయు, అపచారములయు అర్బుదములయందు (అసంఖ్యాకములందు) ఉంచఁబడిన బుద్ధి కలవానిని; క్రోధినం = కోపము కలవానిని; త్వచ్ఛ్రీపాదాసక్తియుక్తం = నీ శ్రీపాదములయెడ ఎక్కువ ఇష్టముతో కూడినవానిని; మాం = నన్ను; అవ = రక్షింపుము; శివకర! = మేలు కలిగించు ప్రభూ! జిష్ణుక్ = జయశీలుని; కృష్ణుక్; నుతించెన్.

వ. అని మఱియును. 303

చ. యదుకులనాథ! యిప్పు డితఁ డాగ్రహవృత్తి నొనర్చు నిగ్రహం
బిదియు ననుగ్రహంబ యగు, నింద్రియరాజికి [1]బంటుసేయు శ్రీ
మదము నణంచి నీయడుగుమానిసిగా ననుఁజేసెఁగాన; సం
పదగల గర్వి నిర్మమునిమాడ్కి నినుం గని కొల్వఁజాలునే? 304

టీక. ఆగ్రహవృత్తిక్ = కోపముతో; నిగ్రహంబు = శిక్ష; ఇంద్రియరాజికిక్ = ఇంద్రియములగుంపునకు; బంటుచేయు = లొంగునట్లు చేయునట్టి; శ్రీమదము = సంపదచేతనైన గర్వమును; అణంచి = నశింపఁజేసి; ననుక్; నీయడుగుమానిసిగాక్ = నీపాదసేవకునిగా; నిర్మమునిమాడ్కిక్ = మమత లేనివానివలె.

క. మూఢుఁడ ననుఁ బ్రోవు [2]మహాప్రద్ధకు నిఁక జొరక నామతి వెలయుత దయా
గాఢత్వాజ్ఞ విమూఢా, రూఢుఁడనై జగములం దిరుగువాఁడ హరీ! 305

టీక. ఇఁకక్; నామతి = నామనస్సు; మహాద్రిద్ధకుక్ = పెద్దల నవమానించుటకు; చొరక = ప్రవేశింపక - సిద్ధపడక; దయాగాఢత్వాజ్ఞక్ = ఎక్కువ దయతోడి నీయాజ్ఞచే.

చ. సురసదనంబునందయిన క్షోణితలంబునయందునైన భీ
కరనిరయంబునందయినఁ గర్మవశంబున నుండు నామదిం
బొరయును గాతఁ గాతరసముద్ధరణోచితకార్యధుర్య! త్వ
చ్చరణసరోరుహద్వితయ సంతతసంస్మరణానుషంగముల్. 306

టీక. సురసదనంబునందుక్ = అమరావతియందు; (స్వర్గమందు); భీకరనిరయంబునందుక్ = భయమునుగొల్పు నరకమునందు; కాతర......ధుర్య! భయపడినవారిని రక్షించుపనిని పూనుకొను దేవుఁడా! త్వచ్చరణ......షంగముల్ = నీ రెండు పాదపద్మములను ఎల్లపుడును స్మరించుటలతోడి కూడికలు; నామదిక్; పొరయునుగాక! = పొందునుగాక!

1. చ. బట్టు. 2. ట. మహాప్రీదకు.

క. అని వలగొని యాయదునం, దనునిరుపమదివ్యరూపదర్శనమున లోఁ
దనియుచుఁ జొక్కుచు మ్రొక్కుచుఁ, జనియెన్ విద్యాధరుండు శతధృతితనయా!

టీక. వలగొని = ప్రదక్షిణముచేసి; నిరుపమదివ్యరూపదర్శనమునన్ = సాటిలేని దివ్యరూపము చూచుటచే; తనియుచున్ = తృప్తిపడుచు; చొక్కుచున్ = పరవశత పొందుచు; చనియెన్; శతధృతితనయా != నారదుఁడా !

క. మధుమథనునాజ్ఞ నేవం, విధమహిమ దలిర్చు క్షేత్రవిభు భైరవదే
వు ధరాధోభువనస్వర్గధామనుతుఁ గాంచి పిదపఁ గనఁదగుఁ గృష్ణున్. 308

టీక. మధుమథనునాజ్ఞన్ = మధువను రాక్షసుని చంపిన విష్ణుని యానతిచే; ఏవంవిధమహిమన్ = ఇట్టి గొప్పతనముతో; తనర్చు = ప్రకాశించునట్టి; ధరా......నుతున్ = భూపాతాళ, స్వర్గలోకములచే కొనియాడఁబడువానిని.

శా. సాహిత్యాపరకాళిదాస! హరిపూజాగౌరవవ్యాస! గం
గాహల్లోహలవాగ్విలాస! రిపువర్గత్రాసకృత్ప్రాస! కాం
తాహర్షావహదృగ్విలాస! శ్రుతి[1]పద్యాయోజితాభ్యాస! హే
మాహార్యోపమధైర్యధుర్యపదవిన్యాసా! విధేయారసా! . 309

టీక. సాహిత్యాపరకాళిదాస ! = సాహిత్యవిద్యయందు రెండవ కాళిదాసు అయినవాఁడా! హరి......వ్యాస ! = విష్ణుని పూజించు గొప్పతనమున వ్యాసుఁడైనవాఁడా ! గంగా...లాస!=గంగా ప్రవాహమువంటి మాటలనేర్పుకలవాఁడా! రిపు......ప్రాస! = శత్రుసమూహమునకు భయముగొల్పు ప్రాసము (అను ఆయుధము) కలవాఁడా ! కాంతా......విలాస != స్త్రీలకు సంతోషము కలిగించు చూపులవిలాసము కలవాఁడా ! శ్రుతి......భ్యాస ! = వేదమార్గమున చేయఁబడిన అభ్యాసము కలవాఁడా ! హేమా......విన్యాసా ! మేరుపర్వతముతో సమానమైన ధైర్యమున అడుగు ఉంచువాఁడా!- మేరువువంటి ధైర్యము కలవాఁడా! విధేయారసా!=విధేయులైన కుమారులు కలవాఁడా! (ఇవియన్నియు వేదాద్రిమంత్రికి విశేషణములు)

క. షడ్దర్శనపారగ! కవి, రాడ్దత్తానుగ్రహాభిరమ్య!*మదాంధ
ద్విడ్దంతిసింహ! మహిత, త్విడ్దశశతకిరణ! హృదయధృతహరిచరణా! 310

టీక. షడ్దర్శనపారగ! = ఆరు దర్శనముల అంతము చూచినవాఁడా - షడ్దర్శనములను బాగుగ ఎఱిఁగినవాఁడా ! [షడ్దర్శనములు - సాంఖ్యము - యోగము - న్యాయము - వైశేషికము - పూర్వ మీమాంస - ఉత్తరమీమాంస.] కవి...రమ్య ! = కవిరాజుల కీయఁబడిన అనుగ్రహముచే మనోహరుఁడైనవాఁడా! - కవులను అనుగ్రహించినవాఁడా! మదాంధ..... సింహ ! = మదించిన శత్రువులను ఏనుఁగులకు సింహమైనవాఁడా ! మహిత......కిరణ ! = అధికతేజస్సున సూర్యుఁడైనవాఁడా ! హృదయ......చరణా! = మనస్సులో ఉంచఁబడిన విష్ణుపాదములు కలవాఁడా ! - సదా విష్ణుని ధ్యానించువాఁడా ! అలం. రూపకము, అనుప్రాసము.

మాలిని. వినయనయసముద్రా! [2]విస్తృతోల్లాసముద్రా
జననుతగుణజాలా! శత్రు[3]రాణ్మీనజాలా!
ధనదవదసమానా! ధన్యధీభాసమానా!
ఘనపురినరాగా! కావ్యదత్తానురాగా!

---

1. చ. పద్య. *క. మధాంధ. చ. మదాంధ. 2. క. విశ్రు. చ. విస్తృ. ట. 3. చ. ట. రాజ్ఞా

టీక. వినయనయసముద్రా ! = వినయమునకు, నీతికి సముద్రమైనవాఁడా ! విస్తృతోల్లాసముద్రా !=ఎక్కువైన సంతోషముతోఁ గూడినవాఁడా ! జన......జాలా ! = జనులచే కొనియాడఁబడిన గుణములగుంపుకలవాఁడా ! శత్రు......జాలా ! =శత్రురాజులను చేఁపలకు వలయైనవాఁడా ! ధనధనదసమానా! = ధనమున కుబేరునితో సమానుఁడైనవాఁడా! ధన్యధీభాసమానా !=గొప్పబుద్ధిచే ప్రకాశించుచున్నవాఁడా ! ఘనవపురినరాగా ! = గొప్ప శరీరమను సూర్యుని వెలుఁగుకలవాఁడా ! - సూర్యుని తేజస్సువంటి తేజస్సు కలవాఁడా ! కావ్యదత్తానురాగా!=కావ్యములయెడ ప్రేమ (ఇష్టము) కలవాఁడా! అలం. అనుప్రాసము, రూపకము.

గద్యము. ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధికకృపాపరిపాకపరిచిత సరసకవితాసనాథ రామకృష్ణకవినాథప్రణీతంబైన పాండురంగమాహాత్మ్యంబగు పరమభాగవత చరిత్రంబునందుఁ జతుర్థాశ్వాసము.

టీక. ప్రథమాశ్వాసాంతగద్యమునకు వలెనే.

ఇది శ్రీగౌతమసగోత్రపవిత్ర బులుసూపనామక సీతారామస్వామ్యవధానిసుపుత్ర, విద్వజ్జనవిధేయ వేంకటరమణనామధేయగ్రథితంబైన పాండురంగమాహాత్మ్య టీకయందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీరస్తు

# పాండురంగమాహాత్మ్యము

## పంచమాశ్వాసము



షణ్ముఖజననీ మహీ
భాషానిభనిజవధూశుభప్రదలీలా!
భూషితకల్యాణోజ్జ్వల
వేషా! రామా[1]నుజేంద్ర వేదాద్రీశా!

టీక. శ్రీ...లీలా! = శ్రీషణ్ముఖజననీ = పార్వతీదేవితోను; మహీ = భూదేవితోను; భాషా = సరస్వతీదేవితోను; నిభ = సమానమైన; నిజవధూ = ధర్మపత్నికి; శుభప్రదలీలా! = మేలొసఁగు విలాసముకలవాఁడా! భూషిత......వేషా! = అలంకరింపఁబడిన చొక్కపు కాంతిగల అలంకారములు (ఆభరణాంబరాదులు) కలవాఁడా! ['కల్యాణోజ్జ్వల = చొక్కపు బంగారుచే వెలుఁగునట్టి' అని పూర్వటీక.]

వ. ఆకర్ణింపుము. 2

క. అని యీక్రియ నానతి యి, చ్చిన హెచ్చిన సంతసంబు చిత్తముతోడం
బెనఁగొన ననిమిషముని యి, ట్లను నజ్జగదేకనిధికిఁ బ్రాంజలి యగుచున్. 3

టీక. ఆనతియిచ్చినన్ = తెలుపఁగా; సంతసంబు=సంతోషము; చిత్తముతోడన్ = మనస్సుతో; పెనఁగొనఁగాన్ =కలిసి పెనవేసికొనఁగా - మనస్సున ఎక్కువ సంతోషము కలుగఁగా; ప్రాంజలి=చేతులు జోడించినవాఁడు; అనిమిషముని = దేవముని - నారదుడు; అజ్జగదేకనిధికిన్ = ప్రపంచములకు ఒక్కటే యొక్క నిధియైనవానికి - శివునికి;–(పరమేశ్వరునిగూర్చి యనుట.) ఇట్లనున్.

తే. క్షేత్రమాహాత్మ్యమును మహాక్షేత్రపాల, దివ్యచరితంబు నందుండు దేవదేవు
గుణకలాపంబుఁ బుండరీకునిమహిమయు,వింటి భవబంధములు వీడుకొంటి దేవ! 4

టీక. అందుండు = ఆక్షేత్రముననున్న; దేవదేవుగుణకలాపంబున్ = పాండురంగనిగొప్పగుణములను; భవబంధములన్ = సంసారబంధములనుండి; వీడుకొంటిన్ = విడువడితిని. (వానిని వినుటచే నాకు పునర్జన్మరాహిత్య మగునని నారదుఁడు తలఁచె ననుట.]

తే. ఎన్నిద్వారంబు [2]లయ్యాయియెడ వసించు,ద్వారదేవత లెంద ఱా స్థలములందుఁ
బ్రబలు [3]క్షేత్రాది పుణ్యవైభవము పేర,నొండుగలదేని యానతియిండు మఱియు.

టీక. అయ్యాయియెడన్ = ఆ యా ద్వారములదగ్గఱ; ఆ స్థలమునందున్ = ఆ క్షేత్రమున; ప్రబలు = పేరుపొందు; క్షేత్రాది = క్షేత్రాదికము; ఒండు = వేఱైనది.

---

1. చ. నుజయ్య. 2. చ. లయ్యయి. 3. చ. క్షేత్రావి.

క. అని నారదుండు ప్రార్థించినఁ బద్మదళాయతాక్షుఁ జిత్తాంభోజం
బున నిల్పి యతనిఁ [1]బలుకున్,మనసిజమర్దనుఁడు మధురమధురారభటిన్. 6

టీక. మనసిజమర్దనుఁడు = మన్మథుని మర్దించిన శివుఁడు; చిత్తాంభోజంబునన్ = హృదయపద్మమున; పద్మదళాయతాక్షున్ = తామరఱేకులవలె విశాలములైన కన్నులు కలవానిని - విష్ణువును; నిల్పి = ఉంచి; అతనిన్ = నారదమునిఁగూర్చి; మధురమధురారభటిన్ = మిక్కిలి మధురమైన గంభీరస్వరముతో; పలుకున్.

క. సుఖమాలికాతరంగిణి, సఖియై భీమరథిఁ గూడి చను నెచ్చట స
త్సుఖకర మచ్చోటు చతుర్ముఖముఖ[2]నుత మాదితీర్థమునునై వెలయున్. 7

టీక. సఖియై = చెలికత్తెయై - తోడఁగూడినదై; చతుర్ముఖముఖనుతము = బ్రహ్మాదులచేఁ గొనియాడఁబడినది; ఆదితీర్థము = ప్రధానతీర్థము; వెలయున్ = ప్రకాశించును.

క. పూర్వద్వారం బగునది, దర్వీకరసార్వభౌమ[3]తల్పునగరికిన్
సర్వసుపర్వార్చితపద, గీర్వనిత వసించు నచటఁ గృష్ణుని యాజ్ఞన్. 8

టీక. అది = సుఖమాలికాభీమరథుల సంగమస్థలము; దర్వీ......నగరికిన్ = శేషశాయి యగు విష్ణుని నగరికి; పూర్వద్వారంబు = తూర్పువాకిలి; అచటన్ = ఆ-చోట; సర్వసుపర్వార్చితపద = సమస్తదేవతలచేతను సేవింపఁబడిన పాదములు కలదైన; గీర్వనిత = సరస్వతీదేవి; వసించున్.

క. శ్రీమహితము సిద్ధేశ్వర, నామాంక [4]మపంకజలసనాథము లక్ష్మీ
కాముకనిహితము ఖచరా, లీమాన్యమునైన శంభులింగముతోడన్. 9

టీక. శ్రీమహితము = సంపదచే గొప్పది; సిద్ధేశ్వరనామాంకము = సిద్ధేశ్వర మను పేరు కలది; అపంకజలసనాథము = బురదలేని (తేఁట)నీటితో కూడినది; లక్ష్మీకాముకనిహితము = విష్ణువుచే ఏర్పఱుపఁబడినది; ఖచరాలీమాన్యమును = దేవతలగుంపునకు గౌరవింపఁదగినదియును; శంభులింగముతోడన్ = శివలింగముతో; [మీఁదిపద్యముతో సమన్వయము.] అలం. పరికరము.

క. తగు దక్షి[5]ణంపువాకిలి, నగధరునగరునకు భీమనందన[6]పొందుం
దగిలినయది యచ్చోటన, యగమ్యపుష్పావతీమహానది యనఘా! 10

టీక. నగధరునగరునకున్ = గోవర్ధనగిరి నెత్తిన విష్ణువుక్షేత్రమునకు; దక్షిణంపువాకిలి; తగున్; అనఘా! = పాపములు లేని నారదమునీ! అచ్చోటన = ఆ దక్షిణద్వారప్రదేశముననే; అగమ్య... ... నది = సాటిలేని పుష్పావతి యను పేరి యేఱు; భీమనందనపొందున్ = భీమరథీనది సంగమమును; తగిలినయది = పొందినది.

క. దానస్నానాదిహృతా, జ్ఞానానలదాహమైన సంగమతీర్థం
బానెలవున విఖ్యాతం, బైనది; సుర లుందురు శిలాకృతి నందున్. 11

టీక. దాన......దాహము = దానము, స్నానము మొదలగువానిచేత నశింపఁజేయఁబడిన అజ్ఞాన మను అగ్నిమంట; ఆ,నెలవునన్ = అచ్చోటనే; విఖ్యాతంబు, ఐనది = ప్రసిద్ధమై యున్నది; అందున్; సురలు = దేవతలు; శిలాకృతిన్ = శిలా(విగ్రహ)స్వరూపములతో; ఉందురు.

వ. అది భవదీయాశ్రమం బగుట నీ వెఱుంగుదు వదియునుంగాక. 12

టీక. భవదీయాశ్రమము = నీ నివాసము - నారదాశ్రమమనుట.

---

1. చ. బలుకన్. 2. క. నత. చ. నుత. 3. చ. తల్పమగరి. 4. చ. మపంకమయ. 5. చ. ణంబు. 6. చ. నుబొందుం.

చ. కలఁ డొకబోయ తన్నికట కాననభూమి; నతండు విల్లున
మ్ములు ధరియించి కల్మషసమూహము లెత్తినమేనుఁబోలెఁ బే
రలుక వహించెనేని హృదయంబు గలంగు [1]ధరాధరస్థలీ
నిలయవసత్కరీంద్రులకు; నిక్కము, తక్కుమృగంబు లోర్చునే? 13

టీక. తన్నికటకాననభూమిన్ = దాని చేరువనున్న అడవియందు; కల్మష......పోలెన్ = శరీరమును దాల్చిన పాపములగుంపులవలె; పేరలుక = ఎక్కువ కోపమును; వహించెనేనిన్ = పొందిన యెడల; ధరాధర......కరీంద్రులకున్ = కొండగుహాలయందు నివసించుచున్న ఏనుఁగులకును; హృదయంబు; కలంగున్ = కలఁతపడును; నిక్కము = ఇది యథార్థమే; ఓర్చునే? = సహింపఁగలవా? (లేవనుట.) అలం. ఉపమ, అర్థాపత్తి.

చ. అడవికి వేఁటమై నరిగి యాతఁ డొకానొకనాఁ డొకింతయున్
మెడ మలఁగింపలేక తన మేపొడ [2]లొండును రెండు నేకమై
పొడమఁగ [3]బీఁదకన్నుపడి [4]బూడిదపండునుబోలె బూఁనుపా
రెడు నొక దుప్పికిం గవియఁ బ్రేలి భయజ్వరతప్తచిత్తమై. 14

టీక. మెడ, మలఁగింపలేక = మెడను త్రిప్పలేక; తన, మేపొడలు = తన శరీరముమీఁది మచ్చలు; ఏకమై కలసి; పొడమఁగన్ = గోచరము కాఁగా; బీదకన్నుపడి=బెదరుచూపులుగలిగి; బూను పారెడు = బూజుపట్టిన; దుప్పికిన్, కవియన్ = దుప్పిని, ఎదుర్కొనఁగా; ప్రేలి = తపించి; భయజ్వరతప్తచిత్తయై = (దుప్పి) భయము అను రోగముచే తపింపఁబడిన మనస్సు కలదయి; (ముందున కన్వయము.)

తే. ఆ చమూరువు యూథంబుఁ దొఱఁచి చనియె, వింట నమ్మేర్చి బోయ [5]వెన్వెంటఁ [6]దఱిమె
లోలజిహ్వాకరాళ[7]విశాలముఖత, [8]నోలి భీతేందుమృగశాబమో యనంగ. 15

టీక. ఆ చమూరువు = ఆ దుప్పి; వింటన్, అమ్ము, ఏర్చి = ధనుస్సున బాణము సంధించి; బోయ; వెన్వెంటన్; తఱుమన్; లోల......ముఖతన్ = లీటుచున్న నాలుకలచే భయంకరమైన ముఖము కలుగుటను (రాహువున కనుట); ఓలిన్ = క్రమమున; భీతేందుమృగశాబమో అనఁగన్ = భయపడినట్టియు, చంద్రునియం దున్నట్టియు జింకపిల్లయో అనునట్లు; యూథంబుఁదొఱఁచి = మందను విడిచి; చనియెన్. అలం. ఉత్ప్రేక్ష.

ఉ. ఆ రురు వీఁగతిం బఱచి యగ్రమహిం బసి లేచి వెండియున్
భూరిరయంబునం జని వపుర్వ్యథ సంగమతీర్థతీరవి
స్ఫారలతానికుంజములు బల్విడి దూఱునెడం గిరాతుఁడున్
గ్రూరశిలీముఖంబు దొడి గుండియగాఁడఁగ నేసె; నేసినన్. 16

టీక. ఆ రురువు = ఆ దుప్పి; ఈగతిన్ = ఈరీతిగా; పఱచి = పరుగెత్తి; అగ్రమహిన్ = ముందున్న నేలపై; భూరిరయంబునన్ = ఎక్కువ వేగమున; వపుర్వ్యథన్ = శరీరమునందలి బాధచే; సంగమ......కుంజములు = సంగమతీర్థమునందలి విశాలములగు తీగలపొదలను; బల్విడిన్ = మిక్కిలి వేగముతో; క్రూరశిలీముఖంబు = వాఁడిబాణమును; తొడి = సంధించి, గుండియగాఁడఁగన్ = గుండెలలో నాటుకొనునట్లు; ఏసెన్ = కొట్టెను.

---

1. చ. దరోదర. 2. చ. లొడ్డును. 3. చ. జీత. 4. చ. బూడెదపన్ను. 5. చ. వెన్నంట. 6. క. దఱుమ. చ. దఱిమె. 7. చ. విశాఖ. 8. చ. నోపి.

సీ. ఆశరముఖనిభం బౌ శర మటుదాఁకఁ బవనాభిహతిఁ దూలు బంధుజీవ
కుంజంబు పువ్వులఁ [1]గూలించువిధమున నవనవక్షతజబిందువులు [2]దొరఁగఁ
జేయుచు వివృతాస్యసీమఁ బ్రాణానిలప్రస్థానపటహోగ్రరవ మనంగ
నార్తనాదముఁ గ్రమ్మ నది యేటి తెలినీటితెమలున నుఱికి దేదీప్యమాన
తే. హాటకవిమాన మెక్కి విద్యాధరేంద్రుఁ
డగుచు లావణ్యపుష్పాస్త్రుఁ డగుచుఁ జంద్ర
సాంద్రతనుకాంతి యగుచు నతీంద్రమహిమ
గగనమున కేఁగెఁ; దోలుమేను కానఁబడదు. 17

టీక. ఆశరముఖనిభంబు = అగ్నిజ్వాలతో సమానమైన; పవనాభిహతిఁ = గాలిదెబ్బచే; తూలు= తూలిపోవు - ఊఁగులాడు; బంధుజీవకుంజంబు = మంకెనచెట్లపొద; ['కుంజము = చెట్టు' అని పూర్వటీక.] కూలించువిధమునన్ = రాల్చురీతిని; నవ.....వులు = క్రొంగ్రొత్త రక్తపుబిందువులు; దొరఁగఁజేయుచున్ = స్రవించుచు; వివృతాస్యసీమన్ = తెఱవఁబడిననోటినుండి; ప్రాణానిల...... రవము, అనంగన్ = ప్రాణవాయువు బయలుదేఱునప్పటి డప్పుల గొప్పధ్వనులో యనునట్లు; ఆర్తనాదము = ఏడుపుధ్వని; క్రమ్మన్ = వ్యాపింపఁగా; అది ఆ దుప్పి; ఏటితెలినీటితెమలునన్ = నది యొక్క స్వచ్ఛమైన నీటి ప్రవాహమునందు; దేదీప్యమానహాటకవిమానము = మిక్కిలి ప్రకాశించు బంగారువిమానమును; విద్యాధరేంద్రుఁడు = విద్యాధరు లను దేవగణమునకు ప్రభువు; లావణ్యపుష్పాస్త్రుఁడు = చక్కఁదనమున (తళుకున) మన్మథుఁడు; చంద్రసాంద్రతనుకాంతి = చంద్రునివలె దట్టమైన దేహప్రకాశముకలవాఁడు; అతీంద్రమహిమన్ =ఇంద్రుని గొప్పతనమును మీఱిన గొప్పతనముతో; గగనమునకున్ = స్వర్గమునకు; ఏఁగెన్; తోలిమేను = వెనుకటి (జింక)దేహము. అలం. ఉపమ.

శా. చిత్తం బద్భుత మంద నమ్మృగవధాజీవుండు లోలోనఁ ద
ద్వృత్తంబున్ బలుమాఱు మెచ్చి నిజదుర్వృత్తిన్ విసర్జించుచున్
దత్తీరాంబువు నాడి క్రోలి విగతాతంకాత్ముఁడై శుద్ధి ద
ళ్కొత్తన్ ముక్తశరీరుఁడై కనియె దివ్యుల్ మెచ్చ నుచ్చస్థితిన్. 18

టీక. అమ్మృగవధాజీవుండు = ఆబోయవాఁడు; చిత్తంబు = మనస్సు; అద్భుతము, అందన్ = ఆశ్చర్యమును పొందఁగా; లోలోనన్ = మనస్సునందే; తద్వృత్తంబున్ = ఆ జరిగినదానినంతటిని - (తాను దానిని చూచి వెంబడించి, కొట్టఁగా, అది విద్యాధరుఁడగుట మున్నగుదానిని] ['వృత్తంబున్ = వృత్తిని' అని పూర్వటీక.] నిజదుర్వృత్తిన్ = తనచెడ్డవృత్తిని - జంతువులను జంపు పనిని; విసర్జించుచున్ = విడుచుచు; తత్తీర్థాంబువులు, ఆడి = ఆ తీర్థపుజలమున స్నానమాడి; క్రోలి = ఆ నీటిని త్రాగి; విగతాతంకాత్ముఁడై = నిర్విచారమైన మనస్సు కలవాఁడై; దళ్కొత్తన్ = ప్రకాశింపఁగా; ముక్తశరీరుఁడై = (విరువఁబడిన) ముక్తినిపొందిన - దేహముకలవాఁడై; దివ్యుల్ = దేవతలు; ఉచ్చస్థితిన్ = గొప్పస్థితిని; పొందెన్.

క. కావునఁ దత్తీర్థంబున, నేవలనఁ బరాసులగు విహీనమతులకున్
గైవల్యసిద్ధి యగునన, నీవలె నతిశుద్ధమతుల నేటికి నెన్నన్ ? 19

టీక. ఏవలనన్ = ఏవైపునను - ఏవిధముననైననుసరే; పరాసులు = మరణించినవారు; విహీనమతులకున్ =బుద్ధిలేనివారికిని - మూర్ఖులకును; కైవల్యసిద్ధి = మోక్షసిద్ధి; అగున్ = కలుగును. అలం. అర్థాపత్తి.

1. చ. గూరించు. 2. చ. ట. దొరుగ.

సీ. సంధ్యల [1]మూఁట నిచ్చ [2]నివాళు లిచ్చుచు బిరుదాంకమాలికల్ పేరుకొనుచు
లోచూపు దివుట నాలోకించి చొక్కుచుఁ బులకాశ్రుగాద్గద్యములఁ బొరయుచు
శ్రుతు లెట్టు లట్ల సంస్తుతు లాచరించుచు [3]వీనులఁ దత్కథా[4]వితతి వినుచుఁ
గరతాళగతులఁ [5]జొక్కటముగా నాడుచు [6]నావేశమూర్ఛల నలఁతఁ గనుచు
తే. విష్ణు సేవింతు రచట నవ్విబుధవల్లభాజనంబులు తత్కృపాభాజనంబు
లమ్మహాక్రీడనస్థలి నాచరించె, లంఘనాక్రీడనము దొల్లి లచ్చిమగఁడు. 20

టీక. సంధ్యల, మూఁటన్ = మూఁడు సంధ్యలయందును; నిచ్చ = ఎల్లప్పుడు; నివాళులు = హారతులు; పేరుకొనుచున్ = పఠించుచు; లోచూపున్ = అంతర్దృష్టిని; దివుటన్ = ప్రూనికతో; చొక్కుచున్ = పరవశమగుచు; పులకాశ్రుగాద్గద్యములన్ = గగుర్పాటు, కన్నీరు, గొంతునుండి మాట రాకుండుటలను; పొరయన్ = పొందును. శ్రుతులు = వేదములు; ఎట్టు = ఎట్లు వర్ణించునో; సంస్తుతులు, ఆచరించుచున్ = కొనియాడుచును; తత్కథావితతిన్ = ఆ విష్ణుని కథలను; కరతాళగతులన్ = చేతులతో తాళములను వేయుచు - చప్పట్లు చఱచుచు; చొక్కటముగాన్ = చక్కఁగా; ['చొక్కటము = స్వచ్ఛము' అని పూర్వటీక.] ఆవేశమూర్ఛలన్ = పరవశతచేతను తెలివితప్పుటచేతను; అలఁతన్, కనుచున్ = అలసటపొందుచు; అవ్విబుధవల్లభాజనంబులు = ఆదేవతాస్త్రీలు, తత్కృపాభాజనంబులు = ఆ విష్ణుని దయకు పాత్రము లగువారు; తొల్లి = పూర్వము; లచ్చిమగఁడు = విష్ణువు; అమ్మహాక్రీడనస్థలిన్ = ఆ గొప్ప యాఁటలాడుచోట; లంఘనాక్రీడనమున్ = గంతులాఁటను; ఆచరించెన్ = చేసెను.

మ. వినుమ, మఱి శౌరికి నోడి సంగమమరుద్విద్వేషి యెచ్చో[7]టికో
చని వెండిం జనుదెంచి యచ్చట శిలాసంచ్ఛన్న దేహంబుతో
డ నిలాగర్భమునందు డాఁగఁ గని [8]గాఢక్రోధుఁడై దేవకీ
తనయుం డా[9]శిల ద్రొచ్చి వైచి [10]మెదిపెన్ దద్దైత్యుఁ జూర్ణంబుగన్. 21

టీక. సంగమమరుద్విద్వేషి = సంగముఁడను రాక్షసుఁడు; వెండిన్ = మఱల; శిలాసంఛన్న దేహంబుతోడన్ = ఱాతిచే కప్పఁబడిన దేహముతో; ఇలాగర్భమునందున్ = భూమిలోపలిభాగమున; గాఢక్రోధుఁడై = ఎక్కువ కోపము కలవాఁడై; ద్రొచ్చివైచి = తొలఁచి, పగులఁగొట్టివైచి; తద్దైత్యున్ = ఆ రాక్షసుని; చూర్ణంబుగాన్, మెదిపెన్ = పిండి యగునట్లుగా నలిపెను.

క. పువ్విలుతుతండ్రి యచ్చట, మువ్వంకమురువున మురళి మ్రోయించె మనం
[11]బువ్విళ్లూరఁగ శ్రుతులకు, నవ్విధ[12]ము తదీయపదయుగాంకము [13]దెలుపన్. 22

టీక. పువ్విలుతుతండ్రి = మన్మథునితండ్రియగు విష్ణువు; మువ్వంకమురువునన్ = త్రిభంగీపద్ధతితోనుండి; శ్రుతులకున్ = చెవులకు; తదీయపదయుగాంకము = అతని రెండుపాదముల గుఱుతులు.

క. మహి నేవంవిధచిత్రావహమగు సద్గుణంపువాకిట[14]మహిమల్
బహువిధముల వినుతింపఁగ, నహిపతియుం జాలఁ డనిన నన్యులవశమే ? 23

---

1. మూఁడు. 2. చ. నివారువిచ్చు. 3. చ. విష్ణునిం. 4. చ. వినుతి. 5. శ. ర. మిక్కుటము. 6. చ. నావేశ. 7. చ. టికిం. 8. చ. బాధ. 9. చ. సిల. 10. మెదపెన్. 11. క. బువ్విళులూ, చ. ట. శ. ర. బుర్విళ్లూ. 12. శ. ర. మఁదడీ. 13. చ. దెలుఁపన్. 14. చ. మహితుల్.

టీక. మహిన్ = భూమిపై; ఏవంవిధచిత్రావహము = ఇట్టి విచిత్రములు గల్గించునది. చిత్రవంతము; బహుముఖములన్ = పెక్కు గొంతుల; వినుతింపఁగన్ = కొనియాడుటకు; అహిపతియున్ = శేషుఁడును; చాలఁడు = తగఁడు; అలం. అర్థాపత్తి.

సీ. తనకటాక్షములు సంతానచింతారత్న నిర్మాణపరమాణునికర మనఁగఁ
దనవిలాసంబు మచ్ఛత్రుశాంబరనిషూదనపాలితపుష్పపతాక యనఁగఁ
దన మనస్సరసి సంతత చిదానందవైభవమరాళము కున్కిపట్టనఁగఁ
దనప్రసాదంబు భక్తవరేణ్యదుర్గతిక్షాళనోచితచంద్రగోళి యనఁగ

తే. వెలయు నేదేవి యాదేవి విద్రుమద్రుమ ద్రుమ ద్రుమ(?) తనుకాంతిభద్ర పరమ
మాయ భువనేశ్వరి [1]వసింప మధువిరోధి, [2]ధామమునఁ గల్గు పశ్చిమద్వార మమరు.

టీక. తనకటాక్షములు = తనకడకంటి చూపులు; సంతాన......నికరము = కల్పవృక్షము యొక్కయు, చింతామణియొక్కయు సృష్టికొఱకైన పరమాణుసమూహము; (భువనేశ్వరీదేవి కటాక్షములు కోరిన కోరికల నొసంగునవి యనుట). మద్......పతాక = నా శత్రువైన మన్మథుఁడు పాలించుపతాక-బిరుదైనది; మనస్సరసి = మనస్సనెడి సరస్సు; సంతత......మరాళమునకున్ = శాశ్వతమగు చిదానందవిభవమను హంసకు; ఉన్కిపట్టు = నివాసము; తనప్రసాదంబు = తన యను గ్రహము; భక్త......చంద్రగోళి = ఉత్తమభక్తుల దుర్గతిని కడిగివేయుటకుఁ దగిన వెన్నెల [వెన్నెల వలని మంచువలన కడుగఁబడినట్లు ఆ దుర్గవలన దుర్గతులు కడిగివేయఁబడుననుట.] విద్రుమ...... కాంతి = పగడపుఁజెట్టుయొక్క పింగళవర్ణపు దేహకాంతి కలది; పరమమాయ = మహామాయాస్వరూపిణి; మధువిరోధిధామమునన్ = మధురాక్షసునికి శత్రువగు విష్ణుని నివాసమగు పాండురంగక్షేత్రమున; అమరున్ = వెలయుచుండును. అలం. ఉత్ప్రేక్ష, రూపకము, ఉదాత్తము.

ఉ. పోర్మహిషున్ నిజాంఘ్రిఁగల బొట్టనవ్రేలుదం[3]మట్టి పట్టి మున్
బేర్మిఁ దదంగమున్ [4]మెదిపి పెట్టిన నెత్తురుబొట్టుఁ[5]బోలె జ్యో
తిర్మయవీక్షణం బలిక[6]దేశమునం గల దుర్గ స్వర్గదన్
[7]వార్మణిధారి [8]యుత్తరపువాకిట నిల్చినవాఁడు కాపు[9]గాన్. 25

టీక. పోర్ = పోరు - యుద్ధముచేయునట్టి; మహిషున్ = మహిషాసురుని; నిజాంఘ్రిఁగల = తన పాదమునందున్న; మట్టి, పట్టి = త్రొక్కిపట్టి; మున్ = తొలుత; పేర్మిన్ = ప్రీతితో; తదంగమున్ = ఆ యసురుని దేహమును; మెదిపి = నలిపి; జ్యోతిర్మయవీక్షణంబు = తేజోమయమగు (అగ్నిరూపమగు) కన్ను; అలికదేశమునన్ = నొసటియందు; దుర్గన్ = కాళిని; స్వర్గదన్ = మోక్షము నిచ్చుదానిని; కాఁపుగన్ = రక్షణగా; వార్మణిధారి = నీటియందు పుట్టిన కౌస్తుభమణిని ధరించిన విష్ణువు; ["వార్మణధారి = కవచసమూహములను ధరించినవఁడు - విష్ణుఁడు" అని పూర్వటీక.] అలం. ఉపమ.

క. తరణియు భైమియును బరస్పర ముచ్చటఁగూడి నిగుడఁ బావనమగు త
త్సరిదంబువునం దాడిన,నరునకు నవ్వారి చరణనఖమున వెడలున్. 26

టీక. తరణియున్ = ఆ పేరుగల నదియును; నిగుడన్ = వ్యాపింపఁగా - ప్రవహింపఁగా; పావనమగు = పవిత్రమైన; తత్సరిదంబువునందున్ = ఆ నీటిలో; ఆడిన = స్నానముచేసిన; నరు

1. చ. వసించు. 2. చ. వామ. 3. చ. మట్ట. 4. చ. మెదటి. 5. చ. వోలె. 6. క. దేహము. చ. కేశము. 7. క. వర్మణ. చ. వార్మణి. 8. క. నుత్త. చ. యుత్త. 9. క. గన్. చ. గాన్.

నకుఁ; అవ్వారి = ఆ నదీజలము; చరణనఖనముకుఁ = కాలిగోటియందు; (అందు స్నానముచేసిన వారు విష్ణువు లగుదురు - అనఁగా వారికి విష్ణుసారూప్యము కలుగుననుట.]

క. ఎవ్వఁడు వ్యాధిగ్రస్తుం, డెవ్వఁడు భయవిహ్వలాత్ముఁ డెవ్వం [1]డధనుం
డవ్వాఁ డచ్చటి దుర్గం, బువ్వలఁ [2]బూజించి యిష్టభోగము లొందున్. 27

టీక. భయవిహ్వలాత్ముఁడు = భయముచే చలించిన మనస్సు కలవాఁడు; ఇష్టభోగములు = కోరిన సుఖములను.

వ. ఇన్నాలుగు నంతర్ద్వారంబు లింక బహిర్ద్వారంబుల ప్రకారం బాకర్ణింపు మని గోకర్ణకుండలుం డాకర్ణనవశంవదాశయుండగు కుశేశయాసనసూతి కిట్లనియె. 28

టీక. అంతర్ద్వారంబులు = లోపలి ద్వారములు; బహిర్ద్వారంబులు = బయటి ద్వారములు; గోకర్ణకుండలుండు = శివుఁడు; ఆకర్ణనవశంవదాశయుండు = వినుటయందు ఆసక్తమగు మనస్సు కలవాఁడు; కుశేశయాసనసూతికిఁ = కమలాసనుఁడగు బ్రహ్మకుమారుఁడగు నారదునిఁగూర్చి.

సీ. కలికురక్కసుని నొక్కరుని [3]జిక్కఁగఁ [4]ద్రొక్కి భద్రకాళిక [5]యొందుఁ బ్రస్ఫురించు
నిందుండువిధమున నెందు నే వసియింతు నలిలేక కోటీశ్వరాహ్వయమునఁ
బ్రవహించు నెందు నభ్రంకషోర్ములఁ బుణ్యజల యను జలధియోషామతల్లి
నతజగత్త్రితయ శ్రీనారాయణీదేవి వర్తించు నెందేని వార్త కెక్కి

తే. యట్టి [6]యట్టాలతోరణ[7]హట్టకుట్టి, మస్ఫురద్గోపురైడూకమణిమయోరు
హర్మ్యరమ్యంబు కరవీరమను పురంబు, పశ్చిమద్వారమగు జగత్పతినగరికి. 29

టీక. కలికురక్కసునిఁ = క్రూరరాక్షసుని; చక్కఁగఁ = బాగుగా; ప్రస్ఫురించుఁ = ప్రకాశించునో; అలి = భేదము ('కొఱఁత'అని పూర్వపుటీక.) అభ్రంకషోర్ములఁ = ఆకసము నంటు నెత్తగు అలలతో; జలధియోషామతల్లి = సముద్రమునకు భార్యయగు గొప్పనది; నతజగత్త్రితయ = వంగియున్న (లొంగిన) మూఁడులోకములు-(స్వర్గ, మర్త్య, పాతాళములు) కలది; వార్తకుఁ, ఎక్కి = ప్రసిద్ధికెక్కి; అట్టాల......రమ్యంబు=బురుజులు, తోరణములు, అంగడివీధులు, తిన్నెలు, ప్రకాశించు గోపురములు, డడిగోడలయిండ్లు, మణులుతాపిన మేడలు మున్నగువానిచే చక్కనిది; జగత్పతినగరికిఁ= పాండురంగక్షేత్రమునకు. ["ఏడూక = లోపల యెముకలు పేర్చి మెత్తినగోడ'అని పూర్వటీక. ఏడూక మన డడిగోడ - ఐడూకము డడిగోడల యిల్లు.]

తే. క్షోణిఁ గృష్ణానదీతీర శూర్పలాఖ్య,తీర్థరాజాధివాసినై తీర్థచరణ
ధామమణి సౌధదక్షిణద్వారమేను,జాగరూకతఁ బాలింతు యోగివర్య! 30

టీక. క్షోణిఁ = భూమిపయి; కృష్ణా......వాసినై = కృష్ణానదీతీరమున నున్న శూర్పల మను ప్రధానక్షేత్రమున నివసించువాఁడనై; తీర్థచరణధామమణిసౌధదక్షిణద్వారము = తీర్థము పాదమునఁగల విష్ణుని నివాసమగు మణిసౌధముయొక్క దక్షిణద్వారమును.

శా. గర్వోద్రిక్తతరంగసంఘముల వీఁకన్ బుష్కరిణ్యాపగా
వార్వేణుల్ దనయుత్తరంపుదెసఁ బర్వంగా గదాపాణినై
సర్వాలంకృతశాలినై వెలయుఁ గంసధ్వంసనాగారరా
ట్పూర్వద్వారమునం ద్రివిక్రముఁడు నై పొంగన్ బయోదచ్ఛవిన్. 31

1. క. డధముం. చ. ట. డధనుం. 2. చ. బూజించు. 3. చ. ట. జక్కఁగ. 4. చ. ద్రొక్క. 5. చ. ట. యందు. 6. చ. యిటల. 7. చ. పట్ట.

టీక. గర్వోద్వృత్తతరంగసంఘములపేఁకన్ = పొంగిపొరలుచున్న తరంగముల విజృంభణముచే; పుష్కరిణ్యాపగావాహ్వేణుల్ = పుష్కరిణి యను నదియొక్క నీటిప్రవాహములు; పర్వంగాన్ = ప్రవహింపఁగా; సర్వాలంకృతశాలినై = బాగుగ అలంకరింపఁబడినవాఁడనై; కంస.....ద్వారమునన్ = కంసుని చంపిన కృష్ణుని గొప్పసౌధముయొక్క తూర్పుద్వారమున; మై = దేహము; పయోదచ్ఛవిన్ = నీలమేఘకాంతితో; వెలయున్.

క. [1]ఖరనఖరదళితరక్షః, పరివృఢవక్షోఽరుణాంబు పరిచితదీప్తా
త్యురుకేసరదోహుఁడగు, నరకేసరి యుత్తరంబున గవనిఁ గాంచున్. 32

టీక. ఖర.....దోహుఁడు - ఖరనఖర = వాఁడిగోళ్లచే; దళిత = చీల్పఁబడిన; రక్షఃపరివృఢ = రాక్షసరాజైన హిరణ్యకశిపునియొక్క; వక్షః = ఱొమ్మునందలి; అరుణాంబుః = రక్తద్రవముచే; పరిచిత = సంబంధముపొందిన; దీప్తాత్యురుకేసరదోహుఁడు = ప్రకాశించుచు, మిక్కిలి గొప్పవైన వెండ్రుకల (జూలు) దోహదము (ఎరుపు)కలవాఁడు; నరకేసరి = నరసింహుఁడు; ఉత్తరంబుగవనిన్ = ఉత్తర ద్వారమును.

క. లోనాలుగు వెలినాలుగు, నైన మహాద్వారభూము లపవర్గశ్రీ
నీనఁగ నీనగరాద్ధరు, శ్రీనగరగణితవిభూతిఁ జెంపు మునీంద్రా! 33

టీక. అపవర్గశ్రీన్ = మోక్షసంపదను; ఈనఁగన్ = కలుగఁజేయఁగా - ఇచ్చుటను; ఈ, నగరాద్ధరు = ఈ కృష్ణునియొక్క; శ్రీనగరగణితవిభూతిన్ = క్షేత్రముయొక్క గొప్ప సంపదను.

వ. అని మఱియు నక్కఱియవేల్పునల్పగుణప్రకటనపరుండై హాయం డిట్లనియె. 34

టీక. కఱియవేల్పునల్పగుణప్రకటనపరుండై = ఆ కృష్ణుని గొప్పగుణములను తెల్పుటయం దాసక్తుఁడై.

ధర్మరాజు తమ్ములతోఁగూడఁ బాండుగంగక్షేత్రమునకుఁ బోయినకథ

చ. అభిముఖతత్త్వశాలి సుకృతాఢ్యుఁడునౌ చతురాస్యమానస
ప్రభవుఁడు శిష్యసంఘము లపారము గొల్వఁగఁ దొల్లి యొక్కనాఁ
డిభపురనాథుఁ గౌరవకులేశ్వరు ధర్మజుఁ గానఁబోవ భూ
విభుఁ డతఁ డాతనిం [2]దెలిచె వేయివిధంబుల సాధుపూజలన్. 35

టీక. అముఖతత్త్వశాలి = అవగాహితమగు భగవత్తత్త్వము కలవాఁడు; సుకృతాఢ్యుఁడు = గొప్ప పుణ్యాత్ముఁడు; చతురాస్యమానసప్రభవుఁడు = బ్రహ్మమానసపుత్రుఁడైన సనందనుఁడు; అపారములు = అంతములేనివి; ఇభపురనాథున్ = హస్తినాపురాధిపతిని; భూవిభుఁడు, అతఁడు = ఆరాజు-ధర్మజుఁడు; ఆతనిన్ = మునిని; సాధుపూజలన్ = లెస్సగా నుండు పూజలచే-మర్యాదలచే; తెలచెన్ = తృప్తిపఱిచెను.

క. అహితాహితకారణ[3]వి, గ్రహులును సదనుగ్రహప్రగల్భులు [4]నగు నా
గహనగృహావాసచర్యా, మహితతపోధనులసంగమము పొగడొందెన్. 36

టీక. అహితాహితకారణవిగ్రహులును = (రాజుపక్షమున) శత్రువులకు అహితమునొసరించుటకునైన విరోధముకలవారు, (మునిపక్షమున) హితముకానిదానికి (చెడ్డదానికి) అహితము నొనర్చు

1. క. కర. చ. ట. ఖర. 2 చ. దలఁచె. 3. చ. దుష్ప్రహులు. 4 చ. నగరా.

టమనైన దేహము కలవారు; (అనిష్టములను నశింపఁజేయ నవతరించినవారనుట.) సదనుగ్రహప్రగల్భులు = (రాజుపక్షమున -) మంచివారిని ఏలుటయందు ప్రతిభకలవారు, (మునిపక్షమున) గొప్పఅనుగ్రహము (దయ) నందు ప్రతిభకలవారు; గహన......సంగమము = గహనము నివాసముగాఁ గల ముని యొక్కయు, గృహము నివాసముగాఁగలిగి తపస్సుచేయు (రాజయోగి)రాజుయొక్కయు కలిసికొనుట; బొగడొందెన్ = కీర్తింపఁబడెను. అలం. శ్లేష, క్రమము.

ఉ. తమ్ములుఁ దాను నప్పుడు పృథాప్రథమాత్మజుఁ డంతరంగముల్
క్రమ్మినశోకవహ్నిహతిఁ గందుచుఁ గేలు మొగిడ్చి బ్రహ్మచి
త్తమ్మునఁ గల్గు సంయమివతంసముఁ బల్కు ఖరాంశుతాపత
ప్తమ్మగు తేనియం జినుకు తమ్ములఁబోల సబాష్పనేత్రముల్. 37

టీక. పృథాప్రథమాత్మజుఁడు = కుంతిపెద్దకొడుకు - ధర్మరాజు; అంతరంగముల్ = మనస్సును; క్రమ్మిన = వ్యాపించిన; శోకవహ్నిగతిన్ = శోకాగ్నియొక్క దెబ్బచే; కందుచున్ = తపించుచు; కేలు, మొగిడ్చి = చేతులుజోడించి; సబాష్పనేత్రముల్ = నీళ్లతో నిండియున్న కన్నులు; ఖరాం శుతాపతప్తమ్ము = సూర్యుని వేఁడిమిచే వాడినది; అగు = అయిన; తేనియం, జినుకు = తేనెను స్రవించుచున్న; తమ్ములన్ = పద్మములను; పోలన్ = పోలఁగా; బ్రహ్మచిత్తమ్మునఁగల్గు = బ్రహ్మ మనస్సునుండి పుట్టిన; సంయమివతంసమున్ = మునిశ్రేష్ఠునిఁగూర్చి - బ్రహ్మమానసపుత్రుఁడగు సనం దనునిగూర్చి. అలం. ఉపమ.

క. ఏ భీరువనై వేఁడెద, నో భద్రప్రద! ప్రసాద మొసఁగుము నాకున్
మీ భావంబునఁ బోడమని, దీ భువనత్రయమునందు నింతయుఁ గలదే? 38

టీక. భీరువనై = భయస్వభావుఁడనయి; భద్రప్రద ! = శుభములొసఁగూర్చువాఁడా ! ఇంత యున్ = కొంచెమును - అణుమాత్రమును.

శా. చింతాకంతయు వెన్కఁదియ్యక కురుక్షేత్రంబునన్ బాపసం
క్రాంతస్వాంతుఁడనై సుహృత్సుతపితృభ్రాతృాదులం జంపి య
త్యంతద్రోహ మొనర్చియుం దిరిగెదన్ బ్రాణంబుతో మత్సముం
డంతర్వాణివతంస! యెవ్వఁడు గలం డాహా! వితర్కింపఁగన్. 39

టీక. పాప......స్వాంతుఁడనై = పాపముచే ఆక్రమింపఁబడిన మనస్సు కలవాఁడనై; మత్స ముండు = నావంటివాఁడు; అంతర్వాణివతంస ! = జ్ఞానిశ్రేష్ఠుఁడా !

క. వంగడపు వెదురుఁ గోపపు, టింగలమున నేర్చి కనిన యీసిరి నిందా
సంగతిఁ బొగ[1]చూరెను; త, ద్భంగురమౌక్తికము; [2]దీనఁ బసిమియుఁ గలదే? 40

టీక. వంగడపువెదురున్ = వంశము అను వెదురును; కోపపుటింగలమునన్ = కోపాగ్నిచే; ఏర్చి = కాల్చి; కనిన = సంపాదించిన; ఈ సిరి = ఈ రాజ్యసంపద - రాజ్యలక్ష్మి; నిందాసంగతిన్ = నిందయొక్క సంపర్కముచే; తద్భంగురమౌక్తికము = భంగశీలమైన ఆ వెదురులోని ముత్యము; పొగ చూరెను = మలినమయ్యెను; దీనన్ = ఈ ముత్తియమువలన; పసిమియున్ = కాంతియు; అలం. రూపకము.

---

1. చ. ట. సూరిన. 2. చ. దీని.

మ. అసిధారా[1]దళితాత్మబంధుభుజమధ్యస్వైరనిర్య[2]ద్వసా
మసనై పుట్టిన యిమ్మహాదురితమున్ [3]మన్నొట్టియున్ [4]వాజిమే
ధసమిద్ధానలభూతిచే నుసిమియున్ దప్పింపలేనైతి; నీ
కస టెప్పాటఁ దొలంగు? నెట్లు లగుదుఁ గల్యాణకల్యాత్ముఁడన్? 41

టీక. అసి.....వసా = వాఁడికత్తిచే సంహరింపఁబడిన స్వీయ బంధువుల భుజమధ్యమున నుండి స్వేచ్ఛగాఁ (వెల్లుగా) కారుచున్న ద్రవరూపమైన క్రొవ్వుచేత; మసనై = మలినమై-మఱకియై; ఇమ్మహాదురితమున్ = ఈ గొప్ప పాపమును; మన్నొట్టియున్ = భూమిని దానముచేసియును; వాజిమేధసమిద్ధానలభూతిచేన్ = అశ్వమేధయాగసమయమున ప్రజ్వలించు నగ్ని యొక్క సంపదచేతను - గొప్ప అశ్వమేధయాగము నొనర్చియు; ఉసిమియున్ = తుడిచియును; తప్పింపలేనైతిన్ = పోఁగొట్టఁ జాలనైతిని. ఏదైన వస్తువుయొక్క మఱకి పోవుటకు మన్నుపెట్టియు, బూడిదపెట్టియు తోముట సహజము; అట్లు తోమినయెడల ఆ మఱకి పోవును. కాని యీ పాప మను మఱకి ఎట్లుచేసినను పోలేదు. [మన్నొట్టుట = మన్నుపెట్టుట - భూమిదానము చేయుటయు; భూతి = సంపద, బూడిదయు;] [పూర్వటీకలో 'అసిధారావధిత' అను పాఠము గ్రహింపఁబడి 'వధిత = చంపఁబడిన' అను నర్థము చేయఁబడినది.] ఈకసటు = ఈ పాపము, ఈ మఱకి; [పూర్వటీకలో 'పాపము' అనిమాత్ర మున్నది;] ఎప్పాటన్ = దేనివలన - ఏరీతిని; తొలంగున్? = నశించును? కల్యాణకల్యాత్ముఁడన్ = శుభములచే ఒప్పువాఁడను; ఎట్టులగుదున్? అలం. రూపకము, శ్లేష.

క. కర్మము కర్మాంతరహృ, త్కార్మఠ మగు హానిః బూనఁ గానము; నిరయాం
తర్మజ్జనాభిముఖు నీ, దుర్మదుఁ బడనీక నిలుపు ద్రుహిణప్రభవా! 42

టీక. కర్మాంతరహృత్కార్మఠము, అగు = వేఱొక (చెడ్డదైన) కర్మమును నశింపఁజేయునట్టి పనికలది; అగుచుదానిన్ = అగునట్టి కర్మనాశకమగు; కర్మము = పనిని; పూనన్, కానము = పూనుటకు చూడ లేకున్నాము; నిరయాంతర్మజ్జనాభిముఖున్ = నరకమునందు మునుఁగుటకు సిద్ధముగా ఉన్నవానిని; దుర్మదున్ = దురహంకారిని; పడనీక = నరకమున పడనీయక; నిలుపుము = నిలువఁబెట్టుము - ఉద్ధరింపుము. [పడనున్నవానిని పడకుండ నిలుపుట మేలని భావము.] ద్రుహిణప్రభవా! = బ్రహ్మ కుమారుఁడా!

క. మావంటివారలకుఁ బా, పావిలదృక్కులకు ధర్మ మారయని యస
ద్భావులకు భవాదృశులగు, శ్రీవైష్ణవవరులె దిక్కు చిత్పూర్ణమతీ! 43

టీక. పాపావిలదృక్కులకున్ = పాపముచేత కలఁగిన చూపుకలవారికి; అసద్భావులకున్ = సదభిప్రాయము లేనివారికి; శ్రీవైష్ణవవరులె = ఉత్తములగు విష్ణుభక్తులే; దిక్కు = శరణు; చిత్పూర్ణమతీ! = జ్ఞానముచే నిండిన బుద్ధికలవాఁడా!

సీ. అని యుధిష్ఠిరుఁడు పల్కిన సనందనుఁ డాత్మ నలరి యిట్లను నమ్మహాత్ముతోడ
'నీపాల శాంబరీగోపాలుఁడు గలాఁడు పరమవైష్ణవధర్మపరత మెలఁగు
నీమోముఁ గనుఁగొన్న నిఖిలాఘము[5]లు వోవు నెగదాఁకి యడఁగు[6]తూనిగలలీల
హరిభక్తి యను గంగ కడ్డమే? కలుషపుటిసుకచేఁ గట్టిన యసదు[7]కట్ట

1. క. వధితా. శ. ర. దళితా. 2. శ. ర. ధ్వనిన్. 3. క. మన్నొట్టి. చ. శ. ర. మన్నొట్టి. 4. చ. వాసి. 7. చ. పాల. 5. క. లుఁబోవు. చ. లువోవు. 6. క. తూలిక. చ. తూనిక. ట, మాలిక. 7. క. గట్ట. చ. కట్ట.

తే. దురితరాశి మునింగి శ్రీవరునిభటుఁడు, తోయపద్మదళచ్ఛాయఁ బాయఁబడఁడు
రేయుఁబగలు వృథా చింతసేయనీవు, ప్రాకృతుండవె? భూలోక[1]పాకవిమత! 44

టీక. నీపాలన్ = నీపక్షమున; శాంబరిగోపాలుఁడు = మాయగొల్లఁడు - గోపాలుఁడుగా అవతరించిన విష్ణువు; కల్యాఁడు = ఉస్నాఁడు; పరమవైష్ణవధర్మపరతన్ = ఉత్తములగు విష్ణుభక్తుల యాచారములయెడ నాసక్తితో; మెలఁగు = సంచరించుచున్న; నిఖిలాఘములు = సమస్తపాపములును; సెగదాఁకి = అగ్నిని తాఁకి; అడఁగు = నశించునట్టి - మాడిపోవునట్టి; తూనిగలలీలన్ = తూనీఁగల (పతంగముల)వలె; 'పతంగవద్వహ్నిముఖం వివిక్షుః' అని కుమారసంభవమున కాళిదాసు. ['తూలికల లీలన్ = దూదియేకుల విధమున' అని పూర్వటీక.] కలుషపుటిసుకచేన్ = పాపము అను ఇసుకతో; అసదుకట్ట = చిన్నఆనకట్ట; తోయపద్మదళచ్ఛాయన్ = నీటిలోనున్న తామరాకురీతిని; వృథాచింత = పనికిమాలిన విచారము; ప్రాకృతుండవె? = మూఢుఁడవా? భూలోకపాకవిమత! = భూలోకమునకు ఇంద్రుఁడైనవాఁడా! - ధర్మరాజా! అలం. ఉపమ, రూపకము.

ఉ. కర్తవు గావు హర్తవునుగా వభిరక్షివి గావు నీవు స
త్కీర్తిధురీ[2]ణ! యింతకును గృష్ణుఁడె మూలము గాన పుణ్యవి
స్ఫూర్తిఁ బాపవైకృతముఁ బూరుషుఁ బొందునె? యస్వతంత్రతన్
వర్తిలుచున్కిఁ; దెద్దునకు వచ్చునె పాకగుణాగుణావళుల్. 45

టీక. కర్తవు = సృష్టికర్తవు - చేయువాఁడవు; హర్తవు = నశింపఁజేయువాఁడవు; అభిరక్షివి = రక్షించువాఁడవు; సత్కీర్తిధురీణ! = గొప్పకీర్తికలవాఁడా! పుణ్యవిస్ఫూర్తియున్ = పుణ్యముల ప్రకాశమును; పాపవైకృతమున్ = పాపముల వికారమును; అస్వతంత్రతన్ = స్వాతంత్ర్యము లేకుండునట్లు; వర్తిలుచున్కిన్ = ప్రవర్తించుచుండుటచే; పూరుషునిన్ = మనుష్యుని; పొందునె! [పుణ్యపాపములు కర్మానుసారములనియు, పురుషుఁడు నిమిత్తమాత్రుఁడనియు భావము.] పాకగుణాగుణావళుల్ = వంటయొక్క మంచిచెడ్డలు - రుచులు; తెడ్డునకున్ = అబకకు; వచ్చునె? = రావుగదా! అలం. దృష్టాంతము.

క. పరులకతంబుననేనియు, హరి నొకమరి దలఁప భద్రమగు ఖలులకుఁ; ద
న్నిరతస్మరణా[3]చరణ, స్ఫురణాఢ్యులు నిత్యపదవిఁ బొందుట యరుదే? 46

టీక. ఖలులకున్ = దురాత్ములకు; పరులకతంబుననేనియున్ = శత్రువులకారణముచేతనైనను; తన్నిరతస్మరణాచరణస్ఫురణాఢ్యులు = అతనిని ఎల్లపుడును స్మరించుటచే సంపన్నులగువారు - ఎల్లపుడును భగవంతుని స్మరించువారు; నిత్యపదవిన్ = మోక్షమును; అరుదే! = ఆశ్చర్యమా! - కష్టమా! అలం. అర్థాపత్తి.

తే. [4]ధారుణీవల్లభులకంటెఁ దక్కుచోట, నశ్వమేధంబు నిష్ఫలంబగు విధమున
నర్థవంతంబు గాదు సత్యాకళత్ర, [5]సేవ కిలఁ బూని సేయు పాచితముశతము. 47

టీక. తక్కుచోటన్ = మిగిలినయెడ; పాచితముశతము = నూఱు ప్రాయశ్చిత్తములు; అర్థవంతంబు = ప్రయోజనకారి - ఉపయుక్తమైనది. అలం. ఉపమ.

క. భ్రాతృవధపితృవధాదుల, పాతకములు రావు విష్ణుపదభక్తులకున్;
దైతేయసూను లిరువురు, నేతద్వ్యవహారసాక్షు లిభపురనాథా! 48

1. చ. ట. పాకవిమత! క. పాలవినుత. 2. చ. ణుఁడిం. 3. చ. చరణా. 4. శ. ర. ధారణీ.
5. శ. ర. సేవకుల.

టీక. ఇభపురనాథా! = హస్తిపురప్రభువగు ధర్మజా! వైతేయసుతులు = రాక్షసకుమారులు-ప్రహ్లాద, విభీషణులు; వితథవ్యవహారసాక్షులు = ఇట్టిదానికి సాక్షిభూతులు. (విభీషణుఁడు భ్రాతృవధ మునకును, ప్రహ్లాదుఁడు పితృవధమునకును సాక్షులు.)

శా. ఆ కంసారిప్రశంస నీమది సుదీర్ణాంహస్స్మృతిం దాల్పఁ బె
ల్లాకంపించి తొలంగుఁగాక, నిను డాయన్నేర్చునే పాతకా
నీకంబుల్? దివిఁగన్న చీఁకటుల నెందేఁ గంటిమే? వింటిమే?
క్ష్మాకాంతాధిప! లోకసంగ్రహమనీషం జేసి తీ ప్రశ్నమున్. 49

టీక. ఉదీర్ణాంహస్స్మృతిన్ = మిక్కిలి వెల్లడియగునట్లుగా; పాతకానీకంబుల్ = పాపముల గుంపులు; పెల్లు = ఎక్కువగా; ఆకంపించి = వణఁకిపోయి; ఈ ప్రశ్నమున్ = ఇట్లు నన్ను పృచ్ఛ చేయుటను; లోకసంగ్రహమనీషన్ = జనులు తరించుమార్గముకొఱకగు కోరికతో; చేసితి = చేసితివి. అలం. దృష్టాంతము.

క. అటులేనియుఁ జెప్పెద నీ, పొటిపొటి తలపోఁతలెల్లఁ బోవనడువ్రు; మా
రట మఁడుగు; నెమ్మనము స్థిక్కటిగా నొనరించి గట్టిగా విను మధిపా! 50

టీక. అటులేనియున్ = అట్లయినయెడల - లోకసంగ్రహార్థ మడిగినయెడల-నీపొటిపొటితల పోఁతలు = నీచిన్నచిన్న ఆలోచనలు - కొంచెపుటాలోచనలను; పోవనడువుము = పోఁగొట్టుము; ఆరటము = కలఁతపాటును; ఉడుగుము = విడువుము; ఒక్కటిగాన్ = చలనములేక - స్థిరముగా.

సీ. తలఁపించు నేదేవుతనువునం దఖిలాండములు పయోనిధిభంగవిలసనముల
నేదేవుమహిమకు నింతయు [1]దంతిప్రపదలగ్నతదితరపదసమాన
మేదేవు నిజమాయ నెవ్వాఁడు గడచననేరండు తనమేనినీడఁ [2]బోలె
నేదేవుఁ డింతకు నింతయై యంతకు నంతయై గుఱిలేక యతిశయిల్లు

తే. నా జగత్కర్త దుష్టసంహారణబుద్ధి, విట్లులుండన ధర నుద్భవించె, క్షేత్ర
పాలుఁడును బుండరీకుండుబలసికొలువ,నుండు తీర్థంబునకు నేఁగు ముదయకాంత.

టీక. ఏదేవుతనువునందున్ = ఏ విష్ణుని శరీరములో; అఖిలాండములు = సమస్తలోకములు; పయోనిధిభంగవిలసనములన్ = సముద్రములోని అలల సొంపును; తలఁపించున్ = తలఁపునకు తెచ్చునో; (లోకము లతని కుక్షిలో సముద్రమున అలలు ఉన్నట్లుండుననుట.] మహిమకున్ = గొప్పతనము నకు, దంతిప్రపదలగ్న తదితరపదసమానము = ఏనుఁగు అడుగులో అణఁగియుండు తక్కినవాని అడు గులతో సమానమనునో; (ఏనుఁగు అడుగుజాడలో తక్కిన జీవులయడుగుజాడలిముడునట్లు-విష్ణుని మహిమ తక్కిన దేవతలమహిమను మిక్కిలిగా అతిక్రమించునని భావము.] నిజమాయన్=సొంతమైన మాయను; కడనననేరఁడు = మీఱజాలఁడో - [ప్రతివ్యక్తియు తన తన నీడను విడువనేరిలిని, విష్ణుమాయకును లొంగియుండుననియు, దానిని తప్పించుకొనఁజాలఁడనియును భావము] ఇంతకునింతయై = స్వల్పము కంటె స్వల్పమై; అంతకునంతయై = గొప్పదానికంటె గొప్పవాఁడై; గుఱిలేక = మేఱమీఱి; అతి శయిల్లున్ = ప్రకాశించునో - ['అణో రణీయాన్, మహతో మహీయాన్' అని ఉపనిషదుక్తి.] క్షేత్రపాలుండు = క్షేత్రపాలుఁడగు భైరవుఁడును; బలసి = పరివేష్టించి - చుట్టుకొని; ఉండు; తీర్థంబునకున్; ఉదయకాంక్షన్ = అభ్యుదయముకొఱకైన కోరికతో; ఏఁగుము. ['ఉదయకాంక్షన్ = గౌరవాభిలాషచేత' అని పూర్వటీక.] అలం. ఉపమ, ఉదాత్తము.

1. క. దంతీంద్ర. చ. దంతిప్ర. 2. క. పోలె. చ. ట. బోలె.

క. వేఁగి మహానదివారిం, దోఁ[1]గి హరిం గొలువు; నిఖిలదురితశ్రేణుల్
కాఁగిన యినుమా మిషమని, మూఁగికొనిన మక్షికాసమూహంబు లగున్. 52

టీక. మహానదివారిన్ = భైమినీటిలో; తోఁగి = మునిఁగి; కొలువు = సేవింపుము; నిఖిలదురితశ్రేణుల్ = సమస్తపాపసమూహములు; ఆమిషమని = మాంసమును భ్రాంతితో; మక్షికాసమూహంబులు = ఈఁగలగుంపులు; అగున్. అలం. నిదర్శన.

తే. బ్రాహ్మణునిఁ దల్లిఁ దండ్రిని భ్రాతృ దాత
గురుజనంబుల [2]హింసించు క్రూరుఁడైన
[3]శీధుపానాభిరతుఁడు దుశ్శీలుఁడైనఁ
[4]బాండురంగాధిపతిఁ గాంచి పరము నొందు. 53

టీక. భ్రాతన్ = సోదరుని; దాతన్ = ఇచ్చువానిని; శీధుపానాభిరతుఁడు = మద్యపానమున ఆసక్తికలవాఁడు; పరమున్ = పరమపదమును.

క. నావిని ధౌమ్యాదిమహీ, దైవతములుఁ దమ్ముగమియుఁ దను గొలువఁగ శో
కావహమతి భవదగ్రజు, దీవనగొని చనియె నయ్యుధిష్ఠిరుఁ డెలమిన్. 54

టీక. ధౌమ్యాదిమహీదైవతములు = ధౌమ్యుఁడు మున్నగు బ్రాహ్మణులు; తమ్ముగమి = సోదరసమూహము, శోకావహమతి = విచారముతోఁ గూడిన మనస్సుకలవాఁడై; భవదగ్రజుదీవన = నీ అన్నయగు సనందనుని యాశీస్సు; ఎలమిన్ = ప్రీతితో.

ఉ. ఆ కుముదాప్తవంశవిభుఁ డంతఁ గనుంగొనియెన్ వసుంధరా
నాకము నాకుపాకశుకనాసశుకాదికసన్మునిస్తుత
శ్లోకము శోకకర్దమవిశోషణలోకహితప్రభాసము
త్సేకముఁ దాపవహ్నిజలశీకరసేకముఁ బౌండరీకమున్. 55

టీక. కుముదాప్తవంశవిభుఁడు=చంద్రవంశపురాజు; వసుంధరానాకమున్ = భూలోకస్వర్గమును; నాకుపాక......శ్లోకమున్ = వాల్మీకి, శుకనాసుఁడు, శుకుఁడు మున్నగు మునులచే కొనియాడఁబడిన గొప్పకీర్తి కలదానిని; శోక......త్సేకమున్ = విచార మను బురదను ఎండించునట్టి సూర్యకాంతి (ఎండ)చేత హెచ్చైనదానిని; తాప......సేకమున్ = తాపాగ్నిని చల్లార్చుటకు చల్లని నీటితుంపరులఁ జల్లుట యగుదానిని; పౌండరీకమున్; కనుంగొనియెన్. అలం. పరికరము, రూపకము.

లయగ్రాహి. కంబువు నరాళచికురంబులుఁ గటీకృతక
రాంబురుహయుగ్మ మళికాంబకము నగ్న
త్వంబుఁ బసి రొప్పు వెదురుం బెరుగు నుడ్డపొడ
లుం బదములం [5]బలుకుచుం బొదలు మువ్వల్
జంబుఫలజిద్రుచిభరంబు మకరాకృతిఁ గ
రం బమరుఁగుండలములుం బరఁగఁ బంచా
బ్దంబులఁ దలిర్చు నిసువుం బతి భజించెఁ ద్విజ
గంబులకు రోహణనగంబగు నగణ్యున్. 56

1. చ. గిన హరి. 2. క. హింసించి. చ. ట. హింసించు. 3. చ. సీధు. 4. క. పాండు
5. చ. బలుకు.

టీక. కంబువు = శంఖము; అరాళచికురంబులు = దట్టపుతలవెండ్రుకలు; కటీ..... యుగ్మము=మొలపై ఉంచుకొనిన రెండు చేతులును; ఆళీకాంబకము = నొసటి కన్ను; నగ్నత్వంబున్ = దిగంబరత్వమును; పసిన్ = అలమందను; గొప్ప = త్రోలు; వెదురున్; ఉద్ద = నాలుగు; పాదలు(?) పలుకుచున్ = ధ్వనిచేయుచు; హావలు = ప్రకాశించునట్టి; జంబుఫలజిద్రుచిభరంబు = నేరేడుపండుకాంతిని జయించు గొప్ప కాంతియును; మకరాకృతిన్ = మొసలిరూపుతో; కరంబు, అమరు = మిక్కిలి ఒప్పినదైయున్న; పరగన్ = ఒప్పఁగా - ప్రకాశింపఁగా; పంచాబ్దాబులన్ = ఐదేండ్లయీడుతో; శిశువున్ = బిడ్డను; రోహణనగంబు, అను = రత్నపర్వతమైన; అగణ్యున్ = లెక్కించ సాధ్యము కానివానిని; పతి = రాజు - యుధిష్ఠిరుఁడు; భజించెన్. అలం. స్వభావోక్తి, ఉపమ.

క. పుష్కరిణిఁ దీర్థమాడియుఁ, బుష్కరదళనయనుమూర్తిఁ బూజించియు నా
విష్కృతశుభోన్నతియు నతి, నిష్కల్మషమతియు నయ్యె నృపతి మునిపతీ! 57

టీక. పుష్కరిణిన్ = తటాకమునందు - తీర్థమున; తీర్థమాడియున్ = స్నానముచేసియు; పుష్కర......మూర్తిన్ = తామరరేకులవంటి కన్నులు కల శ్రీకృష్ణుని; ఆవిష్కృతశుభోన్నతియున్ = ప్రకటింపఁబడిన (వెలువరింపఁబడిన) గొప్ప శుభములు కలవాఁడును.

క. దానంబునఁ బితృగురుసఖి, దానంబున నైన కీడుఁ దలఁగి హరికృపా
దానంబు [1]నందెఁ గురుపతి, దానం బునరుద్భవంబు దానికిఁ గలదే? 58

టీక. పితృ......దానంబునన్, ఐన = తండ్రులయు, గురువులయు, మిత్రులయు చంపుటచేఁగలిగిన; కీడు = పాపము; తలఁగి = తొలఁగించి - పోఁగొట్టి; కురుపతి = ధర్మజుఁడు; హరికృపాదానంబున్ = విష్ణుని దయను స్వీకరించుటను; దానన్ = అందువలన; పునరుద్భవంబు = పునర్జన్మము; దానికిన్ = దానము చేయువానికి, కలదే? = లేదు. అలం. అనుప్రాసము.

తే. ఆ యతీంద్రుండు ఋత్విజుఁ డయ్యె; వేది,యయ్యె శ్రీపౌండరీకమహాస్థలంబు
పాపపశువుల విశసించి భక్తిచరువు, పాండురంగాగ్నిలో వేల్చు పాండవునకు.

టీక. పాపపశువులన్ = పాపములను పశువులను; విశసించి = నఱికి; భక్తిచరువున్ = భక్తి యను హోమార్థమగు నన్నమును; పాండురంగాగ్నిలోన్ = పాండురంగఁడను అగ్నిలో; వేల్చు = హోమము చేయునట్టి; పాండవునకున్ = ధర్మరాజునకు; ఆ యతీంద్రుండు = ఆ సనందన మహాముని; ఋత్విజుఁడు = యాగము చేయించువాఁడు; వేది = యజ్ఞముచేయు స్థలము. అలం. రూపకము.

వ. ఇవ్విధంబున నవ్విధువంశవతంసంబు కంసమర్దనసాక్షాత్కారదర్శనంబు నిజదురిత కర్మ[2]నంబు నాపాదించుటఁ గృతార్థుండై పౌండరీకవాస్తవ్యులగు పుండరీకాది విద్వత్పుండరీకంబుల నొండొండఁ గీర్తించుచుఁ [3]బ్రవర్తించి కతిపయదివసప్రచారుండై యచ్చటనుండి నిజానుజద్విజసనాథంబుగా గజపురంబునకుం జనుదెంచి సుఖంబుండె నట్లగుటం జేసి. 60

టీక. విధువంశవతంసంబు = చంద్రవంశమున శ్రేష్ఠుఁడగు ధర్మరాజు; నిజదురితకర్మనంబునన్ = తన పాపముల నాశనమును; ఆపాదించుటన్ = కలుగఁజేయుటచే; విద్వత్పుండరీకంబులన్ = ఉత్తమ విద్వాంసులను; కతిపయదివసప్రచారుండై = కొన్నిరోజులు మెలఁగినవాఁడై - నివసించినవాఁడై; నిజానుజద్విజసనాథంబుగాన్ = తన సోదరులతోను, బ్రాహ్మణులతోను కూడుకొని; గజపురంబునకున్ = హస్తినాపురమునకు.

1. చ. నెందె. 2. చ. నంబా. 3. క. బ్రవర్తిత. చ. బ్రవర్తించి.

క. [1]అదిరొ మహాఫలమని తన, హృదయంబునఁ బౌండరీక మెప్పఁ దెలుఁగఁ డా
మె[4]దుక చను [1]నిదియ ముక్తి, ప్రద మని [2]పెరతీర్థమునకు బహునిగమనిధీ! 61

టీక. మహాఫలము = గొప్పఫలమైనది; మెదుక = తెలివిమాలినవాఁడు - మూర్ఖుఁడు; పెఱతీర్థమునకున్ = వేఱొక పుణ్యస్థలమునకు; బహునిగమనిధీ! = పెక్కు శాస్త్రముల నెఱింగిన సాదరమునీ!

క. వాలిన దప్పి వియఝ్ఝర, కూలంబున నుయ్యి ద్రవ్వు కుమతి గలిగినన్
శ్రీలలనావిభుఁ డుండని, నేలయు క్షేత్రమని [3]యరుగు నీచుఁడు గలుగున్. 62

టీక. వాలినదప్పిన్ = అతిశయించిన దప్పికతో; వియఝ్ఝరకూలంబునన్ = గంగానదియొడ్డున; కుమతి = చెడ్డబుద్ధికలవాఁడు - నీచుఁడు; శ్రీలలనావిభుఁడు = సిరిమగఁడగు విష్ణువు.

చ. మసనమునందునైనఁ బురమార్గమునం బడియైన నింటనై
న సకలగర్హితస్థలమునం బ్లవగేహమునందునైన నా
కసమున నీట నేలపయిఁ గంకటిమీఁదననైన మానవుం
డసువులఁ బాసి నిష్కలుషుఁడై హరి దానగు నమ్మహాస్థలిన్. 63

టీక. మసనమునందునైనన్ = శ్మశానమందైనను; సకలగర్హితస్థలమునన్ = అందరిచేతను నిందింపఁబడిన చోటనైనను; ప్లవగేహమునందున్ = మాలవాని యింటియందు; కంకటిమీఁదను = మంచముపైని; నిష్కలుషుఁడై = పాపములు లేనివాఁడై; తాన్=ఆ మరణించినవాఁడు.

క. విను పతితుఁడైనఁగానీ, చని తత్క్షేత్రంబునందుఁ జా[4]నోచి పున
ర్జననంబు గనఁడు గావున, జనులకు నా స్థలమునందుఁ జనుఁ దను వూడ్వన్. 64

టీక. పతితుఁడు = చెడిపోయినవాఁడు; చానోపి = మరణించి; తనువు = దేహము; ఊడ్వన్, చనున్ = విడువఁదగును.

ఉ. అద్రిభృదుత్తరాశ శతహస్తమితావని నున్న వాఁడు బో
ధిద్రుమమూర్తియై నృహరి తీర్థనివాసులఁ గాఁచు పూన్కి, నో
భద్రవిచార! యా భువనభర్తకు నుత్తరభాగ మూఁది య
క్షుద్రసుఖోన్నతిన్ వెలయుఁ గుండలతీర్థము తీర్థరాజమై. 65

టీక. అద్రిభృదుత్తరాశన్ = గోవర్ధనధారి యగు కృష్ణునకు ఉత్తరపుదిక్కున; బోధిద్రుమమూర్తియై = రావిచెట్టురూపు కలవాఁడై; ఊఁది = అంటి; అక్షుద్రసుఖోన్నతిన్ = తక్కువకాని మేలి సుఖములతో;

క. విందుఁ దన తొడుగు మణిమయ, కుండలయుగ మచట దాఁచెఁ గొండ గొడుగుగా
నుండు నతఁ డనఁగఁ దద్గుణ, కుండలపరిపూర్ణకర్ణకుహరుఁడ నగుచున్. 66

టీక. తనతొడుగు = తాను ధరించుచున్న; కొండ......నతఁడు = గోవర్ధనగిరిని గొడుగుగా ఎత్తిపట్టిన కృష్ణుఁడు; తద్గుణ......కుహరుఁడను, అగుచున్ = ఆ విష్ణుని గుణము లను కుండలములచే నిండిన చెవులు కలవాఁడ, నగుచు; విందున్ = వినుచుందును.

1. శ. ర. అదియ. 2. చ. మెదక. 3. క. నిదియు. చ. ట. నిదియ. 4. శ. ర. పెఱ. 7. ఛ. దొలుఁగు. 4. క. నోపి. చ. ట. నోచి.

సీ. ఆ కుండలాఖ్యతీర్థాంబుధారల నాడి నరకేసరి భజించు నరుఁడు రాజ
సూయఫలం బొందుఁ జూవె! యా వేలుపుటేలికఁ జుట్టిరా నేను చేతు
ల వెడల్పు నేల వాలాయంబుగాఁ గన వృష్టి యల్కి [1]భజించుచున్నజనుల
చేతఁ బూజలు గొను పూతనాఘాతనారీహర్త బహుజనశ్రేణులందు

తే. వారు ముక్తులు ధర జీవవంతులయ్యు, వారి పితరులు తృప్తులై వఱలువారు;
వారు చరియించు మన్న యుర్వరయ తెల్ల, దీవి; వారలపలుకులు దేవకథలు. 67

టీక. బొందుఁజూవె! = పొందును సుమీ! వేలుపుటేలికన్ = దేవతావిభుని - నరసింహుని; వాలాయంబుగాన్ = నిరంతరముగా; పూతనాఘాతనారీహర్త = పూతన యను రాక్షసస్త్రీని చంపిన కృష్ణుఁడు; వారు = అట్లు సేవించువారు; ఉర్వరయ = స్థలంబే; తెల్లదీవి = శ్వేతద్వీపము.

తే. ఆ నృకేసరి భజియించు నమరకన్య, లెన్నఁ బెక్కండ్రు హారతు లిచ్చి యిచ్చి
వారిఁ గొల్వక గర్వించువారు క్షేత్ర, మండలమున సుఖస్థితి నుండ లేరు. 68

టీక. అమరకన్యలు = దేవకన్యకలు.

ఉ. ఆ నరసింహు మ్రోల మృతులై కులకోటిసమన్వితంబుగా
మానవు లూర్ధ్వలోకసుఖమగ్నతఁ జొక్కుదు రెల్లకాలమున్;
దానికిఁ [2]గప్పయైన [†]ప్రయుతప్రియపుత్రుఁడె సాక్షి; యచ్చటన్
గానితెఱంగులన్ మెలఁగు కష్టమతుల్ నిరయైకసంగతుల్. 69

టీక. కులకోటిసమన్వితంబుగాన్ = లెక్కలేని వంశములతోఁ గూడుకొనునట్లుగా; ఊర్ధ్వలోకసుఖమగ్నతన్ = స్వర్లోకసుఖములందు మునుగుటచే; చొక్కుదురు = పరవశు లగుదురు. ప్రయుతప్రియపుత్రుఁడు = ప్రయుతునిఁ కుమారుఁడగు అయుతుఁడు; కానితెఱంగులన్ = చెడ్డదారులను; నిరయైకసంగతుల్ = నరకమునే పొందువారు (అగుదురని భావము.)

ఉ. పంకజపత్రనేత్రునకుఁ బశ్చిమదిక్కున నుండు నానమ
త్పంకరుహాసనాద్యమరపాల మలోలము పద్మతీర్థ మో
పంకవిదూర! కేలఁగల పద్మము నచ్చట దాఁచినాఁడు చ
క్రాంకుఁడు మున్ త్రిదంష్ట్రమనుజాశననాశనహేతుకంబు [3]గాన్. 70

టీక. పంకజపత్రనేత్రునకున్ = తామరరేకులవంటి కన్నులు కల కృష్ణునకు; ఆనమత్...
...పాలము = నమ్రులగు బ్రహ్మాదిదేవతలచే సేవింపఁబడునవి; అలోలము = చలనము (కదలిక) లేనిది; త్రిదంష్ట్ర...నాశకంబుగాన్ = త్రిదంష్ట్రుఁడను పేరిటి రాక్షసుని నాశమునకు హేతువగునట్లుగా.

క. ఆ తీర్థతనువునకు లక్ష్మీతరుణీవల్లభుండు జీవము వృజనో
పేతుఁడు ననవధి సవనో, ద్భూతఫలం బందు నందు బొంది విడిచినన్. 71

టీక. ఆ తీర్థతనువునకున్ = తీర్థరూపముగనున్న దేవుని శరీరమునకు; జీవము = ప్రాణము; వృజనోపేతుఁడును = పాపములతోఁ గూడుకొన్నవాఁడును; అందున్ = అచ్చోట; బొంది = శరీరమును; అనవధిసవనోద్భూతఫలంబు = హద్దులేని యాగముల ఫలమును; అందున్ = పొందును.

---

1. చ. భుజించు. 2. క. గర్వ. చ. ట. గప్ప. † క. యయుత. 3. క. గన్; చ. గాన్.

ఉ. పాపదురాపరూపమగు పద్మసమాహ్వయతీర్థమాలినీ
 రే పురుషుండు గ్రోలు నొకయించుక యెన్నఁడునేని వానికిన్
 బాపము లభ్రపుష్పములు; బంధనముల్ శశశాబశృంగముల్;
 తాపవికారముల్ మరుజలంబులు పుట్టువు లశ్మతైలముల్. 72

టీక. పాపదురాపరూపము = పాపాత్ములచే పొందరాని రూపుకలది; ఎన్నఁడునేనిన్ = ఎప్పుడైనను; అభ్రపుష్పములు = గగనకుసుమములు - లేనివనుట; శశశాబశృంగముల్ = కుందేటిపిల్ల కొమ్ములు (లేనివి). మరుజలంబులు = మరుభూమిలోని నీళ్లు (లేనివి.) అశ్మతైలముల్ = ఱాతిలోని నూనెలు. (లేనివి.) అలం. నిదర్శన.

సుశర్మోపాఖ్యానము-పద్మతీర్థప్రభావము

క. ఒకఁడు సుశర్మాఖ్యుఁడు ఘాతుకుఁడు గలఁడు; కల్లుద్రాగు; దునుము ధరామ
 ర్త్యకులుల; నఱ దలచుం గురు,నకుఁ గనకము దొంగిలుం దినము నజపుత్రా! 73

టీక. సుశర్మాఖ్యుఁడు = సుశర్మ యనుపేరు కలవాఁడు; ఘాతుకుఁడు = క్రూరుఁడు; ధరామర్త్యకులులన్ = బ్రాహ్మణులను; దునుమున్ = చంపును; అఱ = ద్రోహము (కీడు).

క. ఆ వృషలీపతి యావ, జ్జీవంబుఁగ నంతనంతఁ జేసిన నానాం
 హోవిసరంబులు పటమునఁ, గోవలు వడ వ్రాసి చిత్రగుప్తుఁడు దాఁచెన్. 74

టీక. వృషలీపతి = శూద్రస్త్రీభర్త - శూద్రుడు; అంతనంతన్ = క్రమక్రమమున; నానాంహోవిసరంబులు = పెక్కులైన పాపముల గుంపులు; చిత్రగుప్తుఁడు = యముని లేకరి; పటమునన్ = గుడ్డకాగితముపయిని; కోవలుపడన్ = పూసగ్రుచ్చినట్లు - పంక్తులు తీర్చి; ['కోవలు = దొంతులు' అని పూర్వటీక.]

శా. ఆ నీచుం డొకనాఁడు వాఁడిమి జతుర్వ్యాఘ్రాన్వితుండై పెనుం
 గానం దెర్వులు గట్టి యేఁగు ప్రజలం [1]గట్టిండియై దోఁచి నీ
 రానన్ రోయుచు నుండె[2]దప్పిగొని మధ్యాహ్నాతపాపాతజ
 గ్లానిం దత్సమయార్తకాసరముఁ బోలంజాలి [3]నల్దిక్కులన్. 75

టీక. వాఁడిమిన్ = శౌర్యముతో; చతుర్వ్యాఘ్రాన్వితుండై = నల్గురు వేఁటకాండ్రతో (అనుచరులతో) కూడినవాఁడై; పెనుంగానన్ = పెద్ద యడవిలో; తెర్వులుకట్టి = దారులు అడ్డగించి; ఏఁగు = ప్రయాణముచేయుచున్న; కట్టిండియై = క్రూరుఁడై - నిర్దయుఁడై; నీరానన్; మధ్యాహ్నాతపాపాతజగ్లానిన్ = మండుటెండ పైఁ బడుటవలనఁ గల్గిన బడలికవలన; తత్సమయార్తకాసరమున్ = అట్టి మండుటెండలో బాధపడు దున్నపోతును ; పోలంజాలి = పోలఁగలిగి; ఆనన్ = త్రాగుటకు; నీరు; రోయుచునుండెన్ = వెదకుచుండెను.

ఆ. అంతఁ బద్మతీర్థమఁట వాఁడు గని యందుఁ, జెమట వాయ మునిఁగి విమలవారిఁ
 గ్రోలి రావిమొదలఁ గూర్చుండి యొకయింత, నిలిచి యింటి కరిగె వలయురీతి.

టీక. విమలవారిన్ = నిర్మలోదకమును; రావిమొదలన్ = క్షేత్రములోని రావిచెట్టు నీడను; వలయురీతిన్ = ఇచ్చవచ్చునట్లు.

క. ఆ విషము మేన నూని త,దావిర్భవదఘచయంబు నరుగఁగ రాచేన్
 బోవక నలసంక్రాంతమ, హావిషధరవిషము కలిలయము చేయు క్రియన్. 77

1. చ. గట్టాడి. ట. గప్పిండి 2. చ. డప్పి. 3. చ. యాదిక్కులన్.

టీక. విషము=నీరు; తదావిర్భవదఘచయంబున్=వాఁడు చేసిన పాపముల సమూహమును; కరఁగఁగన్ = కరఁగిపోవునట్లు; పోవక = విడువక; నల.....విషము = నలునియందు ప్రవేశించిన కర్కోటకుని విషము; కలియుగంబును = నలునియందలి కలిని నశింపఁజేయుటను. అలం. ఉపమ.

ఆ. అంతఁ గొంతకాల మరుగంగ మృత్యుగోచరత నున్న యా సుశర్మ కడకు
లిఖితతత్కృతాఘ లిపియైన పటముఁ దెప్పించి చిత్రగుప్తుఁ డెంచి చూచి. 78

టీక. మృత్యుగోచరతన్, ఉన్న = చచ్చుటను పొందిన - మరణించిన; లిఖిత.....లిపి = వ్రాయఁబడిన వానిచే (సుశర్మచే) చేయఁబడిన పాపముల లిపి కలది; పటమున్ = గుడ్డకాగితమును.

క. దురితశతకోటులం దక్షర మొకటియుఁ గాన లేక కంఠవికృతిభం
గురతాయుతుఁడై జముకడ, కరిగి [1]తగం బలుకు నతఁడు ప్రాంజలి యగుచున్.

టీక. దురితశతకోటులందున్ = వందలకోట్ల (లెక్కలేని) పాపములందు; కంఠ ..... యుతుఁడై = గొంతులోని స్వరహీనతాయుక్తుఁడై - గద్గదస్వరము కలవాఁడై; ప్రాంజలి = చేతులు జోడించినవాఁడు - నమస్కరించినవాఁడు; జముకడకున్ = యమునియొద్దకు.

ఉ. ‘[2]దక్కఁగ వ్రాసితిన్ మును పటమ్మునయందు సుశర్మపాపముల్;
లెక్క యెఱుంగరాదు లవలేశము; [3]వానికి నట్టివ్రాఁతయం
దక్కజ మిప్పు డొక్కటియు నక్షరరూపము లేదు దేవ! నేఁ
డక్కడితంబు గట్టి యుడినట్టుల యున్నది కప్పుదేఱుచున్. 80

టీక. దక్కఁగన్ = స్థిరమగునట్లు; [‘అనుభవమునకుఁ దగినట్లు’ అని పూర్వటీక.] అక్కజము= ఆశ్చర్యము; అక్కడితంబు = ఆ గుడ్డకాగితము; కప్పుదేఱుచున్ = నలుపురంగు తేఱుచు; గట్టియుడినట్టులన్=రంగుపూఁతపూసినట్లు-క్రొత్తదానియట్లు.

ఆ. హతలతాంతమైన యారామమునుబోలె, విగతతారమైన విన్నుఁబోలె
గళితవర్ణమైన కడితంబు; దీనికి, మీరె తెలియవలయుఁ గారణంబు.’ 81

టీక. హతలతాంతము = నశించిన పువ్వులు గలది; ఆరామము=తోఁట; విగతతారము = అస్తమించిన చుక్కలు కలది; విన్ను = ఆకాశము; గళితవర్ణము = జారిన - నశించిన అక్షరములు కలది; కడితంబు = గుడ్డకాగితము. తెలియవలయున్=ఊహింపవలెను. అలం. మాలోపమ.

క. అని పల్కు నమ్మహామతిఁ, గని జముఁ డిట్లనియె ‘నీదుకవిలియ నీవ్రా
సిన లిపి యున్నదో లేదో, కనుఁగొను మీసారి లెస్సఁగా గణకవరా!’ 82

టీక. మహామతిన్ = గొప్పబుద్ధి కలవానిని - చిత్రగుప్తుని; నీదుకవిలియన్ = నీకడితమున - నీగుడ్డకాగితపు లెక్కలపుస్తకమున; లెస్సగాన్ = బాగుగా; గణకవరా! =గొప్పలేకరి!

ఆ. అనుడు నట్లకాక యని చిత్రగుప్తుండు, దండధరునియాజ్ఞ వెండి నేఁగి
పటము ప్రతిస్ఫుటంబుఁ బరికించి యందు వీక్షించెఁ జక్రపాణి చేతివ్రాఁత. 83

టీక. దండధరునియాజ్ఞన్ = యమునియుత్తరువుచే; వెండిన్ = తిరిగి; చక్రపాణిచేతివ్రాఁతన్ = విష్ణుని స్వహస్తలేఖనమును; వీక్షించెన్.

1. చ. తరం. 2. చ. దక్కఁగ. 3. క. దానిని. శ. ర. సూర్యా వానికి.

ఉ. ఈతఁడు పద్మతీర్థమున కేఁగి యొకానొకనాఁడు తత్పయో
ధౌతనిజాంగుఁడై చనుకతంబున విప్ర[1]వధాదిపాతక
వ్రాతముఁ దొంటిపుట్టువులఁ బ్రాప్తములైన యఘంబులున్ మరు
ద్ధూతఘనాఘనావలులతో సరియై సరిపోయె నన్నియున్. 84

టీక. తత్పయోధౌతనిజాంగుఁడై = ఆ తీర్థపునీటిచే కడుగఁబడిన దేహము కలవాఁడై - అందు స్నానముచేసినవాఁడై; విప్ర......వ్రాతము = బ్రాహ్మణహత్య మొదలగు పాతకముల సమూహము; తొంటిపుట్టువులన్ - వెనుకటి జన్మములందు; ప్రాప్తములైన = సంభవించిన; అఘంబులున్ = పాపములును; మరుద్ధూతఘనాఘనావలులతోన్ = గాలిచేఁ జెదరఁగొట్టఁబడిన వానకాలపు మేఘముల వరుసలతో; సరిపోయెన్ = (పూర్తిగా) నశించెను. అలం. ఉపమ.

క. అనునర్థంబులు గల లిపిఁ, గని చని జముఁ బల్కు నతఁడు 'గానఁబడదు నే
మును వ్రాసినయది; యన్యము, కనుపట్టెడు [2]యల్లిఖితమొ కాని వినఁదగున్. 85

టీక. అన్యము = వేఱైనది; యల్లిఖితమొ, కాని = ఎవరు వ్రాసినదో, యేమో !

ఉ. ఈతఁడు పద్మతీర్థమున కేఁగి యొకానొకనాఁడు తత్పయో
ధౌతనిజాంగుఁడై చనుకతంబున విప్రవధాదిపాతక
వ్రాతముఁ దొంటిపుట్టువులఁ బ్రాప్తములైన యఘంబులున్ మరు
ద్ధూతఘనాఘనావలులతో సరియై సరిపోయె నన్నియున్. 86

టీక. చూ. పద్యము. 84. టీక.

సీ. అని యొప్పు కౌతుకజనకాక్షరశ్రేణి వీక్షించి వచ్చితి విద్వదింద్ర!
యిది మీర లెఱిఁగింపు డేనాఁట సకృదవగాహనంబున మహాకలుషరాశి
వలనఁ బూరుషుఁ జేరఁదలఁగు పుణ్యపుఁదీర్థ మెన్నండుఁ గన విన నీమదు[3]ప్త
లిపిపంక్తి నేకవారపయో[4]విమజ్జనమాత్రచే నణఁచిన మహిమ గలుగు

తే. దివ్యతీర్థంబువైభవ మవ్యయప్రసాదమేదురమానసౌజ్జ్వల్యకల్య
వచనరచనల వివరింపవలయు నప్రపన్నదైత్యలతాదాత్ర! భానుపుత్ర !' 87

టీక. కౌతుకజనకాక్షరశ్రేణిన్ = వేడుకను కలిగించు యక్షరములవరుసను; విద్వదింద్ర ! = గొప్పవిద్వాంసుఁడా ! సకృదవగాహనంబునన్ = ఒక్కసారి మునుఁగుటచేత; మహాపాపరాశివలనన్ = మహాపాతకముల గుంపునుండి; చేరఁదలఁగు = చేరఁదప్పించు; ఈ, మదుప్తలిపిపంక్తిన్ = ఈ,నాచే వ్రాయఁబడిన యక్షరపంక్తిని - సుకర్మపాపముల పట్టికను; ఏకవారపయోవిమజ్జనముచేన్ = ఒక్కసారి స్నానముచేయుటచే; అణఁచిన = నశింపఁజేసిన; మహిమ = గొప్పతనము; అవ్యయ - రచనల్ - అవ్యయ = తగ్గిపోని; ప్రసాద = అనుగ్రహముచే; మేదుర = అతిశయించిన; మానసౌజ్జ్వల్యకల్య = మనఃప్రకాశత్వపు నేర్పుకల; వచనరచనలన్ = మాటలపొందికలతో; అప్రపన్న......దాత్ర! = శరణార్థులు కాని రాక్షసులనెడి తీగలకు కొడవలియైనవాఁడా ! భానుపుత్ర ! = సూర్యుని కుమారుఁడవగు యమధర్మరాజా ! వివరింపవలయును-అలం. రూపకము.

వ. అనిన నప్పద్మమిత్రపుత్రుండు చిత్రగుప్తున కిట్లనియె. 88

టీక. పద్మమిత్రపుత్రుండు = సూర్యపుత్రుఁడు - యముఁడు.

---

1. చ. వధాతి. 2. క. నేలిఖితమొ. చ. ట. యల్లిఖితమొ. 3. చ. మదుక్తి. ట. మదుప్త
4. క. భిమజ్జన. చ. విమజ్జన.

శా. ప్రాశస్త్యంబు వహించు దండకమహారణ్యంబు పుణ్యార్థి సం
చారోత్కోటివిశాలభూమి ఖలదుష్ప్రాపప్రభావోదయ
శ్రీశుద్ధిన్ గను; దాన గౌతమి గుణోత్సేకంబుకల్మిన్ హృషీ
కేశావాసము పౌండరీకనిలయం బీరెంటి నెల్లం దుదిన్. 89

టీక. పుణ్యార్థి......భూమి = పుణ్యములకోరునట్టి పెక్కుకోట్ల జనులకు విశాలస్థలము; ప్రాశస్త్యంబువహించున్; ఖలదుష్ప్రాప=దుర్మార్గులకు పొందరానిది, ప్రభావోదయశ్రీశుద్ధిన్ = గొప్ప మాహాత్మ్యముసంపద, పరిశుద్ధతను; కను = పొందునట్టి; దానన్ = ఆ దండకవనమువలన; గౌతమి = గోదావరీనది; ప్రాశస్త్యంబున్, వహించున్. గుణోత్సేకంబుకల్మిన్ = అతిశయించు గుణసంపదచే; హృషీకేశావాసము = విష్ణువునకు నివాసమగు; పౌండరీకనిలయంబు = పాండురంగక్షేత్రము; తుదిన్ = కడపట; ఈ రెంటికిన్ = దండకా, గోదావరులకు.

సీ. అర్కుండు వెలుఁగుట యనిలుండు వీచుట యింద్రుండు వర్షించు టిల జలము
మునుఁగక తిరమౌటయును నెసఁగు నే విష్ణునాజ్ఞప్తిచే నెవ్వఁ డఖిలజగము
బ్రహ్మయై సృజియించుఁ బద్మాక్షుఁడై ప్రోచు మదనారియై త్రుంచు మత్ప్రభృతుల
లోకపాలకుల నే లోకేశుకరుణాకటాక్షంబె యధికృతియందు నిలుపు

తే. నా విభుం డెందు నుండు మర్త్యమునఁ బుట్టి
భూతకోటి ననుగ్రహంబునఁ [1]బెనుచుచు
నెందుఁ గ్రుంకి సుశర్మయుఁ జెందె ముక్తి
దాని కెనవచ్చు తీర్థ మీధరణిఁ గలదె ? 90

టీక. అర్కుండు = సూర్యుఁడు; అనిలుండు = గాలి; తిరము, ఔటయున్ = స్థిరముగా నిలుచుటయును; ఎసఁగున్ = కలుగునో; పద్మాక్షుఁడై = విష్ణువయి; మదనారియై=శివుఁడయి; త్రుంచున్ = నశింపఁజేయునో; మత్ప్రభృతులన్ = నేను మొదలుగాఁగల; లోకపాలకులన్ = దిక్పాలురను; ఏ లోకేశుకరుణాకటాక్షంబె = ఏ ప్రభుని దయగల క్రేఁగంటిచూపే; అధికృతియందున్=అధికారమునందు; మర్త్యమునన్ = భూలోకమునందు; భూతకోటిన్ = జీవరాశిని; పెనుచుచున్ = పెంచుచు-పోషించుచు; దానికిన్ = ఆ పద్మతీర్థమునకు; ఎనవచ్చు = సాటియగు; ధరణిన్ = భూమియందు; కలదె? = లేదు. అలం. ఉదాత్తము.

వ. అని పద్మతీర్థంబు తీర్థచరణవిహారణచరితార్థం బగు, దాని నానాగుణంబులు నగణిత ప్రభావంబులని కొనియాడి. 91

టీక. తీర్థచరణవిహారణచరితార్థంబు = విష్ణుని విహారముచేత కృతార్థమైనది; అగణితప్రభావంబులు = లెక్కలేని గొప్పతనములు కలవి.

క. పెనుగృప సుశర్మఁ గనుఁగొని, తనువు నిమిరి యాదరించి దండధరుఁడు చం
ద్రునిలీలఁ జల్ల [2]నగు చందనభూషణవసనమాల్యతర్పితుఁ జేసెన్. 92

టీక. పెనుకృపన్ = ఎక్కువదయతో; నిమిరి = ప్రేమతో తడవి; దండధరుఁడు=యముఁడు; చందన......తర్పితున్ = గంధ, ఆభరణ, వస్త్రమాల్యములచే తృప్తిపొందింపఁబడినవానిని. అలం. ఉపమ.

క. ఈగతిఁ గృతాంతుకృపఁ గని, సాగి చనియె నతఁడు గగనచరయానమునన్
నాగనరయక్షసురపున్నాగానీకములు గొలువ నాకంబునకున్. 93

1. క. బెనుపుచు. ట. ననుచుచు. 2. చ. ట. నై.

టీక. కృతాంతుకృపన్ = యమునిదయచే; కని=పొంది; గగనచరయానమునన్ = విమానము పయిని; నాగ.....నీకములు = నాగులు, నరులు, యక్షులు, దేవతలు మొదలగుజాతుల పురుష శ్రేష్ఠులు; కొలువన్ = సేవింపఁగా; నాకంబునకున్ = స్వర్గమునకు; చనియెన్.

మ. అమరాధీశుఁడు గౌరవం బెసఁగఁ దన్నర్ధాసనాసీనుఁ జే
యఁ మరుద్భోగములెల్లఁ గాంచి ధరయం దగ్రాన్వయోద్భూతుఁడై
కమలావల్లభుఁ బౌండరీకపతి సాక్షాద్బ్రహ్మముం గొల్చి ని
త్యముఁ దన్మందిరరాడలంకృతియె చేయం[1]జాలె నేలేఁ ధృతిన్. 94

టీక. అమరాధీశుఁడు = దేవతలప్రభువు - ఇంద్రుఁడు; ఎసఁగన్ = కలుగఁగా; అర్ధాసనాసీనున్ = తనతోఁగూడ తన సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టుకొనువానినిగా; మరుద్భోగములు = దివ్యసుఖములను; అగ్రాన్వయోద్భూతుఁడై = బ్రాహ్మణకులమునఁ బుట్టినవాఁడై; కమలావల్లభున్ = లక్ష్మీదేవిభర్తను; సాక్షాత్బ్రహ్మమున్ = ప్రత్యక్ష పరబ్రహ్మస్వరూపుని; తన్మందిరరాడలంకృతియె=ఆ దేవుని గొప్ప యాలయమును అలంకరించుటయే. చేయంజాలెన్=చేయఁగలిగెను; వేఱేపనిచేయలేదనుట.

శా. ఆపంచత్వముగాఁగ నిట్లు హరిగేహక్షోణిసమ్మార్జనం
బాపాదింప ఘటిల్లు పుణ్యమునఁ జంద్రావాసముం జొచ్చి హా
ర్దాపూర్ణస్థితిఁ బెక్కుభోగములఁ బెక్కబ్దావళుల్ గాంచి ధా
త్రీపాలోత్తముఁడై సుకీర్తి యన ఘుర్విం బెంపునం బుట్టుచున్. 95

టీక. ఆపంచత్వముగాఁగన్ = చచ్చువఱకును; హరిగేహక్షోణిసమ్మార్జనంబు = విష్ణుదేవాలయభూమి నూడ్చుటను; ఆపాదింపన్ = చేయఁగా; ఘటిల్లు = కలిగిన; చంద్రావాసమున్ = చంద్రలోకమును; అబ్దావళుల్ = అనేకసంవత్సరములు; ధాత్రీపాలోత్తముఁడై = గొప్పరాజై; పెంపునన్= గొప్పతనముతో.

క. అతఁ డధికభక్తితో నాయత కీర్తి స్ఫూర్తివర్తియై వెలసి జగ
త్పతి నుచితపూజనంబులఁ, బ్రతి ఘస్రము [2]దెలఁచు [3]భక్తిపరతంత్రుండై. 96

టీక. ఆయతకీర్తిస్ఫూర్తియై = గొప్ప కీర్తితో ప్రకాశించుచున్నవాఁడై; ప్రతిఘస్రము = ప్రతిదినమును; తెలచున్ = సేవించును.

ఆ. అతఁడు సన్యసించె నఖిలభోగంబులు, నిండువయసునాఁడ యుండియుండి
నందనందనాంఘ్రినాళీకసేవోప, యోగరాగభోగ మొకటి దక్క. 97

టీక. సన్యసించెన్ = విడిచెను; నిండువయసునాఁడ=యౌవనమునందే; నంద......భోగము= నందునిపుత్రుఁడగు శ్రీకృష్ణుని పాదపద్మములను సేవించుటకుపయుక్తమగు భక్తిరూపమగు భోగము.

సీ. నిలువున నొలిపించె విలుసంగడము నెల్ల, శరములయాయంబుఁ బొరయఁ టుడిపెఁ
దగశబ్దమాత్రపాత్రముచేసె గుణలత, [4]మ్రోఁకులఁ గట్టించె మౌలబలము
గంచుకివశము గావించె సేనానాథుఁ,[5] గమరించె సహచరుఁ గటికియెండఁ
బ్రతిపక్షభావసంగతుఁ డని హితుఁ జూచె, వరకేతనము కీర్తిభరము దులిపె

తే. ధర్మనిర్మలబుద్ధి సుశర్మఁ గదిసి, గెలువఁగాలేక చని కోపగించి మదనుఁ
[6]డురక తనవార లతనికి నోడు మనిరె?, పలికిఁ గీడౌట బంట్లపాపంబుగాదె!. 98

---

1. చ. ట. జాలె. 2. చ. దెలుచు. 3. ట. భక్త. 4. క. మ్రోఁకున. చ. మ్రోఁకుల. 5. క. గట్టించె. చ. ట. గమరించె. 6. క. డుఱుక. చ. డురక.

టీక. ధర్మనిర్మలబుద్ధిన్ = యోగధర్మముచే పరిశుద్ధమగు బుద్ధికలవానిని; సుశర్మన్; కదిసి = సమీపించి; మదనుఁడు = మన్మథుఁడు; ఊఱక = మాటలాడక - నిష్కారణముగనే; విలువఁగడమును, ఎల్లన్ = విద్ధవంశముల నన్నింటిని - చెఱకుగడలనన్నిటిని; [మన్మథునికి చెఱకు విల్లు; దానిని నిలువున ఒలిపించుట సహజము. మఱియు ఎవరు తప్పుచేసిరో - వారినే కాక - కోపము గల యజమానుఁడు, తద్వంశజుల నందఱిని శిక్షించుటయుం స్వభావము] శరములన్ = కెల్లును, బాణములను; ఆయంబుఁ బోరయుటన్ = (పువ్వుపక్షమున) వృద్ధిని పొందుటను, (బాణపక్షమున) మర్మస్థానములఁ బొందుటను; ఊడిపెను = పోఁగొట్టెను. [పూవులు మన్మథునికి బాణములు; అవి వికసించినపిదప వృద్ధిని పొందుటకు బదులు వాడి రాలిపోవుట సహజము. వృద్ధిని పొందకుండ, ఆయువున్నట్టు లేకుండ అనిష్టుని శిక్షించుట సహజము.] గుణలతన్ = తీగవంటివింటినారిని; తగన్ = తగునట్లుగా; శబ్దమాత్రపాత్రము, చేసెన్ = వినఁబడుటకు మాత్రము తగినట్లు చేసెను. [మన్మథునికి నారి తుమ్మెదలగుంపు; అది యెప్పుడును శబ్దమునే చేయును; అట్లే గుణమెప్పుడును వినఁబడునదే కాని చూడఁబడునది కాదు. తన కిష్టము లేనివానిని స్వరూపము లేకుండ చేయుట - అట్టివాని పేరుమాత్రము నిలుచునట్లుంచుట శిక్షలో నొక విధము.] మూలబలమున్ = మూలమైన సేనను; శుక, పికాదులను; ద్రుమునన్ = చెట్టుపైని; కట్టించెన్ = ఉండునట్లు చేసెను, కట్టివైచెను. [శుకపికాదులు చెట్టుపైనే నివసించును; అవియే మన్మథుని సేన; చెట్టునకు కట్టించుటయు నొక శిక్షాభేదము.] సేనానాథున్ = సేనాధిపతి యగు మలయానిలమును; కంచుకివశము గావించెన్ = కుబుసము గల పామునకు స్వాధీనమగునట్లు చేసెను; [మన్మథుని సేనకు మలయానిల మధిపతి; అది పామున కాహారమగుట ప్రసిద్ధము; పాముచే కఱపించుటయు నొక శిక్షాభేదము.] సహచరున్ = వసంతుని; కమరించెన్ = వాడునట్లు చేసెను; చెట్లు చిగిరించుట, పూవులు వికసించుట మున్నగు పనులు చేయు మృదుస్వభావుఁడు మన్మథునితో కలిసిమెలిసియున్న వసంతుఁడు; కటికియెండ (గ్రీష్మము)రాఁగా వసంతర్తువు వాడి వత్తియగుచు - నశించును. మండుటెండలో నిలువఁబెట్టి శోషింపఁజేయుటయు నొక శిక్ష.] హితున్ = మిత్రుఁడైన చంద్రుని; ప్రతిపక్షభావసంగతుఁడని = పక్షపక్షమునకును దాని స్వభావముతో - వృద్ధిక్షయరూపమున) కూడినవాఁడు - శత్రువులతో ఏకీభవించినవాఁడు అని; చూచెన్ = ఎఱిఁగెను. [చంద్రునికి శుక్ల, కృష్ణపక్షానుసారముగ వృద్ధిక్షయములు సహజములు; మేలుగోరువాఁడు ఉపకరించనిచో వానిని శత్రుపక్షమువానినిగా ఎన్నుకొనుట స్వభావము.] వరకేతనము = యోగ్యమగు ధ్వజమైన మీనమును; కీర్తిధరమున్ = దట్టమైన బురదలో; డులిపెన్ = రాల్చెను. మన్మథునికి మీనము ధ్వజము; దానిని అడుసులో డుల్చుట స్వభావము. మఱియు అనిష్టుని గొప్పకీర్తిని నశింపఁజేయుట సహజము. కీర్తి = యశస్సు, బురద.]
అలం. శ్లేష. అర్థాంతరన్యాసము.

క. ఆరాజర్షి పదంపడి, క్షీరోదన్యాయమున విచిత్రగతిన్ ల
క్ష్మీరమణుఁ గలసి యేకా, కారంబున నలరె ముజ్జగంబులు వొగడన్. 99

టీక. పదంపడి = పిదప; క్షీరోదన్యాయమునన్ = పాలలో నీరు కలిసిపోవునట్లు; - భేదము లేక; ఏకాకారంబునన్ = అభేదరీతిని.

క. విను మఖిలదురితకులభం, జనమజ్జన మమృతనిధివశం బగుటకుఁ గా
వున సర్వజనోపాస్యం, బనూన మత్తీర్థరాజ మనుపమ మనఘా! 100

టీక. అమృతనిధి = అమృతమయమగు నిధి; వశంబు, అగుటకున్ = స్వాధీనమగుటకు; అఖిల......మజ్జనము = సమస్తపాపసమూహ నాశకమగు స్నానము; అగుచున్నదని శేషము. ఆ తీర్థరాజము = ఆ పద్మతీర్థము; అనూనము = తక్కువకానిది - గొప్పది; అనుపమము = సాటిలేనిది.

ఉ. భూరిసుఖానుషంగములు పూరుషుఁ బొందవు సోమపాన కై
దారజలోపయోగములు తత్కలనం బసరెక్కు నెత్తికిన్
పేరు శిలాకృతుల్ జఠరపేటిక కత్తైవు లేల? యెందు నె
వ్వారికిఁ బద్మ[1]తీర్థపతివారికిఁ జేరినఁ గల్గు సౌఖ్యముల్. 101

టీక. భూరిసుఖానుషంగములు = ఎక్కువ సుఖముల ననుభవించుటలు; సోమపాన, కైదారజలోపయోగములు=సుర త్రాగుట, పొలమునకు పెట్టిన నీరు తానుపయోగించుకొనుటయుఁ; పూరుషున్ = పురుషుని; పొందవు - అట్టివానివలన; గల్గు పాపములు పురుషునంటవు; తత్కలనన్ = ఆ పద్మతీర్థపు చేరికచే - అందు మునుగుటచే; నెత్తికిన్ = తలకు; పసరు ఎక్కున్ = జ్ఞానము కలుగును. పేరుశిలాకృతుల్ = పెద్దపెద్ద దేవవిగ్రహములు; ఉదరపేటికకున్ = పెట్టెవంటి పొట్టకొఱకు; అగుచున్న వనుట; [ఉదరనిమిత్తముగా అవి కల్పింపఁబడినవని భావము.] అత్తైవులు = ఆరోగము - ఆ చికాకు; ఎవ్వారికిన్ = ప్రతిజీవికిని; పద్మ......వారికిన్ = ఉత్తమమగు పద్మతీర్థపు జలమునకు.

చ. కృతమున నేకదంష్ట్రుఁడయి క్రీడ యొనర్చుచుఁ ద్రేత దంష్ట్రికా
ద్వితయముచే వెలుంగుచు మదించి త్రిదంష్ట్రలతోడ ద్వాపరం
బుతతిఁ జరించు నొక్క దితిపుత్త్రుఁడు; వృత్త్రుఁడు వానిఁ బోలఁ ద
ద్భుతజనకప్రతాపమున భూరిబలంబున మాయ పెంపునన్. 102

టీక. కృతమునన్ = కృతయుగమున; ఏకదంష్ట్రుఁడు = ఒక్క కోఱకలవాఁడు; త్రేతన్ = త్రేతాయుగమున; దంష్ట్రికాద్వితయముచేన్ = రెండు కోఱలచే; మదించి = క్రొవ్వి; ద్వాపరంబుతతిన్ = ద్వాపరయుగకాలమున; ఒక్క, దితిపుత్త్రుఁడు = ఒక్కదైత్యుఁడు - రాక్షసుఁడు; వృత్త్రుఁడున్ = వృత్త్రుఁడను రాక్షసుఁడును; అద్భుతజనకప్రతాపమునన్ = ఆశ్చర్యమును కలిగించు పరాక్రమమునందును.

క. ఆహరిహయారి శార్ఙ్గి, గ్రాహీ యన హిరణ్యకశిపు గాదిలి సుతుఁడై
బాహాబలశిఖిఁ ద్రిజగ, ద్దాహం బొనరించె నేకదంష్ట్రయుఁ దానున్. 103

టీక. హరిహయారి = ఇంద్రుని శత్రువగు రాక్షసుఁడు; గాదిలిసుతుఁడై = ముద్దుకొడుకై; బాహాబలశిఖిన్ = భుజబల మను నగ్నిచే.

క. ఆ యొంటిపంటివేలుపు, దాయం బొలియించె నృహరి దంభోళికటు
చ్ఛాయల నూయలలూపు న,ఖాయుధముల[2] వఱదుఁ జీఱు వ్యాఘ్రముఁబోలెన్.

టీక. ఒంటిపంటివేలుపుదాయన్ = ఏకదంష్ట్ర గల దేవశత్రుని - రాక్షసుని; నృహరి = నరసింహస్వామి; దంభోళి......చ్ఛాయలన్ = వజ్రాయుధపు తీక్ష్ణకాంతులను; ఊయలలూపు=ఊఁగులాడించు - అతిక్రమించు; నఖాయుధములన్ = గోళ్లు అను ఆయుధములతో; వఱదున్ = పెద్దనక్కను; చీఱు = చీల్చునట్టి; పొలియించెన్=చంపెను. అలం. ఉపమ.

ఉ. వెండియు రావణాబ్ధిఁ బ్రభవించెఁ ద్రిలోకహాలాహలాకృతిన్
మండుచు దంష్ట్రికాయుగమునం బెడఁగై యతికాయనామ మా
తండు ధరించి త్రేతఁ; దలఁ దర్వెఁ దదుగ్రనిశాటుఁ బట్టి వి
ష్ణుం డని రాముఁడై విలయసూర్యకరోగ్రశరాగ్రధారలన్. 105

1. చ. తీర్థవతి. 2. చ. పారుఁడు:

టీక. రావణాబ్ధిన్=రావణుఁడను సముద్రమున; త్రిలోకహాలాహలాకృతిన్ = ముల్లోకములకు హాలాహలవిషమగు రూపులో; దంష్ట్రికాయుగమునన్=రెండు కోఱలతో; వెడఁగై=ప్రకాశించి; అతికాయనామము = అతికాయుఁడను పేరు; త్రేఁకన్; ప్రభవించెన్=పుట్టెను;తదుగ్రనిశాటున్= ఆ భయంకరరాక్షసుని; పట్టి = పట్టుకొని; ఆనిన్ = యుద్ధమునందు; తలఁద్రెవ్వన్=తలను తఱిగెను -నఱికెను. విలయ......ధారలన్ = ప్రళయకాలసూర్యుని కిరణములవలె వాఁడియైన బాణముల యంచులచే. [అతికాయుని లక్ష్మణుఁడు చంపినట్లు రామాయణమునఁగలదు.] అలం. రూపకము, ఉపమ.

ఉ. [1]వ్యాపృతబద్ధవైరమతి నంతటఁ బోవక వాఁడు వెండియున్
వ్యాపకవేళ నిద్ధరఁ ద్రివిదంష్ట్రుఁడునా నుదయించి యాజిల
క్ష్మాపతిఁ బౌండరీకవిభుఁ జేరఁ గనుంగొని పల్కు మిక్కిలిన్
గోపము పర్వఁటన్ గొలిమికూఁడులయాడునఁ గన్ను లుబ్బఁగన్. 106

టీక. అంతటన్, పోవక = దానితో విడువక; వాఁడు = ఆ రాక్షసుఁడు; వ్యాపృతబద్ధవైరమతిన్ = వ్యాపింపఁబడిన బద్ధవైరము (పూర్వవిరోధము) గల బుద్ధితో; ఇద్ధరన్ = ఈ భూమిపైని; కోపము, పర్వఁటన్ = కోపము వ్యాపించుటచేత; కొలిమికూఁడులయాడునన్ = కమ్మరీని నిప్పుగుంటయొక్క గూఁడులవలె; ఉబ్బఁగన్=పెద్దవి కాఁగా-బూరటింపఁగా. అలం. ఉపమ.

ఉ. ఎక్కడి కేఁగుదెంచితి వహీనవిహార! చికిత్స నీకు నేఁ
జక్క నొనర్చెదన్; బెలుచఁ జంపితి దొంగిలి మున్ మదీయులన్
రక్కసులన్ నిరుం బొదివి ప్రాణముఁ గొందుఁ గడంగి సాదవై
[2]త్రుక్కిడియున్నఁ బోవిడువఁ; దొల్లిటి[3]త్రుళ్లిఁకఁ జెల్ల దిచ్చటన్. 107

టీక. ఏఁగుదెంచితివి?=వచ్చితివి? అహీనవిహార!=ఎక్కువగా తిరుగువాఁడా!, శేషశాయీ!చికిత్స= రోగముకుదుర్చుట - పనిపట్టించుట; పెలుచన్ = క్రూరముగా; పొదివి = ఆక్రమించి; సాదవై = సాధువవయి - మంచివాఁడవై; త్రుక్కిడి = గర్వము నశించి; తొల్లిటిత్రుళ్లి = వెనుకటి మిడిసిపాటు.

మ. అని సింహంబున కల్గు నక్కక్రియ నిట్లాక్షేపముల్ పల్కి య
ద్దనుజుం డంతకదండభీషణగదాదండంబునన్ వ్రేయ వం
చనఁ దూలించెఁ దదుగ్రసాధనముఁ గంసధ్వంసి తద్ఘోరతా
డనవేగంబున భగ్నమయ్యెఁ [4]గటివేల్లత్ క్షుల్లకాశిక్యమున్. 108

టీక. అద్దనుజుండు = ఆ రాక్షసుఁడు: అంతక......దండంబునన్ = యమదండమువలె భయంకరమైన గదతో; వ్రేయన్ = కొట్టఁగా; వంచనన్=తప్పుకొనుటచే; కంసధ్వంసి=శ్రీకృష్ణుఁడు; తదుగ్రసాధనమున్ = ఆ భయంకరమైన ఆయుధమును; తద్......గంబునన్ = దాని ఘోరమైన కొట్టుటయందలి వేగమువలన; కటి......శిక్యమున్ = మొలనుండి వ్రేలాడుచున్న జాలెసంచి; భగ్నము, అయ్యెన్ = శిథిలమయ్యెను. అలం. ఉపమ.

శా. అత్తార్క్ష్యధ్వజుఁ డప్పు డాగ్రహారసవ్యగ్రాత్ముఁడై దానవున్
మొత్తెన్ మెత్తనివీఁక దక్షిణకరాంభోజంబునన్; దాన న
మ్మత్తుండున్ గడతేఱె నెత్తురులు గ్రమ్మన్ ముక్కునన్ వాతఁ బెన్
మొత్తంబుల్ కొని; ప్రస్తుతించి రమరుల్ మోదించి దామోదరున్. 109

---

1. క. ఆవిత. చ. ట. వ్యాపృత. 2. చ. త్రుక్కిరి. 3. చ. ట. త్రుళ్లట. 4. క. కటి.
5. క. సహ. చ. ట. రస.

టీక. అత్తార్క్ష్యధ్వజుఁడు = గరుడుఁడు ధ్వజముగాఁ గల ఆ శ్రీకృష్ణుఁడు; అగ్రహరసవ్యగ్రాత్ముఁడై = రౌద్రరసముచే తొందరింపఁబడిన మనస్సు కలవాఁడై; దానవుఁ = ఆ రాక్షసుని; మెత్తనివీఁకన్ = మృదువైన విధమున; ['వీఁకన్ = పూనికతో' అని పూర్వటీక.] దక్షిణకరాంభోజంబునన్ = పద్మమువంటి కుడిచేతితో; దానన్ = ఆ దెబ్బవలన; వాతన్ = నోటినుండియు; వెన్ మెత్తంబుల్ గొని = అధికసంఖ్యాకములయి; క్రమ్మగ = వ్యాపింపఁగా; కడతేఱెన్ = చచ్చెను; అమరుల్ = దేవతలు; మోదించి=సంతోషించి; దామోదరున్ = విష్ణుని; ప్రస్తుతించిరి = కొనియాడిరి.

క. ఆ రొమ్ముదిక్కుఁ జిక్కం, బోయతివర! కానవచ్చి యున్నది భగ్నం
 బై యిపుడు మంత్రవర్ణ, శ్రీయుతవక్షఃస్థలునకు జితదైత్యునకున్. 110

టీక. భగ్నంబై = శిథిలమై; మంత్ర......స్థలునకున్ = మంత్రాక్షరములతోను, లక్ష్మీదేవితోను కూడిన ఱొమ్ముకల విష్ణువునకు; జితదైత్యునకున్ = జయింపఁబడినరాక్షసులు కలవానికి.

ఉ. ఆకమలేక్షణుండు తనయక్కునఁ దాల్చిన సిద్ధమంత్రముల్
 నా కెఱిఁగించినాఁడు మును నాయెడఁ గల్గినకూర్మి పేర్మి; నే
 లోకమునందు నెవ్వరికి లోఁబడనేఱదు నాకె కాని త
 ద్వ్యాకృతి; నావుడుం బలుకుఁ బ్రాంజలియై యతఁ డిందుశేఖరున్. 111

టీక. ఆ కమలేక్షణుండు = ఆ కృష్ణుఁడు; అక్కునన్ = ఱొమ్మున; కూర్మి పేర్మిన్ = ఎక్కువ మక్కువచే; తద్వ్యాకృతి = దాని వివరము; అతఁడు = నారదుఁడు; ప్రాంజలియై = చేతులు జోడించినవాఁడై; ఇందుశేఖరున్ = శివునిఁగూర్చి; పల్కెన్.

చ. పశుపతి! మమ్ముఁబోలిన ప్రపన్నులపైఁ గృప చాలి యున్కి [1]త్వా
 దృశులకు నైజమౌట పసుదేవతనూభవదత్తమంత్రముల్
 విశదముగాఁగ నా కొసఁగవే, నిను వేఁడెదఁ; దానఁ జేసి దుః
 ఖశరధి[2]ద్రెవ్వ [3]నీదయ నఖండసుఖస్ఫురణంబు నొందెదన్. 112

టీక. పశుపతి! = శివుఁడా! ప్రపన్నులపైన్ = శరణాగతులపయి; కృప, చాలియున్కి = దయగలిగి యుండుట; త్వాదృశులకున్ = మీవంటివారికి; నైజము, ఔటన్ = స్వభావమగుటచే; వసు......మంత్రముల్ = శ్రీకృష్ణునిచే ఈయఁబడిన మంత్రమును; దానఁజేసి = అందువలన; దుఃఖశరధి = సముద్రమువంటి దుఃఖము; త్రెవ్వన్ = అంతముకాఁగా - ఇంకగా - నశింపఁగా; నీదయన్ = నీ కరుణచే; అఖండసుఖస్ఫురణంబు = ఎడతెగని+సుఖానుభవమును.

ఉ. నావిని శూలి పల్కు మునినాయక! యీ మను వెందు గోప్యమై
 తా విలసిల్లు; దీని దురితప్రవణాత్ములకున్ మురారిసే
 వావిముఖప్రచారులకు వైష్ణవమార్గముగాని [4]హీనవుం
 డ్రోవఁ జరించు సజ్జనవిరోధులకుం దగ [5]దింత దెల్పఁగన్. 113

టీక. నాన్ = అని పల్కఁగా; శూలి = శివుఁడు; మనువు = మంత్రము; గోప్యమై = రహస్యమైనదై; దురితప్రవణాత్ములకున్ = పాపములందు ఆసక్తమగు మనస్సు కలవారికిని; మురారి... ప్రచారులకున్ = విష్ణుని సేవింపనివారికిని; సజ్జనవిరోధులకున్ = ఉత్తములను ద్వేషించువారికిని.

క. నీవు హరిభక్తియుతుఁడవు, గావున నా కెపుడుఁ గూర్తుఁ గావున విజ్ఞా
 నావాసపూర్ణబుద్ధివి, గావున [6]వివిపింతు వినుము కలుషవిదూరా! 114

1. చ. ట. దా. 2. చ. ద్రివ్వ. 3. చ. నీదెదయ. 4. చ. దానవుం. 5. చ. వింత. 6. చ. విను

టీక. కూర్తు = ఇష్టుఁడవగుదువు ['స్నేహింతువు' అని పూర్వటీక.] విజ్ఞాన......బుద్ధివి = విశేషజ్ఞానమునకునివాసమైన గొప్పబుద్ధికలవాఁడవు.

శ్లో. స్పర్శాద్యం సత్యనామాద్యం షష్ఠషష్ఠం సదీర్ఘకం,
షష్ఠం షష్ఠాది సత్యాంతం సమాకం తం విదుర్బుధాః. 115

టీక. స్పర్శాద్యం = మొదటి స్పర్శాక్షరము - కకారము - కలదిగాను; సత్యనామాద్యం = 'సత్యము' యొక్క పేరిలోని మొదటి యక్కరము - 'ఋతగ్ం సత్యం'-అని 'ఋ'కారము కలదిగాను; షష్ఠ షష్ఠం = ఆఱవవర్గము (అంతస్థాదికము)లోని ఆఱవ అక్షరము-షకారము; సదీర్ఘకం = ఆ 'ష' దీర్ఘముతోఁ గూడినది. - 'షా' కారము; కలదిగను [ఇట్లు నాల్గక్షరములు - 'కృషా' - అని కాఁగా.] షష్ఠం = ఆఱవ అక్షరము; షష్ఠాది = షష్ఠవర్గమొదటిదగు'య'కారము గలదిగాను; సత్యాంతం = నమ స్కృతి చివఱగలది-'నమః'-చివఱఁగలది. గాను; దీనినిబట్టి ఐదవ యక్షరము - ణ కారము - ఊహ్యము. ఇట్లు 'కృష్ణాయ నమః' అని తేలినది; (ఇది) సమాకం = సమానములగు దళములు కలది = [గరుడ వాహన విష్ణువు దేవతగాఁ గల] షడ్దళ - స్వాధిష్ఠాన చక్రముకలదిగాను; తం = ఆ మంత్రమును; బుధాః = విద్వాంసులు; విదుః = తెలిసికొందురు చెప్పుదురు.

క. కృష్ణుఁడు ఋషిగాఁగ మహా,విష్ణుఁడు దేవతగఁ బొల్చి వేమాఱులు త
న్నిష్ఠాతబుద్ధిఁ బేర్కొను, వైష్ణవులకు నీ మనువు ధ్రువస్థితి యొసఁగున్. 116

టీక. పొల్చి = ప్రకాశించి; తన్నిష్ఠాతబుద్ధిన్ = తదాసక్తమగు బుద్ధితో; ఈ, మనువు = ఈ మంత్రము; ధ్రువస్థితి = మోక్షము.

ఉ. ఎవ్వఁడు పౌండరీకమున కేఁగి మహానదిఁ దీర్థమాడి తా
నవ్విధులెల్లఁ దీర్చి కమలాక్షునకున్ బ్రణమిల్లి నూరుమా
ర్లివ్వరమంత్ర మర్థిఁ బఠియించు నతం డఖిలాఘపంకముల్
దవ్వు[1]సనం గనంగలఁడు తత్త్వమహత్త్వము సత్వరంబుగన్. 117

టీక. మహానదిన్ = గొప్ప నదియందు - భైమియందు; తీర్థమాడి = స్నానముచేసి; ఇవ్వర మంత్రము = ఈ గొప్పమంత్రమును; అర్థిన్ = ప్రీతితో; నిఖిలాఘపంకముల్ = సమస్తపాపములను మురికి; దవ్వుసనన్ = దూరముగ తొలఁగఁగా - నశింపఁగా; సత్వరంబుగన్ = వేగముగ; తత్త్వమహా త్త్వమున్ = పరమాత్మ యొక్క గొప్పతనమును.

క. విధివంతం[2]బుగ [3]విధుస,న్నిధి నిచ్చలు నేఁ బఠింతు నిఖిలభవతమో
వధవిధి[4]విధు వగు దీనిన్, విధినందన! తత్ప్రసాదవిభవాపేక్షన్. 118

టీక. విధివంతంబుగన్ = నియమానుసారముగా; విధుసన్నిధిన్ = విష్ణుసాన్నిధ్యమున; నిఖిల... ...విధువు = జన్మములను చీఁకట్లను నశింపఁజేయు పద్ధతియందు చంద్రుఁడగునది; తత్ప్రసాదవిభవా పేక్షన్=ఆతని యనుగ్రహసంపదను పొందు కోరికతో; విధినందన! = బ్రహ్మపుత్రుఁడవగు నారదమునీ! అలం. రూపకము.

వ. సిద్ధేశ్వరాహ్వయంబున సిద్ధలింగంబవై యొందేని నీ వుండుదు వా దక్షిణ [5]ద్వారంబు నధిష్ఠించి యీ మంత్రంబు ననుష్ఠించు నిష్ఠాగరిష్ఠులకు నిష్టార్థసిద్ధి కరతల స్ఫటికఘుటిక యగుట నిగమార్థంబు. తొల్లి తీర్థయాత్రాచరణనిపుణుండగు నీలాంబరుండు నిఖిలతీర్థంబులను[6] దర్శించుచు వచ్చివచ్చి పౌండరీకంబు సొత్తెంచి

1. చ. ట. సనం. 2. చ. బున. 3. చ. విధి. 4. చ. వధు. 5. చ. భాగంబు. 6. క. లును.

యుత్తుంగతరంగడోలారూఢ కలహంసకులకల[1]లరవఘుమఘుమిత బ్రహ్మాండకు
హరక్రోడంబగు భీమరథీనీరంబునం గృతస్నానుండై యనూనమహిమాభిరామం
బగు నా క్షేత్రంబునం గల [2]విచిత్రంబులు నేత్రప్రీణనంబుగా, నాచరించుచు
నచ్చోట సాక్షరుఁడగు పుండరీకాక్షు వీక్షించి వెఱఁగంది తదక్షరలక్షణంబు
నెఱుంగనేఱక యూరకుండె, నుండియు నయ్యేకకుండలుండు చలపకారితనంబున
నవ్వర్ణంబులు నిర్ణయింప నుద్యుక్తుండై. 119

టీక. నిష్ఠాగరిష్ఠులకున్ = నియమముచే మిక్కిలి గొప్పవారగువారికి; కరతలస్ఫటికఘుటిక = అఱచేతిలోని పటికపుపూస - స్పష్టముగ గోచరించునది; నీలాంబరుండు = బలరాముఁడు; చొత్తెంచి = ప్రవేశించి; ఉత్తుంగ.....క్రోడంబు - ఉత్తుంగ = ఉన్నతమయిన; తరంగ = అలలు అను; డోలా = ఉయ్యేలలందు; ఆరూఢ = ఎక్కియున్న; కలహంసకుల = హంససమూహముయొక్క; కలకలరవ ఘుమఘుమిత = కలకలధ్వనిచే ఘుమఘుమని ప్రతిధ్వనించు; బ్రహ్మాండకుహరక్రోడంబు = బ్రహ్మాండముల గుహల లోపలిభాగముకలది; అనూనమహిమాభిరామంబు = గొప్పమహిమచే మనోహరమైనది; నేత్రప్రీణనంబుగాన్ = కన్నులపండువు అగునట్లు; ఆచరించుచున్ = చేయుచు - అచటి విచిత్రములను కన్నులకఱవుదీఱఁజూచుచు; సాక్షరుఁడు = సమంత్రాక్షరుఁడు; వెఱఁగు, అంది = ఆశ్చర్యపడి; ఉండియున్ = అట్లూరకయుండినప్పటికిని; అయ్యేకకుండలుండు = ఆ బలరాముఁడు; చలపకారితనంబునన్ = పట్టుదలతో [చలపకారి = పట్టుదలకలవాఁడు;] ['చలపకారితనంబునన్ = మచ్చరముకలవానితనమున' అని పూర్వటీక.] ఉద్యుక్తుండై = సిద్ధపడినవాఁడై.

మ. కరముల్ మీఁదికిఁ [3]జాచి యూరుపులు బిగ్గం బట్టి యంతన్ రిపూ
త్కరముం బోవ నడల్చి యట్టిటఁ బద్మం బట్లు మోమొప్పఁగా
జరణాంగుష్ఠనఖావలంబనముతోఁ జండాంశుఁ గన్గొంచు భా
స్వరనిష్ఠం దప మాచరించె నొకమాసం బన్న[4]వర్జ్యంబుగన్. 120

టీక. ఊరుపులు = శ్వాసములు - ఊపిరి; బిగ్గంబట్టి = బంధించి; అంతన్ = పిదప; రిపూత్కరమున్ = శత్రుసమూహమును - కామాదులగు అరిషడ్వర్గమును; పోవన్, అడల్చి = తరిమి; మోము, ఒప్పఁగాన్ = ముఖము ప్రకాశింపఁగా; చరణాంగుష్ఠనఖావలంబనముతోన్ = కాలివ్రేలిగోరు ఆధారముగాఁ గల్గి-కాళ్లను ఎత్తి, వ్రేళ్లచివఱ నిలువఁబడి; చండాంశున్ = సూర్యుని; భాస్వరనిష్ఠన్ = ప్రకాశించు(గొప్ప)నియమముతో; అన్నవర్జ్యంబుగన్ = అన్నమును విడిచి.

తే. దానఁ బ్రియ[5]మంది దానవధ్వంసి యొసఁగెఁ
గూర్మి[6]యన్నకు ధర్మైకనిర్మలునకు
నమ్మహామంత్ర; మాతండు నంతనుండి
యదియ జపియింపఁదొడఁగె గాయత్రివోలె. 121

టీక. దానవధ్వంసి = రాక్షసులను నశింపఁజేసిన కృష్ణుఁడు; ధర్మైకనిర్మలునకున్ = తదేక(ధర్మ)దీక్షచే నిర్మలుఁడైనవానికి.

క. భూరిగుణరత్నరాశిఁ గుమారుఁ గనుంగొనఁగఁ దివురు మమకారము లో
నారసి యొసంగె మున్నా, నీరజనాభుండు రుక్మిణికి[7]నామనువున్. 122

1. క. లారవ. చ. లరవ. ట. లనాద. 2. చ. విశేషంబు. 3. క. సాఁచి. చ. జాఁచి. క. 4. వర్జ్యంబు. చ. వర్జంబు. 5. చ. మొంది. 6. ట. యున్న. 7. క. నీ. చ. నా.

టీక. భూరిగుణరత్నరాశిక్ = గొప్పవై, శ్రేష్ఠమైన గుణములప్రోవు అనవాసిని; కనుఁగొనఁగ్ = చూచుటకు - పొందుటకు; తివురు = యత్నించునట్టి; మమకారము = కోరిక; లోఁజాఁచి = మనస్సున గ్రహించి; నీరజనాభుండు = పద్మనాభుఁడు-కృష్ణుఁడు; ఈమనువక్ = ఈమంత్రమును.

క. జపియించె నేను దినము, లుపవాసపురస్సరముగ నుత్కలి నిష్ఠా
నిపుణమతిం జలిచే నిటు, లుపదిష్టంబైన మంత్ర మత్సుక మొదవన్. 123

టీక. ఏను,దినములు = అయిదు దినములు; ఉపవాసపురస్సరముగక్ = ఉపవాసములో కూడ; ఉత్కలి = ఆమని - రుక్మిణి; ఉత్సుకము, ఒదవక్ = ఉత్సాహము, కలుగఁగా.

ఉ. విస్మ మదీయనేత్రశిఖి వేగమునన్ జముఁగూడఁ జన్నయ
స్మన్మథుఁ డిందుబింబసుకుమారుఁడు భోజతనూజయందుఁ బు
ట్టె న్మధువైరి దెల్పిన కడిందిజపంబు నెపంబునన్ బున
ర్జన్మమునొందె రాగరససంపదపెంపు యుగద్వయీమతిన్. 124

టీక. మదీయ - వేగమునక్ = నా మూఁడవకంటి యగ్ని వేగమున; ఇందు బింబ సుకుమారుఁడు = చంద్రబింబమువలె చక్కనివాఁడు; భోజతనూజయందుక్ = రుక్మిణియందు; కడిందిజపంబు నెపంబునక్ = గొప్పదైన జపము కారణమున; రాగరససంపదపెంపునక్ = గొప్పదైన అనురాగసంపద; యుగద్వయీమతిక్ = ఇద్దఱుయువకులరీతిని-ప్రద్యుమ్న, సాంబ రూపమున; పునర్జన్మము నొందక్ = మరలఁ బుట్టెను.

సీ. బలభిదారామసంభవలతాంతశ్రేణిఁ బన్నుము నాకొక్క చిన్ని తేరు
కాళికెంగేలిచిల్కలరాజుఁ గొనితెచ్చి నావెంటఁ బడివాగె నడవఁ బనుపు
గగనచరద్రాశిగణవర్తిమకరంబు బిరుదుటెక్కముగ వేగిర మొనర్పు
మదనగోపాలుండు మాతండ్రిచే నాకుఁ జెఱకుచే మలి[1]పింపుకఱకువిల్లు

తే. వనజహితు వేఁడి తమ్మి తూపునకుఁ దెమ్ము, దివ్యములఁగాని సాధింపఁ దీరదీశు
నంబ! నీవంచు రుక్మిణి నట్టు నిట్టుఁ, దిరుగు శైశవచాప[2]లార్దితుఁడు మరుఁడు.

టీక. బలభి......శ్రేణిక్ = ఇంద్రుని యుద్యానవనములోని పూలమొత్తముచేత; చిన్ని తేరు = చిన్నరథమును; పన్నుము = తయారుచేయుము; కాళి......రాజుక్ = కాళికాదేవి చేతిపైనుండు గొప్పచిలుకను; నావెంటక్ = నావెనుక; పడివాగెక్ = స్వారికి తగిన ఏర్పాటుతో-జీనితో; నడువక్ = నడచుటకు; గగన......మకరంబు = ఆకాశమున తిరుగు రాశులలోని మొసలిని; మదనగోపాలుండు = మదనగోపాలుఁడైన విష్ణువు; మలిపింపు = చెక్కింపుము; కఱకువిల్లు = కఠినమగు ధనుస్సు; వనజహితుక్ = సూర్యుని; వేఁడి = ప్రార్థించి; తమ్మి = కమలమును; తూపునకుక్ = బాణమునకు; తీరదు = సాధ్యపడదు; అంబ! = అమ్మా! శైశవచాపలార్దితుఁడు = బాల్యమందలి చాపల్యముచే పీడింపఁబడినవాఁడు; మరుఁడు = మన్మథుఁడు.

బిడ్డ లిట్టి యసాధ్యపుఁగోరికలను గోరుటయు, అందులకుఁ దల్లిచీరపట్టుకొని చుట్టును తిరుగుటయు స్వభావజములు.

చ. పలుచని లేఁతకెంజిగురు[3]బత్తళికం బెకలించి తేనియం
గొలిపిన[4]తాసటంబుగల క్రొవ్విరితూపుల నిక్షుచాపుఁడే
గెలు పొనఁగూర్చె; నా గెలుపు కృష్ణునిపట్టపుదేవి రుక్మిణీ
లలన జపించు మంత్రముబలంబున నైనదిగా నెఱుంగుఁడీ! 126

1. క. పించు. చ. ట. పింపు. 2. చ. మార్థితుడు. 3. చ. ట. బత్తిడిగె. 4. క. చాసటంబుఁ గూర్చు. తాసటంబుఁ. చి. ని.

టీక. పలుచని......బత్తళికన్ = మృదువై లేఁతదైన చిగురుటాకుల యమ్ములపొదియుండి; వెకలించి = లాగి; తేనియంగొలిపిన తాసటంబు = తేనెతోఁగూర్చిన మెఱుఁగు; ['బాసటము = సహాయము. వాఁడి' అని పూర్వటీక.] ఇక్షుచాపుఁడు = మన్మథుఁడు.

క. సరసిజభవభవ! వాయు, స్ఫురితములై త్రిపురదహనములు త్రిజగములన్
బురికొని నీరసయవసాం, కురసఖముగ నేర్చె మున్నకుంఠితశక్తిన్. 127

టీక. సరసిజభవభవ ! = బ్రహ్మపుత్రుఁడవగు నారదుఁడా ! వాయుస్ఫురితములై = వాయువులచే విస్తరింపఁజేయఁబడినవై; త్రిపురదహనములు = త్రిపురములనెడి యగ్నులు; పురికొని = వ్యాపించి; అకుంఠితశక్తిన్ = మొక్కవోని బలముతో; నీరసయవసాంకురసఖముగన్ = ఎండిన గడ్డిపరకలవలె; ఏర్చెన్ = దహించెను. అలం. ఉపమ.

సీ. పెనుఁగంపతోడుగు లీడ్చిన మొల్కసనీ యయ్యె గగనంబుతో రాయు కాననములు
కడులావుమానిసి [1]కాల రాచిన చీమ చాలయ్యెఁ బశ్వాదిజంతుపంక్తి
[2]బడెగండ్ల నొంటిపైఁబడిన విఘ్నేశవాహములయ్యె హరిదంతహస్తిపతులు
వనపాలు రడుసులోఁ జనఁ[3]గ్రుక్కు తాళీఫలాకృతులయ్యెఁ గులాచలములు
తే. మృదులగోమయపిండసమ్మిళితకార, వేల్లఫలబీజసమమైరి వీళ్లప్రజలు
కమలసంభవవరదానగర్వితాసు, రవరపట్టణనిర్భరాక్రమణవికృతి. 128

టీక. కమల......వికృతిన్ - కమలసంభవ = బ్రహ్మచేతనైన; వరదాన = వరదానమున; గర్విత = గర్వించిన; అసుర = రాక్షసులయొక్క; పట్టణ = పురములచేనైన; నిర్భరాక్రమణవికృతిన్ = ఎక్కువైన యాక్రమణమను వికారమువలన; గగనంబుతోన్, రాయు = ఆకాశమును ఒరసికొనునట్టి - అత్యున్నతము లయిన; కాననములు = అడవులు; పెనుఁగంపతోడుగు = పెద్దకంపలకట్ట - ఒకవిధమైన చీపురు; ఈడ్చిన = (మీఁద) లాగిన మొల్కసనీ = లేఁతపైరు; [పెద్దయడవులు నేలమట్టము లయ్యె ననుట.] కడులావుమానిసి = మిక్కిలిలావుగనున్న మనుష్యుఁడు; చీమచాలు = చీమలబారు; హరిదంతహస్తిపతులు = గొప్పదిగ్గజములు; బడెగండ్లన్ = పెద్దకలుఁగులందు; ఒంటిమైన్ = ఒక్కసారిగా; విఘ్నేశవాహనములు = ఎలుకలు; కులాచలములు = కులపర్వతములు - మహేంద్రాది సప్తకుల పర్వతములును; వనపాలురు = తోఁటకాపులు; అడుసులోన్ = బురదలో; చనన్ = చొచ్చునట్లు; తాళీఫలాకృతులు = తాఁటిపండ్లవంటివి; వీళ్లప్రజలు = పట్టణములలోని జనులు; మృదుల......సమము = మెత్తని పేడముద్దకు అద్ద బడిన కాకరగింజలతో సమానముగా. అలం. ఉపమ, రూపకము. కావ్యలింగము.

క. ఈ రీతిఁ గొంతకాలము, క్రూరగతిన్ సోఁకుమూఁక కుడిదలయూళుల్
గారింపఁగ నే నంతట, వారింపఁగఁ గణఁగితిన్ భువనహితబుద్ధిన్. 129

టీక. సోఁకుమూఁకకుడిదలయూళుల్ = రాక్షసుల యునికిపట్టు లగు త్రిపురములు; కారింపఁగన్ = బాధింపఁగా; కణఁగితిన్ = సిద్ధపడితిని.

చ. అపుడు పినాకమున్ బవినిభాస్త్రములుం గొని యేయఁబూని త
త్త్రిపురము లొక్కటన్ నిటలదృష్టికి లక్ష్యముచేయుచోట మ
ద్వపురుదితంబులైన శ్రమవారిజలంబులు డిగ్గజాతి యు
ర్విపయిఁ గడున్ వడిన్ దొఱఁగి వెల్లువచూపి నదీత్వ మొందుచున్. 130

1. క. కాళ్ల. చ. కాల. 2. క. బడెగండ్లనుంటిమై. చ. ట. బడిగండ్లమిట్టపై. 3. చ. జిక్కు

టీక. పినాకముఁ = పినాకమనెడి ధనుస్సును; పవినిభాస్త్రములఁ = వజ్రసమానములగు బాణములను; ఒక్కటఁ = ఒక్కసారిగా; నిటలదృష్టికిఁ = ఫాలలోచనమునకు; లక్ష్యము చేయుచోటఁ = గురిచేయునప్పటికి; మద్వపుఃప్రభవితంబులైన = నా శరీరమునుండి పుట్టిన; శ్రమవారిజలంబులు = చెమటనీరు; తొఱఁగి = జారి-కారి; వెల్లువచూపి = ప్రవహించి.

క. మున్నెను మేన నలఁదిన, ప్రస్నని భసితంబు నణఁచి [1]శ్రమవారి కడుఁ
[2]జెన్నెసఁగె మంచుమల[3]మం, చున్నడఁచికొని ప్రవహించు సురనదిపగిదిన్. 131

టీక. అలఁదిన = పూసిన; ప్రస్నని భసితంబు = మనోజ్ఞమగు (తెల్లనైన) బూడిద; శ్రమవారి = చెమట; మంచుమలమంచుఁ = హిమాలయప్రమంచును; [పూర్వటీకలో 'సంచు' పాఠము గ్రహింపఁబడి 'సంచుఁ = విధముగ - అందముగ' అని అర్థము వ్రాయఁబడినది.] అడఁచికొను = కొట్టుకొని; [ఇచట భసితముతో మంచు సరిపోల్పఁబడినది] అలం. ఉపమ.

క. భీమాహ్వయమున వర్తిలు, నా మేనం బుట్టునంది నదినై వెలసెఁ
భూమిఁ భైమి యనందగి, భీమరథి యనంగ మాఱుపేరెసఁగంగన్. 132

టీక. పుట్టువు, అంది = జన్మించి.

శా. ఆక్షైమీనది విశ్వముఁ నిజకృపీటార్ద్రింబు గావించుచుఁ
శ్రీభామావిభుక్షేత్రమండలము డాసెఁ; డాసినఁ వీచిరే
ఖాభీలంబగు దానిపెంపు గని ము[4]న్నందుండు ప్రాణుల్ మహా
క్షోభోద్విగ్నమనస్కులై పెలుచ నాక్రోశించుచుఁ బెంపఱన్. 133

టీక. విశ్వముఁ = ప్రపంచమునంతను; నిజకృపీటార్ద్రింబుఁ = తన నీటిచే తడిసినదానిని; శ్రీరామాభిభుక్షేత్రమండలము = శ్రీలక్ష్మీదేవిభర్తయగు విష్ణుని క్షేత్రమగు పౌండరీకమును; డాసెఁ = సమీపించెను; వీచిరేఖాభీలంబు = అలలసమూహముచే భయంకరమైనది; మహాక్షోభోద్విగ్నమనస్కులై = ఎక్కువైన కలఁతపాటుచేత భయపడిన మనస్సులు కలవారై; పెలుచఁ = గట్టిగా; ఆక్రోశించుచుఁ = మొఱపెట్టుచు; పెంపఱఁ = దైన్యమునొందఁగా.

క. భూరి[5]భయార్దితులై చని, శౌరి నవు మదరాగరుచికృపాపూరితదృ
క్కైరవుఁ బలుకుదు రమృతా, హారులుహరిఁబలుకు క్రియఁ గృతాంజలు లగుచున్.

టీక. భూరిభయార్దితులై = గొప్ప భయముచే పీడింపఁబడినవారై; మద...కైరవుఁ = గర్వము, ప్రేమము తేజస్సు, దయ - అనువానితో నిండిన కలువలవంటి కన్నులు కలవానిని; అమృతాహారులు = దేవతలు. అలం. ఉపమ.

ఉ. మిక్కుటమైన [6]పొంకమున [7]మిన్నలగర్భముగాఁగఁ బొంగి నేఁ
డొక్కమహాస్రవంతి యిదె యుత్తరదిక్కున క్షేత్రసీమపై
నిక్కె లయాబ్ధిఁబోలె; [8]నిట నిల్వఁగనోపము నాగహార! మే
మెక్కడి కేఁగువార? మిఁక నెద్ది తెఱం గిటమీఁద? నావుడున్. 135

టీక. పొంకమునఁ = వేగముతో; మిన్ను = ఆకాశము; గర్భముగాఁగఁ = ఉత్పత్తిస్థానము కాఁగా; మహాస్రవంతి = గొప్పనది; లయాబ్ధిఁబోలెఁ = ప్రళయకాలపు సముద్రమువలె; నాగహార! = పాము హారముగాఁగల కాలభైరవుఁడా!

---

1. చ. క్రమ. 2. చ. జిన్నె. 3. క. సంచున్నాఁచికొని. చ. నుంచు...ట...నడిచికొని. 4. చ. న్నెన్నుండు. 5. చ భయావృతు. 6. క. పంక. చ. ట. పొంక. 7. క. మిన్నుల. చ. మిన్నల. 8. చ. ట. యిట.

సీ. కాళరాత్రి స్తనాగ్రకృతావకాశమై యురము వెల్మిడిపూఁత యొప్ప వెనుప
శిథిలత్వ మొందిన చెంగావిజడముడి చిలుకూడి నెలపువ్వు చెంప*నంటఁ
గంకాళ మను బుద్ధిఁ గరమున జందెంపుఁజిలువఁ బట్టిన నది జలదరింప
నెచ్చటఁ బ్రభవించె? [1]నే తెద్ది? యని పల్కు సరభసోక్తుల జగ[2]జ్జంతు లలుకఁ
తే. బాణిపుట[3]శీధుపాత్రంబుఁ బాఱవైచి, కురువుపై నున్న కిన్నర నుఱక [4]ద్రోచి
యతిరహఃకేళినుండియు నరుగుదెంచి, భూరిజయగౌరవుఁడు కాలభైరవుండు.

టీక. కాళ.....వకాశము = కాళరాత్రి (కాళి)యొక్క స్తనముల అగ్రభాగములచే చేయఁబడిన తెరపి గలది - అనఁగా అతని భార్య యగు కాళి కౌఁగిలించుకొనుటచే భైరవునిరొమ్ము మీఁద స్తనచూచుకము లంటిన చోట మాత్రము విడిచి, తక్కినయెడ బూడిద దట్టమై యున్నదనుట. [ఇట్టుండుట ఎక్కువ అందమును కలుగఁజేయుచున్నదని భావము] శిథిల్వము, ఒందిన=విడిపోయిన; చిలుకూడి = ముడిజాఱి; నెలపువ్వు=(జడలోని) చంద్రుఁడను పువ్వము; చెంపన్ అంటన్=చెంపపైఁబడఁగా; కంకాళము = ఎముకలగూడు; కరమునన్=చేతితో; జందెంపుఁజిలువన్ =ఉపవీతముగా నున్న పామును; జలదరింపన్ = జల్లుమనఁగా - భయపడఁగా; సరభసోక్తులన్ = తొందరతోఁగూడిన మాటలచే; జగజ్జంతులు = లోకములోని జీవులు; అలుకన్ = భయపడఁగా: పాణిపుటశీధుపాత్రంబున్ = చేతిలోని మధుకలశమును; కురువుపైన్ = తొడపైని; కిన్నరన్ = వీణను; ఊఱక = ఊరక; అతిరహఃకేళిన్ = (భార్యతో) ఏకాంతవిహారమున. అలం. భ్రాంతిమంతము, స్వభావోక్తి.

ఆ. అరుగుదెంచి యమ్మహానది వీక్షించి, చేతు లెత్తి బిట్టు చిట్టమిడిచి
ఘోరకోపవేగ ధీరోక్తు లులియంగఁ, బలుకు నిట్లు క్షేత్రపాలకుండు. 137

టీక. బిట్టు = గట్టిగా; చిట్టము, ఇడిచి = చిటికెవ్రేసి, ఘోరకోపవేగధీరోక్తులు = ఎక్కువ కోపముచే తడఁబడినమాటలు; ఉలియంగన్ = ధ్వనిచేయఁగా.

చ. 'నిలునిలు! తుంగభంగవగు నిన్ను గనుంగొని సాధ్వసాతి వి
హ్వాలమతులైరి క్షేత్రతలవాసులు; దానికిఁ గోప[5]గించె నీ
వలమురి[6]తాలు; పింక నిట వచ్చుట మానుము మచ్చెకంటి!' నా
నిలిచి నుతించు నన్నది వినిశ్చితకార్యగతిన్ జగత్పతిన్. 133

టీక. తుంగభంగవు = ఎత్తయిన అలలు కలదానవు; సాధ్వసాతివిహ్వాలమతులు = భయముచే మిక్కిలి ఆందోళపడు మనస్సు కలవారు; వలమురితాలుపు = దక్షిణావర్తశంఖమును దాల్చిన విష్ణువు; మచ్చెకంటి! = చేపలవంటి కన్నులుకలదానా! (నది స్త్రీకావున యిట్టి సంబోధనము). వినిశ్చితకార్యగతిన్ = నిశ్చయింపఁబడిన కార్యముల పద్ధతిగలవానిని; జగత్పతిన్ = విష్ణుని; నుతించున్.

సీ. జగదుద్భవస్థితిక్షయహేతు వెవ్వఁడు దేవాదిదేవుండు దిక్కు నాకు
గ్రాహనిగ్రహ [7]మీఁగి కరిఁ గాచె నెవ్వఁడు త్రిభువనాధీశుండు దిక్కు నాకుఁ
దుదిపదంబు నొసంగి ధ్రువుఁగాచె నెవ్వఁడు దృఢదయామయమూర్తి దిక్కు నాకు
[8]ద్రౌపదిబన్నంబుఁ [9]దొలఁగించె నెవ్వఁడు దీనమందారుండు దిక్కు నాకు
తే. నెవ్వనిపదాబ్జమున జనియించు జలము,మజ్జనకుఁడైన శివుఁ డాత్మ మౌళి [10]నిలిపె
నమ్మహావిష్ణుఁ డా కృష్ణుఁ డా గుణాబ్ధి, దేవకీనందనుఁడె యొందు దిక్కు నాకు.

---

*శ. ర. వట్ట. 1. చ. నెరరెద్ది. 2. చ. జంతు. 3. చ. శీమ. 4. క. కఁద్రోచి. శ. ర. కత్రోచి. 5. క. గించినన్. 6. క. తాల్పుడిం. శ. ర. తాలుపిం. 7. చ. ముగల్గి. 8. క. ద్రౌ. చ. ద్రో. 9. క. దల. చ. దొల. 10. చ. నిలిపి.

టీక. జగదు......హేతువు = లోకముల సృష్టి, స్థితి, లయములకు కారణమైనవాఁడు; గ్రాహనిగ్రహము, ఈఁగి = మొసలితోడి యుద్ధమును తొలఁగించి; కరిన్ = ఏనుఁగును - గజేంద్రుని; తుదిపదంబున్ = ఉత్తమస్థానమును-మోక్షమును; బన్నంబున్ = భంగపాటును; జనియించు జలమున్ = పుట్టిన నీటిని; గుణాబ్ధి = గుణములకు సముద్రుఁడు.

తే. శరణమవు గమ్ము; మద్భయజ్వరము నడఁపు, భగ్నమతి నైతిఁ [1]కుక్కురభర్తకతన
నింక నెయ్యదిదిక్కు? చక్రాంక! నన్నుఁ బ్రోవు మరిపల్లెఁ గృపఁ బల్కు దేవుఁ [2]డేటి.

టీక. మద్భయజ్వరమున్ = నా భయము అను రోగమును; అడఁపు = పోఁగొట్టుము; కుక్కురభర్తకతనన్ = కుక్క వాహనముగాఁగల కాలభైరవునివలన; [‘కుక్కురభర్త = కుక్కలరాజు’ అని పూర్వటీక.] భగ్నమతిన్ = శిథిలమైన బుద్ధి కలవాఁడను; చక్రాంక ! = చక్రము చిహ్నముగాఁ గల దేవా !

ఉ. రమ్ము గరమ్ము ద్రోచి మధురప్రియభాషిణి! నన్నుఁ గన్నమీఁ
దమ్మఁ జేయుక్ భయమ్ము గలదా! వల దాతురవృత్తి; మన్నియో
గమ్మున నీప్రదేశమునఁ [3]గ్రమ్మి నమజ్జనజన్మజాడ్యపా
శమ్ములఁ ద్రెంపు; నింపు మనిశమ్ము శుభమ్ములు భూతకోటికిన్. 141

టీక. గరమ్ము=బెదరుపాటు; ఆతురవృత్తి = తొందరపాటు-కలఁతపాటు; వలదు = అక్కఱలేదు; మన్నియోగమ్మునన్ =నా యాజ్ఞవలన; క్రమ్మి = వ్యాపించి - ఉండి; నమజ్జనజన్మజాడ్యపాశమ్ములన్ = వంగియున్న (నమస్కరించిన జనుల పునర్జన్మజాడ్యముల పాశములను; అనిశమ్ము = ఎల్లపుడును; భూతకోటికిన్ = జీవరాశికి.

క. అస్మత్క్షేత్రస్థితి భవ, భస్మాంగజ! గంగకంటెఁ బావని వగుచున్
భస్మీకరింపు లోకా, పస్మారప్రాయదురితబాధాశతమున్. 142

టీక. భవభస్మాంగజ ! = విభూతితోఁ గూడిన శివుని దేహమునుండి పుట్టిన నదీ! అస్మత్క్షేత్రస్థితిన్ = నాక్షేత్రమున ఉండుకతనమున; పావనివి = పవిత్రమైనదానవు; లోకా......శతమున్ = లోకముయొక్క మూర్ఛతో సమానమగు వందలకొలఁదియైన పాపములబాధలను; భస్మీకరింపు=బూడిద చేయుము - నశింపఁజేయుము.

చ. అని వనజాక్షుఁ డీకరణి నానతియిచ్చినఁ దత్కృపారసం
బనుపెనువాన నుబ్బినక్రియన్ రయ మారఁగ దత్ప్రదేశమున్
ధనువున నారికై నిగిడె; దానిశరంబు గరంబుఁ దాఁకినన్
దునుఁగుఁ జినుంగు ప్రీలుఁ గడుఁదూలు జగజ్జనజన్మలక్ష్యముల్. 143

టీక. వనజాక్షుఁడు = తామరలవంటి కన్నులు గల విష్ణువు; ఈకరణిన్ = ఈరీతిని; పెనువానన్ = పెద్దవర్షముచేత; తత్ప్రదేశమన్ధనువునన్ = ఆక్షేత్రప్రదేశమనెడి వింట; శరంబున్ = (ధనుఃపక్షమున) బాణమును; (నదీపక్షమున) నీటిని; తునుఁగున్ = తెగును; ప్రీలున్ = చీలును; తూలున్ = ఎగిరిపోవును - నశించిపోవును; జగజ్జనజన్మలక్ష్యముల్ = లోకములోని జనుల జన్మముల గుఱులు; [ఇచట జలమునకుఁగల బాణరూపముచే లక్ష్యములకు పడఁగొట్టునట్లు వర్ణన;] అలం. రూపకము.

క. ఎందుఁ బ్రభవించె నస్మ, న్నందన యత్తీర్థవిభువు నరసింహాఖ్యం
జెంది యదునందనాత్మా, నంద మగున్ బద్మగర్భనందన! వింటే. 144

1. క. కుర్కుర. 2. చ. డేడి. 3. చ. గ్రమున.

టీక. అస్మన్నందన = సాపుత్రిక - భైమీనది; అత్తీర్థవిభువు = ఆ గొప్ప తీర్థము.

క. అదిమొదలు[1]గా సరస్వతి,తుదగాఁ గల తీర్థములకు దొరయై నడుమఁ
బొదలు ఋషివృషభ సేవిత, పదుఁడగు హరి మెచ్చు తీర్థపతి మానిపతీ! 145

టీక. దొరయై = ప్రభువై; ఋషి......పదుఁడు = గొప్పమునులచే సేవింపబడు పాదములు కలవాఁడు - విష్ణువు; మెచ్చు = కొనియాడునట్టి; తీర్థపతి = గొప్ప తీర్థము - భైమీనది; నడుమఁ; పొదలుఁ = ప్రకాశించును.

క. సాక్షాత్కరించి పద్మద, ళాక్షుఁడు వేంచేసియునికి న త్తీర్థకులా
ధ్యక్షము మసారతరళా, లక్షిత ముక్తావళీ లలంతిం[2]బోలున్. 146

టీక. వేంచేసియునికిఁ = వేంచేసి యుండుటచేత; మసార......లలంతిఁ = నాయకమణి యగు ఇంద్రనీలముతోఁ గూడిన ముత్యాలహారముచు; పోలుఁ ,['మసారతరళాలక్షిత = పచ్చలపతక ముచే గుఱుతిడఁబడిన' అని పూర్వటీక.] అలం. ఉపమ.

క. వెన్నుఁడు ప్రత్యక్షంబై, యున్నయెడకు దక్షిణాశ నొక పులినతలం
బున్నది; మిన్నది కడగను, నున్నతిఁ గన్నది శుభంబు లొసఁగం బొసఁగన్. 147

టీక. వెన్నుఁడు = విష్ణువు; పులినతలంబు = ఇసుకతిన్నె; కడగమనున్నతిఁ = మిక్కిలి గొప్ప ఎత్తును; పొసఁగఁ = అనుకూలింపఁగా.

ఆ. ముందు నందగోపుమందయందుఁ జరించు, రూపధన్యయొార్తు గోపకన్య
విష్ణు[3]భక్త ముక్త కృష్ణుఁ డచ్చట నుక్కి, యొఱేఁగి †యేఁగుదెంచి [4]యెఱుకమించి.

148. మందయందుఁ = గొల్లపల్లెలో; రూపధన్య = అందకత్తె; గోపకన్య = గొల్లపడుచు; విష్ణుభక్త = విష్ణుభక్తురాలు; ముక్త = జీవన్ముక్తురాలు; ['భుక్తముక్త = అనుభవింపఁబడి విడువఁబడినది' అని పూర్వటీక. ఇందలి 'భుక్త' అను పాఠమును, దాని యర్థమును అననుగతములు.] ఎఱుకఁ, మించి= జ్ఞానముచే గొప్పదయి.

క. విప్ర[5]కులోచితశుచివే, షప్రథితశరీర యయ్యుఁ జక్రస్తని సా
భిప్రాయస్మితవికసిత, దీప్రనిజకపోల యగుచు దేవునిప్రోలన్. 149

టీక. విప్ర......శరీర = బ్రాహ్మణకులమునకుఁ దగిన పరిశుద్ధాలంకారముచే చక్కని శరీరము కలది - చూచుటకు చక్కని బ్రాహ్మణవనితవలె నున్నది; చక్రస్తని = గుండ్రనిచన్నులు కలది; సాభిప్రాయ......కపోల = అనురాగముతోఁగూడి, మెఱుఁగెక్కి ప్రకాశించు చెక్కిళులు కలది.

సీ. జలధరశ్యామకుంతలకలాపమునకుఁ బాటింపమిరియు నవప్రసవకలన
దళితనీలోత్పలదళచంచదక్షుల కామిాలనంబె కాలాంజనంబు
కుంభికుంభస్థూలకుచమండ[6]లికి జ్ఞానముద్రాకరమె [7]ముత్తెములసరంబు
గగనసోదరవలగ్నప్రదేశమున [8]కోడ్యాణబంధంబె యొడ్డాణ మిడుట

తే. గాఁగఁ దప మాచరించు నక్కలువకంటి, యంగలతిక నిరాకల్ప యయ్యు [9]నలరె
శారదారంభవిమలాభ్రసరణికరణిఁ, బ్రకృతిమధురంబులకు వేషరచన లేల ? 150

---

1. క. గను. చ. ట. గా. 2. చ. ట. బొలుచున్. 3. క. భుక్త. చ. ట. భక్త. †చ. ట. యరుగుదెంచి. క. యఁరుగుదెంచె. 4. క. నెఱుక. చ. ట. యెఱుక. 5. క. వరూ. చ. కులో. ట. మహిళ. 6. చ. లిక. 7. క. ముత్య. చ. ముత్తె. 8. చ. కొడ్డాణ. 9. క. నమరె. చ. నలరె.

టీక. జలధర.....కలాపమునకున్ = నీలమేఘమువలె నల్లనైన శిరోజసమూహమునకు; పాటింపమియె = ఆదరింపకుండుటయే - బంధించుకొనకుండుటయే - విరియఁబోసికొనుటయే; నవప్రసవకలన=క్రొత్తపువ్వులను ముడిచికొనుట - [ఆమె కొప్పుపెట్టుకొని పూవులను ముడిచికొనిన ఎంత అందముగ నుండునో, కొప్పుముడిచికొనక, తల విరియఁబోసికొనినను అట్లే అందముగ నుండును. ఇట్లే ప్రతిపాదమునను గమనించునది.] వికచ.....పక్ష్మలకున్ = వికసించిన నల్లకలువ రేకులవలె ఒప్పిదమైన కన్నులకు; అమీలనంబె = కొంచెము మూసికొనియుండుటయే; కాలాంజనంబు = కాటుక; [కాటుక లేకున్నను, కన్నులు కాటుకపెట్టుకొన్నట్లందముగ నున్నవనుట.] కుంభికుంభస్థూలకుచమండలికిన్ = ఏనుఁగు కుంభమునవలె పెద్దదైన స్తనములకు; జ్ఞానముద్రాకరమె = జ్ఞానముద్రతోఁ గూడిన హస్తమే. ముత్తెములసరంబు = ముత్యాలహారము. [కుడిచేతి బొటనవ్రేలియొక్కయు, చూపుడువ్రేలియొక్కయు కొనలను చేర్చి ఱొమ్ముపై నుంచుకొనుచు, ఎడమచేతిని ఎడమమోకాలిచిప్పపయి నుంచుట తపోవిషయమున జ్ఞానముద్ర.] గగన.....ప్రదేశమునకున్ = ఆకాశముతో సమానమైన - శూన్యమైన-నడుమునకు; ఓడ్యాణబంధంబె = ఓడ్యాణమను ఆసనమే; అక్కలువకంటియంగలతిక = కలువకన్నులుగల యౌవనికయొక్క తీగవంటి దేహము; నిరాకల్ప, యయ్యున్ = అలంకారములు లేనిదైనను; శారదా.....కరణిన్ = శరత్కాలపుటాకాశమువలె; అలరెన్ = ప్రకాశించెను; ప్రకృతిమధురంబులకున్ = స్వభావముచే మనోహరమైనవానికి.

తపస్సుచేయునపుడు జుట్టు విరియఁబోసికొనుట, కన్నులు కొంచెము మూయుట, ముద్రాసనముల రచించుట, మౌంజి(మొలనూలు) ధరింపకుండుటయు సహజము. అలం. ఉపమ, విభావన, అర్థాంతరన్యాసము.

శా. లోకేశ[1]స్థితలోకవాసకృతి సాలోక్యంబు నర్చింప, ల
క్ష్మీకాంతాంఘ్రియుగంబుఁ జేరుతమి సామీప్యంబు, స[2]ద్భక్తర
క్షాకారిం దనరూపుగా [3]నిలుపుటన్ సారూప్యమున్, బుద్ధి నా
కౌకశ్శేఖరుఁగూర్చి యున్కి సతి సాయుజ్యంబు నొందుం దుదిన్. 151

టీక. మోక్షము నాలుగు విధములు (1) సాలోక్యము (భగవంతుఁ డుండు లోకమున నివసించుట.) (2) సామీప్యము (పరమాత్మదగ్గరనుండుట) (3) సారూప్యము (భగవంతునితోఁ సమానమగు రూపమును పొందుట) (4) సాయుజ్యము (దేవునితో కలసిమెలసియుండుట) పయి చతుర్విధమోక్షములను ఆగొల్లపడుచు పొందినట్లు ఇందువర్ణితము. లోకేశ.....కృతిన్ = లోకములకు ప్రభువగు విష్ణుఁడు నివసించు భూలోకమున నివసించుటచే; అర్చింపన్ = పూజించుటకయి; లక్ష్మీ...యుగంబున్, చేరు, తమిన్=విష్ణునిపాదపద్మములను పొందు ఆసక్తిచే; సద్భక్తరక్షాకారిన్ = ఉత్తములగు భక్తులను రక్షించువానిని - దేవుని; బుద్ధిన్ = జ్ఞానమున; నాకౌకశ్శేఖరుఁగూర్చి = దేవతాశ్రేష్ఠుఁడగు విష్ణువును గూర్చి; ఉన్కిన్ =ఉండుటచే; సతి = గోపకన్యక.

శా. స్నానానుక్రమవాసితాచలఝరీసాంద్రాంబువుల్ ధ్యానసం
ధానాధీనవపుర్విలోకన నితాంతప్రీతసారంగసం
తానంబుల్ మృదుపాదపల్లవతలోద్యత్కాంతి లాక్షారస
శ్రీనద్ధాచలతుంగశృంగములు మించెం దత్తపస్సంగముల్. 152

టీక. స్నానా.....బువుల్ = స్నానానుష్ఠానమున ప్రసిద్ధిపొందిన సెలయేళ్లనీటిప్రవాహములు కలవి; ధ్యాన.....సంతానంబుల్ - ధ్యానసంధానాధీన=ధ్యానము చేయుటలో ఆసక్తమైన; వపుర్విలోకన = (గోపికయొక్క) దేహమును చూచుటచే; నితాంతప్రీత = మిక్కిలి సంతోషించిన;

---

1. చ. స్థితి. 2. క. ద్భక్తి. చ. ట. ద్భక్త. 3. చ. నునుపుటన్ ట. నునుచుటన్.

సారంగసంతానంబుల్ = జింకగుంపులు ['సారంగ = తుమ్మెదలయొక్క' అని పూర్వటీక.] కలవి; మృదు......శృంగములు - మృదు = మెత్తని; పాదపల్లవధళ = చిగుళ్లవంటి గోపికపాదములనుండి; ఉద్యత్ = బయలువెడలిన; కాంతి = ప్రకాశమను; లాక్షారసశ్రీ = లత్తుకద్రవపుసంపదచే; సద్ధ = కట్టఁబడిన; తుంగశృంగములు = ఎత్తయిన కొండకొనలుకలవి; అగు - తత్తపస్సంగముల్ = ఆగోపిక తపోవ్యాపనములు; మించెన్ = అతిశయించెను. అలం. ఉదాత్తము.

ఉ. ఆ భగవంతుఁ డంతఁ గరుణార్ద్రమతిన్ సతి మ్రోల నిల్చె [1]న
భ్రాభమదభ్రమభ్రమ మనంతము శాంతకము కాంతి[2]మంత మ
క్షోభమలోభమప్రతిమ[3]శోభనశోభియు నైన మేను నా
నాభరణంబులం గుసుమితామరభూజమనోజ్ఞ రాజిలన్. 153

టీక. కరుణార్ద్రమతిన్ = దయారసముతోఁగూడిన మనస్సుతో; అభ్రాభము = మేఘకాంతి వంటి కాంతికలది - శ్యామవర్ణముకలది; అదభ్రము = అల్పముకానిది - గొప్పది; అభ్రమము = భ్రాంతిలేనిది. ['అబ్భ్రమము = నీటిసుడిగలది' అని పూర్వటీక.] అనంతము = అంతములేనిది; కాంతిమంతము = తేజస్సుకలది; అక్షోభము = కలఁతలేనిది; అలోభము = లోభము లేనిది; అప్రతిమశోభనశోభియుంన్ = సాటిలేని చక్కఁదనముచే; ప్రకాశించునదియును; మేను = శరీరము; నానాభరణంబులన్ = పెక్కు అలంకారములచేత; కుసుమితామరభూజమనోజ్ఞన్ = పుష్పించిన పారిజాతవృక్షము వలె; రాజిలన్ = ప్రకాశింపఁగా. అలం. పరికరము, ఉపమ.

ఉ. ఆ శరదిందుబింబసదృశానన సూనశరాసకోటిసం
కాశు రమేశు రాగరసకశ్మలగాత్రయు [4]స్రస్తనేత్రయున్
పేశలబంధకైశికయు భీతి ముదశ్రునిపాతముఖ్యచే
ష్టాశబలత్వసక్తతనుకంపయునై కనుమ్రంపుదాల్చుచున్. 154

టీక. ఆ శరదిందుబింబసదృశానన = శరత్కాలపు చంద్రబింబముతో సమానమగు ముఖము కల ఆ గోపిక; సూనశరాశకోటిసంకాశున్ = కోటిమన్మథులతో సమానమైనవానిని; రమేశున్ = లక్ష్మీవల్లభుని; రాగరసకశ్మలగాత్రయుంన్ = అనురాగరసముచే మలినమైన దేహముకలదియు - ఎక్కువ ప్రేమ కలదియు; స్రస్తనేత్రయుంన్=జాఱిన వస్త్రము కలదియు; పేశలబంధకైశికయుంన్ = మృదులమగు -వదులైన కొప్పుకలదియును; ['పేశల = అందమైన; కైశిక=కీలుగంటుకలది' అని పూర్వటీక.] భీతి...కంపయునై - భీతి = భయము; ముదశ్రుసంపాత = ఆనందాశ్రువులను రాల్చుట; ముఖ్య= మొదలైన; చేష్టా = చేష్టలయొక్క; శబలత్వ = కలయికచే; ['శబలత్వ = చిత్రవర్ణములతోడ' అని పూర్వటీక. ఇది అసంగతము.] సక్త=కూడిన; తనుకంపయునై = మెఱుపువంటి దేహముకలదియు నయి; కనుమ్రంపు, దాల్చుఁగన్ = చూపుల మాంద్యమును, పొందఁగా - పరవశముకాఁగా; అలం. పరికరము, ఉపమ.

తే. పృథులవిజ్ఞానరసపూర్ణభృగుశుకాది, భావనాదీర్ఘికలయందుఁ బరిణమించు
జలజదళనేత్రుపాదాంబుజములు గేల, భీతమృగశాతలోచన బిగియఁబట్టె. 155

టీక. పృథుల......దీర్ఘికలయందున్ = గొప్ప విజ్ఞానమను నీటితో నిండిన భృగువు, శుకుఁడు మొదలగువారి మనస్సులనెడి నడబావులందు; పరిణమించు=పరిపక్వము పొందునట్టి - వికసించునట్టి; ['పరిణమించు = సంతోషించు - వికసించు' అని పూర్వటీక.] జలజ......జములు = విష్ణుని పాదపద్మములను; భీత......లోచన = భయపడిన జింకపిల్లయొక్క చూపులవంటి చూపులు కల గోపవనిత; కేలన్ = చేతితో; బిగియఁబట్టెన్ = గట్టిగా పట్టుకొనెను. అలం. రూపకము.

---

1. చ. సభ్రా. 2. క. షంత. చ. మంత. 3. చ. శోభమ. 4. చ. త్రస్త.

క. కరకీలితనిజపదాబ్జున్, విరళితరత్నప్రభయున్నైన విధుబింబముఖన్
వర[1]సంభావితఁజేసెన్, గరుణాగుణహారి శౌరి కన్నుల పండువుగాఁ. 156

టీక. కర...పదాబ్జునుక్ = చేతితో కట్టుకొనఁబడిన తన (విష్ణువు) పాదపద్మములుకలది యగు; విరళితరత్నప్రభయుక్ = మిక్కిలి మాఱైన - పోయిన సిగ్గు గలదియు; విధుబింబముఖన్ = చంద్రబింబమువంటి ముఖము కల దానిని; కరుణాగుణహారి = దయాగుణముచే మనోహరుఁడైనవాఁడు; శౌరి = విష్ణువు; వరసంభావితన్ = వరముచే గౌరవింపఁబడినదానిని - వరములు పొందినదానిని చేసెన్.

సీ. తనుఁజూచి శిథిలబంధశిరోజ యగుట నయ్యబలకు ముక్తకేశాహ్వయంబు
దయచేసి తత్ప్రార్థితములైన వరముల నొసఁగి యప్పసిగాఁపుటుసరబుద్ధి
చిఱుగుబ్బలాని తక్షేత్రరాజమునకు నీశానదిక్కున నిరవుపఱిచె
వెన్నుఁడు తనునది ప్రేపల్లెలో రాక తక్కించుదౌష్ట్యంబుఁ దలఁచి నగుచు

తే. దానికరములచేఁ బీడితంబులైన, పాండురంగేశుశ్రీపాదపల్లవముల
సంగుళీమధ్యతనురేఖ లంటియుండు, గంగ ప్రవహించు నీటిడొంకలునుబోలె.

టీక. శిథిలబంధశిరోజ = పీడిన ముడిగల జుట్టుతో కూడినది; ముక్తకేశాహ్వయంబు = ముక్తకేశయను పేరు; దయచేసి = ఇచ్చి; తత్ప్రార్థితములు=ఆమెచే అడుగఁబడినవి; ఒసఁగి = ఇచ్చి; అప్పసి ......గుబ్బలు = ఆ తక్కువబుద్ధికలదగు గొల్లపడుచుయొక్క (మూర్ఖురాలైన యామెయొక్క;) ['పసిగాఁపుటుసరబుద్ధి=ధూర్తురాలైన గొల్లపడుచుయొక్క' అని పూర్వటీక.] చిఱుగుబ్బలు = చిన్నిచన్నులను; ఆని = పట్టుకొని; వెన్నుండు = విష్ణువు; తనుక్ = విష్ణువును; అది = ఆ గొల్లపడుచు; ప్రేపల్లెలో రాక = గొల్లపల్లెకు వచ్చుటను - గొల్లపల్లెలో నుండుటను; తక్కించు దౌష్ట్యంబుక్ = ఊహించు మొరటుతనమును - కోరిన పట్టుదలను; తలఁచి = ఊహించి; నగుచుక్=నవ్వుచు; ఈశానదిక్కునక్= ఈశాన్యపుదిశను; ఇరవుపఱిచెక్ = ఉండునట్లు చేసెను; పాండురంగేశు...పల్లవములక్ = శ్రీకృష్ణుని పాదపద్మములపైని; గంగక్=గంగానదిపైని; నీటిడొంకలునుబోలెక్ = నీటియలలవలె. అంగుళీ...... రేఖలు = వ్రేళ్ల మధ్యభాగములందలి గుఱుతులు; అంటియుండుక్. అలం. ఉపమ.

క. ఆ ముక్తకేశదర్శన, మో మునికులసార్వభౌమ! యొసఁగు ననేక
శ్రీమూర్తిదానఫల మా, భామిని శ్రీమూర్తిగాఁగ [2]బాటింపఁదగుక్. 158

టీక. ఆ ముక్తకేశదర్శనము = ఆ ముక్తకేశను చూచుట; అనేక......ఫలము = పెక్కు లక్ష్మీనారాయణవిగ్రహముల దానఫలమును; ఆ భామిని = ఆ యువతి; శ్రీమూర్తిగాఁగక్ = లక్ష్మీదేవి యని.

తే. అనుడు వేలుపుఁదాపసి 'యా సుశీల
పుత్త్రు లేచందమున మోక్షమునకుఁ జనిరి
ప్రియుతనందనుఁ డెవ్వఁ? డేపగిది నతఁడు
నృహరికృపఁ గాంచె?' ననఁబల్కు నీలగళుఁడు. 159

టీక. వేలుపుఁదాపసి = నారదముని; నీలగళుఁడు = నీలకంఠుఁడు - శివుఁడు.

క. మునివర! విను మత్యద్భుత, జనకచరిత యైన జనని చనినపిదపఁ ద
[3]త్తనయులు మురభిత్పదవీ, త్తనయులు గురువాక్యకరణతత్పరబుద్ధిన్. 160

1. చ. సుభాషిత. క. సంభావిత. 2. చ. బాలింప. 3. క. వ త్త. చ. ద త్త.

టీక. అత్యద్భుతజనకచరిత = మిక్కిలి యాశ్చర్యమును పుట్టించు స్వభావము (ప్రవర్తన) కలది - సుశీల; ముర......నయులు = విష్ణుని పాదములయందు ఉంచఁబడిన శ్రద్ధ కలవారు - విష్ణు పాదధ్యాతలు; [ఇచట వెనుకటి టీకాకారులు 'మురభిత్పదవత్తనయులు' అను పాఠమును గ్రహించి 'కృష్ణునిపాదములవలన రక్షింపఁబడుచున్న కొడుకులు గలవారు' అని అర్థము వ్రాసిరి. ఆ పాఠ, టీకలు అననుకూలములు.] గురు......బుద్ధిన్ తల్లిమాట నెఱవేర్చుబుద్ధితో.

శా. భైమీతీర్థనివాసు రాసకుశలున్ బద్ధేక్షణున్ యాదవ
స్వామిన్ సామజవత్సలుం గొలిచి యైశ్వర్యంబునం బొల్చి వా
రామీఁదన్ సకళత్రపుత్రములు దీప్యన్మూర్తులై తత్తనూ
గ్రామం(?) బెక్కిరి నావుడున్ మఱియు నాబ్రహ్మర్షి పల్కెన్ శివున్. 161

టీక. రాసకుశలున్ = రాసక్రీడయందు నేర్పుకలవానిని; సామజవత్సలున్ = గజేంద్రుని యెడ దయకలవానిని; పొల్చి = ఒప్పి - గొప్పవారై; ఆమీఁదన్ = ఆ తరువాత; సకళత్రమిత్రము గన్ = భార్యాపుత్రులతోఁగూడ; దీప్యన్మూర్తులై = ప్రకాశించు దేహములు కలవారయి; తత్తనూ గ్రామంబు, ఎక్కిరి (?)

ఉ. హాళి మనంబునం బెరుగ నాలయి బిడ్డయి బంటుఁబైదరయై
మూలధనార్జనంబు నిలుముంగిలియై గళదఘ్నదర్పతన్
వాలినవారి కెట్టు లపవర్గము భర్గ! ముకుందుఁ డిచ్చె? నిం
కేల కలాస? మేల జడ? లేల కమండలు? వేల దండమున్? 162

టీక. హాళి = ఆసక్తి; పెరుగన్ = ఎక్కువకాఁగా; ఆలయి = భార్యను కూర్చుకొని; బిడ్డయి = బిడ్డలుపుట్టి; బంటుఁబైద = బంటుగా నుండు పిల్లవాఁడు; మూలధనార్జనంబు = కూడఁబెట్టుటకు (వారిని పోషించుటకయి) ధనమును సంపాదించుట; ఇలుముంగిలియై = ఇల్లు, వాకిలి సంపాదించి; గళదఘ్నదర్పతన్ = గొంతుకబంటియైన గర్వముచే; వాలినవారికిన్ = అతిశయించినవారికి; అపవర్గము= మోక్షము; భర్గ ! = శివుఁడా ! ఏలకళాసము = కృష్ణాజినమేల?

క్రమక్రమముగా కుటుంబమును వృద్ధిపఱచుకొని, తత్పోషణార్థము తాపత్రయపడి యహంకార పూరితులగు సంసారులకు విష్ణువు అతిసులభముగా మోక్ష మిచ్చినయెడల మావంటివారికి ఈ ముని వృత్తితో శ్రమపడ నావశ్యకమేమి? అని భావము.

క. వార లటుగాక కారణ, పూరుషులై యట్టి సతికిఁ బుట్టుటనో తుదిన్
జేరిరి గృహస్థు లయ్యును, సారసదళనయను మేని సాయుజ్యంబున్. 163

టీక. వారలు = సుశీలపుత్రులు; అటుగాక = మీఁది సామాన్యరీతినిగాక; కారణపూరుషులై = కారణజన్ములై; పుట్టుటనో = పుట్టుటచేతఁగాబోలును; సారస......సాయుజ్యంబున్ = విష్ణుదేహముతోఁ గలిసిమెలిసియుండుటను; చేరిరి = పొందిరి.

వ. అనిన [1]నగి జగదీశ్వరుండు [2]సురమునీశ్వరునితో వెండియు నిట్లనియె. 164

ఉ. హారివిచార! నీ వనినయట్లు పురాకృతపుణ్యసంపదన్
వారల కావహిల్లె మునివల్లభదుర్లభమయ్యు నయ్యమ
ర్త్యారివిదారిమేనఁ గలయంగల పూనిక; వారయేల? యె
వ్వారు గృహస్థధర్మపరివర్తులు వారలసొమ్ము ముక్తియున్. 165

---

1. క. ఖా. చ. ట. నగి. 2. చ. సురమునితో.

టీక. పారివిచార ! చక్రపాణి యాలోచన కలవాఁడా ! మునివల్లభదుర్లభము, అయ్యుఁగాక = గొప్పమునులకు అసాధ్యమయినదైనను; అయ్యమర్త్యారిదారిమేరకన్ = దేవశత్రువులగు రాక్షసులను సంహరించు విష్ణుని శరీరమునఁ గలయుంగల పూనిక = చేరుటకుఁ గావలసిన పట్టుదల; వారలకుఁగాక = సుశీలపుత్రులకు; అవహిల్లెఁగాక = కలిగెను; వార యేల? = వారే కాదు; ఎవ్వారు = ఎవరు; గృహస్థధర్మపరిపక్తులు = గృహస్థధర్మములకు లొంగియుందురో; ముక్తియుఁగాక = మోక్షముకూడ; వారల సొమ్ము; (అగునని.)

సీ. పరిణీత[1] యగు నింతి ప్రతికూల గాదేని తనయుండు తనయాజ్ఞ దాఁటఁడేని
నిజసహోదరులు వినీతు[2]లై మనిరేని కోడ లోరుపుపక్కి గొనఁగదేని
కూఁతు రీలువునందుఁ గొదవ వహింపదయేని ఋణ మనుపాతకం బెనయదేని
తేజోగరిమ పరాధీనతఁ జెడదేని నిందాంధకారంబు నెఱయదేని

తే. న్యాయమున మొల్లములపెల్లు డాయునేని
యతిథిసంతర్పణం బింట నమరునేని
సముచితాచారమును నింట [3]సాగునేని
కలదె గృహమేధి[4]ధర్మంబుకంటె మేలు? 166

టీక. పరిణీత = పెండ్లియాడినది; ['పరిణత=పెండ్లాడినది' అని పూర్వటీక.] ప్రతికూల=ఎదురు తిరుగునది; వినీతులై = అడఁకువ గలవారై; మనిరేని = ఉందురేని; ఓరుపుపక్కి = శాంతము విడిచి; ఈలువునందున్ = సత్ప్రవర్తనమున; కొదవ = కొఱఁత - లోపము; పాతకంబు = పాపము; ఎనయదేని = పొందదేని; పరాధీనతన్ = ఇతరులకు లొంగియుండుటచే; నిందాంధకారంబు = నింద యను చీఁకటి; నెఱయదేని = వ్యాపింపకుండునేని; మొల్లములపెల్లు = ఎక్కువ ధనము; గృహమేధి ధర్మంబు కంటెన్ = గృహస్థధర్మముకంటె; మేలు = మేలైనది - గొప్పది; కలదె? = లేదు.

అయుత నియుతు లను మునికుమారులచరిత్రము

క. ఏనోహార మొక్కయుపాఖ్యానము గల దేతదర్థ; మదియును వినినన్
మౌనివర! నీ మనంబున, నూనిన జడ నుడుగు ననుచు నుగ్రుఁడు పలుకున్. 167

టీక. ఏనోహారము = పాపములు పోఁగొట్టునది; ఉపాఖ్యానము = చిన్నకథ; ఏతదర్థము = దీనికొఱకై - గృహస్థధర్మము గొప్పదని నిరూపించుటకు; ఊనిన = నిలిచిన; జడను = సంశయము; ఉడుగున్ = నశించును; ఉగ్రుఁడు = శివుఁడు.

తే. వింధ్య మమరాద్రిపోటికి వివిధతార
కములు మొలపూసలుగఁ బెరుగ మదిఁ దలఁచె
నెన్నఁ డంటమున్న కాశిలో నన్ను గొలిచి
ఘటజ మగు తేజ మింపొందు నుటజమునను. 168

టీక. అమరాద్రిపోటికిన్ = మేరుపర్వతముతోడి స్పర్థకు - పందెమునకు; వివిధతారకములు = నక్షత్రము లన్నియును; మొలపూసలుగన్ = మొలత్రాటిలోని పూసలుగ నుండునట్లు; పెరుగన్; [వింధ్యము నక్షత్రమండలము తన కటిభాగమునకు వచ్చునట్లుగా పెరుఁగఁదలఁచెనుట.] అంటమున్న = అంతకుఁబూర్వమే; ఉటజమునను = పర్ణశాలలో, ఘటజము, అగు, తేజము = కుండనుండి పుట్టిన తేజస్సు - అగస్త్యమహాముని.

1. క. పరిణత. చ. పరిణీత. 2. క. లయి. 3. చ. సాగె. 4. చ. కర్మంబు.

వ. అస్తంభతపో[1]ఽనుభావవిజృంభితుండగు నక్కుంభసంభవునకు నజస్రశుశ్రూషా వికస్వరహృదయంబగు శిష్యసహస్రంబు గల; దందుఁ బ్రశస్తుండను మునితనయు లయుతనియుతు లనువార లప్పారికాంక్షికిం బ్రేమా[2]స్పదంబులయియుండి; రంత నొక్కకాలంబున న మ్మునిలోకపాకశాసనుండు నిజాంతర్గతంబున నిట్లని వితర్కించు,

టీక. అస్తంభ......విజృంభితుండు - అడ్డులేని తపశ్శక్తిచే గొప్పవాఁడైనవాఁడు; కుంభసంభవునకున్ = అగస్త్యమహామునికి; అజస్ర...హృదయంబు = ఎల్లప్పుడును (తద్బోధనమును) వినుకోరికచే వికసించిన (జ్ఞానముపొందిన) హృదయములు కలది; పారికాంక్షికిన్ = మునికి; ప్రేమాస్పదులు = మిక్కిలి యిష్టులు; ఒక్కకాలంబునన్ = ఒకప్పుడు; అమ్ముని......శాసనుండు = ఆ మునీంద్రుఁడు. అగస్త్యుఁడు; నిజాంతర్గతంబునన్ = తనమనస్సులో; వితర్కించున్ = ఆలోచించును.

శా. ఈనాశిష్యులలోన వీరిరువురున్ హృద్యానవద్యోదయ
జ్ఞానానూనవిచారవాగ్విభవతేజఃక్షాంతిశాంతిప్రథా
సానాథ్యంబునఁ గానిపించెదరు; మత్సక్తాశయుల్; వీరి స
న్మానింపందగుఁ బాణిపీడనవిధానశ్రీల వాలాయమున్. 170

టీక. హృద్యా......సానాథ్యంబునన్ - హృద్య=మనోహరమై; అనవద్య = లోపము లేనిదై; ఉదయ = పుట్టిన - కలిగిన; జ్ఞాన = జ్ఞానముచే; అనూనవిచార = గొప్ప ఆలోచన గల; వాగ్విభవ = మాటలపొందికయొక్కయు; తేజఃక్షాంతి శాంతిప్రథా = తేజస్సుయొక్కయు, ఓరిమియొక్కయు, శాంతముయొక్కయు, ప్రసిద్ధియొక్కయు; సానాథ్యంబునన్ = కూడికతో; మత్సక్తాశయుల్ = నాయందే లగ్నమైన మనస్సుకలవారు; వాలాయమున్ =అవశ్యముగా; వీరిన్; పాణిపీడనవిధానశ్రీలన్ = వివాహముచేయుటవలని సంపదలచేత; సన్మానింపందగున్ = గౌరవింపఁదగును.

శా. వాసోనిగ్రహ మెన్నరాఁ కలితము నీర్వట్టునన్ [3]గణింపర్; తలల్
మాసెంగా యన; రంగముల్ బడలినన్ బాటింప; రట్లుండనీ
యాసాయంబుగ నానిశాత్యయముగా నామ్నాయముల్ [4]క్రోల్చుచో
నాసీనప్రచలాయితం బయిన లే దాహా! వితర్కింపఁగన్. 171

టీక. వాసోనిగ్రహము = వస్త్రముల లేమిని; ఎన్నరు = లెక్కింపరు; నీర్వట్టున్ = దప్పిని; పాటింపరు = లెక్కింపరు; ఆసాయంబుగన్ = సాయంకాలమువఱకును; ఆనిశాత్యయముగాన్ = ఉదయమగువరకును - అనఁగా - అహోరాత్రము లెడతెఱపి లేక; ఆమ్నాయముల్ = వేదములను; క్రోల్చుచోన్ = వల్లించునపుడు; అభ్యసించునపుడు; ఆసీనప్రచలాయితంబు = కదలక కూర్చుండుటచే నయిన కునుకుపాటు.

క. వీరలకుఁ దగిన మగువల, ధారుణిఁ బొరయంగ [5]లేరు; ధాతృతనయ లు
న్నారఁట; సకరగ్రహణలు, కారఁట; కొనివత్తు వారిఁ గమలజుచేతన్. 172

టీక. ధారుణిన్ = భూమిపైని; పొరయంగన్ = పొందఁగా; ధాతృతనయలు = బ్రహ్మపుత్రికలు; సకరగ్రహణలు = వరుని హస్తమును గ్రహించినవారు - పెండ్లియైనవారు; కమలజుచేతన్ = బ్రహ్మవలన; కొని = గ్రహించి.

వ. అని నిశ్చయించి యాసత్యవ్రతుండు సత్యలోకంబున కరిగి. 173

1. క. ధనభావ. చ. ట. నుభావ. 2. క. స్పదు. చ. ట. స్పదంబు. 3. క. ర గణింపన్. 4. క. గ్రోల్చుచో. ట. గ్రోల్చుచున్. 5. చ. లేర.

టీక. సత్యవ్రతుఁడు = సత్యమైన నియమము కలవాఁడు - అగస్త్యుఁడు.

సీ. శశిరేఖఁ గైకొన్న సౌవర్ణగిరివోలె మిసుకుఁజేడియఁగూడి మెఱయువాని
నసురేజ్యుఁ బాటించు హాటకాద్రియుఁబోలె నంచ చెంగటనుండ నలరువాని
శారదాభ్రము లంటు భూరిశైలముఁబోలెఁ దెలుపుఁగైసేఁతల వెలయువాని
కకుబిభంబుల[1]మీఁది కాంచనాగముఁబోలె వెలిదమ్మిగద్దియ వెలయువానిఁ

తే. బొడవులన్నియుఁ దనయందె పొడమువాని
[2]మొదలు నడుమును గడయు నేర్పడనివాని
సచ్చిదానందకందమై హెచ్చువాని
నలువఁ జుళుకితపాథోధి తెలిచె నుతుల, 174

174. శశిరేఖన్ = చంద్రరేఖను; గైకొన్న = గ్రహించిన - కలిగియున్న; సౌవర్ణగిరి వోలెన్ = మేరుపర్వతమువలె; మిసుకుఁజేడియన్ = వాగ్దేవితో - సరస్వతితో; మెఱయువానిన్ = ప్రకాశించువానిని; అసురేజ్యున్ = రాక్షసగురుని - శుక్రాచార్యుని; పాటించు = పొందియుండు హాటకాద్రియుం బోలెన్ = మేరుపర్వతమువలె: అంచ = హంస - వాహనము; చెంగటన్=సమీపమున; అలరువానిన్ = ఆనందించువానిని; శారదాభ్రములు = శరత్కాలములోని (తెల్లని) మేఘములు; అంటు = తాఁకుచున్న; భూరిశైలముఁబోలెన్=బంగారుకొండ (మేరుపర్వతము)వలె; తెలుపుఁ గైసేఁతలన్ = తెల్లని యాభరణములతో; వెలయువానిన్ = ఒప్పుచున్నవానిని; కకుబిభంబులమీఁది= దిగ్గజములపైనున్న; కాంచనాగముఁబోలెన్ = బంగారుకొండ - (మేరువు)వలె; వెలిదమ్మిగద్దియన్ = తెల్లతామరగద్దెపయి; పొడవులన్నియున్ = రూపములన్నియు - ప్రాణుల దేహములన్నియు; పొడము వానిన్ = పుట్టువానిని; మొదలు......గడయున్ = ఆది, మధ్యాంతములు; సచ్చిదానందకందమై= సచ్చిదానందములకు మూలమై; నలువన్ = చతుర్ముఖుని - బ్రహ్మను; చుళుకితపాథోధి = ఆచమించిన సముద్రముకలవాఁడు - అగస్త్యుఁడు; నుతులన్ = స్తోత్రములచే; తెలచెన్ = తృప్తిపఱచెను. అలం. ఉపమ, ఉదాత్తము.

క. తెలచిన మొలచిన కృపకుం, గలఁచిన మదితోడ నతనిఁ గమలజుఁ డగ్ర
స్థలిని నిలిపి పలుకులకస, ధళధళలు ముఖప్రఘాణతలములఁ బొలయన్. 175

టీక. తెలచినన్ = సంతోషపెట్టఁగా; మొలచిన కృపకున్ = కలిగిన దయకు; కలఁచిన మదితోడన్ = చలించిన మనస్సుతో; కమలజుఁడు = బ్రహ్మ; అగ్రస్థలిన్ = సమీపమున; నిలిపి = ఉంచి;[ ఎదుటి ప్రదేశమునందు'అని పూర్వటీక.] పలుకుల......ధళలు = పొందికగలమాటలయొక్క కాంతులు - తేటలు; ముఖప్రఘాణములన్ = ముఖముతలవాకిటి ముందరిగదులయందు.

సీ. హుంకారములు లేవె యుపపురందరహరోత్పాటనంబునకుఁ బాల్పడవుగాక
భ్రూభంగములు లేవె యాభీల వింధ్యగర్వ స్తంభనమునకు రావుగాక
చులుకాకృతులు లేవె జలరాశి వి[3]శోషణక్రీడకుఁ జొరవుగాక
జాఠరాగ్నులు లేవె జటితాపివాతాపితనుదాహమున[4]నెదుర్కొనవుగాక

తే. నిష్ఠ నీమాడ్కి లోకప్రతిష్ఠగుఱిచి, దుష్టనిగ్రహశిష్టసంతుష్టిహేతు
రోషభీషణరేఖానిరూఢగాఢ,లీలఁ గ్రీడించు ప్రోడలు లేరుగాక. 176

1. మీఁద. చ. మీఁది. 2. క. గడయునడుమును మొదలు. 3. క. శోషణ. చ. ట. చూషణ.
4. చ. కెదుర్కొనవు.

టీక. ఉప......త్పాటనంబునకున్ = మాఱట దేవేంద్రుఁడగు నహుషుని మాహాత్మ్యాకారముగ పదభ్రష్టునిఁ జేయుటకు; పాల్పడవుగాక! = సిద్ధపడవుగాని. [పూర్వము నహుషుఁడు శతక్రతువు లొనరించి, యింద్రపదవి నొంది మునుల నవమానించి యగస్త్యునిచే సర్పమగునట్లు శపింపఁబడెనని భారత గాథ.] భ్రూభంగములు = బొమముడిపాట్లు; అఖిల......స్తంభనమునకున్ = భయంకరమగు (ఎక్కువైన) వింధ్యపర్వతగర్వము నడఁగించుటకు; రావు = అనుకూలింపఁవు. [మేరువుతో పోటిచేయుచు, వింధ్యపర్వతము ఎక్కువగా పెరిగి, సూర్యచంద్రులగమనములను నిరోధింపఁగా అగస్త్యముని దాని విజృంభణము నణఁచెనని గాథ.] చులుకాకృతులు = పుడిసిళులు; జల......క్రీడకున్ = సముద్రమును పూర్తిగా త్రాగివేయునట్టి విలాసమునకు (పనికి); చొరవు = సిద్ధపడవు. [పూర్వము అగస్త్యుఁడు సముద్రమున దాఁగిన కాలకేయాసులగు రాక్షసులను బయటఁబెట్టుటకు దేవతలకోరికపయి సముద్రము నాచమించెను.] జాఠరాగ్నులు=జఠరమునందున్న అగ్నులు; జటి...దాహమునకున్=మునులను బాధించు వాతాపిరాక్షసునిశరీరమును కాల్చుటకు - జీర్ణించుకొనుటకు; ఎనరొ్కనవు = సిద్ధపడవు; నిష్ఠన్ = నియమముతో - పట్టుదలతో; లోకప్రతిష్ఠఁగుఱిచి = లోకముల మేలికొఱకు; దుష్ట......లీలన్ - దుష్టనిగ్రహ=దురాత్ములను శిక్షించుటకును; శిష్టసంతుష్టి = ఉత్తముల సంతోషణము (రక్షణము) నకును; హేతు = కారణమైన; రోషభీషణ = కోపముచే భయంకరమైన; రేఖానిరూఢగాఢలీలన్ = తేజస్సుతో స్థిరమైన గొప్పవిలాసముతో; క్రీడించు = ఆఁటలాడు; ప్రోడలు = నేర్పరులు. అలం. ఉదాత్తము.

తే. భువనసంభవదుపసర్గనివహశాంతి, త్వన్ముఖంబునఁ జనఁ బెద్దతనముతోడ
నిందుధరుఁ డన హరి యన నే ననంగఁ, బ్రోపుగంటిమి మిత్రావరుణకుమార!

టీక. భువన......శాంతి = లోకమునఁ బుట్టు ఉపద్రవములయొక్క అడఁగుట - నాశనము; త్వన్ముఖంబునన్, చనన్ = నీమూలమున జరుగఁగా; పెద్దతనముతోడన్ = ప్రతిష్ఠతో; ఇందుధరుఁడు = చంద్రశేఖరుఁడు - శివుఁడు; ప్రోపుగంటిమి = రక్షింపఁబడితిమి.

సీ. అని యాదరించి యమ్ముని వచ్చుటకుఁ బ్రయోజనముఁ దద్విశదోక్తిసరణిఁ దెలిసి
యీవర్థి [1]వగుటకు నిది యెంత? యని శతానందుండు మున్నొక్కనాఁడు నిఖిల
యువతిసృష్టికి నెక్కుడవుఁగాక యని తనయాత్మ నిర్మించి గాయత్రి యనియు,
సావిత్రి యనియుఁ బ్రశస్తనామము లిడ్డ కూఁతుల నొసఁగఁ గైకొని యతండు
తే. వారి నఁటఁ దెచ్చి తనకూర్చువారిఁగూర్చి
యయుతనియుతుల కెఱిఁగింప నందు నయుతుఁ
డొల్లఁడయ్యె నిజోద్యోగ; మొల్లకున్న
నియుతునకుఁ బెండ్లిసేసెఁ గన్నియలదోయి. 178

టీక. ప్రయోజనమున్ = కారణములు; తద్విశదోక్తిసరణిన్ = స్పష్టమైన యతని మాటల కోరణిబట్టి; ఈవు = నీవు; అర్థివి = యాచకుఁడవు-కోరినవాఁడవు; శతానందుండు = బ్రహ్మ; నిఖిలయువతిసృష్టికిన్ = సమస్తయువతీసృష్టికంటెను; ఎక్కుడు = అధికము - అందమైనది; తనయాత్మన్ = తనమనమున; కూర్చు వారిఁగూర్చి = ఇష్టలగు; కన్యలలుగురించి = నిజోద్యోగము = తన(అగస్త్యుని) ప్రయత్నమును; ఒల్లఁడయ్యెన్ = ఒప్పుకొనఁడయ్యెను - వివాహమున కంగీకరింపలేదు; కన్నియలదోయిన్ = ఇద్దఱు కన్యకలను.

క. తనయాజ్ఞఁగూడ శతధృతి,తనయామణిఁ గైకొనని హాతనయాశయునిన్
మును చట్టు వెడలనడిచెను, ముని కనలి కఠోరవర్ణముఁగఁ బలు కొలయన్. 179

1. చ. గుదటయి. ట. వగునట.

టీక. తనయాజ్ఞకున్ = యాంత్రిచేష్టకు; శతధృతిసయామణికిన్ =బ్రహ్మప్రతికను; కూడకన్ = కూడుటకు - వివాహమగుటకు; కైకొనని = గ్రహింపని; హతనయాశయునికిన్ = నీతిమార్గము తప్పిన వానిని; [బ్రహ్మచర్యానంతరము గార్హస్థ్యము ధర్మము; ఆ ధర్మమును అయుతుండు మీఱెననుట.] చట్టున్ = శిష్యుని; ముదు = ముందుగా; ముని = అగస్త్యుఁడు; కనలి = కోపించి; పలుకు = మాట; కర్ణోరవక్త్రముగన్, ఒలయకే =కర్ణసాక్షరములు కలవగునట్లుగా; వెడలనడిచెను = తఱిమివేసెను.

సీ. కుటిలాలకములు చీఁకటిప్రోగులగు; నైనఁ జిచ్చంద్రికాఢ్యముల్ [1]చిత్తగతులు
మధురోష్ఠములు రాగమహితంబులగు; నైన భావముల్ వైరాగ్య[2]బంధురములు
గురుకుచంబులు గర్వభరితంబు లగు; నైన హతదుర్వికారంబు లాశయంబు
లలవోకనడలు మాంద్యయుతంబు లగు; నైన నంతరంగములు బోధాస్పదములు
తే. పొగరుఁజూపులు [3]చపలంబు లగునయ్యైన, నిండు[4]మనములు మిక్కిలి [5]నిశ్చలంబు
లవుర! వీరల కన, నొప్పు నతివలందు, నిలిపె సమబుద్ధి ప్రియముగా నియుతమౌని.

టీక. కుటిలాలకములు = వంకరలైన ముంగురులు; చీఁకటిప్రోగులు = చీఁకటిప్రోగులవలె నల్లనివి, అజ్ఞానమునకు దారిచూపునవి; ఐనన్ = అట్లయినను; చిత్తగతులు = (ఉనిదల) మనోగతులు; చిచ్చంద్రికాఢ్యముల్ = చిదానందసంపద కలవి; మధురోష్ఠములు = మధురములైన పెదవులు; రాగమహితంబులు = ఎఱుపుతోఁగూడినవి, రజోగుణపూరితములు; వైరాగ్యబంధురములు = వైరాగ్యగుణముచే ఒప్పిదముగలవి; గర్వభరితంబులు = పొంకముగలవి, గర్వముగలవి; ఆశయములు = అభిప్రాయములు; హతదుర్వికారంబులు = చెడ్డతనములు కలవి; అలవోకనడలు = విలాసగమనములు; మాంద్యయుతంబులు = మెల్లనివి, మాంద్యగుణములతోఁగూడినవి; అంతరంగములు = మనస్సులు; బోధాస్పదములు = జ్ఞానమునకు నిలయములయినవి; నియుతమౌని = నియుతుఁడను అగస్త్యశిష్యుఁడు; అతివలందున్ = స్త్రీలయందు - భార్యలయెడ, సమబుద్ధి = న్యాయమైన ఆశయమును, నిలిపెన్. [అతనిభార్యలు ఉత్తమలగుటచే రూపములు రాగాదిజనకము లయ్యును, మనస్సులు నిర్మలములయి యుండుట నాతనికి వారియెడ ప్రీతి కలిగెననుట.] అలం. విరోధాభాసము.

క. ఈతఁ డిటులుండ మునుపటి, యాతఁడు హృల్లగ్నగురుకృతానాదరుఁడై
శీతనగసవిధవసుధకు, నేతెంచి మనోగతమున నిటు లూహించెన్. 181

టీక. మునుపటియాతఁడు = మొదటివాఁడు - అయుతుఁడు; హృల్ల......నాదరుఁడై = మనస్సునందు తగుల్కొనియున్న గురుతిరస్కారము కలవాఁడై; శీత......వసుధకున్ = హిమాలయ ప్రాంతభూమికి.

చ. చిలుకలు [6]కమ్మతెమ్మెరలు శీతమయూఖుఁడు దేఁటు లాదిగాఁ
గల ననవిల్తుసాధననికాయము వేలముపట్టు లంగనా
కుల; మటుగాన దాని విడఁగొట్టక [7]తృళ్లెకదొట్ట వీతరా
గులమని విఱ్ఱవీఁగెదరు కొందఱు బోడలు నాన[8]గండలై. 182

టీక. కమ్మతెమ్మెరలు = మలయానిలములు; శీతమయూఖుఁడు = చంద్రుఁడు; ననవిల్తు...... నికాయము = మన్మథుని సాధనములగు పరివారములు; అంగనాకులము = స్త్రీలసమూహము; వేలము

1. చ. చిత్తరతులు. ట. చిత్రగతులు. 2. క. బంధు. చ. ట. బంధు. 3. చ. చలపం. 4. చ. మయము. 5. చ. నిశ్చయంబు ట. నిష్ఫలంబు. 6. చ. గమ్మ. ట. గుమ్మ. 7. చ. ట. తుట్టెకవెక్కివీగె. 8. చ. గేడ. ట. గెండ.

పట్టులు = శిబిరస్థానములు; [మన్మథుని కని భావము.] దానిఁ = మీఁదివస్తుసముదాయమును; విడఁగొట్టక = త్రోసివేయక; బోడలు = సన్న్యాసులు; నానగండలై = సిగ్గుమాలినవారై; తృట్టు=దప్పి - ఆశ; ఎగదొట్టఁ = రేఁగఁగా; వీతరాగులము, అని = పోయిన రాగాదులు కలవారము, అని; విఱ్ఱవీఁగెదరు = మిగుల గర్వింతురు.

క. జడలంట చుట్టం! గట్టం, గడవసమంట! మేనఁ గప్పఁ గాషాయములేఁ!
యడవుల నవయు తపస్వికిఁ, గడు సౌఖ్యమె కోరు సతికిఁ గలయిక తగునే? 183

టీక. చుట్టఁ = చుట్టుకొనుటకు; జడలంట- కట్టఁ = కట్టుకొనుటకు; కడవసము = కృష్ణాజినము; కషాయము = కావిగుడ్డ; అడవులఁ = అడవులందు; నవయు తపస్వికిఁ = శుష్కించు మునికిని; కడుఁ = మిక్కిలిగ; సౌఖ్యమె కోరు సతికిఁ = సుఖమునే అభిలషించు వనితకును; కలయిక = సంధానము; తగునే? అలం. విషమము.

సీ. ఊర్వీధరము లెక్కి యుఱుకనే కుచకుంభయుగ మొల్లఁ[1]గాక తానుఱుకు మనిన
వాఁడికైదువులపై వ్రాలనే [2]నిడుఁజూపువా లొల్లఁగాక తా వ్రాలు మనిన
[3]మున్నీటిసుడి వడి మునుఁగనే నతనాభిఁ గనొల్లఁగాక తా మునుఁగు మనిన
బెడఁగారు కాలాహిఁ దొడుకనే నూఁగారుతొడుసొల్లఁగాక తాఁ దొడుకు మనినఁ

తే. జెప్పి గురుఁ డేమి పనిచినఁ జేయలేనె? కావె తనసొమ్ము మామకకాయకర్మ
గతులు; మొఱ్ఱో యనంగ లింగంబు గట్టు,జంగమన నంగనలఁగూర్పఁ జనదుగాక!

టీక. ఊర్వీధరములు = కొండలు; ఉఱుకనే = క్రిందికి దుముకలేనా? ఒల్లఁగాక ! = అంగీకరింపనుగాని; తాను = గురువు - అగస్త్యుఁడు; [ఇచట కుచములకును కొండలకును సామ్యము.] వాఁడికైదువులపైఁ = తీక్ష్ణమైన ఆయుధములమీఁద; నిడుఁజూపువాలు = సోఁగయైన స్త్రీల వాలుచూపును; మున్నీటి = సముద్రముయొక్క; సుడిన్ = అలయందు; వేగముగా; నతనాభిఁ = లోఁతైన బొడ్డును; కనఁ = చూచుటకు; బెడఁగాఱు = ప్రకాశించు - అందమైన; కాలాహిఁ = నల్లత్రాఁచును; తొడుకనే? - పట్టుకొననా? నూఁగారుతొడుసు = స్త్రీల రోమావళిసంబంధమును; [ఇచట చూపులకు, కత్తులకు - బొడ్డునకు, అలకు - నూఁగారునకు, నల్లత్రాఁచునకు పోలిక.] పనిచినఁ = ఆజ్ఞాపించినను; మామకకాయకర్మగతులు = నా శరీరమున నగు పనులరీతులు; తనసొమ్ముకావె = తనసొత్తు కావా? మొఱ్ఱో = (అక్కఱలేదనుటను సూచించు అనుకరణము;) అంగనలఁ=స్త్రీలను; కూర్పఁ = పొందించుటకు; చనదు = తగదు; అలం. లోకోక్తి, వ్యంగ్యోపమ.

తే. నెయ్యుఁ డట్టి పనికి నియుక్తుఁడు తగుఁగాక, గృహితకంటె వేఱె కీడుగలదె?
గురుహితంబు నూఁది యురిఁబడ నే నోప,ననుచు బ్రహ్మచర్య మయుతుఁ డొంది.

టీక. నెయ్యుఁడు = మిత్రుఁడు; గృహితకంటెఁ =గృహస్థుఁడగుటకంటె; ఊఁది=పూని; ఉరిఁబడఁ = ఉరిలోఁ పడుటకు - కష్టములపాలగుటకు; నేను, ఓపఁ = నేను సహింపను.

మ. సుముఖాంతఃకరణంబు మత్సరము నౌత్సుక్యంబునుం బాసి ధౌ
తమణీ దర్పణరీతిఁ జెన్నుగఁ దదంతర్లగ్నమై యాదిత
త్త్వము దీపింపఁ దపం బొనర్చు జటిలవ్యాఘ్రుం బనాఘ్రాత పు
ష్పముచందంబగు మేన నూను నియమశ్రీప్రాగ్ర్యఁ [3]ద్రుంగించుచున్. 136

1. ట. నోరఁగా. 2. క. నిడుచూపు. చ. ట. నిడుఁజూపు. క. మున్నీటసుడి. 3. క. దగ్గించు, చ. ద్రుగ్గించు.

టీక. జటిలవ్యాఘ్రంబు = మునిశ్రేష్ఠుఁడు - అయుతుఁడు; ['జటిలవ్యాఘ్రంబున్ = ఋషిశ్రేష్ఠుని' అని పూర్వటీక.] అనాఘ్రాతపుష్పము చందంబు, అగు = వాసనచూడని పూవువలెనైన - అస్ఖలితబ్రహ్మచర్యముకలవైన; మేనన్ = శరీరమున; ఊను = వహించునట్టి; నియమశ్రీప్రౌఢిన్ = నియమము అను మంగళపునిష్ఠచే; తుఱంగించుచున్ = నశింపఁజేయుచు; సుముఖాంతఃకరణంబున్ = అనుకూలమగు (నిర్మలమగు) మనస్సునందు; మత్సరమున్ = అసూయను; ఔత్సుక్యంబునున్ = ఉత్కంఠను - తీవ్రమగు ఇచ్ఛను; పాసి = విడిచి; శాతమణీదర్పణాకృతిన్ = నిర్మలమగు మణులయద్దము రీతిని? చెన్నుగన్ = చక్కఁగ; తదంతర్లగ్నమై = ఆ మనస్సులో తగుల్కొని - ఉండి; ఆదితత్త్వము = పరమాత్మ? దీపింపన్ = ప్రకాశింపఁగా తపంబు, ఒనర్చెన్. అలం. ఉపమ, రూపకము.

క. సర్వాతిరిక్తధృతి యగు, నుర్వీసురసార్వభౌము నుగ్రతపమునం
బర్వె భయజ్వరదాహ మ, ఖర్వోద్ధతి నిఖిలభువనగర్భములందున్. 187

టీక. సర్వాతిరిక్తధృతి = అందఱికంటెను ఎక్కువగు ధైర్యము కలవాఁడు; ఉర్వీ...... తపమునన్ = బ్రాహ్మణోత్తముని (అయుతుని) ఘోరతపస్సువలన; నిఖిల..... లందున్ = సమస్తలోకములయొక్కయు లోపలిభాగములందు; అఖర్వోద్ధతిన్ = అడ్డులేని ఆధిక్యమున - ఆర్భాటముతో; భయజ్వరదాహము = భయము అను జ్వరముయొక్క మంట; పర్వెన్ = వ్యాపించెను.

క. మినుమినుకు మినుకు మనియెన్, బెనుమినుకులబరణి ధరణి బిట్టూటాడెన్
వననిధులు విరిసెఁ గురిసెన్, గనగనగన మనుచు నిప్పుకలు కుప్పలుగన్. 188

టీక. పెను......బరణి = గొప్పకాంతులకు నిధి; మినుమినుకు = సూర్యుఁడు - మినుకు మనియెన్ = మినుకుమినుకులాడెను; ధరణి = భూమి; బిట్టు=వేగముగ; ఊటాడెన్ = గజగజలాడెను; వననిధులు = సముద్రములు; విరిసెన్ = పొంగెను; నిప్పుకలు=అగ్నికణములు; కుప్పలుగన్ = తిప్పలుగ; కురిసెన్. అలం. అనుప్రాసము.

ఉ. అత్తటి నిప్పు ద్రొక్కినటు లౌఁదలఁ [1]దేల్గొనినట్లు లావ యు
వ్వెత్తుగఁ ద్రావినట్లు విబుధేశుఁడు మాణవకోగ్రనిష్ఠకున్
జిత్తమునం దపించి యతిశీఘ్రగతిన్ క్షితి [2]కేఁగుదెంచెఁ ద
ద్వృత్తము మానిపింతు నని వృద్ధమహీసురవేషధారియై. 189

టీక. అత్తటిన్ = అయుతతపస్సమయమున; విబుధేశుఁడు=ఇంద్రుఁడు (కర్త) ఔఁదలన్ = తలపై; తేల్కొనినట్లు = తేలు కుట్టినట్లును; అవ = ఆవరసము; ఉవ్వెత్తుగన్ = నిరవశేషముగ - సమృద్ధిగాఁ; మాణవకోగ్రనిష్ఠకున్ = బ్రహ్మచారియగు అయుతుని భయంకరమైన తపోనిష్ఠకు; తద్వృత్తమున్ = అతనిపనిని - తపస్సు నాచరించుటను; వృద్ధ.....ధారియై = ముసలిబ్రాహ్మణుని వేషమును ధరించినవాఁడై; క్షితికిన్, ఏఁగుదెంచెన్ = భూమికి దిగెను.

సీ. జీర్ణైణకృత్తివేష్టితశాస్త్రశబలికా [3]వారపేటిక లోఁక [4]వటువు పూనఁ
గంబళకటబ్రుసీకాషాయకరకంబు లొక్కయంతేవాసి యుద్వహింప
నాళ్లికాఫలసారయవసక్తుతండుల సూపాదు లొక్కశిష్యుండు మోవ
సమిదాజ్య[5]పూర్ణకీటక[6]కుశస్రుక్స్రువచయ మొక్క[7]ఛాత్రుండు సంగ్రహింపఁ

---

1. చ. తెల్దిని. 2. చ. దెంచి. 3. చ. సార. 4. చ. చట్టు. 5. క. పూర. చ. పూర్ణ. 6. క. కుచ. చ. కుశ. 7. చ. శైక్షుండు.

తే. [1]దలుగుదామెనఁ బెనఁచిన గళముతోడఁ, జంట పెన్నాడు క్రేపుతోఁ జాల నలసి
నడచు ధేనువు నొక[2]చిన్నవడుగురొప్ప,నయతునాశ్రమవాట మయ్యతిథి డాసి.

టీక. జీర్ణ......పేటికలు - జీర్ణకృత్తివేష్టిత = ప్రాఁత జింకచర్మముచే చుట్టఁబడిన; శాస్త్రశబలాళికావార పేటికలు = శాస్త్రముల వేర్వేఱు విభాగములున్న పెట్టెలను; వటువు = బ్రహ్మచారి; పూనఁ = పట్టుకొనఁగా ['శబలికా = నానావర్ణమైన' అని పూర్వటీక.] కంబళ......కరకంబులు = కంబళి; చాప, ఆసనము, కావిగుడ్డలు, కమండలువులను; అంతేవాసి = శిష్యుఁడు; ఉద్వహింపఁ = పట్టుకొనఁగా; ఆమ్లికా......సూపాదులు = చింతపండు, బియ్యపుపిండి, బియ్యము, పప్పు, మొదలగువానిని; మోవఁ = మోయఁగా; సమి......చయము - సమిత్ = సమిధలు; ఆజ్యపూర్ణకీచక = నేతితోనిండిన వెదురుబొంగు (పాత్రము); కుశ = దర్భలు; స్రుక్స్రువచయము = హోమపాత్రముల సమూహమును; ఛాత్రుఁడు = శిష్యుఁడు; సంగ్రహింపఁ = పట్టుకొనఁగా; [ఇచట పూర్వటీకలో 'కీచకకుచ' అను పాఠమునసనుసరించి 'వెదురుసోల' అను అర్థము వ్రాయఁబడినది. అది అసంగతము.] తలుగుదామెనఁ = పలుపుత్రాటిలో; పెనచిన = పెనవేసిన - కట్టిన; గళముతోడఁ = మెడతో; క్రేపుతోఁ = దూడతో; వడుగు = బ్రహ్మచారి; రొప్పఁ = తోలఁగా; ఆశ్రమవాటము = ఆశ్రమప్రదేశము; డాసి = సమీపించి. అలం. స్వభావోక్తి.

క. శిరసు వడంకఁగఁ దెల్లఁగ, నరసిన గృహమేధినియును నడచెఁ దదంగం
బిరవుకొని పట్టుచాలక, జర కొంత వినిర్గమించి చనుదెంచు క్రియన్. 191

టీక. నరసిన = పండిపోయిన; . గృహమేధినియును = గృహిణియును; తదంగంబు = అతని దేహమును; ఇరవుకొని = ఆక్రమించి; పట్టుచాలక = అవకాశము సరిపోక; జర = ముసలితనము; వినిర్గమించి = బయలువెడలి; చనుదెంచు క్రియఁ = వచ్చుచున్నదో యన. అలం. ఉత్ప్రేక్ష.

వ. ఇట్లు కుహనాహితాగ్నియుఁ దైర్థికవేషాభినయ నిపుణుండు నగు నాఖండలుండు తపఃప్రభావతరంగితం బగు తదాశ్రమంబునఁ బటకుటికామండపమధ్యంబున నధ్యాసించి మాధ్యాహ్నిక క్రియాచరణానంతరంబునం బ్రాణాగ్నిహోత్రప్రీణనంబు ననుసంధించి యతిస్నిగ్ధవర్ణముగ్ధాకృతియుఁ జతురపదవిన్యాసధన్యాసికయునై [3]సుకవికవితయుం[4]బోలె నున్న హోమధేనువునకుఁ బథశ్రమంబు నోసరించుచు నుచితగతి [5]నొక్కింతతడవు విశ్రమించి [6]సచ్ఛాత్రుండై మెత్తమెత్తన చని యొండ[7]కండ క్రొవ్వు దలఁగు నత్తటి సరిత్తీరంబునకు సాయంసంధ్యాసముపాసనార్థంబు నిర్గమింప నుద్యుక్తుండై ముక్తసమాధి యగు నయుతునికడకుం జనుటయు నతం డతనికి నాతిథేయంబు ప్రియంబున నాచరించి సుఖాసీనుఁ గావించి యాగమనకారణం బడుగుటయుఁ గృత్రిమముని ధాత్రీసురపుత్త్రున కిట్లనియె. 192

టీక. కుహనాహితాగ్ని = కపటపు గృహస్థు; తైర్థిక......నిపుణుండును = తీర్థయాత్రకు పోవువాని వేషము ధరించుటలో [అట్లు నటించుటలో] నేర్పరియు; ఆఖండలుండు=ఇంద్రుఁడు; తపః...తరంగితంబు = తపోమహత్త్వమున కలకలలాడునది; పటకుటికామధ్యంబునఁ = గుడారపుమధ్యమునందు; అధ్యాసించి = కూరుచుండి; ప్రాణాగ్నిహోత్రప్రీణనంబుఁ = ప్రాణాహుతిని స్వీకరించుటను -

1. చ. దులుఁగు. 2. చ. చిన్ని. 3. క. కవి. చ. సుకవి. 4. చ. బోని. 5. క. నొక్కించుకత
చ. నొక్కింతద. 6. క. సఛాత్రుం. 7. చ. కుండ.

భోజనమును; అనుసంధించి = కూర్చి - చేసి; అతి.....కృతియుఁ = (కవిత్వపక్షమున) మిక్కిలి సుకుమారములగు వర్ణములు కలదియు, (శ్లేషపక్షమున, మిక్కిలి ఆకర్షణీయములగు వంగతోడి శ్లేష కలదియు; చతుర.....ధన్యాసికయుఁ = (కవిత్వపక్షమున) చమత్కారములగు పదముల కూర్పుచే యోగ్యమైనదియు; (గోపక్షమున) చక్కని యడుగులుంచుటచే - చక్కని నడకలచే ధన్యమగునదియు; పథశ్రమంబుఁ = మార్గాయాసమును - దారిబడలికను; ఓసరించుచుఁ = పోఁగొట్టుచు; సచ్ఛాత్రుండై = శిష్యులతోఁ గూడుకొన్నవాఁడై; ఎండకందర్పొవ్వ లజాఁగునత్తఱిఁ = ఎండయొక్క తీక్ష్ణత తగ్గినసమయమున - ప్రొద్దు వాలినపిదప; సరిత్తీరంబునకుఁ = ఏటియొడ్డునకు; సాయం...నార్థంబు = సాయంకాల సంధ్యావందనము నిర్వర్తించుటకొఱకు; నిర్గమింపఁ = బయలుదేఱుటకు; ఉద్యుక్తుండై = సిద్ధపడినవాఁడై; ముక్తసమాధి = విడువఁబడిన యోగసమాధికలవాఁడు; అతిథేయంబుఁ = అతిథి సత్కారమును; సుఖాసీనుఁ = సుఖముగా కూర్చున్నవానిని, కృత్రిమముని = కపటవానప్రస్థుఁడు; ధాత్రీసురపుత్రునకుఁ = బ్రాహ్మణకుమారుఁడైన అయ్యతునికూర్చి.

చ. అమృతభుగాస్పదంబు విశదాప్సరముఁ నవపారిజాతము
ఖ్యమహిజరాజిరాజిత మనంతఫలాయతనంబు నిత్యని
మ్యము నగు నొక్కయాశ్రమము హైమనగోపరిసీమ నుల్లసి
ల్లు మదధివాసమై; మదము లోభము క్రోధము మొల్వ దచ్చటన్. 193

టీక. ఈ పద్యమున ఇంద్రుఁడు తననివాసమునుగూర్చి, తెలుపుచు శ్లేషరూపమున తా నింద్రుఁడైన సంగతియు వివరించుచున్నాఁడు. అమృతభుగాస్పదంబు = (ఉభయపక్షమునను) దేవతలకు నివాసమైనది; విశదాప్సరముఁ = (ఆశ్రమ. ప.) స్వచ్ఛజలములతోఁ గూడిన సరస్సు కలది, (స్వర్గ. ప.) పరిశుద్ధలగు అప్సరసలతోఁ గూడినది; నవ.....రాజితము = (ఆశ్రమ. ప.) క్రొత్త (వింత) పారిజాతము మొదలగు వృక్షములగుంపుచే ప్రకాశించునది. (స్వర్గ. ప.) కొనియాడఁదగిన పారిజాతాది వృక్షసమూహములు కలది; అనంతఫలాయతనంబు=(ఆశ్రమ. ప.) అంతములేని ఫలములకు స్థానమైనది (స్వర్గ. ప.) గొప్ప స్వర్గమైనదియు - (ఫలాయతనము=స్వర్గము;) హైమనగోపరిసీమఁ = [ఉభయ. ప) మేరుపర్వతశిఖరభాగమున మదధివాసమై = నాకు నివాసమై; ఉల్లసిల్లుఁ = వెలయును; మొల్వదు = అంకురింపదు - పుట్టదు. అలం. శ్లేష.

క. శ్రీసఖులు సుగుణరత్నావాసులు సమవర్తన ప్రవర్తులు నయ్యున్
నాసరివారలు గని మనఁగా సుఖినై యే నొనర్తుఁ గాఁపుర మచటన్. 194

టీక. ఈ పద్యమున మిగిలిన ముప్వురు దిక్పతులు - కుబేర, వరుణ, యములు సూచింపఁబడు చున్నారు. శ్రీసఖులు = సంపద్యుక్తులు, కుబేరపక్షమున (ధనపతులు.) సుగుణరత్నావాసులు = శ్రేష్ఠ గుణములకు నిధులు, (వరుణపక్షమున - గుణసముద్రులు); సమవర్తనప్రవృత్తులు = సరిసమానముగ - నిష్పక్షపాతముగ నడచువారు, (యమునిపక్షమునని యమపద్ధకలవారు) అయ్యున్ = అయియుండి; నాసరివారలు = నాతో సమానమైనవారు; మనఁగాఁ = వర్తింపఁగా.

తే. అఖిలధర్మంబులందు గార్హస్థ్య మెన్న, నుత్కటుంబిని తన్నిష్ఠ నోర్పుగలిగి
జగతిఁ దీర్థాచరణబుద్ధి సంచరింతు, ధ్రువతపోగామి! యీమేను ధ్రువముగాఁమి.

టీక. గార్హస్థ్యము = గృహస్థవృత్తి; ఉత్కటంబు = గొప్పది; ధ్రువతపోగామి! = స్థిర తపోదీక్ష కల ముని!

ఉ. కంచి భజించి శేషగిరిఁ గన్గొని యాదిము రంగధాముఁ గీ
ర్తించి ప్రయాగమాధవు నుతించి గయాప్రియు శ్రీగదాధరున్

గాంచి కరిద్విషన్నగశిఖామణికిన్ బ్రణమిల్లి వార్ధి నే
తెంచిన కొయ్యవేల్పుఁ గని దిక్కుల తీర్థములెల్ల నాడుచున్. 196

టీక. శేషగిరిన్ = తిరుపతిని; ఆదిమున్ = మూలపురుషుని; రంగధామున్ = శ్రీరంగవాసి- రంగనాథుని; కరిద్విషన్నగశిఖామణికిన్ = గొప్పదైన సింహాచలమునకు; వార్ధిన్, ఏతెంచిన = సముద్రము నుండి కొట్టుకొని వచ్చిన; కొయ్యవేల్పున్ = జగన్నాథుని; తీర్థములు, ఎల్లన్, ఆడుచున్ = పుణ్య స్థలములందు తిరుగుచు.

ఉత్సాహ. వచ్చివచ్చి కల్పకంబువంటి యొంటివానిఁ గ
న్నిచ్చపచ్చు గ్రచ్చకాయ లెంచి యాడువాని [1]మే
విచ్చు [2]నచ్చగంటివాని వింటి వెన్న[3]మ్రుచ్చు న
ప్పచ్చవిల్తుఁ గన్నతండ్రిఁ బాండురంగవిట్ఠలున్. 197

టీక. కల్పకంబువంబువంటి = కల్పవృక్షమువంటి, ఒంటివానిన్ = ఒంటరిగా లక్ష్మీవిరహితముగా; ఉన్నవానిన్; కన్నిచ్చపచ్చు = కంటికి ఇంపగు; మేవిచ్చు నచ్చగంటివానిన్ = పార్శ్వము (అఱ భాగము) వికసించియున్న - తెఱువఁబడిన చక్కని కన్నులు గలవానిని; వెన్నమ్రుచ్చున్ = వెన్న దొంగను; పచ్చవిల్తుఁగన్న తండ్రిన్ = మన్మథుని జనకునివింటిన్.. అలం. పరికరము.

వ. విని యద్దేవాదిదేవు సేవింపం జనువాఁడనై పైజాడ సపరిచ్ఛదంబుగా [4]నేఁగు దెంచితి [5]నీ వెవ్వఁడ? వెద్ది యభిలషించి భువనభయానకంబగు తపం బాచ రించెదు? వాచంయమివంశ[6]కరీరంబ! యీ శరీరసాదంబునకు నాదికారణంబగు నీహృదయం [7]బదయం బని యుచ్చరించుటన నోరు వొక్కుచున్నయది. [8]యున్నది యున్నయట్ల నొడువుమనుడు నవ్వడు విట్లనియె. 198

టీక. పైజాడన్ = పయిరీతిని; సపరిచ్ఛదంబుగాన్ = సపరివారముగా; భువనభయానకంబు = లోకములకు మిగుల భయముఁ గల్గించునది; వాచంయమివంశకరీరంబ! = మునికులమున కంకురమగు వాఁడా! - మునికిశోరమా! శరీరసాదంబునకున్ = శరీరముక్షీణించుటకు; ['నాశమునకు' అని పూర్వటీక.] వొక్కుచున్నయది = బాధపడుచున్నది. వడువు = వటువు - బ్రహ్మచారి.

క. ప్రయతుఁ డను మునికుమారుఁడ;నయుతుం డను వాఁడ; నియుతు నగ్రజుఁడ గత
స్మయ! విస్మయావహతపో,నియతి వెలుఁగు కలశజన్మునికి శిష్యుండన్. 199

టీక. గతస్మయ! = గర్వములేనివాఁడా! అగ్రజుఁడన్ = అన్నను; విస్మయావహతపోని యతిన్ = ఆశ్చర్యకరమగు తపోనిష్ఠచే; వెలుఁగు = ప్రకాశించునట్టి; కలశజన్మునికిన్ = అగస్త్యునికి.

క. కులశిఖరినిభులు తనకుం, గలశిష్యులలోన నెల్లగారవ మారం
గలశీసుతుండు కరుణా,కలశీతలదృష్టి బెరయఁగా మముఁ జూచున్. 200

టీక. కులశిఖరినిభులు = కులపర్వతములతో సమానులు; గారవము, ఆరన్ = వాత్సల్యము కలుగఁగా; కలశీసుతుండు = అగస్త్యుఁడు; కరుణా.....దృష్టి = దయతోఁ గూడిన చల్లనిచూపు; బెరయఁగాన్ = వ్యాపింపఁగా.

---

1. క. మో. 2. చ. పెచ్చ. 3. క. ముచ్చు. చ. మ్రుచ్చు. 4. చ. జను. 5. క. నీవ్వెఁడ. 6. క. కంఠీ రవంబ! చ. కరీరంబ! 7. క. లోలేదు. చ. లోకలదు. 8. క. లోలేదు.

ఉ. దాతయు దైవముం గురుఁడుఁ దల్లియుఁ దండ్రియునై యథేచ్ఛ వి
ద్యాతిశయంబు రాఁజొనిపి యమ్ముని ముక్కొకనాఁడు ధాతృసం
జాతలసత్స్మితాస్య [1]జలజాతల జాతలకాంతపాయక
దోర్గతల నొక్కయిద్దఱు తలోదరులన్ మముఁ జూచి యిట్లనున్. 201

టీక. దాతయున్ = ఇచ్చువాఁడును; అథేచ్ఛవిద్యాతిశయంబు = ఎదురులేని - గొప్పవిద్యను. రాఁజొనిపి = వచ్చునట్లు చేసి; ధాతృసంజాతలన్ = బ్రహ్మపుత్రికలను; స......జాతలన్ = చిఱునవ్వుతోడి ముఖము అనుచంద్రుఁడు కలవారిని; జాత......దోర్గతలన్ = మన్మథునిబాణములవలెఁ గానఁబడువారిని; తలోదరులన్=యువతులను; మమున్=సోదరులగుమమ్ము. అలం. ఉపమ, రూపకము.

క. మీఁకని కొనితెచ్చితి నాళీకాసను వేఁడి యిన్నళినవయనల మీ
కో కుఱ్ఱలార! పాణిస్వీకృతి జ్యేష్ఠానుపూర్విఁ జేకొనుఁ డనుచున్. 202

టీక. నాళీకాసనున్ = కమలాసనుఁడగు బ్రహ్మను; జ్యేష్ఠానుపూర్విన్ = జ్యేష్ఠానుక్రమమున; (పెద్దవాఁడు పెద్దదానిని - చిన్నవాఁడు చిన్నదానిని) పాణిస్వీకృతిన్ చేకొనుఁడు = పాణిగ్రహణము చేసికొనుఁడు - వివాహమాడుఁడు; అనుచున్ = అని పలుకగా.

క. అవగుణగణశేవధు లగు ధవళాక్షుల కీడు దలఁచి దారాదరణ
వ్యవహృతికి మాఱుమొగ మిడి, యవుగా దని కొన్నిమాట లాడితి నతనిన్.

టీక. అవగుణగణశేవధులు = చెడ్డగుణములగుంపునకు నిధులు; ధవళాక్షుల కీడు = స్త్రీలవలని యాపద; దారాదరణవ్యవహృతికిన్=భార్యను స్వీకరించు పనికి - వివాహమాడుటకు; మాఱుమొగము, ఇడి = ఇష్టపడక; అవుఁగాదని = విమర్శించి.

క. ఆడినఁ గూడిన కినుకన్, పీడిన జడముడియుఁ బొగలువెడలెడి చూపుల్
పోఁడిమిగొనునిట్టూర్పులు, వాడినమొదమును మేన వడియుఁ [2]జెమరునై. 204

టీక. కూడిన, కినుకన్ = కలిగిన కోపముచే; పొగలువెడలెడి = మంటలుగ్రక్కుచున్న; పోఁడిమిఁగొను = ఒప్పిదమైన; వాడిన = కలఁతపడిన; మేనన్, వడియు = శరీరమున కారునట్టి; చెమరునై = చెమ్మటయుఁగలవాఁడై. అలం. స్వభావోక్తి.

క. శపియింపఁగఁ దలఁచియు న త్తపసి యుడిగెఁ గఱువఁదలఁచి తానె యుడుగు పా
ముపగిది; [3]శిఖ విడినంతనె, విపులామరవిపులకోపవిషముం దిరుగున్. 205

టీక. తానె, యుడుగు = తానే యుపశమించునట్టి; శిఖ = పడగ, జుట్టుముడి; విపులా...... విషమున్ = బ్రాహ్మణులయొక్క గొప్ప కోపవిషమును; తిరుగున్ = మరలిపోవును - తగ్గిపోవును. అలం. ఉపమ, రూపకము.

క. సను వెడల నడిచి నాతమ్మునికి వివాహం బొనర్చె ముని కనకవిభా
జనకతనుద్యుతివిభవల,వనరుహభవమానసోద్భవల నా కవలన్. 206

టీక. వెడలనడిచి = తతిమివేసి; కనక......విభవలన్ = బంగారు కాంతివంటి దేహకాంతితో ప్రకాశించువారిని; వన......ద్భవలన్ = బ్రహ్మమానసపుత్రికలను; కవలన్=ఇద్దఱిని.

క. సలసలమను కలశుజుఱ్ఱెగ్గలపుంగినుక యను నెసటఁ గలవడి ఎడి నౌ
దల యంటి చూచుకొని యే,నిలువెడలితి నాతఁణంబ యొత్తినభీతిన్. 207

1. చ. నితాంతలతాంత. 2. జుమరు. 3. చ. సిగవిడు.

టీక. కలశజువెగ్గలపుఁగినుక = అగస్త్యునివిపరీతకోపము; కలవడి = కలఁతపడి-క్రాఁగి; వడిన్ = వేగముగా; బొదలయంటి=తలతాఁకి - (కాలినదేమో యని తడివిచూచి); ఎత్తినభీతిన్ = హెచ్చయిన భయముతో; అలం. రూపకము.

ఆ. [1]విష నిభంబులైన విషయాభిలాషంబు, లెల్లఁ [2]జెల్లఁబెట్టి యేను బ్రహ్మ
చర్యధుర్యవృత్తి సవరించుచున్నాఁడ, నుగ్రతపము మోక్ష మొందు కోర్కి.

టీక. విషనిభంబులు = విషసమానములు; విషయాభిలాషంబులు = భోగేచ్ఛలు; చెల్లఁబెట్టి = విడిచి; బ్రహ్మ.....వృత్తిన్ = బ్రహ్మచర్యదీక్షయందు; ఉగ్రతపము = గొప్పతపస్సు.

క. అనుడు దరహాసరసమునఁ, దన వదనజరద్విధుండు [3]తారుణ్యము నై
కొన మందాందోళనమే, ళనమున శిర మమర మాయలాఁ డిట్లనియెన్. 209

టీక. దరహాసరసమునన్ = చిఱునవ్వుయొక్క సారము (రసముచే)న; వదనజరద్విధుఁడు = ముఖము అను ముసలిచంద్రుఁడు; (ఆ గృహస్థు ముదుసలి యగుటచే నతనిముఖము ముసలిచంద్రునితో పోల్పఁబడినది;) తారుణ్యమున్, కైకొనన్ = యౌవనమును పొందఁగా - మిగుల ప్రకాశింపఁగా; మందాందోళనమేళనమునన్ = ఊగించుటతోడి కలయికతో; శిరము, అమరన్ = తల ఒప్పఁగా. అనఁగా - తలను ఆడించుచు; మాయలాఁడు - కపటగృహస్థు - ఇంద్రుఁడు అలం. రూపకము.

చ. ప్రయుతుఁడు మత్సఖుం డతనిప్రాభవమున్ భవమున్ సుధీజన
ప్రియజనకంబు; లా గుణగరిష్ఠునిజ్యేష్ఠతనూజుఁ డొట మ
న్నయనయుగంబు హర్షసుధ నానె నినుం గనుగొన్న, సాధు బో
ధయుత! భవద్విరుద్ధచరితంబు శ్రవఃపుటసూచి [4]యయ్యెడున్. 210

టీక. మత్సఖుండు = నామిత్రుఁడు; ప్రాభవమున్ = గొప్పతనమును; భవమున్ = సంసారమును - కుటుంబమును; సుధీ......కంబులు = విద్వాంసులకు సంతోషదాయకములు; మన్నయనయుగంబు = నా రెండు కన్నులును; నినున్; కనుగొన్నన్ = చూడఁగా; హర్షసుధన్, ఆనెన్ = సంతోషామృతమును పొందెను; సాధుబోధయుత! ఉత్తమజ్ఞానము కలవాఁడా! భవద్విరుద్ధచరితంబు = నీ విపరీతస్వభావము - సంసారము నొల్లకుండుట; శ్రవఃపుటసూచి = (దొప్పలవంటి) చెవులకు సూది-విన రానిది. అయ్యెడున్=అగుచున్నది.

మ. కులధర్మం బెడలించి శ్రీగురునకున్ గోపంబు పుట్టించి మి
త్రులసౌభ్రాత్రనివాసదేశముల నీతోఁబుట్టులం బాసి ని
శ్చలతన్ వ్రేలెద వుట్టిగట్టుకొని; దుస్సాధంబు సుమ్మీ స్మర
జ్వలనజ్వాలిక సోఁకనీక నిలుపన్ జ్ఞానామృతస్యందమున్. 211

టీక. ఎడలించి = త్రోసివేసి; మిత్రులన్ = హితులను; సౌభ్రాత్రనివాసదేశములన్ = ఉత్తమసోదరభావ, నివాసభూములను; నిశ్చింతన్ = నిర్విచారముగ; ఉట్టికట్టుకొని వ్రేలెదవు = ఆడియాసలు పడియెదవు; జ్ఞానామృతస్యందమున్ = జ్ఞానము అనెడి అమృతధారను; (నేతిధారలు) స్మరజ్వలనజ్వాలిక, సోఁకనీక = మన్మథుఁడను నగ్నిజ్వాలను తాఁకనీక; నిలుపన్ = వేఱుగా ఉంచుటకు; దుస్సాధంబు, సుమ్మా! = అసాధ్యముకదా! [నేయి అగ్నియందు పడి, దానిని జ్వలింపఁజేయుట స్వభావము; దానిని తప్పించుటయు అసాధ్యము. అట్లే ఎట్టిజ్ఞానియైనను, మన్మథునికి లొంగవలసినవాఁడే యనుట ) అలం. రూపకము.

---

1. క. తే. 2. చ. సల్ల. 3. శ. ర. దారుణ్య. 4. యయ్యెడన్. త.

చ. చలనవిహీనవృత్తి సడిసన్న పరాశరుఁ డాదిరైన య
య్యల యల రాయివంటి హృదయంబులు నీరుగఁజేయు బోయ వూ
విలుతున కెంత దొడ్డపని వెన్నెల బిట్టని కాసినంతలో
[1]పలన కరంగి పొంగు పసిబాలుకచిత్తము మెత్తచేయఁగన్. 212

టీక. చలనవిహీనవృత్తిక్=నిశ్చలనిష్ఠయందు; సడిసన్న = పేరుపడిన; అయ్యల = ఉత్తముల యొక్క; బోయ = వేఁటకాఁడైన; బిట్టని = దట్టముగా; కాసినంతలోపలన = విరియులోపుగానే; ఎంతదొడ్డపని? = ఘనకార్యము కాదుగదా! (మన్మథుని విరికోలలకు లొంగనివా రుండరనుట.) అలం. అర్థాపత్తి.

మ. లలితాగారవిహారులై మణిమయాలంకారులై శీలవ
ల్లలనాలాలితులై యమూల్యమృదుచేలద్యోతితాకారులై
కలమాన్నప్రియులై సుగంధధరులై కందర్పునిం[2]బోని భూ
తలనాథుల్ జనకాదు లొందిరికదా తత్తాదృగానందముల్. 213

టీక. లలితాగారవిహారులై = సౌధములందు విహరించువారై; మణిమయాలంకారులై = రత్నభూషణములు కలవారై; శీల......లాలితులై = సత్ప్రవర్తన గల భార్యలచే సేవింపఁబడినవారై; అమూల్య......తాకారులై = విలువైన మెత్తని (పట్టు) వస్త్రములచే అందమైన వేషముకలవారై; కలమాన్నప్రియులై = మేలి వరియన్నమును భుజించువారై; సుగంధధరులై = పరిమళద్రవ్యములను పూసికొన్నవారై; కందర్పునింబోని భూతలనాథుల్=మన్మథులవంటి, రాజులు; తత్తాదృగానందముల్ = సాటిలేని యానందములను - సచ్చిదానందములను; ఒందిరికదా!=పొందలేదా? ['తత్తాదృక్=దానికిఁ దగిన' అని పూర్వటీక.] అలం. పరికరము.

మ. కలలో వార్తలు విప్పి చెప్పెదు క్రియక్ గాథాపురాణార్థముల్
దెలుపన్నేర్తురుగాని నేరరుసుమీ తీవ్రవ్రతాచారశ
ష్కులులై యుండెడు ముండధారులు సుముక్తుల్; డాయఁగాఁ జింతకా
యలకజ్జాయముతోయ మింత చదరంబా కత్పరిష్వంగమున్. 214

టీక. కలలోక్, వార్తలు = కలలో జరుగు సమాచారములను; విప్పి = వివరించి; తీవ్ర...... శష్కులులై = ఘోరములైన వ్రతములచేతను, నియమములచేతను చిక్కులములై - కృశించినవారై; ముండధారులు=సన్న్యాసులు; సుముక్తుల్=ఉత్తమములైన మోక్షములను అపద్ధతులను; డాయఁగాక్= చేరుటకు; నేరరుసుమీ!=సమర్థులు కాఁజాలరుకదా! తత్పరిష్వంగముక్ = ఆ మోక్షాలింగనములు - ఆ మోక్షసంపాదన; ఇంత చదరంబా! = అంత సులభమనుకొంటివా? చింతకాయల కజ్జాయముతోయము= చింతకాయలకజ్జమువంటిది; [చింతకాయలకజ్జాయము ఒకానొక మధురభక్ష్యవిశేషము. దానిని తయారు చేయుట మిక్కిలి కష్టము. అట్లే మోక్షమును కష్టతమమనుట.] అలం. ఉపమ.

మ. వరసారస్వతపట్టభద్రులు కవుల్ వర్ణించి వర్ణించియుక్
సర సావం[3]తయుఁ గానలేరు [4]తుది యోషావిభ్రమాంభోధికిక్;
విరసాంతఃకరణుండవై యెటులుగా నిందించెదో యయ్య! త
త్సరసాకార ముదారమన్మథకళాసర్వస్వశృంగారమున్? 215

టీక. వర......భద్రులు = వాఙ్మయమున ఆఱితేఱినవారు; తుది = చివఱను; యోషావిభ్రమాంభోధికిక్ = వనితలవిలాససముద్రమునకు; సరస = హద్దు; అవంతయుక్ = కొంచెమైనను;

1. క. లలన. 2. చ. బోలి. 3. చ. తట. 4. చ. తుది. క. తుద.

[ఇచట 'సరసావంతయు' అని అకారసంధి చేయఁబడినది.] విరసాంతఃకరణుండవై = రసములేని (విరసమైన) మనస్సు కలవాఁడవై; సరసాకారము = చక్కని రూపుకలదానిని; ఉదార.....శృంగారమున్ = గొప్ప మన్మథకళకు నిధియైన శృంగారరసమును; ఎటులు గాన్ = ఏరీతిని; నిందించెదో! = నిందించుచున్నావోకదా! అలం. రూపకము.

సీ. కీలారమునసుండి పాలింటి కేతేర బహుధాన్యములు చేలఁ బండి యొరఁగ
నెడనెడఁ బెండ్లిండ్లు వడుగులు వొడమఁ గృతార్థులై యర్థించు నర్థు లలరఁ
బరిచారికాకోటి పనిపాటు పాటింపఁ జుట్టంపుసందడి నెట్టుకొనఁగ
గ్రాసు మెంతయు నిజప్రాభవంబున మన సత్యనిష్ఠకుఁ దన్ను సాక్షి గోర
తే. నిత్యనైమిత్తికములు నిర్ణిద్రబుద్ధి, నాచరించుచు హరిభుక్త మాత్మభార్య
భక్తి నిడ భుక్తిఁ గొనుచున్కి ముక్తికాని,నిదురవంటిది తాతివంటిదియుఁ గాదు,

టీక. కీలారమునసుండి = పసులకొట్టమునుండి; ఒరఁగన్ = (వెన్నులు) వంగియుండఁగా = పొడమన్ = జరుగఁగా; కృతార్థులై = కోరిక నెఱవేఱినవారై; అర్థులు = ఇంటికి వచ్చిన యాచకులు; అలరన్=సంతోషింపఁగా; నెట్టుకొనఁగన్ = అతిశయముగ ఉండఁగా; నిజప్రాభవంబునన్ = తన యధికారముచేత; సత్యనిష్ఠకున్ = నిజము పలుకుటకు; నిర్ణిద్రబుద్ధిన్ = మిక్కిలి శ్రద్ధతో; నిత్యనైమిత్తికములు = కర్మలు [ప్రతిదినము జరుపు ఔపాసనము, అతిథిపూజ మున్నగునవి నిత్యములు; ఆ యా పర్వములందు చేయు వ్రతములు, శ్రాద్ధములు మున్నగునవి నైమిత్తికములు.] హరిభుక్తమున్ = విష్ణునికి నివేదింపఁబడిన అన్నాదికము; భుక్తిఁగొనుచున్కి = భుజించుచుండుట. అలం. స్వభావోక్తి.

క. అని తను నీక్రియ బోధించిన జరఠతపస్విపలుకుఁ జిత్తాభోగం
బునఁ బెనఁగనీక ప్రయుతుని,తనయుఁడు తన యుండు బిగి వదల కిట్లనియెన్.217

టీక. జరఠతపస్విపలుకు = ముసలిమునిమాట; చిత్తాభోగంబునన్ = మనమునందు; పెనఁగనీక = చుట్టుకొననీయక; తన యుండు బిగి = తనకున్న పట్టుదల; వదలక = విడువక; [వదల కిట్లనియెన్' అనుచోట అకారసంధి చేయఁబడినది.]

ఉ. పుక్కిటియోవరిం జదువు పుత్తడి హత్తిన పెద్ద[1]నైన మా
[2]ర్గాక్కొకవేళ పాటవముపొందమిఁ జెందినఁ జక్కఁబెట్టువా;
రక్కట! యొక్కటన్ [3]బెడఁకి యాడినఁ గీడన నెవ్వఁ డోపుఁ? బే
రుక్కున నేఱు నిక్కి [4]చన నొక్కఁడు వంకలు నొక్క శక్తుఁడే? 218

టీక. పుక్కిటియోవరిన్ = పుక్కిలి యను సౌధమున; చదువుపుత్తడిన్ = విద్యాదేవత - సరస్వతి; హత్తిన = లగ్నమై యున్న - పెద్దనైనన్=బ్రహ్మనుగూడ; పాటవమునొందమిన్, చెందినన్ = నేర్పుపొందుటను తప్పఁగా - తప్పుదారిని పడఁగా; చక్కఁబెట్టువారు = దిద్దునట్టివారు; అక్కట! = అయ్యో! బెడఁకి యాడినన్ = తప్పి (న్యాయముతప్పి) మాటలాడినయెడల; కీడు = అన్యాయము; పేరుక్కునన్ = మిక్కిలి ధాటితో; ఏఱు = నది. అలం. దృష్టాంతము.

క. నిష్కారణముగఁ దన్ను బహిష్కారణము నొందఁజేయు నిల్వాలవైరిన్
శుష్కీభూత[5]కరుణాహృత్పుష్కరుఁ డితఁ [6]డనక నన్ను దూఱం దగునే? 219

---

1. చ. కైన. 2. చ. కొక్కొక. 3. చ. బెనఁగి. 4. చ. చను. 5. క. కరణ. 6. క. డనగ, చ. డనక.

టీక. తన్నున్ = నన్ను; నిష్కారణముగన్ = ఎట్టి తప్పు లేకయే; బహిష్కారణమును, పిండఁజేయు = తఱిమివేసిన; ఇల్వలవైరిన్ = అగస్త్యమునిని; శుష్క.....పుష్కరుఁడు = దయ లేని హృదయపద్మము కలవాఁడు; ఇతఁడు = అగస్త్యుఁడు; అనక = అని పలుకక; దూఱఁదగునే? = నిందించుట న్యాయము కాదు. మీ రగస్త్యమునినే నిందింపవలెనని భావము.

క. మమకారదూరునకు మిత్రములు కళత్రములు నన్నదమ్ములు నను బం
ధముల [1]పరిష్వంగము ధర్మమె? [2]కైకొన మణుఁగు నగము మైలయు నగమే? 220

టీక. మమకారదూరునకున్ = మమకారము ['ఇది నాది' - అను భావము] లేనివానికి; కళత్రములు = భార్యలు; బంధముల పరిష్వంగము = త్రాళ్ళబిగింపు; కైకొనన్ = గ్రహించుటకు; మణుఁగు= మడుఁగు - పారిశుద్ధ్యము; మైలయున్ = మురికియు - అపరిశుద్ధతయు.

తే. గాఢవిజ్ఞానమయమనో[3]రూఢమైన, నిర్మమునిధైర్య మతనుండు నేఱఁడు గొన;
దానధారాకరాళకాంతారదంతి, కుంభముక్తాహరణ మొనఁగూడు [4]నెట్లు? 221

టీక. గాఢ.....రూఢము = గొప్ప విజ్ఞానముతోఁగూడిన మనస్సున బాగుగ నాటుకొనినది; నిర్మముని ధైర్యము = మమకారములేనివాని ధీరత్వమును; అతనుండు = మన్మథుఁడు; నేఱఁడు, కొనన్ = స్వాధీనము చేసికొనలేఁడు; దాన.....హరణము = మదజలప్రవాహమున భయంకరమైన అడవియేనుఁగుయొక్క కుంభమునందలి ముత్యాలను గ్రహించుట; ఒనఁగూడుట = సంభవించుట; ఎట్లు?= అసాధ్యము. అలం. అర్థాంతరన్యాసము.

క. అకుటిలగుణవాసన తోఁన కలిగి మరువంపులేఁగొనయుఁబోలిన శ్రీ
శుకు నెన్న[5]రేమి? సారె జ, నకు నెంతురు పరముఖోపనతవిజ్ఞానున్. 222

టీక. అకుటిలగుణవాసన = చక్కని పరిమళము (పుష్పపక్షమున), వంకరలేని గుణానుభూతార్థస్మృతి (శుకపక్షమున); తోన = పుట్టుకతోడనే; మరువంపులేఁగొన = లేఁత మరువపుతీఁగ; ఎన్నరేమి?= ఏల లెక్కింపరు? సారె = మాటిమాటికిని; పరముఖోపనతవిజ్ఞానున్ = ఇతరులవలన సంపాదించిన విజ్ఞానము కలవానిని; జనకున్ = రాజర్షియగు జనకుని; అలం. శ్లిష్టోపమ.

చ. మునిజనభాగధేయమగు మోక్షముపక్షము లేక పల్కు నీ
వనఘవిచార! సారెఁ గొనియాడెదు బూడిదబొట్టువోని యీ
చెనఁటిగృహస్థధర్మ మది; చిమ్మెటసింగమె? గాజు రత్నమే?
కనకశలాటు కాథమము కల్పఫలంబె? చలంబు లేటికిన్? 223

టీక. ముని.....భాగధేయము = మునులపాటి సంపద; మోక్షముపక్షము = మోక్షము వైపు - మోక్షమునందలి అభిమానము; అనఘవిచార! = నిర్మలమగు ఆలోచన కల మునీ! బూడిదబొట్టువోని = బూడిదబొట్టువలె క్షణికమయిన; చెనఁటి = పాడయిన; కనక.....థమము = ఉమ్మెత్తకాయ; కల్పఫలంబె! = కల్పవృక్షపుఫలమా? చలంబులు = మాత్సర్యములు; ఏటికిన్? = ఎందుకు? [నా తపోనియతిఁజూచి నీవు అసూయపడి, యిట్లు పల్కుచున్నావనుట! అలం. ఉపమ, నిదర్శన.

ఉ. సంపదచేతఁగాని కొనసాగవు సువ్వె గృహస్థధర్మముల్;
సంపద పూర్వజన్మవికసత్సుకృతంబునఁగాని చేర; దా
సంపద చేరియున్ [6]మదవశంవదుఁజేయు మహాత్ము నేనియున్;
జంపకు నన్ను [7]గన్నుసిమి, చంపుఁడు ముంపుఁడు బోధగాథలన్. 224

---

1. చ. పరిస్పంద. 2. క. మైకొను. చ. కైకొను. 3. క. గూఢ. చ. రూఢ. 4. క. నెట్లు. చ. డెట్లు. 5. చ. లేమి. 6. క. స్మర. చ. మద. 7. చ. న్నుమిసి.

టీక. పూర్వ......సుకృతంబునఁగాని=వెనుకటి పుట్టుకలలో చేసికొనిన పుణ్యములవలనఁగాని; చేరదు = కలుగదు; చేరియుఁన్=వచ్చినను; మదవశంవదుఁన్ = గర్వమునకు లొంగినవానిని-అహంకార పూరితుని; చంపుడు, ముంపుడుబోధగాథలన్=ముంచివేయునట్టి చచ్చుబోధనల కథలతో; కన్నుసిమి= కన్ను పులిమి - కన్నుగప్పి- మోసపుచ్చి; నన్ను, చంపకు=బాధపెట్టకుము. అలం. కారణమాల.

శా. కందర్పాస్త్రములంచు నంచితతటిత్కాండంబులంచున్ సుధా
మందస్యందములంచుఁ [1]గాంచనలతామతల్లులంచున్ సుధీ
బృందంబుల్ ధ్వనినిందలం దెగడు నీ బింబోష్ఠులం దెల్ల నా
నందాభాసమె కాక భాసితచిదానందంబు పెంపొందునే? 225

టీక. కందర్పాస్త్రములు=మన్మథుని బాణములు; అంచితతటిత్కాండంబులు=ఒప్పిదమైన మెఱపుల గుంపులు; సుధామందస్యందములు=ఎడతెగని అమృతప్రవాహములయినవి; కాంచనలతామతల్లులు= శ్రేష్ఠమైన సంపెంగతీగలు; [మతల్లికాశబ్దమును తెలుఁగుకవులు 'మతల్లి'గా వాడుట కలదు. ఈకవి = 'మతల్లి'గా కూడ వాడుచున్నాఁడు.] సుధీబృందంబుల్=విద్వాంసుల సమూహములు; ధ్వనినిందలన్ = వ్యంగ్యరూపమున నిందించు వ్యాజస్తుతులచే; తెగడు=నిందించునట్టి; ఈ బింబోష్ఠులందున్, ఎల్లన్=దొండ పండువంటి పెదవి గల యీ స్త్రీలయెడ; ఆనందాభాసమె=ఆనందమువలె కనఁబడునదే; భాసితచిదానందంబు = ప్రకాశించు చిద్రూపమగు బ్రహ్మానందము; పెంపొందునే? = అతిశయించునా? - కలుగునా? పండితుల వ్యాజస్తుతి నిట్లు గ్రహింపనగును - కందర్పాస్త్రములు సుకుమారమైనవని స్తుతి; కాని యవి అత్యల్పకాలమున వాడిపోవునని (పూవులు కావున) నింద గమ్యము; తటిత్కాండంబులు అందమైనవని స్తుతి; అవి క్షణికములని నింద; సుధాస్యందములు మధురములగునవని స్తుతి; చంద్రునివలె నవియు క్షీణించునవని నింద వ్యంగ్యము; కాంచనలత లింపైనవని స్తుతి; తీగలు తెగునని గాని, అచిరకాలమున ఎండునని గాని నింద ధ్వని, అలం. ఉపమ, రూపకము.

చ. కురులసిరుల్ మెఱుంగుఁజనుగుబ్బల నిబ్బరముల్ మొగంబువి
స్ఫురణము లింద్రనీలమణిభూధరశృంగకురంగలాంఛనా
దరవశదృష్టిఁ జూచెదవు తాపసవంశవతంస! తజ్జరా
భరమున వచ్చు తెల్పుఁ, బడుపాటు వళీవలనంబు నుండఁగన్. 226

టీక. కురుల సిరుల్ = కుంతలముల అందములు; నిబ్బరముల్ = బిగువులు; మొగంబు విస్ఫురణములు = ముఖప్రకాశములు; ఇంద్ర......దృష్టిన్ = ఇంద్రనీలమాణిక్యములు, పర్వతశృంగములు, చంద్రులు అను మర్యాదకు లొంగిన చూపుతో; [ఇచట క్రమముగా - కురులు, కుచములు, ముఖములు మీఁదివానితో పోల్పఁబడినవి.] తాపసవంశవతంస !=మునివంశమున పుట్టిన ఉత్తముఁడా! తజ్జరాభరమునన్ = వాని ముసలితనమున; పడుపాటు = వ్రేలఁబడుట; వళీవలనంబున్ = (ముఖము) ముడతలుపడుటయును; ['కడుపుమీఁది ముడతల చుట్టుకోలు' అని పూర్వటీక. ఇది అసంగతము]. అలం. క్రమము, ఉపమ.

క. కుల మొల్ల గోత్ర మొల్లన్, గలకంఠుల నొల్ల నొల్లఁ గలుములు బాధా
నలహుతదుర్భవబాధా, నలమతినై కందు నొకధనముచే ననుచున్. 227

టీక. ఒల్లన్ = ఇష్టపడను; గోత్రము=వంశము; కలకంఠులన్ = స్త్రీలను; కలుములు = సంపదలు; బాధా......మతినై - బాధానలహుత=నిషేధము అను అగ్నిచే దగ్ధముచేయఁబడిన; దుర్భవ బాధానలమతినై=చెడ్డదైన సంసారముయొక్క బాధలను జీర్ణింపఁజేయు బుద్ధికలవాఁడనయి. ధనముచేన్ = తపశ్శక్తిచే; కందున్=చూచెదను-పరతత్త్వముననుట.

---

[1] క. కాంచన.

క. [1]ఒకటికిఁ బదియుఁ బదింటికి, నొకనూఱుగాఁగ దనసంయుక్తులకుఁ జలిం
పక [2]నొడువు వడువృద్ధఫని, ష్ఠమ నలరియుఁ బలుకుఁ గపటసంయమి కినుకన్.

టీక. నొడువు = జవాబిచ్చు; వడువృద్ధఫనిష్ఠకన్ = ఆబ్రహ్మచారియొక్క గొప్ప పట్టుదలకు; అలరియున్ = సంతోషించియున్నను; కపటసంయమి = మాయాముని; కినుకన్ = కోపముతో.

సీ. పందకుఁ బోటు లోభగ్రస్తునకు నీఁగి బోయకుఁ గరుణ నపుంసకునకు
నంగనాసుఖము నెఱింగించుతెఱఁగయ్యె నాబుద్ధి నీయందు నాటకునికి;
నెటులైన నగ్గము నీ; విదివోలు నిది [3]వోల దనిచెప్ప నెఱిఁయునే యసదుఁ బోడువ!
నిమ్నాభిముఖమైన నీటి నెవ్వాఁడోపు త్రిప్పి [4]యెప్పగుచోటఁ బ్రవహఁ జేయ?

తే. నలమి గుడి మ్రింగువానికిఁ దలుపు లప్ప
డములు కాకుండునే? యగస్త్యముని [5]పనుపు
మీఱి యూరక యిగుర్చ్వన మిన్నుముట్టు
నింతమేటికి నామాట యెంతపాటి? 229

టీక. పోటు = యుద్ధము; ఈఁగి = త్యాగము; బోయకున్ = కిరాతునకు. అంగనాసుఖము = స్త్రీలపొందువలని సుఖము; అసదుఁబోడువ = నీచుఁడైన దుష్టుఁడు; నిమ్నాభిముఖము = పల్లమునకు ప్రవహించునది; అలమి = ఆక్రమించి; పనుపు=ఆజ్ఞ; ఇగుర్చ్వనన్ =చిగురునట్లే - పసితనమున నే; ఇంత మేటికిన్ = ఇట్టి గొప్పవానికి. అలం. లోకోక్తి, నిదర్శన, వ్యాజస్తుతి.

ఉ. వ్యాసుతాదులం దలఁచి వాసికి మాఁగలకత్తి మ్రింగె దా
సాసల నట్టు చాచె దదె యందనిపంటికి; బొందెతోనె కై
లాసముఁ జేరఁజూచెదు; చలం బదియేమి ఫలం? బటంచు నా
భూసురుఁ డీసు వెంచి మునిపుత్రకుఁ బాసి తొలంగి వెండియున్. 230

టీక. వ్యాససుతాదులన్ = శుకుఁడు మున్నగువారిని; వాసికిన్ = మెప్పునకు; ఆసాసలన్ = పేరాసలతో; అందనిపంటికిన్ = అందని పండునకు ('పండు' కొఱవివిభక్తిముగా వాడఁబడినది); అట్టు చాచెదు = మెడ యెత్తెదవు; చలంబు=పట్టుదల; భూసురుఁడు = బ్రాహ్మణుఁడు; ఈసు, వెంచి = కోపము రెట్టించి.

తే. కామధేనుముఖంబునఁ గార్యసిద్ధిఁ
[6]బడయ నూహించి మాయలుపన్ని చనియె;
విను మునిశ్రేష్ఠ! తపముఁ గావించువారిఁ
గనినఁ దలయేర్చుఁగాదె యాఖండలునకు. 231

టీక. కామధేనుముఖంబునన్ = కామధేనుమూలమున; ఆఖండలునకున్ = ఇంద్రునకు; తల, యేర్చుఁగాదె! = తల నొచ్చునుగదా!

సీ. ఉద్యదుత్తానసముద్యోగమాత్రావశిష్టచేతస్సార దష్టదర్భ
శతికృదుగ్రధ్వాంతతతినివారణవిధాత్వరమాణవాలాగ్రదఁళవిహిత
నాదృతాధశ్శయనారంభవిస్రంభగళగకంబళాభోగఁ గాతరాత్మ
నేకపార్శ్వస్థితిస్వీకార నిర్భగ్న [7]చరమోరుకరశల్య సాంద్రబాష్ప

---

1. చ. ఒకటిం. 2. చ. నుడువు. 3. చ. వల. 4. చ. యెప్పటి. 5. క. పనుపు. చ. పలుకు. 6. క. ర. బుండ. 7. చ. భరమోరుకరశల్యబాష్పసాంద్ర.

తే. దుగ్ధసేవాసమయబోధముగ్ధవత్సపీడితాపీనపర్యంతఁ బృథులదామ
వేష్టితగ్రీవ నొంట జూచె విప్రుఁ డొక్క, యర్జుని నిజోటజప్రఘాణాంతరమున.

టీక. ఉద్య.....స్సారన్ - ఉద్యత్ = కలుగుచున్న; ఉత్థానసముద్యోగమాత్ర = లేచుటకైన ప్రయత్నమునకుమాత్రమునకుఁదగి అవశిష్ట = మిగిలిన; చేతస్సారన్ = మనోబలము కలదానిని - అనఁగా అది మనోబలముచేతనే లేవఁబ్రయత్నించుఁగాని, శరీరశక్తిలేదని భావము. దష్టదర్భన్ = కొఱుకఁబడిన దర్భగడ్డి కలదానిని - దానిని నమలుటకును దానికి శక్తి లేదనుట. క్షతి... వాలాగ్రన్ - క్షతికృత్ = గాయపఱచుచున్న; ఉగ్రధ్వాంక్షతతి = భయంకరములగు కాకుల గుంపును; నివారణవిధా = అడ్డుకొను పనియందు; త్వరమాణ = తొందరపడుచున్న; వాలాగ్రన్ = తోఁకచివఱిభాగము కలదానిని; దంశపిహితన్ = అడవియీఁగలచే కప్పఁబడినదానిని - అడవియీఁగలు దట్టముగా ముసురుకొన్నదానిని; ఆదృతా.....భోగన్ - ఆదృత = ఆదరింపఁబడి; అథశ్శయనారంభ = నేల పండుకొనుటకు ముందు; విస్రంభ = స్వేచ్ఛగా నున్న; గళకంబళాభోగన్ = గంగడోలుయొక్క ఒప్పుగలది - ఆ గోవు పండుకొనుటకుఁ బ్రారంభించినపుడు దానిగంగడోలు ఒప్పిదము తేఁటపడుననుట. కాతరాక్షిన్ = బెదరుకన్నులు కలదానిని; ఏక.....శల్యన్ - ఏకపార్శ్వస్థితిస్వీకార = ఒక్క ప్రక్కనే పండుకొనుటచేత; నిర్భగ్నచరమోరుకరశల్యన్ = విరిగిన క్రిందొడ కల్గునట్లుచేయు ఎముకలు కలదానిని; సాంద్రబాష్పన్ = ఎక్కువగా కన్నీరు విడుచుదానిని; దుగ్ధ.....పర్యంతన్ - దుగ్ధసేవాసమయబోధ = పాలు త్రాగెడి సమయమును తెలియఁజేయు; ముగ్ధవత్స = చిన్నదూడచే; పీడిత=బాధింపఁబడిన; ఆపీనపర్యంతన్ = పొదుగుమూలభాగము కలదానిని;; పృథుల.....గ్రీవన్ = పెద్దత్రాటితోఁ గట్టఁబడిన మెడ కలదానిని; అర్జునిన్ = ఆవును; నిజోట.....రమునన్ = తన పర్ణశాలయొక్క ముంగిటియందు; విప్రుఁడు; చూచెన్. అలం. స్వభావోక్తి.

క. చూచి యిది యల్ల మొన్నటి, వాచంయము వేల్మిగిడ్డివడు వోందెడు నీ
నైచికికి నెట్లొకో యీ, నీచత వాటిల్లె నిన్న నేఁటనె యనుచున్. 233

టీక. వాంచయము వేల్మిగిడ్డివడువు = మునియొక్క హోమధేనువురీతిని; నైచికికిన్ = అవునకు; నిన్న నేఁటనె = ఇంత తక్కువకాలమునందే.

చ. మతిఁ గృపక్రమ్మ బాడబకుమార[1]శిఖామణి యుద్ధరించె భూ
పతితఁ దపస్విరోహిణి నపాయపరంపరఁ బాచి సాఁకి యూ
ర్జితబలఁ జేయఁగాఁ దలఁచి శిష్టహితన్ గలికాలజాత దుః
స్థితఁ బడు ధర్మదేవత శతచ్ఛలోచనుఁ డెత్తుకైవడిన్. 234

టీక. క్రమ్మన్ = వ్యాపింపఁగా - కలుగఁగా; బాడబ.....మణి = ఉత్తముఁడగు బ్రాహ్మణపుత్రుఁడు - అయుఁతుఁడు; భూపతితన్ = భూమిపై పడిపోయినదానిని; తపస్విరోహిణిన్ = మునిధేనువును; పాఁచి = తప్పించి; సాకి = పెంచి; ఊర్జితబలన్ = సంపాదించిన బలముకలదానిని; శిష్టహితన్ = శిష్టులకు మేలగుదానిని; కలి.....దుఃస్థితన్, పడు = కలికాలమునందు కలిగిన హీనదశయందు పడియున్న; ధర్మదేవతన్; శతచ్ఛదలోచనుఁడు = పద్మాక్షుఁడు - విష్ణువు; ఎత్తుకైవడిన్ = ఉద్ధరించిన విధమున; ఉద్ధరించెన్ = లేవనెత్తెను. అలం. ఉపమ.

క. [2]పడఁబడఁబొఱలుచు గడగడ, వడఁకుచు మొదవింత నిలిచె వనజాక్షుఁడు మున్
వెడలింపఁగ [3]జడనిధి వెలు,వడి యించుక దెలియు పుడమిపడఁతియుఁ బోలెన్.

1. క. శిరో. చ. శిఖా. 2. శ. ర. బడబడ. 3. క. జల. చ. జడ. 4. చ. వనిత.

టీక. పడఁబడక = పడఁబడమని - (అనుకరణము) పాఱుమక = పేకవేయుము; మొదవు = ఆవు; ఇంత = కొంచెము; జలనిధి, వెలువడి = సముద్రమునుండి బయటికి వచ్చి; ఇంచుక = కొంచెము; తెలియు = గోచరమగు; పుడమిఁబడఁతియుఁబోలెన్ = భూదేవివలె. అలం. ఉపమ.

చ. పదములఁగొంకు వోఁ[1]బిసికి [2]ప్రక్కలస్రుక్కడలించి దంశవం
శదమనవృత్తి నింపొసఁగి [3]సాస్నఁ నఖంబుల దువ్వి నెత్తురుల్
చిదికెడు[4]గంట్ల భూరజముఁ జిల్కి ముఖస్థతృణంబు ద్రోచి య
మ్మొదవు మృదుక్రియన్ నడపి ముంగిటఁ బందిటికాటఁ గట్టుచున్. 236

టీక. పదములన్ = కాళ్లను; కొంకు = దడ; పోన్ = పోవునట్లుగా; పిసికి = పట్టిపిసికిచేసి; ప్రక్కలస్రుక్క = పార్శ్వభాగముల ముడుతను; ఎడలించి = పోఁగొట్టి; దంశవంశదమనవృత్తిన్ = అడవియీఁగలగుంపును అణఁచు పనిచే; ఇంపొసఁగి = సంతోషమును కూర్చి; నఖంబులన్ = గోళ్లచే; సాస్న, దువ్వి = గంగడోలు, దువ్వి; చిదికెడు = రక్తము చిమ్మునట్టి; గంట్లన్ = గాయములందు; భూరజము = దుమ్ము; చిల్కి = చల్లి; ముఖస్థతృణంబున్ = నోటిలోనున్న గడ్డిపఱకను; త్రోచి = లోనికి చొప్పించి.

క. చేతోజహయచ్ఛాయా,పాతాసహమైన మంచి పచ్చికయు విని
ర్ధౌతకలధౌతదండచ్ఛి,భాతులితజలంబులం దపసి ప్రియ [5]మెసఁగన్. 237

టీక. చేతోజ......సహము = మన్మథుని వాహనమగు చిలుకయొక్క కాంతి సంభవించుటను కూడ సహింపనిది - అనఁగా చిలుకవన్నెకన్న మిన్నయగు రంగుకలది; వినిర్ధౌత......జలంబులన్ = కడుగఁబడిన వెండి కడ్డీవలె ప్రకాశించు స్వచ్ఛజలములచేతను; ప్రియము = ఇష్టము; ఎసఁగన్ = కలుగఁగా.

సీ. పడఁబడ నెత్తఁ బాల్పడియున్కి నాసనా[6]భ్యాసనైపుణ[7]శక్తి పట్టుదలలె
నులపాంకురము లేర్చి యులుపవట్టెడుపూన్కిఁ గుశపల్లవాహృతి కుంటువడియె
సడలంగ మెడరజ్జుఁ గడువడి నిడుతమి నక్షసూత్రావృత్తి యవలఁ జనియెఁ
బొల[8]యాడ్చితినుటకుఁ బొలయుపుల్గులఁ బోవనదలించుహుంకృతిఁ బెదరె మంత్ర
తే. మాసలన్నియు మొదలంటఁ గోసిపోయున్న, గోఁచికట్టున కటువంటి గొడవ గడవ
రాక మెడఁజుట్టుకొనియె; నూరక యకార్య,కరణశీలుర కెప్పాటఁ గలదె సుఖము?

టీక. పడఁబడన్ = పడిపోఁగా, పడిపోఁగా; ఎత్తన్, పాల్పడియున్కిన్ = ఎత్తుటకు సిద్ధముగా నుండు కారణమున; ఉలపాంకురములు = గడ్డిపోఁచలు; ఉలపవట్టెడుపూన్కిన్ = కానుక ఇచ్చు - తినిపించు పట్టుదలతో; కుశపల్లవాహృతి = చిగురుదర్భలను (హోమార్థము) తెచ్చుట; కుంటువడియెన్ = కొఱవడెను; సడలంగన్ = జాఱిపోఁగా; రజ్జున్ = త్రాటిని; తమిన్ = కూరిమితో; అక్షసూత్రావృత్తి = జపమాలను త్రిప్పుట; పొల=మాంసమును; పొలయు = తిరుగుచున్న; పుల్గులన్ = పక్షులను; పోవన్ = పోవుటకు; అదలించు హుంకృతిన్ = బెదరించు హుంకారమున; గోఁచికట్టునకున్ = బ్రహ్మచారికి; గొడవ = లంపటము; అకార్యకరణశీలురకున్ = చెడ్డపనిని చేయఁదలఁచినవారికి. అలం. అర్థాంతరన్యాసము.

---

1. క. బసికి. చ. బిసికి. 2. క. ప్రక్క. చ. ప్రక్క. 3. శ. ర. సాస్ర. 4. క. గండ్ల. శ. ర. సూర్య. గంట్ల. 5. చ. మొసఁగన్. 6. క. భ్యాస. చ. భ్యాస. 7. చ. వృత్తి. 8. శ. ర. యీడ్చి.

చ. విబుధతపోధనేంద్ర! విను వేయి విధంబుల నాతఁ డేదనే
చి బలవిభేదినైచికి విశృంఖలమై ఖలమైత్రిఁ బోలె వే
గబలవిహీనతార్తి యుడుగం గడుఁ గ్రొవ్వున నివ్వటిల్లి బీ
ద బలిసి బందికాఁడగు విధంబునఁ ద్రిమ్మరు నమ్మహాటవిన్. 239

టీక. విబుధతపోధనేంద్ర! = దేవమునీ! నారదా! ఏదన్ = పోషింపఁగా; ఏచి = బలిసి; బలవిభేదినైచికి = ఇంద్రునియావు - కామధేనువు; విశృంఖలమై = అడ్డులేనిదై; ఖలమైత్రిఁబోలెన్ = చెడ్డవానితోడి స్నేహమువలె; బలవిహీనతార్తి = బలము లేనందునఁ గల్గు బాధ; ఉడుగన్ = తొలఁగఁగా; నివ్వటిల్లి = విజృంభించి; త్రిమ్మఱున్ = తిరుగును. అలం. ఉపమ.

ఉ. గుండువలెన్ బలీయమగుఁ గోడియతోడఁ జరింప నారఁగాఁ
బండిన బల్సువంటి [1]పస భాసిలు మైసిరి చూడ్కికెంతయున్
బండువొనర్ప నల్పగతి పాల జనింప సమాంస[2]మీనసన్
వెండియు నిల్చెఁ జూలుదధివీచి మణిఘృణి [3]చొచ్చుచాడ్పునన్. 240

టీక. బలీయము = బలముకలది; కోడియతోడన్ = కోడెతో - ఎద్దుతో; బల్సువంటిపస = బలుసుకాంతివంటి కాంతి; మైసిరి = శరీరశోభ; చూడ్కికిన్ = చూపునకు పాలన్ = పాలవిషయమున; అల్పగతి = తక్కువఁదనము - తగ్గిపోవుట, జనింపన్ = కలుగఁగా; సమాంసమీనసన్ = ప్రతివత్సరము ఈనునట్టి యీ ఆవునకు; ఉదధివీచిన్ = సముద్రపుటలను; మణిఘృణి = మణులకాంతి; చొచ్చుచాడ్పునన్ = ప్రవేశించురీతిని. వెండియున్; చూలు = గర్భము; నిల్చెన్. అలం. ఉపమ.

తే. వత్సయుతయు గర్భవతియునై మాహేయి, పతివ్రతంబు నణఁప వార్చియుండెఁ
[4]గంబుగర్భతర్ణకయు జరద్గర్భయు, నై న[5]యసురఁ జెఱుపుటావుఁబోలె. 241

టీక. వత్సయుతయున్ = దూడతోఁగూడియున్నదియు; మాహేయి = ఆవు; పతివ్రతంబున్ = యజమానుని (అయుతుని తపోనియమమును; అణఁపన్ = నశింపఁజేయుటకు; వార్చి = ఎదురుచూచి; కంబుగర్భతర్ణకయున్ = శంఖమువంటి కడుపుగల దూడ గలదియు; జరద్గర్భయున్ = నిండుచూలాలును; అసురఁ జెఱుపుటావుఁబోలెన్ = కామధేనువువలె.

క. లోచనవికృతి ముకురమునఁ, గోచరమగు పగిదిఁ గపటగోచరితము దన్
మోచిన వాచంయమసుతుఁ, డేచిన నెవ్వగలఁ బొగిలి యూహించెన్. 242

టీక. లోచనవికృతి = కన్నుల వికారము; ముకురమునన్ = అద్దమునందు; గోచరము, అగు పగిదిన్ = కనబడునట్లు; తన్, మోచినన్ = తనకు నాటగా; వాచంయమసుతుఁడు = మునికుమారుఁడు; ఏచిన = బాధించిన; నెవ్వగలన్ = ఎక్కువవిచారములచే; పొగిలి = దుఃఖించి; ఊహించెన్ = తలఁచెను.

సీ. వత్సనాభీ [6]గంధవహమయ్యె నీయావుపై గాలి నీవారపాకములకుఁ
గఠినకుద్దాలవక్త్రములయ్యె నీజన్నెమనుదెక్క లక్కందమూలములకుఁ
జటులదవానలచ్ఛట[7]లయ్యె నీగిడ్డికటుజిహ్వ బర్హిర్హిరణ్యకాయములకు
నాఁటణోచ్చారణోద్ధతులయ్యె నీతొట్టుకంఠహుంకృతులేణగర్భిణులకు

1. క. పసి. చ. పస. 2. చ. నీనసన్. 3. చ. వొల్చు. 4. క. గంజ. చ. గంబు. 5. క. యసురు. చ. యసుర. 6. శ. ర. గంధవహుండయ్యె. 7. క. యయ్యె. చ. లయ్యె.

తే. నాకు మొగమోడి యూఁగాద నరుతపస్వు, లేల యీ మైల పూయక దూల? నీని
వత్సయుతముగ [1]నివ్వనీవాటమునకు, లాడిగావింతు నంతఁ దోలంగు దూఱు.

టీక. ఈ యావుపైగాలి = ఈ యావుపైనుండి వీచుగాలి; నీవారపాకములకున్ = నివ్వరి ధాన్యపు పంటలకు; వత్సనాభిగంధవహము = వసనాభి యను విషపు గాలి; అయ్యెన్; విషపుగాలి వలె ఈ యావును ఆ పంటను నశింపఁజేయుచున్నదని భావము. ఈ జన్నెమునుదెక్కులు = ఈ యావుముంగాళ్ల గిట్టలు; కఠినకుద్దాలవక్త్రములు = వాఁడియైన గునపముల చివఱిభాగములు - అగ్రభాగములు; ఈ గిడ్డికటుజిహ్వ = ఈ యావుయొక్క గఱుకునాలుక; బర్హిర్బిశాయములకున్ = కుశవనమునకు; చటులదవానలచ్ఛట = భయంకరమైన దావాగ్నిజ్వాల; ఈ తోఁకుకంఠహుంకృతులు = ఈయావుయొక్క భయంకరములైన యఱపులు; పీనగర్భిణులకున్ = గర్భముతోనున్న యాఁడుఱేళ్లకు; అకాలోచ్చారణోద్ధతులు = గర్భస్రావమును గలిగించు మంత్రోచ్చారణముయొక్క పెద్దదెబ్బ; మొగమోడి = మోమోటమిపడి; ఓఁగాదు, అనరు = మాఱుమాటాడరు; మైల = మురికి; దూల, ఏల? = దురద యెందుకు? - ఈ పనికిమాలిన చిత్తక్షోభ నా కేల? యని భావము; ఈ వనీవాటమునకున్ = ఈ యడవి గుంపునకు; లాడి, గావింతున్ = బలిగా చేసెదను; అంతన్ = పిదప; దూఱు = నింద; తోలంగున్ = పోవును. (ఇతరులవలన నిందింపఁబడ నక్కఱలేదు.) అలం. రూపకము.

ఉ. దండమె దీనివాలధి? సుధానిభవాఃకరకంబె దీని యీ
కుండపొదుంగు? దీనిముకుఁ [2]గ్రోళులు భూమిబిలాంతరంబులే?
[3]ఖండపటంబె దీనిమెడకంబళి? యంచుఁ ద్యజించె రోసి య
[4]క్కొండొక బ్రహ్మచారి మది గూకులువత్తులునై యసద్గతిన్. 244

టీక. దీనివాలధి = దీనితోఁక; దండమె = యోగుల చేతి దండమగునా? సుధా.....కరకంబె = అమృతసమానమగు నీటి కమండులువు అగునా? ముకుఁగ్రోళులు = నాసారంధ్రములు; భూమిబిలాంతరంబులే? = బొరియల లోపలి భాగములగునా? మెడకంబళము = గంగడోలు; ఖండపటంబె = గుడ్డముక్కయా? - గోఁచిపేలికయా? అంచున్ = అని పలుకుచు - నా దండ, కమండలాదులను విడిచి, దీనింగాపాడ నాకేమిపని యని తలఁచుచు; రోసి = ఏవగించి; అక్కొండొక బ్రహ్మచారి = ఆ చిన్నవడువు; గూకులువత్తులునై = మిక్కిలి కలఁతపడి; అసద్గతిన్ = చెడ్డతనమున; త్యజించెన్ = విడిచెను; అలం. వక్రోక్తి.

తే. క్రేపు వాపోవఁబట్టి లంకియకుఁ దార్చి, తోలవియఁగొట్టి మెడ నొక్కతుండుగట్టి
గిడ్డి వెడలించెఁ దలత్రాడు కేల [5]దొట్టి, మారి వెడలించువడువున మాణవకుఁడు.

టీక. క్రేఁపు = దూడ; వాపోవన్ = అరవఁగా, లంకియకున్, తార్చి = (ఆవుతో) లంకె వేసి; తోలు, అవియన్ = పైచర్మము, ఊడునట్లుగా; ఒక్క తుండు = ఒక్క టొంపము (మెడలో కట్టు లావుపాటికఱ్ఱ); తలత్రాడు = తలకుఁగట్టిన త్రాటిని; కేలన్, తొట్టి = చేతితో పట్టుకొని; మారి, వెడలించువడువునన్ = మశూచిని తరిమివేయురీతిని; మాణవకుఁడు = బ్రహ్మచారి; గిడ్డిన్ = గోవును; వెడలించెన్. అలం. ఉపమ, స్వభావోక్తి.

క. ఆధేనువు తత్కృతబహుబాధల సక్రోధ యగుచుఁ బరతత్త్వసము
ద్బోధకబోధకలితుఁడగు, వాధూల[6]మునీంద్రుఁ డుండు వనమునఁ బడియెన్. 245

టీక. తత్......బాధలన్ = వానిచే పెట్టఁబడిన పెక్కు బాధలవలన; సక్రోధ = కోపముతోఁగూడినది; పర......కలితుఁడు = పరమాత్మతత్త్వమును బోధించు జ్ఞానముచే ప్రకాశించువాఁడు.

1. క. నీవనీ. శ. ర. నివ్వనీ. 2. చ. గోళులు. 3. చ. ఖండ. 4. చ. కొండక. 5. చ. జుట్టి.
6. క. యతీం. చ. మునీం.

క. పులియున్న పొదరు మొసలికి, నెలవగు బలు[1]మడువు ద్రాఁచు నిల్చిన వల్మీ
బిల మన నమ్ముని వనమెవ్వాలనం జొరఁజనదు వాసవప్రభృతులకున్. 247

టీక. పొదరు = పొద; నెలవు = నివాసము; బలుమడువు = పెద్దకొలను; వల్మీబిలము=పుట్ట రంధ్రము; ఎవ్వాలనన్ = ఏ విధమున నైనను; వాసవప్రభృతులకున్ = ఇంద్రాదులకును; చొరఁజనదు = ప్రవేశింపరాదు. అలం. రూపకము.

శా. ఆ మాయాగవి[2] మట్టె నట్టడవిలో సత్యుద్ధతిన్ రేపి మ
ధ్యేమార్గంబున నభ్రగర్భితసురాద్రిం[3]బోలి వల్మీకరే
ఖామగ్నాకృతి నున్న యున్నతతపఃకౌశల్య[4]కల్యున్ గత
వ్యామోహున్ జిరజీవి దేవతులితున్ వాధూలవాచంయమున్. 248

టీక. ఆ మాయాగవి = ఆ కపటగోవు; రేసి = విజృంభించి; మధ్యేమార్గంబునన్ = దారి నడుమ; అభ్రగర్భితసురాద్రింబోలి = మేఘములతో కూడిన మేరుపర్వతమువలె; వల్మీకరేఖామగ్నాకృతిన్ = పుట్టతోఁగూడి దట్టమైన చెట్లగుంపులో మునిఁగిన ఆకారముతో; [పుట్ట మేఘమువలెను, ముని మేరువువలెను ఉన్నట్లు పోల్పఁబడినది.] ఉన్నత......కల్యున్ = గొప్పతపస్సునేర్పున ఆఱితేఱిన వానిని; గతవ్యామోహున్ = నశించిన అజ్ఞానము కలవానిని; దేవతులితున్ = దేవసమానుని, వాధూలయమున్; మట్టెన్. అలం. ఉపమ, పరికరవాచము.

ఉ. మట్టిన బిట్టు మిట్టిపడి మౌని సముత్థితుఁడయ్యె మేనిపైఁ
[5]బెట్టినపుట్ట నెట్టవిసి బీఁటలువాఱ శ్రవశ్శకుంతముల్
చట్టుపలెత్తి ముందఱికి సాఁగఁదలంప జటాచ్ఛటాచ్ఛవిన్
ద్రుట్టెలుకట్టి నిద్రిలు మరుద్భుగధీశకులంబు మేల్కొనన్. 249

టీక. బిట్టు, మిట్టిపడి = శీఘ్రముగా ఎగిరిపడి; పెట్టిన = ఏర్పడిన; పుట్టనెట్టు = పుట్టచోటు - అవిసి = పగిలి; శ్రవశ్శకుంతముల్ = చెవులపైనుండు పిట్టలు; చట్టుపలు = రెక్కలు; జటాచ్ఛటాచ్ఛవిన్ = జడలగుంపులకాంతితో; త్రుట్టెలు, కట్టి = గుమికూడి; నిద్రిలు = నిద్రించునట్టి; మరుద్భుగధీశకులంబు = పాముల గుంపు.

మ. కసవుందీవలు దావపావకశిఖౌఘుంబుల్ ప్రకాశింప వె
క్కసమై తోఁచిన కొండచందమునఁ దీర్ఘశ్మశ్రుచంచచ్ఛటా
విసరక్రోధరసోగ్రమూర్తి యగుచున్ వృద్ధవ్రతిశ్రేష్ఠుఁ డా
త్మసమీపస్థితు హస్తముక్తసురభిన్ దద్వర్ణి[6] నీక్షించుచున్. 250

టీక. కసవుందీవలు = గడ్డితీగలును, దావ......ఘుంబుల్ = కార్చిచ్చుయొక్క మండల గుంపులును; వెక్కసమై = అధికమయి; దీర్ఘ......మూర్తి = నిడుపాటి గడ్డము, మీసములతో చలించు కాంతిసమూహము గల కోపముచే భయంకరస్వరూపుఁడు; వృద్ధవ్రతిశ్రేష్ఠుఁడు = గొప్ప ముసలిముని - వాధూలుఁడు; ఆత్మసమీపస్థితున్ = తనకుదగ్గఱగా నున్నవానిని; హస్తముక్తసురభిన్ = చేతితో విడుచుచున్న గోవుకలవానిని; తద్వర్ణిన్ = ఆ బ్రహ్మచారిని - అయుంతుని; ఈక్షించుచున్ = చూచుచు - మీఁదిపద్యముతో అన్వయము. అలం. ఉపమ.

---

1. చ. మగడు. 2. చ. మాయావిని. 3. చ. బొల్చు. 4. క. శల్యున్. చ కల్యున్. 5. క పెట్టిన. సూర్య. బెట్టిన. 6. క. వీక్షిం. చ. నీక్షిం.

ఉ. ఓరి దురాత్మ! యోరి వినయోజ్ఝిత! యోరి మదాంధ! [1]యెందు నే
వారికిఁ జేరరాదు మునువారికి నీవన; మీవు చొచ్చి జం
భారికృతోపఘాతశతహార్యము గాని మదీయఘోరదు
ర్వారసమాధిగౌరవము వమ్ముగఁ జేసితి వాసురక్రియన్. 251

టీక. వినయోజ్ఝిత != వినయమునుండి విడువఁబడినవాఁడా ! - దుర్వినీతుఁడా ! మునువారికిన్ = బ్రదుకఁదలఁచినవారికి; నావనము; చేరరాదు=సమీపింపనసాధ్యము; జంభారి......హార్యము=ఇంద్రుని యొక్క శతసంఖ్యాకములగు బాధలచేతను నశింపఁజేయఁదగినది; ఆసురక్రియన్ = రాక్షసపద్ధతిని వమ్ముగన్ = వ్యర్థమైనదానినిగా; చేసితివి.

తే. వృద్ధుఁ బ్రణిధాననిర్మగ్ను బుద్ధిబలుని, హీను నన్నిట్లు చేసితి గాన నీవు
నిట్టిప్రాయంబు నీరూపు నీవిధంబు, నదటు నుడివోయి భేకంబ వగుమనవుడు.

టీక. ప్రణిధాననిర్మగ్నున్ = ధ్యానయోగమున మునిఁగినవానిని; ఇట్టి ప్రాయంబు=యౌవనము; ఈరూపు = ఈస్వరూపము; అదటున్ = గర్వమును; ఉడివోయి = పోయి; భేకంబవు=కప్పవు.

శా. ఆ పృథ్వీసురసూతి తత్పదసరోజానమ్రుఁడై యిట్లనున్
'కోపాటోప మడంపుఁ డీరలిగినన్ గొండల్ పడున్ వారిధుల్
రూపేదున్ ధర వ్రయ్యు మిన్నొరగు మద్రూపంబునా నెంత? ని
ష్ఠాపద్మాసన! లెస్సఁగాఁ దెలిసి నన్ శాపాగ్నిచేఁ గ్రాఁపవే! 253

టీక. ఆ, పృథ్వీసురసూతి = ఆ బ్రాహ్మణపుత్రుఁడు - ఆయుతుఁడు; తత్పదసరోజానమ్రుఁడై = ఆమునిపాదపద్మములపై వ్రాలినవాఁడై; ఈరు = మీరు; అలిగినన్ = కోపించినచో; వారిధుల్ = సముద్రములు; రూపు,ఏదున్=నశించును; ధర=భూమి; వ్రయ్యున్=బ్రద్దలగును; మద్రూపంబునాన్ = నా రూపనఁగా; నిష్ఠాపద్మాసన! = నిష్ఠయందు బ్రహ్మయైనవాఁడా! లెస్సగాన్, తెలిసి = బాగుగా గ్రహించి. క్రాఁపవే = కాల్చుము.

క. తలఁగని లయశిఖివని నిను, నెఱుఁగుదు వాధూలమునికులేశ! నిజముగా
నెఱిఁగి యెఱిఁగి తనయౌదల, కొఱవిం గొని గోఁకఁ దివురు కుమతియుఁ గలఁడే?

టీక. లయశిఖివి = ప్రళయాగ్నివి; ఔదలన్ = తలను; కొఱవిఁగొని = కాలుచున్న కట్టెను తీసికొని - (దానితో) గోఁకన్, తివురు = గోఁకుటకు యత్నించునట్టి; కుమతియున్ = చెడ్డబుద్ధికల వాఁడును; కలఁడే? = ఉండునా? అలం. లోకోక్తి.

ఉ. ఉద్ధతిదక్కి యొక్కయెడ నూరకయుండఁగనీని కంధరా
బద్ధమహాహి నీ కపిలఁ బాపఁదలంచితి; నొండు లేదు; దీ
నోద్ధరణాతిసాంద్రకరుణోదధివీచిసమృద్ధి యైన నీ
బుద్ధికిఁ జేర్పఁగాఁ దగునె భూరిదవానలకీలఖేలమున్?' 255

టీక. ఉద్ధతి దక్కి = గర్వమును విడిచి - శాంతివహించి; ఉండఁగనీని = (నన్ను) ఉండనీయనట్టి; కంధరాబద్ధమహామహిన్ = మెడలోఁగట్టుకొన్న పాము అగుదానిని; ఈ కపిలన్ = ఈ యావును; దీనో......సమృద్ధి = దీనులను రక్షించుటయందు మిక్కిలిపెద్దదగు కరుణాసముద్రముయొక్క యలలతో నిండినది; భూరి......ఖేలమున్ = పెద్ద కారుచిచ్చుమంటల విలాసమును, చేర్పఁగాఁదగునే! అలం. రూపకము.

---

1. చ. ఖుందు.

వ. అని మునితనయుండు ధేన్వాగమనాది తదుచ్చాటనాంతంబుగాఁ గల తన వృత్తాంతంబు విన్నవించుటయు, నూహించి యత్తెఱంగు చిత్తంబున యథార్థంబుగాఁ గనుంగొని. 256

టీక. తదుచ్చాటనాంతంబుగాన్ = దానిని తఱుముట తుదగా; అత్తెఱంగు = ఆ పద్ధతి - అయుతుఁడు చెప్పిన విధము.

మ. భ్రుకుటీభీషణఫాలభాగుఁడు తనుప్రోద్భూతఘర్మాంబు బిందుకుఁడున్ బ్రస్ఫుటదోష్ఠపల్లవుఁడు చేతోభీతికృల్లోలతారకఘూర్ణన్నయనుండు గాక శమసారస్మేరుఁడయ్యెం దపస్వికులగ్రామణి చిచ్చు చంద్రుపొడవై చెన్నొందుచందంబునన్. 257

టీక. భ్రుకుటీ......భాగుఁడు = బొమముడిచే భయంకరమైన నొసలు కలవాఁడు; తను......దుకుఁడున్ = శరీరమునుండి హెచ్చుగా పుట్టిన చెమటబిందువులు కలవాఁడును; ప్రస్ఫుటదోష్ఠపల్లవుఁడు = కదలుచున్న చిగురువంటి పెదవికలవాఁడు; చేతో......నయనుండు = మనస్సునకు బెదరు కల్గించు చలించు కనుపాపలతో తిరుగు కన్నులుకలవాఁడు; తపస్వికులగ్రామణి=మునిశ్రేష్ఠుఁడు-వాఘూలుఁడు; శమసారస్మేరుఁడు = శాంతరసముతోడి చిఱునవ్వు కలవాఁడు; చిచ్చు = అగ్ని; చంద్రుపొడవై=చంద్రునిరీతిని (చల్లని)దై; చెన్నొందుచందంబునన్ = ప్రకాశించురీతిని; అయ్యెన్. అలం. ఉపమ.

క. సప్రణయుఁడగుచు మునిలో, శప్రసరుం [1]డానరించెఁ గనికరమున స ద్విప్రకుమారుఁ; దృణాంచల, విప్రుషములుగావె! యపనివిబుధాగ్రహముల్.

టీక. సప్రణయుఁడు=ప్రీతితో కూడుకొన్నవాడు; అపని...బుధాగ్రహముల్ = బ్రాహ్మణుల కోపములు; తృణాంచలవిప్రుషములు = గడ్డిపోచలచివరి నీటిబిందువులు.

ఉ. ఆ వసుధామరప్రభవు నమ్ముని యిట్లను 'వత్స! నిన్ను నా భావపథంబునన్ నిను [2]నపాపునిగాఁ గను[3]గొంటి; నాగ్రహ [4]వ్యావృతచిత్తవృత్తి నిటు లాడితి మీఁద దరయంగ లేక; నా [5]యా వచనంబుదప్ప [6]దనఘుం బెద మూర్ఖత నన్ను మోచుటన్. 259

టీక. ఆ, వసుధామరప్రభవున్ = ఆ బ్రాహ్మణపుత్రునిఁగూర్చి; నాభావపథంబునన్ = నా మనోమార్గమున; అగ్రహ......వృత్తిన్ = కోపమునకు లొంగిన మనోవ్యాపారమున; మీఁదు, అరయంగలేక = ముందు చూడక; ఇటులు, ఆడితిన్ = ఇట్లు పల్కితిని; అనయంబు = ఎల్లపుడును; ఎదన్ = మనస్సులో; నన్ను మూర్ఖత మోచుటన్ = నన్ను అజ్ఞానము పొందుటచేత; ఆ వచనంబు = ఆ శాప వాక్యము; తప్పదు.

చ. వగవకుమన్న! దైవగతి వచ్చిన కీడు దలంచి నెమ్మదిన్ బొగులకుమన్న! కర్మములపోకకు భోగమె హేతువన్న! వి శ్వగురుఁ [7]గరీంద్రవత్సలు దివానిశముల్ దలపోయుమన్న! మే లగు హరిభక్తియుక్తులకు నాపద రాదుగదన్న యొన్నఁడున్. 260

1. చ. దుదరించె. 2. చ. పాత్రుని. 3. చ. దొంటి. 4. చ. వ్యావిల. 5. చ. యా. 6. ఛ. దనిఘుకెడ. 7. క. గిరీంద్రు.

టీక. వగవకుము = విచారింపకుము; దైవగతిన్ = దైవవశమున; పొగులకుము = తపింపకుము; పోకకున్ = పోవుటకు - నశించుటకు; భోగమె = అనుభవించుటయే; హేతువు = కారణము; విశ్వగురున్ = లోకగురువును; కరీంద్రవత్సలున్ = గజేంద్రునిపై వాత్సల్యము కలవానిని; దివానిశమున్ = రాత్రింబగళ్లు; తలపోయుము = ధ్యానింపుము. మేలు, అగున్ = శుభము కలుగును.

సీ. జలధరంబన నెద్ది? [1]పొలపంబు పుట్టించు నిల్లాలి మెఱుఁగుల వెుల్లములకు
మున్నీరనఁగ నెద్ది? మొలచుట కావాల మాణిపూసలువోని యాత్మజులకు
నీడ మ్రాఁకన నెద్ది? నిలువ నీడై తోఁచు నాఁకట[2]నుండు ద్విజావళులకు
†దాఁపన నెద్ది? యాధార*మౌ దివిఁ బ్రాకు పితృదేవతలకుఁ గుంటు[3]పిచ్చుకలకు

తే. నట్టి గృహమేధిధర్మంబునందు నీవు,కుత్ససేయుట నీరీతి [4]గొఁదవయొదవె
[5]నొప్పునది యొప్పదనిపల్కు నుద్ధతులకుఁ, గసరి పైవచ్చు జాళ్లపై గాలియైన.

టీక. ఇల్లాలి......ములకున్ = భార్యయొక్క తళుకు లను మెఱుపుల మొత్తమునకు; జలధరంబు, అనన్ = మేఘమనునది; ఎద్ది = ఏ గృహస్థత; పొలపంబు, పుట్టించున్ = ప్రకాశమును కలుగఁజేయునో; [ఇట 'పొలపము = వ్యాపనము; మొల్లములకున్ = ధనములకు' అను పూర్వటీక అననుగతము.] అణిపూసలువోని యాత్మజులకున్ = అణిముత్తెములవంటి కొడుకులకు; మున్నీరు, అనఁగన్ = సముద్రమనునది; ఎద్ది = ఏ గార్హస్థ్యము; మొలచుటకున్ = పుట్టుటకు; ఆవాలము = పాదు; [అగుచున్నదో] ద్విజావళులకున్ = పక్షులగుంపునకు, బ్రాహ్మణబృందమునకు; నీడమ్రాను, అనన్, ఎద్ది, నిలువనీడై; తోఁచున్ = కనఁబడునో; దివిఁబ్రాకు = ఆకాశమున కెగురు, స్వర్గమున కెక్కు; పితృదేవతలకున్ = మరణించిన వంశజులకు; కుంటుపిచ్చుకలకున్ =కుంటుచున్నపిచ్చుకలకును, కుంటివారికి; దాఁపు, అనన్ = మెట్టనునది; ఎద్ది = ఏ గృహస్థధర్మము; ఆధారము, ఔనో = అగుచున్నదో; అట్టి; గృహమేధిధర్మంబునందున్ =గృహస్థధర్మమునుగూర్చి; కుత్ససేయుటన్ =నిందించుటవలన; కొదవ= హీనత-అవమానము; ఒదవెన్ = కలిగెను; ఒప్పునది = ధర్మమగుదానిని; ఉద్ధతులకున్ = దురహంకారులకు; కసరి = విజృంభించి - హెచ్చి. జాళ్లపై గాలియైన (?) పైవచ్చున్.

క. ఏనింతవాఁడ[6] నేనయి, పూనుదునఁట[7] యెద్దిగాకపోయెడు? నని [8]సుం
తైనఫలమందఁదీరదు, మానవుల[9]కకాదు వినుమమర్త్యులకైనన్. 262

టీక. ఏను, ఇంతవాఁడను = నేను ఇంతగొప్పవాఁడను; ఏనయి = నాయంతట నేనయి; ఎద్ది కాకపోయెడున్ = నా అనుకొనునది ఏది జరుగదు? అని = అనుకొని; సుంతైనన్ = కొంచెమైనను; అమర్త్యులకైనన్ =దేవతలకుఁగూడ; ఫలము, అందన్, తీరదు=ఫలమును పొందుటకు సాధ్యము కాదు.

సీ. మును లనుష్టుభమునఁ దనుఁగొల్వఁదగువానిఁ బ్రహ్లాదుఁ బ్రోవఁ బొల్పడినవాని
ద్వాత్రింశదురుభుజాస్తంబాఢ్యుఁ డగువాని నశ్వత్థమూర్తియై యలరువానిఁ
[10]జక్రంబుచే క్షేత్రజనముఁ బ్రోచెడువాని వివిధాయుధంబుల వెలయువాని
నలఘుదివ్యాకల్పములఁ జూడఁగలవాని భీమరథ్యాపగాసీమవాని

ఆ. వివిధకథలవాని వివిధరూపంబుల, వాని నిలిచి కొలుచు[11]వారివాని
శ్రీనృసింహదేవు సేవింపు ఘేకంబ, వై తదంఘ్రిమూల మధివసించి. 263

టీక. అనుష్టుభమునన్ = అనుష్టుభమను ఛందస్సుతో - (పాదమునకు 8 అక్షరములు గల ఛందస్సుతో); ద్వాత్రింశ...ఢ్యుఁడు=స్తంభములవలె గొప్పవగు ముప్పదిరెండుబాహువులు (శాఖలు)

1. చ. యొలపం. 2. చ. నొందు. †శ. ర. దాపన * శ. రమా. 3. చ. పిచ్చి. 4. క.గొదవ. చ. గొదవ. 5. క. నొప్పుగతి నొప్పుగనఁగల్ల.. చ. నొప్పునదియొప్పదనిపల్కు. 6. చ. యేనయి. 7. చ. యద్ది. 8. చ. కుం. 9. చ. క. క. కు. 10. క. చక్రంబు. 11. క. వాని. చ. వారి.

కలవానిని; అశ్వత్థమూర్తియై = రావివృక్షపుటాకారము కలవాఁడై; అలఘు.....ములన్ = ఎక్కు వైన దేవకల్పములగు కాలములను; భీమ.....వానిన్ = భీమరథీనదీస్థలమున ఉన్నవానిని; నిలిచి = శ్రద్ధపూని; కొలుచువారివానిన్ = సేవించువారి స్వాధీనమగువానిని; భేకంబవై = కప్పవై; తదంఘ్రి మూలము, అధివసించి = అతనిపాదములకడ నివసించి - సేవింపుము. అలం. పరికరము.

తే. దర్దురాంగనయందు సంతానసిద్ధి, నీకు నగుఁ గొంత కాలంబు నిర్గమింప
దాన నీదుపితౄణంబు తలఁ[1]గి శాప, మోక్షసంప్రాప్తియును గల్గు నాక్షణంబ.' 264

టీక. దర్దురాంగనయందున్ = ఆఁడుకప్పయందు; నిర్గమింపన్ = గడవఁగా; పితౄణంబు = పితృదేవతలబుుణము; తలఁగి = తీరి; [సంతానముకలుగుటచే ననుట.] శాపమోక్షసంప్రాప్తియున్ = శాపముయొక్క విడుదలను పొందుటయు.

వ. అని యివ్విధంబున వాధూలుండు శాపావధి నొడివి యవ్వాటువు నాశ్వాసించి విశ్వాద్భుతజనకంబుగ నంబురుహప్రియమండలంబు భేదించికొనుచుం జని యప వర్గసామ్రాజ్యసింహాసనాసీనుండయ్యె నిచ్చట వియచ్చరధేనువు నేలినవానిపని సఫలంబుచేసి ఫలోదయంబు నలంకరించె. ప్రయుతసుతుండును విఫలప్రయ త్నుండై యయత్నసంప్రాప్తంబగు నిజవ్యసనంబున నుసురుసురయ్యును సాయం సమయకుముదంబుచందంబునఁ గొంతకొంత తచ్ఛాంతివచనంబుల వడ[2]దేఱిన వాఁడై జగత్త్రయపవిత్రీకరణ[3]ప్రవణంబగు పాండురంగక్షేత్రంబునకుఁ జని. 265

టీక. శాపావధి = శాపాంతమును; నొడివి = తెలిపి; ఆశ్వాసించి = ఊరడించి; విశ్వా... ...కంబుగన్ = లోకమున కాశ్చర్యము కలుగునట్లు; అంబురుహప్రియమండలంబు = సూర్యమండల మును; [మోక్షము పొందువారు సూర్యమండలమును భేదించుకొని, పోవుదురని శ్రుతి.] అపవర్గ... ...నాసీనుండు = మోక్షసామ్రాజ్యసింహాసనముపై కూర్చున్నవాఁడు - ముక్తుఁడు; వియచ్చరధేను వున్ = కామధేనువుకూడ; ఏలినవానిపని = ప్రభుకార్యమును; ఫలోదయంబును = ఫలప్రాప్తిని, స్వర్గమును; అలంకరించెను = పొందెను. అయత్నసంప్రాప్తంబు = ప్రయత్నములేక ప్రాప్తించినది - అనుకొనకుండ వచ్చినది; నిజవ్యసనంబునన్ = ఆపదవలన; అసురుసురయ్యును = బడలియున్నను; సాయం.....చందంబునన్ = సాయంకాలమందలి కలువపూవువలె; వడదేఱినవాఁడై = తెప్పఱిలిన వాఁడై; జగత్త్రయ.....ప్రణవంబు = ముల్లోకములను పవిత్రములుగా చేయుటకు సమర్థమైనది.

క. భీమరథిఁ దొట్టి తీర్థ, స్తోమంబుల నెల్లఁ దనువుఁ దోఁగించి ముని
గ్రామణి కుహనాభీరశి, ఖామణిమణి సౌధరాజగర్భాగతుఁడై. 266

టీక. తొట్టి = మొదలుకొని; తనువున్ = దేహమును; తోఁగించి = ముంచి; మునిగ్రామణి = ఉత్తమముని యగు అయుతుఁడు; కుహనా.....గతుఁడై = కపట గోపకశ్రేష్ఠుఁడగు కృష్ణుని మణి మయదేవాలయము లోపలికి వచ్చినవాఁడయి.

సీ. సురతరుప్రసవరించ్ఛోళి[4]వశాళివినీల జలదంబులోని [5]క్రొందళుకు లెసఁగ[మెఱవఁ
మొగము వెన్నెలయేటి [6]మొగఁదేలుమగమీలగతిఁ [7]బక్ష్మలాక్షియుగ్మకము
గఱియ నెమ్మేను చీఁకటిమ్రాఁకుఁ బ్రాఁకు బంగరుతీగక్రియఁ దూలఁగద్రుశాటి
యుడుపథంబున [8]జాఱు [9]నుడురత్నతతిభాతి మెడహారముల పెన పుడమిఁదాఁక

1. చ. గ. 2. చ. దీఱి. 3. క. లోలేదు. చ. లోఉన్నది. 4. చ. చూళి. 5. చ. క్రొత్తళు. 6. క. మొగలేటిమగమీల చ. మొగిదేలుమొగజాల. 7. క. పక్ష్మ. 8. చ. మీఱు. 9. క. నురు.చ. నుడు

తే. నచ్చరలు వీవనలు వీవ నంగరాగ
వాసనలు భూషణార్పు[1]లు నేసరేఁగ
బిఱిఁది దెసనున్న రమమీఁదఁ [2]నొఱఁగి ధవళ
చలదళచ్ఛాయ నుండు నిట్టులు నుతించు. 267

టీక. సుర......దళుకులు - సురతరుప్రసవరింఛోళి = కల్పవృక్షపుష్పసమూహముగల; (పూలచే అలంకరింపఁబడిన); మౌళి = శిరస్సనెడు; వినీలజలదంబులోని = కాఱుమబ్బులోని; క్రొందళుకులు = క్రొత్తకాంతులు ఎసఁగన్ = వ్యాపింపఁగా; మొగము......గతిన్ - మొగము వెన్నెలయేటి మొగ = ముఖమును వెన్నెలయేటిద్వారమున; తేలు = తేలునట్టి; మగమీలగతిన్ = మగచేఁపలవిధమున; పక్ష్మలాక్షియుగ్మకము = రెప్పలపాటు గల రెండు కన్నులును; మెఱవన్ = ప్రకాశింపఁగా; కటియ......మాఁకున్ = నల్లనిశరీరమను తమాలవృక్షమునకు; కద్రుశాటి = పీతాంబరము; తూలన్ = చలింపఁగా. ఉడుపథంబునన్ = ఆకాశమునుండి; ఉడురత్నతతిభాతిన్ = గొప్పచుక్కల గుంపువలె; మెడహారముల పెన = మెడలోని హారముల మెలిక; తాఁకన్ = అంటఁగా; అచ్చరలు = అప్సరసలు; వీవనలు = చామరములు; అంగరాగవాసనలు = మైపూఁతలపరిమళములు; భూషణార్పులున్ = నగలతళుకులును; ఏసరేఁగన్ = విజృంభింపఁగా; పిఱిఁదిదెసన్ = వెనుకభాగమున; ధవళ......చ్ఛాయన్ = తెల్లని రావిచెట్టునీడను. [పూర్వటీకలో 'వెన్నెలయేటిమొగరేటి' అను పాఠము ననుసరించి 'మొగరేటి=ముఖర యను నదిదుందలి' అను నర్థము వ్రాయఁబడినది.] అలం. ఉపమ, రూపకము.

ఉ. ఫాలము [3]చుక్క వంకనెలపై వెలుఁగొందెడు లోహితాంగునిన్
బోలఁగఁ గంబు[4]గర్భమునఁ బొల్పగు నీలములీలఁ గంధరా
కాళిమ యుల్లసిల్ల విధుఖండము కెంజడకెంపుఁదమ్మిలో
బాలమరాళమట్లలర భాసిలు శూలి, లలాటపట్టికన్. 268

టీక. ఫాలముచుక్క = నొసటిబొట్టు; వంకనెలపైన్ = నెలవంకపయి; లోహితాంగునిన్ = అంగారకుని; పోలఁగన్ = సరిపోలఁగా; కంధరాకాళిమ = మెడపైనున్న నలుపు; కంబుగర్భమునన్ = శంఖములో; పొల్పగు = ప్రకాశించు; నీలములీలన్ = ఇంద్రనీలమువలె; ఉల్లసిల్లన్ = ప్రకాశింపఁగా; విధుఖండము = అర్ధచంద్రుఁడు; కెంజడకెంపుఁదమ్మిలోన్ = ఎఱ్ఱనిజడ యను నెఱ్ఱతామర పూవుపయి; బాలమరాళమట్లు = పిల్లహంసవలె; భాసిలు, శూలి = ప్రకాశించునట్టి శివుఁడు; లలాటపట్టికన్ = నొసటియందును. [ముందు సమన్వయము.] అలం. ఉపమ.

మ. నలినాస న్నలినాసనాననపురాణస్థానముల్ డాయ[5]కి
ష్ముల బల్[6]మాయలబోరుతల్పు లధరంబుల్ గెంపువాచూరులున్
గల విద్వద్వదనాంతరాళనవరంగక్షోణి రాణించు ను
జ్జ్వలవజ్రప్రజశంఖసంఘనిభ భాషాయోష జిహ్వాస్థలిన్. 269

టీక. నలిన్ = తగునట్లును; ఆసన్ = ఆశతోను; నళినాసనాననపురాణస్థానముల్ = కమలాసనుఁడగు బ్రహ్మయొక్క ముఖములను ప్రాఁతచోటులను; డాయక = సమీపింపక; ఇష్ములన్ = ప్రీతితో; బోరుతల్పులు = పెద్దతల్పులు, నాలుకలు; అధరంబుల్ = క్రిందివి పెదవులు; కెంపువాచూరులున్ = కెంపులుతాపిన ముంజూరులును (ఎఱ్ఱని మీఁదిపెదవులు); విద్వ......క్షోణిన్ = విద్వాంసుల నోళ్ల లోపలిభాగములను సౌధభాగములందు; రాణించు = ప్రకాశించునట్టి; ఉజ్జ్వల...

1. క. లనేసలెసఁగ బఱిది చ. లునేసరేగ పరిది 2. చ. నురిసి. 3. చ. ప్రక్కనిల. 4. చ. గర్ధ. 5. చ. కి. 6. చ. ల్మాయ. క. ల్పాయ.

నిభ = ప్రకాశించు రవలవలెను, శంఖములసమూహామువలెను ఉండునది; భాషాయోష = సరస్వతి; జిహ్వాస్థలిన్ = నాలుకపైని; [విష్ణుజిహ్వపై సరస్వతి యున్నదనుట] అలం. రూపకము.

సీ. లలితకుంతలశైవలము ముఖైందవబింబ మధురాధరప్రవాళాంకురంబు
చలనస్వభావలోచనమహామీనంబు కమనీయకంధరాకంబుకంబు
గర్వితస్తనకనత్పర్వతాభోగంబు విశదత్రివళిభంగవిలసనంబు
[1]మధ్యవృత్తావర్తమహితంబు కటితటీద్వీపంబు పృథులోరుదివిజకరటి

తే. కరము పదకూర్మపృథుకంబు గ్రమ్మ నఖరమణికలాపంబు నగుచు నేమగువరూపు
భూరిసౌభాగ్యసంపదఁ బోలుఁ దండ్రి, నా సుధాంభోధిపుత్రి బాహాంతరమున.

టీక. ఇందు లక్ష్మీదేవి సౌభాగ్యసంపదచే తన తండ్రియగు సముద్రుని పోలుచున్నదని వివరింపఁబడినది. లలితకుంతలశైవలము = (లక్ష్మీరూపు) పాచివంటి చక్కని వెండ్రుకలుకలది, (స. రూపు) కుంతలములవంటి పాచికలది; ముఖైందవబింబము = (ల) చంద్రబింబమువంటి ముఖము కలది, (స) ముఖమగు చంద్రబింబము కలది; మధు......రంబు = (ల) పగడపుమొలకవంటి తియ్యని పెదవికలది, (స) మధురాధరమువంటి పగడపుమొలక కలది; చపల......మీనంబు = (ల) పెద్దచేఁపలవంటి చలించు కన్నులు కలది, (స) చలించులోచనములవంటి పెద్ద చేఁపలు కలది; కమ......కంబు = (ల) శంఖమువంటి చక్కని మెడకలది, (స) చక్కనిమెడవంటి శంఖముకలది; గర్విత......భోగంబు = (ల) పర్వములఁబోలు పొగరుచన్నులు కలది, (స) గబ్బిగుబ్బలవలె ప్రకాశించు పర్వతముల పరిపూర్ణత కలది; విశద......విలసనంబు=(ల) అలలవంటి వళుల విలాసము కలది, (స)స్పష్టమైన త్రివళుల వలెనుండు అలలవిలాసము కలది; మధ్య......మహితంబు = (ల) సుడివంటి నాభి కలది; (స) బొడ్డువంటి సుడిగలది; ['మధ్యవృంత = బొడ్డనెడి' అని పూర్వటీక. అది మధ్యవృత్తముకాని మధ్యవృంతముకాదు] కటితటీద్వీపంబు = (ల) ద్వీపములవంటి పిఱుదులు కలది; (స) పిరుదులవంటి ద్వీపములుకలది; పృథులోరు దివిజకరటికరము = (ల) ఐరావతముతొండమువంటి గొప్పతొడలు కలది; (స) పెద్దతొడవంటి ఐరావతము హస్తముకలది; పదకూర్మపృథుకంబు = (ల) తాఁబేటిపిల్లవంటి పాదములు కలది, (స) పాదములఁబోలు తాఁబేటిపిల్లలుకలది; నఖరమణికలాపంబున్ = (ల) మణులగుంపులవంటి గోళ్లు కలది, (స) నఖములవంటి మణులగుంపుకలదియు; ఏ మగువరూపు = ఏ లక్ష్మీదేవిస్వరూపము; తండ్రిన్; పోలున్ =పోలియుండునో; ఆ సుధాంబోధిపుత్రి = పాలసముద్రపుపట్టి యగు నా లక్ష్మీదేవి; బాహాంతరమునన్ = ఱొమ్మువైని; [ముందున కన్వయము. లక్ష్మి విష్ణునిఱొమ్ముపైనున్న దనుట.] అలం. ఉపమ. ఉదాత్తము.

మ. సితకీరస్ఫటికాక్షమాలికలు కెంజేదోయి సంధించి భా
రతి వామాంకతలంబునన్ సతతమున్ రంజిల్లఁ గల్లోలసం
గతహంసోత్తమఫేనపంక్తి యగు గంగావాహినిం దాల్చు దై
వతశైలంబునఁ దేజరిల్లు నల విశ్వస్రష్ట నాభిం దగన్. 271

టీక. కెంజేదోయిన్ = ఎఱ్ఱనైన (అందమైన) రెండుచేతులందును; సితకీర, స్ఫటికాక్షమాలికల్ = తెల్లచిలుకను, జపమాలికను (క్రమముగా); సంధించి = కూర్చి; భారతి = సరస్వతీదేవి; వామాంకతలంబునన్ = ఎడమవైపున; రంజిల్లన్ = ప్రకాశింపఁగా; కల్లోల...పంక్తి = అలలయందు లగ్నమైన ఉత్తమహంసయు, నురుగును కలది; గంగావాహినిన్ = గంగానదిని; దైవశైలంబు = కైలాసము; తేజరిల్లు = ప్రకాశించునట్టి; విశ్వస్రష్ట = బ్రహ్మ, [ఇచట బ్రహ్మ శైలముతోను, సరస్వతి

1. క. మధ్యవృంతావర్త. చ. మధ్యవృత్తావర్త.

గంగతోను, తెల్లచిలుక హంసతోను, జపమాల నురుగుగుంపుతోను పోల్పఁబడినవని యెఱుఁగవలెను.]
అలం. ఉపమ.

తే. రత్నసందర్భగర్భ యీ రత్నగర్భ
చరణపీఠంబుగా నున్న సకలభువన
మయుని నినుఁ గంటి దేవ! నాభయము లుడిగె
నని తపసి ప్రీతిఁ గంసాభియాతిఁ బొగడి. 272

టీక. రత్నసందర్భగర్భ = రత్నముల సమూహము గర్భమున గలదైన; ఈ, రత్నగర్భ = ఈ భూమి; చరణపీఠంబుగాన్ = పాదపీఠముగాను; ఉడిగెన్ = నశించెను; తపసి = ముని - తపోయుతుఁడు; కంసాభియాతిన్ = కంసశత్రువగు శ్రీకృష్ణుని.

క. అంటఁ జని వటువుత్తరదిక్తటమునఁ గనుఁగొనియెఁ దరళతరతపమూర్తిన్
బటునఖరశైత్యమున న్నారట ముడిపి సురారి నేలు రసికు నృసింహున్. 273

టీక. వటువు = బ్రహ్మచారి; ఉత్తరదిక్తటమునన్ = ఉత్తరదిగ్భాగమున; దరళతరతపమూర్తిన్ = ప్రకాశించు వృక్షస్వరూపముకలవానిని; పటునఖరశైత్యమునన్ = వాడిగోళ్ళతీక్ష్ణతచేత ["నఖరశైత్యమునన్ = గోటిచల్లదనముచేత" అని పూర్వటీక.] ఆరటమున్ = కష్టమును; ఉడిపి = పోనడచి; సురారిన్ = రాక్షసుని - ప్రహ్లాదుని; రసికున్ = కరుణారసపూర్ణుని; నృసింహున్; [నృసింహుఁ డచట రావిచెట్టు రూపమున నున్నాఁడని గ్రహింపనగును.]

క. శాశ్వతకరుణాంబుధి నవ్విశ్వవిభుం గనుటఁ గోలె విప్రుని మది మా
నీశ్వరశాపవికార మ,[1]నశ్వరదుశ్చేష్టితాభినయ మొనరింపన్. 274

టీక. శాశ్వతకరుణాంబుధిన్ = స్థిరముగ ఉండు దయాసముద్రుఁడగువానిని; కనుటఁగోలెన్ = చూచినది మొదలుకొని; విప్రునిమదిన్ = అయుతుని మనస్సునందు; మానీశ్వర శాపవికారము = వాధూలమునిశాపమువలనఁగల్గు వికారము; అనశ్వరదుశ్చేష్టితాభినయము = స్థిరమగు చెడ్డచేష్టలను జరుపుటను; ఒనరింపన్ = చేయఁగా.

శా. నీరప్రాంగణకర్కటీబిలములన్ నిద్రింప మృత్స్నామయా
హారంబుల్ గబళింపఁ బెల్లఱవ నిట్టట్టుం బ్లుతంబుల్ గొనన్
దూరాయాస్యదహీంద్రభీతిహతి గొందుల్ దూఱఁగోరున్ మదిన్
సారాపేతమనోబలం బగు భవిష్యద్భేక ముత్సేకమై. 275

టీక. సారాపేతమనోబలంబు = సారము తొలగిపోయిన మనోబలము కలది - ధైర్యము లేనిది; అగు; భవిష్యద్భేకము = కప్పగా మాఱఁబోవు నయుతుఁడు; ఉత్సేకమై = అతిశయించినదై; నీర......బిలములన్ = నీటియొడ్డుననుండు ఎండ్రికన్నములందు; నిద్రింపన్ = పండుకొనుటకును; మృత్స్నామయాహారంబున్ = మట్టిసంబంధమగు నాహారమును; పెల్లు, అఱవన్ = గట్టిగా అఱచుట కును; ప్లుతంబుల్, గొనన్ = దాట్లు వేయుటకును; దూరా......హతిన్ = దూరమునుండి వచ్చుచున్న పాములభయముపాటున; గొందుల్ = సందులను; దూఱన్; మదిన్ = మనస్సులో; కోరున్.

క. ఈ వడువున శాపవ్యాప, నావేశము గదిరియును మహాధైర్యముతో
నా విప్రుఁడు సుప్రతిభా,దేవేజ్యుఁడు ప్రస్తుతించు దితిసుతశత్రున్. 276

1. క. నీశ్వర. చ. నశ్వర.

టీక. ఈవడువునన్ = ఈరీతిని; శాప......వేశము = శాపకష్టము పూనుట; కదిరియును = కలిగినను; సుప్రతిభాదేవేజ్యుఁడు = గొప్పబుద్ధిచేత బృహస్పతి యగువాఁడు - అయుతుఁడు; దివిసత్శత్రున్ = రాక్షసులకు శత్రువగు విష్ణుదేవుని; ప్రస్తుతించున్.

ఉ. ఆ సభ నుక్కుఁగంబమున నా క్రియ నుద్భవమంది యాసురా
గ్రేసరహృద్విదారణము కించిదుదంచితహాసకృత్యమున్
గా సమకట్టియున్ బెనుపఁగాఁ గతమేమి పునర్భవస్పృహన్
నీ నట లెవ్వ రేఁ దెలియనేర్తురె ? మర్త్యమృగాధినాయకా ! 277

టీక. అక్రియన్ = అరీతిని; ఉద్భవమంది = పుట్టి; ఆ, సురా......దారణము = ఆ రాక్షసరాజగు హిరణ్యకశిపుని గుండెలు చీల్చుట; ['హృద్విదారణము = గుండెలు పగుల్చుట' అని పూర్వటీక.] కించి......కృత్యముంగాన్ = చిన్న చిఱునవ్వుతోఁ జేయు పనియగునట్లుగా; సమకట్టియున్ = ఏర్పఱచియు; పునర్భవస్పృహన్ = గోళ్లయందలి కోరికను [వానిని చంపుటకు గట్టిగోళ్లు గల మృగరాజురూపమును గ్రహించుటయందలికోరికనుట], సంసారమునందలి కోరికను [మరల కృష్ణరూపమున జన్మించుకోరికనుట]; నీనటలు = నీజాలు, నీమాయలు; ఎవ్వరేన్ = ఎవ్వరయినను; మర్త్యమృగాధినాయకా ; = నరసింహప్రభూ !

ఉ. మిక్కుటమైన వాఁడి[1]పవిమిత్రములై వెలుగొందు నీ నఖా
గ్రమ్ములకున్ మృదుప్రకృతిగల్గుట క్రొత్త రమాకుచాద్రిపా
ర్శ్వమ్ముల[2]యందు; నందుఁగలసారగతుల్ నఖరాభిపాతసా
ధ్యమ్ములు[3]గామిఁ గావలయు నట్లగుటల్ దితిపుత్త్రశాత్రవా ! 278

టీక. మిక్కుటమైన = అధికమైన; వాడిపవిమిత్రములై = వాఁడియైన వజ్రాయుధమునకు సమానములై ; నీ, నఖాగ్రమ్ములకున్ = నీకొనగోళ్లకు; రమా......లయందున్ = లక్ష్మీదేవి గబ్బిగుబ్బల ప్రక్కలందు; మృదుప్రకృతి = మెత్తఁదనము; క్రొత్త = వింత; దితిపుత్త్రశాత్రవా ! = రాక్షసులకు శత్రువవగు ప్రభూ ! అట్లగుటల్ = ఆ నీ వాఁడిగోళ్లు మెత్తనివగుటలు; అందున్ = ఆ కుచపార్శ్వప్రదేశమున; సారగతుల్ = బలపద్ధతులు; నఖరా......ధ్యమ్ములు = గోళ్లనొక్కులకు సాధ్యమగునవి; కామిన్ = కాకపోవుటచే; కావలయున్ = అయి యుండును. ఇందు లక్ష్మీదేవి స్తనకాఠిన్యము తెల్పఁబడినది. అలం. ఆక్షేపము.

ఉ. కోపవికారమంచు నొకకొందఱు, కొందఱు భక్తలోకర
క్షాపరతంత్రతాజనితసాంద్రకృపాగుణమంచుఁ గొంద ఱు
ద్దీపితవీరసింహవిహృతి స్ఫుటఖేటవికారమంచు నీ
చూపుల[4]రక్తిమం బొగడుచున్ నుతియింపుదు రీశ్వరేశ్వరా ! 279

టీక. ఈశ్వరేశ్వరా ! = దేవతలకు దేవతయైనవాఁడా ! నీచూపులరక్తిమన్ = నీ కన్నులలోని ఎఱుపును; భక్త......గుణము - భక్తలోకరక్షాపరతంత్రతా=భక్తులసమూహమును రక్షించుటయందలి యాసక్తిచే; జనిత = పుట్టింపఁబడిన - కలిగిన; సాంద్రకృపాగుణము = ఎక్కువైన దయ; ఉద్దీపిత......వికారము - ఉద్దీపిత = మిక్కిలి ప్రకాశించు; వీరసింధువిహృతి = వీరుల సముద్రము (సమూహము) నందు విహరించుటచే; స్ఫుట = స్పష్టమైన; ఖేటవికారము = డాలువాఱుయొక్క (వాఱు = సన్ననితోలు) మాఱురూపుకలది; అలం. ఉల్లేఖము.

1. చ. బలి. 2. చ. నుండు. 3. శ. ర. గామ. 4. చ. రక్తినిం.

చ. హరికిరి దంష్ట్ర నాటువడి యైందవరేఖ[1]దలిర్చు పూర్వభూ
ధరశిఖరం బనంగ నుతిదాల్చు కుచంబునఁ బొల్చు భూసతిన్
బరిహసనం బొనర్చు రమభావము సిగ్గున [2]మ్రొగ్గఁజేయవే
నరమృగరాజ! నీ నఖము నాఁటినఁ [3]బొల్చు నురోజకుంభముల్. 279

టీక. హరికిరిదంష్ట్రన్ = వరాహావతారమూర్తి కోఱచే; నాటువడి = గ్రుచ్చుకొనఁబడి; ఐందవరేఖన్ = చంద్రరేఖచే; తలిర్చు = ప్రకాశించునట్టి; పూర్వభూధరశిఖరంబు, అనంగన్ = తూర్పుకొండకొనయో అనునట్లు; నుతిన్, దాల్చు = పేరుపడిన; కుచంబునన్ = స్తనముచే, భూసతిన్ = భూదేవిని; పరిహసనంబు, ఒనర్చు = ఎగతాళి చేయునట్టి; రమభావమున్ = లక్ష్మీదేవియాశయమును; సిగ్గునన్ = సిగ్గుతో; మ్రొగ్గఁజేయవే? = ఎక్కువగునట్లు చేయవా? - లక్ష్మికి ఎక్కువ సిగ్గుకల్గఁజేయవా? [ఆమె రెండుస్తనములనుగూడ నఖక్షతముల నలంకరించి-ఆమె సిగ్గుపడునట్లు చేయుదువనుట.] నరమృగరాజ! = నరసింహా! పొల్చున్ = ఒప్పును - ప్రకాశించును. అలం. ఉత్ప్రేక్ష.

సీ. పరిపూర్ణచంద్రబింబము [4]నడుచక్కిలోఁ గొనసాగు విద్రుమాంకుర మనంగఁ
[5]గన్నె రేఁగి తేకు కత్తుల[6]బోనిలోఁ జిక్కిన[7]యౌర్వాగ్నిశిఖ యనంగ
వెండికంబములతో వియ్యంపుఁబొత్తెత్తు యమునాతరంగసంఘము లనంగఁ
బ్రాలేయగిరివెన్కభాగంబువహియించు పవనపారణకులప్రభు వనంగ

తే. మొగమునకు బిగి గావించు మిగులుఁగన్ను
దంష్ట్రికాంతరజిహ్వయుఁ దఱచుఁ గేల
నలుఁగులుఁ [8]బిఱుందవాలమ్ము గలుగు నిన్ను
గొలుతు దితిపుత్త్రచేతఃకుకూలదహన! 281

టీక. పరి.....చక్కిలోన్ = నిండుచంద్రునినడిమిభాగమున; కొనసాగు = ప్రకాశించు; విద్రుమాంకురము, అనఁగన్ = పగడపుమొలకయో అనునట్లు; [మొగమునకు బిగి కావించు మిగులుఁగన్ను (ఎక్కువకన్ను) ప్రకాశించునని ఎత్తుగీతితో సమన్వయము.] కన్నె .....బోనిలోన్ = లేఁత మొగలిరేకుల బోనిలోపల; ఔర్వాగ్నిశిఖ = బాడబాగ్ని; [కోఱలనడుమనున్న నాలుక ప్రకాశించుచున్నదని భావము. [కోఱలు కత్తులబోనితోను, నాలుక బడబాగ్నితోను పోల్పఁబడినవి.] కంబములతోన్ = స్తంభములతో; వియ్యంపుఁబొత్తు, ఎత్తు = వియ్యమును పొందు - సరిసమానమైన, [చేతులు వెండికంబములవలెను, వానిలోని కత్తులు యమునాప్రవాహములవలెను ఉన్నవని పోలిక.] ప్రాలేయగిరి వెన్కభాగంబు = హిమాచలపువెనుకప్రక్క; పవన.....ప్రభువు, అనఁగన్ = పాములఱేఁడను నట్లుగా; [తెల్లనిదేహముపృష్ఠభాగమున తోఁకయున్నదనుట. హిమాలయ, దేహములకును, సర్పవాలములకును పోలిక.] దితి.....దహన! = రాక్షసులమనస్సులకు కుమ్ము (ఊముక) నిప్పు అయినవాఁడా! అలం. ఉత్ప్రేక్ష, క్రమము.

తే. అని నృహర్యక్షవర్యు నర్యమసహస్రదివ్యతేజఃప్రభావుఁ గీర్తించి యతఁడు
తత్పదద్వంద్వమునకు వందన మొనర్చి, తపసితిట్టునఁ బ్లవమయ్యెఁ దత్క్షణంబ.

టీక. నృహర్యక్షవర్యున్ = నరసింహమూర్తిని; అర్యమ.....ప్రభావున్ = వేయిమంది సూర్యుల తేజఃప్రభావము కలవానిని; కీర్తించి = కొనియాడి; అతఁడు(= కయుంటుఁడు); ప్లవము = కప్ప.

1. క. దలిర్చ. చ. దలిర్చు. 2. చ. మ్రొక్క. 3. చ. బొందదు. 4. క. నందు. చ. నడు. 5. క. కన్నె. 6. క. బోను. చ. బోని. 7. చ. యౌరా. 8. చ. బిఱిుంది.

క. ఆ శమము నా వివేకం, బా శుద్ధియు నాతపంబు లా బహునిగమ
ప్రాశస్త్యము నటులయ్యె మ్ము,నీశునకును; దైవఘటన లిట్టివి దలఁపన్. 283

టీక. శమమున్ = శాంతియును; బహునిగమప్రాశస్త్యము = వివిధాగమవిజ్ఞానమును.

ఆ. అస్మదాదిమానసావాలవలయప్ర,కాశభక్తియుక్తికల్పలతకు
మూల మనఁగ నొప్పు నా లోకవిభు నంఘ్రి,మూల మాశ్రయించి జాలిమాలి.

టీక. అస్మదాది......లతకున్ = మావంటివారిమనస్సులను పాదుయొక్క వలయమున ప్రకాశమగు భక్తితోడికూడిక యను కల్పవృక్షపుతీఁగకు; మూలము = వేరు; అంఘ్రిమూలము = పాదమూలమును; జాలిమాలి = దుఃఖమును విడిచి; (ముందున కన్వయము.) అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

ఉ. ముత్తియముల్ ప్రవాళదళముల్ గమనాకృతిఁ గూడినట్టులై
క్రొత్తగునౌర! వీని యపురూపపురూపిది యెంచు విస్మయో
దాత్తమనస్కులై సకలతైర్థికులున్ గొనియాడ భేకలో
కోత్తము మొప్పుఁ జిత్రవపురుజ్జ్వలమై జలజాసనోద్భవా! 285

టీక. ప్రవాళదళముల్ = పగడపు కమనాకృతి, గూడినట్టులై = అందమైన, రూపము దాల్చినట్లుండి; అపురూపపురూపు = ఎక్కడను లేని చక్కఁదనము; క్రొత్త, అగున్ = వింతగొల్పును; విస్మయోదాత్తమనస్కులై = ఆశ్చర్యముతోఁగూడిన గొప్ప మనస్సులు కలవారై; తైర్థికులున్ = యాత్రికులు; చిత్రవపురుజ్జ్వలమై = రంగురంగులదేహమున ప్రకాశించునదై; ఒప్పున్; జలజాసనోద్భవా! = నారదమునీ! అలం. ఉపమ.

సీ. కమలాప్తుఁ డుదయింపక యమున్నఁ [1]బుటుకున మునుఁగు సంగమతీర్థమునకు నేఁగి
విను సైకతనిమగ్నమునివేదనినదంబు తగుచోట నుండి లేఁబగటిదాఁక
మధ్యాహ్నవేళ [2]సంప్రాశించు బలిపీఠగతపులాకంబులు మితముగాఁగ
సందెప్రొద్దుననుండి నడురేయి[3]గడసన సమ్ముఖమ్మునఁ గొల్చి సంవ[4]సించు

తే. శ్రీనృసింహుండు పెనుఁబాపసెజ్జమేను, చేర్పఁ దద్దివ్యచరణరాజీవమూల
భూబిలంబున నధ్యాత్మపూర్ణబుద్ధి, జాగరము[5]సేయు శాలూరచక్రవర్తి 286

టీక. కమలాప్తుఁడు = సూర్యుఁడు; సైకత......నినదంబు = ఇసుకతిన్నెలపైఁగూర్చుండు మునుల వేదపారాయణస్వరమును; లేఁబగటిదాఁక = పండ్రెండుగంటలవఱకును; వినున్; బలి...... పులాకంబులు = బలిపీఠముపైనుండు మెతుకులు; ప్రాశించున్ = తినును; సందెప్రొద్దుననుండి=సూర్యాస్తమయము మొదలుకొని; నడురేయిగడసనన్ = అర్ధరాత్రిగడచువఱకు; సమ్ముఖమ్మునన్ = సన్నిధిని; కొల్చి = సేవించి; పెనుఁబాపసెజ్జన్ = శేషశయ్యపై; తద్దివ్య......బిలంబునన్ = అతని పాదపద్మముల క్రింది భూమిలోని రంధ్రమున; జాగరము సేయున్ = మేల్కొనియుండును; శాలూరచక్రవర్తి= కప్పలఱేఁడు.

ఆ. రత్నరంగవల్లిరచనకుఁ దనమేను, [6]పువ్వుగుత్తికరణి పొలుపు [7]నిలుప
నంబుచరము ప్రాతరారంభవేళల, నృహరి యగ్రవీథి నిలుచు ననఘ! 287

టీక. రత్న......రచనకున్ = రత్నముల ముగ్గుకూర్పునకు; పొలుపునిలుపన్ = శోభను కల్గింపఁగా; అంబుచరము=కప్ప; నృహరియగ్రవీథిన్ = నరసింహునెదుట; నిలుచును. అలం. ఉపమ.

1. చ. బటుకున. 2. చ. ప్రాపించు. 3. చ. గడచిన. 4. చ. శించు. 5. చ. సేసె. 6. చ. పూవు. 7. చ. గిలుప.

క. హరిదాస మనుచుఁ దనునెల్లరు పేరిడి పిలువఁగలిగి ప్లవపతి గడపెన్
జిరకాలము పూర్వజనన,చరితజ్ఞుం డగుచు మోక్షసౌఖ్యాపేక్షన్. 288

టీక. ప్లవపతి = కప్పఱేఁడు; పూర్వ ....చరితజ్ఞుండు=పూర్వజన్మవృత్తాంతము నెఱిఁగినది; మోక్షసౌఖ్యాపేక్షన్ = మోక్షసుఖమునందలికోరికతో; చిరకాలము; కడపెన్.

ఆ. ఇటులు కొన్ని[1]యేఁడు లేఁగంగ నొకనాఁడు, పౌండరీకనాథుపర్వమునకు
కన్యకుబ్జవిభుని కన్యాశిరోమణి, ప్రాణసఖులు గొల్వ నరుగుదెంచె. 289

టీక. పర్వమునకున్ = ఉత్సవమునకు.

తే. ఆత్మవాహనములనుండి [2]యవతరించి, నారసింహాఖ్యతీర్థంబునకుఁ గుఱఁగట
భ్రమిచెంగట విడిసిరి పద్మముఖులు, విరహిహృద్గాములగు మారుశరము లనఁగ.

టీక. ఆత్మవాహనములనుండి = తమతమ రథములనుండి; అవతరించి = దిగి; కుఱఁగటన్ = సమీపమున; విరహిహృద్గాములు = విరహులగువారి మనస్సులందు నాటినవి; సూనశరములు = పుష్పబాణములు; పద్మముఖులు = తామరపూలవంటి ముఖములు కల యువతులు; విడిసిరి = బసచేసిరి. అలం. ఉపమ.

తే. మార్గఖేదశిథిలమతు లంగనలు చొచ్చి, భీమరథిఁ గలంచు టేమి క్రొత్త?
వారి గోరువెచ్చనక్షోజములకాంతి, [3]లవమ ముజ్జగములఁ దవిలి కలఁప. 291

టీక. వారి...కాంతి = ఆ స్త్రీల నఖాపచ స్తనముల కొలఁది తేటుఁ; తవిలి = వ్యాపించి; కలఁపన్ = కలఁతపెట్టఁగా; మార్గ.....మతులు = దారిబడలికచే చెదరినబుద్ధులకలవారైన; అంగనలు = స్త్రీలు; చొచ్చి = ప్రవేశించి; కలఁచుట = కలఁతపఱచుట; ఏమిక్రొత్త? = ఏమి వింత!

సీ. గంధవాహమున [4]కాగారంబు లివి యంచు వీజనంబులఁ జూచి వెగటు[5]గదిరి
మరుబాణముల సహోదరవర్గ [6]మిది యంచు నలరు మొగ్గలఁ జూచి యలఁతనొంది
కమలారినామంబు గైకొన్న వివి యంచుఁ బుల్ల[7]తీఁగలఁ జూచి పుల్లసిల్లి [దఱిగి
శుకయుగంబులఁ దాము నొకచాయవివి యంచు నవశుకంబులఁ జూచి [8]నయము

తే. కన్యకుబ్జేశకన్యపైఁ గలుగు చెలువు
భావములపెంపు నొఱపులు మోవఁజేయ
బలిమి నిజధైర్యములు చిక్కఁబట్టియున్న
మును లొనర్పుదు [9]రొకరీతి ముఖ్యవిధులు. 292

టీక. గంధవాహమునకున్ = వాయువునకు; అగారంబులు = నివాసములు; వీజనంబులన్ = విసనకఱ్ఱలను; కదిరి = పొంది; మరు.....వర్గము = మన్మథునిబాణములగు పూవుల సోదరసమూహము; అలరుమొగ్గలన్ = పూవుమొగ్గలను; అలఁతన్, ఒంది = శ్రమపడి; కమలారినామంబున్ = చంద్రునిపేరు; పుల్లఁతీగలన్ = సోమలతలను [చంద్రునకు సోముఁడనియును పేరు కలదు.] పుల్లసిల్లి = వెలవెలఁబోయి; శుకయుగంబులు = చిలుకదంపతులు; ఒకచాయవి = ఒక్క రంగు గలవి; నవశుకంబులన్ = లేమావిచిగుళ్లను; నవముగఁ దఱిగి=మెత్తఁబడిపోయి - ధైర్యముసడలి; కలుగు చెలువు = కలుగు చక్కఁదనము; భావములన్ = మనస్సులందు; పెంపునొఱపులు ఎక్కువ = తాపము (బాధ)లను; మోవఁజేయన్ = కలిగింపఁగా; బలిమిన్ = బలముతో—(మిక్కిలికష్టమున); మునులు; ముఖ్యవిధులు=

1. యేండ్లు. 2. చ. యరుగుదెంచి. 3. చ. లవము. 4. క. కగా. చ. కాగా. 5. చ. గదిరి. క. గదరి. 6. చ. మది. 7. చ. క. ర. తీఁగలు. 8. క. నవముగదిరి. చ. నయము దఱిగె. 9. చ. రీక.

తమవిహితకృత్యములను; ఒనర్తురు = చేయుదురు. యోగులు వారివారి నిత్యకృత్యములకు గావలసిన నీజనాదులు వారిమనస్సులను తపింపఁజేయు పనులకు కారణములగుటచే మిక్కిలి కష్టముపయి ఆ యా వికారములకు లొంగక మనస్సులను చిక్కఁబట్టి తపస్సొనర్చుచున్నారని భావము.

తే. వనజనాభుని యభిషేకమునకె[1]కాని, కనకగర్భాదులకు [2]వాడుకొనఁగరాని
తీర్థకుండాంబునికరంబు తెఱవపింఛ, గబ్బిచనుజక్కవలచేతఁ [3]గలఁపఁబడియె. 293

టీక. వనజనాభుని = శ్రీవిష్ణువుయొక్క; అభిషేకమునకె కాని = స్నానమునకు మాత్రమే తప్ప; కనకగర్భాదులకున్ = బ్రహ్మాదులకుఁగూడ; వాడుకొనఁగరాని = ఉపయోగించుకొన వీలుకానట్టి; తీర్థకుండాంబునికరంబు = పుణ్యస్థలమగు కుండములోని నీటిని; తెఱవ... చేతన్ = స్త్రీల గుంపుయొక్క నిక్కఁజన్నలను చక్రవాకములచేత; కలఁపఁబడియెన్ = కలఁతపెట్టఁబడెను - మలినము చేయఁబడెను. [పూర్వటీకలో ఇచట "వాడుకొనన్ = స్థిరముగా నిలువ"......"గబ్బి = గంభీర మయిన" అని అర్థములు వ్రాయఁబడినవి. అవి అననుకూలములు.] అలం. ఉపమ.

తే. జాఱు నలరులతేనియగారయిచ్చి
గాడ్పుసంధించు నయకాని [4]యూడ్పు వెఱచు
నెందు నయ్యాఁకవిరితోఁట [5]నిందుముఖుల
నగవు నునుమంచుసోనవోలె నయము దఱుగ. 294

టీక. అలరులతేనియగార = పూఁదేనెపూఁత; గాడ్పుసంధించు = గాలిని కూర్చు; నయకాని యూడ్పు = అందగానినిట్టూర్పు; ఎందున్ = ఏ తోఁటలో; వెఱచున్ = భయపడునో - [వాయు దేవుఁడు నిట్టూర్పు విడుచుటకుఁగూడ ఆ తోఁటయందు భయపడునట.] ఆ ఆఁకవిరితోఁటన్ = భద్రముగా కాపాడఁబడుచున్న పాండురంగని యుద్యానమునందు; నునుమంచుసోనవోలెన్ = కొంచెపు మంచుప్రవాహమువలె; నయముదఱుగన్ = నీతితప్పఁగా - వ్యాపింపఁగా. వారాతోఁటలోఁ బ్రవేశించి కలఁచిరనుట. ['సోన = సూగు' అని పూర్వటీక.] అలం. ఉపమ.

ఆ. అవసరంబు గాచి యల్లంతదవ్వుల, నుండి సురులు [6]దనకు దండము లిడ
నొప్పు ముక్కునఁదు నూరుపుగలవేల్పుఁ, గొమ్మలంటి రాటబొమ్మవోలె. 295

టీక. అవసరంబుగాచి = సమయము నెదురుచూచి; అల్లంతదవ్వులన్ = మిక్కిలిదూరములో; సురులు = దేవతలు; ముక్కు......వేల్పున్ = ముక్కుమీఁద కోపముఁగల కాలభైరవుని; ఆటబొమ్మవోలెన్ = ఆటలాడుకొను బొమ్మనువలె; అంటిరి = తాఁకిరి. అలం. ఉపమ.

మత్తకోకిల. జాలిదక్కి మతాంతరాళవిశాలవేదులయందుఁ గో
[7]ణాలగొందిఁ దపంబుసల్పు జనంబు తాల్ములు దూలు ద
ద్బాలికాకుల నిస్తుల స్తనపాళికామృగనాభివా
తూలికాహా[8]తిఁ బక్వశాల్మలితూలికాశకలాకృతిన్. 296

టీక. జాలి, దక్కి = శంకను విడిచి - శంకలేక; మతాంతరాళవిశాలవేదులయందున్ = మతములలోపలి తిన్నెలపయి; కోణాలగొందిన్ = కృష్ణునిఁగూర్చి; జనంబు = జనుల; తాల్ములు = ధైర్యములు; తద్బాలికా......హతిన్ = ఆ బాలికలగుంపుయొక్క సాటిలేని కుచములయగ్రభాగమునందలి కస్తూరితోడి గాలితాఁకుడుచేత; పక్వ......కృతిన్ = బాగుగా పండిన బూరుగుదూది పింజెలవలె; తూలున్ = ఎగిరిపోవును - నశించును. అలం. ఉపమ.

1. క. గాని. చ. కాని. 2. క. బాఁదు. చ. వాడు. 3. క. గప్పు. చ. గలఁప. 4. చ యూర్పు 5. చ. విందు. 6. క. మునులు. చ. దనకు. 7. క. సాల. సూర్య. ణాల. 8. క. తిప. సూర్య. తిఁ॥

శా. డోలారోహణసాహసోద్యమముఁ జాటు[1]ప్రౌఢనర్మోక్తి వి
ద్యాలాలిత్యముఁ బుష్పసాయకసపర్యాచర్యయున్ మున్నుగా
హాలాపానవిహారము న్నడపి రుద్యత్ప్రీతిఁ బద్మేక్షణల్
పోలుంబోలము లింత యెన్నక మహాబోధిద్రుమచ్ఛాయలన్. 297

టీక. పద్మేక్షణల్ = తామరలవంటి కన్నులుగల యా కన్నియలు; పోలుంబోలములు = కార్యాకార్యములు; ఇంత = కొంచెమైనను; ఎన్నక = లెక్కింపక; మహా.....చ్ఛాయలన్ = ఆ గొప్ప రావిచెట్టునీడలందు; డోలారోహణసాహసోద్యమమున్ = ఉయ్యెలలూగు సాహసప్రయత్నమును; చాటు ....లాలిత్యమున్ = ప్రియమైన నేర్పుమాటల పాండిత్యపు ఒప్పును; పుష్ప...చర్యయున్ = మన్మథపూజయును; మున్నుగాన్ = మొదలుగా; హాలాపానవిహారమున్ = మధుపానము చేసి తిరుగుటయును; ఉద్యత్ప్రీతిన్ = ఎక్కువ సంతోషముతో; నడపిరి = జరిపిరి.

ఆ. జవ్వ[2]నంపుమదము సౌందర్యమదమును, ధనమదంబు మనసుఁ బెనుఁగుదుళ్లఁ
బొదల నంత [3]శీధుమదముఁ దోడ్తోఁ బ్రోది, యగుచు నిగిడె నమ్మృగాక్షులందు.

టీక. మనసుఁబెనుగుదుళ్లన్ = మనస్సులను పెద్దపాములుగను; పొదలన్ = కలుగఁగా - పుట్టఁగా; శీధుమదమున్ = మద్యపుమైకమును; తోడ్తోన్ = వెంటనే; అమ్మృగాక్షులందున్ = జింక చూపులుగల ఆ స్త్రీలయందు; ప్రోదియగుచున్ = పెరుగుచు - వృద్ధిపొందుచు; నిగిడెన్ = వ్యాపించెను.

సీ. దామోదరుఁడు యశోదాస్తన్యమానెడు నని మ్రొక్కు విరిగుత్తి నళి భ్రమింపఁ
బ్రొద్దులు [4]సొచ్చెఁ గద్రూదేవి కిపు డని ప్రియమందు వేణుగర్భిణిగుఱించి
పావనిగద నొచ్చె ఫణికేతుతొడలని యడలు నేనుఁగుచేత నరఁటు[5]లొరుఁగ
బడబాగ్ని జడధి వెల్వడియెడు నని చూపుఁ గానఁ బూఁచిన కింశుకము చెలులకు
తే. శేషవృత మేరుశిఖరమనీషఁ బొగడు, నంచకౌఁగిట నున్న హేమాంబుజంబు
పూర్వమగు విన్కి మదివెడ[6]వొడము దేర, మధుమదక్షీబ యగు నొక్క విధునిభాస్య.

టీక. మధుమదక్షీబ = మద్యమువలని మత్తుచే ఒడలు తెలియనిది; విధునిభాస్య = చంద్రముఖి యగు వనిత; మదివెడ = మనోవికారము; పొడముదేరన్ = పుట్టగా; పూర్వమగు విన్కిన్ = పూర్వజ్ఞానవాసనచే; విరిగుత్తిన్ = పూలగుత్తిచుట్టును; అళి, భ్రమింపన్ = తుమ్మెద తిరుగఁగా; దామోదరుఁడు = కృష్ణుఁడు; ఆనెడునని = త్రాగుచున్నాఁడని; మ్రొక్కున్. వేణుగర్భిణిగుఱించి = (ముత్యములతోడి) వెదురుఁజూచి; కద్రూదేవికిన్ = పాములతల్లికి - (పామువలె వెదురు ఉండుట వలన) ప్రియము, అందున్ = సంతోషించును. అరఁటులు = అరఁటిబోదెలు; ఒరుగన్ = పడిపోగా; పావనిగదన్ = భీమునిగదచే; ఫణికేతుతొడలు = పాము పతాకగాఁగల దుర్యోధనుని యూరువులు; నొచ్చెనని; అడలున్ = దుఃఖించును. బడబాగ్ని = సముద్రమునందునగ్ని; జడధివెల్వడియెడున్ = సముద్రమునుండి బయలువెడలెనని; కానన్ = అడవిలో; కింశుకము = మోదుగుపువ్వును; చెలులకున్; చూపున్. హేమాంబుజంబు = బంగారుపద్మమును; శేష ....మనీషన్ = శేషునిచే చుట్టుకొనఁబడిన మేరుశిఖరమనుబుద్ధితో; పొగడున్ = కొనియాడును. అలం. భ్రాంతిమంతము, కావ్యలింగము.

1. క. ప్రౌఢి. చ. ప్రౌఢ. 2. క. నంబు. చ. నంపు. 3. చ. సింధు. 4. క. చొచ్చె. చ. సొచ్చె. 5. క. లొదుఁగ. చ. లొరుఁగ. 6. క. పొడము. చ. వొడము.

సీ. సుధయొల్కు నెఱివేణి సోమార్ధముం బోలి చెమరించె దుర్గ[1] లేఁ జెమరునొసలు
కుర్కురభర్తృదృగ్గోళంబు శీధు సంసేవనం[2]బునఁ బోలె జేవురించె
విష్ణు నన్యాసక్తు వీక్షించుటను బోలె ముక్తకేశికి బొమముడి జనించెఁ
ద్వరితనిశ్శ్వాసవేదనఁ బోలెఁ గంపించె విజయునివదనారవిందదళము

తే. పరమపావనమైన తత్పౌండరీక, పుణ్యతీర్థావకాశ మపూర్వ[3]శుద్ధిఁ
[4]బెనుచు నృపకన్యకాసఖీజనుల వివిధ, విలసనంబున జనియించు నలుక ననఘ !

టీక. అనఘ! = గొప్పమునీ! పరమపావనము, ఐన = మిక్కిలిపవిత్రమైన; తత్పౌండ..... వకాశము = ఆ పాండురంగక్షేత్రపుపుణ్యతీర్థప్రదేశమును; అపూర్వశుద్ధిన్, పెనుచు = కనివినియెఱుగని శుద్ధితో పెంపొందించు - కలఁతపెట్టు; వివిధవిలసనంబులన్ = వివిధములగు విలాసములచే; జనియించునలుకన్ = పుట్టిన కోపమున; సుధ యొల్కు = అమృతము కారునట్టి; నెఱివేణిసోమార్ధముం బోలి = కేశములందలి నెలవంకతో సరియగునట్లు; దుర్గ... . నొసలు = కాళియొక్క చెమరుతో గూడిన నుదురు; శీధు .....బోలెన్ = మద్యసేవనమునతో యనునట్లు; కుర్కుర.....గోళంబు = కాలభైరవునికనుగ్రుడ్లు; జేవురించెన్ = ఎఱ్ఱబడెను. అన్యాసక్తున్ = ఇతరవనితపై ఇష్టముకలవానిని వీక్షించుటను బోలెన్ = చూచుట చేతనో అనునట్లు; ముక్తకేశినిబొమముడి = ముక్తకేశినికి కనుబొమముడిపాటు; త్వరిత......బోలెన్ = తొందరపాటుతోడి ఊపిరితీయుటవలని బాధచేతనో యనునట్లు; విజయుని......దళము = అర్జునుని ముఖపద్మము. అలం. ఉపమ, ఉత్ప్రేక్ష, కావ్యలింగము.

క. పొడఁగనిరి పడఁతు లయ్యెడఁ, బొడలపొడలయొడలి తపసిపుట్టువుఁ గప్పన్
జడభరతనిభము నరహరి, యడుగుఁ బుడమి సరియ వెడలి యఁట చనుదేరన్.

టీక. పడఁతులు = స్త్రీలు; పొడల.....పుట్టువున్ = మచ్చమచ్చల దేహముగలమునిని; జడభరతునిభమున్ = జడభరతునితో సమానమగుదానిని; నరహరి.....సరియన్ = విష్ణుపాదపీఠభూమియందలి రంధ్రమునుండి; చనుదేరన్ = రాగా; పొడగనిరి = చూచిరి. అలం. ఉపమ.

చ. కనకము[5]పేరిరో హణనగంబొ సుధాంబునిధానగర్భమో
యనిమిషకార్ముకం బుదయ మయ్యెడు నొప్పగునొక్కొ దీనిపు
ట్టిన[6]కడ యంచు విస్మయము [7]డింపక చంపకపుష్పనాసికల్
చొనిపిరి వాలుఁజూపువల చుట్టును దర్దురపట్ట[8]భద్రునిన్. 302

టీక. కనకము......నగంబో = బంగారు పేరిటి రత్నపర్వతమో! సుధాంబు...... గర్భమో = పాలసముద్రపు నడిమిభాగమో! అనిమిషకార్ముకంబు = ఇంద్రధనుస్సు; దీనిపుట్టినకడ = దీని (ఈ కప్ప) జన్మస్థానము; విస్మయమున్ = ఆశ్చర్యమును; డింపక = దింపక - తగ్గింపక; చంపకపుష్పనాసికల్ = సంపెగపూలవంటి ముక్కులు గల స్త్రీలు; దర్దురపట్టభద్రునిన్, చుట్టును = కప్పలతేని చుట్టును; వాలుఁజూపువల = వాల్చూపులను వలను; చొనిపిరి = ప్రవేశపెట్టిరి - ఉంచిరి. అలం. సందేహము, రూపకము.

తే కందుకము గాదు కేళీశుకంబు గాదు, పల్కువీణియ గాదు దర్పణము గాదు
వర్షపిశునంబుఁ బట్టఁ బల్వురుసఁ జనిరి, చంచలాత్ములు చపలప్రచార లెందు. 303

---

1. చ. జిలగు. 2. క. బును. చ. బున. 3. క. సిద్ధి. చ. శుద్ధి. 4. క. బెనచు. చ. బెనుచు. 5. క. పేరు. చ. పేరో. 6. చ. కత. 7. చ. దింపక. 8. చ. బద్ధునిన్.

టీక. కందుకము = బంతి; కేళీశుకంబు = విలాసార్థమైన చిలుక; దర్పణము = అద్దము; వర్ష పిశునంబుగ్ = వర్షమునకు కారణమగు కప్పుచు; చంచలాక్షులు = బెదరు కన్నులుగల స్త్రీలు; చపల ప్రచారలు = దుర్వినీతమగు నడత కలవారు. అలం. అర్థాంతరన్యాసము.

తే. యువజనంబులఁ దనయురిఁ దవులపఱచు, కీలు గలిగిన యొక నీలనీలవేణి
తురుము విరివండ యురి వారిచరముఁ జిక్కు, వఱుపనేఱక మదిఁ జిక్కువడియెఁదాన.

టీక. యువజనంబులన్ = యువకులను; తనయురిఁ దవులపఱచు, కీలు = తనవలలోఁ దగు ల్కొనఁజేయునేర్పు; నీలనీలవేణి = మిక్కిలి నల్లని కురులుగల వనిత; తురుమువిరివండయురిన్=కొప్పు లోని పూలమాలయురిచే; వారిచరముగ్ = కప్పును; చిక్కువఱుపనేఱక = పట్టుకొనఁజాలక; తాన = తానే; మదిన్ = మనసులో; చిక్కువడియెన్ = కలఁతపొందెను. అలం. విషమము.

తే. చొచ్చి చనఁ బట్టుటకు నొక్కమచ్చెకంటి,మ్రోలఁ బఱచిన[1]చేల దర్దురము దాఁటెఁ
దొంటిపుట్టునఁ దనయంటు సంటువారి,మీఁది మమకార నది [2]త్రెవ్వ నీఁదుకరణి.

టీక. మచ్చెకంటి = స్త్రీ; చేల = వస్త్రమును; ['బేల = మూఢము' అని పూర్వటీక.] దర్దు రము = కప్పు; తొంటిపుట్టునన్ = వెనుకటిజన్మమున; అంటుసంటువారిమీఁది మమకారనది=బంధువుల పయిగల ప్రేమ యను నదిని; త్రెవ్వన్ ఈఁదుకరణిన్ = పూర్ణముగా ఈఁదురీతిని; దాఁటెన్. అలం. ఉపమ.

క. ఆ వర్షాభూవిభునకు, హానివళి దఱచయ్యె బిసరుహాక్షులచేతన్
రావణునకు వైకుంఠపు,రావాసస్త్రీలచేతియలజడివోలెన్. 306

టీక. ఆ వర్షాభూవిభునకున్ = ఆ కప్పలఱేనికి; బిసరుహాక్షులచేతన్ = తామరలవంటి కన్నులు కల స్త్రీలచేత; హానివళి = ఉపద్రవము; వైకుంఠ......అలజడివోలెన్ = (శ్వేతద్వీపము నందలి) వైకుంఠనగరవనితలవలని శ్రమవలె; దఱచు, అయ్యెన్ = ఎక్కువయ్యెను. [రావణుని అచటి స్త్రీలు పదితలల పురుగుగా పరిగణించి యల్లరిచేయుట ప్రసిద్ధము.] అలం. ఉపమ.

ఆ. పూర్వజన్మకుంభభూశిష్యముఖ్యుండు, భేకరూపకూపబింబితుండు
ప్రయుతసుతుఁడు దవులుపడఁడయ్యె భూపాల, తనయసఖులచేత ధాతృతనయ!

టీక. పూర్వ......శిష్యుఁడు = కడచినజన్మలో అగస్త్యుని శిష్యుఁడైనవాఁడు; భేక... బింబి తుండు = కప్పరూపమైనహీనజన్మకలవాఁడు; తవులుపడఁడయ్యెన్ = చిక్కకపోయెను. ధాతృ తనయ! = నారదా!

క. నరనాథపుత్త్రి యత్తఱి, నురుకుచకచజఘనభారయుతయయ్యు మదిన్
ధరియించెఁ గార్యభరముగ్, గిరిగహనద్వీపసహితక్షితి ధృతిఁబోలెన్. 308

టీక నరనాథపుత్త్రి = రాజకుమారిక; ఉరు......యుత, యయ్యున్ = గొప్పకుచములయు, కురులయు, పిఱుదులయు బరువుతో కూడుకొన్నది, అయినప్పటికిని; గిరి......క్షితి = కొండలతోను, అడవులతోను, ద్వీపములతోను కూడిన భూమి; ధృతిఁబోలెన్ = ధైర్యమునువలె; కార్యభరమున్, ధరియించెన్ = కార్యమును నెఱవేర్చు పూనికను గ్రహించెను. అలం. క్రమము, ఉపమ.

ఉ. పన్నిద మెద్దియే నిడుఁడు పట్టెదఁ జూడుఁడు దీని నంచు నా
కన్నియ చిన్ననవ్వొలయఁగాఁ జెలికత్తియలం [3]దదుద్యమ
చ్ఛన్నమనస్కలం దెగడి చంచలకాంచికలాప[4]వాగురా
సన్నహనంబునన్ సలిలజంతులలామముఁ బట్టె నుబ్బుచున్. 309

1. క. బేల. 2. చ. ద్రవ్వ. 3. దద్యుద. 4. క. వాగురీ. చ. వాగురా.

టీక. పన్నిదము = పందెము; ఎద్దియేన్ = ఏది కావలసినను; చిన్ననవ్వు = చిఱునవ్వు; ఒలయఁగాన్ = ప్రకాశింపఁగా; తదు...మనస్కులన్ = దానిని పట్టుకొను ప్రయత్నముచే ఆక్రమింపఁబడిన మనస్సుకలవారిని; తెగడి = నిందించి; ["తనూద్యమచ్ఛన్నమనస్కులన్ = కొంచెపుఁబ్రయత్నము చేత కప్పఁబడిన మనసుకలవారిని - విశేషప్రయత్నము లేనివారిని."అని పూర్వటీక.] చంచల.....సన్నహనంబునన్ = కదలుచున్న మొలత్రాడను వలయొక్క ఏర్పాటున; ఉబ్బుచున్ = పొంగుచు; సలిలజంతులలామమున్ = నీటిజంతువగు కప్పను; పట్టెన్.

తే. సర్వతీర్థప్రదేశప్రశస్తమతికిఁ, గాంచిఁ దవులుట దన కర్హ మంచు నొక్క
తవులువడియుండె వరుణదంతావళంబు, పడఁతి యురిఁజేసె మెడ[1]చుట్టి పసిఁడి రశన.

టీక. సర్వ.....మతికిన్ = సమస్తములగు పుణ్యక్షేత్రములను కొనియాడు బుద్ధి కలవానికి; కాంచిన్ = కాంచీక్షేత్రమున, మొలనూలియందును; తగులుట = ఇష్టపడుట, తగులుకొనుటయు; అర్హము = తగినది; వరుణదంతావళంబు = కప్ప; పడఁతి = రాజపుత్రి; పసిఁడిరశనన్ = బంగరుమొలనూలిచే; చుట్టి; ఉరిన్ = బంధమును; చేసెన్. అలం. ఉత్ప్రేక్ష.

సీ. పులుఁగునాడించు[2]చొప్పున మించు నాడించుమించున సకిన నాడించినట్టు
లా రామ చిత్రశాలూరంబు మదహాసకౌముదీపరిషిక్తగండఫలక
యగుచు నించుకవడి యాడించి కప్పకు వెఱచిన యొకవృద్ధవిప్రుమీఁద
వైచి తచ్చాపంబువలన సఖీజనంబును దాను దద్భేకమునకు భార్య
ఆ. [3]లైరి; యిట్లు తనకు ననురూప తనురూప,శీలములఁ దలిర్చు నాలిపిండు
గలుగుటయును నయ్యతఁ డలఘుసంసారాబ్ధి,నీఁదుఁ [4]దొంటియీఁతయినుమడింప,

టీక. పులుఁగును = పక్షిని; ఆడించుచొప్పునన్ = ఆడించురీతిని; మించున్ = మెఱపును; మించునన్ = రీతిని; సకినన్ = బొమ్మను; ఆ రామ = ఆ యువతి; మద.....ఫలక, యగుచున్ = గర్వసూచకమగు చిరునవ్వు అను వెన్నెలతోఁగూడిన చెక్కిలి కలదగుచు; చిత్రశాలూరంబున్ = రంగులకప్పను; ఆడించి; వెఱచిన = భయపడిన; తద్భేకమునకున్ = ఆ కప్పకు; అనురూప.....శీలములన్=తగిన (సమాన) రూపమునను, నడతను; తనర్చు = ప్రకాశించునట్టి; ఆలిపిండు=భార్యలగుంపు; అలఘుసంసారాబ్ధిన్ = గొప్పదైన సంసారసముద్రమును; తొంటియీఁత = వెనుకటి యీఁదులాట; ఇనుమడింపన్ = రెండింతలు కాఁగా; ఈఁదున్ = ఈఁదుచుండెను.

తే. అధిపతనయకు మును బహిఃప్రాణము లగు,చామ లెవ్వారు వారెల్ల [5]సతికి దాయ
లైరి మండూకసార్వభౌమార్ధతనువు, లైనదినముల; సాపత్న్య[6]మెంత కీడు. 312

టీక. అధిపతనయకున్ = రాజపుత్రికకు; బహిఃప్రాణములు = బయటి జీవములు - ప్రాణసమానలు; చామలు = స్త్రీలు; మండూక......తనువులు = కప్పతేనిభార్యలు; ఐన, దినములన్ = ఐన రోజులందు; సతికిన్ = రాజపుత్రికకు; దాయలు = పగవారు; సాపత్న్యము = సవతిగా ఉండుట; కీడు = హాని అలం. అర్థాంతరన్యాసము.

ఉ. నున్ననిమోము మీసముఁల నూఁగును జెన్నటిగాకమున్న [7]మా
యన్నవుగా! గృహస్థులకు నగ్రణివై మను'మంచు మున్ను వే
గన్నులవేల్పు దెల్ప [8]నదిగా దని వాదముసేయు ధైర్యసం
పన్నుఁడు దేర్పఁగాఁ దొణఁగెఁ [9]బాఁడసతిం గుపితప్రియాతతిన్. 313

---

1. చ. చుట్టె. 2. చ. యొప్పున. 3. క. యయ్యెనిట్లు. చ. వైరియిట్లు. 4. తొంటి. 5. క. పుత్రికి. చ. సతికి. 6. క. మెంతకీడు. చ. మంతగీడు. 7. యాసన్నము. క. చ. మాయన్నము. 8. చ. విది. 9. క. పాద.

టీక. నున్ననిమోము = స్నిగ్ధమైన ముఖము; మీసములనూఁగుచు = నూనూఁగుమీసములును; చెన్నటిగాకమున్న = వ్యర్థమగుటకు మునుపే - నశింపకమున్నే; అగ్రణివై = ముఖ్యుఁడవై; మనుము = జీవింపుము; మున్ను = తొల్లి; వేగన్నులవేల్పు = సహస్రాక్షుఁడు - ఇంద్రుఁడు. వాదముసేయు = చర్చించు నట్టి; ధైర్యసంపన్నుఁడు = ధైర్యశాలి - అయుతుఁడు; కుపితప్రియాతతిన్ = ప్రణయకోపము వహించిన భార్యలగుంపును; పాదనతిన్ = కాళ్లకు మ్రొక్కులుచే; తేర్పఁగాన్ = శాంతింపఁజేయుటకు; తొడఁగెన్ = సిద్ధపడెను.

తే. విషమశరుఁ డేయు తూపుల వేట్ల నెన్ను, వాఁడు వాధూలమునిశాపవర్ణతతుల
రాతికొడుకైన యిల్వలారాతిచట్టు, మనసు గరఁగించి మమతలఁ [1]బెనఁగెఁ గాన.

టీక. వాధూల.....తతులన్ = వాధూలమునిశాపాక్షరములచే; రాతికొడుకు, ఐన = కప్పయైన; ఇల్వలారాతిచట్టు = అగస్త్యశిష్యుఁడు - అయుతుఁడు; మమ.....గానన్ = కోరికలందుఁ దగుల్కొనెను కావున; విషమశరుఁడు = మన్మథుఁడు; ఏయు తూపులవేట్లన్ = ప్రయోగించు బాణములదెబ్బలను; ఎన్నువాఁడు = లెక్కించువాఁడయ్యెను.

తే. స్వాతిమేఘంబుచినుకులు వనధిశుక్తి, వితతి ముయ్యాడునై మౌక్తికత వహించు
కరణి నయుతునిప్రేమ తత్కాంతలందు, నిలిచెఁ బర్యాయపాత్రతానియమసరణి.

టీక. స్వాతి.....చినుకులు = స్వాతికార్తెమేఘపు వానచినుకులు; వనధిశుక్తితతిన్ = సముద్రమందలి ముత్యపుచిప్పలందు; ముయ్యాడునై = పరిపూర్ణతనుపొంది-అందముకలవై; మౌక్తికతన్ = ముత్యము లగుటను; వహించుకరణిన్ = పొందురీతిని; పర్యాయ.....సరణిన్ = వరుసక్రమము ననుసరించిన పద్ధతిని; తత్కాంతలందున్ = ఆ స్త్రీలయందు. నిలిచెన్ = స్థిరమై యుండెను. అలం. ఉపమ.

క. మునిపతికి రాజసుతకును, దనయుఁడు జన్మించె; నంతఁ దచ్ఛాపపుటి
ర్లను విరిసె; జ్ఞానచంద్రుఁడు, గనుపట్టెన్; విష్ణుపదము గానఁగవచ్చెన్. 316

టీక. తచ్ఛాపపుటిర్లను = ఆ వాధూలముని శాపమను చీఁకటియును; విరిసెన్ = తొలఁగెను; విష్ణుపదము = ఆకాశము, విష్ణువుండు స్థానమగు మోక్షము. అలం. రూపకము.

వ. సలపితుం డగుట మంద[2]పాలసమశీలుం డగు ప్రయుతనందనుచరిత్రం బద్భుతరసైకపాత్రంబయ్యె నిట్లు. 317

టీక. సలపితుండగుటన్ = మాటలు వచ్చినవాఁడగుటచే; కప్పరూపునను పూర్వజ్ఞానముకలవాఁడగుటచే; మందపాలునిపక్షమున లపితతోఁ గూడినవాఁడనుట.

క. గృహమేధిధర్మ[3]వర్మా, సహాసుమతి యగు కుమతి యయుతుచందమున సుదు
స్సహదుఃఖగ్రాహానన, గుహఁ బడు నని వింటి మును ముకుందునిచేతన్. 318

టీక. గృహ...మతి = గృహస్థధర్మమను కవచము నోర్వనివాఁడు - గృహస్థధర్మము నొల్లనివాఁడు; కుమతి = చెడ్డబుద్ధి కలవాఁడు; సుదుస్సహ.....గుహన్ = మిగుల సహింపరాని దుఃఖమను మొసలియొక్క గుహవంటి నోటిలో; ముకుందునిచేతన్ = విష్ణువువలన; వింటిన్. అలం రూపకము.

ఆ. విష్ణుభక్తులై వివేకులై తృష్ణావి, [4]దూరులై స్వకుటుంబపూరణంబు
సమయసంభృతార్థసంతృప్తిగాఁ గొని, నడచువారు భవము గడచువారు. 319

---

1. చ. బెనఁగు. 2. చ. పాట. 3. క. వర్మా. చ. మర్మా. 4. క. పూరులై. చ. దూరులై.

టీక. వివేకులై = జ్ఞానులై; తృష్ణావిదూరులై = ఆశకు దూరముగానున్నవారై - ఆశ లేని వారై; స్వకుక్షిపూరణంబు = తనపొట్టను పోసికొనుట: సమయ .....సంతృప్తిగాక్ = ఆ యా కాలమునకు దొఱకిన వస్తువులచే తృప్తికల్గునట్లు; కొని = గ్రహించి - ఉన్నదానితో తృప్తిపడి; భవముఁగడచువారు = సంసారమునుండి తప్పించుకొనువారు - ముక్తులు; (అగుదురనుట.)

సీ. అని పార్వతీనాథుఁ డమరసంయమిఁ జూచి పరమభాగవతప్రపత్తిగలుగు
నీవిట్లు ప్రార్థింప నిఖిలోన్నతము లగు దైవతక్షేత్రతీర్థముల మేళ
నం బెఱింగించితి నానాకథానిధానం బగుదాని; నెన్నఁడును దీని
వైష్ణవధర్మప్రవర్తనం బెడలిన యసదుల కెఱుక సేయకుము నీవు
తే. గుప్తముగఁజేయు మనుడు భర్గునకు మ్రొక్కి
ముని మునిధ్యేయ! నీకతంబున దురాప
రూపతత్క్షేత్రరాజస్వరూప మెఱుఁగఁ
గంటి గరిగంటిగాని సౌఖ్యములఁగంటి. 320

టీక. అమరసంయమిన్ = దేవమునిని - నారదుని; పరమ......ప్రపత్తి = గొప్పవారగు భగవద్భక్తుల శరణు; మేళనంబు = కూడిక; నానా......నిధానంబు = అనేకకథలకు నిధియైనది; వైష్ణవ......నంబు = వైష్ణవాచారము ననుసరించిన నడత; ఎడలిన = చెడిన; అసదులకున్ = అల్పులకు; గుప్తముగన్ = రహస్యమైనదానిని; భర్గునకున్ = శివునకు; ముని = నారదుఁడు; మునిధ్యేయ! = మునులచే ధ్యానింపఁబడు శివుఁడా! దురాప......రూపము = పొందరాని ఆ గొప్ప క్షేత్రముయొక్క స్వరూపమును; ఎఱుఁగన్, కంటిన్ = తెలిసికొంటిని; గరిగంటిగాని = తఱుఁగని; కంటిన్ = పొందితిని.

చ. భయము నడల్చి దుఃఖములఁ బాచి సుఖంబులఁ బ్రోదిచేసి త
ద్దయుఁ దిల[1]కించు నీయడుగుఁదమ్ముల నిమ్ములఁ గొల్చి నిత్యసం
శ్రయ మొనరించు నాకిఁక నసాధ్యము[2]లే; దిది యట్ల[3]యౌను; †దు
ర్ణయభవసాగరోత్తరణనావికు లాదిమవైష్ణవోత్తముల్. 321

టీక. అదల్చి = బెదరఁగొట్టి; పాచి = పోఁగొట్టి; ప్రోదిచేసి = పెంచి; తద్దయున్ = మిక్కిలి; నీయడుగుఁదమ్ములన్ = నీ పాదపద్మములను; ఇమ్ములన్ = భక్తితో; ఆదిమవైష్ణవోత్తముల్ = ప్రధాన విష్ణుభక్తులు; దుర్ణయ......నావికులు = చెడ్డదైన సంసారసాగరమును దాటుటకు నావికులును (అగుదురనుట.) తాముతరించుచు నితరులను దరింపఁజేయుదురనుట.

క. అని పౌనఃపున్యం[4]బుగ, వనజాసనసూతి మ్రొక్కి వలగొని హరు వీ
డ్కొని పౌండరీకమునకున్, జని భైమిం దీర్థమాడి చక్రి భజించెన్. 322

టీక. పౌనఃపుణ్యంబుగన్ = మాటిమాటికిని; వనజాసనసూతి = నారదముని; వలగొని = ప్రదక్షిణముచేసి.

క. భజియించి తత్ప్రసాద, వ్యజనానిలశమితతాపుఁడై యిప్పుడు న
బ్జజసూతి దక్షిణద్వా, రజగతి నున్నాఁడు సుస్థిరప్రమదమునన్. 323

1. క. కించి. చ. కించు. 2. చ. లేదని. 3. చ, యౌన. † దుర్భయ. క. ఖ. చ. ఖన.

